మర్మస్థానముల వ్యాపించుట, ఇవియన్నియుం పిడకావ్యాధియందు సంభవించు నుపద్రవములు. (ఇత్తెరంగున 'పిడకాః కతి?' అనుప్రశ్నమున కుత్తరముగ 'సప్త పిడకాః' అని నిర్దేశింపబడిన ప్రమేహపిడక భేదము వివరింపబడియె).

అంతర్విద్రధియు గుల్మంబును సమానలక్షణములు కల్గియుండును కావున పరస్పర భేద మరయుట కష్టముగ నుండును. ఈరెంటికిని గలపరస్పరభేదములు మాచే రచియింపంబడిన మాధవనిదానవ్యాఖ్యయందు విద్రధినిదానమున విస్తరముగ నిర్ణయింపబడినది కాన విస్తరభీతిచే నిట జెప్పబడదయ్యె.

## దోషములగతిభేదములు.

మూ. క్షయః స్థానం చ వృద్ధిశ్చ దోషాణాం త్రివిధా గతిః,
ఊర్ధ్వం చాధశ్చ తిర్యక్చ విజ్ఞేయా త్రివిధాఽపరా. ౧౧౦
ఇత్యుక్తా విధిభేదేన దోషాణాం త్రివిధా గతిః,
త్రివిధా చాపరా కోష్ఠశాఖా మర్మాస్థిసన్ధిషు. ౧౧౧

వ్యా. (గతి యన నవస్థ యని యర్థము) వాత-పిత్త-కఫరూపములైన మూడు దోషములకును క్షయము (స్వప్రమాణమునకన్న తక్కువగనుండుట), స్థానము (ఆయా దోషమునకు నిర్ణయింపబడిన ప్రమాణమునసుండుట), వృద్ధి (స్వప్రమాణమునకన్న నధికముగ నుండుట,ఇదియే ప్రకోపము),అను భేదముచేత నవస్థ మూడువిధములుగ నుండును. మరియుం ఊర్ధ్వగమనము, తిర్యగ్గమనము (అడ్డముగ వ్యాపించుట), అధోగమనము (శరీరమునందు క్రిందిభాగమున వ్యాపించుట). అను భేదముచేత అవస్థావిశేషము మూడు విధములనుండును. ఇత్తెరంగున విధిభేదముచే దోషములగతి భేదము మూడువిధముల నుండును మరియు కోష్ఠమునందును, రక్తవాహినీసిరలయందును, మర్మములయొక్కయుం అస్థులయొక్కయు సంధులయందును సంచరించుటంజేసియు గతిభేదములు మూడువిధముల నుండును.

## దోషములకు కాలకృతగతిభేదము.

మూ. చయప్రకోపప్రశమాః పిత్తాదీనాం యథాక్రమమ్,
భవన్త్యేకైకశః షట్సు కాలేష్వభ్రాగమాదిషు. ౧౧౨
గతిః కాలకృతా చైషా చయాద్యా పునరుచ్యతే,

వ్యా. వర్షాదిఋతువు లారిటియందును పిత్తకఫవాతములు మూడును వరుసగ చయము, ప్రకోపము, ప్రశమము నను మూడుఅవస్థల క్రమముగ నొందుచుండును. (అనగ పిత్తమునకు వర్షఋతువునందు చయంబును, శరత్తునందు ప్రకోపంబును

హేమంతఋతువునందు ప్రశమంబును కల్గును. ఇత్తెరంగుననే శిశిర, వసంతాంత గ్రీష్మ ఋతువులయందు కఫమునకు వరుసగ చయప్రకోపప్రశమంబులను నవస్థలు కల్గును. గ్రీష్మవర్షాశరత్కాలముల మూటియందును వాతమునకు వరుసగ చయప్రకోపప్రశమ ములను నవస్థలు కల్గును. అని ముఖ్యాభావము.) ఇది వాతాదిదోషములకు కాలకృత మైన త్రివిధగతిభేదము.

### ప్రాకృతవైకృతగతిభేదములు.

మూ. గతిశ్చ ద్వివిధా దృష్టా ప్రాకృతీ వైకృతీ చ యా. ౧౧౩
పిత్తాదేవోష్మణః పక్తిః నరాణా ముపజాయతే,
తచ్చ పిత్తం ప్రకుపితం వికారాన్ కురుతే బహూన్. ౧౧౪
ప్రాకృతస్తు బలం శ్లేష్మా వికృతో మల ఉచ్యతే,
స చైవౌజః స్మృతః కాయే స చ పాప్మోపదిశ్యతే. ౧౧౫
సర్వా హి చేష్టా వాతేన స ప్రాణః ప్రాణినాం స్మృతః,
తేనైవ రోగా జాయన్తే తేన చైవోపరుధ్యతే. ౧౧౬

వ్యా. మరియుం పైజెప్పినత్రిదోషముల గతిభేదములును ప్రాకృతము (స్వభావ స్థితినుండుట) వైకృతము (వృద్ధిక్షయముల నొందుట), అను భేదముచేత రెండు విధముల నుండును. ఎట్టులన:—పిత్తము స్వభావస్థితి నున్నపుడు దానివేడిచేత మను జులు భుజించునాహారము పక్వమగును. (దానంజేసి యారోగ్యము కల్గును. అయ్యది ప్రకోపమునొందినచో పలుదెరంగులైన పైత్తికరోగముల గల్గించును. కఫము ప్రకృతి స్థితినుండినయెడ నయ్యది యోజోరూపమై శరీరమునకు బలమును కల్గించును. అయ్యది వికృతిజెందినయెడ మలరూపము (మలినముగ జేయుస్వభావము) నొంది నానారోగ ముల గల్గించుటంజేసి పాపాత్మకమని (శరీరమున కనిష్టమును కల్గించునది) చెప్పబడును. వాతము ప్రకృతిస్థితి నుండునెడ శరీరచేష్టల కన్నింటికి నాధారకారణమై ప్రాణులకెల్ల ప్రాణరూపముగ నుండును. అయ్యది 'వికృతిజెందినయెడ నానావిధ వాతికరోగముల గల్గించును. దానంజేసి మనుజునకు ప్రాణాపాయంబును కల్గును (ఇవియే ప్రాకృతవైకృత భేదముల లక్షణములు.)

### ఆరోగ్యపరిపాలనావశ్యకత.

మూ. నిత్యసన్నిహితామిత్రం సమీక్ష్యాత్మాన మాత్మవాన్,
నిత్యం యుక్తః పరిచరేత్ ఇచ్ఛన్నాయురనిత్వరమ్. ఇతి ౧౧౭

వ్యా. లోకమున తనకు హితమును గోరుమానవుడు తనకు శత్రువునుబోలె నపాయకరమైన వ్యాధిరూపమైన శత్రువు సర్వకాలసర్వావస్థలయందును సన్నిహితమై యున్నదని యెంచి యింద్రియముల నిగ్రహించి యాహారవిహారాదుల హితముగ నెరవేర్చుకొనుచు తగుజాగ్రత్త కల్గియుండునెడ ననశ్వరమైన యాయురారోగ్యముల కాపాడుకొనగలడు.

## అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. శిరోరోగాస్స హృద్రోగాః రోగా మానవికల్పజాః,
క్షయాస్సపిడకాశ్చోక్తాః దోషాణాం గతిరేవ చ. ౧౧౭
కియన్తశ్శిరసీయేఽస్మిన్ అధ్యాయే తత్త్వదర్శినా,
జ్ఞానార్థం భిషజాం చైవ ప్రజానాం చ హితైషిణా. ౧౧౮

వ్యా. శిరోరోగభేదములు, హృద్రోగములు, దోషమున ప్రమాణభేదమున గల్గు రోగభేదములు, క్షయములు, ప్రమేహపిడకాభేదములు, వాతాదిదోషముల గతిభేదములు అను నీవిషయములన్నియు కియంతశ్శిరసీయమను నీయధ్యాయమున తత్త్వజ్ఞానసంపన్నుడును, వైద్యులకును ప్రజలకును హితమునుగోరు మహనీయుండును నగు నగ్నివేశునిచే వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
కియన్తశ్శిరసీయో నామ సప్తదశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకమహర్షిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమున సూత్రస్థానమునందు కియంతశ్శిరసీయ మను పదునేడవ యధ్యాయము సమాప్తము.

---

## అష్టాదశాధ్యాయము.

అవతరణిక:—పూర్వాధ్యాయమున ప్రమేహపిడకాభేదములు వివరింపబడినవి. అట్టి పిడకలయందెల్ల శోఫము (వాపు) ప్రధానముగ నుండును. కావున ప్రమేహపిడకల జెప్పినపిదప శోథలనిరూపించు త్రిశోథీయమను నధ్యాయము చెప్పబడును:—

మూ. అథాతస్త్రిశోథీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. కియంతశ్శిరసీయాధ్యాయమును జెప్పినపిదప దోషభేదముచే మూడువిధము లైన శోథలను తెలుపునట్టి త్రిశోథీయమను నధ్యాయమును త్రికాలజ్ఞానసంపన్నుడగు నాత్రేయమహర్షి యుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లులు వివరించెద నని భావము.

## శోఫభేదములు.

మూ. త్రయశ్శోథా భవన్తి:—వాతపిత్తశ్లేష్మనిమిత్తాః, తే పునర్ద్వివిధాః నిజాగన్తుభేదేన. 3

వ్యా. వాతము, పిత్తము, శ్లేష్మము అనుమూడుకారణములచే వేర్వేరుగ పుట్టుటంజేసి శోథములు మూడువిధములగును. (వాతశోఫ, పిత్తశోఫ, కఫశోఫ యని మూడువిధములని భావము.) మరియు నవి నిజములు ఆగంతుకములు నని మరల రెండు విధములుగ నుండును.

## ఆగంతుశోఫకారణములు.

మూ. తత్రాగన్తవః ఛేదనభేదనక్షణనభఞ్జనపిచ్చనోత్పేషణప్రహారవధబన్ధనవేషనవ్యధనపీడనాదిభిర్వా, భల్లాతకపుష్పఫలరసాత్మగుప్తాశూకక్రిమిశూకాహితపత్రలతాగుల్మసంస్పర్శనైర్వా, స్వేదనపరిసర్పణావమూత్రణైర్వా, విషిణాం; సవిషప్రాణిదంష్ట్రాదన్తవిషాణనఖనిపాతైర్వా, సాగరవిషవాతహిమదహనసంస్పర్శనైర్వా శోథాస్సముపజాయన్తే. ౪

వ్యా. పైజెప్పినవానిలో నాగంతుశోఫ జనించుట కివి కారణములు:—శస్త్రాదులచేనైన ఛేదనము (నరకబడుట), భేదనము (రెండుగ చీలుపబడుట), క్షణనము (అస్థులు చూర్ణముగ నగుట), తునియలుగ నరకబడుట, పిచ్చనము (మిక్కిలి పీడింపబడుట), నలుగుట, దెబ్బలుతగులుట, త్రాళ్లచే బిగదీయబడుట, పాములు మున్నగునవి చుట్టుకొనుట, సూదులు మున్నగునవి గ్రుచ్చుకొనుట, రాయి మున్నగునవి తగిలి దోగికొనుట అను నీకారణములచేతను; జీడిచెట్టుయొక్క పువ్వులు కాయలు పాలు మున్నగునవి, దూలగొంటినూగు ఇవి శరీరముపై సోకుట, కంబళిపురుగులు మున్నగువానినూగు శరీరమున సోకుట, విషగుణముకల ఆకులు తీగెలు చిన్నచెట్లును శరీరముపై తగులుట, విషజంతువులయొక్క మూత్రము శరీరముపై తగులుట, అట్టివిషజంతువులు శరీరముపై పాకులాడుట, వానిమూత్రము శరీరముపై సోకుట, విషముకల జంతువుల కోరలు పండ్లు కొమ్ములు గోళ్లు మొదలగునవి గ్రుచ్చుకొనుట, సముద్రమునుండి వచ్చు

గాలి, విషవస్తువులపైనుండి వచ్చుగాలి, మంచు, అగ్ని ఇవి శరీరమును స్పృశించుట, అను నీకారణములచే వాపు పుట్టును. అట్టి శోఫ ఆకస్మికములైన కారణములచే గల్గుటంజేసి యాగంతుకమని చెప్పబడును.

ఆగంతుశోఫలయందు వాతాదిసంబంధము, వానిచికిత్స.

మూ. తే పునర్యథాస్వం హేతువ్యఞ్జనై రాదావుపలభ్యన్తే నిజవ్యఞ్జనైకదేశవిపరీతైః, బన్ధమన్త్రాగదప్రలేపప్రవాతనిర్వాపణాదిభిశ్చోపక్రమైః ఉపక్రమ్యమాణాః ప్రశాన్తిమాపద్యన్తే ౫

వ్యా. పైజెప్పిన యాగంతుకశోఫలు పైగనపరచిన ఆయా కారణములచేత తొలుత కల్గి పిమ్మట నిజశోఫలకు జెప్పినకారణములలో నేకదేశము విపరీతముగ వానికారణములైన వాతపిత్తామలతో సంబంధము కల్గియుండును. (అనగ నిజశోఫలయందు అహితసేవనాది కారణములచే వాతపిత్తకఫములలో నొకదోషము ప్రకోపించి అట్టి దోషప్రకోపమువలన నొప్పి పోటు మున్నగుబాధలు కల్గి పిమ్మట శోఫ జనించును. ఆగంతుకశోఫలు అటుగాక తొలుత వానివానికి సంబంధించిన చ్ఛేదనభేదనాదికారణములచే తొలుత శోఫ సంభవించి పిమ్మట వాతాదిదోషములకు సంబంధించిన శూలపోటు మంట మున్నగు చిహ్నములతో గూడియుండునని భావము. ఇదియె నిజశోఫలను ఆగంతుశోఫలకును ఏకదేశవైపరీత్యము.)

అట్టి యాగంతుకశోఫలు కట్టుగట్టుట, మంత్రప్రయోగము చేయుట, విషహరౌషధముల ప్రయోగించుట, అట్టి యౌషధములచే పట్టువేయుట, కాపడముపెట్టుట, ఉగదీయుట మున్నగునుపాయములచే చికిత్స జేసినయెడ శాంతినొందును.

నిజశోఫనిదానము.

మూ. నిజాః పునః స్నేహస్వేదవమనవిరేచనాస్థాపనానువాసనశిరోవిరేచనానాం అయథావత్ప్రయోగాత్, మిథ్యాసంసర్జనాద్వా, ఛర్ద్యలసకవిషూచికా శ్వాసకాసాతీసారశోష పాణ్డురోగోదరప్రదరభగన్దరార్శోవికారాఽతికర్షణైర్వా, కుష్ఠకణ్డూపిటకాదిభిర్వా, ఛర్దిక్షువథూద్గార శుక్రవాతమూత్రపురీషవేగధారణైర్వా, కర్మరోగోపవాసాధ్వకర్షితస్య వా, సహసాతిగుర్వమ్ల లవణపిష్టాన్నఫలశాక రాగదధిహరితక మద్యమన్దకవిరూఢ నవశూకశమీధాన్యానూపౌదకపిశితోపయోగాత్, మృత్పఙ్కలోష్టభక్షణాత్, లవణభక్షణాద్వా, గర్భసంపీడనాత్, ఆమ

గర్భప్రపతనాత్, ప్రజాతానాంచ మిథ్యోపచారాత్, ఉదీర్ణ
దోషత్వాత్ శోఫాః ప్రాదుర్భవన్తీత్యుక్తః సామాన్యహేతుః.

వ్యా. నిజశోథములు ఈ క్రిందికారణములచే జనించును:—స్నేహము, స్వేదము, వమనము, విరేచనము, ఆస్థాపనవస్తి, అనువాసనవస్తి, శిరోవిరేచనము అను నీకర్మలను విధ్యుక్తమునకు విరుద్ధముగ (వ్యత్యస్తముగ) ప్రయోగించుట; అట్టి విధుల జేసికొనిన పిమ్మట సంసర్జనక్రమమునకు విరుద్ధముగ నాహారాదుల నాచరించుట; వాంతి, అలసకము, విషూచి, శ్వాసకాసములు, అతిసారము, ధాతుక్షయము, పాండురోగము, మహోదరము, రక్తప్రదరము, భగందరము, అర్శస్సు, అను నీవ్యాధులచేతను, శరీరమును మిక్కిలి కృశింపజేయుటచేతను; కుష్ఠము, దురద, పిటకలు మున్నగువ్యాధులచేతను; వాంతి, తుమ్ములు, త్రేనుపులు, శుక్రము, అపానవాతము, మూత్రపురీషములు అనునవి వెడలనున్నపుడు వానిని వెడలనీయక నిరోధించుట; పంచకర్మలజేసికొనుటచేనైనను జ్వరాదిరోగములచేనైనను ఉపవాసములచేనైనను త్రోవనడచుటచేనైనను శరీరము జఠరాగ్నియు కృశతనొందినవాడు, మిక్కిలి గురుత్వమును గల్గించుపదార్థముల సాహసించి భుజించినను మిక్కిలి పులుపు లవణము కలపదార్థముల సేవించినను, పిష్టాన్నములు, శాకములు, ఫలములు, రాగము, పెరుగు, హరితకశాకము, మద్యము, మన్దకము, మొలకలెత్తినపప్పులు మున్నగునవి, క్రొత్తబియ్యము, కాయధాన్యములు, ఆనూపంబులును ఔదకంబులును నగుజంతువులమాంసము అను వినినన్నింటిని పంచకర్మాదులచే కృశించినవారు అతిశీఘ్రముగ నుపయోగించినను; మట్టిని బురదను మట్టిపెళ్లలను తినుటచేతను; ఉప్పును అధికముగ తినుటచేతను; గర్భమునకు సంఘర్షణము కల్గుటచేతను; పూర్ణముకాని గర్భము ప్రసవకాలమునకు ముందుగనే పడిపోవుటచేతను; ప్రసవము యథాకాలముననైనను అట్టిస్త్రీలు అపథ్యముల సేవించుటచేతను; వాతపిత్తకఫములు ప్రకోపించుటచేతను శోఫలు సంభవించును. ఇయ్యవి నిజశోఫలకు సాధారణకారణములు.

(ఇచ్చట "కర్మరోగోపవాసాధ్వకర్శితస్య" అనుపదమునకు "సహసాతిగుర్వమ్ల... పిశితోపయోగాత్" అనుపదముతో నన్వయించవలెను. పంచకర్మలురోగములు మున్నగువానిచే మిక్కిలి కృశించినవారు గురు అమ్లాదిపదార్థములను త్వరపడి యధికముగ నుపయోగించినయెడ నయ్యది శోఫకు కారణమై దానివలన శోఫము కల్గునని భావము).

### వాతశోఫనిదానసంప్రాప్తులు.

మూ. అయన్త్వత్ర విశేషః— శీతరూక్షలఘువిశదశ్రమోపవాసాతి
కర్షణక్షపణాదిభిః వాయుః ప్రకుపితః త్వఙ్మాంసశోణితాదీన్యభి
భూయ శోఫం జనయతి. ౭

వ్యా. వాతాదిశోఫల విశేషనిదానాదు లీక్రింద వివరింపబడును:—శీతవీర్య గుణములు కల్గినపదార్థములను, రూక్షంబులను లఘుగుణంబులను విశదగుణంబులను కలపదార్థములను భుజించుట; దేహమునకు శ్రమమును కల్గించుపనులజేయుట, ఉపవాసముండుట, శరీరమును కృశింపజేయు లంఘనచికిత్స నధికముగ జేసికొనుట, వమనాదుల నధికముగ చేయుటవలన శరీరమును కృశింపజేయుట ఇవి మున్నగు కారణముల చేత వాతము ప్రకోపమునొంది చర్మము మాంసము రక్తము మున్నగువానిని చెరచి శోఫమును కల్గించును.

## వాతశోఫలక్షణములు.

మూ. స క్షిప్రోత్థానప్రశమః భవతి, శ్యావారుణవర్ణః ప్రకృతివర్ణో వా చలః స్పన్దనః ఖరపరుషభిన్నత్వగ్రోమా, చ్ఛిద్యత ఇవ, భిద్యత ఇవ, పీడ్యత ఇవ, సూచీభిరివ తుద్యతే, పిపీలికాభిరివ సంసృప్యతే, సర్షపాదికకల్కావలిప్త ఇవ చిమిచిమాయతే, సఙ్కుచ్యత ఆయమ్యత ఇతి వాతశోఫః. ౮

వ్యా. పైజెప్పినవిధముగ కల్గినశోఫ అతిశీఘ్రముగ జనించి శీఘ్రముగనే శమించుచుండును. అయ్యది శ్యావవర్ణంబైనను, అరుణవర్ణంబైనను, శరీరమునకు సమానమైన వర్ణంబైనను కల్గియుండును. చంచలమై కదలుచుండును. చర్మంబును రోమములను కర్కశంబులను, పరుషంబులును నై వేలుచుండును. మరియు నాశోఫకల్గినచోట ఛేదించినవిధముగను, చీల్చినరీతిగను, మెలిబెట్టి పిసికినవిధముగను, సూదులచే బొడిచిన విధముగను, చీమలు పారుకాడినవిధముగను, బాధకల్గును. మరియు తీక్ష్ణములైనయావాలు మున్నగువానికల్కమును పూసినవిధముగ చిమచిమలాడుచుండును. పైచర్మము ముడుతలు కల్గి యీడువబడినట్లుండును. ఇట్టిలక్షణములు కల్గినది వాతశోఫ యని యెరుంగునది.

## పిత్తశోఫనిదానము, సంప్రాప్తియు.

మూ. ఉష్ణతీక్ష్ణ కటుకక్షారలవణామ్లాజీర్ణభోజనైః, అగ్న్యాతప ప్రతాపైశ్చ పిత్తం ప్రకుపితం త్వఙ్మాంసశోణితాన్యభిభూయ, శోఫం జనయతి. ౯

వ్యా. స్పర్శముచేతను గుణవీర్యములచేతను ఉష్ణమైన పదార్థములనైనను, కటుక పదార్థములనైనను, క్షారలవణామ్లరసములుకల పదార్థములనైనను, అజీర్ణకరపదార్థముల నైనను భుజించుట; నిప్పుయొక్కయు ఎండయొక్కయు వేడిసోకుట ఈకారణములచేత పిత్తము ప్రకోపమునొంది చర్మమాంసరక్తములను చెరిచి శోఫమును కల్గించును. (ఇయ్యది పిత్తశోఫ)

### పిత్తశోఫలక్షణములు.

మూ. స శీఘ్రోత్థానప్రశమో భవతి, కృష్ణపీతనీలతామ్రాకావభాసః, ఉష్ణోమృదుః, కపిలతామ్రలోమా, ఉష్యతే దహ్యతే దూయతే ధూప్యతే ఉష్ణాయతే స్విద్యతి క్లిద్యతి, న చ స్పర్శముష్ణం వా సుషూయతే, ఇతి పిత్తశోఫః. ౧౦

వ్యా. అట్టి పిత్తశోఫ శీఘ్రముగ పుట్టి శీఘ్రముగనే శమించును. అయ్యది నలుపు పసుపు నీలవర్ణము తామ్రవర్ణము అనురంగులలో నొకరంగుకల్గి వేడిగ మృదువై యుండును. అందు రోమములు కపిలవర్ణంబుగనైనను, తామ్రవర్ణముగనైన నుండును. అయ్యది యగ్నిసమీపమున నున్నవిధముగ సెగగల్గియు, నిప్పున కాలుపబడినవిధముగను మండుచుండును. చలించుచుండును. పొగ వెడలునట్లుండును. ఇతరులు తాకినచో వేడిగ నుండును. చెమట బట్టును. చెమ్మగిలును. ఇతరులు తాకినను ఉష్ణ (వేడి) స్పర్శమును సహింపలేకుండును. ఇయ్యది పిత్తమునగల్గినశోఫ యని యెరుంగునది.

### కఫశోఫనిదానము, సంప్రాప్తియు.

మూ. గురుమధురశీతస్నిగ్ధైః, అతిస్వప్నాఽవ్యాయామాదిభిశ్చ శ్లేష్మా ప్రకుపితః త్వఙ్మాంసశోణితాదీన్యభిభూయ శోఫం జనయతి. ౧౧

వ్యా. గురుపదార్థములను, మధురంబులును శీతంబైన స్పర్శవీర్యగుణములుగల్గి నదియు స్నిగ్ధంబునైన పదార్థములను భుజించుట; అధికముగ నిదురించుట, దేహపరిశ్రమమును బొత్తుగ జేయకుండుట ఇవి మున్నగుకారణములచేత కఫము ప్రకోపించి చర్మము మాంసము రక్తము మున్నగువానిని చెరిచి శోఫమును కల్గించును. (ఇది కఫజ శోఫము).

### కఫజశోఫలక్షణములు.

మూ. స కృచ్ఛ్రోత్థానప్రశమో భవతి, పాండుశ్వేతావభాసః స్నిగ్ధః శ్లక్ష్ణః గురుః స్థిరః స్త్యానః, శుక్లాగ్రరోమా, స్పర్శోష్ణసహశ్చేతి శ్లేష్మశోఫః. ౧౨

వ్యా. అట్టికఫమునకల్గినశోఫ మిక్కిలి కష్టముచే చిరకాలమునకు కల్గి మిక్కిలి కష్టముగ చిరకాలమునకు శమించును. పాండువర్ణంబైనను శ్వేతవర్ణంబైనను కల్గి, స్నిగ్ధంబు (జిడ్డుగల్గినది)ను, శ్లక్ష్ణంబును (నునుపుకల్గినది), భారముగను, గట్టిగను ఘనీభవించినదియు నైయుండును. అట్టి వాపుపైనుండురోమములు కొనలయందు తెల్లనై

యుండును. తాకినచో వేడిగనుండు స్పర్శముకల్గినను ఓర్చియుండును. ఇయ్యది కఫమున కల్గినశోఫ యని యెరుంగునది.

సంసర్గ, సన్నిపాతశోఫలనిదానము సంప్రాప్తి.

మూ. యథాస్వకారణాకృతిసంసర్గాత్ ద్విదోషజాస్త్రయః శోఫా భవన్తి. ౧౩
కారణాకృతిసన్నిపాతాత్ సాన్నిపాతిక ఏకః. ౧౪

వ్యా. వాతాదుల ప్రత్యేకముగ జెప్పినకారణములలో రెండేసిదోషముల కారణములచేత రెండేసిదోషముల సంసర్గముచే పుట్టి, అట్టి రెండేసిదోషముల లక్షణములు కలిసినశోఫలు ద్విదోషములని యెరుంగునది. అయ్యవి మూడువిధములు. మరియు మూడుదోషములకు వేరువేరుగ జెప్పినప్రకోపకారణముల మూడిటి సన్నిపాతముచే మూడుదోషములును సమకాలమున ప్రకోపించి దాన కల్గినశోఫయందు ఆదోషముల మూడిటిలక్షణములతోగూడిన శోఫసన్నిపాతమున సంభవించినదని యెరుంగునది. ఇది యొకవిధముగ నుండును.

శోఫములపరిగణనము.

మూ. ఏవం భేదప్రకృతిభిస్తాభిః భిద్యమానో ద్వివిధః, త్రివిధః, చతుర్విధః, సప్తవిధశ్చ శోఫ ఉపలభ్యతే పునశ్చైక ఏవోత్సేధ సామాన్యాదితి. ౧౫

వ్యా. పైజెప్పినరీతిగ నిజాగంతుభేదములచేతను, వాతపిత్తకఫరూపములగు కారణముల మూడిటిచేతను, సంసర్గ-సన్నిపాతభేదములచేతను తొలుత రెండువిధంబులును, దోషములమూటితో నొక్కొకటిచే గల్గినవి మూడువిధంబులును, దోషముల రెంటిసంసర్గమున కల్గినవిమూడును సన్నిపాతమున కల్గినది యొకటియు జేరి సంసర్గసన్నిపాతములు నాల్గును. ఏకదోషజ-ద్విదోషజ-సన్నిపాతజము లన్నియు కలిసి యేడువిధంబులుగ శోఫముండును. (నిజాగంతుభేదములచే రెండు. ఏకదోషమునకల్గినవి వాతిక, పైత్తిక, కఫజములు మూడు, ద్విదోషసంసర్గమున కల్గినవి వాతపిత్త, వాతకఫ, పిత్తకఫభేదములు మూడు. సన్నిపాతమున కల్గినది యొకటి, ఇందు ఆగంతుకములు గాక కేవలము దోషములచే గల్గినవి ఏకదోషజ-ద్విదోషజ-సాన్నిపాతికములు జేరి యేడువిధములుగ శోఫలుండునని భావము) మరియు శోఫ యనగ శరీరమునం దెచ్చటనైన స్వాభావికస్థితికన్న ఉన్నతముగ గల్గినవాపు అని యర్థము. అట్టి యున్నతరూపమైనలక్షణము నిజాగంతుశోఫలయం దన్నిటియందును సమానముగ నుండునుకావున అట్టిలక్షణమునుబట్టి శోఫము ఏకరూపముగ నగును.

## పైజెప్పినలక్షణములను కొన్నివిశేషలక్షణములను శ్లోకరూపముగ జెప్పుట, అందు వాతికశోఫలక్షణములు.

భవన్తి చాత్ర:—

మూ॥ శూయన్తే యస్య గాత్రాణి స్వప(స్పన్ద)న్తీవ రుజన్తి చ,
పీడితాన్యున్నమన్త్యాశు వాతశోఫం తమాదిశేత్. ౧౬
యశ్చాప్యరుణవర్ణాభః శోఫో నక్తం ప్రణశ్యతి,
స్నేహోష్ణమర్దనాభ్యాం చ ప్రణశ్యేత్స చ వాతికః. ౧౭

వ్యా॥ శరీరమునందు శోఫకల్గినచోట స్పర్శజ్ఞానము లేక నొప్పి కల్గి, వ్రేలిచేత నదిమినప్పుడు గుంటపడి ఆగుంట అతిశీఘ్రముగ తనంతటనే యుంబికిన నయ్యది వాతశోఫమని చెప్పనగును. మరియు ఎఱ్ఱనిరంగుకల్గి పవలంతయు వ్యాపించియుండి రాత్రియందు తనంతటనే శమించినను, చమురుచేతను ఉష్ణవీర్యమైన యౌషధాదులచేతను మర్దనచేసినప్పుడు శాంతినొందినను అయ్యది వాతమున గల్గినదని యెఱుంగునది.

## పైత్తికశోఫలక్షణములు.

మూ॥ యః పిపాసాజ్వరార్తస్య దూయతేఽథ విదహ్యతే,
స్విద్యతి క్లిద్యతే గన్ధీ సపైత్తః శ్వయథుస్స్మృతః. ౧౮
యః పీతనేత్రవక్త్రత్వక్ పూర్వం మధ్యాత్ప్రశూయతే,
తనుత్వక్చాఽతిసారీ చ పిత్తశోఫస్స ఉచ్యతే. ౧౯

వ్యా॥ శోఫ సంభవించినప్పుడు మనుజునకు డప్పియు జ్వరంబును కల్గి, నొప్పియు మంటయు పుట్టి, చెమటబట్టి నీరుకారుచుండి వాసనకల్గియున్నయెడ అట్టివాపు పిత్తమున జనించినదియని చెప్పబడును. మరియు తొలుత శరీరమధ్యమున వాపుపుట్టి శరీరమున వ్యాపించి వానికన్నులును ముఖంబును చర్మంబును పచ్చనై చర్మము పలుచనై అతిసారము కల్గినయెడ నయ్యది పిత్తశోఫమని యెఱుంగునది.

## శ్లైష్మికశోఫలక్షణములు.

మూ॥ శీతస్సక్తగతిర్యస్తు కణ్డూమాన్ పాణ్డురేవ చ,
నిపీడితో నోన్నమతి శ్వయథుస్స కఫాత్మకః. ౨౦
యస్య శస్త్రకుశచ్ఛిన్నాత్ శోణితం న ప్రవర్తతే,
కృచ్ఛ్రేణ పిచ్ఛాం స్రవతి స చాపి కఫసంభవః. ౨౧

వ్యా. ఏవాపు తాకినచో చల్లనై, పుట్టునపుడు సావకాశముగ పుట్టి నిశ్చలమై దురదయుం దెల్లనిరంగును కల్గి, చేతితో నదిమినప్పుడు పల్లముపడి మరల నది వేగిరముగ పైకుబకక యుండునో అయ్యది కఫమున జనించినదని యెరుంగునది. మరియు వాపుకల్గినచోట శస్త్రముచేనైనను ముల్లు మొదలగువానిచేనైనను చీల్చినయెడ రక్తము స్రవించక కొంతకాలమునకు జిడ్డుతోగూడిన నీరు స్రవించిన నయ్యది కఫశోఫముగ నెరుంగునది.

### సంసర్గసాన్నిపాతికశోఫలక్షణములు.

మూ. నిదానాకృతిసంసర్గాత్ శ్వయథుస్స్యాత్ ద్విదోషజః,
సర్వాకృతిస్సన్నిపాతాత్ శోఫో వ్యామిశ్రహేతుకః ౨౨

వ్యా. పైజెప్పిననిదానములు లక్షణములును రెండేసికలిసిన శోథములు ద్విదోషములు, మూడుదోషములలక్షణములును కల్గియున్నశోఫము సాన్నిపాతికమని యెరుంగునది.

(వాక్యరూపముగ జెప్పినవిషయమునే మరల శ్లోకరూపముగ వివరించుచు "భవన్తి చాత్ర శ్లోకాః" అని యుపక్రమించి చెప్పుట తంత్రకారుల సంప్రదాయము. అట్టి మర్యాద ననుసరించి వాతికాదిశోఫలక్షణములు మరల సుఖబోధార్థమై శ్లోకరూపముగ జెప్పబడియె కావున పునరుక్తము కాదని యెరుంగునది)

### శోఫసాధ్యాసాధ్యలక్షణము.

మూ. యస్తు పాదాభినిర్వృత్తః శోఫస్సర్వాఙ్గగో భవేత్,
జన్తోస్స చ సుకష్టస్స్యాత్ ప్రసృతః స్త్రీముఖాచ్చ యః. ౨౩
యశ్చాపి గుహ్యప్రభవః స్త్రియో వా పురుషస్య వా,
స చ కష్టతమో జ్ఞేయో యస్య చ స్యురుపద్రవాః. ౨౪

వ్యా. పురుషునకు తొలుత పాదములయందు శోఫజనించి యంతట నివర్తించక శరీరమునందెల్ల (పైకి నెగబ్రాకి) వ్యాపించిన నట్టిశోఫము కష్టసాధ్యము. మరియు స్త్రీలకు తొలుత ముఖమున బుట్టి క్రింది శరీరమునందెల్ల వ్యాపించినశోఫయుం కష్టసాధ్యమగును. మరియు స్త్రీలకైనను పురుషులకైనను గుహ్యప్రదేశమున పుట్టినశోఫ మిక్కిలి కష్టసాధ్యము. మరియుం ఛర్ది మున్నగు నుపద్రవములతో గూడినశోఫము కూడ మిక్కిలి కష్టసాధ్యము.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—"అధోభాగో గురుస్త్రీణాం ఊర్ధ్వః పుంసాం గురుస్తథా" అనువచనప్రకారము స్త్రీలశరీరము క్రిందిభాగము గొప్పదిగను

పైభాగము లఘువుగను ఉండుననియు, పురుషులకు శరీరమునం దూర్ధ్వభాగము గొప్పది గను క్రిందిభాగము లఘువుగను ఉండునని తెలియఁజేయుచున్నది. పురుషులకు గురువుగనుండు ఊర్ధ్వశరీరమున తొలుత శోఫము జనించి యంతట నివర్తించక క్రిందిశరీరమునం దెల్ల వ్యాపించిన కష్టసాధ్యమగును. అటుగాక లఘువుగనుండు అధశ్శరీరమున తొలుత బుట్టి గురువుగనుండు ఊర్ధ్వభాగమున వ్యాపించిన నయ్యది మిక్కిలి యసాధ్యమగును. స్త్రీలకు దీనికి వ్యతిరేకముగ నెరుంగునది.

## శోఫోపద్రవములు.

మూ. ఛర్దిశ్శ్వాసోఽరుచి స్తృష్ణా జ్వరోఽతీసార ఏవ చ,
సప్తమోఽయం సదౌర్బల్యః శోఫోపద్రవసఙ్గ్రహః. ౧౫

వ్యా. వాంతి, శ్వాసము, అరుచి, దప్పి, జ్వరము, అతిసారము, బలహీనము అను నీయేడును శోఫమున గల్గునుపద్రవములు.

వాతాదిదోషములచే గల్గుశోఫలను సామాన్యముగ జెప్పి అట్టిదోషములచే నిర్ణితప్రదేశములయందు గల్గుశోఫవిశేషము లీక్రింద జెప్పబడును. అందు ఉపజిహ్వక.

మూ. యస్య శ్లేష్మా ప్రకుపితః జిహ్వామూలేఽవతిష్ఠతే,
ఆశు సంజనయేచ్ఛోథం జాయతేఽస్యోపజిహ్వికా. ౧౬

వ్యా. కఫము ప్రకోపమునొంది జిహ్వామూలమున (నాలుకకు మొదట) జేరి యచ్చట శోఫమును శీఘ్రముగ కల్గించును. అయ్యది యుపజిహ్వక యనురోగమును కల్గించును.

## గలశుండిక.

మూ. యస్య శ్లేష్మా ప్రకుపితః కాకలే వ్యవతిష్ఠతే,
ఆశు సంజనయేచ్ఛోథం కరోతి గలశుణ్డికామ్. ౧౭

వ్యా. ఎవనికి కఫము ప్రకుపితమై తాలుమూలమున జేరునో వానికి నచ్చోట శోఫము సంభవించును. దానంజేసి కలశుండిక యనురోగమును కల్గించును.

## గళగండము.

మూ. యస్య శ్లేష్మా ప్రకుపితో గళబాహ్యేఽవతిష్ఠతే,
శనైస్సంజనయేచ్ఛోథం గళగణ్డోఽస్య జాయతే. ౧౮

వ్యా. కఫము ప్రకుపితమై మెడలో బైటిప్రదేశమున జేరినయెడ నచ్చట మెలమెల్లగ నానాట శోఫను కల్గించును. దానివలన గళగండరోగము కల్గును.

(ఇచ్చట 'శనైః' అనుటచేత గలగండమును కల్గించుదోషములు మెలమెల్లగ పనిచేయు ననియు, తక్కినవానియందు 'ఆశు' అని చెప్పుటచేత ఉపజిహ్వికాదులయందు దోషములు శీఘ్రముగ పనిచేయుననియు తెలిసెడి.)

## గళగ్రహము.

మూ. యస్య శ్లేష్మా ప్రకుపితః తిష్ఠత్యన్తర్గళే స్థితః,
ఆశు సంజనయేచ్ఛోఫం జాయతేఽస్య గళగ్రహః. ౨౯

వ్యా. శ్లేష్మము ప్రకుపితమై కుత్తుకలోభాగమున జేరి వాపును శీఘ్రముగ కల్గించును. దానివలన గళగ్రహము సంభవించును. (పైజెప్పబడిన నాల్గువిధములైన శోఫములు కఫప్రకోపముచేత స్థానవిశేషమున గల్గుశోఫభేదములని యెరుంగునది.)

## విసర్పము.

మూ. యస్య పిత్తం ప్రకుపితం సరక్తం త్వచి సర్పతి,
శోఫం సరాగం జనయేత్ విసర్పస్తస్య జాయతే. ౩౦

వ్యా. పిత్తము ప్రకుపితమై రక్తముతోగూడి చర్మమునజేరి యొకచో నిల్కడలేక సంచరించుచున్నయెడ రక్తవర్ణముకలశోఫమును చర్మమున కల్గించును. దానివలన విసర్పము (నిల్కడలేక సంచరించు వ్యాధివిశేషము) కల్గును. (ఇచ్చట విసర్పమునకును క్రిందచెప్పబడు పిడకకును సంప్రాప్తికారణము సమానముగనున్నను విసర్పకారణమైన దోషము నిల్కడలేక వ్యాపించుస్వభావము కల్గియుండుననియు, పిడకలకు కారణమైన దోషము ఒకచోట నిల్కడకల్గియుండుననియు భేదము నెరుంగునది.) అందుచేతనే పిడకాసంప్రాప్తియందు "అవతిష్ఠతే" అని చెప్పబడినది.)

## పిటిక.

మూ. యస్య పిత్తం ప్రకుపితం త్వచి రక్తేఽవతిష్ఠతే,
శోథం సరాగం జనయేత్ పిడకా తస్య జాయతే. ౩౧

వ్యా. పిత్తము ప్రకుపితమై చర్మము రక్తముతోగూడి యొక్కచోట నిల్కడగ నిలచియున్నయెడ నచ్చోట వాపు కల్గును. దానివలన నచ్చట పిడక జనించును.

## తిలకాదులస్వరూపము.

మూ. (యస్య ప్రకుపితం పిత్తం శోణితం ప్రాప్య శుష్యతి,
తిలకాః పిప్లవో వ్యఙ్గా నీలికా తస్య జాయతే.) ౩౨

వ్యా. పిత్తము ప్రకుపితమై రక్తముతో జేరినప్పుడు అట్టిరక్తము పిత్తము యొక్క వేడిమిచే శోషించును. దానంజేసి తిలకములు (నువ్వులవంటి నల్లని పుట్టు మచ్చలు)ను, పిప్లవములు (శరీరమున వ్యాపించుస్వభావముగల మచ్చలు)ను, వ్యంగంబు (మంగు)ను, నీలికయు కల్గును. (ఇచ్చట శోథవిశేషముల జెప్పు ప్రకరణమున నట్టినడమ శోథరూపముకాని తిలకాదుల జెప్పుట యసమంజసముగ నున్నది. కావుననే ప్రాచీన ముద్రితగ్రంథములలో నీశ్లోకము కానరాదు. చక్రపాణి దత్తవ్యాఖ్యానమున నీశ్లోక మునకును వ్యాఖ్య యగపడుచున్నది. ముఖ్యముగ నీశ్లోకము మాత్రము ప్రక్షిప్తమనియె తోచెడి. విజ్ఞులు విమర్శించెదరుగాక!)

### శంఖకము.

మూ. యస్య పిత్తం ప్రకుపితం శఙ్ఖయోరవతిష్ఠతే,
శ్వయథుశ్శఙ్ఖకో నామ దారుణస్తస్య జాయతే. 33

వ్యా. పిత్తము ప్రకోపించి మనుజునికణతలయందు జేరి వాపును కల్గించును. దానివలన క్రూరమైన శంఖకమనువ్యాధి సంభవించును.

### కర్ణమూలము.

మూ. యస్య పిత్తం ప్రకుపితం కర్ణమూలేఽవతిష్ఠతే,
జ్వరాన్తే దుర్జయోఽన్తాయ శోథస్తస్యోపజాయతే. 3౮

వ్యా. పిత్తము ప్రకుపితమై చెవుల మొదటజేరి జ్వరముయొక్క కడపటిస్థితి యందు వాపును కల్గించును. అయ్యది క్రూరమైన కర్ణమూల మనువ్యాధిని కల్గించును ఇయ్యది యసాధ్యము. (దీనిలక్షణము స్థలాంతరమున నిట్లు చెప్పబడినది.—"సన్నిపాత జ్వరస్యాన్తే కర్ణమూలే సుదారుణః, శోథస్సంజాయతే తేన కశ్చిదేవ విముచ్యతే" ఈ శ్లోకమువలన నియ్యది సన్నిపాతజ్వరాంతమున జనించునని తెలిసెడి.) ఇత్తెరంగున పిత్త ప్రకోపముచే స్థలవిశేషముల గల్గుశోథలు చెప్పబడినవి.

### ప్లీహవృద్ధి.

మూ. వాతః ప్లీహానముద్ధూయ కుపితో యస్య తిష్ఠతి,
శనైః పరితుదన్ పార్శ్వం ప్లీహా తస్యాఽభివర్ధతే. 3

వ్యా. వాతము ప్రకుపితమై ప్లీహమున జేరి యుబికించి మెలమెల్లగ శూ నొప్పిని కల్గించుచు, పార్శ్వమునందు ప్లీహమును వృద్ధినొందించును. ఇయ్యది ప్లీహ వృద్ధి యనబడును.

### గుల్మము.

మూ. యస్య వాయుః ప్రకుపితో గుల్మస్థానేఽవతిష్ఠతే,
శోఫం సశూలం జనయన్ గుల్మస్తస్యోపజాయతే. 36

వ్యా. వాతము ప్రకుపితమై గుల్మస్థానమునజేరి పోటుతోగూడిన శోఫమును కల్గించును అయ్యది గుల్మరూపమగును.

### అండవృద్ధి.

మూ. యస్య వాయుః ప్రకుపితః శోఫశూలకరశ్చరన్,
వఙ్క్షణాద్వృషణౌ యాతి వృద్ధిస్తస్యోపజాయతే. 37

వ్యా. వాతము ప్రకుపితమై వంక్షణముల (గెజ్జలలో) జేరి నొప్పితో గూడిన శోఫను కల్గించి యాశోఫము గెజ్జలనుండి వృషణములజేరి వ్యాపించును. ఇది యండ వృద్ధి యనబడును.

### మహోదరము.

మూ. యస్య వాతః ప్రకుపితః త్వఙ్మాంసాన్తరమాశ్రితః,
శోఫం సంజనయన్ కుక్షౌ ఉదరం తస్య జాయతే. 38

వ్యా. వాతము ప్రకుపితమై చర్మమునకును మాంసమునకును నడుమ జేరి కుక్షిలో శోఫమును కల్గించును. అయ్యది యుదరమగును.

### ఆనాహము.

మూ. యస్య వాతః ప్రకుపితః కుక్షిమాశ్రిత్య తిష్ఠతి,
నాధో వ్రజతి నాప్యూర్ధ్వం చానాహస్తస్య జాయతే. 39

వ్యా. వాతము ప్రకుపితమై కుక్షిలో జేరి క్రిందికిని పైకిని వెడలక కుక్షిలోనే నిరుద్ధమైయుండును. దానంజేసి కడుపుబ్బును. (ఇయ్యది యానాహము).

### అనుక్తాధిమాంసాదిసంగ్రహము.

మూ. రోగాశ్చోత్సేధసామాన్యాత్ అధిమాంసార్బుదాదయః,
విశిష్టా నామరూపాభ్యాం నిర్దేశ్యాశ్శోథసఙ్గ్రహే. 40

వ్యా. మరియు నధిమాంసము అర్బుదము మున్నగువ్యాధులును శరీరస్థితికన్న నున్నతముగనుండు రూపసామాన్యమునుబట్టి శోఫములయందే జేరును. వానియొక్క నామరూపములచే గల్గువిశేషములు ఉన్నతరూపమైన శోథములయొక్క సంగ్రహమున నిర్దేశింపదగియుండును.

ఇచ్చట వాతప్రకోపమున శరీరమున దేశభేదమున గల్లుశోఫ విశేషములు చెప్పబడినవి. మరియుం గుల్మాదిరోగములలక్షణములు మున్నగునవి విశేషముగ జెప్పవలసియున్నను, ఉన్నతరూపసామాన్యలక్షణమునుబట్టి యాశోఫప్రకరణమున సూచనామాత్రముగ చెప్పబడినది.

మరియుం "యస్య శ్లేష్మా ప్రకుపితః" అని యుపక్రమించి కఫపిత్తవాతములచే వేర్వేరుగ శోఫరూపముగ నాయాప్రదేశముల సంభవించు ఉపజిహ్వక, గళశుండిక మున్నగురోగముల సంప్రాప్తిస్వరూపము మాత్రము తెలుపబడినది.

రోహిణీసంప్రాప్తి.

మూ॥ వాతపిత్తకఫా యస్య యుగపత్కుపితాస్త్రయః,
జిహ్వామూలేఽవతిష్ఠన్తే విదహన్తస్సముచ్ఛ్రితాః. ౪౧
జనయన్తి భృశం శోథం వేదనాశ్చ పృథగ్విధాః,
తం శీఘ్రకారిణం నామ్నా రోహిణీతి వినిర్దిశేత్. ౪౨

వ్యా. వాతపిత్తకఫములు మూడును సమకాలమున ప్రకోపమునొంది మిక్కిలి యుత్కటములై నాలుకకు మూలమైన కంఠబిలంబున జేరి యధికముగ మంటపుట్టించుచు మిక్కిలి బాధను కల్గించునట్టివాపును పుట్టించును. త్రిదోషములకు సంబంధించినశూల పోటు మంట నొప్పి మున్నగుబాధలు పలువిధంగుల సంభవించును. ఇయ్యది రోహిణి యని చెప్పబడును. అతిశీఘ్రముగ వ్యాపించి ప్రాణముల హింసజేయును. సన్నిపాతముచే గల్గుటంజేసి ఒకప్పుడు మంటను ఇంకొకప్పుడు నొప్పిని (ఇవ్విధముగ ననేకబాధల గల్గించుచు శీఘ్రముగ నపాయమును గల్గించుచునని భావము).

రోహిణీసాధ్యాసాధ్యత్వములు.

మూ. త్రిరాత్రం పరమం తస్య జన్తోర్భవతి జీవితమ్,
కుశలేన త్వనుక్రాన్తః క్షిప్రం సంపద్యతే సుఖీ. ౪౩

వ్యా అట్టి క్రూరమైనరోహిణి యనురోగము కల్గినయెడ అట్టిరోగి మూడు రాత్రులు జీవించియుండును. ఈమూడురాత్రులకు లోపల మిక్కిలి చికిత్సానిపుణుడగు వైద్యుడు అందుకు దగినచికిత్సను అతిశీఘ్రముగ జేసినచో రోగి సుఖమునొందును. (మూడురాత్రులు గడచువరకు దగినచికిత్స జేయనిచో నయ్యది తప్పక రోగిని చంపునని భావము.)

ఇచ్చట "కుశలేన క్షిప్రం అనుక్రాన్తః సుఖీ సమ్పద్యతే" అని యన్వయించుట చేత అట్టిరోగి సమర్థుడగువైద్యునిచే నతిశీఘ్రముగ చికిత్సజేయబడినయెడ సుఖము

నొందునని యర్థమగును. లేక "క్షిప్రం సుఖీ సంపద్యతే" యని యన్వయించినచో కుశలుడగు వైద్యుడు తగినచికిత్స జేసినచో శీఘ్రముగ నివర్తించునని యర్థము. వ్యాధిస్వభావముచే నతిశీఘ్రముగ జనించి తగుచికిత్స జేసినయెడ నతిశీఘ్రముగనే నివర్తించునని భావము. ఇట్టి శీఘ్రకారిత్వము వ్యాధిస్వభావమున కల్గినదని యెరుంగునది. ఈవిషయమునే తంత్రాంతరమున నిట్లు చెప్పిరి:—"స శీఘ్రం శీఘ్రకారిత్వాత్ ప్రశమం యాతి హన్తి వా" అట్టి రోహిణి శీఘ్రకారిస్వభావము కల్గినదికావున తగుచికిత్స జేసినచో శీఘ్రముగ శమించును. లేనియెడ శీఘ్రముగ చంపునని యర్థము.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—ప్రకృతగ్రంథమున నియ్యది కేవలము సన్నిపాతమున జనించునని యొకవిధముగనే చెప్పబడినది. "పృథక్సమస్తాశ్చ తథైవ శోణితమ్." అని సుశ్రుతాచార్యుండును, "వాతః పిత్తం కఫో రక్తం చైకశస్సర్వశోఽపి వా, కణ్ఠం యదా నిషేవన్తే" అని భోజుండు రోహిణీసంప్రాప్తిని చెప్పిరి. వాత-పిత్త-కఫ-రక్త-సన్నిపాతభేదములచే నైదువిధముల నుండునని చెప్పి వానికి ప్రత్యేకముగ లక్షణములను జెప్పిరి. ఈపక్షము నవలంబించి ఖరనాదుడు "సద్యస్త్రిదోషజా హన్తి, త్ర్యహాత్ శ్లేష్మసముద్భవా, పఞ్చాహాత్ పిత్తసమ్భూతా, సప్తాహాత్ పవనోత్థితా" అని యాయాదోషానుసారముగ కాలనియమమును నిర్ణయించి చెప్పెను. (త్రిదోషమున బుట్టినది యప్పుడే చంపుననియు, కఫమున కల్గినది మూడుదినములకు చంపుననియు, పిత్తమున గల్గినది యైదుదినములలో చంపుననియు, వాతమున కల్గినది యేడుదినములలో చంపుననియు నర్థము.)

ఈపక్షమునే అవలంబించి మాధవకరుండును ఐదువిధములైన రోహిణీభేదములకు వేరువేరుగ లక్షణముల జెప్పెను. ఇయ్యది త్రిదోషసన్నిపాతముననే జనించునదియైనను, అట్టి త్రిదోషములలో నేదోషము మిక్కిలి యుత్కటముగ నుండునో అట్టి దోషమును ప్రధానముగజేసి సుశ్రుతభోజాదులు వేరువేరుగ పరిగణనముచేసి "వ్యపదేశస్తు భూయసా" అనువచనప్రకారము భేదముల గల్పించి లక్షణముల జెప్పిరి. ప్రకృతతంత్రకారుడు మాత్రము సన్నిపాతభేదమును మాత్రము ప్రధానముగజేసి చెప్పెనుగాన పరస్పరవిరోధములేదని యెరుంగునది. దీని విస్తరమంతయు మాచే విరచితంబగు మాధవనిదానాంధ్రవ్యాఖ్యానమున రోహిణీనిదానమున జూచునది. మరియు "గలోపసంరోధకరైస్తదఙ్కురైః" అని తంత్రాంతరమున నుండుటంజేసి యీవ్యాధి కంఠబిలమున మాంసపుమొలకలవలె నుండుశోఫవిశేషమని తెలియదగును.

## కృచ్ఛ్రసాధ్యలక్షణము.

మూ. సన్తి హ్యేవం విధా రోగాః సాధ్యా దారుణసమ్మతాః,
యే హన్యురనుపక్రాన్తాః మిథ్యాచారేణ వా పునః ౪౪

వ్యా. పైజెప్పినరీతిగ మిక్కిలి క్రూరములై ప్రాణహానికరములని చెప్పబడిన రోగములు కొన్ని శీఘ్రముగ తగుచికిత్స జేసినచో నయ్యవి సాధ్యములై యుండును. అవియే తగినచికిత్స జేయకయున్నను, అపథ్యములగు నాహారవిహారాదుల జేసినను మిక్కిలి క్రూరములై చంపును.

## సుఖసాధ్యలక్షణము.

మూ. సాధ్యాశ్చాప్యపరే సన్తి వ్యాధయో మృదుసమ్మతాః,
యత్నాయత్నకృతం యేషు కర్మ సిద్ధ్యత్యసంశయమ్. ౪౫

వ్యా. కొన్నివ్యాధులు మిక్కిలి మృదుస్వభావముకల్గినవియై మిక్కిలి ప్రయత్నపూర్వకముగ చికిత్సజేసినను సామాన్యముగ చికిత్సజేసినను అట్టిచికిత్స వ్యర్థముగాక తప్పక నివర్తించును. అయ్యవి కేవలము సుఖసాధ్యములై యుండును.

## యాప్యరూపాసాధ్యలక్షణము.

మూ. అసాధ్యాశ్చాపరే సన్తి వ్యాధయో యాప్యసంజ్ఞితాః,
సుసాధ్వపి కృతం యేషు కర్మ యాత్రాకరం భవేత్. ౪౬

వ్యా. కొన్నియసాధ్యములైనవ్యాధులు కుశలుడగువైద్యుడు పొరబాటులేక చక్కగ సకాలముగ తగుమైనచికిత్స జేసినచో నట్టియసాధ్యములగువ్యాధులును రోగిని చంపక బొత్తుగ నివర్తించక యుద్రేకము మాత్రము తగ్గి జీవితకాలము గడపుటకు అనుకూలముగ నుండును. (అసాధ్యములైనను యాప్యత్వము నొందుననుట.)

## ప్రత్యాఖ్యేయరూపాసాధ్యలక్షణము.

మూ. సన్తి చాప్యపరే రోగాః కర్మ యేషు న సిధ్యతి,
అపి యత్న (అతియత్న) కృతం బాలైః న తాన్విద్వానుపాచరేత్.

వ్యా. కొన్నిరోగములు మిక్కిలి ప్రయత్నముతో చికిత్సజేసినను అట్టిచికిత్స వ్యర్థమై శాంతినొందక యుండును. అయ్యవి కేవలము అసాధ్యములు. అట్టివ్యాధులకు తెలివిమాలినవైద్యులు చికిత్స జేయబూనవలెనుగాని జ్ఞానవంతుడగువైద్యు డెప్పుడును చికిత్స జేయ నుద్యమింపదగదు.

### సాధ్యాది భేదపరిగణనము.

మూ. సాధ్యాశ్చైవాప్యసాధ్యాశ్చ వ్యాధయో ద్వివిధాః స్మృతాః,
మృదుదారుణభేదేన తే భవన్తి చతుర్విధాః. ౪౮

వ్యా. జ్వరాదిరోగములన్నియుం సాధ్యములనియుం అసాధ్యములనియుం రెండు విధములు. అందు సాధ్యములును అసాధ్యములును ఒకొక్కటి మృదుదారుణభేదములచే రెండేసివిధములై మొత్తమున నాల్గువిధములగును. (సాధ్యములు సుఖసాధ్యములు కృచ్ఛ్రసాధ్యములని రెండువిధములు. అసాధ్యములును మృదు (సుఖ) అసాధ్యములనియుం, దారుణాసాధ్యములనియుం రెండువిధములు. మృదుఅసాధ్యములే యాప్యములు. దారుణాసాధ్యములు ప్రత్యాఖ్యేయములు. ఇట్టిభేదములచేత సాధ్యాసాధ్యభేదములు నాల్గువిధములగునని భావము. వీనిలక్షణములే 'సంతి హ్యేవం విధా రోగాః' అని యుపక్రమించి చెప్పబడినవి) మరియు సద్యఃప్రాణహరము దారుణాసాధ్యములనియుం, కాలాంతరప్రాణహరములు మృద్వసాధ్యములనియు నెరుంగునది.

### వ్యాధినానాత్వము.

మూ. త ఏవాపరిసంఖ్యేయాః భిద్యమానా భవన్తి చ,
రుజావర్ణసముత్థానస్థానసంస్థాననామభిః. ౪౯
(నిదానవేదనావర్ణస్థానసంస్థాననామభిః)

వ్యా. మరియుం పైజెప్పిన సాధ్యాసాధ్యరూపములగువ్యాధులు ఆయావ్యాధులగల్గుబాధలు, వర్ణములు, అట్టివ్యాధులు జనించుటకు కారణములు, ఆవ్యాధులు పుట్టినస్థానములు, వ్యాధులయొక్కయునికి, వ్యాధులనామభేదములు అనువానియొక్క భేదములబట్టి సాధ్యాదిభేదము లనేకములుగ నగును. (కావున అట్టిరుజాదిభేదములబట్టియుం సాధ్యాసాధ్యత్వాదుల నిర్ణయించనగునని భావము).

సముత్థానభేదమన వ్యాధి జనించుటకు కారణములభేదము. అయ్యది రూక్షాదిభోజనంబులును రాత్రిజాగరణాదులును వాతప్రకోపమునకు కారణములగును. అట్టిచో నిదానానుగుణములగు చికిత్సల గల్పింపవలెను. అట్టి యనుగుణముగ హేతువిపరీతాదిచికిత్సలచే వాతము సాధ్యమగును. లేనిచో నసాధ్యస్థితి నందును.

స్థానభేదములు:—ఆమాశయము, పక్వాశయము, రసరక్తాదిధాతువులు మున్నగు స్థానభేదములచే వ్యాధులు సాధ్యాసాధ్యములుగ నగును. కావున స్థానభేదములబట్టియుం సాధ్యత్వాదులు మారుచుండును.

సంస్థానమనగ నాకృతి:—గుల్మము, అర్బుదవ్రణము మున్నగునవి ఆకృతి భేదముచే సాధ్యత్వాదులు గమనింపవలసియుండును. రాజయక్ష్మము. శోషము మున్నగునాను భేదములనుబట్టి సాధ్యత్వాదులు నిర్ణయింపదగియుండును. కావున పైజెప్పినబాధవర్గము కారణము మున్నగువాని చక్కగ గమనించి రోగములను వానిసాధ్యత్వాదిభేదములను నిర్ణయించి చికిత్స జేయవలెనని భావము.

## —వ్యాధిసంఖ్యాభేదనిర్ణయము.—

మూ. వ్యవస్థాకరణం తేషాం యథా స్థూలేషు సంగ్రహః,
తథా ప్రకృతిసామాన్యం వికారేషూపదిశ్యతే. ౪౦

వ్యా. చికిత్సోపయోగ్యమైన రోగసంఖ్యానిర్ణయము అష్టోదరీయాధ్యాయమున ఉదరాదిరోగసంఖ్యాభేదములయందు చెప్పబడును. (అచ్చట వాతాదిభేదములచే నాయారోగములకు గల్గుసంఖ్యానిర్ణయము చెప్పబడును కావున దానింబట్టి యెరుంగవలెనని భావము). మరియు నందు సంఖ్యానిర్ణయము చేయబడనిరోగములను ఆయారోగములకుంగల వాతాదిలక్షణములనుబట్టి నిర్ణయించి శక్తదనుసారముగ నెఱుంగనగును. (వ్యాధులకుంగలరోగములలో వాతాదిలక్షణముల గమనించి ఇయ్యది వాతికము. ఇయ్యది పైత్తికము, ఇయ్యది రక్తజమునని నిర్ణయించి చికిత్స జేయనగునని భావము). ఈయభిప్రాయముచేతనే అష్టోదరీయాధ్యాయమున "సర్వే వికారాః వాతపిత్తకఫాన్నాతివర్తన్తే" అని చెప్పిరి. రోగములన్నియు వాతపిత్తకఫముల మూటి నతిక్రమించి జనించుటలేదు. కావున అట్టిదోషములలక్షణములబట్టి అనుక్తరోగములను వాతాదిభేదముల నిర్ణయింపదగునని భావము.

## —రోగనామపరిజ్ఞానము లేకున్నను దోషజ్ఞానము చికిత్సోపయోగ్యమనుట.—

మూ. వికారనామాకుశలో న జిహ్రీయాత్కదాచన,
న హి సర్వవికారాణాం నామతోఽస్తి ధ్రువా గతిః(స్థితిః) ౪౧
స ఏవ కుపితో దోషః సముత్థానవిశేషతః,
స్థానాన్తరగతశ్చైవ జనయత్యామయాన్ బహూన్. ౪౨
తస్మాద్వికారప్రకృతీరధిష్ఠానాన్తరాణి చ,
సముత్థానవిశేషాంశ్చ బుద్ధ్వా కర్మ సమాచరేత్. ౪౩
యో హ్యేతత్త్రివిధం జ్ఞాత్వా కర్మాణ్యారభతే భిషక్,
జ్ఞానపూర్వం యథాన్యాయం స కర్మసు న ముహ్యతి. ౪౪

వ్యా. తాత్కాలికలక్షణములబట్టి యియ్యది జ్వరము రక్తపిత్తము మున్నగు నామభేదములచే వ్యాధిని నిర్ణయింప నలవికాకున్నను అంతమాత్రముననే వైద్యుఁడు చికిత్సజేయుటకు ఒకప్పుడును సంకోచము నొందదగదు. రోగములకన్నిటికి నామ మాత్రముచేతనే స్థిరమైననిర్ణయ మొకటి యేర్పడియుండదు. ఒకదోషము ప్రకుపితమై యొకస్థానవిశేషమునఁజేరి యనేకరోగముల నితరస్థానములయందు కల్గించును. (వాతము ప్రకుపితమై కంఠమునఁజేరి స్వరభేదము కాసము మున్నగురోగముల గల్గించును. ఈ విషయముననే "కరోతి గళమాశ్రితః, కంఠోద్ధ్వం సంచకాసంచ కాసంచ స్వరభేద మరోచకమ్" అనుశ్లోకమున దెలిసెడి.) కావున కేవలము రోగములనామభేదము దెలియకున్నంతమాత్రమున చికిత్సజేయ సంశయింపదగదని భావము.

కావున వైద్యుఁడు ఆయారోగములకు ముఖ్యకారణములైన వాతాదిదోషములను, అట్టిరోగములు జనించుట కధిష్ఠానములైన స్థానములను, అట్టిరోగములు సంభవించుటకు కారణములైన యాహారవిహారాదులను చక్కఁగ గమనించి చికిత్సజేయ నుపక్రమింపవలెను. మరియు నేవైద్యవరుఁడు పైజెప్పినదోషరూపమైన ప్రకృతులను (వాతాదిదోషముల ననుట), ఆయావ్యాధుల కధిష్ఠానములైన స్థానభేదములను, వ్యాధి కారణములను (ఈమూటిని) చక్కఁగ నెరింగి అట్టిజ్ఞానపూర్వకముగ శాస్త్రపద్ధతి నతిక్రమింపక చికిత్సజేయ నారంభించునో అట్టి భిషగ్వరుఁడు చికిత్సావిధానముల యందు ఒకప్పుడును పొరబాటుపడనేరడు. (రోగములకు చికిత్సజేయుటకు వాతాది దోషములజ్ఞానము ముఖ్యముగ నుపకారకములగును. జ్వరము, అతిసారము మున్నగు నామములు వ్యవహరించుటకై యేర్పడినవి, కాని అట్టినామములే చికిత్సకు ఉపకారకములు కావు. కావున వ్యాధి నామభేదముచే స్ఫుటముగ దెలియలేదని చికిత్సజేయ విరమించక ఆకృతిస్థానప్రకృతులబట్టి వాతాదిసంబంధమును చక్కఁగ గమనించి తగుచికిత్స జేయుట ముఖ్యకర్తవ్యమని భావము.)

### వాతాదిపరిజ్ఞానావశ్యకత.

మూ. నిత్యాః ప్రాణభృతాం దేహే వాతపిత్తకఫాస్త్రయః,
విక్రుతాః ప్రకృతిస్థా వా తాన్బుభుత్సేత పణ్డితః. ॥౩౮॥

వ్యా. ప్రాణికోటులశరీరములయందు వాతపిత్తకఫములు మూడును వికృతిజెంది యైనను వికృతిజెందక స్వభావస్థితియందైనను ఎప్పటికిని యెడబాయక నియతముగ నుండును. కావున అట్టిదోషత్రయముయొక్క స్వభావస్థితిని వికృతిస్థితిని యెరుంగుట పండితునకు ముఖ్యముగ నావశ్యకమై యుండును.

## ప్రకృతిస్థితవాతకృత్యములు.

మూ. ఉత్సాహోచ్ఛ్వాసనిశ్శ్వాసచేష్టా ధాతుగతిస్సమా,
సమో మోక్షో గతిమతాం వాయోః కర్మావికారజమ్. ౫౬

వ్యా. వికృతిజెందక స్వభావస్థితి నుండువాతము పనులయం దుత్సాహము కల్గించును. ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములను (ఊపిరియొక్క గమనాగమనములను) చక్కగ సాగించును. అవయవములయొక్క చాచుట ముడుచుట మున్నగు చలనరూపమయినచేష్టలను చక్కగ సాగించును. రసరక్తాదిధాతువులను శరీరమున చక్కగ వ్యాపింపజేయును. వాతమూత్రపురీషాదులను ఆయాసమయములయందు అడ్డులేక చక్కగా బయట వెడలించుచుండును. ఇవియన్నియు సమస్థితినుండు వాతకృత్యములు.

## ప్రకృతిస్థితపిత్తకృత్యములు.

మూ దర్శనం పక్తిరూష్మా చ క్షుత్తృష్ణా దేహమార్దవం,
ప్రభా ప్రసాదః మేధా చ పిత్తకర్మాఽవికారజమ్. ౫౭

వ్యా. పిత్తము వికృతిజెందక స్వభావస్థితి నున్నప్పుడు కన్నులయందు చూచుశక్తిని చక్కగ నుంచును. భుజింపబడినయాహారమును జీర్ణింపజేయును. దేహమునకు మితమైనవేడిని కల్గించును. ఆకలిని దప్పిని మితముగ కల్గించును. శరీరమునకు తగినమృదుత్వమును కాంతిని కల్గించును. మనస్సును నిర్మలముగ నుంచును. బుద్ధిని సమస్థితి నుంచును. ఇవియన్నియు సమస్థితినుండు పిత్తకృత్యములు.

## ప్రకృతిస్థితకఫకృత్యములు.

మూ. స్నేహో బన్ధః స్థిరత్వం చ గౌరవం వృషతా బలం,
క్షమా ధృతిరలోభం చ కఫకర్మావికారజమ్. ౫౮

వ్యా. కఫము వికారముజెందక సమస్థితి నున్నప్పుడు శరీరముపై జిడ్డును కల్గించును. కీళ్లను సడలనీయక ఒండొంటజేర్చి యుంచును. శరీరమున కుండవలసిన బరువును కల్గించును. పుంస్త్వమును కల్గించును. బలమును, ఓర్పును, ధైర్యమును కల్గించును. ఉదారభావమును పుట్టించును. ఇవియన్నియు సమస్థితినుండు కఫముయొక్క కృత్యములు.

## వాతపిత్తకఫముల క్షీణలక్షణములు.

మూ. వాతే పిత్తే కఫే చైవ క్షీణే లక్షణముచ్యతే,
కర్మణః ప్రాకృతాద్ధానిః వృద్ధిర్వాపి విరోధినామ్. ౫౯

వ్యా. పైజెప్పిన వాతంబైనను, పిత్తమైనను, కఫమైనను, స్వప్రమాణమునకన్న తక్కువయై క్షీణించినయెడల పైజెప్పినరీతిగ వానివానికి స్వాభావికములైన కృత్యములకు హానికల్గును. మఱియు ఆయాదోషమునకు నియతమైనకృత్యములకు విరుద్ధములైనగుణములు వృద్ధిజెందును. ఎట్టులనగా:—వాతము స్వప్రమాణమునకన్న క్షీణత నొందినపుడు దానికి స్వాభావికమైన యుత్సాహము మున్నగుగుణములు తగ్గుటయే కాక అట్టియుత్సాహాదులకు విరుద్ధములయిన విషాదము మొదలగుగుణములు వృద్ధిజెందును పిత్తము క్షీణించినప్పుడు అదర్శనము అజీర్ణము మొదలగువిరుద్ధగుణములు వృద్ధిజెందునని భావము. కఫము క్షీణించినప్పుడు స్నేహాదులకు విరుద్ధములయిన రౌక్ష్యాదిగుణములు వృద్ధిజెందునని భావము. వాగ్భటాచార్యులు "క్షీణా జహతి స్వం లిఙ్గం" అని ఆయా దోషలక్షణములకు హానికల్గుటయే క్షీణలక్షణములని చెప్పిరి. ఇత్తెరంగున వాతాదిక్షీణ లక్షణముల నెరుంగునది.

## త్రిదోషముల వృద్ధిలక్షణములు.

మూ. దోషప్రకృతిర్వైశేష్యం నియతం వృద్ధిలక్షణం,
దోషాణాం ప్రకృతిర్హానిః వృద్ధిశ్చైవం పరీక్ష్యతే. ౬౦

వ్యా. ఆయాదోషములకు స్వాభావికములయిన నియతగుణములు మిక్కిలి యధికముగ గాన్పించినచో నాయాదోషము వృద్ధినొందినదని ఎరుంగునది. వాతమునకు నియతములయిన ఉత్సాహాదులు ఇనుమడించినచో వాతము వృద్ధినొందినదనియుం పిత్తమునకు స్వాభావికములగు వేడి, ఆకలిదప్పులు మున్నగునవి యధికమైనచో పిత్తము వృద్ధినందినదనియు, కఫమునకు స్వాభావికములయిన స్నేహశైత్య మాధుర్యాదిగుణములు వృద్ధినొందినచో కఫము వృద్ధినొందినదనియు నాయా దోషవృద్ధిలక్షణముల నెరుంగునది. ఇత్తెరంగున వాతాదిదోషములయొక్క స్వభావస్థితిని క్షయమును, వృద్ధిని పరీక్షింపదగును.

## అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. సంఖ్యానిమిత్తం రూపాణి శోథానాం సాధ్యతాం న చ,
తేషాం తేషాం వికారాణాం త్రిశోథాం స్తాంశ్చ పూర్వజాన్
విధిభేదం వికారాణాం త్రివిధం బోధ్యసంగ్రహామ్,
ప్రాకృతం కర్మ దోషాణాం లక్షణం హానివృద్ధిషు. ౬౧

వీతమోహరజోదోష మోహమానమదస్పృహః,
వ్యాఖ్యాతవాన్ త్రిశోథీయే రోగాధ్యాయే పునర్వసుః. ౬౩

వ్యా. శోథలయొక్క సంఖ్య, వానికారణములు, వానిస్వరూపములు, వానిలో సాధ్యాసాధ్యములు, ఆయారోగములకు సంబంధించి వాతపిత్తకఫభేదములచే మూడు విధములుగ జనించుశోథభేదములు, ఆయారోగములకు సంబంధించి తెలిసికొనవలసిన ప్రకృతిఅధిష్ఠానము, కారణము అను నీమూటిభేదములును వాతపిత్తకఫములయొక్క స్వాభావికలక్షణములును, వానివృద్ధిక్షయలక్షణములును వీనినన్నింటిని, కామక్రోధ మోహాదివర్జితుడైన పునర్వసువు త్రిశోథీయమను నీరోగాధ్యాయమునందు వివరించి చెప్పెను.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
త్రిశోథీయో నామ అష్టాదశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియునగు నాయుర్వేదతంత్రమున సూత్రస్థానమునందలి త్రిశోథీయమను అష్టాదశాధ్యాయము సమాప్తము.

## ఏకోనవింశాధ్యాయము.

అవతరణిక:—పూర్వాధ్యాయమున "వ్యవస్థాకరణం తేషాం యథా స్థూలేషు సంగ్రహః" అనువాక్యముచేత రోగములసంఖ్యా విభాగనిర్ణయము అష్టోదరీయమున సంగ్రహింపబడునని చెప్పబడినది. కావున అట్టివిభాగమును దెల్పునట్టి యష్టోదరీయాధ్యాయము క్రింద జెప్పబడును:—

సూ॥ అథాతోఽష్టోదరీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. త్రిశోథీయాధ్యాయమును చెప్పినపిదప శోథముతో సమానరూపమయిన ఎనిమిదివిధములయిన ఉదరముల ప్రధానముగ నధికరించిన యష్టోదరీయాధ్యాయమును త్రికాలజ్ఞానసంపన్నుడగు నాత్రేయమహర్షి యుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకయుండునట్లు వివరించెదనని యర్థము.

పూర్వాధ్యాయమున శోథములు ప్రధానముగ వివరింపబడినవికాన అట్టిశోథము నకు సమానరూపమయినది యుదరము. కావున తొలుత దానినే ప్రధానముగచేసి యధ్యాయసంజ్ఞ చెప్పబడినది.

## రోగముల భేదనిర్దేశము.

మూ॥ ఇహ ఖలు అష్టావుదరాణి అష్టౌ మూత్రాఘాతాః, అష్టౌ క్షీర దోషాః, అష్టౌ రేతోదోషాః, సప్త కుష్ఠాని, సప్త పిడకాః, సప్త వీసర్పాః, షడతీసారాః, షడుదావర్తాః, పఞ్చగుల్మాః, పఞ్చప్లీహ ప్రదోషాః, పఞ్చ కాసాః, పఞ్చ శ్వాసాః, పఞ్చ హిక్కాః, పఞ్చ తృష్ణాః, పఞ్చఛర్దయః, పఞ్చభక్తస్య అనశనస్థానాని, పఞ్చశిరో రోగాః, పఞ్చ హృద్రోగాః, పఞ్చపాండురోగాః, పఞ్చోన్మాదాః, చత్వారోఽపస్మారాః, చత్వారోఽక్షిరోగాః, చత్వారః కర్ణ రోగాః, చత్వారః ప్రతిశ్యాయాః, చత్వారో ముఖరోగాః, చత్వారో గ్రహణీదోషాః, చత్వారోమదాః, చత్వారోమూర్ఛా యాః, చత్వారః శోషాః చత్వారి క్లైబ్యాని, త్రయశ్శోఫాః, త్రీణికిలాసాని, త్రివిధం లోహితపిత్తం, ద్వౌ జ్వరం, ద్వావ యామౌ ద్వే గృధ్రస్యౌ, ద్వే కామలే, ద్వివిధమామం, ద్వివిధం వాతరక్తం, ద్వివిధాన్యర్శాంసి, ఏక ఊరుస్తంభః, ఏకః సంన్యాసః, ఏకో మహాగదః, వింశతిః క్రిమిజాతయః, వింశతిః ప్రమేహాః, వింశతిర్యోనివ్యాపదః ఇత్యష్టాచత్వారింశత్ రోగాధికరణాని అస్మిన్ సంగ్రహే సముద్దిష్టాని ఏతాని యథో ద్దేశం అభినిర్దేక్ష్యామః. 3

వ్యా. రోగసంగ్రహరూపమయిన ఈయధ్యాయమునందు రోగవిభాగము ఈ క్రింద వివరింపబడును. మహోదరము, మూత్రాఘాతము, క్షీరదోషము, (పాలకుగల్గు దోషములు) శుక్రదోషము అనునవినాల్గును ఒక్కొక్కటి ఎనిమిదేసివిధములగును. కుష్ఠము, పిడక, విసర్పము అనునీమూడువ్యాధులును ఒక్కొక్కటి ఏడేసిభేదములు కల్గియుండును. అతిసారము, ఉదావర్తము అను నీరెండువ్యాధులును ఒక్కొక్కటి యారేసివిధములగును. గుల్మము, ప్లీహరోగము, కాసము, శ్వాసము, హిక్క (ఎక్కిళ్లు), తృష్ణ (దప్పి), ఛర్ది (వమనము), అనశనస్థానములు, (భోజనమునందు ఇచ్ఛలేక చేయు నట్టి యరోచకము). శిరోరోగము హృద్రోగము, పాండురోగము, ఉన్మాదము అను నీరోగములు పండ్రెండును ఒక్కొక్కటి యైదేసిభేదముల కల్గియుండును. అపస్మారము, నేత్రరోగము, కర్ణరోగము, ప్రతిశ్యాయము (పీనసము). ముఖరోగము, గ్రహణీ

రోగము, మదము, మూర్ఛ, శోషము, క్లైబ్యము (నపుంసకత్వము) అను నీపదివ్యాధులును ఒక్కొక్కటి నాలుగేసి భేదములు గల్గియుండును. శోఫ, (వాపు) కిలాసము (సిబ్బెము), రక్తపిత్తము అనునీమూడురోగములును ఒక్కొక్కటి మూడేసివిధము లగును. జ్వరము, వ్రణరోగము, ఆయామము, గృధ్రసి, కామల, ఆమ (అజీర్ణ) రోగము, వాతరక్తము, అర్శస్సు, (మూలవ్యాధి) అను నీయెనిమిదిరోగములును ఒక్కొక్కటి రెండేసిరోగములు కల్గియుండును. ఊరుస్తంభము, సన్న్యాసము, మహాగదము అను నీమూడురోగములును ఒక్కొక్కవిధముగనే యుండును క్రిమిజాతి, ప్రమేహములు యోనివ్యాపత్తు అనునవి మూడును ఒక్కొక్కటి ఇరువదేసి భేదములు కల్గియుండును. ఇత్తెరంగున నలువదియెనిమిదివిధములగు రోగాధికరణములు అవాంతరభేదములచే వానివానిసంఖ్య నీరోగసంగ్రహమున నిర్దేశింపబడినవి. అట్టి నిర్దేశము ననుసరించి వానికి ప్రత్యేకవివరణము ఈక్రింద చెప్పబడును.

ఇచ్చట ఏకాదిసంఖ్యనువదలి ఎనిమిది యనుసంఖ్య ప్రధానముగజేసి యాసంఖ్యనుండి యనులోమముగ నిర్దేశింపబడినవి. మేహాదిరోగములసంఖ్య ఇరువది యనునది ఇంతకన్న గొప్పదియైనను యాసంఖ్యనుండి క్రమసంఖ్య ననసరించి రోగసమితి లేకుండుటవలన దానిని వదలి అష్టసంఖ్యయే ప్రధానము సుపక్రమింపబడినది.

మఱియుం చికిత్సితమునందు పదునెనిమిదికుష్ఠములు చెప్పబడును. అయినను మహాకుష్ఠములు ఏడును ప్రధానముగజేసి ఇచ్చట సప్తవిధములని పరిగణనము చేయబడినది.

### ఎనిమిదియుదరములకును, ఎనిమిదిమూత్రాఘాతములకును వివరణము.

మూ. అష్టావుదరాణీతి:—వాతపిత్తకఫసన్నిపాతప్లీహబద్ధచ్ఛిద్రదకోదరాణీతి. ౪

అష్టౌ మూత్రాఘాతా ఇతి:—వాతపిత్తకఫ సన్నిపాతాఽశ్మరీ శర్కరా శుక్రశోణితజా ఇతి. ౫

వ్యా. వాతోదరము, పిత్తోదరము, కఫోదరము, సన్నిపాతోదరము, ప్లీహోదరము, బద్ధగుదోదరము, ఛిద్రోదరము, ఉదకో(జలో)దరము నని మహోదరవ్యాధి యెనిమిదివిధముల నుండును.

వాతము, పిత్తము, కఫము, సన్నిపాతము, అశ్మరి, శర్కరా, శుక్రము, రక్తము అను నెనిమిదికారణములచే వేరువేర జనించినవి మూత్రాఘాతము లెనిమిదివిధము లగును.

### ఎనిమిదివిధములైన క్షీరదోషములవివరణము.

మూ. అష్టౌ క్షీరదోషా ఇతి:—వైవర్ణ్యం, వైగన్ధ్యం, వైరస్యం, పైచ్ఛిల్యం, ఫేనసఙ్ఘాతః, రౌక్ష్యం, గౌరవ, మతిస్నేహశ్చేతి ౬

వ్యా. వర్ణము మారియుండుట, వాసన చెడియుండుట, రుచి మారియుండుట, జిగటగనుండుట, నురుగుతో గడ్డగట్టియుండుట, రౌక్ష్యముగ (జిడ్డులేక)యుండుట, బరువుగనుండుట, మిక్కిలి జిడ్డుకల్గియుండుట ఇవియన్నియు పాలనుచెరచు నెనిమిది దోషములు.

ఎనిమిదివిధములైన శుక్రదోషములు.

మూ. అష్టౌ రేతోదోషా ఇతి:—తను, శుష్కం, ఫేనిలం, అశ్వేతం, పూతి, అతిపిచ్ఛిలం, అన్యధాతూపపాతం. అవసాది చేతి, ౭

వ్యా. కలుచనగుట, ఎండియుండుట, నురుగుతో గూడియుండుట, తెలుపురంగు మారియుండుట, దుర్గంధము కల్గియుండుట, మిక్కిలి జిగటనైయుండుట, ఇతరములగు రక్తమాంసాదులు కలిసియుండుట, బరువు అధికమగుటచే నీటిలో మునుగుట ఇవి యెనిమిదియు శుక్రమునకు కల్గుదోషములు.

సప్తవిధకుష్ఠభేదములు.

మూ. సప్త కుష్ఠానీతి:—కపాలోదుమ్బరమండలర్శ్యజిహ్వాపుణ్డరీకసిధ్మ కాకణానీతి ౮

వ్యా. కపాలకుష్ఠము, ఉదుంబరకుష్ఠము, మండలకుష్ఠము, ఋశ్యజిహ్వాకుష్ఠము, పుండరీకకుష్ఠము, సిధ్మకుష్ఠము, కాకణ (కాకణంతిక)కుష్ఠము నని కుష్ఠరోగము ఏడువిధముల నుండును.

సప్తవిధపిడకాభేదములు.

మూ. సప్త పిడకా ఇతి:—శరావికా, కచ్ఛపికా, జాలినీ, సర్షపీ, అలజీ, వినతా, విద్రధీ చేతి. ౯

వ్యా. శరావిక, కచ్ఛపిక, జాలిని, సర్షపిక, అలజి, వినత, విద్రధియు నని పిడకలు (ప్రమేహపిటికలు) ఏడువిధములుగ నుండును.

సప్తవిసర్పభేదములు.

మూ. సప్త వీసర్పా ఇతి:—వాతపిత్తకఫాగ్నికర్దమకగ్రన్థిసన్నిపాతాఖ్యాః. ౧౦

వ్యా. వాతజము, పిత్తజము, కఫజము, అగ్నివిసర్పము, కర్దమకవిసర్పము, గ్రంథివిసర్పము, సన్నిపాతజవిసర్పము నని విసర్పము ఏడువిధముల భేదములు కల్గియుండును.

## అతిసార-ఉదావర్తములయారేసిభేదము.

మూ. షడతీసారా ఇతిః—వాతపిత్తకఫసన్నిపాతభయశోకజాః. ౧౧
షడుదావర్తా ఇతిః—వాతమూత్రపురీషశుక్రచ్ఛర్దిక్షవథుజాః

వ్యా. వాతము, పిత్తము, కఫము, సన్నిపాతము, భయము, శోకము అనుకారణములచే వేర్వేర జనించుటంజేసి యతిసారము లారువిధములగును. వాతము, మూత్రము, పురీషము, శుక్రము, ఛర్ది(వాంతి), తుమ్ము అను నీయారింటిని నిరోధించుటచే గల్గుటంజేసి యుదావర్తము లారువిధములుగ నుండును.

## గుల్మప్లీహాదిరోగములయొక్క యైదేసి భేదములవివరణము.

మూ. పఞ్చ గుల్మా ఇతిః—వాతపిత్తకఫసన్నిపాతశోణితజాః. ౧౩
పఞ్చ ప్లీహదోషా ఇతిః—గుల్మైర్వ్యాఖ్యాతాః ౧౪
పఞ్చ కాసా ఇతిః—వాతపిత్తకఫక్షతక్షయజాః. ౧౫
పఞ్చ శ్వాసా ఇతిః—మహోర్ధ్వచ్ఛిన్నతమకక్షుద్రాః ౧౬
పఞ్చ హిక్కా ఇతిః—మహతీ గమ్భీరా వ్యపేతా క్షుద్రా
చాన్నజా చ. ౧౭
పఞ్చ తృష్ణా ఇతిః—వాతపిత్తామక్షయోపసర్గాత్మికాః ౧౮
పఞ్చ ఛర్దయ ఇతిః—ద్విష్టాన్నసంయోగవాతపిత్తకఫసన్ని
పాతోద్రేకాత్మికాః. ౧౯
పఞ్చ భక్తస్యానశనస్థానానీతిః—వాతపిత్తకఫద్వేషాయాసాః.
పఞ్చ శిరోరోగా ఇతిః—పూర్వోద్దిష్ట మభిసమస్య వాతపిత్త
కఫసన్నిపాతక్రిమిజా ఇతి. ౨౧
పఞ్చ హృద్రోగా ఇతిః—శిరోరోగైర్వ్యాఖ్యాతాః ౨౨
పఞ్చ పాణ్డురోగాఇతిః—వాతపిత్తకఫసన్నిపాతమృద్భక్షణజాః.
పంచోన్మాదాఇతిః—వాతపిత్తకఫసన్నిపాతాగన్తునిమిత్తాః ౨౪

వ్యా. వాతము, పిత్తము, కఫము, సన్నిపాతము, రక్తము అనునైదిటిచే వేరువేరుగ జనించుటంజేసి గుల్మములు ఐదువిధములుగ నుండును. ప్లీహవృద్ధిరోగంబును గుల్మములబోలె వాత-పిత్త-కఫ-సన్నిపాత రక్తములచే వేరువేర జనించుటవలన నైదువిధముల నుండును. కాసము, దగ్గు, వాతము, పిత్తము, కఫము, ఉరఃక్షతము, క్షయము అను నైదు

కారణములచే వేరువేర జనించుటవలన నైదువిధము లగును. మహాశ్వాసము, ఊర్ధ్వశ్వాసము, ఛిన్నశ్వాసము, తమకశ్వాసము, క్షుద్రశ్వాసమునని శ్వాసరోగము ఐదు విధము లగును. హిక్కారోగము (ఎక్కిళ్లు) మహతి, గంభీర, వ్యపేత, క్షుద్ర, అన్నజము (కారము మున్నగు సాహారపదార్థములచే గల్గినది) అను భేదములచే నైదువిధము లగును. వాతము, పిత్తము, ఆమము, (అజీర్ణము) క్షయము, ఉపసర్గము అనుకారణములచే జనించుటవలన తృష్ణ (దప్పి) యైదువిధము లగును. ఛర్ది (వాంతి) యనునది తన కింపుగాని యన్నపానాదుల నుపయోగించుటవలనను, వాత-పిత్త-కఫ-సన్నిపాతముల యుద్రేకము చేతను కల్గుటవలన నైదువిధముల నుండును. వాతము, పిత్తము, కఫము, అన్నద్వేషము, శ్రమము అనుకారణములచే జనించుటవలన యరోచకమును ఐదువిధము లగును.

కియన్తశ్శిరసీయమను పదునేడవయధ్యాయమున విస్తరరూపములైన శిరోరోగములను సంగ్రహించి యుద్దేశింపబడిన శిరోరోగములు. వాతపిత్తకఫసన్నిపాతక్రిములచే వేర్వేరుగ జనించుటవలన నైదువిధములుగ నగును. (కియన్తశ్శిరసీయాధ్యాయమున "అర్ధావభేదకో వా స్యాత్ సర్వం వా రుజ్యతే శిరః, ప్రతిశ్యాయముఖనాసాక్షికర్ణరోగా శ్శిరోభ్రమః" అనువాక్యముచే జెప్పబడిన శిరోరోగములను వదలి సంగ్రహరూపముగ 'పృథగ్దృష్టాస్తు' అని యుద్దేశింపబడిన శిరోరోగములు వాతపిత్తాదికారణములచే నైదు విధములగునని యుద్దేశించి 'పూర్వోద్దేశ మభి సమస్య' అని చెప్పబడినది యని యెరుంగునది.)

హృదయరోగంబులును శిరోరోగములవలె వాత-పిత్త-కఫ-సన్నిపాత-క్రిమిజ భేదములచే నైదువిధము లగును. వాతము, పిత్తము, కఫము, సన్నిపాతము, మృద్భక్షణము అను నైదుకారణములచే వేరువేర జనించుటవలన పాండురోగములును నైదు విధము లగును. వాత-పిత్త-కఫ-సన్నిపాత ఆగంతువులు అను నైదుకారణములచే గల్గుటం జేసి యున్మాదము ఐదువిధములగును.

### అపస్మార-నేత్రరోగాదులకు నాల్గేసి భేదములవివరణము.

మూ. చత్వారోఽపస్మారా ఇతి:— వాతపిత్తకఫసన్నిపాతనిమిత్తజాః చత్వారోఽక్షిరోగాః, చత్వారః కర్ణరోగాః, చత్వారః ప్రతిశ్యాయాః, చత్వారో ముఖరోగాః, చత్వారో గ్రహణీదోషాః, చత్వారో మదాః, చత్వారో మూర్ఛాయాః ఇతి అపస్మారై ర్వ్యాఖ్యాతాః. ౨౫

వ్యా. అపస్మారరోగము వాతము, పిత్తము, కఫము, సన్నిపాతము నను కారణములచే జనించుటంజేసి నాల్గువిధములగును. మరియు నేత్రరోగము, కర్ణరోగము, ప్రతిశ్యాయము (పీనసము), ముఖరోగము, గ్రహణీరోగము, మదము, మూర్ఛ అను నీయేడు రోగములును అపస్మారరోగమును బోలె వాత-పిత్త-కఫ-సన్నిపాతములచే వేరువేరుగ జనించుటంజేసి యొక్కొకటి నాల్గేసివిధములనుండును. (మదరూపవ్యాధియే మదాత్యయమగును కావున వేరుగ జెప్పబడదయ్యె.

శోష-క్లైబ్యముల చతుర్విధభేదములు.

మూ. చత్వారశ్శోషా ఇతిః—సాహససంధారణక్షయవిషమాశనజాః,
చత్వారి క్లైబ్యానీతిః—బీజోపఘాతాత్ ధ్వజభఙ్గాత్ జరయా
శుక్రక్షయాచ్చ. ౨౬

వ్యా. సాహసము (తనకు శక్యముగాని యధికబలముగలవారితో బోట్లాడుట మున్నగుశక్తిపైకార్యముల జేయుట), సంధారణము (మలమూత్రాదివేగముల నిరోధించుట), క్షయము (రక్తాదిధాతుక్షయము), విషమాశనము (అకాలమున భుజించుట, లేక పరస్పరవిరుద్ధద్రవ్యముల జేర్చి భుజించుట) అను నీనాల్గుకారణములచే జనించుటంజేసి శోషరోగము నాల్గువిధములగును. క్లైబ్యము (నపుంసకత్వము) బీజోపఘాతము (కొన్నికారణములచే శుక్రమును సకాలమున వెడలనీయక నిరోధించుట, లేక శుక్రమును అయుక్తములగు నడపడనాదివ్యాపారములచే వ్యర్థముగ వెడలించుట), ధ్వజభంగము (కారణాంతరములచే ప్రధానపురుషావయవము నరములు సడలి బిగిచెడుట), ముసలితనము, శుక్రము నశించుట, అను నీనాల్గుకారణములచే సంభవించుటంజేసి నాల్గుతెరంగులగును.

మూడేసివిధములగు శోథ-కిలాస-రక్తపిత్తములవివరణము.

మూ. త్రయశ్శోథాశ్చేతిః—వాతపిత్తశ్లేష్మనిమిత్తాః,
త్రీణి కిలాసానీతిః—రక్తతామ్రశుక్లాని,
త్రివిధం లోహితపిత్తమితిః—ఊర్ధ్వభాగమధోభాగ ముభయ
భాగం చ. ౨౭

వ్యా. వాత-పిత్త-కఫములచే వేరువేర బుట్టుటవలన శోథము (వాపు) నంజు మూడుతెరంగులు. రక్తతామ్రశుక్లవర్ణభేదములచే కిలాసము (సిబ్బెము) మూడువిధములు. ఊర్ధ్వగతము (నోటవెడలునది), అధోగతము (క్రిందినుండి వెడలునది), ఉభయగతము (రెండుమార్గముల వెడలునది.) అను భేదములచే రక్తపిత్తము మూడుతెరంగులనుండును.

## ద్వివిధజ్వరాదివివరణము.

మూ. ద్వౌ జ్వరావితి:—ఉష్ణాభిప్రాయః శీతసముత్థశ్చ శీతాభిప్రాయ
శ్చోష్ణసముత్థః,
ద్వౌ వ్రణావితి:—నిజశ్చాగన్తుజశ్చ,
ద్వావాయామావితి:—బాహ్యశ్చాభ్యన్తరశ్చ,
ద్వే గృధ్రస్యావితి:—వాతాద్వాతకఫాచ్చ,
ద్వే కామలే ఇతి:—కోష్ఠాశ్రయా శాఖాశ్రయా చ,
ద్వివిధమామమితి:—అలసకో విషూచికా చ,
ద్వివిధం వాతరక్తమితి:—గమ్భీరముత్తానం చ,
ద్వివిధాన్యర్శాంసీతి:—శుష్కాణ్యార్ద్రాణి చ. ౨౨

వ్యా. జ్వరము శీతము కారణముగఁజేసి పుట్టియుఁ నుష్ణములగు (వేడిగనుండు) స్పర్శాదులయందభిప్రాయము పుట్టించునది యొకటి. ఉష్ణములగు కారణములచే గల్గి శీత స్పర్శాదులయం దభిలాషగల్గించునది వేరొకటి. ఈరెండులక్షణములచే జ్వరము రెండు విధముల నుండునని యర్థము. (జ్వరము శీతములగు నిదానములచే గల్గినప్పుడు అట్టి నిదానవిరుద్ధములైన యుష్ణస్పర్శాదులయం దభిలాషకల్గుటయుం, ఉష్ణములగు కారణములచే సంభవించినప్పుడు నిదానవిపరీతముగ శీతస్పర్శాదుల గోరుటయుఁ నైజగుణము. అయినను శీతకాలమైన హేమంతశిశిరాదికాలములయందు పిత్తప్రకోపమున జనించిన జ్వరమున నుష్ణరూపమైన పిత్తమునకు విపరీతముగ శీతాభిలాష కల్గునేగాని శీత కాలమునకు విపరీతమైన యుష్ణాభిలాష కల్గదని తెలియుటకై "ఉష్ణసముత్థః శీతాభిప్రాయః" అని చెప్పబడినది. ఇత్తెరంగుననే యుష్ణకాలమగు గ్రీష్మమున శీతరూపమగు కఫాదులచే గల్గిన జ్వరమున శీతమునకు విరుద్ధముగ నుష్ణాభిలాషయే కల్గునని "శీతాభిప్రాయశ్చోష్ణసముత్థః" అని నియమింపబడినదియని యెరుంగునది. ఈనిర్ణయముచేత ఉష్ణకాలమున బుట్టిన మాత్రనే యుష్ణజ్వరమనియు, శీతకాలమున బుట్టినమాత్రనే శీతజ్వరమనియు, భ్రమింపక, అట్టిజ్వరమునకు కారణమైన ఉష్ణశీతభేదములను నిర్ణయింపవలెనని యభిప్రాయ మేర్పడును.)

నిజమనియు (వాతాది నైసర్గికకారణములచే గల్గినది), ఆగంతుకమనియుఁ (ఆగంతువులగు నభిఘాతాది బాహ్యకారణములచే గల్గినది) వ్రణము రెండువిధములగును. బాహ్యయామమనియు, అంతరాయామమనియుఁ ఆయామమను వాతరోగము రెండు

విధములనుండును. గృధ్రసియను వాతరోగము కేవల వాతముచేతను వాతకఫసంసర్గము చేతను గల్గుటంజేసి రెండువిధములగును.

కామలియనునది కోష్ఠమును (హృదయము శ్వాసకోశము) ఆశ్రయించియు, శాఖల (రక్తాదులు త్వక్కు) నాశ్రయించియు పుట్టుటంజేసి రెండువిధములగును. ఆమ (అజీర్ణ) రోగము అలసకమనియు, విషూచి యనియు రెండువిధములు. (త్రివిధకుక్షీయాధ్యాయమున జెప్పబడు ఆమవిషమనునది అలసకభేదముననే చేరునని రెండువిధములని చెప్పబడినది. కొందరు ఆమవిషమనునది విషమునకు సంబంధించినదికావున నయ్యది విషతంత్రమునకు సంబంధించినదని దాని నిచ్చట వదలి యామరోగము రెండు విధములుగ నిచ్చట పరిగణింపబడినది).

వాతరక్తరోగము గంభీరమనియు, ఉత్తానమనియు రెండువిధములు. (అందు శరీరమునందలి అస్థులు మున్నగుధాతువులలో బుట్టినది గంభీరము. త్వక్చర్మాదుల నాశ్రయించినది యుత్తానము). అర్శస్సులు మూలవ్యాధిలో బుట్టు గుదాంకురములు) శుష్కములు (ద్రవములేనివి). ఆర్ద్రములు (ద్రవముగల్గినవి) నని రెండువిధములు.

ఊరుస్తంభాది ఏకవిధరోగవివరణము.

మూ. ఏక ఊరుస్తమ్భ ఇతి:—ఆమత్రిదోషసముత్థానః,
ఏకస్సన్న్యాస ఇతి:—త్రిదోషాత్మకో మనశ్శరీరాధిష్ఠానః,
ఏకో మహాగద ఇతి:—అతత్త్వాభినివేశః. ౨౯

వ్యా. ఊరుస్తంభవాతము ఆమములైన త్రిదోషములచే గల్గునుకావున నొక్కవిధముగ నుండును. సన్న్యాసమనునది త్రిదోషప్రకోపమున మనస్సును శరీరమును కూడ నాశ్రయించి పుట్టునది యొక్కటియే యగును.

అతత్త్వాభినివేశమన "బ్రహ్మసత్యము, జగత్తుమిథ్య" యను తాత్త్విక (నిశ్చయ) జ్ఞానము లేకుండుట, ఇయ్యది మనోదోషములైన రాజసతామసగుణముల యుద్రేకమున గల్గు మానసికదోషము. ఇయ్యది జననమరణ రూపమైనసంసృతికి కారణమై మహానర్థ దాయకమగుటంజేసి మహాగదమని చెప్పబడును. ఇయ్యది సంసృతిరూపమైన దుఃఖమును కల్గించునది కావున రోగమని చెప్పబడును. ఇట్టిమహావ్యాధి పైజెప్పినవిధముగ నొకటియే యగునని భావము.

వింశతి క్రిమిజాతులవివరణము.

మూ. వింశతిః క్రిమిజాతయ ఇతి:—యూకాః పిపీలికాశ్చేతి ద్వివిధాః
బహిర్మలజాః; కేశాదాః లోమాదాః లోమద్వీపాః సౌరసాః
ఔదుమ్బరాః జన్తుమాతరశ్చేతి షట్ శోణితజాః.

అన్త్రాదాః ఉదరాదాః హృదయచరాః చురవః దర్భపుష్పాః సౌగన్ధికాః మహాగుదా శ్చేతి సప్త కఫజాః.

కకేరుకాః మకేరుకాః లేలిహాః సశూలకాః సౌసురాదా శ్చేతి పంచ పురీషజాః ఇతి వింశతిః క్రిమిజాతయః. 30

వ్యా ఇరువది విధములైన క్రిమిజాతుల వివరణము:—యూకలు (చీర బోతులు), పిపీలికములు (పేలు), అనునవి రెండుజాతులును శరీరమునందలి బాహ్య మలములైన చెమట మున్నగువానిచే గల్గును.

కేశాదములు, లోమాదములు, లోమద్వీపములు, సౌరసములు, ఔదుంబరములు, జంతుమాతలు అను నీయారును రక్తమున పుట్టునవి. అన్త్రాదములు, (పేవులతినునవి) ఉదరాదములు, (కడుపులోని ఆహారాదులను తినునవి), హృదయచరములు (హృదయ మును తినునవి), చూరు అనునవి, దర్భపుష్పములు (దర్భపువ్వులబోలి తెల్లగనుండునవి), సౌగంధికములు, మహాగుదములు (గుదరంధ్రమును పెద్దదిగజేయునవి) అను నీయేడును కఫముచే కల్గునది కకేరుకములు, మకేరుకములు, లేలిహములు, సశూలములు, సౌసురా దములు అను నీయైదును పురీషమున బుట్టునవి. ఇవి యన్నియుం జేరి క్రిమిజాతులు ఏడువిధము లగును.

వింశతిప్రమేహముల వివరణము, అందు కఫప్రమేహములు పది.

మూ. వింశతిః ప్రమేహా ఇతిః—ఉదకమేహా శ్చేక్షురసమేహాశ్చ సాన్ద్రమేహాశ్చ సాన్ద్రప్రసాదమేహాశ్చ శుక్లమేహాశ్చ శుక్రమేహాశ్చ శీతమేహాశ్చ శనైర్మేహాశ్చ సికతామేహాశ్చ లాలామే శ్చేతి దశ శ్లేష్మనిమిత్తాః. 31

వ్యా. ఉదకమేహము, ఇక్షురసమేహము, సాంద్రమేహము, సాంద్రప్రసాద మేహము శుక్లమేహము, శుక్రమేహము, శీతమేహము, శనైర్మేహము, సికతామేహము, లాలామేహమునని కఫప్రకోపమున జనించునవి పదిమేహములు.

పైత్తికమేహములు ఆరు

మూ. క్షారమేహాశ్చ కాలమేహాశ్చ నీలమేహాశ్చ లోహితమేహాశ్చ మంజిష్ఠామేహాశ్చ హారిద్రామేహా శ్చేతి షట్ పిత్తనిమిత్తాః. 32

వ్యా. క్షారమేహము, కాలమేహము, నీలమేహము, రక్తమేహము, మంజిష్ఠా మేహము, హారిద్రామేహము అని పిత్తముచే కల్గు మేహములు ఆరు.

—— వాతికమేహములు నాల్గు. ——

మూ. వసామేహాశ్చ, మజ్జామేహాశ్చ, హస్తిమేహాశ్చ, మధుమేహాశ్చ ఇతి చత్వారో వాతనిమిత్తాః. ఇతి వింశతిః ప్రమేహాః  33

వ్యా. వసామేహము, మజ్జామేహము, హస్తిమేహము, మధుమేహము నని వాతమున జనించుప్రమేహములు నాల్గు. పైజెప్పినరీతిగ శ్లేష్మజమేహములు పదియును, పైత్తికమేహములు ఆరును, వాతికమేహములు నాల్గును జేరి "వింశతిప్రమేహాః" అని నిర్దేశప్రకారము ఇరువదిప్రమేహములును వివరింపబడియె. (పైజెప్పిన ప్రమేహములకు వేరు వేరుగ నన్వర్థసంజ్ఞ ప్రకరణాంతరమున వివరింపబడును.)

—— వింశతియోనివ్యాపత్తులవివరణము. ——

మూ వింశతిర్యోనివ్యాపద ఇతిః—వాతికీ, పైత్తికీ, శ్లైష్మికీ; సాన్నిపాతికీ చేతి, చతస్రః, దోషదూష్యసంసర్గప్రకృతినిర్దేశైః అవశిష్టాష్షోడశ నిర్దిశ్యన్తే. తద్యథాః—రక్తయోనిశ్చ, అరజస్కా చ, అచరణా చ, అతిచరణా చ ప్రాక్చరణా చ, ఉపప్లుతా చ, పరిప్లుతా చ, ఉదావర్తినీ చ, కర్ణినీ చ, పుత్రఘ్నీ చ, అన్తర్ముఖీ చ, సూచీముఖీ చ, శుష్కా చ, వామినీ చ, షణ్ఢయోనిశ్చ, మహాయోనిశ్చేతి వింశతిర్యోనివ్యాపదః. కేవలశ్చాయముద్దేశో యథోద్దేశ మభినిర్దిష్ట ఇతి.  34

వ్యా. వాతపిత్త కఫ సన్నిపాతములచే వేర్వేరుగ జనించుటచే వాతికి, పైత్తికి, శ్లైష్మికి, సాన్నిపాతికి యని యోనివ్యాపత్తులు నాల్గువిధములును, వాతాదిదోషముల పరస్పరసంసర్గములచేతను, అట్టిదోషములకు రసరక్తాది దూష్యములతో గల్గు సంసర్గముచేతను, కారణనిర్దేశముచేతను, గల్గుభేదములు పదునారును చేరి యోనివ్యాపత్తులు ఇరువది విధములగును. అందు దోషదూష్యసంసర్గమున గల్గునవి ఎవ్వియనః—రక్తయోని, అరజస్కము, అచరణము, అతిచరణము, ప్రాక్చరణము, ఉపప్లుతము, పరిప్లుతము, ఉదావర్తిని, కర్ణిని, పుత్రఘ్ని, అంతర్ముఖి, సూచీముఖి, శుష్కయోని, వామిని, షణ్ఢయోని, మహాయోని అను నీపదునారును దోషదూష్యసంసర్గమున గల్గునది. పైజెప్పిన వాతికాదులు నాల్గును, ఈపదునారునుజేరి నిర్దేశప్రకారము ఇరువది యోనివ్యాపత్తులభేదములు వివరింపబడినవి. (ఇందు దోషదూష్యాది సంసర్గవిభాగము యోనివ్యాపత్తుచికిత్స

యందు వివరింపబడును) ఇత్తెరంగున "అష్టచత్వారింశద్రోగాధికరణాని" అని నిర్దేశింపబడిన రోగాధికరణములు నలువదియెనిమిదియు వివరింపబడెను.

రోగగణసంఖ్యావివరణము.

భవతశ్చాత్ర:—

మూ. వింశకాశ్చైకకాశ్చైవ త్రికాశ్చైకాస్త్రయస్త్రయః,
ద్వికాశ్చాష్టౌ చతుష్కాశ్చ దశ ద్వాదశ పఞ్చకాః. 3౫
చత్వారశ్చాష్టకా వర్గాః షట్కౌ ద్వౌ సప్తకాస్త్రయః,
అష్టోదరీయే రోగాణాం రోగాధ్యాయే ప్రకాశితాః ఇతి 3౬

వ్యా. ఇరువదిభేదములుకల్గిన వర్గములును, ఒక్కొకభేదముకల్గిన వర్గములును మూడేసిభేదములు కల్గినవర్గములును, ఒక్కొక్కటి మూడేసిభేదములు కల్గియుండును. రెండుసంఖ్యలుగల రోగగణములు ఎనిమిదివిధము లగును. నాలుగేసిసంఖ్యలుగల రోగగణములు పదియగును. ఐదేసిసంఖ్యలుగల రోగగణములు పండ్రెండు. ఎనిమిదేసి సంఖ్యలుగలవర్గములు నాలుగు. ఆరేసిసంఖ్యలుగల వర్గములు రెండు. ఏడేసిసంఖ్యలుగల వర్గములు మూడు. ఇవియన్నియుం గలసి అష్టోదరీయమను నీరోగాధ్యాయమున రోగములయొక్క వర్గములు ఎనిమిదియుం వివరింపబడినవి.

సర్వరోగములకును త్రిదోషములు కారణములనుట.

మూ సర్వఏవ వికారాః నిజాః నాన్యత్ర వాతపిత్తకఫేభ్యో నిర్వర్తన్తే. యథా హి:—శకునిస్సర్వం దివసమపి పరిపతన్ స్వాం ఛాయాం నాతివర్తతే, తథా స్వధాతువైషమ్యనిమిత్తాః సర్వవికారాః వాతపిత్తకఫాన్ నాతివర్తన్తే. వాతపిత్తశ్లేష్మణాం పునః స్థానసంస్థానప్రకృతివిశేషానభిసమీక్ష్య తదాత్మకానపి చ సర్వవికారాం స్తానేవోపదిశన్తి బుద్ధిమన్త ఇతి. 3౭

వ్యా. రోగసంగ్రహరూపమైన యీయష్టోదరీయాధ్యాయమున జెప్పబడిన నిజరోగములకును, మహారోగాధ్యాయమున జెప్పబడు నిజరోగములకును, ఈరెండధ్యాయములయందును ఇక నెచ్చటనైనను ఈతంత్రమున జెప్పబడని నిజరోగములకును, వాతపిత్తకఫములు వ్యస్తముగనైనను, అన్నియుం కలిసియైనను కారణములగును గాన అట్టివాతపిత్తకఫముల వదలి వేరొండుకారణములచేత జనించుట లేదు. ఎట్లనగా:— లోకమున నొకపక్షి పగలెల్లను తనకిచ్చవచ్చినట్లు పలుపోకల ద్రిమ్మరినను రాత్రివేళ

తనను నియమించుకొనియుండు చెట్టులోనిగూడు నతిక్రమించి యుండదు కదా. అట్లే రంగునే స్వధాతు (శరీరసంబంధమైనధాతువుల) విషమస్థితి నీకారణముగ జేసి జనించు నానావిధనిజరోగంబులును వాతపిత్తకఫముల నతిక్రమించి యుండుటలేదు. (ఏరోగమైనను వాతాదిదోష వైపరీత్యముననే కల్గునుగాని దోషసంబంధములేక జనించుటలేదని భావము) నిజరోగముల న దోషజములని యర్థము. ('నిజాః సర్వే వికారాః' అనిచెప్పుట చేత ఆగంతురోగముల కీనియమము లేదని భావము. ఆగంతుకరోగములయందును అట్టి రోగములకు కారణములైన యభిఘాతాదులచే నాగంతుకరోగములు సంభవించినను, అట్టియాగంతుకరోగములయందు చికిత్స దోషములనపేక్షించియుండదు కావున నీనియమము అనవసరము. నిజరోగములయందు మాత్రము దోషానుసారముగ చికిత్స జేయవలసియుండును కావున నీసంబంధము నరయుట యావశ్యకమని యెరుంగుటకై 'నిజాః' అని చెప్పబడినది.)

మరియు నానావిధరోగములకును పైజెప్పినరీతిగ వాతపిత్తకఫములే కారణములుగ నున్నను, అట్టిరోగములయొక్క స్థానవిశేషసంబంధమును బట్టియు, ఆకృతి విశేషమునుబట్టియు, కారణవిశేషమునుబట్టియు ఉదరము, ఊరుస్తంభము మున్నగు భేదములను 'అష్టావుదరాణి' అనునని మున్నగువాక్యములచే నుపదేశించిరి. అట్టిభేదములు స్థానాదిభేదములచే గల్గినను అవియును వాతాదిదోషజన్యములేయని బుద్ధిమంతులు నిర్ణయించెదరు.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—అన్నిరోగములును త్రిదోషసంబంధము చేతనే గల్గును. దోషసంబంధము లేక వ్యాధులు జనించుటలేదు. కావున వాతాదికారణములచే గల్గినయారోగములనే వానికింగల రసాదిధాతువులు వస్తి మున్నగు స్థానవిశేషసంబంధమును, ఆకృతిని, లక్షణములను, కారణవిశేషములను చక్కగ గమనించి యుదరాదిరోగములకు 'అష్టావుదరాణి' అనునవి మున్నగుభేదముల నుపదేశించెదరు. అని భావము. అందు 'ఊరుస్తంభము కామల మున్నగునవి స్థానవిశేషసంబంధముచే నుపదేశింపబడినవి. ప్రమేహపిడకలు గుల్మములు మున్నగునవి యాకృతివిశేషముచే నుపదేశింపబడినవి. శ్లేష్మప్లీహోదరములు మున్నగునవి కారణవిశేషములచే నుపదేశింపబడినవి.

తత్ర శ్లోకౌ:—

మూ. స్వధాతువైషమ్యనిమిత్తజా యే వికారసఙ్ఘా బహవశ్శరీరే,
న తే పృథక్పిత్తకఫానిలేభ్యః ఆగన్తవస్త్వేవ తతో విశిష్టాః.

వ్యా. శరీరసంబంధములైన వాతపిత్తకఫరూపములగు ధాతువుల వైషమ్యమున
కారణముగఁ జేసి జనించిన యే అనేకరోగములు రోగాధ్యాయమైన యష్టోదరీయమున
జెప్పబడినవో, అట్టి నిజరోగములన్నియు వాతపిత్తకఫములకన్న వేరైనవి కావు. (శరీరమ
నందలి వాతపిత్తకఫరూపములైన ధాతువులయొక్క వైషమ్యమే అష్టోదరీయమున ప
గణనము జేయబడిన యుంవరాదిరోగముల కన్నిటికిని కారణములనుట.) అభిఘాతా
బాహ్యకారణములచే గల్గిన యాగంతుకరోగములకు మాత్రము ఈనియమము లేదు
(అయ్యవి త్రిదోషసంబంధము లేకయే లగుడాది (తుంటకఱ్ఱ మున్నగువాని) ప్రహా
రూపములైన యాగంతుక (బాహ్య) కారణములచే జనించుటవలన, నాగంతుకరో
ములు త్రిదోషవ్యతిరిక్తములుగ నుండునని భావము.)

ఇచ్చట స్వధాతువైషమ్యశబ్దముచేత శరీరసంబంధములైన వాతపిత్తకఫము
వైషమ్యమువలన బుట్టినరోగములని యర్థము. ఆగంతుకారణములచే జనించిన జ్వరా
రోగములయందును ధాతువైషమ్యమున్నది. కావున అట్టి యాగంతుకజ్వరాదినివృత్తి
'వైషమ్యనిమిత్తజాః' అని చెప్పబడినది. అట్టి యాగంతుకజ్వరాదులయందు ఆగంతుకవ
కారణమగునుకాని ధాతువైషమ్యము ప్రధానకారణము కానోపదు. ఇట్లు చెప్పుటచే
నిజరోగములయందు ధాతువైషమ్యము ప్రధానకారణముకావున తదనుగుణముగ చికిత
జేయవలెను. ఆగంతుకములయందు బాహ్యకారణములు ప్రధానములుకాననవిరే
చికిత్సాప్రయోజకములు అని యెరుంగునది.

### నిజాగన్తురోగములకు పరస్పరసంబంధము.

మూ. ఆగన్తురన్వేతి నిజం వికారం నిజస్తథాగన్తుమపి ప్రవృద్ధః,
తత్రానుబన్ధం ప్రకృతించ సమ్యక్ జ్ఞాత్వాతతః కర్మసమారభేత

వ్యా. వాతాదిదోషప్రకోపమున కల్గినది నిజరోగము, అట్టినిజరూపముల
జ్వరము ఉన్మాదము మున్నగురోగములు తొలుత స్వకారణములచే గల్గినపిదప, భూ
వేశము మున్నగు నాగంతుకారణములు సంభవించినచో నాయాగంతుకవ్యాధియు
తొలుతజనించిన నిజరోగము ననుసరించి పుట్టును. (దాని ననుసరించియే వ్యాపించున
మరియు భూతావేశము మున్నగుబాహ్యకారణములచే తొలుత బుట్టిన (యాగంత
రూపమైన) జ్వరము ఉన్మాదము మున్నగు నాగంతుకరోగములను, పిమ్మట కొంతకాల
నకు స్వకారణములచే మిక్కిలి వృద్ధినొందిన నిజరోగంబును అనుసరించి యుండును.

అట్టియెడ అనుబంధరూపమైన (అప్రధానమైన) వ్యాధిని, ప్రకృతి (ప్ర
నమైన) వ్యాధిని చక్కగ గమనించి తత్తదనుగుణముగ చికిత్స జేయ నుపక్రమిం
వలెను. (స్వకారణములచే తొలుత జనించినరోగము నిజమైనను ఆగంతుకమైనను
అనుబంధ్యమనియు, ప్రధానమనియు, స్వతంత్రమనియు చెప్పబడును. స్వకా

ములచే తొలుత నొకవ్యాధి నిజమైనను ఆగంతుకమైనను పుట్టినపిమ్మట, స్వకారణము లచో బుట్టినవ్యాధి అనుబంధమనియు, అప్రధానమనియు, పరతంత్రమనియు జెప్ప బడును. ఈవిషయమునే "స్వతన్త్రో వ్యక్తలిఙ్గః స్వచికిత్సాప్రశమనశ్చ అనుబన్ధ్యః, అతో విపరీతస్త్వనుబన్ధః" అనువాక్యముచే స్థలాంతరమున జెప్పిరి. కారణాంతరము నపేక్షింపక స్ఫుటములైన స్వలక్షణములతో బుట్టి తన కుచితమైన చికిత్సచే శమించునది యనుబంధ్యము స్వతంత్రముననియు, దీనికి విపరీతములైన లక్షణములు కల్గినది పరతంత్రము, అనుబంధముననియు చెప్పబడునని యర్థము. అట్టివ్యాధి సమ్మేళనమున అనుబంధ్య, అనుబంధభేదముల బలాబలములను చక్కగ గమనించి చికిత్స జేయవలెనని భావము. అట్టియెడ అనుబంధవ్యాధి సామాన్యముగ నున్నపుడు ప్రధానవ్యాధి స్వ చికిత్సచే శమించునపుడు అయ్యది శమించును అటుగాక అనుబంధము మిక్కిలి యుత్క టముగ నున్నయెడ ప్రధానవ్యాధికి విరోధము కల్గనీయక యనుబంధవ్యాధి కుపచరించ వలెను. ఈవిషయము "ప్రధాన మవిరోధయన్" అనువాక్యముచే తంత్రాంతరమున చెప్పబడినది.)

ఇచ్చట "ఆగన్తుమపి ప్రవృద్ధః" అని చెప్పుటచేత తొలుత గల్గి నాగంతుక రోగమననుసరించి నిజరోగంబును వృద్ధినొందియుండి పిదప కారణాంతరములచే మిక్కిలి వృద్ధినొంది వ్యాపించునని తెలిసెడి. అపిశబ్దబలముచేత నొకసమయమున నిజరోగమున నిజరోగంబును, ఆగంతువునకు నాగంతుకంబును అనుబంధమగునని తెలిసెడిని.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, సూత్రస్థానే
అష్టోదరీయో నామ ఏకోనవింశోఽధ్యాయః

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమున సూత్రస్థానమునం దష్టోదరీయమనునది పందొమ్మిదియవయధ్యా యము సమాప్తము.

---

## వింశాధ్యాయము.

అవతారిక:—రోగచతుష్కములో జేరిన పైగ్రంథము మూడధ్యాయములచేత వాతాదిజన్యములగురోగములు సామాన్యముగ జెప్పబడినవి. అందు జెప్పబడని కొన్ని వాతాదిజన్యవ్యాధులు మాత్ర మీమహారోగాధ్యాయమున వివరింపబడును:—

మూ. అథాతో మహారోగాధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. అష్టోదరీయాధ్యాయమును జెప్పినపిదప రోగవిశేషముల దెలుపు మహారోగాధ్యాయమును భగవత్స్వరూపుడగు నాత్రేయమహర్షి యుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము.

పూర్వాధ్యాయమున 'జెప్పబడినరోగములకన్న నీయధ్యాయమున రోగవిశేషములు జెప్పబడును కావున నీయధ్యాయము మహారోగాధ్యాయమనని చెప్పబడును; కాని మహాయాససాధ్యము లగురోగములు మహారోగములు అని యర్థము చెప్పు టసమంజసము కాదు.

రోగసామాన్యనిమిత్త-స్వభావ-అధిష్ఠానభేదములు.

మూ. చత్వారో రోగా భవన్తిః—ఆగన్తు-వాత-పిత్త-శ్లేష్మనిమిత్తాః. తేషాం చతుర్ణామపి రోగత్వ మేకవిధం భవతి, రుక్సామాన్యాత్. ద్వివిధాపునః ప్రకృతిరేషా మాగన్తునిజవిభాగాత్. ద్వివిధం చైషా మధిష్ఠానం మనశ్శరీరవిశేషాత్. 3

వ్యా. పలుతెరంగులగు జ్వరాదిరోగములన్నియు ఆగంతు, వాతము, పిత్తము, కఫము అను నాల్గుకారణములచే గల్గును. కావున (ఆగంతుకము, వాతికము, పైత్తికము శ్లైష్మికమునని) నాల్గుతెరంగులై యుండును. అట్టి నాల్గువిధములైన రోగములయందున శరీరమనస్సుల తపింపజేసి కష్టపెట్టుధర్మ మొకటియె సామాన్యముగ నుండును. కావున రోగత్వము ఒకవిధముగనే యుండును. ('రుజ్యన్తే సన్తప్యన్తే అనేనేతి-రోగః, రుక్ రుజా,'' అను వ్యుత్పత్తిచేత బాధగల్గించుస్వభావము రోగసామ్యముగ నొకటియే యగునని భావము.)

మరియు నివి జనించుటకు కారణములు ఆగంతువు (అభిఘాతాదిబాహ్యము అనియు, నిజము (త్రిదోషాత్మకము) అనియు రెండుతెఱగులు. అట్టిరోగముల కధిష్ఠానము (ఉత్పత్తిస్థానము) మనస్సు, శరీరము నని రెండువిధములుగ నుండును. (ఆగంతుకములకును, నైజములకును మనశ్శరీరములు అధిష్ఠానములగును. కావున మానసికము, శారీరము నని రెండువిధములగునని భావము.)

ఆగంతుకారణములు త్రిశోథీయాధ్యాయమున ''తత్రాగన్తవః చ్ఛేదనభేదన'' అని యుపక్రమించి చెప్పబడినవి. అయినను నీయధ్యాయమున వానిలక్షణాదులవిశేషముల జెప్పుటకై యిచ్చట మరల నుపక్రమింపబడియె.

ప్రకృత్యాదివికల్పభేదములచే రోగానంత్యము.

మూ. వికారాః పునరపరిసంఖ్యేయాః—ప్రకృత్యధిష్ఠానలిఙ్గాయతనవికల్పవిశేషాత్; తేషా మపరిసంఖ్యేయత్వాత్.

(ప్రకృత్యధిష్ఠానలిఙ్గవేదనావికల్పవిశేషాణాం అపరిసంఖ్యేయత్వాత్)

వ్యా. పైఁజెప్పినరీతిగ నాగంతు మున్నగుకారణములచే నాల్గువిధములును సామాన్యధర్మముచే నొకవిధంబును, అధిష్ఠానభేదముచేత రెండువిధంబులును నగురోగములు, అట్టిరోగములకు సన్నిహితకారణములైన వాతాదిదోషములును, అధిష్ఠానములైన రసరక్తాదిదూష్యములును, ఆయారోగములకు సంబంధించినలింగములును వికల్పముచే నసంఖ్యేయములు (లెక్కకు మీరినవి) అగుటవలన ననేకవిధములై యుండును.

(ప్రకృతి యన సన్నిహితకారణము,అయ్యది వాతాదులు. అధిష్ఠానము శరీరమునందలి దూష్యములగురసరక్తాదులు. లింగములు - వ్యాధిలక్షణములు, ఆయతనములు-వాతాదిప్రకోపహేతువులైన మిథ్యాహారవిహారాదులు, అట్టిప్రకృతి, అధిష్ఠానము, లింగములు, ఆయతములు అనువానికి వేరువేరుగ సంభవించువికల్పవిశేషములు అనేకములుగ నుండును. కావున అట్టిభేదములచే దాన జనించినరోగములు అసంఖ్యాకము లగునని భావము.)

దోషాదివికల్పభేదముల నిట్లెరుంగునది——రోగములకు సన్నిహితకారణములైన వాతపిత్తకఫములు పరస్పరసంసర్గసన్నిపాతభేదములచేతను, అందును తరతమాదిభేదముచేతను వికల్పితములై దానంజేసి యనంతములగును. రోగముల కధిష్ఠానములైన రసరక్తాదిదూష్యములు పరస్పరము వానియంశాభేదముచే సంసర్గమునంది యనేకవికల్పముల నందును. ఆయారోగములను స్ఫుటములగులక్షణములు తంత్రములయందు వివరింపబడినవి. అవిగాక యింకను విశేషలక్షణములు గమనింపదగినవి యుండును. కావున అట్టిలింగముల వికల్పములును అనంతములు. రోగములకు వ్యవహితకారణములై వాతాదిదోషప్రకోపనములగు మిథ్యాహారవిహారాదులును (ఆయతనములు) అనేకవికల్పములు కల్గి యుండును. అట్టిభేదములచే రోగములన్నియు నసంఖ్యాకములై యుండుననని ఫలితార్థము.

—— నిజాగంతురోగములకు వేరువేరు కారణములు. ——

సూ. ముఖాని తు ఖల్వాగన్తోః నఖదశనపతనాఽభిచారాఽభిశాపాఽభిషఙ్గాఽభిఘాతవధబన్ధపీడనరజ్జుదహనశస్త్రాశనిభూతోపసర్గాదీని; నిజస్య తు ముఖం వాతపిత్తశ్లేష్మణాం వైషమ్యమ్. ౫

వ్యా. గోళ్లు, దంతములు మున్నగునవి శరీరావయవములందు గ్రుచ్చుకొనుట, క్షుద్రశాబరాదిమంత్రప్రయోగములు, పెద్దలగుబుషులు మొదలగువారివలన కల్గిన శాపము, భూతావేశము; రాళ్లు కట్టెలు మున్నగువానిచే దెబ్బలుతగులుట, ప్రాణివధ,

త్రాళ్లచేసైన బంధనము, ఆయుధములు మున్నగునవి యొరసికొనుట, త్రాళ్లచే బిగదీయబడుట, నిప్పునకాలుట, కత్తి మొదలగు ఆయుధములచే దెబ్బతగులుట, పిడుగుబడుట, పంచభూతములవైపరీత్యము, మారి మున్నగువానియుపద్రవములు ఇవియన్నియు ఆగంతుక రోగములకు కారణములు. నిజరోగములకు వాతపిత్తశ్లేష్మములయొక్క వైషమ్యము కారణము.

—— నిజఆగంతురోగముల రెంటికిని సామాన్యకారణములు. ——

మూ. ద్వయోస్తు ఖలు ఆగన్తునిజయోః ప్రేరణం అసాత్మ్యేంద్రియార్థ
సంయోగః ప్రజ్ఞాపరాధః పరిణామశ్చేతి. ౬

వ్యా. నిజాగంతురోగముల రెంటికిని అసాత్మ్యేంద్రియార్థసంయోగము, ప్రజ్ఞాపరాధము, పరిణామము అనునవి మూడును కారణములగును. మనశ్శరీరేంద్రియములకు అనారోగ్యరూపమైన కష్టమును కల్గించునట్టి శబ్దస్పర్శరూపరసగంధములతో చక్షురాదీంద్రియములకు సంబంధము కల్గుట అసాత్మ్యేంద్రియార్థసంయోగము, ప్రజ్ఞాపరాధము చేత (జ్ఞానవైపరీత్యముచేత) కాయికవాచికమానసికకర్మలను విధ్యుక్తమునకు విరుద్ధముగ జేయుట ప్రజ్ఞాపరాధము, శీత-ఉష్ణ-వర్షారూపమైనకాలము పరిణామము. ఈమూడును ఆగంతుక-దోషజరోగములకు కారణమనిభావము. వీనికింగల అయోగ-అతియోగ-మిథ్యాయోగ భేదములు ప్రథమాధ్యాయమున "కాలబుద్ధీంద్రియార్థానాం" అనుశ్లోకముచేతను పదునొకండవదియైన తిస్త్రైషణీయాధ్యాయమున "త్రీణ్యాయతాని అర్థానాం కర్మణః కాలస్యచ అతియోగ-అయోగ-మిథ్యాయోగాః" అనునది మొదలుజేసి, "ఇత్యసాత్మ్యేంద్రియార్థసంయోగః, ప్రజ్ఞాపరాధః, పరిణామశ్చేతి త్రయః త్రివిధవికల్పాః హేతవో వికారాణాం" అనునంతవరకుంగల గ్రంథముచేత వివరింపబడినది. ఆప్రకరణమునందలి వ్యాఖ్యానమున విపులముగ చెప్పియుండుటచే నిచ్చట మరల వివరింపబడదయ్యె.

—— నిజాగంతురోగములకు పరస్పరసంసర్గము. ——

మూ. సర్వేఽపి తు ఖల్వేతే అభిప్రవృద్ధాః చత్వారో రోగాః పరస్పర
మనుబధ్నన్తి న చాన్యోన్యసన్దేహమాపద్యన్తే.

వ్యా. పైజెప్పిననాల్గువిధములైన నిజాగంతురోగములు వృద్ధినొంది ఒకదానితో నొకటి కలసియుండును. అట్లు కలసియున్నను వానివానిలక్షణములు వేరువేరుగ నుండుట వలన సందేహము లేక భిన్నములుగనే యుండును. (ఆగంతులక్షణములును, నిజలక్షణములును, పరస్పరము విలక్షణములై యుండును. కావున దాన జనించినరోగములు సందేహాస్పదములుగాక గుర్తింపదగియుండునని భావము.

## నిజాగంతువులకు పరస్పరభిన్నలక్షణములు.

మూ. ఆగన్తుర్హి వ్యథాపూర్వం సముత్పన్నః జఘన్యం వాతపిత్త శ్లేష్మణాం వైషమ్యమాపాదయతి. నిజే తు వాతపిత్తశ్లేష్మాణః పూర్వం వైషమ్యమాపద్యన్తే జఘన్యాం వ్యథామభినిర్వర్తయన్తి.

వ్యా. ఆగంతురోగము తొలుత దానికి విషయమైనబాధతో కూడి పుట్టి పిమ్మట వాతపిత్తశ్లేష్మములయొక్క వైషమ్యముచే గల్గులక్షణములను చూపును. నైజమగువ్యాధి యందు వాతపిత్తశ్లేష్మములు తొలుతనే వైషమ్యమును జెంది పిమ్మట ఆయాదోషములకు సంబంధించినబాధలను మెల్లమెల్లగ కల్గించును. ఇవియే ఈరెంటికిని పరస్పరభేదములు.

## త్రిదోషములస్థానములు, అందు వాతస్థానములు.

మూ. తేషాం త్రయాణామపి దోషాణాం శరీరే స్థానవిభాగః ఉప దేక్ష్యతే తద్యథా:—వస్తిః, పురీషాధానం, కటిః, సక్థినీ, పాదౌ, అస్థీని చ వాతస్థానాని. అత్రాపి పక్వాశయో విశేషేణ వాత స్థానమ్. ౯

వ్యా. పైజెప్పబడిన నిజరోగములకు కారణములగువాతపిత్తకఫముల మూడిటికిని శరీరమునందు స్థానవిభాగమునందు ఈక్రింద జెప్పబడును. ఎట్లులన:—వస్తి, (మూత్రా శయము) పక్వాశయము, కటి, (నడుము) తొడలు, పాదములు, అస్థులు ఇవి వాతము నకు స్థానములు. అందును పక్వాశయము ముఖ్యస్థానముగనుండును. (ప్రాణాదిభేదములు గలవాతమునకు "స్థానం ప్రాణస్య శీరుషోరః కణ్ఠ జిహ్వాస్య కర్ణనాసికాః" అని యుప క్రమించి వేర్వేరుస్థానములు చెప్పబడును. అయినను పైజెప్పిన వస్త్యాదిస్థానములయందు ప్రాయికముగ వాతరోగములు సంభవించుటచేతను, అట్టిస్థానముల జనించినరోగములు దుస్సాధము లగుటచేతను, అట్టిస్థానములయందుండువాతము శమించినచో వాతవికా రములన్నియు జయించుటచేతను ఈస్థానములు ముఖ్యములుగ జెప్పబడినవి.

## పిత్తస్థానములు.

మూ. స్వేదో రసో లసీకా రుధిరమామాశయశ్చ పిత్తస్థానాని, అత్రా ప్యామాశయో విశేషేణ పిత్తస్థానమ్. ౧౦

వ్యా. చెమట, రసధాతువు, లసీక (శరీరమునందలిజలమున బంధనగల్గియుండు భాగము) రక్తము, ఆమాశయము ఇవి పిత్తమునకు స్థానములు. వీనితో నామాశయము ప్రధానమైనస్థానము.

### శ్లేష్మస్థానములు.

మూ. ఉరశ్శిరో గ్రీవా పర్వాణి ఆమాశయో మేదశ్చ శ్లేష్మణః స్థానాని, అత్రాప్యురో విశేషేణ శ్లేష్మస్థానమ్. ౧౧

వ్యా. రొమ్ము, శిరస్సు, కంఠము, అవయవములయందలికీళ్లు, ఆమాశయము, మేదస్సు ఇవి కఫమునకు స్థానములు. అందును రొమ్ము ముఖ్యమైన స్థానము.

ఇచ్చట పిత్తమునకును, కఫమునకును ఆమాశయము స్థానముగ జెప్పబడెను. అందు పిత్తమునకు ఆమాశయమున క్రిందిభాగంబును, కఫమునకు ఆమాశయమునందు పైభాగంబును స్థానమగునని యెఱుంగునది.

### వికృతావికృతత్రిదోషకృత్యములు.

మూ. సర్వశరీరచరాస్తు వాతపిత్తశ్లేష్మాణో హి సర్వస్మిన్ శరీరే కుపితాఽకుపితాః శుభాశుభాని కుర్వన్తి. ప్రకృతిభూతాః శుభాని, ఉపచయబలవర్ణప్రసాదాదీని, అశుభాని పునర్వికృతిమాపన్నాని వికారసంజ్ఞకాని. ౧౨

వ్యా. పైజెప్పిన వాతపిత్తకఫములు మూడును ముఖ్యముగ శరీరమునందెల్ల వ్యాపించును. అయ్యవి ప్రకోపమునొందినచో రోగరూపములగుకష్టములను, ప్రకోపమునొందక సమస్థితినున్నపుడు ఆరోగ్యరూపమైన శుభ(సుఖ)మును కల్గించును. అందు సమస్థితినుండునవి శరీరవృద్ధి, బలము, శరీరవర్ణము, సౌకుమార్యము మున్నగుశుభముల గల్గించును. వికృతిజెందినవి జ్వరము మున్నగురోగముల గల్గించును.

### సామాన్యజ-నానాత్మజరోగములు, అందు నానాత్మజవిభాగము.

మూ. తత్ర వికారాస్సామాన్యజాః నానాత్మజాశ్చ. తత్ర సామాన్యజాః పూర్వమష్టోదరీయే వ్యాఖ్యాతాః. నానాత్మజాస్త్విహాధ్యాయేఽనువ్యాఖ్యాస్యామః. తద్యథా:—అశీతిర్వాతవికారాః, చత్వారింశత్పిత్తవికారాః, వింశతిశ్శ్లేష్మవికారాః.

వ్యా. శరీరమున పుట్టువ్యాధులు సామాన్యజములనియు, నానాత్మజములనియు రెండువిధముల నుండును. (అందు వాతాదులచేత ప్రత్యేకముగ(వేర్వేరుగ)గాక ఒండొంటికలిసియుం కల్గువ్యాధులు సామాన్యములు. అటు కలియక వాతమునైనను, పిత్తమునైనను, కఫమునైనను కారణముగజేసి ప్రత్యేకముగ సంభవించునవి నానాత్మజములు.) అందు సామాన్యరోగములు అష్టోదరీయాధ్యాయమున వివరింపబడినవి. నా

త్మకరోగములు ఈయధ్యాయమున జెప్పబడును. (వాతపిత్తకఫములచే ప్రత్యేకముగను సంసర్గమునను సన్నిపాతమునను కల్గినసంఖ్యాభేదముల ననుసరించి 'అష్టౌ ఉదరాణి' ఇది మున్నగునిర్ణయము అష్టోదరీయమున జెప్పబడినది. ఈయధ్యాయమున కేవల వాతము చేతను, పిత్తముచేతను, కఫముచేతను, ఒక్కొకదోషముచే నెన్నేసివ్యాధులు కల్గునదియుం వివరించి చెప్పబడునని భావము.)

అవి యెట్టులన:—వాతరోగములు ఎనుబది, పిత్తరోగములు నలువది, కఫరోగములు ఇరువది.

అశీతివాతరోగముల వివరణము.

మూ తత్రాదౌవాతవికారాననువ్యాఖ్యాస్యామః. తద్యథా:—నఖభేదశ్చ, విపాదికా చ, పాదశూలశ్చ, పాదభ్రంశశ్చ, సుప్తపాదతా చ, వాతఖుడ్డాకా చ, గుల్ఫగ్రన్థిశ్చ, పిణ్డికోద్వేష్టనం చ, గృధ్రసీ చ, జానుభేదశ్చ, జానువిశ్లేషశ్చ, ఊరుస్తంభశ్చ, ఊరుసాదశ్చ, పాఙ్గుల్యం చ, గుదభ్రంశశ్చ, గుదావర్తిశ్చ, వృషణోత్క్షేపశ్చ, శేఫస్తమ్భశ్చ, వఙ్క్షణానాహశ్చ, శ్రోణిభేదశ్చ, విడ్భేదశ్చ, ఉదావర్తశ్చ, ఖఞ్జత్వం చ, కుబ్జత్వం చ, వామనత్వం చ, త్రికగ్రహశ్చ, పృష్ఠగ్రహశ్చ, పార్శ్వావమర్దశ్చ, ఉదరావేష్టశ్చ, హృన్మోహశ్చ, హృద్ద్రవశ్చ, వక్ష ఉద్ధర్షశ్చ, వక్ష ఉపరోధశ్చ, బాహుశోషశ్చ, గ్రీవాస్తంభశ్చ, మన్యాస్తంభశ్చ, కణ్ఠోద్ధ్వంసశ్చ, హనుభేదశ్చ, ఓష్ఠభేదశ్చ, దన్తభేదశ్చ, దన్తశైథిల్యం చ, మూకత్వం చ, వాక్సంగశ్చ, కషాయాస్యతా చ, ముఖశోషశ్చ, అరసజ్ఞతా చ, అగన్ధజ్ఞతా చ, ఘ్రాణనాశశ్చ, కర్ణశూలశ్చ, అశబ్దగ్రహణంచ, ఉచ్చైఃశ్రుతిశ్చ, బాధిర్యం చ, వర్త్మస్తంభశ్చ, వర్త్మసంకోచశ్చ, తిమిరశ్చ, అక్షిశూలశ్చ, అక్షివ్యుదాసశ్చ, భ్రూవ్యుదాసశ్చ, శంఖభేదశ్చ, లలాటభేదశ్చ, శిరోరుక్చ, కేశభూమిస్ఫుటనం చ, అర్దితఞ్చ, ఏకాఙ్గరోగశ్చ, సర్వాంగరోగశ్చ, పక్షవధశ్చ, ఆక్షేపకశ్చ, దండకశ్చ, శ్రమశ్చ, భ్రమశ్చ, వేపథుశ్చ, జృంభా చ, విషాదశ్చ, అతి

ప్రలాపశ్చ, గ్లానిశ్చ, రౌక్ష్యఞ్చ, పారుష్యఞ్చ, శ్యావారుణా వభాసతా చ, అస్వప్నశ్చ, అనవస్థితత్వం చేతి అశీతిర్వాత వికారాః. వాతవికారాణామపరిసంఖ్యేయానామావిష్కృత తమా వ్యాఖ్యాతాః. ౧౪

వ్యా. పైజెప్పబడిన వాతరోగములు సంఖ్యాబహుళము లగుటచే తొలుత జెప్పబడుచున్నవి. అవియెట్టులనః—నఖభేదము, (గోళ్లుపగులుట, పుచ్చుట) విపాదిక, (అరికాళ్లు పగులుట), పాదశూలము (అరికాళ్లయందు పోటు), పాదభ్రంశము (పాదములు స్వభావస్థితికంటె వంకరగనుండుట), సుప్తపాదత (పాదములయందు తిమురుచచ్చు పుట్టుట), వాతఖుడ్డాకము (పాదములమీద కల్గెడి యొకవిధమైననొప్పి), గుల్ఫగ్రహ (చీలమండయందు సెరికట్టుట), పిండికోద్వేష్టనము (పిక్కలయందు మెలిపెట్టినట్లు నొప్పి), గృధ్రసీవాతము, జానుభేదము (మోకాళ్లయందు నొప్పి), జానువిశ్లేషము మోకాళ్లకీలు సడలుట), ఊరుస్తంభము (తొడలు స్తంభించి యుండుట), ఊరు సాదము (తొడలు కృశించుట), పాఙ్గుల్యము (కాళ్లురెండును వృద్ధిజెందక శుష్కించి నడవలేక జేయువ్యాధి ఇదియే కుంటితనము), గుదభ్రంశము (గుదము వెలుపలికి జారుట), గుదావర్తి (గుదస్థానమున పొక్కి నొప్పికల్గుట), వృషణోత్క్షేపము (వృషణములు పైకి ఈడ్వబడుట), శేఫస్తంభశ్చ (గుహ్యముస్థంభించుట), వంక్షణానాహము (గజ్జలు ఈడ్చి పట్టి నొప్పికల్గుట), శ్రోణిభేదము (పిరుదులయందు నొప్పి), విడ్భేదము (మలము ఉండలై పిష్టముగొట్టుట), ఉదావర్తము, ఖఞ్జత్వము (కాళ్లు కుంటియగుట), కుబ్జత్వమే (గూను), వామనత్వము (గుజ్జారితనము), త్రికగ్రహము (వెన్నుఎముక క్రిందిసంధిభాగమున పట్టినట్టు నొప్పి), పృష్ఠగ్రహము (వీపునొప్పి), పార్శ్వావమర్దము (ప్రక్కలనొప్పి), ఉదరావేష్టము (కడుపులో తిరిగినట్లు బాధ), హృన్మోహము (హృదయమున మోహము గ్రమ్ముట), హృద్ద్రావము (రొమ్మదరుట), వక్షఉద్ధర్షము రొమ్ముబరువు), వక్షఉపరోధము (రొమ్మడపు), బాహుశోషము (భుజములు ఎండిపోవుట), గ్రీవాస్తంభము (మెడ స్తంభించుట), మన్యాస్తంభము (మెడ వెనుకటినరములు స్తంభించుట), కణ్ఠోద్ధ్వంసము (గొంతురాపు), హనుభేదము (అంకిళ్లుజారుట), ఓష్ఠభేదము (పెదవులు పగులుట) దన్తభేదము (పండ్లు పగులుట), దన్తశైథిల్యము (పండ్లు కదలుట), మూకత్వము (మూగతనము), వాక్సంగము (మాటాటలేకుండుట, లేక నత్తి), కషాయాస్యత (నోరు వగరుగనుండుట) ముఖశోషము (నోరు ఎండుట), అరసజ్ఞత (నాలుకకు మధురాధిరసముల తెలియకుండుట), అగన్ధజ్ఞత (వాసన తెలియకుండుట), ఘ్రాణనాశము (ముక్కుకు వా

కల్గుట) కర్ణశూలము (చెవిపోటు), అశబ్దశ్రవణము (శబ్దములేనప్పుడు చెవులకు శబ్దము వినబడుట),ఉచ్చైశ్శ్రుతి (బిగ్గరగనరచిననే వినబడుట), బాధిర్యము (చెవులు బొత్తుగ వినబడకుండుట చెముడు) వర్త్మస్తంభము కనురెప్పలు స్తంభించియుండుట, వర్త్మసంకోచము (కనురెప్పలు ముడుచుకొనుట), తిమిరము, (అక్షిశూలము (కంటపోటు), అక్షివ్యుదాసము (కన్నులు పైకి కదలుట), భ్రూవ్యుదాసము (కనుబొమలు పైకి కదలుట), శంఖభేదము (కణతనొప్పి), లలాటభేదము (నుదిటినొప్పి), శిరోరుక్కు (తలనొప్పి), కేశభూమిస్ఫుటనము (తలవెండ్రుక లుండుప్రదేశము పొక్కి పుండుఅగుట), అర్దితవాతము, ఏకాఙ్గవాతము, సర్వాంగవాతము, పక్షవధము, ఆక్షేపకవాతము, దండకము, శ్రమము, భ్రమము, కంపము, ఆవలింత, విషాదము, అధికముగ మాటలాడుట, బడలిక, రూక్షత్వము, పరుషత్వము, శరీరమున శ్యామారుణ వర్ణములుకల్గుట, నిదురలేకుండుట, మనస్సు చంచలముగనుండుట, అను నీయెనుబదియు వాతరోగములు. అట్టి వాతరోగములు సంఖ్యకు మీరియుండును. అయిన ఇచ్చట అందు ముఖ్యముగ జేసి ఎనుబదివిధములుగ పరిగణనము చేయబడినవని యెరుంగునది.

### వాతముయొక్కస్వరూపము, గుణములు.

మూ. సర్వేష్వపిఖల్వేతేషు వాతవికారేషూక్తేష్వన్యేషు చానుక్తేషు వాయోరిదమాత్మరూపమపరిణామి కర్మణశ్చ స్వలక్షణాత్. యదుపలభ్య తదవయవం వా విముక్తసందేహా వాతవికారమేవాధ్యవస్యన్తి కుశలాః. తద్యథా:—రౌక్ష్యం, లాఘవం, వైశద్యం, గతిః, అమూర్తత్వం చ ఇతి వాయోరాత్మరూపాణి భవన్తి. ఏవం విధత్వాచ్చ కర్మణః స్వాలక్షణ్యమిదమస్య భవతి. ౧౫

వ్యా. పైజెప్పబడిన వాతరోగములయందును ఇవిగాక చెప్పబడని వాతరోగములన్నిటియందును వ్యాపించియుండు వాతముయొక్క కారణాంతరము నపేక్షింపక నైసర్గికమైన స్వరూపంబును, వికృతిజెందిన వాతముయొక్క కృత్యములకు సంబంధించిన పిత్తకఫములసంబంధము నపేక్షింపని లక్షణంబులును ఈక్రింద జెప్పబడును. అట్టి నైసర్గికలక్షణమును వికృతలక్షణమును పూర్తిగనైనను కొన్నిటినైనను గమనించినయెడ నియ్యది వాతరోగమని కుశలులు దృఢముగ నిశ్చయింపగలరు. అవి యెవ్వియన:—రూక్షత్వము లాఘవము (తేలిక), విశదత్వము, చలనము, రూపములేకుండుట

(కంటకిగపడకుండుట), ఇవి వికృతిజెందక స్వభావస్థితినుండువాతమునకు స్వాభావిక లక్షణములు. ఇట్టిలక్షణములు కల్గియుండుటంజేసి వాతము శరీరమునందు వికృతిజెందినప్పుడును పైజెప్పిన రౌక్ష్యాదిగుణముల జూపుచుండును. కావున నీలక్షణములజట్టి వాత వికారమని నిశ్చయింపదగునని భావము.

ఇచ్చట 'అపరిణామి' యనగ పిత్తకఫముల నపేక్షింపక స్వతస్సిద్ధమైనదని యర్థము. అయ్యది స్వరూపమనుపదముతో నన్వయించును. వాతమునకు రౌక్ష్యాది గుణములు కఫపిత్తాదికారణాంతరముల నపేక్షింపక స్వాభావికమైన స్వరూపమగునని భావము.

మరియు 'కర్మణః స్వలక్షణం' అనుచోట కూడ 'అపరిణామి' యను పదము చేరును. వికృతిజెందినవాతము చేయుకృత్యములలక్షణంబును పిత్తకఫముల నపేక్షింపక వాతమునకు స్వతంత్రముగ గల్గినదని యర్థము. (పైజెప్పిన లక్షణములును స్వరూపంబును వాతమునకు స్వతస్సిద్ధములైనవికాని యితరకారణములచే గల్గినవి కావని ఫలితార్థము.)

## వాతకృత్యములు.

మూ॥ తం తం శరీరావయవమావిశతః స్రంసభ్రంశవ్యాసభేదసాదహర్షతర్షకమ్ప వర్తచాలతోదవ్యథాచేష్టాధ్యాః, తథా ఖరపరుషవిశద సుషిరారుణవర్ణకషాయ విరసముఖశోషశూలసుప్తిసఙ్కుచన స్తమ్భనఖఞ్జతాదీని వాయోః కర్మాణి, తైరన్వితం వాతవికారమేవాధ్యవస్యేత్. ౧౬

వ్యా. స్రంసనము (జారుట), దూరముగ సంబంధము లేకపోవుట, విశాలముగనైనను పెద్దదిగనైననగుట, పగులుట, కృశించుట, హర్షము (జలబరించుట), దప్పి, వణకు, చలనము, గుండ్రముగచుట్టుట, పోటు, నొప్పి, వడదీసినవిధముగ బాధ, ఇవి మున్నగు కృత్యములును, ఆయా అవయవములయందు గరగరయని కరకుబారుట, కఠినముగనుండుట, ఒండొంట గలియకుండుట, రంధ్రములేర్పడుట, అరుణవర్ణము కల్గుట, నోటపగరుపుట్టుట, రుచిదెలియకుండుట, నోరెండుట (ద్రవములేక తడియారుట), శూలమున బొడిచినవిధముగ బాధ, చర్మముపై స్పర్శజ్ఞానములేక మొద్దుబారియుండుట, ముడుచుకొనుట, అవయవములుస్తంభించుట, అవయవములు కుంటియగుట ఇవిమున్నగుకృత్యములును వాతమునకు స్వాభావికములు. పైజెప్పినవివాతమునకు స్వాభావికకృత్యములు కావున వాతము వికృతిజెంది శరీరమునం దేయేయవయవమున జేరునో

అయాయంగములయందెల్ల పైజెప్పినకృత్యముల జేయుచుండును. అట్టియెడ నాస్థానముల గల్గు వైలక్షణములబట్టి యియ్యది వాతమున గల్గినవ్యాధి యని నిర్ణయింపదగునని భావము. (వాతము రూపములేనిది కావున రసవర్ణములు దానికి స్వంతముగ నుండవు. అయినను ప్రభావముచేత కటురసమును అరుణవర్ణమును కల్గించునని యెఱుంగునది)

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—వాతమునకు చక్షుర్గోచరము కాదగిన రూపములేదు. అట్టివాతమునకు రౌక్ష్యాదిగుణంబులును, స్రంసనాదికృత్యముల జేయుటయు నెట్లు సంభవించును? అట్టిగుణములను కృత్యములను గమనించు టెట్లు? అని సంశయము బొడమవచ్చును. వాతమును వానిగుణములబట్టియు కృత్యములబట్టియు గమనింప నలవికాకున్నను, అట్టివాతము మన కప్రత్యక్షముగనే యుండుశరీరమునం దెల్ల వ్యాపించుచు నాయాయంగములయందు పైజెప్పిన రౌక్ష్యాదిగుణముల గల్గించి స్రంసనాదికృత్యముల జేయుచు నుండును. శరీరమునం దేభాగమున వాతమునకు సంబంధించినగుణకర్మములు గానవచ్చునో, అచ్చోట వాతముచే గల్గురోగము సంభవించినదని యనుమానముచే నూహించి రోగముల నిర్ణయింపదగును. కావున వాతమునకు గుణకృత్యములు అనుమానసాధ్యములగును. ఈయభిప్రాయమునే "తం తం శరీరావయవమావిశః" అని యుపక్రమించి మూలమున జెప్పియున్నది.

## వాతహరచికిత్సావిధానము.

మూ. తం మధురామ్లలవణస్నిగ్ధోష్ణైరుపక్రమైరుపక్రమేత స్నేహస్వేదాస్థాపనానువాసననస్తఃకర్మభోజనాభ్యఙ్గోత్సాదనపరిషేకాదిభిః వాతహరైః మాత్రాం కాలం చ ప్రమాణీకృత్య, అస్థాపనానువాసనం తు ఖలు సర్వథోపక్రమేభ్యో వాతే ప్రధానతమం మన్యన్తే భిషజః, తదాదిత ఏవ పక్వాశయమనుప్రవిశ్య కేవలం వైకారికం వాతమూలం ఛినత్తి. తత్రావజితే వాతేఽపి శరీరాన్తర్గతాః వాతవికారాః ప్రశాన్తిమాపద్యన్తే; యథా వనస్పతేర్మూలే ఛిన్నే స్కన్ధశాఖావరోహకుసుమఫలపలాశాదీనాం నియతో వినాశః, తద్వత్. ౧౭

వ్యా. పైజెప్పినలక్షణములబట్టి నిర్ణయింపబడిన వాతరోగమునకు మధురరసంబును అమ్లలవణరసంబులును కల్గి స్నిగ్ధంబులును ఉష్ణంబులు నగునాహారాదులచేతను ఔషధాగులచేతను చికిత్స జేయవలెను. మరియు స్నేహపానము. స్వేదము (చెమటబటించుట)

ఆస్థాపనానువాసనవస్తికర్మలు, నస్యకర్మము, వాతహరమైనభోజనము, అభ్యంగనము, ఉత్సాదనము (నలుగుపిండితో శరీరమును తోముట), వాతహరకషాయాదులచే శరీరమును తడుపుట, ఇవి మున్నగువాతహరములైన చికిత్సలచేత మాత్రాకాలబలాదులకు తగినట్టిపరిమాణము కల్పించి యుక్తియుక్తముగ చికిత్సజేయనగును.

పైజెప్పినచికిత్సలలో ఆస్థాపనము అనువాసనము ననువస్తికర్మలు రెండును పక్వాశయమున జేరి రోగముల గల్గించుటకు కారణముగ నున్న వాతమును బొత్తుగ ఛేదించును. (పక్వాశయమునంగల వాతప్రకోపనకారణములైన దోషములను నిశ్శేషముగ హరించును.) దానంజేసి వాతము హరించును. అట్టివాతము ప్రకోపముడిగినయెడ శరీరమునం దంతర్గతములైన వాతవికారములన్నియు (ఒకచెట్టుకు ప్రధానమైనవేరును మొదలంట నరికినప్పుడు ఆచెట్టుకు సంబంధించినశాఖోపశాఖలు ఆకులు పువ్వులు కాయలు మున్నగునవియన్నియు నశించి నిర్మూలములగువిధమున) నడుగంట నశించును. కావున చికిత్స లన్నింటిలో ఆస్థాపనానువాసనములు రెండును మిక్కిలి ప్రధానములు. వాతము రోగముగల్గింప నుండునప్పుడే తొలుదొలుతనే అట్టివస్తికర్మముల రెంటిని చేసినయెడ పైజెప్పినరీతిగ వాతమునకు మూలకారణము పక్వాశయమున హరించి వాతవికారములన్నియు శాంతినొందునని భావము.

## చత్వారింశత్పిత్తరోగములవివరణము.

మూ. పిత్తవికారాః—ఓషశ్చ, ప్లోషశ్చ, దాహశ్చ, దవథుశ్చ, ధూమకశ్చ, అమ్లకశ్చ, విదాహశ్చ, అన్తర్దాహశ్చ, అంసదాహశ్చ, ఊష్మణ ఆధిక్యంచ, అతిస్వేదశ్చ, అఙ్గస్వేదశ్చ, అఙ్గగన్ధశ్చ, అఙ్గావదరణం చ, శోణితక్లేదశ్చ, మాంసక్లేదశ్చ, త్వగ్దాహశ్చ, మాంసదాహశ్చ, త్వఙ్మాంసావదరణం చ, చర్మావదరణం చ, రక్తకోఠశాశ్చ, రక్తపిత్తం చ, రక్తమణ్డలాని చ, హరితత్వం చ, హారిద్రత్వం చ, నీలికా చ, కక్ష్యా చ, కామలా చ, తిక్తాస్యతా చ, పూతిముఖతా చ, తృష్ణాయా ఆధిక్యం చ, అతృప్తిశ్చ, ఆస్యవిపాకశ్చ, గళపాకశ్చ, అక్షిపాకశ్చ, గుదపాకశ్చ, మేఢ్రపాకశ్చ, జీవాదానం చ, తమఃప్రవేశశ్చ, హరితహారిద్రనేత్రమూత్రవర్చస్త్వం చ, ఇతి చత్వారింశత్ పిత్తవికారాః. పిత్తవికారాణామపరిసంఖ్యేయానాం ఆవిష్కృతతమాః వ్యాఖ్యాతాః. ౧౮

వ్యా. నిప్పుసెగ తగిలినవిధముగ మంట, కొంచెముగ నిప్పు శరీరముపై తగిలినవిధముగ మండుట, శరీరమునం దెచ్చటనైన నిప్పున కాలినవిధముగ మండుట, శరీరాద్యంతమంతయు బగబగమండుట, నోట పొగ వెడలునట్లుండుట, నోట పుల్లనిత్రేపులు వెడలుట, కోష్ఠమున మంటబుట్టుట, హృదయమున మంట, భుజములపై మంటపుట్టుట, శరీరమున వేడి యధికమగుట, అధికముగ చెమటపుట్టుట, శరీరావయవమున మాత్రము చెమటపట్టుట, ఒడలిపై దుర్గంధముపుట్టుట, శరీరము పగులుట, రక్తము చెడుట, మాంసము చెడుట, శరీరముపై చర్మము పైభాగమున మంటపుట్టుట, మాంసమున మంటపుట్టుట, శరీరమునందలి చర్మమాంసములు రెండును జేరి పగులుట, చర్మము మాత్రము చీలుట, శరీరముపైని యెఱ్ఱనిపద్దులు కల్గుట, దోషసంసర్గములేక కేవలపిత్తమున గల్గురక్తపిత్తము, గుండ్రముగనుండు ఎఱ్ఱనిపొడలు, శరీరమునందెల్ల ఆకుపచ్చనిరంగుకల్గుట, పసుపురంగు కల్గుట, నీలిక యనుపుట్టుమచ్చ (ఇది ముఖముపై కల్గును), కక్ష్య (ఇది చంకలో గట్టిగనుండు నొకవిధమైనగడ్డ), కామలారోగము, నోటిచేదు, నోటికంపు, మితిమీరిన దప్పి, భుజించినను ఆకలితీరక తృప్తిలేకుండుట, నోరు పుండగుట, కుత్తుకలో పుండగుట, కన్నులు పుండగుట, గుదస్థానమున పుండగుట, మేఢ్రమున పుండగుట, ప్రాణమునకాధారమైన జీవరక్తము శరీరమునుండి బైటవెడలుట, చీకటిలోనున్నవిధముగ నేమియు తెలియకుండుట, కన్నులును మూత్రంబును మలంబును ఆకుపచ్చనిరంగైనను పసుపు రంగైనను కల్గియుండుట ఈనలువదియు పిత్తరోగములు. పిత్తరోగము లనేకములై సంఖ్యకు అలవికాకుండును. అయినను మిక్కిలి స్ఫుటముగ కనబడునట్టిరోగముల మాత్రము ప్రధానముగజేసి నలువది యని పరిగణనము చేయబడియెనని యెఱుంగునది.

## పిత్తముయొక్క స్వరూపము, గుణములు.

మూ. సర్వేష్వపి ఖల్వేతేషు పిత్తవికారేష్వన్యేషు చానుక్తేషు పిత్తస్యేదమాత్మరూపమపరిణామి, కర్మణశ్చ స్వలక్షణం; యదుపలభ్య తదవయవం వా విముక్తసందేహాః పిత్తవికారమేవాధ్యవస్యన్తి కుశలాః; తద్యథా:— ఔష్ణ్యం, తైక్ష్ణ్యం, లాఘవం, అనతిస్నేహః, వర్ణశ్చ శుక్లారుణవర్జః, గన్ధో విస్రః, రసౌ కటుకామ్లౌ, పిత్తస్యాత్మరూపాణి; ఏవంవిధత్వాచ్చ కర్మణః స్వాలక్షణ్యం ఇదమస్య భవతి. ౧౫

వ్యా. ఇచ్చట జెప్పబడినపిత్తరోగములయందును, అనుక్తములగు నితరపిత్తరోగము లన్నింటియందును, కారణాంతరము నపేక్షింపక పిత్తమునకు స్వాభావికముగ

నుండు స్వరూపంబును, వికృతిజెందిన పిత్తమునకు సంబంధించినకృత్యములును క్రింద వివరింపబడును. అట్టిస్వరూపమును కృత్యమును కొంతవరకైనను అన్నింటినైనను చక్కగ గమనించినచో నియ్యది నిస్సందేహముగ పిత్తరోగమని కుశలులగువైద్యులు బుద్ధి నైపుణ్యముచే నిర్ణయింపగలరు. పిత్తమునకు ఉష్ణత్వము (వేడి), తీక్ష్ణత్వము (చురుకు తనము), లాఘవము (తేలిక), కొంచెము చమురుకల్గియుండుట, శుక్ల అరుణవర్ణములు దక్క తక్కినవర్ణములు, పక్వముగాని మాంసమునకు గల్గుగంధము, కటు (కారము) అమ్ల (పులుపు) రసములు, ఇవియు స్వాభావికగుణములు. అట్టిగుణములు కల్గియుండుటచేత పిత్తము తదనుగుణముగ కర్మలజేయును, కావున దానికర్మలకు సంబంధించినలక్షణములును తదనుగుణముగ నుండును.

### పిత్తకృత్యములు.

మూ. తం తం శరీరావయవమావిశతః దాహౌష్ణ్యపాకస్వేదక్లేదకోథ కణ్డూస్రావరాగాః, యథాస్వం చ గన్ధవర్ణరసాభినిర్వర్తనం, పిత్తస్య కర్మాణి, తైరన్వితం పిత్తవికారమేవ అధ్యవస్యేత్. ౨౦

వ్యా. అట్టిపిత్తము శరీరమునందలి ఆయా అవయవమున జేరినపుడు ఆస్థానమున మంట, వేడి, పుండగుట, చెమట, చెమ్మగిలుట, దద్దురులు, దురద, చీము మొదలగు స్రవించుట, ఎరుపుకల్గుట, గంధవర్ణరసములు పిత్తమునకు స్వరూపలక్షణమున జెప్పినవిధముగ శుక్లారుణ వ్యతిరిక్తములైన తక్కినవర్ణంబులను విస్రగంధంబును కటుకామ్లరసములను కల్గించుట ఇవియన్నియు పిత్తమునకు స్వాభావిక కృత్యములు కావున ఈకృత్యములజేయును. అట్టికృత్యములబట్టి అయ్యది పిత్తవికారమని నిశ్చయింపదగును.

### పిత్తరోగసామాన్యచికిత్స.

మూ. తం మధురతిక్తకషాయశీతైరుపక్రమైః ఉపక్రమేత, స్నేహవిరేక ప్రదేహపరిషేకాభ్యఙ్గాదిభిః పిత్తహరైః మాత్రాం కాలం చ ప్రమాణీకృత్య; విరేచనం తు సర్వోపక్రమేభ్యః పిత్తే ప్రధానతమం మన్యన్తే భిషజః, తద్ధ్యాదిత ఏవామాశయ మనుప్రవిశ్య కేవలం వైకారికం పిత్తమూలం చాపకర్షతి. తత్రావజితే పిత్తే ఽపి శరీరాన్తర్గతాః పిత్తవికారాః ప్రశాన్తిమాపద్యన్తే, యథాగ్నౌ వ్యపోఢే కేవలమగ్నిగృహం చ శీతీభవతి, తద్వత్.

వ్యా. అట్టి పిత్తరోగమునకు మధురతిక్తకషాయరసంబులును, వీర్యగుణములచే శీతంబులు నగునౌషధాదులచే చికిత్స జేయవలెను. మరియు స్నేహపానము, విరేచనము, పట్టువేయుట, పిత్తహరకాయాదులచే తడుపుట, పిత్తహరతైలాదులచే నభ్యంగనము జేయుట మున్నగు పిత్తహరచికిత్సలను మాత్రాకాలాదుల కనుగుణముగ పరిమాణమును గల్పించి చేయవలెను. మరియు పైజెప్పినచికిత్సలలో విరేచనౌషధము తొలుతనే యామాశయమున జేరి పిత్తమును వికృతిజెందించు మూలకారణమైన దోషమును బైట వెడలించి హరింపజేయును. దానంజేసి పిత్తమునకుకల్గిన యాధ్ధత్యము తగ్గును. అట్టిపిత్తము శాంతినొందినపుడు శరీరాంతర్గతములగు పైత్తికరోగములన్నియు (అగ్నిగృహమునందలి నిప్పును దూరంబుచ్చినపుడు అట్టియగ్నిగృహమంతయు చల్లనగువిధమున) శాంతి నొందును.

## వింశతి కఫరోగములవివరణము.

మూ. శ్లేష్మవికారాంశ్చ వింశతిమత ఊర్ధ్వం వ్యాఖ్యాస్యామః. తద్యథా:—తృప్తిశ్చ, తంద్రా చ, నిద్రాయా ఆధిక్యం చ, స్తైమిత్యం చ, గురుగాత్రతాచ, ఆలస్యంచ, ముఖమాధుర్యంచ, ముఖస్రావశ్చ, శ్లేష్మోద్గిరణం చ, మలస్యాధిక్యం చ, బలాసకశ్చ, హృదయోపలేపశ్చ, కణ్ఠోపలేపశ్చ, ధమనీప్రతిచయశ్చ, గళగణ్డశ్చ, అతిస్థౌల్యం చ, శీతాగ్నితా చ, ఉదర్దశ్చ, శ్వేతావభాసతా చ, శ్వేతమూత్రనేత్రవర్చస్త్వం చ, ఇతి వింశతిశ్లేష్మవికారాః. శ్లేష్మవికారాణాం అపరిసంఖ్యేయానాం ఆవిష్కృతతమా వ్యాఖ్యాతాః. ౨౨

వ్యా. ఇరువది శ్లేష్మరోగములును ఈక్రిందవివరింపబడును:—తృప్తి (ఎప్పటికిని కడుపు నిండినట్లుండుట), కునికిపాటు, అతినిద్ర, స్తైమిత్యము (తడిగుడ్డ జుట్టినవిధముగ మొద్దుబారియుండుట), శరీరభారము, ఆలస్యము (పనులయందు సోమరితనము), నోరు తియ్యగనుండుట, నోట నీరుగారుట, నోట కఫముగారుట, మలము అధికమగుట, బలాసకము (అవయములు స్థూలముగ నుండుట), హృదయమున శ్లేష్మము చేరినట్లుండుట, కుత్తుకలో శ్లేష్మము చిక్కియుండుట, నాడులును ధమనులును లావుగను బరువుగనుండుట, గలగండిరోగము, మిక్కిలి స్థౌల్యము, అగ్నిమాంద్యము, ఉదర్దరోగము, శరీరమున తెల్లనిరంగుకల్గుట, మూత్రము నేత్రము మలము ఇవి తెల్లనగుట. ఈ యిరువదియు

శ్లేష్మరోగములు. శ్లేష్మరోగములు కూడ సంఖ్యాతీతములై యుండును. అయినను అందు ముఖ్యముగ స్పష్టముగ నగపడువ్యాధుల మాత్రము ఇచ్చట నిరువదియని పరిగణనము చేయబడియె.

## కఫస్వరూపలక్షణము, దానిగుణములు.

మూ. సర్వేష్వపి తు ఖల్వేతేషు శ్లేష్మవికారేషు అన్యేషు చానుక్తేషు శ్లేష్మణ ఇదమాత్మరూపమపరిణామి కర్మణశ్చ స్వలక్షణం. యదుపలభ్య తదవయవం వా విముక్తసందేహాః శ్లేష్మవికారమేవ అధ్యవస్యన్తి కుశలాః. తద్యథా:— స్నేహశైత్య శౌక్ల్యగౌరవ మాధుర్యమాత్స్నాన్యాని శ్లేష్మణ ఆత్మరూపాణి. ఏవంవిధత్వాచ్చ కర్మణః స్వాలక్షణ్య మిదమస్య భవతి. ౨౩

వ్యా. పైజెప్పినకఫరోగములయందును ఇచ్చట జెప్పబడని తక్కినకఫరోగముల అన్నిటియందును శ్లేష్మమునకు సంబంధించి కారణాంతరము నపేక్షింపక స్వాభావికమైన స్వరూపంబును, వికృతిజెందిన కఫముయొక్క కర్మలలక్షణంబున ఈక్రింద జెప్పంబడును. ఆట్టి కఫమునకు సంబంధించినస్వరూపలక్షణమును, వానికృత్యములను పూర్తిగనైనను కొన్నిటినైనను బుద్ధిమంతులగువైద్యులు గమనించినచో అయ్యది శ్లేష్మరోగమనియే నిశ్చయింపగలరు. అవి యెవ్వియన:— స్నేహము (జిడ్డుగా నుండుట) చల్లదనము, తెల్లగనుండుట, బరువుగనుండుట, తీపికల్గియుండుట, జిగటగయుండుట ఇవి శ్లేష్మము యొక్క స్వాభావికగుణములు. అట్టిగుణములు కల్గియుండుటవలన వానియొక్క కృత్యములను తదనుగుణముగ నుండును.

## కఫకృత్యములు.

మూ. తం తం శరీరావయవమావిశతః శ్వైత్యశైత్యకణ్డూస్థైర్య గౌరవస్నేహస్తంభసుప్తిక్లేదోపదేహాబన్ధమాధుర్యచిరకారిత్వాని శ్లేష్మణః కర్మాణి తైరన్వితం శ్లేష్మవికారమేవ అధ్యవస్యేత్. ౨౪

వ్యా. పైజెప్పబడినలక్షణములు గలకఫము ఆయాశరీరావయవములయందు వ్యాపించినచో నాయాస్థలములయందు నీక్రింద చెప్పబడుకృత్యముల జేయును.— తెల్లని రంగు, చల్లగనుండుట, దురద, మొద్దుబారియుండుట, బరువుగనుండుట, జిడ్డుగనుండుట,

స్పర్శము నెఱుంగక చచ్చుబారియుండుట, స్తంభించియుండుట, ఉబ్బినట్లు నీరుకారుట, కణుతులుకల్గుట, గ్రంథులు కల్గుట, నోట తీపికల్గుట, పనులయందాలస్యము, ఇవి యన్నియుం కఫము ప్రకుపితమైనచో సంభవించును. అట్టిలక్షణములనుబట్టి శ్లేష్మరోగ మని నిశ్చయింపదగును.

## కఫసామాన్యచికిత్స.

మూ. తం కటుకతిక్తకషాయతీక్ష్ణోష్ణరూక్షైరుపక్రమై రుపక్రమేత, స్వేదవమనశిరోవిరేచనవ్యాయామాదిభిః, శ్లేష్మహరైః మాత్రాం కాలం చ ప్రమాణీకృత్య; వమనం తు సర్వోపక్రమేభ్యః శ్లేష్మణి ప్రధానతమమ్ మన్యన్తే భిషజః. తద్ధ్యాదిత ఏవ ఆమాశయమనుప్రవిశ్య, కేవలం వైకారికం శ్లేష్మమూలమప కర్షతి. తత్రావజితే శ్లేష్మణ్యపి శరీరాన్తర్గతాః శ్లేష్మవికారాః ప్రశాన్తిమాపద్యన్తే. యథా భిన్నే కేదారసేతౌ శాలియవ షష్టికాదీని అనభిష్యన్దమానాని అంభసా ప్రశోషమాపద్యన్తే తద్వదితి. ౨౫

వ్యా. అట్టి కఫరోగమును కటు-తిక్త-కషాయరసంబులును, తీక్ష్ణ-ఉష్ణ-రూక్ష గుణంబులును కలఔషధములచే చికిత్స జేయవలెను. మరియుం స్వేదము, వమనము, శిరోవిరేచనము, దేహపరిశ్రమము మున్నగు కఫహరములైన చికిత్సలచేత దేశకాల మాత్రాదులప్రమాణము ననుసరించి తత్తదుచితముగ చికిత్స జేయవలెను. అట్టి చికిత్స లలో నన్నిటికంటె వమనరూపమైనచికిత్స శ్లేష్మమునకు ప్రధానమైనది. ఏలయన:— వమనౌషధము కఫమునకు ప్రధానస్థానమైన యామాశయమున తొలుతనే ప్రవేశించి కఫమును వికృతిజెందించుటకు మూలకారణమైన దోషమును వెడలించును. దానంజేసి కఫము శాంతినొందును. అట్టి యామాశయమునందలి శ్లేష్మము శాంతినొందినప్పుడు శరీ రాంతర్గతములగు కఫవ్యాధులన్నియు (చెరువుకట్ట తెగి నీరంతయుం బైటవెడలిపోయిన యెడ, అట్టి నీటి నాధారముగజేసి వృద్ధినొందుచుండు శాలిషష్టికయవాదిసస్యజాత మంతయుం తనకు వృద్ధికరమగు నీరులేమింజేసి తనంతనే యెండి నశించువిధముగ) తమం తటనే శమించును. కావున కఫహరములగు చికిత్సలలో వమనము మిక్కిలి ప్రధానతమ మని వైద్యవరులు చెప్పెదరు.

[త్రిదోషములవిషయమై యీనిర్ణయ మిచ్చుట నెఱుంగదగును:—లోకమునం గల స్థావరజంగమరూపములగు ప్రతిభావపదార్థమునకు ప్రధానముగ నొకవిధమైన

శక్తి కల్గియే యుండును. కేవలము జడమైన కాంతపురాయియందు ఆకర్షణశక్తి ప్రధానముగ నున్నదని మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము కదా. ఆవిధముగనే ప్రతిపదార్థమునందును ఏదో ఒకవిధమైనశక్తి తప్పక యుండును. అట్టిశక్తి ఆపదార్థముయొక్క వ్యాపారమునుబట్టి మనము గమనించెదము. కాని యొకరూపముతో మనకండ్లకు కగపడదు. అత్తెరంగుననే మనశరీరములయందు రౌక్ష్యలాఘవవైశద్యచలనాదుల గల్గించుశక్తి యొకటియు, వేడివర్ణము జీర్ణము మున్నగువాని గల్గించుశక్తియు, స్నేహశైత్యశుక్లవర్ణాదుల గల్గించుశక్తియు కలవు. ఈమూడిటికి ఘనరూపము లేదు. లేకున్నను వానివానికి నియమితములగు కృత్యములబట్టి యూహింపదగియున్న ఈ మూడుశక్తులనే ప్రాచీనఋషిపుంగవులు ఆయుర్వేదమునందు వ్యవహారమునకై వాతము, పిత్తము, కఫము నని సాంకేతికనామభేదములచే వ్యవహరించిరి. ఈమూడును సమస్థితి నున్నపుడు శరీరమును ధరింపజేయుటంజేసి ధాతువు లనియు, వికృతిజెందినపుడు రోగములచే శరీరమును చెరచుటంజేసి దోషములనియు చెప్పబడునని శాసించిరి. ఈమూడిటి స్వరూపలక్షణమును "రౌక్ష్యం లాఘవం......స్వాలక్షణ్య మిద మస్య భవతి" ఇత్యాదివాక్యములచే వేరువేరుగ వివరించి చెప్పిరి. వానివానిక్రియలబట్టి వానివాని స్వరూపమును నిర్ణయింపవలెను. అట్టి క్రియల చేయుటయే వానిలక్షణమని భావము. అయ్యవి వానిని వృద్ధినొందించుకారణములు తటస్థించినపుడు మిక్కిలి వృద్ధినొంది వాని కృత్యములను అధికముగ జేయును. కారణాంతరములచే క్షీణించినపుడు తమకృత్యముల మానును. వృద్ధిక్షయములు లేక సమస్థితి నున్నపుడు ఆరోగ్యమును కాపాడును. ఈ విషయమునే పలుదెరంగుల తంత్రకారు లుపదేశించియున్నారు. ఇదియే త్రిదోషముల వాస్తవ్యపరిస్థితి.

నవనాగరికులగు నిదానీంతనవైద్యనిపుణులు శరీరమునందుండుగాలి వాతమనియు, జీర్ణముకల్గించు యకృత్తులోని ద్రవరూపమైనపసరు పిత్తమనియు, పీనసాదులు సంభవించునపుడు కల్గునట్టిగిల్ల కఫమనియు చెప్పెదరు; కాని యిది చాల ప్రమాదజనితము. ఆంగ్లవైద్యమునం దారితేరి యాయుర్వేదమునందును పూర్ణప్రజ్ఞను సంపాదించిన పండితాగ్రగణ్యులగు వైద్యవరులును ఆయుర్వేదము ననుసరించి త్రిదోషములు అమూర్తములనియె సిద్ధాంతము చేసియున్నారు. కావున త్రిదోషములు మూర్తిమంతములని చెప్పుట చాల పొరబాటు.]

## రోగాదిపరిజ్ఞానము చికిత్సోపయోగ్య మనునిర్ణయము.

భవన్తి చాత్ర:—

మూ. రోగమాదౌ పరీక్షేత తతోఽనన్తరమౌషధమ్,
తతః కర్మ భిషక్పశ్చాత్ జ్ఞానపూర్వం సమాచరేత్. ౨౬

యస్తు రోగమవిజ్ఞాయ కర్మాణ్యారభతే భిషక్,
అప్యౌషధవిధానజ్ఞః తస్య సిద్ధిర్యదృచ్ఛయా ౨౭
యస్తు రోగవిశేషజ్ఞః సర్వభైషజ్యకోవిదః,
దేశకాలప్రమాణజ్ఞః తస్య సిద్ధిరసంశయః. ౨౮

వ్యా. శాస్త్రీయజ్ఞానము కలవైద్యవరుడు తొలుత రోగముల పరీక్షించి రోగ మియ్యది యని నిర్ణయించుకొనవలెను. పిమ్మట రోగమునకు దగినయౌషధ మియ్యది యని నిర్ణయించుకొని చికిత్స జేయవలెను. ఒకవేళ యౌషధప్రయోగానంతరము సంభవించు అయోగాతియోగమిథ్యాయోగాదులచే నుపద్రవములు కల్గినచో వానికి దగిన సదుపాయముల చక్కగ నెరింగి అట్టి జ్ఞానపూర్వకముగ చికిత్స జేయవలెను.

అటుగాక రోగస్వరూపలక్షణముల గమనించి నిర్ణయించుకొనక చికిత్స జేసినయెడ వానికి కర్మసిద్ధి ఘుణాక్షరన్యాయముగ నొకవేళ కల్గునేమోకాని, చికిత్సావిధానము మాత్రము వానికి దెలిసియున్నను కార్యసిద్ధి నిశ్చయముగ గల్గబోదు.

ఏవైద్యుడు రోగవిశేషముల జక్కగ దెలిసి, పలుదెరంగులైన యౌషధముల రస గుణవీర్యవిపాకాదుల జక్కగ నెరింగి, దేశకాలాదిపరిస్థితుల ప్రమాణముల బాగుగ నెరింగి పైజెప్పినరీతిగ తొలుత రోగముల నిర్ణయించి తత్తదనుగుణముగ నౌషధమును కల్పించి చికిత్సజేయగడంగునో, వానికి తప్పక కార్యసిద్ధి గల్గక తప్పదు.

## అధ్యాయవిషయసంగ్రహము.

మూ. తత్ర శ్లోకాః.—

సంగ్రహః ప్రకృతిర్దేశః వికారముఖమీరణమ్,
అసన్దేహోఽనుబన్ధశ్చ రోగాణాం సంప్రకాశితః. ౨౯
దోషస్థానాని రోగాణాం గణా నానాత్మజాశ్చ యే,
రూపం పృథక్త్వాద్దోషాణాం కర్మ చాపరిణామి యత్. ౩౦
పృథక్త్వేన తు దోషాణాం నిర్దిష్టాస్సముపక్రమాః,
సమ్యఙ్మహతి రోగాణాం అధ్యాయే తత్త్వదర్శినా. ౩౧
(జ్ఞానార్థం భిషజాం చైవ ప్రజానాం చ హితైషిణా)

వ్యా. రోగములసంగ్రహము, ప్రకృతి (ఆగంతు నిజరూపకారణభేదములు), మనశ్శరీరరూపములైన రోగాధిష్ఠానము (ఇదియే దేశము), నానావిధరోగములు, వాని అట్టి యాగంతునిజరోగములకు కారణములు (నిదానము), ఆగంతునిజరూపములగు నఖదశనపతనాదులకును త్రిదోషప్రకోపమునకు ప్రేరకములైన అసాత్మ్యేంద్రియార్థాది మూలకారణము, రోగసంసర్గమున నిశ్చయోపాయము, రోగముల కనుబంధ్యానుబంధ

భేదములు, వాతాది దోషములస్థానములు, వాత - పిత్త - కఫరోగముల గణములు, రోగముల నానాత్వము, వాత-పిత్త-కఫముల వేరువేరు స్వరూపలక్షణము, ఆయాదోష ములకు సంబంధించిన ప్రత్యేకకృత్యములు, వాతాదిదోషములకు వేరువేరు చికిత్సలు, అను నీవిషయముల నన్నింటిని యీమహారోగాధ్యాయమున తత్త్వజ్ఞానసంపన్నుడగు నగ్నివేశమహర్షి విపులముగ వివరించి చెప్పెను.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
మహారోగాధ్యాయో నామ వింశోఽధ్యాయః.
ఇతి రోగచతుష్కః

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును చరకమహర్షిచే సంస్కరింపబడినదియుం నగు నాయుర్వేదతంత్రమున శ్లోకస్థానమునందు మహారోగాధ్యాయమను నిరువదియవ యధ్యాయంబును, రోగచతుష్కంబును సమాప్తము.

ఇది రోగచతుష్కము.

---

## (యో జ నా చ తు ష్క ము)

### ఏకవింశాధ్యాయము.

అవతారిక:—పైజెప్పిన రోగచతుష్కమున రోగములు వివరింపబడినవి. అట్టి రోగములకు సంబంధించినయౌషధములు భేషజచతుష్కమున సామాన్యముగ జెప్ప బడినవి. అట్టిరోగములకును భేషజమునకు యుక్తియుక్తముగ పరస్పరసంబంధమును గమనించి కల్పించుటకుగాను యోజనాచతుష్కము ఈక్రింద జెప్పబడును. (యోజన మన భేషజమునకును రోగములకు వానివానిగుణాదుల పరిస్థితినిపట్టి తత్తదనుగుణముగ సంబంధమును గల్పించి యుక్తియుక్తముగ శరీరమునం దుపయోగించుట) అట్టి యోజ నము ముఖ్యముగ శరీరము నపేక్షించును కావున శరీరభేదముల దెల్పుటకై యష్టౌనింది తీయ మనునీయధ్యాయము చెప్పబడును:—

మూ. అథాతోఽష్టౌనిన్దితీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః ౨

వ్యా. మహారోగాధ్యాయమును జెప్పినపిదప అష్టౌనిందితీయ మనునధ్యాయ మును భగవత్స్వరూపుడగు నాత్రేయమహర్షి యుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము.

ఇచ్చట నిందితులగుపురుషులు ఎనిమిదివిధముల నుందురని చెప్పి అందు ముఖ్యలక్షణాదు లీయధ్యాయమున జెప్పబడును; కావున ఎనిమిదివిధములుగ నుండునిందితుల నధికరించి చెప్పునట్టియధ్యాయము అష్టౌనిందితీయమని యధ్యాయమునకు సంజ్ఞ నెరుంగునది.

అష్టవిధనిందితపురుషులు.

మూ. ఇహ ఖలు శరీరమధికృత్య అష్టౌ పురుషా నిన్దితాః. తద్యథా:—అతిదీర్ఘశ్చ, అతిహ్రస్వశ్చ, అతిలోమా చ, అలోమా చ, అతికృష్ణశ్చ, అతిగౌరశ్చ, అతిస్థూలశ్చ, అతికృశశ్చేతి. 3

వ్యా. శరీరపరిస్థితిభేదమునుబట్టి ఎనిమిదిభేదములు గలపురుషులు ఎనమండ్రు నిందితులని యిచ్చట నిర్దేశింపబడును. అది యెట్లులన:—మిక్కిలి దీర్ఘముగ నుండువాడును, మిక్కిలి పొట్టిగ నుండువాడును, శరీరముపై నధికముగ రోమములు కలవాడును, బొత్తుగ రోమములు లేనివాడును, మిక్కిలి నల్లనిశరీరము కలవాడును, మిక్కిలి గౌరవర్ణముకలవాడును, మిక్కిలి స్థూలమైన (బలిసిన) శరీరము కలవాడును, మిక్కిలి కృశించినశరీరము కలవాడును నైనపురుషులు ఎనమండ్రును నిందితులు.

ఇచ్చట నతిదీర్ఘాదిపురుషు లార్గురును లోకమున చూచువారలకు వికృతరూపముగ గనబడుదురు కావున లోకమున నిందితులగుదురు. (వారు నిందితులగుటకు వైరూప్యము కారణమని భావము) అతిస్థూల, అతికృశులు నిందితులగుటకు కారణము లీక్రింద వివరింపబడును. ప్రకృతమున నీస్థూలకృశుల నుద్దేశించియే చెప్పబడును. తక్కిన యార్గురినిగురించి చికిత్సావిషయముగ జెప్పవలసినవిశేషము లేకున్నను లోకమున నిందితులుగ నగపడుటచే సామాన్యముగ పరిగణనము చేయబడెను. చకారమువలన కుబ్జాదులను లోకమున నిందితులని యెరుంగునది.

అతిస్థూలకృశులకు విశేషదోషములు, అందు అతిస్థూలవిశేషదోషములు.

మూ. తత్రాతిస్థూలకృశయోః భూయ ఏవాఽపరే నిన్దితవిశేషా భవన్తి. అతిస్థూలస్య తావదాయుషో హ్రాసో, జరోపరోధః, కృచ్ఛ్రవ్యవాయతా, దౌర్గన్ధ్యం, దౌర్బల్యం, స్వేదాబాధః, క్షుదతిమాత్రం, పిపాసాఽతియోగశ్చేతి భవన్త్యష్టౌ దోషాః. ౪

వ్యా. పైజెప్పిన యెనిమిదివిధములైన పురుషులలో నతిస్థూలునకును అతికృశునకును వికృతరూప మొక్కటియేకాక మరికొన్ని నిందితవిశేషములు కలవు. అవి యెవ్వి

యన:—మిక్కిలి స్థూలమైనశరీరము కలమనుజునకు నాయుంవు తగ్గును. ముసలితనము శీఘ్రముగ నావరించును. సంభోగకృత్యముజేయ మిక్కిలి కష్టముగ నుండును. శరీరమున దుర్గంధము కల్గును. మిక్కుటముగ చెమటపట్టును. ఆకలి మిక్కిలి యధికమగును. దప్పియుం మితిమీరి కల్గును. ఈయెనిమిదివిధములైనదోషములు తక్కినదీర్ఘాదిపురుషులార్గురికంటె స్థూలునకు అధికదోషములై యుండును.

## అతిస్థౌల్యకారణములు.

మూ॥ తదతిస్థౌల్యమతిసంపూర్ణాత్, గురుమధురశీతస్నిగ్ధోపయోగాత్, అవ్యాయామాత్, అవ్యవాయాత్, దివాస్వప్నాత్, హర్షనిత్యత్వాత్, అచిన్తనాత్, బీజస్వభావాచ్చోపజాయతే.

వ్యా॥ మనుజులు మిక్కుటముగ భోజనముచేయుట, గురుమధురశీతస్నిగ్ధములైన యాహారముల నుపయోగించుట, దేహపరిశ్రమము జేయకుండుట, పగటిపూట నిదురించుట, ఎల్లప్పుడును సంతోషము అధికముగ నుండుట, చింతనరూపమైె మనోవ్యాపారము బొత్తుగ లేకుండుట, తన యుత్పత్తికి ప్రధానకారణమైన తలిదండ్రుల శుక్రశోణితరూపమైన బీజస్వభావము అను నీకారణములవలన శరీరము మిక్కిలి స్థూలమగును.

## స్థూలశరీరునకు ఆయుర్హ్రాసాదులకు కారణములు.

మూ॥ తస్య హి అతిమాత్రం మేదస్వినో మేద ఏవోపచీయతే, న తథేతరే ధాతవః. తస్మాదస్యాయుషో హ్రాసశ్శైథిల్యాత్. సౌకుమార్యాద్గురుత్వాచ్చ మేదసో జరోపరోధః. శుక్రాబహుత్వాత్ మేదసావృతమార్గత్వాత్ కృచ్ఛ్రివ్యవాయతా. దౌర్బల్యమసమత్వాద్ధాతూనామ్. దౌర్గన్ధ్యం మేదోదోషాత్ మేదసస్స్వభావాత్ స్వేదలత్వాచ్చ. మేదసః శ్లేష్మసంసర్గాత్ విష్యన్దిత్వాత్ గురుత్వాత్, వ్యాయామాఽసహత్వాచ్చ స్వేదాబాధః. తీక్ష్ణాగ్నిత్వాత్ ప్రభూతకోష్ఠవాయుత్వాచ్చక్షుదతిమాత్రశ్చ పిపాసాతియోగశ్చ. ౬

వ్యా॥ పైజెప్పినవిధముగ స్థూలమైనశరీరము కలవానికి సాధారణమైన యాహారముచేతనే మేదస్సు శరీరమున వ్యాపించి నానాట నదియే వృద్ధినొందును; గాని తక్కిన రసాదిధాతువులు మేదస్సుచే తిరస్కరింపబడి వృద్ధిజెందక కృశించుచునే యుండును. మేదస్సు ఒక్కటిదక్క తక్కినధాతువులన్నియు వృద్ధినొందక శిథిలములగుటవలన

నాయువు తక్కువ యగును. శరీరము సుకుమారముగ నుండుటవలనను మేదోవృద్ధిచే బరువుగ నుండుటవలనను ముసలితనము శీఘ్రముగ వ్యాపించును. శుక్రము మిక్కిలి తక్కువయగుటవలనను శుక్రము పుట్టుమార్గములు మేదస్సుచే నావరింపబడుటవలనను సంభోగేచ్ఛ మిక్కిలి తక్కువయై అట్టికృత్యమున మిక్కిలి కష్టముగ నుండును. మేదస్సువలె తక్కినధాతువులు (రసరక్తాదులు) వృద్ధినొందకుండుటవలన శరీరమువందు చాల బలహీనత కల్గును. మేదోదోషమువలనను, మేదస్సు ఆగంధము కల్గినదగుటచేతను, చెమట యధికముగ గల్గుటచేతను శరీరమున దుర్గంధము పుట్టును. మేదస్సు శ్లేష్మముతో కూడియుండుటవలనను, అయ్యది స్రవించుస్వభావముకల్గినది యగుటవలనను, బరువుగ నుండుటవలనను, దేహపరిశ్రమమున కోరువజాలకుండుటవలనను, చెమట యధికముగ వెడలును. మిక్కిలి తీక్ష్ణస్వభావమగుటవలనను, కోష్ఠమున వాత మధికముగ నుండుట చేతను ఆకలియు దప్పియు మిక్కిలి యధికమగును.

### మేదోవృద్ధివలన గల్గునుపద్రవములు.

మూ. భవన్తి చాత్ర:—

మేదసావృతమార్గత్వాత్ వాయుః కోష్ఠే విశేషతః,
చరన్ సన్ధుక్షయత్యగ్నిం ఆహారం శోషయత్యపి.　　౭
తస్మాత్స శీఘ్రం జరయత్యాహారం చాతికాంక్షతి,
వికారాంశ్చాశ్నుతే ఘోరాన్ కాంశ్చిత్ కాలవ్యతిక్రమాత్.

వ్యా. పైజెప్పినరీతిగ వృద్ధినొందిన మేదస్సు వాతము సంచరించుమార్గముల నడ్డగించును. దానంజేసి వాతము స్వేచ్ఛగ సంచరింప వలనుపడక కోష్ఠమునందే విశేషముగ సంచరించుచు జఠరాగ్నిని విశేషముగ ప్రజ్వలింపజేయును. భుజింపబడినయాహారము నందలి ద్రవభాగమును శోషింపజేయును. కావున మేదోవృద్ధికలమనుజుడు భుజింపబడిన యాహారమును శీఘ్రముగ జీర్ణింపజేసికొని (తీవ్రమైన యాకలికలవాడై) మరల నాహారమును అధికముగ కోరుచుండును. అట్టికాలమున తగినయాహారమును భుజింపక కాలము గడచినచో దానంజేసి కొన్నిరోగములు సంభవించును.

### మేదోవృద్ధిచే నాయువు నశించుటకు కారణములు.

మూ. ఏతావుపద్రవకరౌ విశేషాదగ్నిమారుతౌ,
ఏతౌ హి దహతస్థూలం వనదావో వనం యథా.　　౯
మేదస్యతీవ సంవృద్ధే సహసైవానిలాదయః,
వికారాన్ దారుణాన్ కృత్వా నాశయన్త్యాశు జీవితమ్.　　౧౦

వ్యా. (శరీరమునందలి వాతము మితముగ సంచరించుచున్నచో జఠరాగ్నిని మితముగ రగులంజేయును. దానంజేసి జాఠరాగ్ని సమస్థితినుండి స్వకృత్యమును వ్యత్యస్తము లేక చేయుచు శరీరమును పోషించును. అటుగాక పైజెప్పినరీతి వాతసంచారమార్గమును వృద్ధిజెందినమేదస్సు నిరోధించిన మిక్కిలి వృద్ధివెడల తెరవుగానక కోష్ఠమునందే యడగి జాఠరానలమును మిక్కిలి దీపింపజేయును. దానంజేసి యగ్ని విషమస్థితి నందును.)

అత్తెరంగున యుంత్కటములైన వాతంబును జాఠరానలంబును అనేకోపద్రవములు గల్గించి (వనమునబుట్టిన, కారుచిచ్చువృద్ధినొంది వనమునెల్ల కాల్చి రూపుమాపువిధముగ) ధ్వంసముచేయును. మరియు మేదస్సు స్వప్రమాణమునకన్న నధికముగ వృద్ధినొందిననాడు వాతపిత్తకఫములు అతిశీఘ్రముగ వృద్ధినొంది మిక్కిలి క్రూరములగు ప్రమేహపిడక, జ్వరము, భగందరము, విద్రధి, వాతరోగము అనునీవ్యాధులలో నొకదానిని కల్గించి జీవితమును అతిశీఘ్రముగ నశింపజేయును.

### స్థూలలక్షణము.

మూ. మేదోమాంసాతివృద్ధత్వాత్ చలస్ఫిగుదరస్తనః,
అయథోపచయోత్సాహః నరోఽతిస్థూల ఉచ్యతే. ౧౧

వ్యా. పైజెప్పినరీతిగ మేదస్సును మాంసంబును అధికముగ వృద్ధినొందుటవలన పిరుదులును ఉదరంబును స్తనంబులును మిక్కిలి బలిసి కదులుచుండును. అత్తెరంగున శరీరము బలిసి వృద్ధినొందియు నందుకు తగినయుత్సాహములేక (అలసుడై) యుండును. అట్టిలక్షణములు కలవాడు స్థూలుడని చెప్పబడును.

మూ. ఇతి మేదస్వినో దోషాః హేతవో రూపమేవ చ,
నిర్దిష్టం; వక్ష్యతే వాచ్యం అతికార్శ్యేఽప్యతః పరమ్. ౧౨

వ్యా. ఇత్తెరంగున మేదోవృద్ధికలవానికిం గల్గుదోషంబులును, మేదోవృద్ధికారణంబులును, మేదస్విలక్షణంబును చెప్పబడినవి. పిమ్మట అతికార్శ్యవిషయము నుద్దేశించియు దోషమును దానికారణాదులును ఈక్రింద వివరింపబడును.

### కార్శ్యము కల్గుటకు కారణములు.

మూ. సేవా రూక్షాన్నపానానాం లఙ్ఘనం ప్రమితాశనమ్,
క్రియాతియోగాః శోకశ్చ వేగనిద్రావినిగ్రహాః ౧౩
రూక్షస్యోద్వర్తనస్నానస్యాఽభ్యాసః ప్రకృతిర్జరా,
వికారానుశయః క్రోధః కుర్వన్త్యతికృశం నరమ్. ౧౪

వ్యా. జిడ్డు లేక మిక్కిలి రూక్షములైన యన్నపానముల సేవించుట, లంకణ ముండుట, తాను భుజింపదగిన పరిమితికన్న మిక్కిలి తక్కువగ భుజించుట, వమన విరేచనాదుల యతియోగము కల్గుట, మలమూత్రాదివేగములను నిద్రను నిరోధించుట, రూక్షములగు నలుగుపిండి మున్నగువానిచే నలుగు పెట్టికొనుట, రూక్షములైన ద్రవ్యములచే స్నానముచేయుట, బీజ (శనకుత్పత్తికారణమైన తలిదండ్రులశుక్లార్తవముల) దోషము, ముసలితనము, జ్వరాదిరోగములు అనుసరించియుండుట, క్రోధము, ఇవి యన్నియు మనుజుని మిక్కిలి కృశింపజేయును. (ఈకారణములు వేరువేరుగనైనను కొన్నియైనను తటస్థించినపుడు మనుజుడు కృశించునని భావము).

## కృశతదోషములు.

మూ. వ్యాయామమతిసౌహిత్యం క్షుత్పిపాసా మహౌషధమ్,
కృశో న సహతే తద్వదతిశీతోష్ణమైథునమ్. ౧౫

వ్యా. దేహపరిశ్రమము, అధికాహారము, ఆకలి, దప్పి, తీవ్రమైనయౌషధము, వీనిని కృశించినమనుజు డోరువజాలడు. మరియు మిక్కిలి చల్లదనమును, ఉష్ణమును సహింపనేరడు. సంభోగమును జేయజాలడు.

## కృశునకు ప్రాయికముగ సంభవించురోగములు.

మూ. ప్లీహా కాసః క్షయశ్శ్వాసః గుల్మార్శాంస్యుదరాణి చ,
కృశం ప్రాయోఽభిధావన్తి రోగాశ్చ గ్రహణీగతాః. ౧౬

వ్యా. ప్లీహవృద్ధి, దగ్గు, క్షయము, శ్వాసము, గుల్మము, అర్శస్సు, ఉదరములు, గ్రహణిదోషమున గల్గురోగములు ఇవియన్నియు కృశించినవానిని ప్రాయికముగ సమయముచేచి బాధింప గనిపెట్టియే యుండును.

## కృశలక్షణము.

మూ. శుష్కస్ఫిగుదరగ్రీవః ధమనీజాలసన్తతః,
త్వగస్థిశేషోఽతికృశః స్థూలపర్వా నరో మతః. ౧౭

వ్యా. మిక్కిలి కృశించినమనుజుడు పిరుదులును ఉదరంబును కంఠంబును మిక్కిలి శుష్కించి, శరీరమునందెల్ల నరములు వ్యాపించి, శరీరమునందలి రక్తమాంసాదులు శోషించుటంజేసి చర్మంబును ఎముకలును మాత్రము మిగిలి కీళ్లు గణుపులు మాత్రము స్థూలములై కనబడును. (ఈలక్షణములుకలవాడు కృశుడని యెరుగనగును).

## స్థౌల్యకార్శ్యతారతమ్యము.

మూ. సతతవ్యాధితావేతౌ అతిస్థూలకృశౌ నరౌ,
సతతం చోపచర్యౌ హి కర్షణైర్బృంహణైరపి. ౧౮

స్థౌల్యకార్శ్యే వరం కార్శ్యం సమోపకరణౌ హి తౌ,
యద్యుభౌ వ్యాధిరాగచ్ఛేత్ స్థూలమేవాతిపీడయేత్. ౧౮

వ్యా. పైజెప్పిన యతిస్థూలుడును అతికృశుడును ఎల్లప్పుడును రోగగ్రస్తులనియే చెప్పదగుదురు. అట్టివారికి అతిస్థూలునకు కర్షణ (శరీరము కృశింపజేయు) ములగు నౌషధాహారాదులచేతను, అతికృశునకు బృంహణములగు (శరీరమును బలియుజేయు) నౌషధాదులచేతను నిరంతర ముపచరించుచుండవలెను. స్థౌల్యంబును కార్శ్యంబును చికిత్సార్హంబు లగుటంజేసి సమానములుగనే యుండును. అయినను ఆరెండిటిలో కార్శ్యము కొంచెము శ్రేష్ఠముగ నుండును. మనుజులకు స్థూలత్వమైనను కృశత్వమైనను తటస్థించినచో స్థూలత్వమే అధికముగ బాధించును.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—శరీరము స్థూలముగ నుండునపుడు అట్టి స్థౌల్యమునకు వ్యాధి విపరీతముగ శరీరమును కృశతనొందించు అపతర్పణచికిత్స జేయవలెను. అట్టి స్థూలునకు జఠరాగ్ని మిక్కిలి తీవ్రముగ నుండును కావున అపతర్పణములు (పుష్టికరములుకాని) యాహారాదులచేత దౌర్బల్యము మిక్కుటమై యనర్థదాయకమగును కావున నపతర్పణము సమంజసము కాదు. అగ్ని ననుసరించి తదనుగుణముగ సంతర్పణములైన (పుష్టికరములగు నాహారాదుల) విధానముల జేసినచో స్థౌల్యమధికమగును. కావున స్థౌల్యచికిత్స విషమస్థితి నుండును. కావున నియ్యది మిక్కిలి బాధాకరము. కృశత్వమునందు సంతర్పణరూపమైన చికిత్స యుక్తియుక్తముగ వ్యాధి విపరీతమై చేయదగియుండును. కావున స్థౌల్యమునకన్న కార్శ్యము కొంచెము యుక్తమైనదని భావము.

## నిర్దుష్టపురుషలక్షణము.

మూ. సమమాంసప్రమాణస్తు సమసంహననో నరః,
దృఢేన్ద్రియత్వాద్వ్యాధీనాం న బలేనాభిభూయతే. ౨౦
క్షుత్పిపాసాతపసహః శీతవ్యాయామసంసహః,
సమపక్తా సమజరః సమమాంసచయో మతః. ౨౧

వ్యా. శరీరము అతిస్థూలంబును కృశంబునుగాక సమమైన పరిమాణము కల్గియుండునట్లు వృద్ధిజెందినవాడును, కరచరణాద్యవయవములు న్యూనాతిరేకములేక సమస్థితిగ నొండొంట గలిసియున్నవాడును నగుమనుజుడు చక్షురాదీంద్రియములు దృఢములై స్వవ్యాపారముల జక్కగ నెరవేర్చుకొనుచుండును; కావున నట్టిమనుజుడు వ్యాధులబలముచేత బాధింపబడడు. మరియు నట్టిమనుజుడు ఆకలిదప్పులను ఎండతాకుడు

ఓరువగల్గియుండును. శీతోష్ణములను దేహపరిశ్రమమును ఓరువజాలియుండును. వానికి కాయాగ్ని న్యూనాతిరేకములేక సమస్థితి నుండుటంజేసి యాహారమును సమముగ జీర్ణింపజేయును. ఆకాలమున ముసలితనము కల్గదు. (ఇచ్చట 'సంహనన' అనుపదమునకు "సంహన్యన్తే (సంబధ్యన్తే) అంగాన్యత్రేతి—సంహననం" అనువ్యుత్పత్తిచేత శరీరావయవములన్నియు వానివానికి నియతమగుప్రమాణము ననుసరించి యొండొంట కలిసియుండుట యని యర్థము.)

### స్థూలకృశులకు దగినచికిత్సాదివిధానము.

మూ. గురు చాతర్పణం శ్రేష్ఠం స్థూలానాం కర్షణం ప్రతి,
కృశానాం బృంహణార్థం చ లఘు సన్తర్పణం చ యత్. ౨౨
వాతఘ్నాన్యన్నపానాని శ్లేష్మమేదోహరాణి చ,
రూక్షోష్ణా వస్తయస్తీక్ష్ణాః రూక్షాణ్యుద్వర్తనాని చ. ౨౩

వ్యా. స్థూలశరీరులకు కర్షణమున (స్థూలత్వమును తగ్గించుట) కై గురుత్వముకల్గి మిక్కిలి తృప్తిని (మాంసాదిధాతువృద్ధిని) కల్గించని తేనె మున్నగువానిని, యుపయోగింపదగును. కృశించినవారికి బృంహణమున (శరీరము బలియుట)కు లఘుగుణముకల్గి సంతర్పణ (మాంసాదిధాతువృద్ధికర) మైన యాహారాదుల జేయనగును.

మరియు వాతహరంబులును, కఫమును మేదస్సును హరించునవియు నగు నన్నపానంబులును, రూక్షోష్ణగుణములు కలవస్తువులును, తీక్ష్ణంబులును రూక్షంబులును నగు నుద్వర్తనంబులును స్థూలుల కుపయోగింపనగును.

ఇచ్చట తేనె గురుత్వముకల్గియుండుటచే జఠరాగ్నిని శమింపజేయును. కర్షణస్వభావము కల్గియుండుటంజేసి మేదస్సు హరించును కావున స్థూలకు జఠరాగ్ని వైపరీత్యము కల్గించక మేదస్సును హరించును; కావున నియ్యది యోగ్యముగ నుండును. ఇత్తెరంగున నపతర్పణ స్వభావముకలకొఱ్ఱలు మున్నగువానికి సంస్కారాది విశేషములచే గురుత్వమును కల్గించి యుపయోగింపదగును.

### స్థౌల్యహరయోగములు.

మూ. గుడూచీభద్రముస్తానాం ప్రయోగస్త్రైఫలస్తథా,
తక్రారిష్టప్రయోగస్తు ప్రయోగో మాక్షికస్య చ. ౨౪
విడఙ్గం నాగరం క్షారం కాలలోహరజో మధు,
యవామలకచూర్ణం చ ప్రయోగశ్శ్రేష్ఠ ఉచ్యతే. ౨౫

వ్యా తిప్పతీగె, భద్రములు, త్రిఫలములు, వీని చేర్చి స్థూలుల కుపయోగింప నగును. తక్రమును అరిష్టములను తేనెను చేర్చి ఉపయోగింపనగును. మరియు.వాయు విడంగములు, శుంఠి, యవక్షారము, ఉక్కురాపొడి, తేనె వీనిని ఒకటిగ జేర్చి యుప యోగింపనగును. యవలను ఉసిరిక యొలుపుచూర్ణమును ఉపయోగింపనగును. ఇవి యన్నియు స్థూలత్వము హరించుటకై యుపయోగించుటకు మిక్కిలి శ్రేష్ఠములని భావము.

మూ. బిల్వాదిపఞ్చమూలస్య ప్రయోగః క్షౌద్రసంయుతః,
శిలాజతుప్రయోగస్తు సాగ్నిమన్థరసః పరః. ౨౬

వ్యా. మరియు బిల్వాది పంచమూలములను (మారేడు, కూరనెల్లి, దుండిలము, నేలగుమ్మడు, కలిగొట్టు ఇవి పంచమూలములు) తేనెతో కలిపి యుంపయోగించినయెడల మిగుల శ్రేష్ఠముగ నుండును. శిలాజతువును తెనెతోను కూరనెల్లిరసమునను జేర్చి యుంప యోగించుటయు ప్రశస్తము.

తేనె "నానాద్రవ్యాత్మకత్వాచ్చ యోగవాహి పరం మధు" అను ప్రమాణము చేత నానాద్రవ్యాత్మకమగుటచే యోగవాహిగుణము కల్గియుండును కావున నేవస్తు వుతో జేర్పబడునో ఆట్టిగుణము కల్గియుండును. కూరనెల్లిరసము పంచమూలములు మున్నగువానితో చేరినప్పుడు అట్టిద్రవ్యములకుంగల కర్షణశక్తి కల్గియుండును. దానంజేసి మేదస్సును హరించును. యోగవాహి యన ఏవస్తువుతో జేరినప్పుడు ఆద్రవ మునకుం గలశక్తి కల్గియుండుట. తేనె నానావిధములైన పుష్పములనుండి మక రందమునెల్ల తుమ్మెదలు ఒక్కచోట జేర్చిన ద్రవము కావున నానాత్మకమని యెరుం గునది.

### స్థౌలహరభోజనము, అనుపానములు.

మూ ప్రశాతికా ప్రియఙ్గుశ్చ శ్యామాకా యవకా యవాః,
జూర్ణాహ్వాః కోద్రవా ముద్గాః కుళుత్థాశ్చక్రముద్గకాః. ౨౭
ఆఢకీనాం చ బీజాని పటోలామలకైస్సహా,
భోజనార్థం ప్రయోజ్యాని, పానం చాను మధూదకమ్. ౨౮
అరిష్టాంశ్చానుపానార్థే మేదోమాంసకఫాపహాన్,
అతిస్థౌల్యవినాశాయ సంవిభజ్య ప్రయోజయేత్. ౨౯

వ్యా. ప్రశాటిక యనుధాన్యవిశేషము (దీనిని గుఘగుబియ్యమని చెప్పెదరు). కొఱ్ఱలు, చామలు, సన్ననియవలు, యవలు, జొన్నలు, ఆరుకలు, పెసలు, ఉలవలు, చక్రముద్గకములు (పిచ్చపెసలు) అను నీధాన్యములచే సిద్ధమైనయన్నంబును, కందులు, పొట్లకాయ, ఉసిరికకాయలు అనువానిచే సిద్ధముచేయబడిన వ్యంజనములతోఁగూర్చి భోజనమునకై యుపయోగింపనగును.

మరియు తేనెతోఁ జేర్పబడినజలము, ద్రాక్షారిష్టము మున్నగుద్రవములు, ఇతరము లగు మేదోమాంసహారములైన ద్రవములు మున్నగువానిని త్రాగుట కుపయోగింపనగు. (ఇవి స్థౌల్యమును హరించునన్నపానములు) పైజెప్పినవానిని ఆయాప్రకృత్యాదుల ననుసరించి విభజించి యథాయోగ్యముగ నుపయోగింపనగునని భావము.

## స్థౌల్యహరవిహారములు.

మూ. ప్రజాగరం వ్యవాయం చ వ్యాయామం చింతనాని చ,
స్థౌల్యమిచ్ఛన్ పరిత్యక్తుం క్రమేణాభిప్రవర్ధయేత్. 30

వ్యా. నిదురమేల్కొంచియుండుట, సంభోగముచేయుట, దేహపరిశ్రమము జేయుట, చింతనారూపమైన మనోవ్యాయామముజేయుట ఈవ్యాపారములను స్థౌల్యమును పోఁగొట్టదలచినవారు నానాట నలవాటుచేసి వృద్ధినొందించవలెను. (ఇవి స్థౌల్యమును హరించునని భావము).

## కృశత్వమును హరించునాహారవిహారాదులు.

మూ. స్వప్నో హర్షః సుఖా శయ్యా మనసో నిర్వృతిః శమః,
చింతావ్యవాయవ్యాయామవిరామః (విరతిః) ప్రియదర్శనమ్.
నవాన్నాని నవం మద్యం గ్రామ్యానూపౌదకా రసాః,
సంస్కృతాని చ మాంసాని దధిసర్పిః పయాంసి చ. 3౨
ఇక్షవశ్శాలయో మాషాః గోధూమా గుడవైకృతమ్,
వస్తయః స్నిగ్ధమధురాః తైలాభ్యఙ్గశ్చ సర్వదా. 33
స్నిగ్ధముద్వర్తనం స్నానం గంధమాల్యనిషేవణమ్,
శుక్లవాసో యథాకాలం దోషాణామవసేచనమ్ 3౪
రసాయనానాం వృష్యాణాం యోగానాముపసేవనమ్,
హత్వాఽతికార్శ్యమాదత్తే నృణాముపచయం పరమ్. 3౫

అచింతనాచ్చ కార్యాణాం ధ్రువం సంతర్పణేన చ,
స్వప్నప్రసంగాచ్చ నరో వరాహ ఇవ పుష్యతి. 38

వ్యా. విశేషముగ నిదురించుట, సంతోషము, సుఖకరములగు పరపు మొదలైన వానిపై బరుండుట, మనస్సుకు చింతలేక నిశ్చలముగ నుండుట, ఇంద్రియముల లంపట లేక మనస్సు శమించియుండుటను. చింతను సంభోగమును దేహపరిశ్రమమును మాని యుండుట, మనసు కింపైనవస్తువుల జూచుట, క్రొత్తబియ్యపుటన్నమును భుజించుట, నూతనమైనమద్యమును త్రాగుట, గ్రామముల నివసించుజంతువులయొక్కయు జలప్రాంతము నందలి జంతువులయొక్కయు జలమున నుండుమత్స్యాదిజంతువులయొక్కయు మాంస రసము నుపయోగించుట, సంస్కరించి పక్వముచేయబడిన మాంసములు, పెరుగు, నెయ్యి, పాలు, చెరకు, రాజనములు, ఉద్దులు, గోధుమములను బెల్లమునుజేర్చి చేయు బడినవస్తువులు ఇట్టియాహారపదార్థముల నుపయోగించుట, స్నిగ్ధంబులును మధురం బులు నైనయౌషధములతో వస్తికర్మను జేసికొనుట, ఎల్లప్పుడును తైలముచే నభ్యంగ నముజేసికొనుట, స్నిగ్ధము (నూనెతో గూడిన) నలుగుపిండిచే మర్దనముజేసి స్నానము జేయుట, చందనమును పుష్పమాలికలను ధరించుట, తెల్లనిబట్టల ధరించుట, నియమిత కాలమునందు విధ్యనుసారముగ దోషముల కనుగుణముగ వమనవిరేచనాదులజేసి దోష ముల వెడలించుట, వృష్యములగు నౌషధములను రసాయనౌషధములను సేవించుట, ఇవి యన్నియు మిక్కిలి కార్శ్యమును పోగొట్టి మనుజులకు రసాదిధాతువుల వృద్ధినొం దించి బలియజేయును. మరియు మిక్కిలి కష్టసాధ్యములగు కార్యములవిషయమై సాధక బాధకాదియుక్తుల మనస్సుచేచింతింపకుండుట, సంతర్పణములగు నాహారాదులసేవించుట' అధికముగ నిద్రపోవుట ఈకృత్యముల నియతముగ జేయుచుండుమానవుడు పందివలె బలిసి పుష్టికల్గియుండును.

నిద్రాస్వరూపము.

మూ. యదా తు మనసి క్లాంతే కర్మాత్మానః క్లమాన్వితాః,
విషయేభ్యో నివర్తంతే తదా స్వపితి మానవః. 39

వ్యా. మనస్సు మిక్కిలి బడలికజెందినపుడు, అట్టిమనస్సుచే ప్రేరితములైన యింద్రియములు తమతమవిషయముల బ్రవర్తించి దర్శనాదిస్వకృత్యముల నెరవేర్చు చుండి దానివలన మిక్కిలి యలసియున్నపుడు ఇంద్రియములు తమవిషయములనుండి మరలి స్వకృత్యముల మాని మనస్సునందే లీనములగును. అట్టియెడ మానవుడు వ్యాపార ముల (కాయికమానసికచేష్టల)విరమించి యేకాంతముగనుండును. అదియే స్వప్నమనియు నిదురయనియు చెప్పబడును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది.—జాగ్రదవస్థయందు జీరరూపమైన యాత్మ యేదైన నొకకార్యముజేయ సంకల్పించును. అప్పుడు మనస్సు ఆత్మనుండి వెలువడి బుద్ధితో గలిసి తనకు చింత్యరూపమైన విషయమునకనువుగ చింతనారూపమైన వ్యాపారము కల్గియుండును. సాధింపదగిన కార్యానుసారముగ చక్షురాదీంద్రియముల ప్రేరేపించును. మనస్సుచే ప్రేరితములైన యాయింద్రియములు తమతమ విషయములగు రూపాదులను గ్రహించుచు నాయాకృత్యముల నెరవేర్చుచుండును. ఇత్తెరంగున లోకవ్యవహారముల నిగ్రహించుతరి చక్షురాదీంద్రియములును మనస్సును చాల బడలికజెందును. మనస్సు బడలినప్పుడు ఇంద్రియముల ప్రేరింపక యుండుగును. అప్పుడు చక్షురాదీంద్రియములను స్వకృత్యముల నెరవేర్చుచు బడలియుండుటంజేసి తమవిషయములనుండి మరలి మనస్సున లీనములగును. అయ్యదియు నాత్మయందు లీనమగును. అట్టియాత్మ యేకాకారమై కృత్యముల నన్నిటిని మాని యానందరూపమైన సుఖము ననుభవించును. అట్టి యవస్థయే స్వప్నమనియు నిద్రయనియు జెప్పబడును. ఈవిషయమునే "ఆత్మా మనసా సంయుజ్యతే, మన ఇంద్రియేణ, ఇంద్రియమర్థేన తతః ప్రత్యక్షం" అనువాక్యముచేత ప్రాచీనులు నుడివిరి.

### నిద్రవలన కల్గు సుఖాసుఖములు.

మూ. నిద్రాయత్తం సుఖం దుఃఖం పుష్టిః కార్శ్యం బలాబలం,
వృషతా క్లీబతా జ్ఞానం అజ్ఞానం జీవితం న చ. ౩౭
అకాలేఽతిప్రసంగాచ్చ న చ నిద్రా నిషేవితా,
సుఖాయుషీ పరా కుర్యాత్ కాళరాత్రిరివాపరా. ౩౯
సైవ యుక్తా పునర్యుఙ్క్తే నిద్రా దేహం సుఖాయుషా,
పురుషం యోగినం సిద్ధ్యా సత్యా బుద్ధిరివాగతా. ౪౦

వ్యా. శరీరమునకును మనస్సునకును సంబంధించినసుఖంబును, దుఃఖంబును, పుష్టియు, కృశత్వంబును, బలంబును, బలహీనతయు, పుంస్త్వంబును, నపుంసకత్వంబును, తెలివియు, అజ్ఞానంబును, జీవితంబును, మరణంబును ఇవియన్నియు నిద్రకు అధీనములై యుండును.

అందు అకాలమున నిద్రించినను, అధికముగ నిద్రించినను, బొత్తుగ నిదురమానినను, అట్టినిద్ర రెండవదియగు ప్రళయకాలరాత్రివలె, శరీరసుఖమును ఆయువును ధ్వంసముచేయును.

మరియు నట్టినిదుర యుక్తమైనకాలమున విధ్యుక్తముగ సేవింపబడినయెడ దేహమునకు సుఖమును కల్గించి యాయువును వృద్ధినొందించును. తపస్సిద్ధుడైన యోగికి తత్త్వజ్ఞానము అనశ్వరమై యానందరూపమైన సుఖమును ఉత్పత్తినాశములేని పరమాయువ్యమును కల్గించువిధముగ యథోక్తముగ ననుభవింపబడిన నిద్రయు మనుజునకు సౌఖ్యమును ఆయుర్వృద్ధిని కల్గించునని భావము. (ఇచ్చట నిద్ర మిథ్యాయోగాఽయోగాతియోగములం జేసీ యనర్థదాయకమై యాయురారోగ్యముల జెరచుననియుం, సమ్యగ్యోగమున సుఖకరమగుననియుం పైశ్లోకముల రెంటిచే జెప్పబడినది.)

## పగటినిద్రకర్హులు.

మూ. గీతాధ్యయనమద్యస్త్రీకర్మభారాధ్వకర్శితాః,
అజీర్ణినః క్షతాః క్షీణాః వృద్ధా బాలా స్తథాఽబలాః ౪౧
తృష్ణాతీసారశూలార్తాః శ్వాసినః హిక్కినః కృశాః,
పతితాఽభిహతోన్మత్తాః క్లాన్తా యానప్రజాగరైః. ౪౨
క్రోధశోకభయక్లాన్తాః దివాస్వప్నోచితాశ్చ యే,
సర్వ ఏతే దివాస్వప్నం సేవేరన్ సార్వకాలికమ్. ౪౩
ధాతుసామ్యం తథా హ్యేషాం బలం చాప్యుపజాయతే,
శ్లేష్మా పుష్ణాతి చాంగాని స్థైర్యం భవతి చాయుషః. ౪౪

వ్యా. సంగీతము పాడుటచేతను, చదువుటచేతను, మద్యపానముచేతను, స్త్రీసంభోగముచేతను, పనులజేయుటచేతను, భారమును మోయుటచేతను, (ఈపనులజేయుటచేత) శ్రమనొందినవారును, అజీర్ణరోగముకలవారును, ఉరఃక్షతరోగపీడితులును, ధాతువులు క్షీణించినవారును, వృద్ధులును, బాలులును, బలహీనులును, దప్పి అతిసారము శూలరోగము అను నీవ్యాధులచే పీడింపబడినవారును, శ్వాసముచేతను ఎక్కిళ్లచేతను బాధింపబడువారును, శరీరము కృశించినవారును, క్రిందపడి దెబ్బతగిలినవారును, తీవ్రముగ దెబ్బలుతగిలినవారును, పిచ్చివాండ్రును, గుఱ్ఱములు మున్నగువానిపై సవారిచేయుటచేతను రాత్రి నిదురమేల్కాంచుటచేతను బడలినవారును, క్రోధము శోకము భయము అనువానిచే బడలినవారును, పగటినిద్రయం దలవాటుకలవారును, వీరందరును సర్వకాలంబును (అన్నిఋతువులయందును) పగటియందు నిదురింపనగును. పైజెప్పినవారు పగటియందు నిదురించినయెడ ధాతువులు సమస్థితినుండి బలము వృద్ధినొందును. శ్లేష్మము పుష్టినొంది అవయవసంధిబంధముల దృఢపరిచి యాయువును స్థిరముగ జేయును.

ఇచ్చట గీతాధ్యయనాదులచే బడలి కృశించినవారికి పగటినిద్రచే రక్తాదిధాతువులు పుష్టినొంది యారోగ్యమును కల్గించుననియు, దప్పి యతిసారము మున్నగువాని యందు పగటినిద్రప్రభావమునంజేసి హితకరంబగుననియు భావము. జీర్ణశక్తిలేనివారికి పగటినిద్రవలన స్రోతోమార్గములు నిరోధింపబడి జఠరాగ్ని వృద్ధినొందును. కావున భుజింపబడినయాహారము సుఖముగ జీర్ణమగును. పగటియందు నిదురించు నలవాటుకలవారికి నిద్ర సాత్మ్యమైయుండును. కావున అట్టివారు పగటినిద్రను వదలినచో సహసా త్యాగమునంజేసి యనర్థదాయకమగును. కావున అట్టివారు పగలు నిదురింపనగును. మరియు రాత్రివేళ నిదురింపక మేల్కొనియుండువారలకు వాతము ప్రకోపము నొందును. కావున అట్టివారు పగటియందు నిదురించినచో వాతము శాంతినొందును. మరియు "యావత్కాలం న సుప్తస్స్యాత్ రాత్రౌ స్వప్నాద్యథోచితాత్, తతోఽర్ధమాత్రం తత్కాలం దివాస్వప్నో విధీయతే" అను తంత్రాంతరవచనమునుబట్టి రాత్రికాలమున నియతముగ నెంతకాలము సుఖముగ నిద్ర సేవింపవలసియుండునో, అట్టి నియమితకాలమున నెంతకాలము తనకు నిద్రాహానికల్గెనో అందు అర్ధకాలము పగటినిద్ర సేవింపవలెనని యెరుంగునది.

మరియు పైజెప్పిన పగటినిద్రానియమము భోజనమునకు ముందు పగటినిద్ర కనుజ్ఞనొసగునుకాని భోజనానంతరము సర్వథా పగటినిద్ర నిషిద్ధము. ఈవిషయము హారీతసంహితయందు భుక్త్వా స్వప్నం న సేవేత సుస్థోఽప్యసుఖితో భవేత్" అని చెప్పబడినది. (సుస్థముగ నున్నవారును పగటియందు భుజించినపిదప నిదురించినచో రోగపీడితులగుదురని యర్థము.) మరియు వ్యాయామాదిక్రియల జేయువారికి పగటినిద్ర విధించుతరి, "నరాన్నిరశనాన్ కామం దివా స్వాపయేత్" అనువాక్యము చేత గూడ భోజనమునకు ముందే పగటినిద్ర విధింపబడినది.

### గ్రీష్మఋతువున దివానిద్రావిధానము.

మూ. గ్రీష్మే చాదానరూక్షాణాం వర్ధమానే చ మారుతే,
రాత్రీణాం చాతిసంక్షేపాత్ దివాస్వప్నః ప్రశస్యతే.　　౨౫

వ్యా. గ్రీష్మకాలమున మిక్కిలి తీవ్రమైన తనకిరణములచేత సూర్యుడు మనుజులశరీరమునందలి స్నిగ్ధభాగము నాకర్షించును కావున శరీరము మిగుల రూక్షమైయుండును. దానంజేసి వాతము వృద్ధినొందును. రాత్రులు స్వల్పప్రమాణముగ నుండుట వలన చాలినంతనిద్ర ననుభవించుట కవకాశము కల్గదు. కావున నట్టిగ్రీష్మకాలమున పగటిపూట నిదురించుట మిక్కిలి ప్రశస్తము.

అట్టి పగటినిద్ర ఆదానస్వభావముచేతను, రాత్రినిద్ర తక్కువయగుటచేతను రూక్షమైనశరీరమును స్నిగ్ధముగజేసి, వృద్ధినొందినవాతమును సమస్థితికి దెచ్చును కావున గ్రీష్మకాలమున మిక్కిలి ప్రశస్తమని భావము.

గ్రీష్మవ్యతిరిక్తఋతువులయందు సాధారణముగ దివానిద్రానిషేధము.

మూ. గ్రీష్మవర్జ్యేషు కాలేషు దివాస్వప్నాత్ ప్రకుప్యతః,
శ్లేష్మపిత్తే దివాస్వప్నాత్ తస్మాత్తేషు న శస్యతే. ౪౬

వ్యా. గ్రీష్మఋతువుదక్క తక్కినకాలములయందు పగటిపూట నిదురించినచో కఫంబును పిత్తంబును ప్రకోపముజెందును. కావున నిషిద్ధము.

పగటినిద్రకనర్హులు.

మూ. మేదస్వినః స్నేహనిత్యాః శ్లేష్మలాః శ్లేష్మరోగినః,
దూషీవిషార్తాశ్చ దివా న శయీరన్ కదాచన. ౪౭

వ్యా. మేదస్సు మిక్కిలి వృద్ధిజెందినవారును, దోషములు హరించుటకై యెల్లప్పుడును నెయ్యి మున్నగుస్నేహముల నుపయోగించువారును, శ్లేష్మప్రకృతికలవారును, శ్లేష్మప్రకోపమునకైన రోగములుకలవారును, దూషీవిషముచే బాధింపబడువారును, ఒకప్పుడైన పగటియందు నిదురింపకూడదు.

ఇచ్చట 'న శయీరన్ కదాచన' అనునిషేధము గ్రీష్మఋతువునందును వర్తించును కావున నీశ్లోకమున నిషేధింపబడిన మేదస్విస్నేహనిత్యులు మున్నగువారును గ్రీష్మఋతువునందును పగలు నిదురింపకూడదని యెరుంగునది. "గీతాధ్యయనమద్యస్త్రీ . . . సేవేరన్ సార్వకాలికమ్" అని విధింపబడిన సార్వకాలికనిద్రమాత్రముబలాబలముల గమనించి యథోచితముగ గ్రీష్మఋతువునందును పగటియందు సేవింపవగుననియుం నెరుంగునది.

అహితనిద్రాసేవనమున గల్గునుపద్రవములు.

మూ. హలీమకశ్శిరశ్శూలం స్తైమిత్యం గురుగాత్రతా,
అఙ్గమర్దోఽగ్నినాశశ్చ ప్రలేపో హృదయస్య చ. ౪౮
శోఫారోచకహృల్లాసపీనసార్ధావభేదకాః,
కోఠోఽరుః పిడకాః కణ్డూః తన్ద్రా కాసో గళామయాః. ౪౯
స్మృతిబుద్ధిప్రమోహాశ్చ సంరోధస్స్రోతసాం జ్వరః,
ఇన్ద్రియాణామసామర్థ్యం విషవేగప్రవర్తనమ్. ౫౦
భవేన్నృణాం దివాస్వప్నస్యాహితస్య నిషేవణాత్,
తస్మాద్ధితాహితం స్వప్నం బుద్ధ్వా స్వప్యాత్సుఖం బుధః. ౫౧

వ్యా. హాలీమకము (పచ్చకామల), తలనొప్పి, శరీరము జడముగ నుండుట ఒడలు బరువుగనుండుట, శరీరమునందంతటను నొప్పి, జఠరాగ్ని మందగించుట, హృదయ స్థానమున కఫముచేరి బరువుగనుండుట, వాపు, అరోచకము, హృల్లాసము (రొమ్ముదడ (ఓకరింతలు), పడిసెము, ఒంటిచెంపనొప్పి, కణుదురీగెలుకుట్టినవిధముగ దద్దురులు, పలు దెరంగులైన పొక్కులు, దురద, కునికిపాటు, దగ్గు, గళరోగములు, జ్ఞాపకశక్తియుం బుద్ధియు నశించుట, శరీరమునందలి స్రోతోమార్గములయడపు, జ్వరము, చక్షురాదీంద్రియములకు తమతమవ్యాపారములజేయ సామర్థ్యము లేకపోవుట, శరీరమున విషము శేషించియున్నచో దానివేగము వ్యాపించుట, ఇవియన్నియుం పగటియందు విధివిహితముగాక అహితముగ సేవింపబడిన నిద్రవలన కలుగును. కావున పైజెప్పినరీతిగ పగటినిద్రకు నిషేధవిషయములను సేవింపదగినవిషయములను చక్కగ గమనించి విధివిహితముగ శరీరమునకు సుఖకరముగ సేవింపదగును. (విధివిహితమైన నిద్ర హితకరంబును, విరుద్ధమైననిద్ర అహితకరంబును నగును కావున అట్టి హితాహితముల జక్కగ గమనించి సేవింపదగునని భావము.)

## రాత్రిజాగరణ-దివానిద్రలసామాన్యగుణములు.

మూ. రాత్రౌ జాగరణం రూక్షం స్నిగ్ధం ప్రస్వపనం దివా,
అరూక్షమనభిష్యన్దిత్వాసీనప్రచలాయితమ్. ౫౨
దేహవృత్తౌ యథాహారః తథా స్వప్నః సమాసతః,
స్వప్నాహారసముత్థే చ స్థౌల్యకార్శ్యే విశేషతః. ౫౩

వ్యా. రాత్రియందు నిదురమేల్కొంచియుండుట రూక్షము. పగటియందు నిదురించుట స్నిగ్ధముగ నుండును. (రాత్రియందు నిదురమేల్కొంచియున్నచో శరీరమునందలి స్నిగ్ధగుణము తగ్గును. కావున నయ్యది రూక్షమును కల్గించుటంజేసి రూక్ష మనబడును. రాత్రియందు నిదురించునెడ నయ్యది స్నిగ్ధముగ జేయును కావున రాత్రినిద్ర స్నిగ్ధ మనబడును. పగటియందును నిద్రాభావము రూక్షమే యగును కాని రాత్రినిద్ర చేత పూర్తిగ స్నిగ్ధత్వము కల్గియుండుటవలన పగటిపూట విశేషముగ రూక్షమును గల్గింపనోపదు. పగటినిద్రమాత్రము స్నిగ్ధత్వమును కల్గించును కావున స్నిగ్ధ మనబడును.)

మరియుం మనుజుడు కూర్చొనియుండియే(పరుండక) తూగిపడును నిదురించునెడ నయ్యది రూక్షంబును, స్నిగ్ధంబునుగాక సమస్థితినుండును.) "ప్రచలాయితమన: కూర్చొనియే నిద్రబోవుట ప్రచలాయిత మనబడును. "ఘూర్ణితం ప్రచలాయితమ్" అని నిఘంటువు.)

మరియుం దేహపోషణమునందు ఆహారమువలెనే నిద్రయుం ముఖ్యమైయుండును. శరీరమునకు స్థూలత్వమైనను, కార్శ్యమైనను నిద్రను ఆహారమును ఆకారణముగ జేసి కల్గును. (ఆహారనిద్రలను యథోక్తముగ సేవించినయెడ నయ్యవి శరీరమునకు ఆరోగ్యస్థి మును కల్గించును. అధికముగ సేవించినచో స్థూలత్వంబును, హీనముగ సేవించినచో కార్శ్యంబును కల్గును. కావున శరీరమున గల్గుమార్పుల కన్నిటికిని ఆహారనిద్రలు కారణములని భావము.)

—— నిద్రాప్రాప్తికి దగుసాధనములు. ——

మూ. అభ్యంగోత్సాదనం స్నానం గ్రామ్యానూపౌదకా రసాః,
శాల్యన్నం సదధి క్షీరం స్నేహో మద్యం మనస్సుఖమ్. ౫౪
మనసోఽనుగుణా గన్ధాః శబ్దాస్సంవాహనాని చ,
చక్షుష స్తర్పణం లేపః శిరసో వదనస్య చ. ౫౫
స్వాస్తీర్ణశయనం వేశ్మ సుఖం కాల స్తథోచితః,
ఆనయ న్త్యచిరాన్నిద్రాం ప్రణష్టా యా నిమిత్తతః. ౫౬

వ్యా. తైలాభ్యంగనము, ఉద్వర్తనము (నలుగుపెట్టుకొనుట), స్నానము, గ్రామమున నివసించు జంతువులయొక్కయు, జలప్రాంతమునను, జలమునందును నివసించు జంతువుల మాంసరసములు, ఎఱ్ఱవరిబియ్యపుటన్నము, పెరుగు, పాలు, నెయ్యి, మద్యము, వీనిని సేవించుటయు; మనస్సుకు వికృతి లేక సుఖముగనుండుట, మనసు కింపైనపరిమళము మూర్కొనుట, అట్టిశబ్దమును వినుట, ఒడలు పిసికించికొనుట, కన్నులకు తృప్తి నొందించు నంజనముల నిడికొనుట, శిరస్సుకును, ముఖమునకును యుక్తములైన లేపనము జేసికొనుట, తగినశయ్య నునిచి చక్కగ పరిచియుండు శయ్యాగృహమున సుఖముగ పరుండుట, నిద్రవచ్చుటకు తగినకాలము ఇవియన్నియుం రోగాదికారణములచే నిదుర రాకున్నపుడు అట్టినిద్రను శీఘ్రముగ రప్పించును.

ఇచ్చట "ప్రణష్టాయా నిమిత్తతః" అని చెప్పుటవలన కారణాంతరమున రాకున్న నిద్రను పై జెప్పినకారణములు రావించునుకాని! కారణము లేకయే యరిష్టరూపమైన నిద్రాభావమును తొలగింపనేరవని యర్థము.

—— అర్హునకు నిద్ర రానీయకుండుట కుపాయములు. ——

మూ. కాయస్య శిరసశ్చైవ విరేకశ్ఛర్దనం భయమ్,
చిన్తా క్రోధః కథాధూమో వ్యవాయో (వ్యాయామో) రక్త మోక్షణమ్. ౫౭

ఉపవాసోఽసుఖా శయ్యా సత్త్వోదార్యస్తమోజయః,
నిద్రాప్రసఙ్గమహితం వారయన్తి సముత్థితమ్. ౫౭

వ్యా. నిదురసేవింపదగనికాలమున వచ్చునిదురను (అహితనిద్రను) నివారించవలసినపుడు కాయవిరేచనంబును శిరోవిరేచనంబును చేసికొనవలెను. లేక వమనము జేయించుకొనవలెను. మరియు చింతారూపమైన మనోవ్యాపారము, క్రోధము, కథలను (ప్రాచీనచిత్రకథలను) వినుట, ధూమపానము, స్త్రీసంభోగము. (లేక దేహపరిశ్రమము), రక్తమోక్షణము జేసికొనుట, ఉపవాసముండుట, సుఖముకాని శయ్యపై బరుండుట, యోగాభ్యాసముచేత రజోగుణమును జయించి సత్వగుణము నధికముగ నవలంబించుట, ఇవియన్నియు ననవసరముగ నహితమైవచ్చు నిద్రను రానియ్యక యాపును.

సామాన్యముగ నిద్రానాశకకారణములు.

మూ. ఏత ఏవ చ విజ్ఞేయా నిద్రానాశస్య హేతవః,
కార్యం కాలో వికారశ్చ ప్రకృతిర్వాయురేవ చ. ౫౮

వ్యా. పైజెప్పబడినకృత్యముల జేసినయెడ ఆతురునకు అహితముగవచ్చు నిద్రను నివర్తింపజేయునని పైని చెప్పబడినవి. అవియే స్వస్థతనుండువానికిని నిదురబట్టకుండుటకును కారణములగును. మరియు పనులజేయుటయం దాసక్తికల్గియుండుటయు, వృద్ధత్వరూపమైన వయఃకాలంబును, జ్వరాదిరోగంబులును, తనకు నైజమైన స్వభావంబును, వాతప్రకోపంబును నిద్రానాశమునకు కారణములగును.

నిద్రాభేదములు.

మూ. తమోభవా శ్లేష్మసముద్భవా చ మనశ్శరీరశ్రమసంభవా చ,
ఆగన్తుకీ వ్యాధ్యనువర్తినీ చ రాత్రిస్వభావప్రభవా చ నిద్రా.

వ్యా. నిద్ర తమోగుణం బధికమగుటచే గల్గునది యొకటి. కఫోద్రేకమున గల్గునది యొకటి. మనస్సుకును శరీరమునకు శ్రమగల్గుటవలన పుట్టునది మరియొకటి. దెబ్బలు గాయములు మున్నగునాగంతుకకారణములచే గల్గునది యొకటి. సన్నిపాతజ్వరాది రోగముల ననుసరించి సంభవించునది యొకటి. రాత్రిస్వభావమునంజేసి సామాన్యముగ సంభవించునది యొకటి. ఇత్తెరంగున నిద్ర కారణభేదములచే నారువిధములుగ నుండును.

మనస్సుకును శరీరమునకు సంబంధించినచింతనము మున్నగువ్యాపారముల విశేషముగ జేసినపుడు మనశ్శరీరముల కలసట కల్గును. దాన సంభవించిననిద్ర 'మనశ్శరీరశ్రమసంభవా చ' అని చెప్పబడినది.

నిద్రావిభాగము.

మూ. రాత్రిస్వభావప్రభవా మతా యా
తాం భూతధాత్రీం ప్రవదన్తి నిద్రామ్,
తమోభవామాహురఘస్య మూలం
శేషం పునర్వ్యాధిషు నిర్దిశన్తి. ౬౧

వ్యా. రాత్రిస్వభావమువలన బుట్టినట్టినిద్ర సకలప్రాణులకును ప్రాణాధారమై శరీరమును పోషించును. తమోగుణమును ప్రధానముగజేసి పుట్టిననిద్ర నానావిధపాపములకు మూలకారణమై యుండును. తక్కిననాల్గువిధములైన నిద్రలు వ్యాధులయందు పరిగణింపబడును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—రాత్రిస్వభావమున గల్గునిద్ర సకలప్రాణులకును ప్రాణాధారమై యుండును. తమోగుణముచే గల్గునిద్ర అజ్ఞానమును కల్గించునది యగును. దానిజేసి యుక్తాయుక్తపరిజ్ఞానములేక ధర్మాపేతకృత్యములజేయుటకు కారణమగును; కావున పాపమునకు మూలమని చెప్పబడినది. ఇయ్యది మానసికదోషమైన తమోగుణముచే గల్గునదియైనను శరీరరోగముల జేరినదికాదని రోగములతో జెప్పబడలేదు. శ్లైష్మికనిద్రయు, శ్రమసంభవనిద్రయు, ఆయావ్యాధి ననుసరించిననిద్రయు, ఆగంతుకనిద్రయు వ్యాధిరూపములైనవి. ఆగంతుకనిద్ర యరిష్టరూపమైన వ్యాధిరూపమైనది. ఇది యసాధ్యము. ఇత్తెరంగున నిద్రాభేదముల నెఱుంగునది.

అధ్యాయవిషయసంగ్రహము.

మూ. తత్ర శ్లోకాః—
నిన్దితాః పురుషాస్తేషాం యౌ విశేషేణ నిన్దితౌ,
నిన్దితే కారణం దోషాస్తయోర్నిన్దితభేషజమ్. ౬౨
యేభ్యో యదా హితా నిద్రా యేభ్యశ్చాప్యహితా యదా,
అతినిద్రానిద్రయోశ్చ భేషజం యద్భవా చ సా. ౬౩
యా యా యథాప్రభవా చ నిద్రా తత్సర్వమత్రిజః,
అష్టౌనిన్దితసంఖ్యాతే వ్యాజహార పునర్వసుః ౬౪

వ్యా. నిందితపురుషభేదములు, అందు ముఖ్యముగ విశేషనిందితపురుషభేదములు రెండు, అట్టి పురుషులనింద్యత్వకారణము, అట్టి నిందితపురుషులదోషములు, నిందితములకు చికిత్స, ఎవరికి, ఎప్పుడు నిద్రహితమైనది. ఎవరికి ఎప్పుడు నిద్ర హితముకానిది, నిద్రాధిక్యమునకును నిద్రాభావమునకు చికిత్స, నిద్రపుట్టుటకు కారణములు, ఏయేనిద్ర

యెట్టిస్వభావముకల్గినది. ఈవిషయముల నన్నింటిని అత్రిపుత్రుడైన పునర్వసువు ఈ యష్టౌనిందితీయ మనునధ్యాయమున వివరించి చెప్పెను. అని యర్థము.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే
సూత్రస్థానే అష్టౌనిన్దితీయో నామ ఏకవింశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమున సూత్రస్థానంబునం దష్టౌనిందితీయమనునది యిరువదియొకటి యవయధ్యాయము సమాప్తము.

---

## ద్వావింశాధ్యాయము.

అవతారిక:—పైయధ్యాయమున రోగమునకును ఔషధములకును యోజనమునకు ప్రధానమైన శరీరభేదములును, స్థౌల్యకార్శ్యములకు సంబంధించినచికిత్సలును సంగ్రహముగ జెప్పబడినవి. అందు లంఘనబృంహణరూపములైన సంతర్పణ-అపతర్పణములు చికిత్సాప్రస్తావమున "సతతం చోపచర్యా హి కర్శనైర్బృంహణైరపి" అని నిర్దేశింపబడినవి. కావున నట్టి యోజనాసంబంధములైన లంఘనబృంహణములస్వరూపాదుల వివరించుటకై లంఘనబృంహణీయాధ్యాయము చెప్పబడును.

మూ. అథాతో లఙ్ఘనబృంహణీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. అష్టౌనిందితీయమును జెప్పినపిదప లంఘనబృంహణముల నధికరించిన లంఘనబృంహణీయాధ్యాయమును త్రికాలవేదియగు నాత్రేయుం డుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము. (లంఘనబృంహణముల నధికరించి చెప్పబడునధ్యాయము లంఘనబృంహణీయమని యధ్యాయసంజ్ఞ నెరుంగునది).

ఆత్రేయుడు అగ్నివేశాదులకు లంఘనాదుల దెల్పుట.

మూ. తపస్స్వాధ్యాయనిరతానాత్రేయశ్శిష్యసత్తమాన్,
షడగ్నివేశప్రముఖాన్ ఉక్తవాన్ పరిచోదయన్. 3
లఙ్ఘనం బృంహణం కాలే రూక్షణం స్నేహనం తథా,
స్వేదనం స్తమ్భనం చైవ జానీతే యస్స వై భిషక్. ౪

వ్యా. తపస్సునందును వేదాధ్యయనమునందును నిరంతరము అసక్తి కల్గినవారును శిష్యులలో నుత్తములును నగు అగ్నివేశుడు మున్నగుశిష్యుల నార్గురిని జ్ఞానోత్పాదకము

లైన ప్రశ్నలజేయుటకు ప్రేరేపించుచు నాత్రేయు డిట్లు చెప్పెను:—"లంఘనము, బృంహణము, రూక్షణము, స్నేహనము, స్వేదనము, స్తంభనము ననునారువిధములైన చికిత్సలను యుక్తమైనకాలమున జేయ నెవ్వ డెరుంగునో వాడు మిక్కిలి శ్రేష్ఠమైన వైద్యుడని చెప్పదగు" నని యాత్రేయుండు శిష్యులకు జెప్పెను.

"స్నేహనం రూక్షణం కర్మ స్వేదనం స్తమ్భనం చ యత్, భూతానాం తచ్చ ద్వైవిధ్యాత్ ద్వివిధం నాతివర్తతే." అను ప్రమాణము ననుసరించి స్నేహన-రూక్షణ-స్వేదనస్తంభనములును లంఘనబృంహణములతో జేరియుండుననని తెలియుచున్నది. అట్లుండినను స్నేహనాదులు విశేషముగ వేరువేరుగ నవాంతరభేదములు చక్కగ దెలియుటకై భిన్నములుగ నిర్దేశింపబడినవి యని యెఱుంగునది.

అగ్నివేశుడు లంఘనాదులనుగూర్చి ప్రశ్నము సేయుట.

మూ. తముక్తవన్త మాత్రేయమగ్నివేశ ఉవాచ హ,
భగవన్! లఙ్ఘనం కింస్విత్? లఙ్ఘనీయాశ్చ కీదృశాః? ౫
బృంహణం బృంహణీయాశ్చ, రూక్షణీయాశ్చ రూక్షణమ్,
స్నేహనం స్నేహనీయాశ్చ, స్వేదాః స్వేద్యాశ్చ కే మతాః? ౬
స్తమ్భనం స్తమ్భనీయాశ్చ, వక్తుమర్హసి తద్గురో!
లఙ్ఘనప్రభృతీనాం చ షణ్ణామేషాం సమాసతః. ౭
కృతాకృతాతిరిక్తానాం లక్షణం వక్తుమర్హసి,

వ్యా. పైజెప్పినప్రకారము శిష్యులతో నాత్రేయుండు చెప్పుటయు నాశిష్యులలో నగ్నివేశు డిట్లు ప్రశ్నజేసెను:—"ఓగురువర్యా! లంఘనమన నేమి? లంఘనము జేయదగినవా రెవ్వరు? బృంహణమన నెద్ది? బృంహణమునకు దగినవా రెవ్వరు? రూక్షణమన నేమి? రూక్షణార్హు లెవరు? స్నేహన మెట్టిది? స్నేహనీయు లెవరు? స్వేదన మెద్ది? స్వేదనమున కర్హు లెవరు? స్తంభనమన నేమి? స్తంభనార్హు లెవరు? అట్టిలంఘనబృంహణాదులారిటికిని కృత (సమ్యగ్యోగ), అకృత (హీన) యోగ, అతిరిక్త (అతి) యోగములలక్షణము లెట్టివి? వీనినన్నిటిని సంగ్రహముగ జెప్ప వేడెదను" అని యాత్రేయుని అగ్నివేశు డడిగెనని యర్థము.

లంఘనబృంహణాదిస్వరూపలక్షణములు.

మూ. వచస్తదగ్నివేశస్య నిశమ్య గురురబ్రవీత్. ౮
యత్కిఞ్చిల్లాఘవకరం దేహే తల్లఙ్ఘనం స్మృతమ్,

బృంహణత్వం శరీరస్య జనయేత్తచ్చ బృంహణమ్. ౯
రౌక్ష్యం ఖరత్వం వైశద్యం యత్కుర్యాత్తద్ధి రూక్షణమ్,
స్నేహనం స్నేహవిష్యన్దమార్దవక్లేదకారకమ్. ౧౦
స్తమ్భగౌరవశీతఘ్నం స్వేదనం స్వేదకారకమ్,
స్తమ్భనం స్తమ్భయతి యత్ గతిమంతం చలం ధ్రువమ్. ౧౧

వ్యా. శిష్యవాక్యమును విని యాత్రేయుఁ డిట్లు చెప్పందొడంగెను:—శరీరమునం దింతమాత్రమైనను చులకదనమును గల్గించునది లంఘన మనబడును. శరీరమును బలియ జేయునది బృంహణమని చెప్పబడును. రౌక్ష్యమును ఖరత్వమును (కరకుదనమును) విశదత్వమును గల్గించునది రూక్షణ మనదగును. శరీరమునకు జిడ్డును, విష్యందమును (ఘనీభవించినదానిని కరగించి పలుచనగ జేయుట), మృదుత్వమును, తడినికల్గించునది స్నేహన మనబడును. చెమటబుట్టించునది స్వేదనము; ఇయ్యది స్తబ్ధత్వమును గౌరవ(భార)మును, శీతలమును హరించుస్వభావము కల్గినది. విశేషముగ వెడలుస్వభావముకల అతిసారాదులను, కొంచెముగ చలించుస్వభావముకలవాతాదులను అడ్డగించి వెడలనీయక బంధించునది స్తంభనము.

## లంఘనద్రవ్యలక్షణము.

మూ. లఘూష్ణతీక్ష్ణవిశదం రూక్షం సూక్ష్మం ఖరం సరమ్,
కఠినం చైవ యద్ద్రవ్యం ప్రాయస్తల్లఙ్ఘనం స్మృతమ్. ౧౨

వ్యా. తేలికయు, ఉష్ణంబును, తీక్ష్ణత్వంబును, విశదత్వంబును, రూక్షతయుం (జిడ్డు లేక గరగరమని యుండుట), సూక్ష్మంబును, కర్కశంబును, సరంబును (స్రవించుస్వభావముకల్గినది), కఠినత్వంబును కల్గినద్రవ్యము ప్రాయికముగ లంఘనము (తేలికదనమును కల్గించునది) అగును.

## బృంహణద్రవ్యలక్షణము.

మూ. గురుశీతమృదుస్నిగ్ధం బహలం స్థూలపిచ్ఛిలమ్,
ప్రాయో మన్దం స్థిరం శ్లక్ష్ణం ద్రవ్యం బృంహణముచ్యతే. ౧౩

వ్యా. భారమైనదియు, గుణవీర్యములచే శీతమైనదియు, స్నిగ్ధము (జిడ్డుకల్గినదియు), బహులము (ఘనమైనదియు), స్థూలంబును, పిచ్ఛిలంబును (జిగటకల్గినదియు), మందంబును (మెల్లగ చిరకాలమునకు పనిచేయునది), స్థిరంబును శ్లక్ష్ణంబును నగుద్రవ్యము ప్రాయికముగ బృంహణమని చెప్పబడును.

### రూక్షణద్రవ్యలక్షణము.

మూ. రూక్షం లఘు ఖరం తీక్ష్ణం ఉష్ణం స్థిరమపిచ్ఛిలమ్ (అవిజ్జలమ్)
ప్రాయశః కఠినం చైవ యద్ద్రవ్యం తద్ధి రూక్షణమ్. ౧౬

వ్యా. రూక్షంబును, లఘువును, ఖరంబును, తీక్ష్ణంబును, ఉష్ణంబును, స్థిరంబును పిచ్ఛిలము కానిదియుం, కఠినంబు నైనద్రవ్యము ప్రాయికముగ రూక్షణ మనదగును.

ఇచ్చట లంఘనద్రవ్యమునకును రూక్షత్వాదిగుణములను జెప్పియున్నది. అయి నను లంఘనద్రవ్యమున లఘుత్వంబును, రూక్షణద్రవ్యమున రూక్షత్వంబును ప్రధానము జెప్పబడినది. మరియుం లంఘనము కేవలము లఘ్వాదిగుణయుక్తద్రవ్యముచేత నేగా యుంపవాసరూపమైన క్రియచేతకూడ చేయబడును. విరూక్షణముమాత్రము రూక్షత్వా గుణయుక్తమగు ద్రవ్యముచేత నే చేయబడును. కావున లంఘనవిరూక్షణములకు పరస్ప భేదము నెఱుంగునది. మరియుం "కృతాఽతికృతలిఙ్గం యత్ లఙ్ఘితే తద్విరూక్షితే" అ లంఘనవిరూక్షణముల రెంటికిని అయోగాతియోగాదిలక్షణములు సమానములుగ జెప్పి నది ప్రాయికమని భావము. విరూక్షణమున స్నేహాభావరూపము, లంఘనమున గురుత్వా భారంబును ముఖ్యములు. కావున నీరెండును భిన్నములేకాని ఏకమని భ్రమింపవలదు.

### స్నేహనద్రవ్యలక్షణము.

మూ. ద్రవం సూక్ష్మం సరం స్నిగ్ధం పిచ్ఛిలం గురు శీతలమ్,
ప్రాయో మన్దం మృదుచ యత్ ద్రవ్యం తత్ స్నేహనం మతమ్

వ్యా. ద్రవంబును, సూక్ష్మంబును, సరంబును, స్నిగ్ధంబును (చమురుకల్గినదియుం) పిచ్ఛిలంబును (జిగటగనుండునది), భారముగ నుండునదియుం, శీతలంబును, మందంబున (చిరకారి), మృదువును నైనద్రవ్యము ప్రాయికముగ స్నేహనమగును.

### స్వేదనద్రవ్యగుణములు, లక్షణములు.

మూ. ఉష్ణం తీక్ష్ణం సరం స్నిగ్ధం రూక్షం సూక్ష్మం ద్రవం స్థిరమ్,
ద్రవ్యం గురు చ యత్ ప్రాయః తద్ధి స్వేదనముచ్యతే. ౧౮

వ్యా. ఉష్ణంబును, తీక్ష్ణంబును, సరంబును, స్నిగ్ధంబును, రూక్షంబును, సూక్ష్మ బును, ద్రవంబును, స్థిరంబును, బరువుకల్గినదియుం నగుద్రవ్యము ప్రాయికముగ స్వేద మగును. ఇచ్చట స్నిగ్ధరూక్షంబులును, సరస్థిరంబులును పరస్పరవిరుద్ధములైన గుణముల కావున స్నిగ్ధద్రవ్యమైనను, రూక్షద్రవ్యమైనను, సరద్రవ్యమైనను, స్థిరద్రవ్యమైనన స్వేదనమగునని యర్థము చేయవలెను.

స్తంభనద్రవ్యలక్షణము.

మూ. శీతం మన్దం మృదు శ్లక్ష్ణం రూక్షం సూక్ష్మం ద్రవం స్థిరమ్,
యద్ద్రవ్యం లఘు చోద్దిష్టం ప్రాయ స్తత్ స్తమ్భనం స్మృతమ్. ౧౭

వ్యా. శీతంబును, మందంబును, మృదువును, శ్లక్ష్ణంబును, రూక్షంబును, సూక్ష్మంబును, ద్రవంబును, స్థిరంబును, లఘువును నైనద్రవ్యము ప్రాయికముగ స్తంభనమగును.

లంఘనసంగ్రహము.

మూ. చతుష్ప్రకారా సంశుద్ధిః పిపాసా మారుతాతపౌ,
పాచనాన్యుపవాసశ్చ వ్యాయామశ్చేతి లఙ్ఘనమ్ ౧౮

వ్యా. వమనము, విరేచనము, శిరోవిరేచన (నస్యము), ఆస్థాపనవస్తియం నను నాల్గువిధములైన శోధనంబులును; దప్పిని నిగ్రహించియుండుటయు, గాలియందైనను ఎండయందైన నుండుటయు, (జఠరాగ్నికి ప్రతికూలములైన దోషములను హరించి జఠరాగ్నిని బలపరిచి యాహారమును జీర్ణింపజేయునవి పాచనములు) అట్టిపాచనంబులును, ఉపవాసంబును (లంకణముండుట), శరీరపరిశ్రమము జేయుటయు, ఇవి పదియును శరీరమునకు లాఘవమును కల్గించునవి కావున లంఘనము లగును. (పైజెప్పబడిన పాచనములు ప్రాయికముగ వాయ్వగ్నిగుణభూయిష్ఠములై యుండును. గాలి సోమగుణసంబంధము కల్గినప్పుడు బృంహణమగును. ఆగ్నేయగుణసంబంధము కల్గినప్పుడు మాత్రము లంఘనమగును. వాయువు యోగవాహి యగుటంజేసి గుణముల మారుచుండును. అనువాసనవస్తి బృంహణముకాని లంఘనము కానేరదు, కావున దానినివదలి తక్కిననాల్గుసంశోధనంబులు నిచ్చట పరిగణనము చేయబడినవి).

పైజెప్పిన పదివిధములైన లంఘనముల వేరువేరుగ నుపయోగ్య విషయములు, అందు శోధనరూపలంఘనమున కర్హులు.

మూ. ప్రభూతశ్లేష్మపిత్తాస్రమలాః సంసృష్ట (సంస్పృష్ట) మారుతాః,
బృహచ్ఛరీరా బలినో లఙ్ఘనీయా విశుద్ధిభిః. ౧౯

వ్యా. శ్లేష్మంబును పిత్తంబును రక్తంబును మలంబును మిక్కుటముగ కల్గినవారును, వాతము విషమస్థితినుండువారును బలిసి మిక్కిలి పెద్దనియగు శరీరముకలవారును, మిక్కిలి బలశాలులును వమనవిరేచనాదిశోధనములచే లంఘనము చేయదగియుందురు.

పాచనరూపమైనలంఘనమున కర్హులు.

మూ. యేషాం మధ్యబలా రోగాః కఫపిత్తసముత్థితాః,
వమ్యతీసారహృద్రోగాః విషూచ్యలసకజ్వరాః. ౨౦

విబన్ధగౌరవోద్గారహృల్లాసారోచకాదయః,
పాచనైస్తాఞ్ భిషక్తేషాం ప్రాయేణాదావుపాచరేత్. ౨౧

వ్యా. వమనము, అతిసారము, హృద్రోగము, విషూచి, అలసకము, జ్వరము, మలబంధము, గౌరవము, త్రేనుపులు, ఓకరింతలు, అరోచకము ఇవి మున్నగువ్యాధులు కఫపిత్తములచే గల్గి మధ్యమబలములై యున్నవారికి తొలుతనే పాచనౌషధములచేత లంఘనము చేయదగును.

పిపాసానిగ్రహాదులచే లంఘనము జేయదగినవారు.

మూ. ఏత ఏవ యథోద్దిష్టాః యేషామల్పబలా గదాః,
పిపాసానిగ్రహై స్తేషాం, ఉపవాసైశ్చ తాఞ్ జయేత్. ౨౨
రోగాఞ్, జయేన్మధ్యబలాఞ్ వ్యాయామాతపమారుతైః,
బలినాం, కిం పునర్యేషాం రోగాణామవరం బలమ్. ౨౩

వ్యా. పైని నిర్దేశింపబడిన వమనాదిరోగములు స్వల్పబలముగ నెవరికి కల్గునో వారికి పిపాసానిగ్రహము (దప్పినణచుట) చేత నుపచరింపనగును. అయ్యవి మధ్యమబలములుగ నున్నపు డుపవాసరూపమైన లంఘనముచే నుపచరింపనగును. అట్టి మధ్యమబల రోగములు మిక్కిలి బలశాలులకు సంభవించినచో నట్టిరోగములను దేహపరిశ్రమము చేతను గాలిచేతను ఎండచేతను ఉపచరింపవలెను. వ్యాయామము, ఆతపము, మారుతము, అనునవి బలశాలులకు మధ్యమరోగములయందే యుపయోగింపదగియున్నపుడు బలశాలులకు స్వల్పబలములైన రోగములు సంభవించినపు డుపయోగార్హములని వేరుగ జెప్పవలెనా? అవశ్య ముపయోగింపదగునని భావము.

లంఘనయోగ్యులు.

మూ. త్వగ్దోషాణాం ప్రమూఢానాం (ప్రమీఢానాం) స్నిగ్ధాభిష్యన్ది బృంహిణామ్, శిశిరే లఙ్ఘనం శస్తం అపి వాతవికారిణామ్.

వ్యా. చర్మదోషముకలవారికిని, మూర్ఛారోగముకలవారికిని (ప్రమేహముకలవారికిని) శరీరము మిక్కిలి స్నిగ్ధమైనవారికిని, శరీరమునం దధికముగ ద్రవభాగముకలవారికిని, అధికముగ బృంహణముచేసినవారికిని, వాతరోగములుకలవారికిని, శిశిరకాలమునను (హేమంతశిశిరఋతువులయందును) లంఘనముచేయుట మిక్కిలి ప్రశస్తము. (హేమంతశిశిరకాలమునందు కాలస్వభావమునంజేసి మనుజులు బలిష్ఠులుగ నుందురు. కావున నప్పుడు సర్వసామాన్యముగ లంఘనముచేయుట మిగుల ప్రశస్తము. పైజెప్పిన విషయములయందు పదివిధములైన లంఘనములను చేయదగునని భావము. ఈవిషయము "శిశిరే త్వపరానపి" అని వాగ్భటులు చెప్పిరి.)

బృంహణద్రవ్యము.

మూ. అదిగ్ధవిద్ధమక్లిష్టం వయస్థం సాత్మ్యచారిణామ్,
మృగమత్స్యవిహఙ్గానాం మాంసం బృంహణముచ్యతే. ౨౫

వ్యా. మృగములు మత్స్యములు పక్షులు అను నీజంతువులు వానివాని అలవాటుగ సంచరించుచున్నవానిమాంసము బృంహణముగ నుండును; అట్టిమాంసము విషమున్నగువానిస్పర్శముకల యాయుధములచే ఛేదింపబడక యుండవలెను. అట్టి జంతువులు విషసంబంధముకల ములుకులచే కొట్టుబడక, రోగాదులచే కృశించక, మంచిపరువైన వయస్సుకల్గి ఆయాజంతువులకు యుక్తమైన యరణ్యాదిప్రదేశములయందు స్వేచ్ఛగ సంచరించునవిగ నుండవలెను. అట్టి మృగములయొక్కయు మత్స్యములయొక్కయు పక్షులయొక్కయు మాంసము బృంహణమగునని భావము.

బృంహణమున కర్హులు.

మూ. క్షీణాః క్షతాః కృశా వృద్ధా దుర్బలా నిత్యమధ్వగాః,
స్త్రీమద్యనిత్యా గ్రీష్మే చ బృంహణీయా నరాస్స్మృతాః. ౨౬

వ్యా. ధాతువులు క్షీణించినవారును, ఉరఃక్షతరోగముకలవారును, శరీరము కృశించినవారును, వృద్ధులును, బలహీనులును, ఎల్లప్పుడు దారినడచువారును, ఎల్లప్పుడు సంభోగమును మద్యపానమును జేయువారును బృంహణము చేయదగి యుందురు. మరియు గ్రీష్మకాలమునను పైజెప్పినవారికే గాక ఇతరులకును సాధారణముగ బృంహణము చేయదగును. (గ్రీష్మమున కాలస్వభావమునంజేసి మనుజులకు బలము తక్కువయగును కావున అట్టికాలమున అందరకును బృంహణముచేయుట యావశ్యకమని యెరుంగునది. ఈవిషయమే "గ్రీష్మేఽపరానపి" అని వాగ్భటులు చెప్పిరి.)

మాంసరసముచే బృంహణము చేయవలసినవారు.

మూ. శోషార్శోగ్రహణీదోషైః వ్యాధిభిః కర్శితాశ్చ యే,
తేషాం క్రవ్యాదమాంసానాం బృంహణా లఘవో రసాః ౨౭
(క్రవ్యాన్మాంసరసా స్తేషాం బృంహణం లాఘవం సమం.)

వ్యా. శోషము, అర్శోరోగము, గ్రహణిరోగము, ఇతరములగు రోగములచేతను కృశించినమనుజులకు మాంసమును తినునట్టిజంతువుల మాంసముయొక్క రసములు లఘువైన బృంహణమగును. (అట్టి జంతువులమాంసరసములు మిక్కిలి లాఘవమును బృంహణమును జేయక సమముగ బృంహణమగునని భావము.)

### సామాన్యముగ బృంహణోపాయములు.

మూ. స్నానముత్సాదనం స్వప్నః మధురాః స్నేహావస్తయః,
శర్కరా క్షీరసర్పింషి సర్వేషాం విద్ధి బృంహణమ్. ౨౮

వ్యా. స్నానము, ఉద్వర్తనము, నిద్ర, మధురరసపదార్థములు, స్నేహద్రవ్యముచే చేయబడిన వస్తికర్మములు, చక్కెర, పాలు, నెయ్యి ఇవియన్నియు నందరికిని సామాన్యముగ బృంహణమగును.

### రూక్షణములు.

మూ. కటుతిక్తకషాయాణాం సేవనం స్త్రీష్వసంయమః,
ఖలిపిణ్యాకతక్రాణాం మధ్వాదీనాం చ రూక్షణమ్. ౨౯

వ్యా. కటు-తిక్త-కషాయరసముల సేవించుట, స్త్రీసంభోగము చేయుట, ఆవపిండిని, నువ్వులపిండిని, మజ్జిగను సేవించుట, తేనె మద్యము మున్నగువానిని సేవించుట ఇవియు రూక్షణమగును.

### రూక్షణము చేయదగినవారు.

మూ. అభిష్యన్నా మహాదోషా మర్మస్థా వ్యాధయశ్చ యే,
ఊరుస్తమ్భప్రభృతయో రూక్షణీయా నిదర్శితాః. ౩౦

వ్యా. మిక్కిలి స్రావమును కల్గించువ్యాధులును, ప్రబలములగు దోషములు కల వ్యాధులును, మర్మస్థానముల సంభవించినవ్యాధులును, ఊరుస్తంభము మున్నగువ్యాధులును రూక్షణము చేయ దగియుండును. (ఇచ్చట "ప్రభృతయః" అనుటవలన ప్రమేహాది వ్యాధులయందును విరూక్షణము చేయుట యుత్తమమని యెరుంగునది.)

### స్నేహన-స్వేదనాదులసంగ్రహము.

మూ. స్నేహాః స్నేహయితవ్యాశ్చ స్వేదాః స్వేద్యాశ్చ యే మతాః,
స్నేహాధ్యాయే మయోక్తాస్తే స్వేదాఖ్యే చ సవిస్తరమ్. ౩౧

వ్యా. స్నేహములును స్నేహనమున కర్హులును స్నేహాధ్యాయమునను, స్వేదములును స్వేదనార్హులును స్వేదాధ్యాయమునందును సవిస్తరముగ జెప్పఁబడినవి కావున నాప్రకరణములచే వాని నెరుంగునది. (పదుమూఁడవయధ్యాయమున స్నేహస్నేహ్యాది విషయంబులును, పదునాల్గవయధ్యాయమున స్వేదస్వేద్యాదివిషయంబులును సవిస్తరముగ జెప్పబడినవి కావున వాని నచట జూచునది యన్నిభావము).

### స్తంభనములు.

మూ. ద్రవం తన్వసరం యావచ్ఛీతీకరణ మౌషధమ్,
స్వాదు తిక్తం కషాయం చ స్తమ్భనం సర్వమేవ తత్. 3౨

వ్యా. ద్రవంబును, సూక్ష్మంబును, స్థిరంబును, మధుర - తిక్త-కషాయరసములు కల్గినవియు నగునౌషధాదులెల్ల స్తంభనములగును. మరియు శీతముగ జేయునట్టి యౌషధములన్నియు స్తంభనములగును. (ఇచ్చట 'తను సరం' అనుపాఠాంతరము కానవచ్చుచున్నది. సరమన వ్యాపించుస్వభావము కల్గినదని యర్థము.)

### స్తంభనము చేయదగినవారు.

మూ. పిత్తక్షారాగ్నిదగ్ధా యే వమ్యతీసారపీడితాః,
విషస్వేదాతియోగార్తాః స్తమ్భనీయా స్తథావిధాః. 33

వ్యా. పిత్తప్రకోపము కలవారును, క్షారములచేనైనను నిప్పుచేనైనను గాల్పబడినవారును, వమనములచేతను అతిసారములచేతను బాధితులును, విషముచే బాధితులును, స్వేదాతియోగము (అధికముగ చెమటపట్టించుటచేత)న బాధితులును, స్తంభనము చేయదగియుందురు.

### లంఘనసమ్యగ్యోగలక్షణము.

మూ. వాతమూత్రపురీషాణాం విసర్గే గాత్రలాఘవే,
హృదయోద్గారకణ్ఠాస్యశుద్ధౌ తన్ద్రాక్లమే గతే. 3४
స్వేదే జాతే రుచౌ చైవ క్షుత్పిపాసాసహోదయే,
కృతం లఙ్ఘనమాదేశ్యం నిర్వ్యథే చాన్తరాత్మని. 3౫

వ్యా. వాతము మూత్రము పురీషము ఇవి యడ్డులేక సరళముగ వెడలుట, శరీరము బరువుచేత తేలికగా నుండుట, హృదయంబును ఉద్గారంబును (త్రేపులు) కంఠంబును నోరును శుద్ధముగనుండుట, కునికిపాటును బడలికయు నివర్తించియుండుట, శరీరముపై చెమటబట్టుట, నోట రుచికల్గుట, ఆకలికిని దప్పికిని యోరుపలేకుండుట, అంతరాత్మకు కొంచెమైన బాధలేకుండుట. ఇట్టి లక్షణములు కల్గినప్పుడు లంఘనము చక్కగ చేయబడినది యని యెరుంగునది.

ఇచ్చట "క్షుత్పిపాసాసహోదయే" అనుచోట "క్షుత్పిపాసయోః అసహాః క్షుత్పిపాసాఽసహాః, తస్య ఉదయః, క్షుత్పిపాసాఽసహోదయః" అను విగ్రహముచేత ఆకలియైనను దప్పియైనను ఓరుప శక్యముగాక మిక్కిలి తీవ్రముగ జనించినయెడ లంఘనము చక్కగ పనిచేసినదని యర్థము. ఈయర్థమునే సుశ్రుతాచార్యులు "సృష్టమారుత

విణ్మూత్రక్షుత్పిపాసాఽసహం లఘు" అని చెప్పిరి. వాగ్భటాచార్యులు "క్షుత్తృట్ సహోదయశ్శుద్ధహృదయోద్గారకణ్ఠతా, వ్యాధిమార్దవ ముత్సాహ స్తన్ద్రానాశశ్చ లఙ్ఘితే" అని చెప్పిరి. "క్షుత్తృట్ సహోదయః" అనుటచేత ఆకలియుం దప్పియుం సమకాలమున బుట్టుట లంఘితలక్షణమని తెలిసెడి. ప్రకృతమున "క్షుత్పిపాసాసహోదయే" అనుచోటను వాగ్భటానుసారముగ జెప్పినను బాధకము లేదు.

లంఘనాతియోగలక్షణములు.

మూ. పర్వభేదోఽఙ్గమర్దశ్చ కాసశ్శోషో ముఖస్య చ,
క్షుత్ప్రణాశోఽరుచి స్తృష్ణా దౌర్బల్యం శ్రోత్రనేత్రయోః 36
మనసస్సంభ్రమోఽభీక్ష్ణం ఊర్ధ్వవాత స్తమో హృది,
దేహాగ్నిబలనాశశ్చ లఙ్ఘనేఽతికృతే భవేత్. 37

వ్యా. శరీరమునందలి సంధులూడినట్లు బాధకల్గుట, శరీరమునం దంతట నొప్పి, దగ్గు, నోరెండుట, ఆకలి మందగించుట, అరోచకము, దప్పి, చెవులకును, కన్నులకును, బలహీనము, మనస్సు కలతనొందుట, శరీరమునం దూర్ధ్వభాగమున ఎక్కిళ్లు శ్వాసము చెవులయందు ధ్వని ఆవలింతలు మున్నగు వాతరోగములు కల్గుట, హృదయమున చీకటి క్రమ్మిన విధముగ నేఁయుం దోచకుండుట, దేహముయొక్కయుం జాఠరాగ్నియొక్కయుం బలము నశించుట, ఇవి యన్నియుం కల్గినయెడ లంఘనము అధికమైనదియని యెఱుంగునది.

బృంహణసమ్యగ్యోగ-అతియోగలక్షణములు.

మూ. బలం పుష్ట్యుపలమ్భం చ కార్శ్యదోషవివర్జనమ్,
లక్షణం బృంహితే స్థౌల్యం అతి చాత్యర్థబృంహితే. 38

వ్యా. బృంహణము చక్కగ పనిచేసినప్పుడు శరీరమునకు బలము కల్గును. శరీరము కృశత్వము పోయి పుష్టి కల్గియుండును. కృశత్వముచే గల్గు శీతోష్ణముల నోరువలేకుండుట మున్నగుదోషములు హరించును. శరీరము కృశత్వము పోయి స్థూలమగును. ఇట్టి లక్షణములు బట్టి బృంహణము చక్కగ నైనదని యెఱుంగునది. మరియుం బృంహణము అధికముగ నైనచో స్థూలత్వము మిక్కిలి యధికమగును.

రూక్షణసమ్యగ్యోగ-అయోగములు, స్తంభితలక్షణంబును.

మూ. కృతాకృతస్య లిఙ్గం యత్ లఙ్ఘితే తద్ధి రూక్షితే,
స్తమ్భితస్స్యాద్బలే లబ్ధే యథోక్తైశ్చామయైర్జితైః. 39

వ్యా. లంఘనమునకు జెప్పిన లక్షణములే రూక్షణమునకును సమ్యగ్యోగ-అతి యోగములయందు కల్గును. కావున దానిచేతనే యెరుంగునది.

స్తంభనమునకు జెప్పిన రోగములన్నియుం హరించి చక్కనిబలము కల్గినయెడ స్తంభనౌషధము చక్కగ పనిచేసినదని యెరుంగునది.

స్తంభనాతియోగలక్షణము.

మూ. శ్యావతా స్తబ్ధగాత్రత్వం ఉద్వేగో హనుసంగ్రహః,
హృద్వర్చోనిగ్రహాశ్చ స్యాత్ అతిస్తమ్భితలక్షణమ్. ౪౦

వ్యా. స్తంభన మధికమైనపుడు శరీరావయవములు స్తంభించును. మనసునందు ద్వేదము కల్గును. (లేక ఊర్ధ్వశ్వాసంబును ఎక్కిళ్లును కల్గును.) అంకిళ్లు పట్టుకొనును. హృదయమున పట్టినట్లుండును. మలము వెడలక బద్ధగించును. ఇట్టి లక్షణములబట్టి స్తంభన మధికముగ జేయబడినది యని యెరుంగునది.

లంఘనబృంహణాద్యయోగలక్షణము.

మూ. లక్షణం చాకృతానాం స్యాత్ షణ్ణామేషాం సమాసతః,
తదౌషధానాం ధాతూనాం అసమో వృద్ధిరేవ చ. ౪౧

వ్యా. లంఘనబృంహణాది చికిత్సలచే సాధింపదగిన వ్యాధులయందు లంఘనాదులను వ్యాధి బలానుసారముగ నుపయోగింపనియెడ అట్టి చికిత్సచే వ్యాధి కలకబారి వాతాదులు శమింపక వృద్ధినొందును. ఇదియే అయోగలక్షణము. ఈలక్షణమే పై జెప్పిన లంఘనబృంహణాదు లారిటికిని సమముగ నుండును. (ఔషధాదిరూపమైన చికిత్స వ్యాధిని శమింపజేయదగిన పరిమాణము ననుసరించక తక్కువగ జేసినయెడ వాతాది దోషములు కలకబారి వృద్ధినొందును గాని శమించి వ్యాధిని నివర్తింపజేయజాలవు. ఈ లక్షణ మీబృంహణాదుల అయోగమునకును సమానముగ నుండునని భావము.)

ఉపక్రమషడ్విధత్వనిర్ణయము.

మూ. ఇతి షట్ సర్వరోగాణాం ప్రోక్తాస్సమ్యగుపక్రమాః,
సాధ్యానాం సాధనే సిద్ధాః మాత్రాకాలానురోధినః. ఇతి.

భవతి చాత్ర:—

దోషాణాం బహుసంసర్గాత్ సంకీర్యన్తే హ్యుపక్రమాః,
షట్త్వం తు నాతివర్తన్తే త్రిత్వం వాతాదయో యథా. ౪౨

వ్యా. జ్వరాదిభేదములచే పల్తుతెరంగులైన రోగముల కన్నిటికిని పైజెప్పినరీతిగ లంఘనము, బృంహణము, స్నేహనము, స్వేదనము, రూక్షణము, స్తంభనమునని యారు

విధములైన చికిత్సలు చక్కగ నిరూపింపబడినవి. సాధ్యావస్థ నుండు రోగముల సాధిం చుటకై పైజెప్పిన చికిత్సలను మాత్రము కాలమును అపేక్షించి యుపయోగించినయెడ చికిత్సాసిద్ధి కల్గును.

మరియు వాతపిత్తకఫములయొక్క సంసర్గాది భేదములచే వ్యాధులు అనేక విధములుగ నుండును. అట్టి సంసర్గాదులయందు తత్తద్గుణముగ పైజెప్పిన యారు విధములైన చికిత్సలును, లంఘనస్వేదనము, బృంహణస్వేదము మున్నగు భేదములచే బలుతెరంగులుగ నగును. కాని వాతాదిదోషములు మూడును పరస్పర సంసర్గాది భేద ములచే పలుతెరంగులైనను మూడువిధములుగనే యుండునట్లు చికిత్సలును లంఘనాది భేదములచే నారువిధములుగనే యుండును కావున నారువిధములుగ పరిగణనము చేయ బడినది. (బృంహణ స్వేదనాది చికిత్సలకు వ్యాధ్యాద్యనుసారముగ సంసర్గము కల్పింప బడినను అట్టి సాంకర్యముచేత వాని వానికి నియమితములగు గుణముల జూపును కాని (తేనె నెయ్యి ఒకటిగ కలిసినప్పుడు స్వాభావిక గుణమునకు వ్యతిరేకముగ విషగుణ మును జూపి యపాయము చేయువిధముగ) కార్యాంతరమును జేయుటలేదు. కావున నారువిధములని చెప్పినందుకు భంగములేదని భావము.)

## అధ్యాయవిషయసంగ్రహము.

మూ. తత్ర శ్లోకః—

ఇత్యస్మిన్ లఙ్ఘనాధ్యాయే వ్యాఖ్యాతాష్షడుపక్రమాః,
యథాప్రశ్నం భగవతా చికిత్సా యైః ప్రకాశితా. ౪3

వ్యా. ఇత్తెరంగున నీలంఘనబృంహణీయాధ్యాయమున చికిత్సాప్రవర్తకము లగు లంఘనబృంహణాదులైన యారుపక్రమములును శిష్యుని ప్రశ్నానుసారముగ భగ వంతుడైన యాత్రేయునిచే విపులముగ జెప్పబడినవి యని యర్థము.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
లఙ్ఘనబృంహణీయో నామ ద్వావింశోఽధ్యాయః

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమను సూత్రస్థానమునందు లంఘనబృంహణీయ మనునది యిరువది రెండవయధ్యాయము సమాప్తము.

## త్రయోవింశో౽ధ్యాయము.

అవతారిక:—పై యధ్యాయమున లంఘనబృంహణాది భేదములచే నుపక్రమములు ఆరువిధములుగ జెప్పబడినవి. అవియే సంతర్పణము అపతర్పణము నను రెండు విధముల నుండునని వాని భేదముల నిరూపించుటకై సంతర్పణీయాధ్యాయము చెప్పబడును.

మూ. అథాతస్సన్తర్పణీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. లంఘనబృంహణీయాధ్యాయమును జెప్పినపిదప సంతర్పణవిషయముల వివరించునట్టి సంతర్పణీయాధ్యాయము త్రికాలజ్ఞానియగు నాత్రేయుం డుపదేశించిన దానికి న్యూనాతిరేకము కాకుండునట్లు వివరించెదనని యర్థము.

—— సంతర్పణాధిక్యమున గల్గువ్యాధులు. ——

మూ. సన్తర్పయతి యస్స్నిగ్ధైః మధురైర్గురుపిచ్ఛిలైః,
నవాన్నైర్నవమద్యైశ్చ మాంసైశ్చానూపవారిజైః. 3
గోరసైర్గౌడికైశ్చాన్నైః పైష్టికైశ్చాతిమాత్రశః,
చేష్టాద్వేషీ దివాస్వప్నశయ్యాసనసుఖే రతః. ౪
రోగాస్తస్యోపజాయన్తే సన్తర్పణనిమిత్తజాః,

వ్యా. ఏమనుజుడు స్నిగ్ధంబులును, మధురంబులును, పిచ్ఛిలంబులును నగు నాహారముల చేతను, నూతనములగు ధాన్యములచే సిద్ధమైన యన్నము చేతను, క్రొత్త మద్యముల చేతను, అనూప (జలప్రాంతమున నుండుజంతువుల) మాంసము చేతను, జలజంతువుల మాంసముల చేతను, ఆవుపాల చేతను, గుడాన్నము (చక్కెరపొంగలి) చేతను, పిష్టము చేయబడిన భక్ష్యాదుల చేతను, మిక్కిలి యధికముగ తృప్తినొందినవాడు పనుల జేయక సోమరితనముచే పగటియందు పరుండి నిశ్చేష్టుడై నిద్రించుచున్నను, పనుల జేయక సుఖముగ కూర్చొనియున్నను అట్టివానికి సంతర్పణమునంజేసి క్రూరమైన వ్యాధులు సంభవించును.

స్నిగ్ధమధురాద్యాహారములను, నవాన్నాదులను, గోరసము మున్నగువానిని మిక్కిలి యధికముగ తృప్తికల్గునట్లు భుజించి, పనులజేయక సోమరిపోతువలె పగటియందును నిద్రాదిసుఖము ననుభవించుచున్నచో వానికి సంతర్పణాధిక్యమునంజేసి క్రిందజెప్పబడు ప్రమేహాదిరోగములు సంభవించునని భావము. (ఇచ్చట పనుల

జేయకుండుట, పగటినిద్ర, పరుండియుండుట, చేష్టలదక్కి కూర్చొనియుండుట, ఇవియును సంతర్పణమున జేరినవి కావున, స్నిగ్ధాద్యాహారములచేనైనను, దివాస్వప్నాదులచేనైనను సంతర్పణనిమిత్తకములైనవ్యాధులు కల్గుననియు నర్థము చేయదగును.)

సంతర్పణజనితవ్యాధులవివరణము.

మూ. ప్రమేహాకణ్డూపిడకాః కోఠపాణ్డ్వామయజ్వరాః. ౫
కుష్ఠాన్యామప్రదోషాశ్చ మూత్రకృచ్ఛ్రమరోచకః,
తన్ద్రాక్లైబ్యమతిస్థౌల్యం ఆలస్యం గురుగాత్రతా. ౬
ఇన్ద్రియస్రోతసాం లేపః బుద్ధేర్మోహః ప్రమీలకః,
శోఫాశ్చైవంవిధాశ్చాన్యే శీఘ్రమప్రతికుర్వతః. ౭

వ్యా. పైజెప్పిన సంతర్పణమునకు శీఘ్రముగ ప్రతీకారము చేయనియెడ, ప్రమేహము, దురద, పిటికలు, దద్దురులు, పాండురోగము, జ్వరము, కుష్ఠము, అజీర్ణరోగములైన విషూచి మున్నగునవి, మూత్రకృచ్ఛ్రము, అరోచకము, కునికిపాటు, నపుంసకత్వము, అతిస్థౌల్యము, పనులయం దాలస్యము, శరీరభారము, చక్షురాదీంద్రియములనాశములు అడచికొని తమవ్యాపారములయందు సామర్థ్యములేకుండుట, బుద్ధిమాంద్యము, ప్రమీలకము (ఎల్లప్పుడును స్వప్నావస్థను బోలె దేనినైన నవలోడనను జేయుచుండుట), శోఫము (నంజు), ఇవి మున్నగురోగములు కల్గును.

సంతర్పణజనితరోగచికిత్స.

మూ. శస్తముల్లేఖనం తత్ర విరేకో రక్తమోక్షణమ్,
వ్యాయామశ్చోపవాసశ్చ ధూమాశ్చ స్వేదనాని చ. ౮

వ్యా. అట్టి సంతర్పణజనితరోగములయందు వమనవిరేచనంబులును, రక్తమోక్షణంబును, దేహపరిశ్రమము జేయుటయు, ఉపవాసముండుటయు, ధూమపానంబును, స్వేదనంబును (చెమటబట్టించుటయు) యుక్తములుగ నుండును.

అభయాప్రాశాదియోగములు.

మూ. సక్షౌద్రశ్చాభయాప్రాశః ప్రాయో రూక్షాన్నసేవనమ్,
చూర్ణప్రదేహా యే చోక్తాః కణ్డూకోఠవినాశనాః ౯
త్రిఫలారగ్వధాం పాఠాం సప్తపర్ణీం సవత్సకమ్,
ముస్తం నిమ్బం సమదనం జలేనోత్క్వాథితం పిబేత్. ౧౦

తేన మేహాదయో యాన్తి నాశమభ్యస్యతో ధ్రువమ్,
మాత్రాకాలప్రయుక్తేన సన్తర్పణసముత్థితాః. ౧౧

వ్యా. మరియు పైజెప్పిన వ్యాధులయందు కరకకాయలను చూర్ణముజేసి తేనెలో కలిపి సేవించుటయు, రూక్షములైన యన్నములభుజించుటయు మంచిది. ఆరగ్వధీయమను మూడవయధ్యాయమున 'కుష్ఠం హరిద్రే' అని యుపక్రమించి చెప్పబడిన కండూకోఠముల హరించు చూర్ణంబులును ప్రదేహంబులును ఉపయోగింపదగును. మరియు త్రిఫలములు, రేల, చిరుబొద్ది, కానుగు, కొడిసెపాల, తుంగగడ్డలు, వేపపట్ట, శృంగకాయ, వీనినన్నింటిని సమభాగములుగ గూర్చి నీళ్లుపోసి క్వాథముచేసి పానము చేయవలెను. అట్టి క్వాథమును మాత్రాకాలాదుల ననుసరించి ప్రతిదినము సేవించుచు నభ్యాసము చేయుచున్నచో సంతర్పణమున గల్గిన ప్రమేహము మున్నగు వ్యాధులన్నియు శమించును.

ఆరగ్వధాదియోగము.

మూ. ముస్తమారగ్వధః పాఠా త్రిఫలా దేవదారు చ,
శ్వదంష్ట్రా ఖదిరో నిమ్బః హరిద్రే త్వక్చ వత్సకాత్. ౧౨
రసమేషాం యథాదోషం ప్రాతః ప్రాతః పిబేన్నరః,
సన్తర్పణకృతైస్సర్వైః వ్యాధిభిః విప్రముచ్యతే. ౧౩

వ్యా. తుంగగడ్డలు, రేలకాయలోనిజిగురు (లేక రేలపట్ట), చిరుబొద్ది, త్రిఫలములు, దేవదారుపట్ట, పల్లేరు, చండ్రపట్ట, వేపపట్ట, పసుపు, మ్రానిపసుపు, కొడిసపాలపట్ట వీనినన్నిటిని జేర్చి కషాయము కాచి దోషముయొక్క బలానుసారముగ పరిమాణము గల్పించి ప్రతిదినంబును ఉదయకాలమున సేవించినచో సంతర్పణముచే గల్గినవ్యాధులు నివర్తించును.

త్వగ్దోషహరోద్వర్తనము.

మూ. ఏభిశ్చోద్వర్తనోద్ఘర్షస్నానయోగోపయోజితైః,
త్వగ్దోషాః ప్రశమం యాన్తి తథా స్నేహోపసంహితైః. ౧౪

వ్యా. పైజెప్పబడిన తుంగగడ్డలు రేల మున్నగువానిని నలుగుపిండివలె చూర్ణము చేసి శరీరమునకు నూనెపూసికొనియైనను నూనెను పూసికొనకయైనను నలుగుపెట్టుకున్నను చర్మదోషములు నివర్తించును. మరియు నాద్రవ్యములనుగూర్చి స్నేహపాకవిధిగ తైలము కాచి ఆట్టితైలమును బూసికొనినను చర్మదోషములు హరించును. (ఇచ్చట తైలమును బూసికొని నలుగుబెట్టుకొనిన నయ్యది యుద్వర్తనమనియు, తైలమును బూసికొనక నలుగు బెట్టికొనిన నయ్యది యుద్ఘర్షణమనియు చెప్పబడును.)

### కుష్ఠాదిపానము.

మూ॥ కుష్ఠం గోమేదకం హిఙ్గు క్రౌఞ్చాస్థి త్ర్యూషణం వచామ్,
(క్రౌఞ్చాస్థీన్యూషణం వచామ్)
వృషకైలే శ్వదంష్ట్రాం చ ఖరాశ్వాం చాశ్మభేదికమ్. ౧౫
తక్రేణ దధిమణ్డేన బదరామ్లరసేన వా,
మూత్రకృచ్ఛ్రం ప్రమేహం చ పీతమేతద్వ్యపోహతి. ౧౬

వ్యా. చెంగల్వకోష్ఠు, గోమేదకపుమణి, ఇంగువ, క్రౌంచపక్షియొక్క అస్థులు, శుంఠి, పిప్పలి, మిరియాలు, వస, అడ్డసరము, ఏలకులు, పల్లేరు, కురాసానివోమము, పాషాణభేది (కొండపిండిచెట్లు), వీనినన్నిటిని చూర్ణముచేసి మజ్జిగలోనైనను, పెరుగుమీది తేటనీటితోనైనను రేగుపండుయొక్క పుల్లనిరసముతోనైనను కలిపి పుచ్చుకొనిన (త్రాగిన) మూత్రకృచ్ఛ్రంబును, ప్రమేహంబును నివర్తించును.

### తక్రహరీతకీ మున్నగు ప్రయోగములు.

మూ. తక్రాభయాప్రయోగైశ్చ త్రిఫలాయాస్తథైవ చ,
అరిష్టానాం ప్రయోగైశ్చ యాన్తి మేహాదయశ్శమమ్. ౧౭
త్ర్యూషణం త్రిఫలా క్షౌద్రం క్రిమిఘ్నం సాజమోదకమ్,
మన్థోఽయం సక్తవస్తైలం హితో లోహోదకాప్లుతః. ౧౮

వ్యా. తక్రహరీతకీప్రయోగంబునను, త్రిఫలారిష్టప్రయోగంబునను, ప్రమేహాము మున్నగునవి శాంతినొందును. మరియు త్ర్యూషణములు (శుంఠి పిప్పలి మిరియాలు), త్రిఫలములు (కరక తాని ఉసిరికకాయలు), తేనె, వాయువిడంగములు, ఓమము, సత్తుపిండి వీనిని చూర్ణము అగరుద్రావకమును నెయ్యి మున్నగు స్నేహములను చేర్చి మంథము చేసియు త్రాగిన ప్రమేహము మున్నగువ్యాధుల హరించును.

### సంతర్పణజనితరోగహరవ్యోషాదిసత్తుపానము.

మూ. వ్యోషం విడఙ్గం శిగ్రూణి త్రిఫలాకటురోహిణీ,
బృహత్యౌ ద్వే హరిద్రే ద్వే పాఠా సాతివిషా స్థిరా. ౧౯
హిఙ్గు కేబుకమూలాని యవానీ ధాన్యచిత్రకమ్,
సౌవర్చలమజాజీం చ హపుషాం చేతి చూర్ణయేత్. ౨౦
చూర్ణతైలఘృతక్షౌద్రభాగాస్స్యుర్మానతస్సమాః,
సక్తూనాం షోడశగుణో భాగః సన్తర్పణం పిబేత్. ౨౧

ప్రయోగాత్తస్య శామ్యన్తి రోగాస్సన్తర్పణోత్థితాః,
ప్రమేహా మూఢవాతాశ్చ కుష్ఠాన్యర్శాంసి కామలాః. ౨౨
ప్లీహా పాణ్డ్వామయశ్శోథః మూత్రకృచ్ఛ్రమరోచకః,
హృద్రోగో రాజయక్ష్మా చ కాసశ్శ్వాసో గళగ్రహః ౨౩
క్రిమయో గ్రహణీదోషాః శ్వైత్ర్యం స్థౌల్యమతీవ చ,
నరాణాం దీప్యతే చాగ్నిః స్మృతిర్బుద్ధిశ్చ వర్ధతే. ౨౪

వ్యా. త్రికటుకములు, వాయువిడంగములు, మునగగింజలు, త్రిఫలములు, కటుకరోహిణి, ములక, వాకుడు, పసుపు, మ్రానిపసుపు, చిరుబొద్ది (లేక అగరుశుంఠి), అతివస, ముయ్యాకుపొన్న, ఇంగువ, కేబుకము (ఇది గ్రంథికవిశేషము), దీనివేరు, ఓమము, దనియాలు, చిత్రమూలము, సౌవర్చలవణము, జిలకర, బోడతరను వీనినన్నిటిని సమభాగముగ జేర్చి చూర్ణముచేసి యాచూర్ణసముదాయమునకు సమభాగముగ తైలమును, నేతిని, తేనెను కూర్చి (ఇచ్చట తైలము ఘృతము తేనె అను నీమూడును ఒక్కొకటియు చూర్ణమునకు సమభాగముగ నుండవలెను). అట్టి చూర్ణమునకు పదునారుభాగములుగ సత్తుపిండిని కలిపి యన్నిటి నొకటిగ జేర్చి నీళ్లుబోసి కలియబెట్టి త్రాగునది.

(పైజెప్పినయౌషధము నీళ్లలో జేర్చి త్రాగుటవలన సంతర్పణమని పేరుగల్గినది) దీనిని త్రాగుటవలన సంతర్పణములగు నాహారవిహారాదులచే గల్గినవ్యాధులన్నియు నివర్తించును. మరియు ప్రమేహములు, మూఢవాతము, పలువెరంగులైన కుష్ఠములు, అర్శోరోగములు, కామలారోగములు, ప్లీహరోగము,పాండురోగము, శోథము,మూత్రకృచ్ఛ్రము, అరోచకము, హృద్రోగము, రాజయక్ష్మ, కాసము, శ్వాసము, గళగ్రహము (కుత్తుకపట్టినట్లుండుట), క్రిమిరోగము, గ్రహణీరోగములు, శ్విత్రకుష్ఠము, అధికమైన స్థౌల్యము ఈవ్యాధులన్నియు పైజెప్పినయౌషధమును సేవించినయెడ నివర్తించును. జఠరాగ్నిదీప్తి కల్గును. స్మృతియు బుద్ధియు వృద్ధినొందును.

(ఇచ్చట పైజెప్పినవిధముగ చూర్ణతైలాదులనన్నిటిని ఉదకమున కలిపి యుపయోగించదగినది కావున సంతర్పణము. అయ్యది సంతర్పణజనితరోగములను శమించుటం జేసి యపతర్పణము నగును).

## స్థౌల్యహరసామాన్యచికిత్స.

మూ. వ్యాయామనిత్యో జీర్ణాశీ యవగోధూమభోజనః,
సన్తర్పణకృతైర్దోషైః స్థౌల్యం ముక్త్వా విముచ్యతే. ౨౫

ఉక్తం సన్తర్పణోత్థానామపతర్పణమౌషధమ్,
వక్ష్యన్తే సౌషధాశ్చోర్ధ్వమపతర్పణజా గదాః. ౨౬

వ్యా. ప్రతిదినమునను దేహపరిశ్రమము జేయువాడును, భుజించినయాహారము చక్కగ జీర్ణించినపిదప మరల భుజించువాడును, యవలచేతను గోధుమములచేతను సిద్ధమైనయన్నమును భుజించువాడును, సంతర్పణరూపములైన యాహారవిహారాదులచే గల్గినశరీరస్థౌల్యమును వదలి సుఖముగ నుండును. ఇత్తెరంగున సంతర్పణమున సంభవించు రోగశమనమునకై యపతర్పణరూపమైన యౌషధము చెప్పబడినది. పిమ్మట నీక్రింద అపతర్పణముచే గల్గురోగంబులు వానిశమింపజేయు నౌషధములును వివరింపబడును.

—అపతర్పణముచే గల్గురోగములు.—

మూ. దేహాగ్నిబలవర్ణౌజః శుక్రమాంసపరిక్షయః,
జ్వరః కాసానుబన్ధశ్చ పార్శ్వశూలమరోచకః ౨౭
శ్రోత్రదౌర్బల్యమున్మాదః ప్రలాపో హృదయవ్యథా,
విణ్మూత్రసఙ్గ్రహశ్శూలం జఙ్ఘోరుత్రికసంశ్రయమ్. ౨౮
పర్వాస్థిసన్ధిభేదశ్చ యే చాన్యే వాతజా గదాః,
ఊర్ధ్వవాతాదయస్సర్వే జాయన్తే ఽపతర్పణాత్. ౨౯

వ్యా. అపతర్పణముచేత శరీరబలంబును, అగ్నిబలంబును, శరీరవర్ణంబును, ఓజస్సును, శుక్రంబును, మాంసంబును క్షీణించును. దగ్గుతోగూడిన జ్వరము సంభవించును. ప్రక్కనొప్పియు, అరోచకంబును కల్గును. చెవులు బలహీనములై శబ్దమును గ్రహింపనేరకుండును. ఉన్మాదంబును (పిచ్చి), ప్రలాపంబును (నిరర్థకముగ పదరుట), హృదయంబునందు బాధయు కల్గును. మలమూత్రములు బంధింపబడును. పిక్కలయందును తొడలయందును వెన్నెముకకు క్రిందిసంధిభాగమునను శూలమున గ్రుమ్మినవిధముగ పోటు పుట్టును. అస్థిసంధులన్నిటియందును ఊడిపోవునట్లు బాధ కల్గును. ఇతరములైన యనేక వాతవ్యాధులును, శరీరోర్ధ్వభాగమున ఊర్ధ్వశ్వాసరూపమైనవాతవ్యాధులును అపతర్పణమున కల్గును.

ఇచ్చట నూర్ధ్వవాతమనగ నూర్ధ్వశ్వాసమని యర్థము. లేక "అధః ప్రతిహతో వాయుః శ్లేష్మణా కుపితేన చ, కరోత్యనిశముద్గారం ఊర్ధ్వవాతస్స ఉచ్యతే" అని తంత్రాంతరమున జెప్పబడిన యూర్ధ్వవాతమను వ్యాధివిశేషమని యర్థము చేయనగును.

(ప్రకుపితమైన కఫముచే వాతము క్రిందికి ప్రతిహతమై యెల్లప్పుడును త్రేనుపుల గల్గించును. ఇయ్యది యూర్ధ్వవాత మనబడునని యర్థము).

అపతర్పణజనితకార్శ్యమునకు సంతర్పణవిధి.

మూ. తేషాం సన్తర్పణం తజ్జ్ఞైః పునరాఖ్యాతమౌషధమ్,
యత్తదాత్వే సమర్థం స్యాత్ అభ్యాసే వా తదిష్యతే. ౩౦

వ్యా. పైజెప్పిన అపతర్పణముచే గల్గిన శరీరకార్శ్యము మున్నగువ్యాధులయందు సంతర్పణౌషధమును సేవించుట యుక్తము. అట్టి సంతర్పణము కేవలము తాత్కాలికమైన యపతర్పణమున కల్గిన కృశత్వాదులను, చిరకాలము అపతర్పణాభ్యాసమున కల్గిన కార్శ్యాదులను పోగొట్టుటకు సమర్థముగ నుండుదాని నుపయోగింపదగునని ఋషుల సమ్మతము.

చిరకాలక్షీణతయందు సంతర్పణాదివిధానము.

మూ. సద్యః క్షీణో హి సద్యో వై తర్పణేనోపచీయతే,
నర్తే సన్తర్పణాభ్యాసాత్ చిరక్షీణస్తు పుష్యతి. ౩౧
దేహాగ్నిదోషభైషజ్యమాత్రాకాలానువర్తినా,
కార్యమత్వరమాణేన భేషజం చిరదుర్బలే. ౩౨
హితా మాంసరసాస్తస్మై పయాంసి చ ఘృతాని చ,
స్నానాని వస్తయోఽభ్యఙ్గాః తర్పణాస్తర్పణాశ్చ యే. ౩౩

వ్యా. తాత్కాలికముగ (తటాలున) నపతర్పణమునంజేసి హఠాత్తుగ సంభవించిన శరీరకార్శ్యము తత్కాలముననే సంతర్పణము నాచరించినయెడ అప్పుడే అట్టి కృశత్వము హరించి శరీరము బలిసి పుష్టిజెందును. అటుగాక చిరకాలమునుండి రోగములచే శరీరము కృశించినయెడ చిరకాలము క్రమముగ సంతర్పణము నభ్యాసముచేసినగాని శరీరమునకు పుష్టి గల్గదు.

మరియు చిరకాలమునుండి కృశించియున్నవానికి శరీరబలమును అగ్నిబలమును వాతాదిదోషబలమును చక్కగ గమనించి, తత్తదనుకూలముగ నౌషధమును పరిమాణము గల్పించి దేశకాలాదుల గమనించి, తొందరపడక మెలమెల్లగ సంతర్పణమును జేయదగును. (చిరకాలముగ వ్యాధ్యాదుల కృశతనొందినవానికి తటాలున బలవత్తరమైన సంతర్పణౌషధము నుపయోగించినయెడ దానంజేసి జఠరాగ్ని చల్లారి హానిని కల్గించును.

కావున అట్టివారికి శరీరాగ్నిబలాదుల ననుసరించి యౌషధమాత్రను కల్పించి నానాట మెలమెల్లగ సంతర్పణ నుపయోగింపవలెనని భావము).

అట్టి చిరకాలముగ కృశించినవారికి మాంసరసంబులును, పాలును, ఘృతంబులును, స్నానంబులును, వస్తులును, అభ్యంగనములును హితకరములు. అట్టిమాంసరసాదులు సంతర్పణకరము లగునౌషధాదులచే సంస్కరింపబడినవిగ నుండవలెను. (సంతర్పణ రెండు విధములు. అందొకటి కేవలము సంజ్ఞామాత్రమై యపతర్పణమును జేయునది. ఇదియే యపతర్పణరూపమైన చికిత్సలయందు "వ్యోషం విడంగం...సన్తర్పణం పిబేత్" అని చెప్పబడినది. ఇది స్వరూపముచేత సంతర్పణమని సంజ్ఞచేయబడెనదికాని, గుణముచేత సంతర్పణము కానేరదు. అటుకాక కేవలము తృప్తినొందించుటచే పుష్టికల్గించునది రెండవది. అయ్యది యీక్రింద "శర్కరాపిప్పలీమూల" అను గ్రంథముచే జెప్పబడును. ఇచ్చట నారెంటిలో తర్పణమునుచేయునట్టి సంతర్పణములనే యుపయోగింపవలెనని "తర్పణాస్తర్పణాశ్చ యే" అని చెప్పబడినది).

## శర్కరాదిసంతర్పణమంథము.

మూ. జ్వరకాసప్రసక్తానాం కృశానాం మూత్రకృచ్ఛ్రిణామ్,
తృష్యతామూర్ధ్వవాతానాం హితం వక్ష్యామి తర్పణమ్. 32
శర్కరాపిప్పలీమూలఘృతక్షౌద్రసమాంశకః, (సమాంశకైః)
సక్తుర్ద్విగుణతో వృష్యః తేషాం మన్థః ప్రశస్యతే. 33

వ్యా. జ్వరము, కాసము ఇవిరెండును చాలకాల మనుసరించి బాధించుటచేత కృశించినవారికిని, మూత్రకృచ్ఛ్రవ్యాధిపీడితులకును, దప్పిచేత బాధపడువారికిని, పైజెప్పిన యూర్ధ్వవాతముచే బాధితులకును, హితకరమైన సంతర్పణము క్రింద చెప్పబడును.—చక్కెర, పిప్పలిమూలము (మోడి), నెయ్యి, తేనె, ఇవియన్నియు సమభాగములు, సత్తుపిండి పైజెప్పినవానికన్నిటికిని రెండింతలుగ జేర్చి యన్నిటి నొకటిగగూర్చి మంథముచేసిన నయ్యది వృష్యముగ నుండును. ఇయ్యది పైజెప్పినకార్శ్యమున నుపయోగించుటకు మిక్కిలి ప్రశస్తము. (తక్కిన సంతర్పణమంథములయందును ఈభాగముల ననుసరించియే కల్పింపనగును).

## వాతాద్యనులోమనసంతర్పణమంథము.

మూ. సక్తవో మదిరా క్షౌద్రం శర్కరా చేతి తర్పణమ్,
పిబేన్మారుతవిణ్మూత్రకఫపిత్తానులోమనమ్. 34

వ్యా. సత్తుపిండి, మద్యము, తేనె, చక్కెర వీనినన్నిటిని మంథము జేసి త్రాగిన -హో వాతము, మలమూత్రములను, కఫపిత్తములను అనులోమములుగ సంచరింపజేయును. సంతర్పణమగును. (ఇచ్చట మదిర తేనె చక్కెర అను నీమూడును సమభాగములుగను ఈమూటికి ద్విగుణముగ సత్తుపిండిని చేర్పవలెనని యెఱుంగునది).

## ఉదావర్తాదిహరతర్పణము.

మూ. ఫాణితం సక్తవస్సర్పిః దధిమణ్డోఽమ్లకాఞ్జికమ్,
తర్పణం మూత్రకృచ్ఛ్రఘ్నం ఉదావర్తహరం పిబేత్. 3౭

వ్యా. ఫాణితము (చక్కెరపాకము), సత్తుపిండి, నెయ్యి, పెరుగుమీదిమీగడ, పులిగంజి వీనినన్నిటిని పైజెప్పినభాగముల ప్రకారము చేర్చి త్రాగినయెడ మూత్రకృచ్ఛ్రమును ఉదావర్తమును హరించును. ఇదియు తర్పణము.

## మద్యవికారహరమన్థము.

మూ. మన్థః ఖర్జూరమృద్వీకా వృక్షామ్లామ్లీకదాడిమైః,
పరూషకైస్సామలకైః యుక్తో మద్యవికారనుత్. 3౮

వ్యా. ఖర్జూరపండు, ద్రాక్షపండు, చింతపండు, పులిచింతాకు, దానిమ్మ, చిట్టీత పండు, ఉసిరికకాయలు వీనినన్నిటిని చేర్చి మంథముజేసిన నయ్యది మద్యపానమున గల్గిన వికారమును పోగొట్టును.

## సద్యస్సంతర్పణమంథము.

మూ. స్వాదురమ్లో జలకృతః సస్నేహో రూక్ష ఏవ వా,
సద్యస్సన్తర్పణో మన్థః స్థైర్యవర్ణబలప్రదః, ఇతి. 3౯

వ్యా. తీపికల్గిన వస్తువులను పులుపుకలవస్తువులను చేర్చి యుదకము బోసి స్నేహద్రవ్యమును చేర్చియైనను చేర్పకయైనను మంథముజేసిన నయ్యది సద్యస్సంతర్పణమగును. (అప్పుడే పుష్టిని కల్గించునదియని భావము.) శరీరమును దృఢముగ జేయును. కాంతిని బలమును కల్గించును.

## అధ్యాయవిషయసంగ్రహము.

మూ. తత్ర శ్లోకః:—
సన్తర్పణోత్థా యే రోగాః రోగా యే చాపతర్పణాత్,
సన్తర్పణీయే తేఽధ్యాయే సౌషధాః పరికీర్తితాః. ౪౦

వ్యా. సంతర్పణముచే జనించురోగములును, అపతర్పణమున గల్గురోగములును, ఆరెంటికి దగిన యౌషధంబులును, సంతర్పణమను నీయధ్యాయమున నాత్రేయమహర్షిచే విస్తరముగ వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
సన్తర్పణీయో నామ త్రయోవింశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమునందు సూత్రస్థానమున నిరువదిమూడవ యధ్యాయము
స మా ప్త ము.

---

## చతుర్వింశాధ్యాయము.

అవతారిక:—పైగ్రంథమున వాతపిత్తకఫముల నుద్దేశించి వాని స్వరూపంబును వానివలన గల్గురోగములకు బృంహణ లంఘనాది రూపములచే నారువిధములైన సామాన్యచికిత్సలును వివరింపబడినవి. రక్తమును వాతాదులవలె సమస్థితి నున్నపుడు శరీర పోషకంబును, వికృతి జెందినపుడు రోగజనకంబును నగును; కావున రక్తమునకు సంబంధించిన విషయములను, దానివలన కల్గురోగములను దానికి సంబంధించిన సంతర్పణాది రూపమైన చికిత్సను దెల్పునట్టి విధిశోణితీయ మనునధ్యాయము చెప్పబడును.

మూ॥ అథాతో విధిశోణితీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. సంతర్పణీయాధ్యాయమును చెప్పినపిదప శోణితవిధి ననుసరించి చెప్పబడు విధిశోణితీయ మనునధ్యాయమును త్రికాలజ్ఞానవేత్తయగు నాత్రేయుం డుపదేశించిన దానికి న్యూనాతిరేకములు లేకుండునట్లు వివరించెదనని భావము. 'విధినా శోణితం' అనుశబ్దము నధికరించి చెప్పబడిన యధ్యాయము విధిశోణితీయమని యధ్యాయసంజ్ఞ నెరుంగునది.

రక్తసంబంధములగు రోగములును వాతాదిదోషములవలననే కల్గును; అయినను తక్కినధాతువులకన్న రక్తమున గల్గురోగము లనేకములు కావున ప్రధానమని యుద్దేశించి రక్తమునకు ప్రత్యేకాధ్యాయము చెప్పబడినది యని యెరుంగునది.

### రక్తము శుద్ధమగుటకు కారణములు.

మూ. విధినా శోణితం జాతం శుద్ధం భవతి దేహినామ్,
దేశకాలౌకసాత్మ్యానాం విధిర్యః సంప్రకాశితః. 3

వ్యా. శరీరమునందు పుట్టునట్టిరక్తము తస్యాశితీయాధ్యాయమున జెప్పబడిన విధిప్రకారము జాంగలాది దేశములకును వసంతాదికాలములకు అభ్యాసమునకు సాత్మ్యములగు నాహారవిహారాదివిధి నవలంబించి యాచరించుటచేత పరిశుద్ధముగ నుండును.

అనగా తస్యాశితీయాధ్యాయమున (ఆరవయధ్యాయమున) దేశకాల అభ్యాసములకు సంబంధించిన సాత్మ్యములగు నాహారవిహారాదివిధులు చెప్పబడినవి. అట్టి విధిని మీరక యాహారవిధుల నాచరించినయెడ శరీరమునందలి రక్తము నిర్దుష్టముగ నుండు నని భావము. సాత్మ్యమన—"దేశానామామయానాం చ విపరీతగుణం గుణైః, సాత్మ్యమిచ్ఛన్తి సాత్మ్యజ్ఞాః చేష్టితం చాద్యమేవ చ" అని తస్యాశితీయముననే చెప్పబడినది. దేశాదులకు విపరీతగుణములైన యాహారవిహారాదులు దేశాదిసాత్మ్యములని భావము. "ఉపశేతే యదౌచిత్యాత్ ఓకసాత్మ్యం తదుచ్యతే" యని యోకసాత్మ్యము చెప్పబడినది.

కొందరు శరీరమున బుట్టిన రక్తము కొన్ని కారణాంతరములచే దుష్టమైనచో నయ్యది తస్యాశితీయాధ్యాయమున జెప్పిన దేశ-కాల-అభ్యాసములకు సాత్మ్యము నుద్దేశించి చెప్పినవిధి నవలంబించినచో శుద్ధమగునని పై శ్లోకమునకు వ్యాఖ్యానము చేసెదరు.

## విశుద్ధరక్తకృత్యము.

మూ. తద్విశుద్ధం హి రుధిరం బలవర్ణసుఖాయుషా,
యునక్తి ప్రాణినం ప్రాణశ్శోణితం హ్యనువర్తతే.     ౪

వ్యా. పరిశుద్ధమైన యారక్తమును ఆధారముగ జేసికొని ప్రాణముండును; కావున పైజెప్పిన రీతిగ తస్యాశితీయాధ్యాయమునందలి విధానము నవలంబించుటచే పరిశుద్ధమైన రక్తము మనుజులకు బలమును శరీరవర్ణమును ఆయువును చెడనీయక సమకూర్చుచుండును.

'తద్విశుద్ధం' అనుచోట 'తేన (విధినా) శుద్ధం' అను విగ్రహముచేత తస్యాశితీయమున జెప్పినవిధిచే శుద్ధమైనరక్తము అని యర్థమగును. లేక తచ్ఛబ్దము పూర్వపరామర్శకము కావున పైజెప్పబడిన శుద్ధరక్తమనియైన యర్థము సమంజసము. మరియు దశప్రాణాయతనీయమను నిరువదితొమ్మిదవయధ్యాయమున "దశైవాయతనాన్యాహుః ప్రాణా యేషు ప్రతిష్ఠితాః, శఙ్ఖౌ మర్మత్రయం కంఠో రక్తం శుక్రౌజసీ గుదమ్" అని చెప్పినప్రకారము రక్తము ప్రాణమున కాధారమని తెలియునది.

## రక్తదుష్టికారణములు.

మూ. ప్రదుష్టబహుతీక్ష్ణోష్ణైః మద్యైరన్యైశ్చ తద్విధైః,
(రసైశ్చ తద్విధైః)
తథాతిలవణక్షారైః అమ్లైః కటుభిరేవ చ. ౫
కులుత్థమాషనిష్పావతిలతైలనిషేవణైః,
పిణ్డాలుమూలకాదీనాం హరితానాం చ సర్వశః. ౬
జలజానూపశైలానాం ప్రసహానాం చ సేవనాత్,
దధ్యమ్లమస్తుసక్తూనాం సురాసౌవీరకస్య చ. ౭
విరుద్ధానాముపక్లిన్నపూతీనాం భక్షణేన చ,
భుక్త్వా దివా ప్రస్వపతాం ద్రవస్నిగ్ధగురూణి చ ౮
అత్యాదానం తథా క్రోధం భజతాం చాతపానలౌ,
ఛర్దివేగప్రతీఘాతాత్ కాలే చానవసేచనాత్. ౯
శ్రమాభిఘాతసన్తాపైః అజీర్ణాధ్యశనైస్తథా,
శరత్కాలస్వభావాచ్చ శోణితం సంప్రదుష్యతి. ౧౦

వ్యా. మిక్కిలి దుష్టములైన (స్వాభావికమైన ప్రకృతివిరుద్ధములైన)వియు, మిక్కిలి తీక్ష్ణంబులును, ఉష్ణంబులునైన మద్యములను త్రాగుట, అట్టి చెడ్డగుణములుకల పానకాదులను త్రాగుట (లేక దుష్టంబులును తీక్ష్ణోష్ణంబులునైన యన్నముల భుజించుట), అధికమైన లవణంబును (ఉప్పును) కారమును కల యన్నాదులనైనను, అమ్ల కటురసములు పదార్థములనైనను భుజించుట, ఉలవలు, మినుములు, అనుములు, నువ్వులు, నూనె వీనిని సేవించుట, పెండలము, ముల్లంగి మున్నగుదుంపలను, పలుదెరంగులైన యాకుకూరలను తినుట, నీటిజంతువులయొక్కయు, జలప్రాంతమునందు జంతువులయొక్కయు, కొండగుహలలోనుండు జంతువులయొక్కయు, ప్రసహముల (బలాత్కారముగ జంతువులకిహింసించు బెబ్బులి మున్నగుజంతువుల) యొక్కయు, మాంసమును తినుట; పెరుగు, పులిసిన పెరుగుమైమీగడ, సత్తుపిండి, సురయను మద్యము, పులిసిన కూటినీళ్లు వీనిని త్రాగుట; పరస్పరవిరుద్ధములైన క్షీర మత్స్యముల నొకటిగ జేర్చి యుపయోగించుట, కుళ్లిన వస్తువులను కంపెత్తినవస్తువులను తినుట, ద్రవంబును స్నిగ్ధంబును గురుత్వము కల్గినదియు నగు నాహారమును భుజించి పగటియందు నిదురించుట, తాను భుజించుపరిమితికన్న మిక్కుటముగ భుజించుట, కోపపడుట, ఎండయందును నిప్పుసెగయందును

నివసించుట, వాంతిరానున్నపుడు దానిని రానీయక నిరోధించుట, రక్తమోచనము చేయవలసిన శరత్కాలమున చేయకుండుట, పనుల జేయుటవలన నలసట జెందుట, దెబ్బలు మొదలగు నభిఘాతము కల్గుట, మనస్సంతాపము జెందుట, ఈకారణములచేత రక్తము చెడును. మరియు శరత్కాలమున కాలస్వభావమునంజేసి (పైకారణములు లేకున్నను) రక్తము చెడును. మరియు పక్వముగాని యన్నము భుజించినను, భుజించిన యాహారము జీర్ణము కాకుండునపుడు మరల భుజించినను రక్తము చెడును.

ఇచ్చట "పిత్తం ప్రాయశ్శరది కుప్యతి" అనువచనముచేత పిత్తము ప్రకోపమును చెందునని శరదృతుచర్యలో చెప్పబడినది. పిత్తము ప్రకోపము జెందినపుడు దానికి ఆధారమైన రక్తంబును చెడును. కావుననే శరదృతువునందు పిత్తప్రతీకారమునకై "తిక్తస్య సర్పిషః పానం విరేకో రక్తమోక్షణమ్" అని రక్తమోక్షణంబును శరదృతు చర్యయందు చెప్పబడినది. శరత్కాలమున రక్తమోక్షణము చేయనిచో రక్తము దుష్టమగునని "కాలే చానవసేచనాత్" అనువాక్యముచే రక్తదుష్టికారణము చెప్పబడినది.

### రక్తదుష్టివలన గల్గురోగములు.

మూ. తతశ్శోణితజా రోగాః ప్రజాయన్తే పృథగ్విధాః,
ముఖరోగోఽక్షిరాగశ్చ (పాకశ్చ) పూతిఘ్రాణాస్యగన్ధతా.
గుల్మోపకుశవీసర్పరక్తపిత్తప్రమీలకాః,
విద్రధీ రక్తమేహాశ్చ ప్రదరో వాతశోణితమ్. ౧౨
వైవర్ణ్యమగ్నినాశశ్చ పిపాసా గురుగాత్రతా,
సన్తాపశ్చాతిదౌర్బల్యం అరుచిశ్శిరసశ్చ రుక్. ౧౩
విదాహశ్చాన్నపానస్య తిక్తామ్లోద్గిరణం క్లమః,
క్రోధప్రచురతా బుద్ధేస్సమ్మోహో లవణాస్యతా. ౧౪
స్వేదశ్శరీరదౌర్గన్ధ్యం మదః కమ్పః స్వరక్షయః,
తంద్రా నిద్రాతియోగశ్చ తమసశ్చాతిదర్శనమ్. ౧౫
కణ్డ్వారుకోఠపిటకాః కుష్ఠచర్మదలాదయః,
వికారాస్సర్వ ఏవైతే విజ్ఞేయాశ్శోణితాశ్రయాః. ౧౬

వ్యా. పైజెప్పిన కారణములచే దుష్టమైనరక్తమువలన నీరోగములు సంభవించును:—ముఖరోగము, కన్నులెఱ్ఱవారుట (కన్నులు పుండగుట), ముక్కునను నోటియందును దుర్గంధము, గుల్మము, ఉపకుశము (దంతముల కాధారములగు చిగుళ్ల

సందు మంటకల్గి పన్నులు కదలుచుండురోగవిశేషము), విసర్పము, రక్తపిత్తము, ప్రమీలకము (మైకము), విద్రధి యనువ్రణవిశేషము, రక్తమేహము, రక్తప్రదరము, వాతరక్తము, శరీరవర్ణము మారియుండుట, అగ్నిమాంద్యము, దప్పి, ఒడలిబరువు, సంతాపము, మిక్కిలి బలహీనము, అరోచకము, తలనొప్పి, అన్నపానములు అతివేగ ముగ దహింపబడుట, చేదుగనైనను పులుపుగనైనను త్రేపులువచ్చుట, బడలిక, అధిక క్రోధము, జ్ఞానము శూన్యమగుట, నోరు ఉప్పనైయుండుట, శరీరముపై నధికముగ చెమటబట్టుట, ఒడలికంపు, మదము (తిక్కయెత్తినట్లుండుట), శరీరము వణకుట, స్వరము క్షీణించుట, కునికిపాటు, అతినిద్ర, చీకటిలోనున్నట్లు మైకమధికముగ గ్రమ్ముట, దురద, ఒడలినొప్పులు, శరీరముపై దద్దులును పొక్కులును కల్గుట, కుష్ఠములు, చర్మదళకుష్ఠము ఇవిమున్నగు నానావిధరోగములును రక్తము నాశ్రయించి (రక్తము చెడుటవలన) జనించురోగములు.

ఇచ్చట నుపకుశలక్షణము "శోష్టేషు దాహో భవతి తేషు దన్తాశ్చలన్తి చ, తస్మిన్నుపకుశో నామ పిత్తరక్తకృతోగదః" అను సుశ్రుతవాక్యమునుబట్టి యెరుంగునది. కుష్ఠమున చర్మదళమును వేరుగ చెప్పుటచేత చర్మదళకుష్ఠము విశేషముగ రక్తదుష్టిచే జనించునని యెరుంగునది. "శోణితజాః" అని చెప్పక "శోణితాశ్రయాః" రక్తము వాతాదులవలె స్వతంత్రముగ (త్రిదోషముల నపేక్షింపక) రోగకారణము కానేరదని తెలిసెడి.

## అనుక్తరక్తరోగపరిజ్ఞానోపాయము.

శ్లో. శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైః ఉపక్రాన్తాశ్చ యే గదాః,
సమ్యక్సాధ్యా న సిధ్యన్తి రక్తజాంస్తాన్విభావయేత్. ౧౭

వ్యా. మరియు కేవల వాత-పిత్త-కఫముల హరించుటకై శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్షాది గుణములు కలచికిత్సలచే వ్యత్యస్తము లేక చక్కగ చికిత్స జేసినను నారోగములు సాధ్యావస్థనుండియు శమించకున్నయెడ నట్టిరోగములన్నియు రక్తదోషమున సంభవించినవని యెరుంగునది.

వైద్యుడు కేవలము స్ఫుటముగ గానంబడు లక్షణములనుబట్టి వాతికమనియో పైత్తికమనియో శ్లైష్మికమనియో నిర్ణయించి, అట్టిదోషమునకు మాత్రము దగినశీతోష్ణాదిరూపమైన చికిత్స జేసినప్పుడు, వ్యాధి సాధ్యావస్థనుండియు శాంతినొందకుండు నెడ నావ్యాధి రక్తముచే సంభవించినదని సామాన్యముగ రక్తజనితరోగమును గమనింపనగు భావము.

ఇయ్యది యనుపశయముచే వ్యాధిని నిర్ణయించుపద్ధతి. ఈవిధానము "గూఢ లింగం వ్యాధి ముపశయాపశయాభ్యాం పరీక్షేత" అని చెప్పబడినది.

రక్తాశ్రయరోగములకు చికిత్స.

మూ. కుర్యాచ్ఛోణితరోగేషు రక్తపిత్తహరీం క్రియామ్,
విరేకముపవాసం (విరేకమనువాసం) వా స్రావణం శోణితస్య వా.

వ్యా. పైజెప్పినరక్తము నాశ్రయించినరోగములయందు రక్తపిత్తహరమైన చికిత్స జేయనగును. మరియు విరేచనము, ఉపవాసము, రక్తమోక్షణము జేయందగును. (లేక అనువాసనవస్తి జేయందగును.)

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—రక్తజరోగములయందు రక్తదుష్టమైనపుడు అట్టిరక్తము నాశ్రయించి వాతాదులు ప్రకోపమునొంది రోగముల గల్గించును. అందు రక్తశామకచికిత్స ననుసరించక కేవల వాతాదిదోషమాత్రహరములైన స్నిగ్ధశీతాదిచికిత్సల మాత్రము చేసినయెడ స్వాశ్రయమైనరక్తముయొక్క ప్రభావమునంజేసి శమింపవు. కావున రక్తమును దానినాశ్రయించిన వాతాదిదోషములను (రెంటిని) శమింపజేయునట్టి చికిత్స జేయవలెను. అందును ప్రాయికముగ రక్తమును పిత్తంబును సమానముగ నుండును కావున రక్తపిత్తహరములైన విరేకంబును రక్తమోక్షణంబును విధింపబడినది. అట్టి విరేకాదిచికిత్సలను సందర్భానుసారముగ జేయనగును.

రక్తస్రావపరిమితి.

మూ. బలదోషప్రమాణాద్వా విశుద్ధ్యా రుధిరస్య వా,
రుధిరం స్రావయేజ్జన్తోరాశ్రయం ప్రసమీక్ష్య వా.        ౧౯

వ్యా. రక్తమోక్షణము జేయుంతరి రోగియొక్కబలపరిమితి నాశ్రయించి రోగముయొక్క ప్రమాణము ననుసరించి తత్తదనుగుణముగ రక్తమును స్రవింపజేయవలెను. లేక యెంతరక్తమును స్రవింపజేసినచో దుష్టరక్తమంతయు వెడలి శరీరమునందలి రక్తము పరిశుద్ధమగునో అంతరక్తమును వెడలింపవలెను. మరియు దుష్టమైన రక్తము జేరియున్న ప్రదేశమును చక్కగ గమనించి యేప్రదేశమున నెంతరక్తము విధ్యనుసారముగ స్రవింపజేయదగునో అంతరక్తమును వెడలించవలెను.

రోగము స్వల్పముగ నున్నప్పుడు స్వల్పముగను, బలవత్తరముగ నున్నపుడు అధికముగను రక్తమును స్రవింపజేయవలెను. ఎట్లులన:—కుష్ఠము స్వల్పముగ నున్నపుడు స్వల్పముగను, అధికముగ నున్నపుడు అధికముగను రక్తమును స్రవింపజేయవలెను. ఈవిషయము తంత్రాంతరమున "ప్రచ్ఛనమల్పే కుష్ఠే మహతిచశస్తం సిరావ్యధ

నమ్" అని చెప్పియున్నారు. సిరావ్యధనము, ప్రచ్ఛనము అనునవి వ్యాధిబలానుసారముగ జెప్పబడినవి. ఎట్టివిధానముచే ప్రమాదము కల్గకుండునో అట్టివిధి ననుసరించి రక్తస్రావము జేయందగునని ముఖ్యభావము.

### వాతాదిదుష్టరక్తలక్షణములు.

మూ. అరుణాభం భవేద్వాతాత్ విశదం ఫేనిలం తను,
పిత్తాత్పీతాసితం రక్తం స్త్యాయత్యౌష్ణ్యాత్ చిరేణ చ. ౨౦
ఈషత్పాణ్డు కఫాద్దుష్టం పిచ్ఛిలం తన్తుమద్ఘనం,
ద్విదోషలిఙ్గం సంసర్గాత్ త్రిలిఙ్గం సాన్నిపాతికమ్. ౨౧

వ్యా. వాతముచే దుష్టమైనరక్తము మిక్కిలి యెఱ్ఱనిరంగుకల్గి జిడ్డులేక విశదముగను నురుగుతోగూడి పలుచనై యుండును. పిత్తముచే దుష్టమైనరక్తము నలుపుతో కూడిన పసుపురంగుకల్గి యుష్ణమై (వేడికల్గి) దానంజేసి చిరకాలమునకు ఘనీభవించును. కఫముచే దుష్టమైనరక్తము కొంచెముగ పాండురవర్ణముకల్గి జిగటగను తీగెలుసాగుచు ఘనీభవించి (గడ్డకట్టి) యుండును. మరియు పైజెప్పిన లక్షణములలో రెండేసిదోషముల లక్షణములు మిశ్రముగ నుండుసపుడు ద్విదోషసంసర్గమున రక్తము దుష్టమైనదనియు, మూడుదోషములకు జెప్పినలక్షణములన్నియు కలిసియుండునెడ త్రిదోషసన్నిపాతమున రక్తము దుష్టమైనదనియు నెరుంగునది.

### నిర్దుష్టరక్తలక్షణములు.

మూ. తపనీయేంద్రగోపాభం పద్మాలక్తకసన్నిభమ్,
గుఞ్జాఫలసవర్ణం చ విశుద్ధం విద్ధి శోణితమ్. ౨౨

వ్యా. వాతాదులచే దుష్టముగాక పరిశుద్ధముగ నుండురక్తము కాచబడి పసుపు మీరియుండు బంగరురంగును, ఇంద్రగోపపుపురుగువలె నెఱ్ఱనిడాలును, ఎఱ్ఱతామరవంటి రంగును, లత్తుకవంటిరంగునుకల్గియు, లేక గురిగింజవంటిరంగును కల్గియైన నుండును. (అట్టిలక్షణములబట్టి శుద్ధరక్తమని యెఱుంగనగునని భావము.)

మనుజులు వాతాదులలో నానాప్రకృతులు కల్గియుందురు కావున ఆయా ప్రకృతుల ననుసరించి ఆయారంగులు గల్గియుండునని తలంచి తపనీయాదిదృష్టాంతముచే ననేకవర్ణములు విశుద్ధరక్తమునకు జెప్పబడినవని యెఱుంగునది.

మరియు శుద్ధరక్తలక్షణములు వాగ్భటాచార్యునిచే నిట్లు చెప్పబడినవి:—
"మధురం లవణం కిఞ్చిత్ అశీతోష్ణమసంహితమ్, పద్మేన్ద్రగోపహేమావిశశలోహిత లోహితమ్. లోహితం ప్రవదేచ్ఛుద్ధం తనోస్తేనైవ చ స్థితిః" ఈవాక్యముచేత కొంచె

ముగ లవణముతోఁగూడిన మధురరసంబును, సమశీతోష్ణంబును నైనదనియుం, ఆట్టి శుద్ధరక్తము చేతనే శరీరము స్థిరముగ నుండుననియు విశేషముగ జెప్పబడినది.

రక్తస్రావానంతరము పథ్యసేవనవిధి.

మూ. నాత్యుష్ణశీతం లఘు దీపనీయం రక్తేఽపనీతే హితమన్నపానమ్,
తదా శరీరం హ్యనవస్థితాసృక్ అగ్నిర్విశేషేణ చ రక్షితవ్యః

వ్యా. మనుజునకు రక్తస్రావము జేయించినతోడనే శరీరమునందలి రక్తము చంచలమై కదలుచుండును. జఠరాగ్ని మందగించియుండును కావున ఆట్టి యగ్నిని కాపాడుట ముఖ్యకర్తవ్యము. అందుకై ఆట్టిరోగికి మిక్కిలి ఉష్ణంబును శీతంబునుగాక (సమశీతోష్ణంబై) చుఱుకనగ జీర్ణమై జఠరాగ్నిని జ్వలింపజేయు నన్నపానంబులు మిక్కిలి హితకరంబులై యుండును.

మనుజుని శరీరమునందలి రక్తము రక్తస్రావమునంజేసి మరింత చంచలమై యుండును. అట్టియెడ అత్యుష్ణమైన యన్నపానముల నుపయోగించినచో రక్తమును మిక్కిలి చలింపజేయును. జఠరాగ్ని రక్తమోక్షణముచేత బలహీనస్థితి నున్నపుడు అతిశీతంబులగు నన్నపానము లుపయోగించినయెడల జఠరాగ్నిని మరింత మందగింపజేయును. కావున అత్యుష్ణంబును అతిశీతంబును కాక సమశీతోష్ణస్థితినుండి యగ్నిని దీపింపజేయు నన్నపానములు హితకరములని భావము.

రక్తస్రావముచే శుద్ధమైనరక్తము కలవానిలక్షణములు.

మూ. ప్రసన్నవర్ణేంద్రియమిన్ద్రియార్థా
నిచ్ఛన్తమవ్యాహతపక్తృవేగమ్,
సుఖాన్వితం తుష్టిబలోపపన్నం
విశుద్ధరక్తం పురుషం వదన్తి. ౨౮

వ్యా. రక్తస్రావము జేసికొనిన మనుజునికి శరీరవర్ణంబును చక్షురాదీంద్రియంబులును నిర్మలంబులై ఆయాఇంద్రియంబులకు సంబంధించిన శబ్దస్పర్శాదులను గ్రహించుటకిచ్ఛగల్గి జఠరాగ్ని నిరాటంకముగ ఆహారమును పచింపజేయుశక్తి గల్గి మలమూత్రాదివేగములు అడ్డులేక యుక్తకాలమున ధారాళముగ వెడలుచుండి మనస్సంతోషంబును శరీరబలంబును గల్గి సుఖముగ నున్నచో నట్టిపురుషుని శుద్ధమైనరక్తము కలవానినిగ నెఱుంగునది.

రక్తరససంజ్ఞావహస్రోతస్సులదుష్టిచే గల్గురోగములు.

మూ. యదా తు రక్తవాహీని రససంజ్ఞావహాని చ,
పృథక్ పృథక్ సమస్తా వా స్రోతాంసి కుపితా మలాః. ౨౯

మలినాహారశీలస్య రజోమోహావృతాత్మనః,
ప్రతిహత్యానతిష్ఠన్తే జాయన్తే వ్యాధయస్తదా. ౨౬
మదమూర్ఛాయసన్న్యాసాః తేషాం విద్యాద్విచక్షణః,
యథోత్తరం బలాధిక్యం హేతులిఙ్గోపశాన్తిషు. ౨౭

వ్యా. మలినములైన యాహారముల దినువానికిని రజోగుణముచేతను అజ్ఞానముచేతను ఆవరింపబడినవానికిని వాతాదిదోషములు ప్రకోపమునొంది వేరువేరుగనైనను అన్నియు కలిసియైనను రక్తమును వహించునాడులనైనను, రసధాతువును వహించునాడులనైనను సంజ్ఞ (జ్ఞానమున) కాధారమైన మనస్సును వహించునాడులనైనను ప్రవేశించినపుడు, అట్టినాడులును అడ్డగించియుండును అప్పుడు మదము, మూర్ఛ సన్న్యాసమనను (మానసిక) వ్యాధులను కల్గించును. ఆమూడును ఒకదానికన్న నొకటి మిక్కిలి బలవత్తరములుగ నుండును. మరియు వానిలో నొకదానికన్న నొకటి బలవత్తరమైన కారణములచే గల్గి బలవత్తరలక్షణములుకల్గి, బలవత్తరములైన చికిత్సలచే శాంతినొందదగినవి యగును. (మదమునకన్న మూర్ఛయు, దానికన్న సన్న్యాసంబును బలాధికములై యుండునని భావము. మదమనునది తిక్క. ఇదియే యున్మాద మనబడును). ఈమూడువ్యాధులయందును ప్రధానమైన యజ్ఞానము ఉత్తరోత్తర మధికముగ నుండునని "హేతులింగోపశాన్తిషు" అనువాక్యముచే దెలిసెడి. ఇచ్చట జెప్పబడిన మూడురోగములు వాగ్భటాచార్యులచే నిట్లు చెప్పబడినవి:—"రజోమోహాఽహితాహారపరస్య స్యుస్త్రయో గదాః, రసాసృక్చేతనావాహిస్రోతోరోధసముద్భవాః మదమూర్ఛాయసన్న్యాసాః యథోత్తర బలోత్తరాః" రజోగుణము ప్రధానముగ గల మనుజుడు అపథ్యములగు నాహారవిహారాదుల సేవించినపుడు వాతాదిదోషములు ప్రకుపితములై రసధాతువును వహించు స్రోతస్సులమార్గము నడ్డగించి మదమును కల్గించుననియు మోహము (తమోగుణము) ప్రధానముగ గలమానవునకు వాతాదులు ప్రకోపమునంది రక్తావహములగు స్రోతస్సుల నడ్డగించి మూర్ఛను కల్గించుననియు, నిరంతరము నపథ్యముల సేవించుమానవునకు వాతాదులు ప్రకుపితములై జ్ఞానవహంబులగు స్రోతస్సుల నడ్డగించి సన్న్యాసమును కల్గించుననియు నర్థము. ఇచ్చట రసధాతువహస్రోతస్సుల నడ్డగించినపుడు మదరోగంబును, రక్తవహస్రోతస్సుల నడ్డగించినపుడు మూర్ఛయు, జ్ఞానవహస్రోతస్సుల నడ్డగించినపుడు సన్న్యాసంబును సంభవించునని యథాసంఖ్యముచే దెలిసెడి. (ఈమూడువ్యాధులయందును అజ్ఞానము ముఖ్యలక్షణము. అయ్యది మదమునందు స్వల్పముగను మూర్ఛయందు అధికముగను, సన్న్యాసమునందు అత్యధికముగ ... ... తెలిసెడి)

### వాతాదిమదసంప్రాప్తి.

మూ. దుర్బలం చేతసస్థ్సానం యదా వాయుః ప్రపద్యతే,
మనో విక్షోభయన్ జన్తోః సంజ్ఞాం సమ్మోహయేత్తదా. ౨౮
పిత్తమేవం కఫశ్చైవం మనో విక్షోభయన్ నృణామ్,
సంజ్ఞాం నయత్యాకులతాం విశేషశ్చాత్ర వక్ష్యతే. ౨౯

వ్యా. వాతము ప్రకోపించి జ్ఞానమునకు ముఖ్యస్థానమైన హృదయము మిక్కిలి బలహీనమైయుండునెడ నట్టిదుర్బలహృదయమున జేరి వానిజ్ఞానమును కల్లోలముగ కలత నొందించి తెలివిని నశింపజేయును. ఇత్తెరంగుననే పిత్తకఫములు ప్రకుపితములై చాల దుర్బలమైన హృదయస్థానమున జేరినపుడు జ్ఞానము కలతనొందించును (ఇదియే మద మని చెప్పబడును). ఇది సామాన్యస్వరూపము. వాతాదివిశేషలక్షణములు క్రింద వివరింపబడును.

### వాతికమదలక్షణము.

మూ. సక్తాఽనల్పద్రుతాభాషం చలస్ఖలితచేష్టితమ్,
విద్యాద్వాతమదావిష్టం రూక్షశ్యావారుణాకృతిమ్. ౩౦

వ్యా. వాతముచే గల్గినమదమున బాధింపబడుమనుజుడు కొతుకుగ నతివేగముగ మితిమీరి మాటలాడును. ఒకనియమము లేక తొట్రుపాటుతో గూడిన యాంగికాది చేష్టలజేయును, రూక్షంబును శ్యావారుణంబునైన యాకారము కల్గియుండును.

### పైత్తికమదలక్షణము.

మూ. సక్రోధపరుషాభాషం సంప్రహారకలిప్రియం,
విద్యాత్పిత్తమదావిష్టం రక్తపీతాఽసితాకృతిమ్. ౩౧

వ్యా. పిత్తమదముచే నావేశము నొందినమనుజుడు మిక్కుటముగ కోపముతో కఠినోక్తుల బల్కును. కొట్లాటయందును కలహమునందును ఆసక్తి కల్గియుండును. ఎఱుపు పసుపు నలుపులతో గలిసినయాకారము కల్గియుండును.

### శ్లైష్మికమదలక్షణము.

మూ. స్వల్పసంబంధవచనం తన్ద్రాలస్యసమన్వితమ్,
విద్యాత్కఫమదావిష్టం పాణ్డుం ప్రధ్యానతత్పరమ్. ౩౨

వ్యా. కఫప్రకోపమువనైన మదముకలవాడు స్వల్పముగ సంబంధముతో గూడిన మాటల బల్కును. కునికిపాటుతో పనులయందు మాందముగ ప్రవర్తించును. శరీరవర్ణము పాండురముగ నుండును. ఎప్పుడు జూచిన నేదో మనస్సున తలపోయుచుండును.

### సాన్నిపాతికమదలక్షణము, మదసామాన్యస్వరూపము.

మూ. సర్వాణ్యేతాని రూపాణి సన్నిపాతకృతే మదే,
జాయతే శామ్యతి క్షిప్రం మదో మద్యమదాకృతిః. 33

వ్యా. సన్నిపాతమున కల్గినమదమున వాతాదులకు వేరువేరుగ జెప్పినలక్షణము లన్నియుం మిశ్రములై యుండును. మదము తనంతటనే శీఘ్రముగ కల్గి తనంతనే (మద్యపానముచే గల్గినమదమువలె) శీఘ్రముగ శమించుచుండును. (ఇది మదమునకు సామాన్యస్వరూపము) (ఇత్తైరంగున అష్టోదరీయమను పందొమ్మిదవయధ్యాయమున 'చత్వారో మదాః' అని నిర్దేశింపబడిన మదభేదముల నాల్గిటికిని ప్రత్యేకలక్షణములు వివరింపబడినవని యెఱుంగునది).

మూ. యశ్చ మద్యమదః ప్రోక్తః విషజో రౌధిరశ్చ యః,
సర్వ ఏతే మదా నర్తే వాతపిత్తకఫత్రయాత్. 34

వ్యా. మరియుం మద్యపానమున గల్గినమదంబును, విషమున గల్గినమదంబును దుష్టరక్తముచే గల్గినమదంబును ఇవియన్నియుం వాతపిత్తకఫముల మూడిటిసంబంధము లేక జనించుటలేదు. పైజెప్పినమదముల మూడిటికిని మద్యపానంబును విషంబును రక్తంబును కారణములై యున్నను, వానియందు వాత-పిత్త-కఫములు ప్రకోపము జెంది వాని లక్షణముల జూపుచుండును కావున త్రిదోషములును కారణములగును. దానంజేసి మద్యాదులచే గల్గినమదంబులును, పైజెప్పినరీతిగ వాత-పిత్త-కఫ-సన్నిపాతభేదములచే నాలుగేసివిధములై యుండునని భావము. మరియుం మద్యపానముచేతను విషముచేతను దోషములు మూడును ప్రకోపము జెందును. అయినను "వ్యపదేశస్తు భూయసా" అనువచన ప్రకారము అట్టిదోషములలో నుత్కటమైన దోషమునుబట్టి వాతికాది భేదములు చెప్పబడినవని యెఱుంగునది).

### వాతికమూర్ఛాలక్షణము.

మూ. నీలం వా యది వా కృష్ణం ఆకాశమథ వాఽరుణమ్,
పశ్యంస్తమః ప్రవిశతి శీఘ్రం చ ప్రతిబుధ్యతే. 35
వేపథుశ్చాఙ్గమర్దశ్చ ప్రపీడా హృదయస్య చ,
కార్శ్యం శ్యావారుణా చ్ఛాయా మూర్ఛాయే వాతసమ్భవే.

వ్యా. మనుజుడు ఆకసమును నీలవర్ణముగనైనను నల్లనిరంగు కల్గినట్లైనను ఎఱ్ఱని రంగు కల్గినదానినిగ నైనను జూచుచు తెలివితప్పి యొడలెరుంగక పడి మరల శీఘ్రముగనే మూర్ఛదేరినయెడ నయ్యది వాతప్రకోపమున సంభవించినమూర్ఛ యని యెఱుంగునది.

ఈమూర్ఛ కల్గినప్పుడు శరీరము వడవడ వణకును, ఒడలియందంతటను నొప్పికల్గును, రొమ్మున పట్టినట్లు నొప్పికల్గును, శరీరము కృశించును, శరీరమున శ్యామవర్ణంబైనను అరుణవర్ణంబైన కల్గును. (ఇట్టిలక్షణములు కల్గినది వాతమున కల్గినమూర్ఛ యని యెరుంగునది).

ఈవాతికమూర్ఛయందు శ్యావారుణఛాయకల్గునని చెప్పబడినది. 'వాతాద్రజో ఒరుణాచ్ఛాయా శ్యావా' అని అష్టాంగహృదయమున జెప్పినప్రకారము శరీరమున సంభవించుఛాయ అరుణశ్యామవర్ణములై యుండుచో నయ్యది పంచమహాభూతము లతో చేరినవాయువికారమని తెలిసెడి. అయ్యది 'వాయవీ రోగమరణక్లేశాయ' అను నష్టాంగహృదయవాక్యమువలనను "వాయవ్యాసా వినాశాయ క్లేశాయమహతేఽపివా" అను ప్రమాణాంతరముచేతను మరణసూచకమని తెలియుచున్నది. కావున ప్రకృతమున జెప్పినఛాయనుబట్టి ఇయ్యది యరిష్టజనకమని యూహింపదగియున్నది. అయినను కారణములేక వాయవ్యఛాయసంభవించినచో నయ్యది యరిష్టమగునుకానిసకారణముగ సంభవించినది యరిష్టము కానేరదు. ఇచ్చట శ్యావారుణచ్ఛాయ వాతప్రకోపమునంజేసి సంభవించినదికాని యకారణముకాదు. కావున నియ్యది యరిష్టలక్షణమని భ్రమింప నవకాశములేదు. అయినను "క్లేశాయ మహతేఽపి వా" అని చెప్పినట్లు మిక్కిలి క్లేశ మును మాత్రము కల్గించును.

మరియు ఛాయాస్వరూపమును వాగ్భటాచార్యు లిట్లుపదేశించిరి:—"వర్ణ మాత్రా మతిచ్ఛాయా ప్రభావర్ణప్రకాశినీ, ఆసన్నే లక్ష్యతే చ్ఛాయా వికృష్టేభా ప్రకాశతే" నీలపీతాదివర్ణములవలన బుట్టి అట్టివర్ణమును మించి ప్రకాశించునది ఛాయ. ఇయ్యది సమీపముననే తెలియదగియుండును. నీలపీతాదివర్ణముల ప్రకాశింప జేయుస్వభావము కల్గినది ప్రభ. ఇయ్యది దూరమునుండియు గమనింపదగియుండునని యర్థము.

### పైత్తికమూర్ఛాలక్షణము.

మూ. రక్తం హారితవర్ణం వా వియత్పీతమథాపి వా,
పశ్యం స్తమః ప్రవిశతి సస్వేదశ్చ ప్రబుధ్యతే.　　　３౭
సపిపాసః ససన్తాపః రక్తపీతాకులేక్షణః,
సంభిన్నవర్చాః పీతాభః మూర్ఛాయే పిత్తసంభవే.　　　３౮

వ్యా. ఆకసము ఎఱ్ఱనిరంగుకలదిగనైనను, ఆకుపచ్చనిరంగుకలదిగనైనను, పసుపు పచ్చనిరంగుకలదిగనయినను కనుబడి తెలివిదప్పి మూర్ఛనొంది యొడలు తెలియునప్పుడు శరీరమున చెమటబట్టి లేచినచో నయ్యది పిత్తప్రకోపమున కల్గినమూర్ఛ యని యెరుం

గునది. ఈమూర్ఛయం దధికముగ దప్పికల్గును. శరీరమునందెల్ల మంటబుట్టును. కన్ను ఎఱ్ఱగనైనను పచ్చగనైనను అరుణవర్ణముగనైన నుండును. మలము భిన్నముగ (ఉం లుగ) నగును. శరీరము పచ్చనిరంగుకల్గియుండును. (ఈలక్షణములు కల్గినది పిత్తజ మూర్ఛ యనిభావము.)

## కఫజమూర్ఛాలక్షణము.

మూ. మేఘసఙ్కాశమాకాశం ఆవృతం వా తమోఘనైః,
పశ్యం స్తమః ప్రవిశతి చిరాచ్చ ప్రతిబుధ్యతే. 3
గురుభిః ప్రావృతైరఙ్గైర్యథైవార్ద్రేణ చర్మణా,
సప్రసేకస్సహృల్లాసః మూర్ఛాయే కఫసంభవే. ౪

వ్యా. ఆకసమును మబ్బుతో సమానముగనైనను, లేక చీకటిచేతను మబ చేతను గ్రమ్మబడినదానిగనైనను జూచుచు మేనెరుంగక క్రిందబడి చిరకాలమున ప్రజ్ఞదెలిసినచో నయ్యది కఫప్రకోపమున గల్గినమూర్ఛ యని యెరుంగునది. ఆ మూర్ఛ కల్గినప్పుడు శరీరముపై మోటుగుడ్డలనైనను తడిసినచర్మమునైనను గప్పినవి ముగ నుండును. నోట నీరువెడలును. రొమ్మదరును. (ఈలక్షణములు కల్గినది కఫజమూ యని యెరుంగునది.)

## సాన్నిపాతికమూర్ఛాలక్షణము.

మూ. సర్వాకృతిస్సన్నిపాతాత్ అపస్మార ఇవాగతః,
స జన్తుం పాతయత్యాశు వినా బీభత్సచేష్టితైః. ౪

వ్యా. త్రిదోషసన్నిపాతముచే గల్గినమూర్ఛయందు వాతాదులకు వేరువేరు జెప్పబడిన లక్షణములన్నియు కల్గును. జొల్లుగారుట మున్నగు బీభత్సచేష్టలందక్క తక్కినయపస్మారలక్షణములు కల్గి మనుజుడు శరీరము నెరుంగక మూర్ఛ గ్రమ్మి శీఘ్ర ముగ పుడమిపయింబడును. (అష్టోదరీయమను పందొమ్మిదవయధ్యాయమున "చత్వారో మూర్ఛాః" అని నిర్దేశప్రకారము నాల్గువిధములగు మూర్ఛలలక్షణములు వేరువేరు నిట వివరింపబడినవి.)

మాధవనిదానమున రక్తజవిషజమూర్ఛలను వేరుగజెప్పి వానికి ప్రత్యేకలక్షణ లును జెప్పబడినవి. ఈతంత్రమున "యశ్చ మద్య-విషజో రాధిరశ్చ యః, సర్వఏతే.. వాతపిత్తకఫత్రయాత్" అనుశ్లోకమున సంగ్రహింపబడిన భేదములనే మాధవకరుడ

వివరించెనుగాని యపూర్వము కాదు. మరియు మూర్ఛలనిదానసంప్రాప్తి పూర్వరూప రూపాదులు మాధవనిదానమున విపులముగ జెప్పబడినవి. మాచే విరచితమగు మాధవనిదానవ్యాఖ్యానమును జూచునది.

మదమూర్ఛలకును సన్న్యాసమునకును గలభేదము.

మూ. దోషేషు మదమూర్ఛాయాః కృతవేగేషు దేహినామ్,
స్వయమేవోపశామ్యన్తి సన్న్యాసో నౌషధైర్వినా. ౪౨

వ్యా. పైజెప్పినమదములును మూర్ఛలును ప్రకుపితములైన వాతాదిదోషములు తమబలముకొలది వేగమును పూర్తిగ జూపి బలము తమంతటనే యుడిగినప్పుడు ఆవ్యాధులును తమంతటనే శమించును. సన్న్యాసము మాత్రము ఔషధములప్రయోగింపక తమంతట శాంతినొందనేరదు. ఇదియే మూర్ఛారోగమునకు సన్న్యాసమునకు భేదము.

వాతాదులుత్కటములై తమవేగము నధికముగ జూపుటయే వానిబల ముడుగుటకు కారణము. ఈవిషయము విషమజ్వరమునందు "కృత్వా వేగం గతబలాః" అని చెప్పబడినది.

సన్న్యాసరోగసంప్రాప్తి, లక్షణములు.

మూ. వాగ్దేహమనసాం చేష్టామాక్షిప్యాతిబలా మలాః,
సన్న్యస్యన్త్యబలం జన్తుం ప్రాణాయతనసంశ్రితాః. ౪౩
స నా సన్న్యాససన్న్యస్తః కాష్ఠీభూతో మృతోపమః,
ప్రాణైర్వియుజ్యతే శీఘ్రం ముక్త్వా సద్యఃఫలాం క్రియామ్.
దుర్గేఽమ్భసి యథా మజ్జద్భాజనం త్వరయా బుధః,
గృహ్ణీయాత్తలమప్రాప్తం తథా సన్న్యాసపీడితమ్. ౪౪

వ్యా. తమతమకారణములచే మిక్కిలి వృద్ధినొంది యుత్కటములుగ ప్రకుపితములైన వాతపిత్తకఫములు వాక్కుయొక్కయు దేహముయొక్కయు మనస్సుయొక్కయు చేష్టలను బొత్తుగ మాన్పి, ప్రాణమునకు ముఖ్యాధారమైన హృదయమున జేరి, బలహీనుడగుమనుజుని ప్రజ్ఞతప్పించి తటాలున క్రింద బడద్రోయును. ఇయ్యది సన్న్యాస మనబడును. అట్టి మనుజుడు క్రూరమైన యీ సన్న్యాసరోగముచే పీడితుడై కొయ్యవలె నీటుకుని చచ్చినవానింబోలె నేలంబడి యుండును. అట్టి సమయమునం దతిశీఘ్రముగ మూర్ఛదొలగింప దగినచికిత్స చేసియెడ మనుజుడు శీఘ్రముగ ప్రాణముల విడనాడి సంయమనికి పైనముగట్టును. (కావున నతిశీఘ్రముగ చికిత్స జేయవలె ననుట.)

మిక్కిలి యగాధమైనబావి మున్నగుజలాశయమున నొకపాత్ర (బోరగిలం) బడి మఱుగుచు తేలుచునున్నపుడు ఆపాత్ర మునింగి జలాశయమున క్రిందికి బోక మునుపును అతిశీఘ్రముగ గ్రహించువిధమున, సన్న్యాసరోగముచే మూర్ఛనొంది చావనై యున్నవాని నతిశీఘ్రముగ తగినచికిత్సజేసి ప్రతికింపవలెను. (శీఘ్రముగ చికిత్స జేయనిచో బావిలో మఱుగుచున్నపాత్రవిధముగ శీఘ్రముగనే యాపత్తు నొందునని భావము.) (అష్టాదశీయాధ్యాయమున "ఏకస్సన్న్యాస ఇతి త్రిదోషాత్మకః" అని నిర్దేశింపబడిన త్రిదోషాత్మకమైన సన్న్యాసములక్షణముతో జెప్పబడినను.)

## సన్న్యాసరోగమున మూర్ఛతొలగించునుపాయనులు.

మూ. అఞ్జనాన్యవపీడాశ్చ ధూమః ప్రధమనాని చ,
సూచీభిస్తోదనం శస్త్రైః దాహః పీడా నఖాన్తరే. ౪౬
లుఞ్చనం కేశలోమ్నాం చ దన్తైర్దశనమేవ చ,
ఆత్మగుప్తావఘర్షాశ్చ హితాస్తస్యావబోధనే. ౪౭

వ్యా. మిక్కిలి తీక్ష్ణములైన యంజనములచే కంటికి కలికము వేయుట, తీక్ష్ణములైన చూర్ణాదులచే నస్యము చేయుట, ధూమమును బట్టుట, సూదులచేతను శస్త్రముల చేతను గ్రుచ్చుట, కాల్చబడిన శలాకాదులచే రక్షలబెట్టుట, గోళ్లసందున సూదులు మున్నగువాని గ్రుచ్చి బాధగల్గించుట, తలవెండ్రుకలనైనను శరీరమునందలి రోమములనైనను ఊడబెరుకుట, పండ్లతో కొరుకుట, దురదగొండియాకు శరీరముపై రుద్దుట ఇవి యన్నియు సన్న్యాసరోగమున బాధపడువానికి మూర్ఛ తొలగించి తెలివి దెచ్చుటకు దగినయుపాయములు.

## మూర్ఛను దొలగించు మరికొన్నిచికిత్సలు.

మూ. సమ్మూర్ఛితాని తీక్ష్ణాని మద్యాని వివిధాని చ,
ప్రభూతకటుతిక్తాని (యుక్తాని) తస్యాస్యే గాలయేన్ముహుః.
మాతులుఙ్గరసం తద్వత్ మహౌషధసమాయుతమ్, [ కాఞ్జికైః.
తద్వత్ సౌవర్చలం (సౌవీరకం) దద్యాత్ యుక్తం మద్యామ్ల
హిఙ్గూషణసమాయుక్తం యావత్సంజ్ఞాప్రబోధనమ్,

వ్యా. మిక్కిలి తీక్ష్ణములగు పలుదెరంగులైన మద్యములలో మిక్కిలి కారమును చేదును కలవస్తువుల గలిపి కలియబెట్టి సన్న్యాసముచే మూర్ఛనొందినవానినోట బలాత్కారముగ పలుమారు బోయుచు నారసము లోపలికి దిగునట్లు కుదిలించవలెను.

మాదీఫలములరసమున శుంఠిచూర్ణమును కలిపియైనను, మద్యమునందును పుల్లని గంజి యందైనను సౌవర్చలలవణమును కలిపియైనను, లేక యింగువను పిప్పలిచూర్ణమును కలిపి యైనను పైజెప్పినరీతిగ రోగినోట బలాత్కారముగ బోసి కుడిపించునది. పైజెప్పిన చికిత్సలను రోగికి శరీరప్రజ్ఞ కల్గునంతదనుక చేయవలెను.

౼ సన్న్యాసమున ప్రజ్ఞ తెలిసినపిదప చేయదగినయుపచారాదులు. ౼

మూ. ప్రబుద్ధసంజ్ఞమన్నైశ్చ లఘుభిస్తముపాచరేత్. ౫౦
విస్మాపనైః స్మారణైశ్చ ప్రియశ్రుతిభిరేవ చ,
పటుభిర్గీతవాదిత్రశబ్దైశ్చిత్రైశ్చ దర్శనైః. ౫౧
స్రంసనోల్లేఖనైర్ధూమైః అఞ్జనైః కబళగ్రహైః,
శోణితస్యావసేకైశ్చ వ్యాయామోద్ఘ(ద్ధ)ర్షణైస్తథా. ౫౨
ప్రబుద్ధసంజ్ఞం మతిమాననుబన్ధముపక్రమేత్,
తస్య సంరక్షితవ్యం హి మనః ప్రళయహేతుతః. ౫౩

వ్యా. పైజెప్పిన యుపాయములచేత నెట్టకేలకు మూర్ఛతొలంగి శరీరముపై ప్రజ్ఞ తెలిసినవానికి చులకనగ జీర్ణమగునట్టి యన్నపానముల బెట్టనగును. మరియు వాని యొక్క మనసు మరల మూర్ఛకు కారణము చెంతబోనీయక కాపాడవలెను కావున అందుకై వానిమనసుకు ఆశ్చర్యమును కల్గించునుపాయములచేతను, తాను మున్ను ఆరోగ్యస్థితిలో జేసినపనులు మున్నగువానిని స్మృతిపథమునకు దెచ్చుటచేతను, వానికింపైనవిషయముల వినిపించుటచేతను, రమ్యములైన సంగీతము వాద్యములు మున్నగువాని శబ్దములను వినిపించుటచేతను, చిత్రములైన వస్తువులను కాటకాయలను జూపుటచేతను, మనస్సు కుల్లాసమును నిరంతరముగ కల్గించుచుండవలెను.

మరియు నట్టిసన్న్యాసరోగము పొడచూపకుండుటకై వమనవిరేచనములు, ధూమపానము, అంజనము, కబిలగ్రహము, రక్తమోచనము, దేహపరిశ్రమము, ఉద్ఘర్షణము (శరీరమును నలుగుపిండిచే మర్దనముచేయుట) మున్నగుచికిత్సల జేయవలెను. (ఇట్టి యాహారవిహారచికిత్సలజేసినయెడ నారోగికి మూర్ఛకారణములు మనస్సుకు గాక, అట్టి రోగమును కల్గించుకారణములు హరించునని భావము).

౼ మద - మూర్ఛారోగములయందు పంచకర్మవిధానము. ౼

మూ. స్నేహస్వేదోపపన్నానాం యథాదోషం యథాబలమ్,
పఞ్చకర్మాణి కుర్వీత మూర్ఛాయేషు మదేషు చ ౫౪

వ్యా. పైజెప్పినమూర్ఛలయందును మదరోగములయందును తొలుత స్నేహ స్వేదవిధులను విధ్యుక్తప్రకార మాచరించి పిదప రోగియొక్క వాతాదిదోషములను శరీరబలమును చక్కగ గమనించి తత్తదనుగుణముగ వమన-విరేచన-శిరోవిరేచన - అను వాసన ఆస్థాపనము లనునట్టి పంచకర్మముల జేయనగును.

మదమూర్ఛారోగములచికిత్సాయోగములు.

మూ. అష్టావింశత్యౌషధస్య తథా తిక్తస్య సర్పిషః,
ప్రయోగశ్శస్యతే తద్వత్ మహాతిక్తషట్పలస్య వా. ౫౫
త్రిఫలాయాః ప్రయోగో వా సఘృతక్షౌద్రశర్కరః,
శిలాజతుప్రయోగో వా ప్రయోగః పయసోఽపి వా. ౫౬
పిప్పలీనాం ప్రయోగో వా పయసశ్చిత్రకస్య వా,
రసాయనానాం కౌమ్భస్య సర్పిషో వా ప్రశస్యతే. ౫౭

వ్యా. మరియు నిరువదియెనిమిదియౌషధములజేర్చి పక్వముచేయబడిన కల్యాణ ఘృతమునైనను, మహాతిక్తకఘృతమునైనను, తిక్తషట్పలఘృతమునైనను ఉపయోగించుట (పానముజేయుట) చాలప్రశస్తము. మరియు త్రిఫలములతో ఘృతమును తేనెను చక్కెరను కలిపి సేవించుట చాలమంచిది. శిలాజతువునైనను, ఆవుపాలనైనను, పిప్పళ్లనైనను, చిత్రమూలమును చేర్చినపాలనైన నుపయోగింపనగును. రసాయనప్రకరణమున జెప్పినరసాయనములనైనను, పదిసంవత్సరములు కుండలో పదిలముగ నుంచబడి మాగిన నేతినైనె నుపయోగించినచో పైజెప్పిన మదమూర్ఛాసన్న్యాసరోగములు హరించును.

(చికిత్సాస్థానమున నున్మాదచికిత్స ౧౪-వ యధ్యాయమున "విశాలా త్రిఫలా... కల్కైః కర్షసమై రేతైః వింశత్యష్టాభిరేవచ...కల్యాణకమిదం సర్పిః శ్రేష్ఠం పుంసవనేషు చ" అని చెప్పబడిన కల్యాణఘృతంబును; "సప్తచ్ఛదం ప్రతివిష్టాం...మహావికారాన్ మహాతిక్తం" అని కుష్ఠచికిత్సితమై యేడవయధ్యాయమున చెప్పబడిన మహాతిక్తఘృతంబును; "నిమ్బపటోలందార్వీ...కణ్డూమదగండకను త్తిక్తమ్" అని చెప్పబడిన తిక్తషట్పలఘృతంబును ఇచ్చట నిర్దేశింపబడినవి).

మదమూర్ఛాశామకోపాయములు.

మూ. రక్తావసేకాచ్ఛాస్త్రాణాం సతాం సత్త్వవతామపి,
సేవనాత్ మదమూర్ఛాయాః ప్రశామ్యన్తి శరీరిణామ్ ఇతి.

వ్యా. మరియుం రక్తమును స్రవింపజేయుటవలనను, మనస్సు నిర్మలముగ జేయుం నాధ్యాత్మికాదిజ్ఞానసాధనములైన శాస్త్రముల బఠించుటవలనను, సత్త్వగుణమును కల్గిన పెద్దల సేవించుటవలనను మద (ఉన్మాద) మూర్ఛారోగములు శమించును.

అధ్యాయవిషయసంగ్రహము.

మూ. తత్ర శ్లోకాః—

విశుద్ధం చావిశుద్ధం చ శోణితం తస్య హేతవః,
రక్తప్రదోషజా రోగాః తేషు రోగేషు చౌషధమ్. ౨౯
మదమూర్ఛాయసన్న్యాస హేతులక్షణభేషజమ్,
విధిశోణితకేఽధ్యాయే సర్వమేతత్ప్రకాశితమ్. ౬౦

వ్యా. విశుద్ధరక్తలక్షణంబులును, దానికి హేతువులును, అపరిశుద్ధ (దుష్ట) రక్తలక్షణంబులును, దాని హేతువులును, రక్తదుష్టిచే గల్గురోగంబులును, రక్తదుష్టికిని దాన గల్గురోగములకును దగినచికిత్సలును, మద-మూర్ఛ-సన్న్యాసరోగములు జనించుకారణంబులును, ఆరోగములలక్షణంబులును, వానికి దగినచికిత్సయు, ఇవియన్నియుం నీవిధిశోణితాధ్యాయమున నగ్నివేశునిచే వివరింపబడియె.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
విధిశోణితీయో నామ చతుర్వింశోఽధ్యాయః.
ఇతి యోజనాచతుష్కః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమున సూత్రస్థానమునందు విధిశోణితీయమను నిరువదినాల్గవయధ్యాయము సమాప్తము.

ఇది యోజనాచతుష్కము.

---

## పంచవింశాధ్యాయము.

## (అన్నపానచతుష్కము.)

అవతారిక:—పైజెప్పబడిన యోజనాచతుష్కమున లంఘనము, బృంహణము, రూక్షణము, స్నేహనము, స్వేదనము, స్తంభనము నని యాఱువిధములైన యుపక్రమములకును తత్తద్దోషానుగుణముగ శరీరసంయోజనక్రమము నిరూపింపబడినది. అట్టి యుపక్రమములు అన్నపానముల ననుసరించియున్నచో వ్యాధినివృత్తికి సమర్థము

లగును; కావున అట్టి యన్నపానవిధుల దెలుపు నన్నపానచతుష్కము చెప్పబడును. అందును అన్నపానగుణములను క్లప్తముగ దెలుపునట్టి యజ్జఃపురుషీయ మనునధ్యాయము తొలుత జెప్పబడును.

మూ. అథాతో యజ్జఃపురుషీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. విధిశోణితీయాధ్యాయమును జెప్పినపిదప నాహారగుణముల సామాన్యముగ దెలుపునట్టి "యజ్జః పురుషః" అను ప్రశ్నమును ప్రధానముగ నధికరించి చెప్పునట్టి యజ్జఃపురుషీయ మనునధ్యాయమును భగవత్స్వరూపుడగు నాత్రేయుం డుపదేశించిన దానికి న్యూనాతిరేకము లేనట్లు వివరించెదనని యర్థము.

ఇచ్చట ప్రశ్నమునందు "కిన్ను స్యాత్పురుషో యజ్జః" అని యుపక్రమింపబడినది. అయినను ప్రశ్నముయొక్క అర్థము ననుసరించి యజ్జఃపురుషీయ మని యధ్యాయసంజ్ఞ చెప్పబడినది.

విషయావతరణమునకై ఋషులు ప్రసంగించుట.

మూ. పురా ప్రత్యక్షధర్మాణం భగవన్తం పునర్వసుమ్,
సమేతానాం మహర్షీణాం ప్రాదురాసీదియం కథా. 3
(మహర్షయ ఉపాసీనాః ప్రాదుశ్చక్రురిమాం కథామ్)
ఆత్మేన్ద్రియమనోఽర్థానాం యోఽయం పురుషసంజ్ఞికః,
రాశిరస్యామయానాం చ ప్రాగుత్పత్తివినిశ్చయే. ౪

వ్యా. పూర్వకాలమున నొకానొకసమయమున జ్ఞానవిజ్ఞానసంపన్నులగు మహర్షులు కొందరు సభజేరి త్రికాలజ్ఞానవేదియు, తపోబలమునంజేసి ప్రత్యక్షముగ ధర్మస్వరూపుండును నగుపునర్వసు వనునాత్రేయమహర్షియొద్ద, ఆత్మ-ఇంద్రియములు, మనస్సు, విషయములు అనుపదార్థముల సమ్మేళనరూపమైన పురుషునియొక్కయు, రోగములయొక్కయు తొల్లింటియుత్పత్తిని నిశ్చయించువిషయము నుద్దేశించి యీక్రింద జెప్పబడురీతిగ ప్రసంగమును సాగించిరి.

ఆత్మేంద్రియమనోఽర్థముల సమ్మేళనాత్మకమైన పురుషునియొక్కయు, రోగములయొక్కయు ఉత్పత్తివిషయమును నిశ్చయించుటకై మహర్షులందరును జేరి యాత్రేయునియొద్ద పరస్పరప్రశ్నోత్తరరూపముగ ప్రసంగించిరని భావము.

వ్యాధికారణమునుగూర్చి కాశిరాజు ప్రశ్నము.

మూ. తదనన్తరం కాశిపతిర్వామకో వాచమర్థవిత్,
(అథ కాశిపతిర్వాక్యం వామకోఽర్థవదన్తరా)

వ్యాజహారర్షిసమితిం అభిస్సృత్యాభివాద్య చ. ౫
కిన్ను స్యాత్పురుషో యజ్జః తజ్జాస్తస్యామయాస్మృతాః?
న వేత్యుక్తే నరేన్ద్రేణ ప్రోవాచర్షిః పునర్వసుః. ౬

వ్యా. అట్టి ప్రశంసకాలమున కాశీపతియగు వామక డనురాజర్షి యీసభయందలి ఋషిసంఘమును సమీపించి వినయముతో నభివాదన మొనరించి యోఋషిసత్తములారా! ''పురుషుడు ఏకారణముచే జనించునో అట్టికారణమునే హేతువుగ జేసి వానికి రోగములు సంభవించునా? లేక అట్టిజన్మకారణముగాక వేరొండుకారణమున కల్గునా?'' యని ప్రశ్న జేసెను. ఇత్తెరంగున సకలార్థవేత్తయగు కాశిరాజు ప్రశ్నను విని యాత్రేయమహర్షి తక్కినమునిపుంగవులను జూచి యిట్లు లానతిచ్చెను.

ఇచ్చట కాశిరాజు లనేకులగుటచే భేదము తెలియుటకే 'వామకః' అని నిర్దేశింపబడినది. లోకమున మనుజు లేకారణమున పుట్టెదరో, దాని నేకారణముగ జేసి రోగములు వారివారికి సంభవించునో? లేక రోగములకు మాత్రము వేరొండుకారణము కలదా? కాశిరాజు ప్రశ్నము. 'యజ్జః' అనుపదమునకు ''యస్మాత్ జాతః—యజ్జః'' అని విగ్రహము. తదనంతరమనుచోట అంతరమన కాలమని యర్థము (కథాప్రసంగ కాలమున).

### ఆత్రేయునియానతి.

మూ. సర్వ ఏవాఽమితజ్ఞానవిజ్ఞానచ్ఛిన్నసంశయాః,
భవన్తశ్ఛేత్తుమర్హన్తి కాశిరాజస్య సంశయమ్. ౭

వ్యా. ఓమునిపుంగవులారా! మీరందరును జ్ఞానవిజ్ఞానముచే సందేహముల నన్నింటిని నివర్తిజేసికొనియున్నవారు. కావున కాశిరాజు కిపుడు కల్గినసంశయమును యుక్తియుక్తముగ నాలోచించి యీయునసందేహమును దీర్ప నర్హులు. (కాశిరాజు సంశయమును దీర్పుడని భావము.)

### పారీక్షి చెప్పిన రోగకారణము.

మూ. పారీక్షిస్తత్పరీక్ష్యాగ్రే (పరీక్ష్యాగ్రే) మౌద్గల్యో వాక్యమబ్రవీత్,
ఆత్మజః పురుషో రోగాశ్చాత్మజాః కారణం హి సః. ౮
స చినోత్యుపభుఙ్క్తే చ కర్మ కర్మఫలాని చ,
న హ్యృతే చేతనాధాతోః ప్రవృత్తిస్సుఖదుఃఖయోః. ౯

వ్యా. పైజెప్పినయాత్రేయునియానతి విన్నతోడనే మౌద్గల్యుడగు పారీక్షియను మునిపుంగవుడు పైజెప్పినప్రశ్నమునకు సంబంధించినవిషయముల జక్కగ గమనించి యిట్లు చెప్పెను:—చేతనాధాతురూపమైన యాత్మవలన పురుషుడు జన్మమెత్తును. అట్టిపురుషుడే రోగములకు కారణమగును. పురుషుడు సుకృతదుష్కృతరూపమైన కర్మమును చేయును. అట్టికర్మచే కల్గుసుఖదుఃఖములను తానే యనుభవించును. చేతనాధాతువు లేనిచో కర్మమైనను, దానకల్గు సుఖదుఃఖరూపఫలంబును కల్గదు. కావున అట్టి కర్మమును సహాయముగజేసికొనిన చేతనాత్మకమైన యాత్మయే జన్మమునకు రోగములకును కారణమగునని భావము.

శరలోముడు మనస్సు జన్మరోగములకు కారణమనుట.

మూ. శరలోమా తు నేత్యాహ న హ్యాత్మాత్మానమాత్మనా,
యోజయేద్వ్యాధిభిర్దుఃఖైః దుఃఖద్వేషీ కదాచన. ౧౦
రజస్తమోభ్యాం తు మనః పరీతం సత్త్వసంజ్ఞకమ్,
శరీరస్య సముత్పత్తౌ వికారాణాం చ కారణమ్. ౧౧

వ్యా. "చేతనాధాతురూపమైనయాత్మ సుఖమునే కోరును. దుఃఖమును ద్వేషించును. ఇది యాత్మకు స్వభావము. అట్టి దుఃఖద్వేషియగు నాత్మ యొకప్పుడు దుఃఖమునకు కారణమైన శరీరసంబంధరూపమైన జన్మమును, అట్టి శరీరమునకు కష్టములగల్గించు రోగములను కల్గింప సమకట్టదు. కావున జన్మమునకును రోగములకును చేతనాధాతువు కారణమగునని పారీక్షి చెప్పినది సంగతము కానేరదు. మరియు రజస్తమోగుణములతో గూడినమనస్సు, శరీరోత్పత్తికిని, సకలరోగములకును కారణమగునని శరలోముడను మునివరుడు తనసిద్ధాంతమును చెప్పెను.

జన్మరోగములకు రసము కారణ మనుమతము.

మూ. వార్యోవిదస్తు నేత్యాహ న హ్యేకం కారణం మనః,
నర్తే శరీరం శారీరరోగాః న మనసఃస్థితిః. ౧౨
రసజాని తు భూతాని వ్యాధయశ్చ పృథగ్విధాః,
ఆపో హి రసవత్యస్తాః స్మృతా నిర్వృత్తిహేతవః. ౧౩

వ్యా. రోగములు శారీరములు మానసములు నని రెండు తెరంగులు. అట్టిరెండు విధములైన వ్యాధిసామాన్యమునకు మనస్సుమాత్ర మొక్కటియే కారణమగునని చెప్పుట సమంజసము కాదు. శరీరసంబంధము లేక శారీరరోగము లుండనోపవు. ఇంతియేకాక రజస్తమోగుణయుక్తమైన మనస్సును శరీరసంబంధము లేక ప్రత్యేకముగ నుండదు.

కావున తన కునికియైన (ఆధారమైన) మనస్సును శరీరోత్పత్తికిని కారణము కాజాలదు. (మనస్సుకు శరీరసంబంధము లేక రజస్తమోగుణములసంబంధము కల్గదు. రజస్తమస్సంబంధము కలమనస్సుచేత శరీరోత్పత్తి కల్గవలెను. ఇట్టి స్థితిలో నన్యోన్యాశ్రయదోషము సంభవించును. "ఇతరేతరాశ్రయాణి చ కార్యాణి న ప్రకల్పన్తే" అనుభాష్యకాను శాసనము ప్రకారము కార్యసమర్థము కానోపదు) కావున రజస్తమోగుణభూయిష్ఠమైన మనసు శరీరోత్పత్తికిని, రోగములకు కారణమగునని శరలోముడు చెప్పినది యసంగతమని నిరసించి వార్యోవిదుడు తనసిద్ధాంతము నిట్లు చెప్పుచున్నాడు.

పంచమహాభూతములును రసమున గల్గును. అట్టి రసమునకు జలము ఆధారము. పాంచభౌతికమైన శరీరోత్పత్తికిని పంచభూతములకు కారణమైన జలమే కారణమగును. అట్టి శరీరము నాధారముగ జేసికొనిన శారీరవ్యాధులకును, శరీరాధిష్ఠితమైన మనస్సుచే కల్గుమానసికవ్యాధులకును రసాధారమైన జలము కారణమని వార్యోవిదుడు తనసిద్ధాంతమును చెప్పెను.

### షడ్ధాతుకారణమతము.

మూ. హిరణ్యాక్షస్తు నేత్యాహ న హ్యాత్మా రసజస్స్మృతః,
నాతీంద్రియం మనస్సన్తి రోగాశ్శబ్దాదిజాస్తథా. ౧౪
షడ్ధాతుజస్తు పురుషః రోగాష్షడ్ధాతుజాస్తథా,
రాశిష్షడ్ధాతుజస్సాంఖ్యైః ఆద్యైస్సంపరికీర్తితః. ౧౫

వ్యా. ఇంద్రియాతీతమైన యాత్మయు ఇంద్రియాతీతమైన మనస్సును రసముచే గల్గుటలేదు. అహితములగు శబ్దస్పర్శరూపరసగంధములవలన సంభవించురోగములు కొన్ని గలవు. వానికి రసము కారణమని చెప్పవలనుపడదు. కావున జన్మమునకును రోగములకు రస ముత్పత్తికారణమని చెప్పుట సంగతము కాదని వార్యోవిదునిమతము నిరసించి హిరణ్యాక్షుడు తనమతమును ఇట్లు చెప్పెను.

"ఖాదయశ్చేతనాషష్ఠా ధాతవః పురుషస్స్మృతః" అని చెప్పినప్రకారము పృథివ్యాదిపంచభూతములును చేతనారూపమైన యాత్మయు జేరి యారుధాతువులు. అట్టి యారుధాతువులకూటమిచేత పురుషుడు జన్మమెత్తును. అట్టి యారుధాతువులవలననే రోగములు కల్గును. కావున పురుషోత్పత్తికిని రోగములకును పృథివ్యాదిపంచభూతములును చేతనారూపంబులైన యారుధాతువులు కారణమగును. సాంఖ్యమతసిద్ధాంతము నను ప్రాచీనులు షడ్ధాతురాశియే పురుషుడని చెప్పిరి.

జన్మరోగములకు తలిదండ్రులు కారణమనుపక్షము.

మూ. తథా బ్రువాణం కుశికం ఆహ తన్నేతి శౌనకః,
కస్మాన్మాతాపితృభ్యాం హి వినా షడ్ధాతుజో భవేత్. ౧౬
పురుషః పురుషాత్ గౌర్గోః అశ్వాదశ్వః ప్రజాయతే,
పిత్ర్యా మేహాదయశ్చోక్తా రోగాః తావత్ర కారణమ్. ౧౭
(పితృమాతృభవాశ్చోక్తాః)

వ్యా. తలిదండ్రులసంబంధములేక కేవలము పైజెప్పిన యారుధాతువులమాత్రము చేతనే పురుషుడు జనించుటలేదు. పితృమాతృసంబంధము లేక ధాతువులమాత్రముచేతనే ప్రాణిజన్మము కల్గునెడ గోవు పురుషుడు అశ్వము మున్నగుభేదము కానరాదు. లోకమున పురుషునివలన పురుషుండును, గోవువలన గోజాతియు, అశ్వమువలన నశ్వంబును కల్గుచుండుట ప్రత్యక్షము. కావున కేవలము షడ్ధాతువులచేతనే జన్మంబును రోగంబులును కల్గునని హిరణ్యాక్షుడు చెప్పినది యసంగతము. మరియు మనుజులకు ప్రమేహాదిరోగములును తలిదండ్రులవలన కల్గుచున్నవి. కావున పురుషజన్మమునకును, ప్రమేహాది రోగసమితికిని తలిదండ్రులు కారణమగుదురని శౌనకుడు చెప్పెను.

జన్మమునకును రోగమునకు కర్మ కారణమనుట.

మూ. భద్రకాప్యస్తు నేత్యాహ న హ్యన్ధోఽన్ధాత్ప్రజాయతే,
మాతాపిత్రోరపి చ తే ప్రాగుత్పత్తిర్న యుజ్యతే (జాయతే).
కర్మజస్తు మతో జన్తుః కర్మజాస్తస్య చామయాః,
న హ్యృతే కర్మణో జన్మ రోగాణాం పురుషస్య వా. ౧౮

వ్యా. పైజెప్పినరీతిగ జన్మమునకు తల్లిదండ్రులే కారణమని చెప్పునెడ తల్లిదండ్రులు గ్రుడ్డివారగునపుడు వారికి జనించుపురుషుడును గ్రుడ్డివాడే కావలసియుండును. లోకమున నట్లు కల్గుటలేదు. అట్టితల్లిదండ్రులకును సృష్ట్యారంభమున తొల్లింటిజన్మమునకు తల్లిదండ్రులు లేమింజేసి అట్టికారణము కానరాదు. కావున జన్మమునకును రోగముల యుత్పత్తికిని తల్లిదండ్రులు కారణమనుట యసంభవము. అని శౌనకసిద్ధాంతమును నిరసించి భద్రకాప్యుడు తనమతము నిట్లు చెప్పెను. పురుషునకు తాను జేసికొనిన సుకృతదుష్కృతరూపమైన కర్మమే జన్మమునకు కారణము. అట్టికర్మచేతనే నానావిధరోగములును సంభవించును. కర్మలేనినాడు జన్మంబును, రోగములును, కల్గుటలేదు. కావున జన్మరోగముల రెండిటికిని వానివానికర్మమే కారణమగును.

### జన్మరోగములకు స్వభావము కారణమనుట.

మూ. భరద్వాజస్తు నేత్యాహ కర్తా పూర్వం హి కర్మణః,
దృష్టం న చాకృతం కర్మ యస్య స్యాత్ పురుషః ఫలం. ౨౦
భావ హేతుః స్వభావస్తు వ్యాధీనామ్ పురుషస్య చ,
ఖరద్రవచలోష్ణత్వం తేజోన్తానాం యథైవ హి. ౨౧

వ్యా. కర్మయనునది క్రియారూపము క్రియకర్తను నధీనమైయుండును. ఒక పురుషుడు సుకృతదుష్కృతరూపమయిన యొకకర్మను చేసినచో అట్టికర్మఫలము గ తానుజన్మము ఎత్తవలెనని చెప్పవలసియుండును. అట్టియెడ క్రియారూపమైన కర్మకు ముందే ఒకకర్త యుండవలయును. కావున తనజన్మమునకు తాజేయుకర్మ కారణ మెట్లగును? కానేరదు. మఱియు ఒకరుజేయక కర్మయేర్పడుట లేదు కర్తయైన తనజన్మమునకు కర్మ యెట్లు కారణమగును? కానేరదు. కావున జన్మరోగములకు కర్మ కారణములని భద్రకాప్యుడు చెప్పినది యసంగతమని నిరసించి భరద్వాజుడు నిట్లు చెప్పెను.

పృథివి, అప్పు, వాయు, తేజస్సు అనునాల్గింటికిని ఖరత్వద్రవత్వచలత్వోష్ణత్వములు ఎట్లు స్వభావసిద్ధములగునో ఆలాగుననే పురుషునకును, వ్యాధులకును స్వభావమే కారణమగును.

### సృష్టికర్మజన్మాదికారణమనుట.

మూ. కాంకాయనస్తు నేత్యాహ న హ్యారంభే ఫలం భవేత్,
భవేత్స్వభావాత్ భావానాం అసిద్ధిస్సిద్ధిరేవ వా. ౨౨
స్రష్టా త్వమితసంకల్పో బ్రహ్మాపత్యం ప్రజాపతిః,
చేతనాచేతనస్యాస్య జగతః సుఖదుఃఖయోః. ౨౩

వ్యా. లోకమునందలి రోగములు జన్మము మొదలగుభావముల కన్నిటికిని సిద్ధియుం సిద్ధించకపోవుటయుం కారణాంతరము నపేక్షింపక స్వభావముచేతనే స్వతస్సిద్ధముగ కల్గునెడ లోకమునందు ప్రసిద్ధముగా నాచరింపబడుకృషి మున్నగువ్యాపారములును, శాస్త్రచోదితములగు యాగాదికర్మవిధానంబును, నిష్ప్రయోజనము లగును. కావున స్వభావమే యుత్పత్తికి కారణమని చెప్పుట సమంజసము కాదు. అని భరద్వాజుని మతమును నిరసించి కాంకాయనుడు తనమతమును ఇట్లు చెప్పెను.

పరమాత్మస్వరూపుడైన భగవంతునికి (ఆదినారాయణునకు)కుమారుడైన సృష్టికర్త యగుబ్రహ్మ పారములేని సంకల్పముకలవాడు. కావున తాసంకల్పించినప్రకారము స్థావర జంగమరూపమయిన ప్రపంచమును సృజించుటకును వానికి సుఖదుఃఖము లొన

గూర్చుటకును కారణభూతుడైయున్నవాడు. కావున బ్రహ్మయే తనసంకల్పప్రకారము మనుజుల సృజించి వారికి సుఖదుఃఖముల కల్గించును. దానంజేసి పురుషులజన్మములకును రోగములయుత్పత్తికిని సృష్టికర్తయే కారణమగును.

కాలము జన్మాదికారణమనుట.

మూ. తన్నేతి భిక్షురాత్రేయో న హ్యపత్యం ప్రజాపతిః,
ప్రజాహితైషీ సతతం దుఃఖైర్యుఞ్జ్యాదసాధువత్. ౨౪
కాలజస్త్వేవ పురుషః కాలజాస్తస్య చామయాః,
జగత్కాలవశం సర్వం కాలస్సర్వత్ర కారణమ్. ౨౫

వ్యా. పరమకారుణికుండును పక్షపాతములేనివాడు నగుసృష్టికర్త తనసంతతిలో జేరిన ప్రజలకు హితముసేయుచుండునుగాని యొకప్పుడును (లోకమున సామాన్యముగ దుష్టునివలె) దుఃఖమును కల్గింపడు. కావున జన్మమునకును, దుఃఖమును కల్గించు నానావిధరోగములకు సృష్టికర్త కారణమని చెప్పుట యుక్తముకాదు. అని కాంకాయన మతమును నిరసించి భిక్షువనునామాంతరము కలయాత్రేయుడు తనమతము నిట్లు చెప్పెను:—

జగమంతయు కాలమున కధీనమైయుండును. అన్నింటికిని కాలమే కారణము నుండును. కావున పురుషుడు కాలమువలననే కల్గును. అట్టిపురుషునకు కాలమువలనే రోగములును కల్గును. కావున జన్మమునకును రోగములకును కారణము కాలమగును.

పూర్వపక్షనిరసనపూర్వకముగ నాత్రేయమతసిద్ధాంతము.

మూ. అథర్షీణాం వివదతాం ఉవాచేదం పునర్వసుః,
మైవం వోచథ తత్త్వం హి దుష్ప్రాపం పక్షసంశ్రయాత్. ౨౬
వాదాన్ సప్రతివాదాన్ హి వదన్తో నిశ్చితానివ,
పక్షాన్తం నైవ గచ్ఛన్తి తిలపీడకవద్గతౌ. ౨౭
ముక్త్వైవం వాదసంఘట్టం అధ్యాత్మమనుచిన్త్యతామ్,
నావిధూతతమస్కన్ధే జ్ఞేయే జ్ఞానం ప్రవర్తతే. ౨౮
యేషామేవ హి భావానాం సమ్పత్సఞ్జనయేన్నరమ్,
తేషామేవ విపద్వ్యాధీన్ వివిధాన్ సముదీరయేత్. ౨౯

వ్యా. పైజెప్పినరీతిగ వాదప్రతివాదములచే పూర్వపక్షసిద్ధాంతముల జూపు- వివాదము చేయుచున్న మునిపుంగవులపక్షముల నన్నిటిని విని పునర్వసువను నామాంతరముకల యాత్రేయమహర్షి యిట్లు చెప్పందొడంగెను:—

మీరు వాదించునది యుక్తముకాదు. అభిమానముచే నొకపక్షము నవలంబించి వాదించినచో వాస్తవ్యమైన సిద్ధాంతము ఏర్పడనేరదు. ప్రతివాదములతోఁగూడినవాదములను వాస్తవ్యముగ నయ్యవి సిద్ధాంతములు గాకున్నను స్వపక్షాభిమానమునం జేసి స్వజ్ఞానగరిమచే వాస్తవ్యములని నిర్ణయింపుచు పల్కునెడ, అట్టివారికి నిరపవాదముగ సిద్ధమైనపక్షము ఒకప్పుడు నేర్పడజాలదు. (నువ్వులగానుగపైనెక్కి దానితోఁకూడ తిరుగుచుండు నొకతైలికుడు పలుమారు చుట్టిచుట్టి తిరుగునుగాని తనకుముఖ్యమైన గమ్యస్థానమును చేరనేరడు కదా? అత్తెరంగుననే తమతమపక్షములయం దభిమానముచేత నిశ్చయముగాని విషయములను నిశ్చితములని వాదప్రతివాదముల నల్పునెడ వాస్తవ్యమైన సిద్ధాంతము ఏర్పడదని భావము.)

జ్ఞేయమైనయంశమువిషయమై తమోగుణముచే గల్గుస్వపక్షాభిమానముల వదలినగాని జ్ఞానము చక్కగ పనిచేయనేరదు. కావున తమతమపక్షాభిమానముచేగల్గు నీ వాదప్రతివాదరూపమైన యన్యోన్యసంఘర్షణమును మాని వాస్తవ్యమైన విషయమును యోజింపుడు.

ఇత్తెరంగున ఋషులవాదోపవాదముల మాన్పి వారిపక్షముల నన్నిటిని నిరసించి నిరపవాదమైన స్వసిద్ధాంతము నిట్లు ఆత్రేయుండు చెప్పెను:—ఏజాతిలోఁచేరినభావముల యొక్క సంపత్తు (ప్రశస్తగుణములగల్గియుండుట) పురుషునికల్గించుచున్నదో, తజ్జాతీయములైన భావముల విపత్తు (వైగుణ్యము) మనుజులకు రోగముల గల్గించును. ఇచ్చట 'యేషాం' అనుపదమునకు 'యజ్జాతీయానాం' అని యర్థము. అయ్యవి పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచమహాభూతములు. అట్టిపంచమహాభూతముల వికారములైనభావములు విగుణములు గాకయుండినయెడ అట్టి యవికృతి పంచమహాభూతాత్మకభావములచే మనుజుడు పుట్టుననియు, అట్టిపంచమహాభూతజాతిలోఁచేరినవాతపిత్తకఫరూపములైన భావములు వికృతిజెందిననాడు రోగముల గల్గించుననియు ముఖ్యభావము. వాతాదిదోషములును పంచభూతాత్మకములని సిద్ధాంతము. 'కిన్ను స్యాత్పురుషో యజ్జః' అని కాశిరాజు చేసినప్రశ్నమున కిది సిద్ధాంతమైనయుత్తరము. ఇచ్చట శిష్యుల సందేహనివృత్తికై ఋషిసంవాదము చెప్పబడినది.

## పురుషవృద్ధికిని రోగవృద్ధికిని హితాఽహితాహారములు కారణము.

మూ. అథాత్రేయస్య భగవతో వచనమనునిశమ్య పునరేవ వామకః కాశిపతిరువాచ భగవన్తమాత్రేయం:—భగవన్! సంపన్నిమిత్తస్య పురుషస్య విపన్నిమిత్తజానాం రోగాణాం కిమభివృద్ధికారణమితి? ౩౦

తమువాచ భగవానాత్రేయః—హితాహారోపయోగ ఏక ఏవ పురుషవృద్ధికరో భవతి. అహితాహారోపయోగః పునః వ్యాధినిమిత్త ఇతి. 30

వ్యా. భగవత్స్వరూపుడగు నాత్రేయునివాక్యమును విని కాశిరాజైన వామకుడు ఇట్లడిగెను.—ఓమహాత్మా ! మహాభూతసంపత్తుచే కల్గినపురుషుడు వృద్ధినొందుటకును, మహాభూతవైపరీత్యమున గల్గినరోగములు వృద్ధినొందుటకును కారణ మెద్దియని కాశిరాజడిగెను.

హితములగు నాహారపదార్థముల నుపయోగించుటయే పురుషునివృద్ధికి ముఖ్యమైనకారణము. అహితములగు నాహారముల నుపయోగించుట వ్యాధికిని, వ్యాధివృద్ధికిని కారణమగునని ఆత్రేయుండు కాశిరాజుప్రశ్నమునకు సమాధానము చెప్పెను.

ఇచ్చట వ్యాధికారణము "తేషామేవ విపత్ ... ముదీరయేత్" అనువాక్యముచే జెప్పబడినది కావున "వ్యాధినిమిత్త" అనుచోట "వ్యాధివృద్ధినిమిత్తః" అని మధ్యమపద లోపముచే నెరుంగునది. లేక వ్యాధికిని, దానివృద్ధికిని అహితాహారము కారణమనియైన చెప్పనగును. (ఏక ఏవ అనునది ముఖ్యముగ నాహారము కారణమని తెల్పును. నిద్రాది విహారములు కూడ వృద్ధికారణమని యెరుంగునది).

హితాహితవిషయమై యగ్నివేశునిప్రశ్నము.

మూ. ఏవంవాదినం భగవన్తం ఆత్రేయమగ్నివేశ ఉవాచ.—"కథమిహ భగవన్! హితాహితానామాహారజాతానాం లక్షణమనపవాదమభిజానీయాత్ ? హితసమాఖ్యాతానాం చైవ హ్యాహారజాతానాం, అహితసమాఖ్యాతానాం చ మాత్రాకాలక్రియాభూమిదేహదోషపురుషావస్థాన్తరేషు విపరీతకారిత్వముపలభామహే" ఇతి. 31

వ్యా. పైరీతిగ జెప్పిన యాత్రేయవచనమును విని యగ్నివేశు డిట్లు ప్రశ్న జేసెను:- ఓమహామునీ! హితము (పథ్యము) లైనరక్తశాల్యాదులును, అహితము (అపథ్యము) లైనయపకములు శూకధాన్యములు మున్నగునవియు పరిమాణము, హేమంతాదికాలము, సంస్కారవిశేషము, అనూపాదిభూమి, శరీరము, వాతాదిదోషములు, రోగములు, పురుషులవయస్సు అనువానియవస్థావిశేషములనుబట్టి పథ్యములు అపథ్యములుగను, అపథ్యములు పథ్యములుగను మారి వ్యత్యస్తముగ కార్యములు చేయుచుండును. ఇది యనుభవసిద్ధముగ తెలియుచున్నది; కావున ఇయ్యవి హితములనియు, ఇయ్యవి యహితము

లనియుం నిరపవాదముగ వానిలక్షణముల మన మెట్లు తెలిసికొనగలము? (అని యగ్నివేశుడు ప్రశ్న జేసెనని యర్థము.)

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—లోహితశాలి(ఎఱ్ఱవరి) ధాన్యము మున్నగునవి పథ్యములని చెప్పబడినవి. అయ్యవి ఆహారపరిమాణమునకన్న నధికముగనైనను స్వల్పముగనైనను భుజించినచో మాత్రాధిక్యమునంజేసి వ్యాధిని కల్గించును. అవియే లఘుగుణము కల్గియుండుటవలన జఠరాగ్ని తీవ్రముగ నున్నవారికి హేమంతకాలమున అగ్నిదీప్తికి చాలియుండవు కావున కాలభేదముచే నపథ్యములగును. (క్రియయన సంస్కారము)పైజెప్పిన రక్తధాన్యములే చక్కగ పచనముకానినాడు సంస్కారభేదమునంజేసి యపథ్యమగును. అట్టిధాన్యమే యనూపదేశమున పుట్టినదైనచో దేశభేదమునంజేసి యపథ్యమగును. స్థూలశరీరముకలవారికి రక్తశాలి లఘువుగనుండుటవలన హితము కానేరదు. ఇది శరీరావస్థచే గల్గినయపథ్యము ('గురుచాఽతర్పణం శ్లేష్మం స్థూలానాం కర్శనం ప్రతి' అని చెప్పినప్రకారము స్థూలశరీరులకు గురుగుణముకల్గి తర్పణముకాని పదార్థములు కర్శనమునకై యుపయోగించుట మంచిదికాని, లఘుగుణము కలరక్తశాలి హితము కానేరదని భావము). అట్టిధాన్యమే వాతప్రకోపమునందును వాతవ్యాధియందును హితము కానేరదు. కావున దోషరోగములయవస్థ ననుసరించి యపథ్యమగును. పురుషావస్థయన బాల్యాదివయోభేదము. బాల్యావస్థయందు శ్లేష్మము ప్రధానముగ నుండును కావున తిక్తాదిరసములు కఫహరములై హితములుగ నుండును. అయ్యవి వాతము ప్రధానమైన ముసలితనమున వాతవర్ధకమగుటంజేసి యపథ్యమగును. ఇది పురుషావస్థాభేదముచే నపథ్యము. ఇత్తెరంగున మాత్రాకాలాదులయవస్థాభేదముల ననుసరించి పథ్యకరణములైన ఎఱ్ఱవరి మున్నగునవియు నపథ్యములై విపరీతఫలమును కల్గించును.

మరియు నపథ్యములై మిక్కిలి ప్రమాదజనకములైనవియు మాత్రాకాలాదుల ననుసరించి యుక్తియుక్తముగ నుపయోగించినయెడ పథ్యములే యగును. కావున నివి పథ్యములు, ఇవి యపథ్యములు నని నిరపవాదముగ నిర్ణయించు టెట్టులని యగ్నివేశునిప్రశ్నము.

ఇచ్చట అవస్థాంతరశబ్దము మాత్రా-కాలాదిపదములతో ప్రత్యేకముగ నన్వయింపనగును. నైతికము ఆవస్థికము నని కాలము రెండువిధములు. వసంతాదికాలము నైతికము. బాల్యము, యౌవనము, వార్ధకము ననునది యావస్థికము. అందు కాలశబ్దముచే నైతికకాలంబును, పురుషావస్థశబ్దముచే వయోభేదంబును గ్రహింపనగును.

### హితాహిత నిష్కృష్టలక్షణము.

మూ. తమువాచ భగవానాత్రేయః—యదాహారజాతమగ్నివేశ సమాంశ్చైవ శరీరధాతూన్ ప్రకృతౌ స్థాపయతి, విషమాంశ్చ సమీకరోతి, ఇత్యేతద్ధితం విద్ధి; అహితం విపరీతమితి. ఏత ద్ధితాహితలక్షణం అనవదాతం భవతి. 33

వ్యా. పైజెప్పినరీతిగ ప్రశ్న జేసిన యగ్నివేశునకు హితాహితముల సామాన్య నిష్కృష్టలక్షణము నిట్లు ఆత్రేయుండు చెప్పెను:—పలుదెరంగులైన యాహారపదార్థ ములలో నెయ్యది వికృతిజెందక సమస్థితినుండుధాతువులను చెడనీయక (న్యూనాతి రేకములు కానీయక) సమస్థితియందే యుంచునో, విషమస్థితిజెందిన (వికృతినొందిన) ధాతువులను సమస్థితికి దెచ్చునో, అట్టి యాహారసముదాయమంతయు హితమని (పత్థ్య మని)యు; ఈలక్షణమునకు విరుద్ధముగ సమస్థితి నున్నధాతువులను విషమస్థితికి దెచ్చు నదియు విషమస్థితి నందినధాతువుల సమస్థితికి దేనేరక మరింత రేపెట్టునదియు నగు నాహారజాతమంతయు నహితమని (అపథ్యమని)యు తెలిసికొనుము. ఇయ్యది హితము నకు, అహితమునకును నిర్దుష్టమైనలక్షణము.

విషమస్థితినుండుధాతువులను సమస్థితికి దెచ్చుచు, సమస్థితి నుండుధాతువుల సామ్యమును చెడనీయక కాపాడునది హితలక్షణము. విషమస్థితినుండుధాతువులను సమ స్థితికి దేనేరక మరింతరేపెట్టుచు, సమస్థితినుండుధాతువుల విషమముగజేయునది యహిత లక్షణము. ఇది హితాహితములకు నిష్కృష్టలక్షణములు.

(మాత్రాకాలదేశాదులపరిస్థితి ననుసరించి పైజెప్పిన హితాహితముల నెరుంగ నగునుగాని కేవలము ఇది హితము ఇది యహితము నని వస్తుస్వరూపముచేతనే నిర్దేశము జేయ వీలుకాదని పైజెప్పినలక్షణమున కభిప్రాయము.)

### అగ్నివేశునిప్రశ్నము.

మూ. ఏవంవాదినం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ:— భగవన్! న త్వేతదేవముపదిష్టం భూయిష్ఠకల్పాః సర్వభిషజో విజ్ఞాస్యన్తి. 34

వ్యా. ఓమహనీయా! మీరు నిర్దేశించి యుపదేశించిన హితాహితలక్షణ మును సామాన్యవైద్యులందరును తెలిసికొనజాలరు. అని యాత్రేయునితో నగ్నివేశుడు చెప్పెను.

పైజెప్పినలక్షణము మాత్రాకాలాదుల యవస్థాంతరము జ్ఞానము నపేక్షించి చెప్పబడినది. అట్టి మాత్రాద్యవస్థాంతరజ్ఞానములేక హితాహితముల నెరుంగ వీలుపడదు. మాత్రాదుల యవస్థాంతరము ఒకవిధముగ నిర్ణయమేర్పడియుండదు. కావున నీచెప్పబడిన హితాహితలక్షణము వైద్యులకందరకును తెలియ నలవికాదని భావము.

## ఆత్రేయప్రతివచనము.

మూ. తమువాచ భగవానాత్రేయః—యేషాం విదితమాహారతత్త్వమగ్నివేశ ! గుణతో ద్రవ్యతః కర్మతస్సర్వావయవశశ్చ, మాత్రాదయో భావాః, త ఏతదేవముపదిష్టం విజ్ఞాతుముత్సహన్తే. యథా తు ఖల్వేతదుపదిష్టం భూయిష్ఠకల్పాః సర్వే భిషజో విజ్ఞాస్యన్తి, తథైతదుపదేక్ష్యామో మాత్రాదీన్, భావాన్ అనుదాహరన్తః, తేషాం హి బహువిధవికల్పా భవన్తి, ఆహారవిధివిశేషాంస్తు ఖలు లక్షణతశ్చ, అవయవతశ్చానువ్యాఖ్యాస్యామః. 3౬

వ్యా. పైనిచెప్పిన యగ్నివేశవాక్యమును విని యాత్రేయుం డిట్లు చెప్పెను:—గురుమందాదిగుణములను, ఉత్పత్తికారణభేదములచే నాప్యము, ఆగ్నేయము మున్నగు ద్రవ్యభేదములను, ఆయాద్రవ్యములు చేయుం జీవనబృంహణాదికర్మములను, ద్రవ్యమునం దంతట వ్యాపించియుండు రసవీర్యవిపాక ప్రభావములను, వీనినిబట్టి యాహారద్రవ్యనిశ్చయజ్ఞానంబును, మాత్ర, కాల, క్రియా, భూమి, దేహ, దోష, పురుషుల యొక్క యవస్థాంతరపరిజ్ఞానంబును, నిస్సందేహముగ నెవరికి తెలిసియుండునో, అట్టివారలే పైజెప్పబడిన హితాహిత లక్షణమును పూర్తిగ దెలిసికొనజాలుదురు. (సకల ద్రవ్యములయందును గురుమందాదిగుణంబులును, జీవన బృంహణాదికర్మలను, రసవీర్యవిపాకప్రభావంబులును, భిన్నభిన్నములుగ నుండును కావున అట్టిగుణాదుల గమనించి ఇయ్యది గురువు, ఇయ్యది బృంహణము, ఈద్రవ్యముయొక్క రసవీర్యవిపాక ప్రభావము లిట్టివి. యని చక్కగ గమనించి యాహారవస్తువాస్తవ్యము నెరింగి, మాత్రాకాలాదుల యవస్థాంతరముల చక్కగ తెలిసియున్న వైద్యులుమాత్రము పైజెప్పిన హితాహితలక్షణముల నిర్ణయించి యాహారవిధానము నిర్ణయింపగలరుగాని, సామాన్యముగ నందరకును పైజెప్పిన లక్షణజ్ఞానము కల్గనేరదని భావము.)

పైజెప్పిన గుణాదులయొక్కయుమాత్రాకాలాదుల యవస్థాంతరములయొక్కయు వికల్పభేదములు నానావిధములుగ నుండును. వానినన్నిటిని ఉత్తమ మధ్యమ అధమ

భేదములచే నానాభేదములుగల వైద్యులకందరకును సులభముగ దెలియునటుల మాత్రాదిభావములను మాత్రము నుదహరింపక వదలి తక్కినవాని నుపదేశించెదను. (వైద్యులలో ఉత్తమాధికారులు కొందరును, మధ్యమాధికారులు కొందరును, అధమాధికారులు కొందరు నుందురు. అట్టిభేదము వారిజ్ఞానపరిస్థితినిబట్టి యుండును. అందు జ్ఞానాధికులకు జ్ఞానాభివృద్ధికిని, తక్కినవారలకు నిశ్చయాత్మజ్ఞానమునకును ఉపయోగించునట్లు ద్రవ్యసంబంధమైన రసగుణవీర్యవిపాకప్రభావముల నుపదేశించెదనని భావము.)

(మరియు "లోహితశాలి యశూకధాన్యానాం" అని యుపక్రమించి శ్రేష్ఠతరములగు ద్రవ్యములు కొన్ని పరిగణనము చేయబడును. అయ్యది జ్ఞానాధికులకు జ్ఞానసాహాయ్యమునకును, అల్పజ్ఞానులకు వ్యవహారయోగ్యతకు నుపయుక్తమగును.)

మరియు నాహారవిధివిశేషములను లక్షణములబట్టియు. ఆహారద్రవ్యములలో నేకదేశభేదమునుబట్టియు నీక్రింద వివరించెదను. ("ఆహారత్వమాహారస్య......కరణబాహుళ్యాత్" అనుగ్రంథముచేత ఆహారద్రవ్యసామాన్యముగ నుండులక్షణమును, ఆహారద్రవ్యము లనంతములుగనున్నను వానిలో శ్రేష్ఠత్వమునుబట్టి 'లోహితశాలయః' అనుగ్రంథముచే కొన్నిటిని పరిగణనముచేసియు నీక్రింద వివరించెదనని భావము.)

స్థావరజంగమాది భేదములచే నాహారపదార్థనిర్ణయము.

మూ. తద్యథా — ఆహారత్వమాహారస్యైకవిధమర్థాఽభేదాత్, స పున ర్ద్వియోనిః స్థావరజఙ్గమాత్మకత్వాత్, ద్వివిధప్రభావో హితాహితోదర్కవిశేషాత్, చతుర్విధోపయోగః పాన-అశన-భక్ష్య-లేహ్యోపయోగాత్, షడాస్వాదో రసభేదతః షడ్విధత్వాత్, వింశతిగుణో గురు-లఘు-శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్ష-మన్ద-తీక్ష్ణ-స్థిర-సర-మృదు-కఠిన-విశద-పిచ్ఛిల-శ్లక్ష్ణ-ఖర-సూక్ష్మ-స్థూల-సాన్ద్ర-ద్రవానుగమాత్, అపరిసంఖ్యేయవికల్పో ద్రవ్యసంయోగకరణబాహుళ్యాత్. 36

వ్యా. భుజింపబడుపదార్థము ఆహార మనబడును. అట్టి యాహారపదార్థమునకు ఆహారత్వము ఏకవిధముగ నుండును. (ఆహారత్వమన ఆహారపదార్థనిష్ఠధర్మము. దీనికర్థభేదము లేదుకావున నాహారత్వ మొక్కటియే యని యర్థము.) అట్టి యాహారపదార్థమున కుత్పత్తికారణము స్థావరము జంగమము నని రెండువిధముల నుండును కావున రెండువిధములైన కారణములు కల్గియుండును. (అట్టి కారణములచే స్థావరము,

జంగమము నని యాహారపదార్థములు రెండువిధముల నుండునని యర్థము. అందు రక్తశాల్యాదులు స్థావరములు. ప్రాణులకు సంబంధించినమాంసాదులు జంగమములు.) అట్టి యాహారపదార్థములు భుజించినపిదప కొన్ని హితమైన (యారోగ్యరూపమైన) ఫలమును, కొన్ని యనారోగ్యరూపమైన ఫలమును కల్గించును. కావున నట్టి హితాహితరూపమైన ప్రభావవిశేషమునంజేసి హితమనియు, అహితమనియు రెండు భేదములు కల్గియుండును.

అయ్యది పానరూపముగను, అశనరూపముగను, భక్ష్యరూపముగను; లేహ్యరూపముగను ఉపయోగింపబడును కావున ఉపయోగభేదములచే నాల్గువిధములుగ నుండును. (పానీయము (త్రాగతగిన ద్రవరూపమైనది), భోజ్యము (మృదువై భుజింపదగినది), భక్ష్యము (కొంచెము ఘనమై నమలి తినదగినది), లేహ్యము (నాలుకతో చప్పరించి తినదగినది), నని నాల్గువిధములగునని భావము.)

తీపు, పులుపు, ఉప్పు, కారము, చేదు, వగరు, అని యారువిధములైన రసభేదములచేత నాహారపదార్థంబును ఆరువిధములుగ నుండును (తీపు మున్నగు ఆరువిధములైనరుచులు కల్గియుండునని భావము.)

గురు, లఘు, శీతము, ఉష్ణము, స్నిగ్ధము, రూక్షము, మన్దము, తీక్ష్ణము, స్థిరము, సరము, మృదువు, కఠినము, విశదము, పిచ్ఛిలము, శ్లక్ష్ణము, ఖరము, సూక్ష్మము, స్థూలము, సాంద్రము, ద్రవము అను నీయిరువదిగుణములు కల్గియుండును. (అట్టి గురులాఘవాది గుణభేదములచే నిరువదిభేదములు కల్గియుండునని భావము.)

మరియు నట్టియాహారపదార్థములైన వ్రీహ్యాదులు పక్వముచేయు సంస్కారభేదము లనేకవిధముల నుండును కావున అట్టి ద్రవ్యసంయోగబాహుళ్యమునంజేసి అనేకవిధములుగ నుండును.

ఇచ్చట "యేషాం విహితమాహారతత్త్వం...గుణతో ద్రవ్యతః, కర్మతః, సర్వావయవశశ్చ" అని నిర్దేశింపబడిన గుణాదులు ఆహారమునకు సంబంధించి వివరింపబడినవి. "తథైతదుపదేక్ష్యామో మాత్రాదీన్ భావాననుదాహరన్తః"అనువాక్యముచేత'మాత్రాది భావముల నుదాహరింపకయే తక్కినగుణాదుల నుపదేశించెదనని ప్రతిజ్ఞజేసినందుచే తదనుసారముగ మాత్రాకాలాదులను మాత్రము వదలి తక్కినగుణాదులు మాత్రము వివరింపబడినవి. మాత్రాకాలాదులు కేవలము ద్రవ్యమాత్రము నాశ్రయించి నియతముగ నేర్పడియుండవు కావున వాని నిచ్చట జెప్పక వదలెను.

కొన్నిప్రతులలో "మాత్రాదీన్ భావానుదాహరన్తః" అనుపాఠము కానవచ్చుచున్నది. అట్టియెడ ప్రతిజ్ఞానుసారముగ గుణాదుల నుపదేశించినట్లు మాత్రా

కాలాదులగూడ నుపదేశించి యుండవలెను. అట్లు వివరించి యుండలేదు. దానంజేసి యీపాఠము గ్రంథకర్తకు స్వోక్తివ్యత్యయమును కల్గించును. కావున నిరసనీయము.

పథ్యతమవస్తు పరిగణనప్రతిజ్ఞ.

మూ. యస్య ఖలు యేయే వికారావయవాః భూయిష్ఠ ముపయుజ్యన్తే భూయిష్ఠకల్పానాం చ మనుష్యాణామ్ ప్రకృత్యైవ హితతమాశ్చ, అహితతమాశ్చ, తాంస్తాన్ యథావదనువ్యాఖ్యాస్యామః. 32

వ్యా. ఆహారపదార్థములలో ఏవస్తుజాతియొక్క ఏఏవిశేషావయవములను మిక్కిలి యుపయోగింపదగునో కొంచెమించుమించుగ అట్టివస్తువుల నన్నింటిని మనుష్యులు వికృతిజెందక స్వభావస్థితి నున్నపుడు, మిక్కిలి హితతమంబులుగను అహితతమంబులుగను అయినవానిని వేరువేరుగ విభజించి ఈక్రింద వివరించెదనని యర్థము.

రక్తశాలి మున్నగునాహారపదార్థములు అనేకజాతులుగ నుండును. అందులో నేయేజాతితో నేయేభేదము కలద్రవ్యములను సంయోగకరణాదుల నపేక్షింపక స్వభావముగనే యుపయోగించినచో మిక్కిలి హితంబులుగను మిక్కిలి యహితంబులుగను ఉండునో కొంచెమించుమించుగ వానినన్నిటి నీక్రింద వేరువేరుగ వివరించెదనని భావము. ఎట్టులన ఆహారపదార్థములలో జేరినధాన్యజాతిలో శూకధాన్యము ఒక తెగలో జేరనగు. అందును ఎఱ్ఱవరిధాన్యము హితతమమనియు, యవకధాన్యము అహితతమమనియు,విభజించి చెప్పబడును. "లోహితశాలయః శూకధాన్యానాం పథ్యతమాః" 'యవకాశ్శూకధాన్యానా మపథ్యతమాః" ఇవి మున్నగువాక్యములచే వివరింపబడును. ఇత్తెరంగుననే నన్నింటిని యుదాహరణముగ నూహించునది.

ఇచ్చట"భూయిష్ఠకల్పాః" అనుచోట "ఈషదసమాప్తౌకల్పప్ దేశ్యదేశీయరః" అనువ్యాకరణసూత్రముచేత కల్పప్ అనుప్రత్యయను కొంచెము తక్కువ యనునర్థమున వచ్చును. కొంచెము తక్కువగ ఏవిహితములు, ఏవి అహితములును కలవో వానిని యించుమించుగ నన్నిటిని చెప్పెదనని యర్థము.

పథ్యతమవస్తుపరిగణనము.

మూ. తద్యథాః—

లోహితశాలయశ్శూకధాన్యానాం పథ్యతమత్వే శ్రేష్ఠతమాః, ముద్గాశ్శమీధాన్యానాం, ఆన్తరిక్షముదకానాం, సైన్ధవం లవ

ణానాం, జీవన్తీశాకం శాకానాం, ఐణేయం మృగమాంసానాం, లావః పక్షిణాం, గోధా బిలేశయానాం, రోహితో మత్స్యానాం, గవ్యం సర్పిస్సర్పిషాం, గోక్షీరం క్షీరాణాం, తిలతైలం స్థావరజాతానాం స్నేహానాం, వరాహవసా ఆనూపమృగవసానాం, చుల్లుకీవసా మత్స్యవసానాం, పాకహంసవసా జలచరవిహంగవసానాం, కుక్కుటవసా విష్కిరశకునివసానాం, అజమేదశ్శాఖాదమేదసాం, శృఙ్గబేరం కన్దానాం, మృద్వీకా ఫలానాం, శర్కరా ఇక్షువికారాణాం, ప్రకృత్యైవ హితతమానాం ఆహారవికారాణాం ప్రాధాన్యతో ద్రవ్యాణి వ్యాఖ్యాతాని భవన్తి. ౩౮

వ్యా. శూకధాన్యములలో (ముల్లుకల్గినధాన్యములలో) నెఱ్ఱవరివడ్లు మిక్కిలి పథ్యములుగ నుండును. మరియు కాయధాన్యములలో పెసలును, ఉదకములలో నంతరిక్షమునసే క్రిందపడనీయక గ్రహింపబడిన జలంబును, లవణములలో సైంధవలవణంబును, ఆకుకూరలలో పాలకూరయు మృగమాంసములలో జింకమాంసంబును, పక్షులలో లావుకపిట్టయు, బొరియలలో నివసించుజంతువులలో ఉడుమును, మత్స్యములలో రోహితమత్స్యంబును (ఎఱ్ఱనిరంగుకలచేప), నేతిదినుసులలో ఆవునెయ్యియు, పాలలో నావుపాలును, స్థావరవస్తువులనుండి పుట్టినతైలముల (నూనెల) లో నువ్వులనూనెయు, అనూపజంతువుల (జలప్రాంతముల నివసించుజంతువుల) వసలలో అడవిపందివసయు, చేపలవసలలో చుల్లుకి యనుచేపయొక్కవసయు, జలపక్షులవసలలో తెల్లనిహంసల వసయు, విష్కిరజాతి (ముక్కుతో గీరితిను) పక్షులవసలలో కోడివసయు, ఆకులదిను జంతువుల మేదస్సులలో మేకలమేదస్సును, గడ్డదినుసులలో అల్లంబును, పండ్లదినుసులలో ద్రాక్షపండ్లును, చెరకురసమునబుట్టు బెల్లము మున్నగుదినుసులలో చక్కెరయు, మిక్కిలి పథ్యకరములై శ్రేష్ఠముగ నుండును. ఇత్తెరంగున నాహారద్రవ్యములలో వస్త్వంతరసంయోగాదుల నపేక్షింపక స్వాభావికముగ హితములగువానిలో మిక్కిలి పథ్యములైనవానిని ప్రధానముగ వివరించి చెప్పబడినది.

ఇచ్చట కాచియాకు ఆకుకూరలలో త్రిదోషహరమై మిక్కిలి హితమైనది. అయినను నయ్యది మరునాటికి నుంచినచో విషతుల్యమగును. కావున దానిని విడచి పాలకూర చెప్పబడినది. "భూశయా వారిజాతాశ్చ కఫపిత్తవివర్ధనాః" అని యుండుట చేత బొరియలలో నుండుజంతువులు సామాన్యముగ కఫపిత్తముల వృద్ధినొందించు

స్వాభావముకల్గినవి. అయినను అట్టి బిలేశయములలో నుడుము శ్రేష్ఠమని పరిగణనము చేయబడినది. మరియు "కించిద్దోష ప్రశమనం కించిద్ధాతు ప్రకోపనం, స్వస్థవృత్తౌమతం కించిద్ద్రవ్యం త్రివిధ ముచ్యతే" అని చెప్పినప్రకారము స్వల్పముగ ధాతువుల ప్రకోపింపజేయుచుండియుం స్వస్థవృత్తమున ప్రకృత్యాదుల ననుసరించి హితమగునని చెప్పబడినవి. జలచరాదులును ఇట్టిసమాధానముచేతనే యంగీకారముగ జెప్పబడినది.

## అపథ్యతమవస్తుపరిగణనము.

మూ. అహితానప్యుపదేక్ష్యామః.—

యవకాశ్శూకధాన్యానాం అపథ్యతమత్వేన ప్రకృష్టతమా భవన్తి. మాషాశ్శమీధాన్యానాం వర్షానాదేయముదకానాం, ఊషరం లవణానాం, సర్షపశాకం శాకానాం, గోమాంసం మృగమాంసానాం, కాణకపోతః పక్షిణాం, భేకో బిలేశయానాం, చిలిచిమోమత్స్యానాం, ఆవికం సర్పిః సర్పిషాం,అవిక్షీరం క్షీరాణాం, కుసుమ్భస్నేహః స్థావరస్నేహానాం, మహిషవసా ఆనూపమృగవసానాం, కుమ్భీరవసా మత్స్యవసానాం, కాకమద్గువసా జలచరవిహఙ్గమవసానాం, కారణ్డవవసా విష్కిరశకునివసానాం, హస్తిమేదః శాఖాదమేదసాం, నికుచం ఫలానాం, ఆలుకం (మూలకం) కన్దానాం, ఫాణితమిక్షువికారాణాం, చటకవసా విష్కిరశకునివసానాం, ఇతి ప్రకృత్యైవాహితతమానామాహారవికారాణాం ప్రకృష్టతమాని ద్రవ్యాణి వ్యాఖ్యాతాని భవన్తి. ౩౯

వ్యా. శూకధాన్యజాతిలో చేరిన ధాన్యములలో యవకములు (చిన్నయవలు) అపథ్యద్రవ్యములలో మిక్కిలి యపథ్యతమములు. మరియు శమీధాన్యములలో(కాయ ధాన్యములలో) మినుములును, ఉదకములలో వర్షాకాలమున నదులలో నుండుజలంబును, లవణములలో చవ్వటియుప్పును, శాకములలో ఆవకూరయును, మృగమాంసములలో గోమాంసంబును, పక్షులలో కాణకపోతంబును (చిన్నగువ్వ), బొరియలలో నుండు జంతువులలో కప్పయు, మత్స్యములలో చిలిచిమంబను మత్స్యవిశేషంబును, నేతిదినుసులలో గొఱ్ఱెలనెయ్యియు, పాలదినుసులలో గొఱ్ఱెలపాలును, స్థావరములనూనెలలో కుసుమలనూనెయు, అనూప (జలప్రాంతమునను౦డు) మృగములవసలలో నెనుబోతుల

వసయు, మత్స్యజాతివసలలో మొసలివసయు, జలమునసంచరించుపక్షులవసలలో నీరుకోడివసయు, విష్కిరజాతిపక్షులవసలలో కారండవ (పెన్నెడపులుగు) వసయు, ఆకులదినుజంతువులమేదస్సులలో నేనుగులమేదస్సును, పండ్లనుసులలో నికుచ (పిన్నరేగు) ఫలంబును, గడ్డదినుసులలో ఆలూకము (గెనసు, కఱ్ఱపెండలము, బంగాళాదుంపలు)ను, (లేక ముల్లంగి) చెరకురసమునసైన బెల్లము మున్నగువానిలో ఫాణితంబును, (అర్థపాకముగ కాచబడినపాగు) విష్కిరపక్షి జాతిలోచేరినవానివసలలో చటక (ఊరపిచ్చుక) వసయు, ఇవియన్నియు ప్రకృతిచేతనే యహితములైన యాహారపదార్థములలో మిక్కిలి యహితములని చెప్పబడినవి. ఇత్తెరంగున హితములైన యాహారములలో నుత్తమములును, అహితములలో మిక్కిలి యహితంబులును వేరువేరుగ వివరింపబడినవి.

ఇచ్చట పైజెప్పబడినవి యహితములలో మిక్కిలి ప్రతికూలమును చేయునవి యని తెలుపుటకై "ప్రకృష్టతమాని" యని చెప్పబడినది. "నికృష్టతమాని" అను పాఠాంతరమున మిక్కిలి నింద్యమైనవని యర్థము. మరియు "కారణ్డవవసా విష్కిరశకునివసానాం" "చటకవసావిష్కిరశకునివసానాం" మూలగ్రంథమున రెండుచోట్ల నొక విషయమే చెప్పబడినది. తక్కినవాని కన్నిటికిని ఒక్కొకవస్తువునే నిర్దేశించుచు విష్కిరశకుని వసమాత్రము రెండుగ నిర్దేశించుటకు కారణము చింతనీయము. ప్రాచీన ప్రతుల యందు మాత్రము "చటకవసా విష్కిరశకునివసానాం" అని మాత్రము పాఠమొక్కటియే యున్నది. ఇదియే సాధువని మాయభిమతము.

## { హితాహితాహారములయొక్కయు ఔషధములయొక్కయు ప్రధానకృత్యనిర్దేశము. }

మూ. హితాహితావయవానా మాహారవికారాణాం, అతోభూయః కర్మ, ఔషధానాం ప్రాధాన్యతః సానుబన్ధాని ద్రవ్యాణి అనువ్యాఖ్యాస్యామః. ౪౦

వ్యా. ఇంతదనుక హితములైన యాహారపదార్థములయొక్కయు, అహితములైన యాహారపదార్థములయొక్కయు, శ్రేష్ఠత్వము నుద్దేశించి అట్టిపదార్థముల యేకదేశము చెప్పబడినది. అట్టి హితాహితముల వ్యాపారము అవి చేయుపనిని చెప్పియుండలేదు. కావున అట్టి హితాహిత రూపములైన యాహారములకు సంబంధించిన కృత్యమును, ఔషధములలో ముఖ్యములైనవానియొక్క కృత్యములను, అట్టి కృత్యములజేయు ద్రవ్యములను, అట్టి ద్రవ్యముల ప్రయోజనములను వివరించెదనని యర్థము.

'లోహితశాలయః' ఇత్యాది గ్రంథముచేత హితాఽహిత ద్రవ్యములలో ముఖ్యతమములు నిర్దేశింపబడినవి కాని వానికర్మల నిర్దేశించి చెప్పియుండలేదు. ఇకమీదు

అట్టి హితాహిత ఆహార ద్రవ్యములుచేయు పనిని, ప్రధానముగ కొన్ని యౌషధములు చేయు పనిని, అట్టిపనిచేయు ద్రవ్యములను సప్రయోజనముగ వివరించెదనని భావము. అందు 'అన్నం వృత్తికరాణాం' 'ఉదకమాశ్వాసకరాణాం' ఇవి మున్నగువాక్యముల చే నాహారపదార్థములు చేయు కృత్యంబును, "త్రివృత్సుఖవిరేచన కరాణాం" అను వాక్యములచే నౌషధములు చేయుకృత్యంబులును చెప్పబడును. మరియు పలుదెరంగులైన యాహార పదార్థముల కర్మములును, నానావిధౌషధ కృత్యంబులు, అనేకములుగ నున్నను, అందు ప్రధానముగ మాత్రము నిర్దేశించి చెప్పబడునని 'ప్రాధాన్యతః' అను పదముచే తెలిసెడి అహితములకృత్యములు "ఆవికం సర్పిః అహృద్యానాం" అను వాక్యములచే చెప్పబడును.

ఇచ్చట 'సానుబంధాని' యనగా ప్రయోజనముతో కూడినవని యర్థము. అయ్యది 'ద్రవ్యాణి' యనుదానికి విశేషణము. ప్రయోజనముతో కూడిన ద్రవ్యములను వివరించెదనని యర్థము. మరియు ద్రవ్యాణి యనుపద ముపలక్షణము. ఇట్లు చెప్పుటచేత "శాస్త్రవిహితస్తర్కః సాధనానాం" ఇది మున్నగువాక్యముల చే తర్కాదుల నిర్దేశించినది సంగతమగును. తర్కాదులు ద్రవ్యములు కావున వానిని చెప్పినదికూడ సంగతము.

వృత్తికరాహారాదులలో శ్రేష్ఠత్వము.

మూ. అన్నం వృత్తికరాణాం శ్రేష్ఠం; ఉదకమాశ్వాసకరాణాం (ఆప్యాయనకరాణాం), సురా శ్రమహరాణాం, క్షీరం జీవనీయానాం, మాంసం బృంహణీయానాం, (రసస్తర్పణీయానాం), లవణమన్నద్రవ్యరుచికరాణాం, అమ్లం హృద్యానాం, కుక్కుటో బల్యానాం, నక్రరేతో వృష్యాణాం, మధు శ్లేష్మపిత్త ప్రశమనానాం, సర్పిర్వాతపిత్తప్రశమనానాం, తైలం వాత శ్లేష్మప్రశమనానాం, వమనం శ్లేష్మహరాణాం, విరేచనం పిత్త హరాణాం, వస్తిర్వాతహరాణాం, స్వేదో మార్దవకరాణాం, వ్యాయామః స్థైర్యకరాణాం, (వ్యవాయః కార్శ్యకరాణాం), క్షారః పుంస్త్వోపఘాతినాం, తిన్దుకమన్నద్రవ్యారుచికరాణాం, ఆమకపిత్థమకణ్ఠ్యానాం, ఆవికం సర్పిరహృద్యానాం, అజాక్షీరం శోషఘ్న-స్తన్య-సాత్మ్య-రక్తసాంగ్రాహిక-రక్తపిత్తప్రశమనానాం,

అవిక్షీరం శ్లేష్మపిత్తోపచయకరాణాం, మహిషీక్షీరం స్వప్నజననానాం, మన్దకం దధ్యభిష్యన్దకరాణాం, గవేధుకాన్నం కర్శనీయానాం, ఉద్దాలకాన్నం విరూక్షణీయానాం, ఇక్షుర్మూత్రజననానాం, యవాః పురీషజననానాం, (జామ్బవం వాతజననానాం), శష్కుల్యః శ్లేష్మపిత్తజననానాం, కులత్థాః అమ్లపిత్తజననానాం, మాషాః శ్లేష్మపిత్తజననానాం, మదనఫలం వమన-ఆస్థాపన-అనువాసనోపయోగినాం. ౪౦

వ్యా. శరీరమును మంచిస్థితినుండు నాహారద్రవ్యములలో నన్నము మిగుల శ్రేష్ఠము, శరీరమున కల్గిన శ్రమ మున్నగువానిని హరించి యూరటజేయు ద్రవ్యములలో నుదకము మిగుల శ్రేష్ఠము. శరీరశ్రమమును పోగొట్టు ద్రవ్యములలో సురయను మద్యము మిగుల శ్రేష్ఠము. మరియు జీవనీయములలో క్షీరంబును, బృంహణీయములలో మాంసంబును, (తర్పణీయములలో మాంసరసంబును), ఆహారపదార్థములకు రుచిని కల్గించు ద్రవ్యములలో లవణంబును, నాలుకకు రుచిని కల్గించువానిలో నమ్లంబును, బలకరద్రవ్యములలో కుక్కుటమును (కోడియు) వృష్యములలో మొసలరేతస్సును, కఫపిత్తముల శమించుద్రవ్యములలో తేనెయు, వాతపిత్తముల శమింపజేయువానిలో నెయ్యియు, వాతకఫముల శమింపజేయువానిలో తైలంబును, శ్లేష్మహారములలో వమనంబును, పిత్తహారములలో విరేచనంబును, వాతహారములలో వస్తికర్మయు, శరీరమునకు మృదుత్వమును కల్గించువానిలో స్వేదంబును (చెమటబుట్టించుట) శరీరావయవాదులకు స్థైర్యమును కల్గించువానిలో వ్యాయామంబును, (శరీరమును కృశింపజేయువానిలో స్త్రీసంభోగంబును), పుంస్త్వమును (సంభోగశక్తిని) నశింపజేయువానిలో క్షారంబును, ఆహారద్రవ్యమునం దరుచిని కల్గించువానిలో తుమికిపండును, కంఠమునకు హితముకాని ద్రవ్యములలో లేత వెలగకాయయు, అరుచిని కల్గించు (అసహ్యత పుట్టించు) ద్రవ్యములలో గొఱ్ఱెనెయ్యియు, శోషహర స్తన్యవృద్ధికర ప్రకృతి సాత్మ్య రక్తసంగ్రాహిక రక్తపిత్తహర గుణములుకల ద్రవ్యములలో మేకపాలును, కఫపిత్తముల వృద్ధినొందించువానిలో గొఱ్ఱెపాలును, నిద్రకల్గించువానిలో గేదెలపాలును, స్రోతోరంధ్రముల స్రవింపజేయు (పడిసెముపుట్టించు) ద్రవ్యములలో మందకమను పెరుగును, శరీరమును కృశింపజేయువానిలో గవేధుకముల (అడవిగోధుమల) యన్నంబును, శరీరమున రూక్షత గల్గించు ద్రవ్యములలో అడవియారికలయన్నం

ఖను, మూత్రమును కల్గించువానిలో చెరకును, పురీషమును కల్గించువానిలో యవలను, (వాతమును కల్గించువానిలో నేరేడుపండును), కఫ పిత్తముల కల్గించువానిలో గొర్రె లంబులను, అమ్ల పిత్తమును కల్గించువానిలో నులవలును, కఫపిత్తముల కల్గించువానిలో మినుములును, వమనమునకును ఆస్థాపనవస్తికిని అనువాసనవస్తికిని ఉపయోగించు ద్రవ్యములలో మ్రంగకాయయు మిక్కిలి శ్రేష్ఠములు.

(ఇచ్చట 'మధు శ్లేష్మపిత్తప్రశమనానాం' అనుచోట కఫపిత్తప్రశామకములైన ద్రవద్రవ్యములలో తేనె శ్రేష్ఠమని యర్థము. "దురాలభా పిత్తశ్లేష్మహరాణాం" అని క్రిందజెప్పినవాక్యమునకు పిత్తకఫప్రశామకములగు నౌషధములలో దూలగొండి శ్రేష్ఠమని యర్థము. కావున నీరెంటికిని కఫపిత్తశామకత్వము చెప్పినది విరోధము లేదు. "వస్తిర్వాతహరాణాం" సామాన్యముగ జెప్పుటచేత ఆస్థాపనానువాసనవస్తులరెంటికిని యర్థమగును. పిత్తశ్లేష్మజననములయిన పేయములలో గొఱ్ఱెపాలు శ్రేష్ఠమని 'ఆవిక్షీరం పిత్తశ్లేష్మజననానాం' అనియు, పిత్తకఫజననములగు భోజ్యములలో మాషములు శ్రేష్ఠమని 'మాషాః పిత్తశ్లేష్మజననానాం' అనియు, అట్టిభక్ష్యములలో చక్కిలములు శ్రేష్ఠములని "శష్కుల్యః పిత్తశ్లేష్మజననానాం" అనియు భిన్నవిషయములు జెప్పబడినవి కావున విరోధములేదు. లేక యీమూడును పిత్తశ్లేష్మజననమున సమానములుగ నుండుననియైన భావము. అనేకద్రవ్యములకు తుల్యముగ శ్రేష్ఠత్వమును చెప్పునట్టి స్థలములయందెల్ల నిత్తెరంగుననే విశేషము నెరుంగునది.)

సుఖవిరేచనాద్యౌషధాదులలో శ్రేష్ఠములనిర్దేశము.

మూ. త్రివృత్ సుఖవిరేచనానాం, చతురఙ్గులం మృదువిరేచనానాం, స్నుక్పయః తీక్ష్ణవిరేచనానాం, (ప్రత్యక్పుష్పీ శిరోవిరేచనానాం), విడఙ్గం క్రిమిఘ్నానాం, శిరీషో విషఘ్నానాం, ఖదిరః కుష్ఠఘ్నానాం, రాస్నా వాతహరాణాం, ఆమలకం వయస్థాపనానాం, హరీతకీ పథ్యానాం, ఏరణ్డమూలం వృష్యవాతహరాణాం, పిప్పలీమూలం దీపనీయ-పాచనీయ ఆనాహ - ప్రశమనానాం, చిత్రకమూలం దీపనీయ-పాచనీయ - గుదశోథార్శశ్శూలహరాణాం, పుష్కరమూలం హిక్కా-శ్వాస - కాస - పార్శ్వశూలహరాణాం, ముస్తం సఙ్గ్రాహిక-దీపనీయ-పాచనీయానాం, ఉదీచ్యం నిర్వాపణ - దీపనీయ-పాచనీయ-చ్ఛర్ద్యతీ

సారహరాణాం, కట్వఙ్గం సఙ్గ్రాహక-పాచనీయ-దీపనీయానాం, అనన్తా సఙ్గ్రాహక-రక్తపిత్తప్రశమనానాం, అమృతా సఙ్గ్రాహక - వాతహర - దీపనీయ - శ్లేష్మశోణితవిబంధప్రశమనానాం, బిల్వం సఙ్గ్రాహక-దీపనీయ- వాతకఫప్రశమనానాం, అతివిషా దీపనీయ - పాచనీయ - సఙ్గ్రాహక - సర్వదోషప్రశమనానాం, ఉత్పల పద్మ కుముదకిఞ్జల్కాః సఙ్గ్రాహక-రక్తపిత్తప్రశమనానాం, దురాలభా పిత్త-శ్లేష్మప్రశమనానాం, గన్ధప్రియఙ్గుః శోణిత పిత్తాతియోగప్రశమనానాం, కుటజత్వక్ శ్లేష్మ పిత్తరక్త సఙ్గ్రాహకోపశోషణానాం, కాశ్మర్యఫలం రక్తసఙ్గ్రాహక-రక్త పిత్తప్రశమనానాం, పృశ్నిపర్ణీ సఙ్గ్రాహక-వాతహర-దీపనీయ-వృష్యాణాం, విదారిగన్ధా వృష్య-సర్వదోషహరాణాం, బలా సఙ్గ్రాహక - బల్య - వాతహరాణాం, గోక్షురకో మూత్రకృచ్ఛ్రానిలహరాణాం, హిఙ్గునిర్యాసః ఛేదనీయ-దీపనీయ-అనులోమిక - వాతకఫప్రశమనానాం, అమ్లవేతసో భేదనీయ-దీపనీయ - అనులోమిక - వాతశ్లేష్మప్రశమనానాం, యావశూకః స్రంసనీయ-పాచనీయ-అర్శోఘ్నానాం. ౪౨

వ్యా. సుఖముగ విరేచనముల జేయునౌషధములలో తెగడయు, మృదువిరేచనములగు నౌషధములలో రేలకాయలలోని జిగురును, తీక్ష్ణముగ విరేచనముల జేయు నౌషధములలో జెముడుపాలును, శిరోవిరేచనౌషధములలో నుత్తరేణియు మిక్కిలి శ్రేష్ఠములు.

మరియు క్రిమిహరములలో వాయువిడంగంబులును, విషహరములలో దిరిసెనంబును, రక్తహరములలో చంద్రయు, వాతహరములలో సన్నరాష్ట్రంబును, మనలి చనముగు రానీయక యావనవయస్సు స్థాపించునౌషధములలో నసిరికకాయలును, పత్త్యౌషధములలో కరకకాయలును, వృష్యములును వాతహరములు నగునౌషధములలో ఆముదపువేరును, దీపనీయమును, పాచనీయమును కడుపుబ్బరమును శమింపజేయునదియు నగువానిలో మోడియు దీపనీయంబును పాచనీయంబును గుదకీలరూపమైన యర్శోరోగహరంబును నగునౌషధములలో చిత్రమూలముయొక్క వేరును మిగుల శ్రేష్ఠములు.

ఎక్కుళ్లను శ్వాసకాసములను పక్కశూలను హరించునౌషధములలో పుష్కర మూలంబును, సంగ్రాహకంబును దీపనీయంబును పాచనీయంబును నగువానిలో తుంగ గడ్డలును, పుండునార్చునదియు దీపనీయంబును, పాచనీయంబును వమనవిరేచనముల హరించునదియు నగునౌషధములలో ఉదీచ్యంబు (కురు వేరు)ను, సంగ్రాహకపాచనీయ దీపనీయ మగునౌషధములలో దుండిగపుష్పమును, సంగ్రాహకంబును, రక్తపిత్తప్రశమనం బును నగునౌషధములలో పాలసుగంధియు, సంగ్రాహకంబును వాతహరంబును దీప నీయంబులును కఫపిత్తములశమింపజేయునదియు మలబంధమును నివర్తిచేయునదియు నగు నౌషధములలో తిప్పతీగెయు మిక్కిలి శ్రేష్ఠములు.

సంగ్రాహకములును దీపనీయంబులును వాతకఫప్రశమనంబులు నగు నౌషధములలో బిల్వంబును, దీపనీయపాచనీయ సంగ్రాహక సర్వదోషహరంబులు నైనయౌషధములలో అతివసయు, సంగ్రాహకములై రక్తపిత్తప్రశమనంబులైన యౌషధములలో తెల్లకలు వలయొక్కయు నల్లకలువలయొక్కయు తామరపువ్వులయొక్కయు కేసరంబులును; పిత్తకఫహరములలో దురదగొండియు, రక్తపిత్తాతియోగమును శమింపజేయువానిలో మ్రేంకణంబును, కఫపిత్తరక్తములను నిరోధించి శోషింపజేయువానిలో కొడిసెపాల చెట్టయు,రక్తసంగ్రాహములును రక్తపిత్తప్రశమనంబులు నగువానిలో పెద్దగుమ్మడిపండును, సంగ్రాహకములును వాతహరములును దీపనీయంబులును వృష్యంబులును నగువానిలో కోలపొన్నయు, వృష్యంబును సర్వదోషహరంబును నగువానిలో ముయ్యాకుపొన్నయు, సంగ్రాహకంబును బలకరంబును వాతహరంబును నగువానిలో చిట్టాముట్టిదయు, మూత్రకృచ్ఛ్రమును వాతమును హరించువానిలో పల్లేరును, చ్ఛేదనీయంబును దీప నీయంబును అనులోమకరంబును వాతకఫప్రశమనంబును నగునౌషధములలో హింగు నిర్యాసంబును (ఇంగువ), ఛేదనీయమును దీపనీయమును అనులోమకరంబును వాతకఫ శామకంబును నగునౌషధములలో అమ్లవేతసంబును (పుల్లప్రబ్బలి), స్రంసనీయంబులును పాచనీయంబులును అర్శోరోగహరంబులు నైనయౌషధములలో యావశూకంబును (యవక్షారము), మిక్కిలి శ్రేష్ఠములు. (పైజెప్పినరీతిగ సుఖవిరేచనాదికృత్యముల చేయుటయందు అట్టికృత్యముల జేయునట్టి యితరౌషధములలో తెగడ మున్నగునవి మిక్కిలి శ్రేష్ఠములుగ నుండునని ఔషధద్రవ్యములకు వానివానికర్మముల నిరూపిం చుచు శ్రేష్ఠత్వము చెప్పబడినది.)

## తక్రాభ్యాసాదుల శ్రేష్ఠత్వములు.

సూ. తక్రాభ్యాసః గ్రహణీదోషార్శోఘృతవ్యాపత్ప్రశమనానాం,
క్రవ్యాన్మాంసరసాభ్యాసః గ్రహణీదోషశోషార్శోఘ్నానాం,

క్షీరఘృతాభ్యాసో రసాయనానాం, సమఘృతసక్తుప్రాశా భ్యాసో వృష్యోదావర్తహరాణాం, తైలగణ్డూషాభ్యాసో దన్తబలరుచికరాణాం, చన్దనోదుమ్బరం దాహనిర్వాపణాలేపనానాం, రాస్నాఽగురుణీ శీతాపనయనప్రలేపనానాం, లామజ్జకోశీరం దాహత్వగ్దోషస్వేదాపనయనప్రలేపనానాం, కుష్ఠం వాతహరాభ్యఙ్గోపనాహయోగినాం, మధుకం చక్షుష్య వృష్య కేశ్య కణ్ఠ్య వర్ణ్య విరజనీయ రోపణీయానాం, వాయుః ప్రాణ సంజ్ఞాప్రదానహేతూనాం, అగ్నిరామస్తమ్భశీతశూలోద్వేపన ప్రశమనానాం, జలం స్తమ్భనీయానాం. ౪౩

వ్యా. గ్రహణీదోషమును, అర్శోరోగమును, నేతిని త్రాగుటచే గల్గినవ్యాపత్తు శమింపజేయుకృత్యములలో తేటమజ్జిగను ప్రతిదిన మభ్యాసముగ నుపయోగించుట మిక్కిలి శ్రేష్ఠము. గ్రహణిదోషమును, శోఫమును, అర్శోరోగమును హరించుక్రియ లలో మాంసమును దినునట్టి పులిమొదలగు జంతువుమాంసరసము ప్రతిదిన మభ్యాస ముగ నుపయోగించుట ప్రశస్తము. మరియు రసాయనక్రియలలో పాలను నేతిని ప్రతిదిన ముపయోగించుటయు, వృష్యకరములై యుదావర్తవ్యాధిని హరించుక్రియ లలో నేతిని సత్తుపిండిని సమకాలమున నుపయోగించుచు నభ్యాసము చేయుటయు, దంతములకు బలమును కల్గించి రుచిని బుట్టించుక్రియలలో తైలముచే ప్రతిదినము గండూషము చేయుటలవాటును, మంటను చల్లార్చునట్టి యాలేపనద్రవ్యములలో చందనముతో కూడిన యుదుంబరంబును, శీతలమును తొలగించు ప్రలేపనద్రవ్యములలో నస్నరాష్టముతో గూడిన యగరును, మంటను చర్మదోషము చెమటను పోగొట్టు ప్రలే పనద్రవ్యములలో లామజ్జక ఉశీరంబులును (వాసనకల్గిన వట్టివేరు వాసనలేని వట్టి వేరును), వాతహరమై యభ్యంగనమునకును ఉపనాహమున (కట్టుకట్టుట) కును ఉపయోగించుద్రవ్యములలో చెంగల్వకోష్ఠంబును, కన్నులకును వృష్యమునకును వెండ్రు కలకును కంఠమునకును శరీరవర్ణమునకు హితంబులై మాలిన్యమును బోగొట్టు నవియును వ్రణాదుల మాన్పునవియును నైనయౌషధములలో అతిమధురంబును మిక్కిలి శ్రేష్ఠములు.

మరియు ప్రాణమును శరీరప్రజ్ఞను ఇచ్చునట్టిహేతువులలో వాయువును (గాలియు), ఆమదోషమును శరీరస్తంభమును శీతలమును శూలనొప్పిని కంపమును శమింపజేయువానిలో నగ్నియు, స్తంభనీయములలో జలంబును మిక్కిలి శ్రేష్ఠములు.

ఇచ్చట జలమునుగురించి "ఉదకమాశ్వాసకరాణాం" అని తొలుత చెప్పబడినది. మరల నిచ్చట "జలం స్తంభనీయానాం" అని జలమునకే వేరొండుకృత్యము చెప్పబడినది. అటుకాక ఒకచోటనే "జలం ఆశ్వాసన స్తంభనకరాణాం" అని యేల చెప్పరాదు; అన్నచో కలిపి చెప్పినయెడ స్తంభనమును ఆశ్వాసనమును రెంటిని చేయుటయందే జలమునకు శ్రేష్ఠత్వము చెప్పినట్లగును. వేరువేరుగ జెప్పినచో ఆశ్వాసనములలోను జలము శ్రేష్ఠము. స్తంభనములలోను శ్రేష్ఠమని యేర్పడును. ఈకారణముచేతనే కలిపి చెప్పక వేరువేరుగ నాచార్యు లుపదేశించిరి. ఈన్యాయము ననుసరించి "పిప్పలీమూలం దీపనీయపాచనీయానాం" ఇది మున్నగుస్థలములయందు రెండుమూడేసి గుణములచెప్పుటచే అట్టి యనేకకర్మలజేయుటయందే పిప్పలి మున్నగువానికి ప్రాధాన్యము శ్రేష్ఠత్వము చెప్పబడునుగాని దీపనీయములలో శ్రేష్ఠము, పాచనీయములలో శ్రేష్ఠము నని వేరువేరుగ శ్రేష్ఠత్వము చెప్పగూడదని యెరుంగునది. (అట్టికర్మల నన్నిటిని చేయుటయందు శ్రేష్ఠమని భావము.)

మూ. మృద్భృష్టలోష్టనిర్వాపితముదకం తృష్ణాతియోగప్రశమనా
నాం, అతిమాత్రాశనం ఆమప్రదోషహేతూనాం, యథా
గ్న్యభ్యవహారః అగ్నిసన్ధుక్షణానాం, యథాసాత్మ్యం చేష్టా
భ్యవహారౌ ఉపసేవ్యానాం, కాలభోజన మారోగ్యకరాణాం,
వేగసన్ధారణ మనారోగ్యకరాణాం, (తృప్తిరాహారగుణానాం),
మద్యం సౌమనస్యజననానాం, మద్యాక్షేపో ధీధృతిస్మృతి
హరాణాం, గురుభోజనం దుర్విపాకానాం, ఏకాశనభోజనం
సుఖపరిణామకరాణాం, స్త్రీష్వతిప్రసఙ్గః శోషద్వారాణాం,
శుక్రవేగనిగ్రహః షాణ్ఢ్యకరాణాం, పరాఘాతనమన్నాశ్రద్ధా
జననానాం, అనశనమాయుషో హ్రాసకరాణాం, ప్రమితాశనం
కర్శనీయానాం, అజీర్ణాధ్యశనం గ్రహణీదూషణానాం, విష
మాశనమగ్నివైషమ్యకరాణాం, విరుద్ధవీర్యాశనం నిన్దితవ్యాధి
కరాణాం. ౪౪

వ్యా. మిక్కిలి తీవ్రమైనదప్పిని శమింపజేయువానిలో మంగలమున నిసుకబోసి వేయించి యాయిసుకను దూరముగ పారవైచి యామంగలమున బోసి చల్లార్చబడిన జలము మిగుల శ్రేష్ఠము. అజీర్ణదోషమును కల్గించుకారణములలో మితిలేక భుజించుట

బలిష్ఠమైన కారణమగును. జఠరాగ్నిని రగిలించి క్రమముగ వృద్ధిచేయువానిలో జఠరాగ్ని బలానుగుణముగ భుజించుట మిక్కిలి శ్రేష్ఠమైనది. (అభ్యవహారమన భోజనము) తాను నియమముగ సేవింపదగినకృత్యములలో తనసాత్మ్యమును(దేహతత్త్వాద్యానుగుణ్యమైన యలవాటును) విడువక యాహారవిహారముల సల్పుట శ్రేష్ఠము.

మరియు ఆరోగ్యకరములలో సకాలమున భుజించుటయు, ఆరోగ్యమును చెరచువానిలో మలమూత్రవాతాదివేగముల వెడలనీయక నిరోధించుటయు, ఆహారపదార్థగుణములలో అట్టిపదార్థములను భుజించినప్పుడు మనుజునకు తృప్తిని కల్గించు గుణంబును, సౌమనస్యమును (మనస్సు కుల్లాసమును) కల్గించువానిలో మద్యంబును, బుద్ధిని ధైర్యమును జ్ఞాపకశక్తిని హరించువానిలో మద్యమును వదలుటయు, అజీర్ణమును కల్గించువానిలో గురుపదార్థముల భుజించుటయు, సుఖముగ జీర్ణింపజేయువానిలో ఒకపూటనే భుజించుటయు, ధాతువుల క్షీణింపజేయువానిలో స్త్రీసంభోగమును మితిమీరి యాచరించుటయు, నపుంసకత్వమును కల్గించువానిలో శుక్రమును సకాలమున యథాయోగ్యముగ వెడలనీయక నిరోధించుటయు, ఆహారమునం దశ్రద్ధకల్గించువానిలో పరాఘాతంబును (ప్రాణులహింసించుస్థలము అట్టిస్థలమును జూచినప్పుడు కరుణచే మనస్సు వికృతిజెంది యన్నమును భుజించుటకు శ్రద్ధ తొలంగునని భావము). ఆయువును తగ్గించువానిలో ఆహారమును బొత్తుగ మానియుండుటయు, శరీరమును కృశింపజేయువానిలో తాను మామూలుగ భుజించుపరిమితికన్న మిక్కిలి స్వల్పముగ భుజించుటయు, గ్రహణి యనుపెద్దప్రేగును చెరచువానిలో భుజించినయాహారము జీర్ణముకాకుండునపుడు మరల భుజించుటయు, జఠరాగ్నిని విషమస్థితికి దెచ్చువానిలో విషమాశనంబును (ఒకపు డధికముగను ఒకపుడు కొంచెముగను భుజించుట విషమాశనము), మిక్కిలి నింద్యములైన కుష్ఠము శ్విత్రము మున్నగు వ్యాధులకల్గించుహేతువులలో పరస్పరవిరుద్ధములైన వీర్యములుకల క్షీరమత్స్యాదుల జేర్చి భుజించుటయు, మిక్కిలి శ్రేష్ఠములు. (పైజెప్పినకృత్యముల జేయుటయందు నిర్దిష్టప్రకారము ఆయాద్రవ్యంబులును కృత్యంబులును శ్రేష్ఠములైయుండునని భావము).

('ఏకాశనభోజనం సుఖపరిణామకరణాం' అనుచోట దినమున కొకపూట భుజించుట సుఖముగ జీర్ణకరమగునని యర్థము. ఇట్లు చెప్పుటచేత ఏకభుక్తమునకు జీర్ణకరత్వము మాత్రము నిర్దేశింపబడినదికాని రెండుపూటలభోజనము అగ్న్యనుసారముగ జేయుటను నిషేధించుటలేదు. మరియు జఠరాగ్ని తీవ్రముగనుండుట సుఖనిద్ర మున్నగునవికూడ రెండుమార్లు భుజించినప్పుడును సుఖజీర్ణకరములు కావచ్చునని యెరుంగునది).

## పథ్యాదులలో ప్రశమాదులశ్రేష్ఠత్వము.

మూ॥ ప్రశమః పథ్యానాం, ఆయాసః సర్వాపథ్యానాం, మిథ్యాయోగో వ్యాధిముఖానాం, రజస్వలాభిగమనం అలక్ష్మీముఖానాం, బ్రహ్మచర్యమాయుష్యకరాణాం, సఙ్కల్పో వృష్యాణాం, దౌర్మనస్యం అవృష్యాణాం, అయథాబలమారమ్భః ప్రాణోపరోధినాం, విషాదో రోగవర్ధనానాం, స్నానం శ్రమహరాణాం, హర్షః ప్రీణనానాం, శోకః శోషణానాం, నిర్వృత్తిః పుష్టికరాణాం, (పుష్టిః స్వప్నకరాణాం), స్వప్నః తంద్రాకరాణాం, సర్వరసాభ్యాసో బలకరాణాం, ఏకరసాభ్యాసో దౌర్బల్యకరాణాం. ౪౫

వ్యా॥ పథ్యములలో మనస్సు శాంతముగనుండుట శ్రేష్ఠము, అపథ్యములలో నాయాసంబును, వ్యాధికారణములలో ఆహారవిహారాదులయొక్క అయోగ అతియోగమిథ్యాయోగంబులును, అలక్ష్మీకరములగుకృత్యములలో రజస్వలయై యుండు స్త్రీతో సంభోగముచేయుటయు, ఆయువును వృద్ధినొందించువానిలో బ్రహ్మచర్యంబును సంభోగేచ్ఛ నధికముగ కల్గించువానిలో సంభోగవిషయముల నుద్దేశించి తలబోయుచుండుటయు, సంభోగేచ్ఛకు హానికల్గించువానిలో మనస్సు కుల్లాసములేకుండుటయు, ప్రాణాపాయకృత్యములలో తనబలమునకు మీరినబలవద్విగ్రహాదుల జేయుటయు, రోగముల వృద్ధినొందించువానిలో విషాదంబును, శ్రమహరములలో స్నానంబును, ఇంద్రియాదులకు ప్రీతిబుట్టించువానిలో హర్షంబును (సంతోషము), శరీరమును శోషింపజేయువానిలో శోకంబును, పుష్టినికల్గించువానిలో సుఖముగనుండుటయు, నిద్రకల్గించువానిలో పుష్టియు, కునికిపాటుకల్గించువానిలో నిద్రయు, బలకరములగు వానిలో మధురాదిరసముల నన్నిటిని యభ్యాసముచేయుటయు, బలహీనతను కల్గించు వానిలో మధురాదిరసములలో నొక్కదానినే యభ్యాసముచేయుటయు శ్రేష్ఠములుగ నుండును.

## అనాహార్యాదులలో శ్రేష్ఠనిర్దేశము.

మూ॥ గర్భశల్యమనాహార్యాణాం, అజీర్ణముద్ధార్యాణాం, బాలో మృదుభేషజీయానాం, వృద్ధో యాప్యానాం, గర్భిణీ తీక్ష్ణౌ

పథవ్యాయామవర్జనీయానాం, సౌమనస్యం గర్భధారకాణాం, సన్నిపాతో దుశ్చికిత్స్యానాం, ఆమో విషమచికిత్స్యానాం, జ్వరో రోగాణాం, కుష్ఠం దీర్ఘరోగాణాం, రాజయక్ష్మా రోగసమూహానాం, ప్రమేహోఽనుషఙ్గిణాం, జలౌకసోఽనుశస్త్రాణాం, వస్తిస్తన్త్రాణాం, హిమవాన్ ఔషధభూమీనాం, సోమ ఓషధీనాం, మరుభూరారోగ్యదేశానాం, అనూపమహిత దేశానాం. ౨౬

వ్యా. వెలికిందియనలవికాని శల్యములలో గర్భరూపమైనశల్యంబును, అవశ్యముగ వెడలింపవలసినవానిలో కడుపులోని యజీర్ణపదార్థంబును, మృదువైన యౌషధాదులచే చికిత్స జేయవలసినవారిలో పసిబాలుండును, చికిత్సలచే వ్యాధి నిశ్శేషముగ హరించక యాప్యముగనుండువారిలో వృద్ధులును, తీక్ష్ణౌషధములను వ్యాయామమును విడువవలసినవారిలో గర్భిణీస్త్రీలును, గర్భమును ధరింపజేయువానిలో మనస్సు కుల్లాసము కల్గియుండుటయు, మిక్కిలి చికిత్సలచే నివర్తికాకుండువ్యాధులలో సన్నిపాతంబును, విషమచికిత్సార్హములగువ్యాధులలో నామంబును, రోగములన్నింటిలో జ్వరంబును, నివర్తించక దీర్ఘకాలముగ బాధించువ్యాధులలో కుష్ఠరోగంబును, రోగసమూహములలో రాజయక్ష్మయు (క్షయరోగము), చికిత్సచే నివర్తించినట్లుండి మరల కాలము వేచి వ్యాపించువ్యాధులలో ప్రమేహరోగంబును, ఉపశస్త్రములలో జలౌకంబులును (జలగలు), వమనాదిపంచకర్మములలో వస్తికర్మంబును, ఔషధద్రవ్యముల కుత్పత్తిప్రదేశములలో హిమవంతంబును, లతాదిరూపములగునోషధులలో సోమలతయు (పుల్లతీగె. ఇది పదునైదుగణుపులు కల్గియుండునది.), ఆరోగ్యకరములగు దేశములలో మరుభూమియు (చెమ్మలేక మెరకగనుండుప్రదేశము), శరీరమున కారోగ్యమును చెరచి యహితములగు దేశములలో అనూపదేశంబును (జలప్రాయమైనప్రదేశము) మిక్కిలి శ్రేష్ఠములు. (దుష్టరక్తమును వెడలించునుపాయములలో జలగలమూలమున వెడలించుట శ్రేష్ఠమని "జలౌకసోఽనుశస్త్రాణాం" అని చెప్పబడినది.)

ఆతురగుణాదులలో శ్రేష్ఠములనిర్దేశము.

మూ. నిర్దేశకారిత్వమాతురగుణానాం, భిషక్ చికిత్సాఙ్గానాం, నాస్తికో వర్జ్యానాం, లౌల్యం క్లేశకరాణాం, అనిర్దేశకారిత్వమరిష్టానాం, అనిర్వేదో వార్తలక్షణానాం, వైద్యసమూహో

నిస్సంశయకరాణాం, యోగో వైద్యగుణానాం, విజ్ఞానమౌష
ధీనాం, శాస్త్రసహిత స్తర్కః సాధనానాం, సమ్ప్రతిపత్తిః ఫల
జ్ఞానప్రయోజనానాం, తృప్తిరాహారగుణానాం, అవ్యవసాయః
ఫలాతిపత్తిహేతూనాం, దృష్టకర్మతా నిస్సంశయకరాణాం,
అసమర్థతా భయకరాణాం, తద్విద్యసమ్భాషా బుద్ధివర్ధనానాం,
ఆచార్యః శాస్త్రాగమహేతూనాం, ఆయుర్వేదోఽమృతానాం,
సద్వచనమనుష్ఠేయానాం, అసద్గ్రహణం సర్వాహితానాం,
సర్వసన్న్యాసస్సుఖానాం ఇతి. ౪౭

(అసమ్బద్ధవచనం, అసద్గ్రహణం, అసద్వచనం) ఇతి త్రివి
ధోఽపి పాఠభేదః)

వ్యా. రోగికి ముఖ్యముగ నుండవలసిన గుణములలో వైద్యుడు నియమించిన ప్రకారము పత్థ్యాదివిధుల నాచరించుట మిక్కిలి శ్రేష్ఠము. వైద్యుడు ద్రవ్యములు పరిచారకుడు రోగి యను నాల్గువిధములైన చికిత్సాంగములలో వైద్యుడు ముఖ్యము. మఱియు విసర్జింపవలసినవారిలో నాస్తికుడును, కష్టముల కల్గించువానిలో చంచలత్వం బును (దురాశ) రోగికి చెప్పిన యరిష్టలక్షణములలో వైద్యుడు చెప్పినప్రకారము రోగి నడవకుండుటయు, రోగికి ఆరోగ్యలక్షణములలో నిర్వేదము (మనస్సున పరితాపము) లేకుండుటయు, వైద్యునకు కల్గిన సందేహము దీర్చుకొను నుపాయములలో వైద్యుల సంఘమున జేరుటయు, వైద్యున కుండవలసిన గుణములలో కాలము దేశము రోగి యొక్క బలాబలము మున్నగువానిని చక్కగ గమనించి తదనుగుణముగ నౌషధముల నుపయోగించువిధానమును దెలిసియుండుటయు, ఔషధములలోపల వైద్యునకు సకల శాస్త్రవిజ్ఞానంబును, సాధనములలోపల శాస్త్రవిచారముతో గూడినతర్కంబును, చికిత్సా ఫలమునకును, చికిత్సాజ్ఞానమునకును, సంబంధించిన యుపాయములలో సంప్రతిపత్తియుం (ఏయేకాలమున నేయేవిధానము జేయ నవసరమో దానిని యథాకాలమున జేయుట), ఆహారమునకుండవలసిన గుణములలో తృప్తిని కల్గించుగుణంబును, కార్యఫలము కల్గ కుండుటకు కారణములలో ప్రయత్నము జేయకుండుటయు, వైద్యునకు సంశయముల తొలగించు నుపాయములలో ననుభవజ్ఞానంబును, భయమును కల్గించు కారణములలో సమర్థతలేకుండుటయు, బుద్ధిని వృద్ధినొందించు నుపాయములలో వైద్యవిద్యాపరి జ్ఞానముకలవారితో సంభాషించుటయు, శాస్త్రముల జక్కగ నెఱుంగు నుపాయములలో

గురువుల నాశ్రయించుటయు, అమృతములలో (జీవితమునకు ప్రధానములగు నుపకరణములలో) నాయుర్వేదంబును, అనుష్ఠింపదగినవానిలో పండితవచనంబును, మిక్కిలి హితము కానివానిలో అసద్వాక్యముల గ్రహించుటయు మిక్కిలి శ్రేష్ఠములు. మరియు లోకమున నిర్బాధకమైన సుఖమును కల్గించు నుపాయము లన్నింటిలో సర్వ సంగపరిత్యాగముజేసి నిస్సంగుడై యుండుట యన్నిటికంటె నుత్తమోత్తమమైనది. (సర్వ సంగపరిత్యాగము బ్రహ్మసాక్షాత్కారజ్ఞానజనకమై నిరతిశయానందరూపమై మోక్ష సాధనమగుటంజేసి సర్వసంగపరిత్యాగము పరమసుఖప్రాప్తికి ముఖ్యసాధనంబని భావము.)

ఇచ్చట "అన్నం వృత్తికరాణాం శ్రేష్ఠం" అను వాక్యమునందలి "శ్రేష్ఠం" అను పదమును ప్రతివాక్యమునందును జేర్చి వాక్యసమన్వయము జేయవలెను.

### అగ్ర్యవిషయములసంఖ్య, దానగల్గుప్రయోజనము.

భవన్తి చాత్ర:—

మూ. అగ్ర్యాణాం శతముద్దిష్టం యద్ద్విపఞ్చాశదుత్తరం,
అలమేతద్వికారాణాం విఘాతాయోపదిశ్యతే.　౭౨

వ్యా. అగ్ర్యాధికారరూపమైన యీ ప్రకరణమునందు ఆహారౌషధాదులలో నేయేతెగయందు నేయేది మిక్కిలి యుత్తమమై గమనింపదగియుండునో అట్టిశ్రేష్ఠమైనవానినెల్ల పరిగణనముచేసి నూటయేబదిరెండు శ్రేష్ఠములైనవి చెప్పబడెను. వీనిని చక్కగ పొరబాటులేక గమనించినచో పలుదెరంగులైన రోగములను నివర్తి చేయుటకు వీనిపరిజ్ఞానము సమర్థమై ముఖ్యసాధనముగ నుండును. అని యుపదేశింపబడినది.

ఇచ్చట అగ్ర్యశబ్దము శ్రేష్ఠవాచకము. వాని వానికి నియమితములగు కృత్యముల బలిష్ఠముగ చేయుటంజేసి అగ్ర్యములు (శ్రేష్ఠములు) అని చెప్పబడును. ఆదు జ్వరము ప్రమేహము మున్నగువ్యాధులు స్వభావముచేతనే పీడాకరత్వము, అనుషంగిత్వము మున్నగు గుణములు కల్గినవని వైద్యుడు చక్కగ గమనించి మిక్కిలి మెలకువతో సమయోచిత ప్రతిక్రియజేయ వీలుండును కావున నట్టిపరిజ్ఞానము రోగనివారణమునకు సమర్థమగునని భావము. మరియు నీ యగ్ర్యాధికారమున పరిగణనము చేయబడినవి ప్రధానముగ జెప్పబడినవి కావున నింతమాత్రముననే తక్కినరోగముల కన్నిటికిని చికిత్సజెప్పుట యనవసరమని యూహింపదగదు. జనించిన రోగముల చికిత్స చేయుటచేతను, కల్గకుండు వ్యాధుల రానీయక స్వస్థపరిపాలనము జేసికొనుటకును ఈ

యగ్ర్యాధికారజ్ఞానము సాధనమై యుండునని "విఘాతాయోపదిశ్యతే" అనువాక్యముచే దెలియదగును. (పైనచెప్పినవన్నియు నూటయేబదిరెండు అని పరిగణనము చేసియున్నది. ఆసంఖ్యకంటె నధికముగ కొన్నిటి మాత్రము ప్రత్యంతరముల నుండుపాఠాంతరముల ననుసరించి చేర్చబడినవి.)

### అగ్ర్యాధికారోక్తవిషయసంగ్రహము, దానిప్రయోజనము.

మూ॥ సమానకారిణో యేఽర్థాః తేషాం శ్రేష్ఠస్య లక్షణం,
జ్యాయస్త్వం కార్యకారిత్వే వరత్వం చాప్యుదాహృతం. ౪౯
వాతపిత్తకఫేభ్యశ్చ యద్యత్ప్రశమనే హితమ్,
ప్రాధాన్యతశ్చ నిర్దిష్టం యద్వ్యాధిహరముత్తమమ్. ౫౦
ఏతన్నిశమ్య నిపుణం చికిత్సాం సంప్రయోజయేత్,
ఏవం కుర్వన్ సదా వైద్యః ధర్మకామౌ సమశ్నుతే. ౫౧

వ్యా. సమానమైన కృత్యములజేయు శాలిధాన్యము మున్నగు పదార్థములలో నేవి శ్రేష్ఠములైయుండునో అట్టి రక్తశాల్యాదుల శ్రేష్ఠత్వరూప లక్షణంబును, సమానమైన కృత్యముచేయు నాహారాది పదార్థములలో హితరూపమైనకార్యమును జేయుటయందు ఏవి యుత్కృష్టము లైయుండునో అట్టి యుత్కృష్టత్వంబును, అహితరూపమైన కృత్యమును జేయుటయందు ఏవి అధమములై యుండునో వానినికృష్టత్వంబును, ప్రశమనరూపకార్యమునందు వాతపిత్తకఫముల శమింపజేయుటకు ఏవి హితములైయుండునో అయ్యవియు, వ్యాధిహరములగు నౌషధాదులలో నేయేవ్యాధిని హరించుట కేదేది యుత్తమముగనుండునో అట్టి యుత్తమౌషధంబును, ఇవి యన్నియు పైగ్రంథముచేత ప్రధానముగ నిర్దేశింపబడినవి.

ఈ విషయమును వైద్యవరుడు తన బుద్ధికౌశలముచే చక్కగ గమనించి చికిత్సను జేయవలెను. పైజెప్పినవిషయముల చక్కగ గమనించి యెల్లప్పుడును చికిత్స జేయు వైద్యుడు ధర్మకామముల రెంటిని బొందగలడు. (రోగికి నారోగ్యమును కల్గించుటచేనైన పుణ్యముచేత పరలోకసాధనమైన ధర్మమును తన కిష్టావాప్తిరూపమైన కామమును బొందగలడని భావము.)

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—పదార్థములలో నొక్కపనిజేయు శక్తిగల పదార్థము లనేకము లుండును. అట్టివానిలో శ్రేష్ఠత్వమును నిర్ణయించి చెప్పుటకు నీ

యగ్ర్యాధికరణ మారంభింపబడినది. అగ్ర్యాధికరణమన శ్రేష్ఠత్వము నధికరించి చెప్పునట్టి ప్రకరణమని యర్థము. అయ్యది "లోహితశాలయః శూకధాన్యానాం శ్రేష్ఠతమాః" అని మొదలుజేసి "సర్వసన్యాసస్సుఖానాం" అనునంతకు గల గ్రంథము అగ్ర్యాధికరణము. అట్టి గ్రంథముచేత నేర్పడిన సారాంశము "సమానకారిణో...సమశ్నుతే" అను శ్లోకములచే చెప్పబడినది. మరియు నాసవవిషయమును జెప్పునట్టి 'ధాన్యఫల' ఇత్యాది గ్రంథంబును అగ్ర్యాధికారమున జేరినది యగును.

దీనివివరణము:—ఒకపనిజేయు పదార్థము లనేకములున్నను వానిలో నొక్కొక జాతియందు ఆహారాదుల కుపయోగించుటయందు ఏది శ్రేష్ఠముగ నుండునో అద్దాని లక్షణము చెప్పబడినది. అట్టి పదార్థములు హితములు అహితములు నని రెండువిధముల నుండు. అందు ఆహారపదార్థములలో జేరిన శూకధాన్యములలో రక్తశాలి ప్రధానముగ శ్రేష్ఠము అని "రక్తశాలయః శూకధాన్యానాం ప్రథ్యతమాః" అనునవి మున్నగు వాక్యములచే హితములలో శ్రేష్ఠములు చెప్పబడినవి. అహితములలో శ్రేష్ఠములు "యవకాశ్శూకధాన్యానాం" అనువాక్యములచే నిర్దేశింపబడినవి. మరియు "అన్నం వృత్తికరాణాం శ్రేష్ఠం ఇవి మున్నగు వాక్యములచేత అట్టి పదార్థములు చేయుకార్యములలో నుత్కృష్టతయు, "శుక్రవేగనిగ్రహః షాణ్ఢ్యకరాణాం" అను మున్నగు వాక్యములచే నికృష్టకార్యంబులును నిర్దేశింపబడినవి. వాతపిత్తకఫముల ప్రశమనకార్యమునందు "వస్తిర్వాతహరాణాం, విరేచనం పిత్తహరాణాం, వమనం శ్లేష్మహరాణాం" అనునవి మున్నగు వాక్యములచే వస్తికర్మ మున్నగునవి శ్రేష్ఠములని చెప్పబడినవి. "ఖదిరం కుష్ఠహరాణాం" "పుష్కరమూలం హిక్కాశ్వాసపార్శ్వశూలాసాహహరాణాం" ఇత్యాది వాక్యములచే కుష్ఠాది వ్యాధిహరౌషధములలో శ్రేష్ఠములును చెప్పబడినవి. వీని నన్నింటిని చక్కగ గమనించి యథోక్తముగ వైద్యుడు చికిత్సజేయవలెనని భావము.

"శ్రేష్ఠస్య లక్షణం" అనగ "లక్ష్యతే (జ్ఞాయతే) అనేనేతి లక్షణం" అను వ్యుత్పత్తిచేత శ్రేష్ఠత్వమును దెలుపునట్టి సాధనము అని యర్థము. అయ్యది నిర్దేశము చేతనే తెలియబడును కావున వస్తువుల నిర్దేశము శ్రేష్ఠత్వాది లక్షణమని యెరుంగునది.

## పథ్యలక్షణము.

మూ. పథ్యం పథోఽనపేతం యత్ యచ్చోక్తం మనసః ప్రియమ్,

వ్యా. (లోకమున పథిన్ శబ్దమునకు మార్గమని యర్థము. అట్టి మార్గవాచకమగు పథిన్ శబ్దముచేత ఇచ్చట శరీరమునందలి స్రోతోరూపములైన మార్గములకును, రసాది

ధాతువులకును ఆధారమైనశరీరము గ్రహింపబడును. అపేతమన అపకారి, అపకారి కానిది అనపేతము.) అట్టిధాత్వాదులకాశ్రయమై శరీరరూపమైన మార్గమునకు అపకారమును (ధాతువైషమ్యాదిరూపమైన యపకారమును) చేయకుండు నాహార విహారౌషధాదులు పథ్యమని చెప్పబడు. (ఆహారవిహారౌషధాదుల నుపయోగించుటకు మార్గమువలె నుండుశరీరమునకు ధాతువైగుణ్యరూపమైన యపకారముచేయక స్వస్థతను కాపాడునట్టి యాహారవిహారాదులు పథ్యమని లక్షణము చెప్పబడెను) లేక స్వస్థత నుండువారికి స్వస్థపరిపాలనంబును, రోగులకు రోగనివృత్తిజేయుటయు చికిత్సావిషయ మన మార్గమని చెప్పబడును. అట్టి స్వస్థపాలనరోగనివర్తనరూపమార్గమునకు అపకారము చేయకుండుట పథ్యలక్షణమనియు చెప్పవచ్చును).

(ఇట్లు చెప్పినచో మనస్సుకు అపకారకమై శరీరమాత్రమున కుపకారకమైన దియు పథ్యమని యర్థమగును కావున దాని సంగ్రహమునకై "యచ్చోక్తం మనసః ప్రియం" అని చెప్పబడినది. మనస్సుకు మిక్కిలి ప్రీతిపుట్టించునది యని యర్థము. మనస్సుకును శరీరమునకును రోగరూపమైన యప్రియమును కల్గింపక మిక్కిలి యారోగ్యరూపమైన ప్రియము గల్గించుచు స్వస్థతను కాపాడునట్టి యాహారాదులు పథ్యమని చెప్పబడును. ఇదియే పథ్యలక్షణము. (ఇదియే హితమనియు చెప్పబడును.)

అట్టి శరీరమునకును మనస్సునకును స్వస్థతను చెరచునదియు రోగములగల్గించు నదియు నగునాహారాచారాదులు అపథ్యములని వ్యతిరేకలక్షణముచే నెరుంగునది (ఇదియే యహితము.)

పథ్యాపథ్యత్వము మాత్రాకాలాదుల నాశ్రయించి యుండుననుట.

మూ. యచ్చాప్రియమపథ్యం చ నియతం తన్న లక్షయేత్. ౫౨
మాత్రాకాలక్రియాభూమిదేహదోషగుణాన్తరమ్,
ప్రాప్య తత్తద్ధి దృశ్యన్తే తే తే భావాస్తథా తథా. ౫౩
తస్మాత్స్వభావో నిర్దిష్టః తథా మాత్రాదిరాశ్రయః,
తదపేక్ష్యోభయం కర్మ ప్రయోజ్యం సిద్ధిమిచ్ఛతా. ౫౪

వ్యా. పైజెప్పినరీతిగ శరీరమునకు అపథ్యంబును మనస్సుకు అహితంబునను అపథ్య లక్షణము సర్వకాలంబును నియతముగ నిర్ణయింప వీలుండదు. అట్టి యపథ్యమనునది మాత్ర (పరిమాణము), వర్షాదికాలము, సంస్కారరూపమైన క్రియ, జాంగలాది

భూమిభేదము, శరీరభేదము, వాతాదిదోషములు, గుర్వాదిగుణములు అనువానియవస్థా భేదము ననుసరించి అపథ్యము పథ్యముగను, పథ్యము అపథ్యముగను మారుచుండును కావున నియ్యది పథ్యము, ఇయ్యది యపథ్యము నని నిర్ణయించి చెప్ప వీలుండదు. కావున వస్తుస్వభావమునమాత్రముచే హితము లెవ్వియో అట్టి హితంబులును, అహితంబులునైనవానిస్వభావంబును, అట్టి పథ్యత్వ అపథ్యత్వములకు ఆశ్రయములైన మాత్రాదులును నిర్దేశింపబడినవి. అట్టి మాత్రాకాలాద్యనుగుణముగ పైజెప్పిన హితాహితముల నిర్ణయించి చికిత్స జేయుంవైద్యునకు కర్మసిద్ధి తప్పక కల్గునని భావము.

పైజెప్పినయగ్ర్యాధికారమున పథ్యాపథ్యములు కేవలము వస్తుస్వభావమాత్రముచే నిర్దేశింపబడినవి. అట్టి పథ్యాపథ్యములు మాత్రాకాలాదిపరిస్థితుల నాశ్రయించి మారుచుండును కావున అట్టి మాత్రాకాలాదులపరిస్థితిని గమనించి తత్తదనుగుణముగ పథ్యాపథ్యనిర్ణయముచేసి చికిత్సచేసినచో కార్యసిద్ధియగునని ముఖ్యతాత్పర్యము.

మాత్రాకాలాదుల కుదాహరణము:—"గవ్యం సర్పిః సర్పిషాం" అని ఆవునెయ్యి పథ్యతమముగ చెప్పబడినది. అయ్యది మాత్రాధికముగ నుపయోగింపబడునేని యపథ్యమగును. అదియే వసంతకాలమున నపథ్యమగును. విరుద్ధద్రవ్యములతోగూర్చి సంస్కరించినచో నయ్యది యపథ్యమగును. అనూపదేశమున నయ్యది యపథ్యమగును. అతిస్థూలదేహముకలవారికిని, కఫమునకును అపథ్యమగును. ఇవి పథ్యము అపథ్యముగ మారుట కుదాహరణము. మరియు విషము మిక్కిలి యపథ్యమైనను స్వల్పపరిమాణముగ నుదరరోగమున నుపయోగించినచో పథ్యమగును. ఈవిషయమే "ఉదరే విషస్య తిలం దద్యాత్" అని చెప్పబడినది. ఇత్తెరంగుననే కాలాదులననుసరించియు అపథ్యముల పథ్యత్వము నూహించునది. తక్కినవాని కన్నిటికిని మాత్రాకాలాదిపరిస్థితినిబట్టియు పథ్యాఽపథ్యత్వము మారుచుండును కావున మాత్రాకాలాదులు పథ్యాపథ్యముల కాశ్రయమని యెరుంగునది.

అగ్నివేశుడు ఆసవద్రవ్యముల నుద్దేశించి ప్రశ్న చేయుట.

మూ. తదాత్రేయస్య భగవతో వచన మనునిశమ్య పునరపి భగవన్తం ఆత్రేయమగ్నివేశ ఉవాచః—"యథోద్దేశమభినిర్దిష్టః కేవలోఽయమర్థో భగవతా, ఆసవద్రవ్యాణాం ఇదానీమనప

వాదం లక్షణం అనతిసంక్షేపేణ ఉపదిశ్యమానం శుశ్రూషా మహే. ఇతి. ౫౨

వ్యా. భగవత్స్వరూపుడగు నాత్రేయమహర్షిచే చెప్పబడిన పైవాక్యములను విని అగ్నివేశ్యుడు మరల నిట్లడిగెను:—ఓమహానీయా! నే నేవిషయము నుద్దేశించి యడిగితినో యట్టివిషయము పూర్తిగ మీచే నిర్దేశించి చెప్పబడినది. మఱియు ఆసవములకు సంబంధించిన ద్రవ్యములయొక్కలక్షణమును నిరపవాదముగ అతివిస్తృతంబును అతిసంక్షిప్తంబును కాకుండున ట్లుపదేశించినచో విన కోరినాము. అని యగ్నివేశుం డడిగెను.

## ఆసవోత్పత్తిద్రవ్యములు.

మూ. తము వాచ భగవానాత్రేయః.—ధాన్య-ఫల-మూల-సార-పుష్ప-కాండ-పత్ర త్వచో భవన్త్యాసవయోనయః అగ్నివేశ! సంగ్రహేణ అష్టౌ. శర్కరా నవమీ. తా స్వేవ ద్రవ్యసంయోగకరణతో ఽపరిసంఖ్యేయాసు యథాపథ్యతమాసవచతురశీతిం (పథ్యతమానామాసవానాం చతురశీతిం) నిబోధ. ౫౬

వ్యా. ఓయగ్నివేశా! ధాన్యములు, ఫలములు, వేళ్లు లేక (గడ్డలు) సారములు (బంక), పువ్వులు, కాడలు, ఆకులు, పట్టలు అను నీయెనిమిదియు ఆసవములకు సంగ్రహముగా నుత్పత్తికారణములగును. ఇవిగాక చక్కెర తొమ్మిదవది యగును. (ఈతొమ్మిది ఆసవముల కుత్పత్తికారణములని భావము.) అట్టిద్రవ్యములయొక్కయు, సంయోగముయొక్కయు, సంస్కారముయొక్కయు భేదములచేత ఆసవములు సంఖ్యాతీతము లగును. అట్టి యనేకవిధములయిన యాసవములలో పథ్యతమములయిన యాసవములు ఎనుబదినాలుగువిధము లగును. వాని నిక్రింద వివరించెద వినుము.

ఇచ్చట ధాన్యాదులు అవాంతరభేదములు కల్గియుండుటచే వానిని నిర్దేశించి చక్కెర యేకరూపమగుటచే వేరుగ "శర్కరా నవమ్" అని నిర్దేశింపబడినది. మధుశర్కర మధుభేదములలోనే చేరినది. మధ్వాసవము ధాన్యాసవభేదములలో చేరును గాన తేనెను వేరుగా నిర్దేశించలేదు. గౌడాసవము మున్నుగువానిని ఇత్తెరంగుననే తెలియునది.

## ఆరువిధములైన ధాన్యాసవములు. 6

మూ. తద్యథాః—సురా - సౌవీర - తుషోదక - మైరేయ-మేదక - ధాన్యాంబు-షష్ఠాః ధాన్యాసవా భవన్తి. ౫౭

వ్యా. సుర, సౌవీరకము, (పొట్టులేనియవలచే చేయబడినది.) తుషోదకము, మైరేయము, మేదకము, ధాన్యాంబు (కాంజికము) అను నీయారును ధాన్యాసవములు.

## ఇరువదియారు ఫలాసవములు. 26

మూ. మృద్వీకా, ఖర్జూర, కాశ్మర్య, ధన్వన, రాజాదన, తృణశూన్య, పరూషా-భయా-మలక, మృగలిండిక, జాంబవ, కపిత్థకువల, బదర, కర్కంధుపీలు, పియాల, పనస, న్యగ్రోధ, అశ్వత్థ, ప్లక్ష, కపీతన, ఉదుంబరాజమోద, శృఙ్గాటక, శంఖినీతి ఫలాసవాః షడ్వింశతిః. ౫౮

వ్యా. ద్రాక్ష, ఖర్జూరము, గుమ్మడి, ధన్వనము, (ఫలవిశేషము) మొరటు, మొగిలి, చిట్టీత, కరకకాయలు, ఉసిరికకాయలు, తాండ్రకాయలు, నేరేడుపండ్లు, వెలగపండ్లు, పెద్దరేగు, చిన్నరేగు, నక్కరేగు, వరగోగు, చారపండ్లు, పనసపండు, మఱ్ఱిపండు, రావిపండు, జువ్విపండు, కలజువ్వి, మేడిపండు, ఓమము, శృంగాటకము, శంఖపుష్పి ఈ ఇరువదియారింటివలన వేరువేరుగ పుట్టిన యాసవములు ఇరువదియారును ఫలాసవములు.

## పదునొకండుమూలాసవములు.

మూ. విదారిగన్ధాఽశ్వగన్ధా కృష్ణగన్ధా శతావరీశ్యామా త్రివృద్దన్తీ బిల్వోరుబూక చిత్రకమూలై రేకాదశ మూలాసవాః. ౫౯

వ్యా. ముయ్యాకుపొన్న, పెన్నేరుగడ్డ, మునగ, చల్లగెడ్డ, సుగంధపాలవేరు, నల్లతెగడ, తెల్లతెగడ, దంతి, మారేడు, ఆముదపువేళ్లు, చిత్రమూలము అను నీ పదునొకండుచెట్లయొక్క వేళ్లచేతను, దుంపలచేతను ఏర్పడిన పదునొకండు ఆసవములును మూలాసవములు.

### ఇరువది సారాసవములు. 20

మూ. సాలప్రియక అశ్వకర్ణ చన్దనస్యన్దనఖదిర కదర సప్తపర్ణార్జు నాసనారిమేదతిన్దుక కిణిహీంశమీశుక్తి శింశపా శిరీషవఞ్జుళ ధన్వన మధుకైః సారాసవాః వింశతిః. ౬౦

వ్యా. మద్ది, కదిమిచెట్టు, చంద్ర, చందనము, నెమ్మిచెట్టు, తెల్ల, చంద్ర, కదర, (చంద్ర భేదము) ఏడాకులపొన్న, తెల్లమద్ది, ఏపి, అరిమేధము, (చంద్రలో భేదము) తుమికి, ఉత్తరేణి, జమ్మి, రేగు, ఇరుగుడుచెట్టు, దిరసనము, అశోకము, ధన్వన(తడచెట్టు) ఇప్ప అను నీ చెట్లయొక్క సారముచే కల్గు ఆసవములు ఇరువదియును సారాసవములు.

### పది పుష్పాసవములు. 10

మూ. పద్మోత్పల, నళిన, కుముద, సౌగన్ధిక, పుణ్డరీక, శతపత్ర, మధూక, ప్రియఙ్గు, ధాతకీ, పుష్పదశమాః పుష్పాసవా భవన్తి.

వ్యా. తామరపువ్వులు, నల్లకలువలు, తెల్లకలువలు, అల్లిపూవులు, సౌగంధికములు, తెల్లతామర, శతపత్రము (నూరురేకులుగల తామరపువ్వు) ఇప్పపువ్వులు, ప్రేఙ్కణపుపువ్వులు, ఆరెపువ్వులు అను నీ పదిదినుసుల పుష్పములచే నేర్పడిన యాసవములు పదియుం పుష్పాసవములు.

### నాల్గు కాణ్డాసవములు. 4

మూ. ఇక్షు, కాణ్డేక్షు ఇక్షుబాలిక పుణ్డ్రక చతుర్థాః కాండాసవాః భవన్తి. ౬౨

వ్యా. నల్లచెరకు, కాడచెరకు, ఇక్షుబాలిక (చెరకులో భేదము) పుణ్డ్రకము (తెల్లచెరకు) ఈ నాల్గిటివలన చేయబడు ఆసవములు నాల్గును కాణ్డాసవములు.

### పత్త్రాసవములు రెండు. 2

మూ. పటోల తాడకపత్త్రాసవౌ ద్వౌ భవతః. ౬౩

వ్యా. చేదుపొట్ల, తాడకము, (శ్రీతాళము) ఈ రెంటియొక్క ఆకులచే నేర్పడిన యాసవములు రెండును పత్త్రాసవములు.

నాల్గు త్వగాసవములు, శర్కరాసవము ఒకటి. 5

మూ. తిల్వకలోధ్రైలవాలుకాః క్రముకచతుర్థాః, త్వగాసవాః భవన్తి, శర్కరాసవ ఏక ఏవేతి. ౭౮

వ్యా. తెల్లలొద్దుగు, ఎఱ్ఱలొద్దుగు, ఏలవాలుకము (హరివాలుకమనెడి నామాంతరముగల గ్రన్థ్యవిశేషము) దీనిని నూగుదోసయని సాధారణముగ చెప్పెదరు. పోకచెట్టు ఈనాల్గిటి పట్టలచే చేయబడు ఆసవములు నాల్గును త్వగాసవములు. మఱియుం చక్కెరచే చేయబడు ఆసవము శర్కరాసవము. ఇది యొక్కవిధముగనే యుండును.

(పైచెప్పబడిన ఎనుబదినాల్గు ఆసవములును పథ్యతమములై యుండునని ప్రకరణానుసారముగ చెప్పబడును. "యథాపథ్యతమానా మాసవానాం చతురశీతిం నిబోధత" అని ప్రారంభించియుండుటచే నివి పథ్యతమములుగ చెప్పబడినవని తెలియుచున్నది.)

ఆసవసామాన్యలక్షణము.

మూ. ఏవ మేషాం ఆసవానాం చతురశీతిః, పరస్పరేణాఽసంసృష్టానాం ఆసవద్రవ్యాణాం ఉపనిర్దిష్టా ఇత్యేషామాసవానాం ఆసుతత్వాదాసవసంజ్ఞా. ద్రవ్యసంయోగవిభాగ స్తేషాం బహువిధవికల్పః, సంస్కారశ్చ, యథాస్వం సంయోగ సంస్కృతాశ్చాసవాః స్వకర్మ కుర్వన్తి, సంయోగసంస్కారదేశకాలస్థాపనమాత్రాదయశ్చ భావాః సముపదిశ్యన్తే. తత్తత్కార్యమభిసమీక్ష్యేతి.

వ్యా. ఆసవములకు ఉత్పత్తికారణములయిన ద్రవ్యములలో నొకదానితో నొకటి కలియక, ఒక్కొక ద్రవ్యమువలన పుట్టిన యాసవములు యెనుబదినాల్గు భేదములును, పైజెప్పిన గ్రంథముచే నిర్దేశింపబడినది. అయ్యవి ఆసుతములు (సంధానము చేయబడినవి) యగుటచే ఆసవములని చెప్పబడును. ఈ ఆసవద్రవ్యములయొక్క పరస్పర సంయోగంబును, వాని సంస్కారభేదంబులును, అనేకవిధములుగ నుండును. అట్టి యాసవములు ఆయామదోషాద్యనుసారముగ సంయోగసంస్కారాదులచే సిద్ధముచేయబడినయెడ వానివానికి నియమితములయిన కృత్యముల జేయనోపును. ద్రవ్యసంయోగము, సంస్కారవిశేషము, సంధానద్రవ్యము, దేశము, కాలము, పరిమాణము మున్నగు

విషయములకు సంబంధించిన విశేషములు ఆయాకార్యమున కనుగుణముగ చెప్పబడును. కావున వానినన్నిటిని చక్కగ గమనింపవలెను

{ ఎనుబదినాల్గు విధములైన పైజెప్పబడిన యాసవముల సామాన్యగుణములు. }

మూ. భవతి చాత్ర:—

మనశ్శరీరాగ్నిబలప్రదానామస్వప్నశోకారుచినాశనానామ్,
సంహర్షణానాం ప్రవరాసవానాం అశీతిరుక్తా చతురుత్తరైషా.

వ్యా. ఇత్తెరంగున మనస్సునకును, శరీరమునకును, అగ్నికిని బలమును కల్గించునవియు, నిదురబట్టకుండుటను, శోకమును, అరుచిని నశింపజేయునవియు, మనస్సు కుల్లాసము కల్గించునవియు నయిన శ్రేష్ఠమయిన యాసవము (84) ఎనుబదినాల్గును పైన వివరింపబడినవి.

అధ్యాయవిషయసంగ్రహము.

మూ. తత్ర శ్లోకః—

శరీరరోగప్రకృతౌ మతానితత్త్వేన చాహారవినిశ్చయో యః,
ఉవాచ యజ్జఃపురుషాదికే స్మిన్ మునిస్తథాగ్ర్యాణి వరాసవాంశ్చ. ౬౨

వ్యా. శరీరమునకును, రోగములకును, ప్రకృతిచేతనే శ్రేష్ఠమయినవానిని శ్రేష్ఠములయిన ఆహారాదులు, శ్రేష్ఠములయిన యాసవాదులును, యజ్ఞపురుషీయమను నీ యధ్యాయమున నిర్దేశింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
యజ్జఃపురుషీయో నామ పంచవింశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశవిరచితంబును చరకునిచే సంస్కరింపబడినదియు నైన యాయుర్వేదతంత్రమునందలి సూత్రస్థానమున యజ్జఃపురుషీయమనునది ఇరువదియైదవ యధ్యాయము సమాప్తము.

## షడ్వింశాధ్యాయము.

అవతారిక:—పూర్వాధ్యాయమున హితాఽహితములలో నేకదేశము "లోహిత శాలయశ్శూకధాన్యానాం" ఇత్యాదిగ్రంథముచే చెప్పబడినది సకలద్రవ్యములయందును హితాఽహితములపరిజ్ఞానమునకు సకలద్రవ్యములయందును వ్యాపించియుండు మధురాదిరసములనారిటికిని వీర్యవిపాకములను వివరించు ఆత్రేయభాద్రకాప్యీయమను నధ్యాయము చెప్పబడును. మరియు పూర్వాధ్యాయమున "షడాస్వాదో రసభేదతః, రసస్యషడ్విధత్వాత్" అనువాక్యముచేత నాహారాదిద్రవ్యము షడ్రసాత్మకమైయుండు నని చెప్పబడెను కావున అట్టిసకలద్రవ్యములయందును వ్యాప్తములైన రసవీర్యవిపాక ప్రభావములు ఈయధ్యాయమున దెలుపబడును. వానిలో విపాకాదులు రసములబట్టియే నిర్ణయింపవలెను కావున తొలుత రసప్రకరణము చెప్పబడును.

మూ. అథాత ఆత్రేయభద్రకాప్యీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః.౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. యజ్జఃపురుషీయాధ్యాయమును జెప్పినపిదప ఆత్రేయభద్రకాప్యపదములు ఆదియందుకల యాత్రేయభద్రకాప్యీయమను నధ్యాయమును త్రికాలజ్ఞానవేత్తయగు నాత్రేయుం లుపదేశించినదాని కన్యూనాతిరిక్తముగ వివరించెదనని యర్థము. (ఆత్రేయ భద్రకాప్యశబ్దములచే నీయధ్యాయ మారంభింపబడును కావున నీయధ్యాయమునకు ఆత్రేయభద్రకాప్యీయమని సంజ్ఞ చెప్పబడినది.)

రసాహారనిశ్చయమునకై ఋషిసమావేశము.

మూ. ఆత్రేయో భద్రకాప్యశ్చ శాకున్తేయస్తథైవ చ,
పూర్ణాక్షశ్చైవ మౌద్గల్యః హిరణ్యాక్షశ్చ కౌశికః. 3
యః కుమారశిరా నామ భరద్వాజస్స చాఽనఘః,
శ్రీమాన్ వార్యోవిదశ్చైవ రాజా మతిమతాం వరః. ౪
నిమిశ్చ రాజా వైదేహో బడిశశ్చ మహామతిః,
కాఙ్కాయనశ్చ బాహ్లీకో బాహ్లీకభిషజాం వరః. ౫
ఏతే శ్రుతవయోవృద్ధాః జితాత్మానో మహర్షయః,
వనే చైత్రరథే రమ్యే సమీయుర్విజిహీర్షవః. ౬
తేషాం తత్రోపవిష్టానాం ఇయమర్థవతీ కథా,
బభూవాఽర్థవిదాం సమ్యగ్రసాహారవినిశ్చయే. ౭

వ్యా. శాస్త్రముచేతను వయసుచేతను వృద్ధులు (గొప్పవారు)ను, ఇంద్రియముల నిగ్రహించినవారునైన ఆత్రేయులు, భద్రకాప్యులు, శాకుంతేయుఁడు, మౌద్గల్యగోత్రజుడైన పూర్ణాక్షుఁడు, కౌశికగోత్రజుడైన హిరణ్యాక్షుఁడు, కుమారశిరుడను నామాంతరముకలభరద్వాజుడు, శ్రీమంతుడైనవార్యోవిదుడు, బుద్ధిమంతులలోకొనియాడదగిన విదేహాధిపతియైన నిమియనురాజర్షి, బడిశుడు, కాంకాయనుడును, బాహ్లీకదేశవైద్యులలో ముఖ్యుడగు బాహ్లీకుడును అనునీబ్రహ్మర్షి రాజర్షి వరులందరును కడురమ్యమైన చైత్రరథమను ఉద్యానవనమునందు వేడుకగా సత్కాలక్షేపములో వినోదముగనుండిరి. అట్టియెడ సుఖోపవిష్టులైనవారికి మధురాదిరసవినిశ్చయపూర్వకమైన యాహారమును నిశ్చయించు విషయమై యర్థవంతమైన యీక్రిందవివరింపబడుప్రకారము ప్రసంగము జరిగెను.

ఇచ్చట శిష్యులకు సుఖబోధమునకై పూర్వపక్షసిద్ధాంతపూర్వకముగ రసాహారనిశ్చయమును దెల్ప నుద్దేశించి మునిసంవాదము చెప్పబడినది.

### రససిద్ధాంతవిషయమై పూర్వపక్షమతాంతరములు.
### అందు రసైకవిధత్వపక్షము.

మూ. ఏక ఏవ రస ఇత్యువాచ భద్రకాప్యః;—యం పఞ్చానామిన్ద్రియార్థానామన్యతమం జిహ్వావైషయికం భావమాచక్షతే కుశలాః, స పునరుదకాదనన్య ఇతి. ౮

వ్యా. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ననునైదు ఇంద్రియార్థములలో నొకటియై నాలుకచే గ్రహింపదగిన యేభావమును ఒక్కదానిని కుశలబుద్ధులగువారు చెప్పెదరో అట్టిరసము ఒక్కటియే యనియును, అయ్యది యుదకమునకన్న వేరొండుకాదనియు భద్రకాప్యుడు చెప్పెను.

చక్షురాదీంద్రియములలో కేవలము రసనేంద్రియమున కాధారమైన నాలుకచే గ్రాహ్యమైనది యొక్కటే రసమనియు, అయ్యది యుదకమునకన్న భిన్నమైనది కాదనియు భద్రకాప్యుని యాశయము.

ఈప్రకరణమున ద్రవ్యనిష్ఠరసవీర్యవిపాకములు వివరింపబడు; అందు "పాకో నాస్తి వినా వీర్యం వీర్యం నాస్తి వినా రసాత్" అనుప్రమాణముచేత విపాకము వీర్యమును, అయ్యది రసమును ఆశ్రయించియుండునని తెలియుంటంజేసి వీర్యవిపాకములరెంటికి నాధారమైనరసము తొలుత వివరింపబడును. 'అన్యతమం' అనుచోట అన్యశబ్దమునకు ఏకమని యర్థము. "అన్యో దక్షిణేనగతః, అన్యో దక్షిణేన" ఇత్యాదివాక్యములయందు

అన్యశబ్దమునకు 'ఏకః' అనునర్థమున ప్రయోగము కలదు. అన్యశబ్దమునకంటె స్వార్థమున తమప్ ప్రత్యయము. 'అన్యతమ'యన ఏకః అని ఫలితార్థము. 'ఉదకాదనన్యః' అనుట చేత ఉదకమన్నను రసమన్నను ఒకేభావమును బోధించునని యుదకరసములకైక్యమును బోధించుట యీపూర్వపక్షియభిప్రాయము.

రసద్వైవిధ్యపక్షము.

మూ. ద్వౌ రసావితి శాకున్తేయో బ్రాహ్మణః ఛేదనీయశ్చోపశమనీయశ్చేతి. ౯

వ్యా. ఛేదనీయము, ఉపశమనీయము నని రసములు రెండు తెరంగుల నుండునని శాకుంతేయుం డనుబ్రాహ్మణుడు సెప్పెను. (అపతర్పణమును (శరీరాదికార్శ్యమును) చేయునది అపతర్పణీయము, అదియే ఛేదనీయము. శరీరమునకు బలమునుకల్గించి బలియ జేయునది బృంహణీయము, ఇదియే యుపశమనీయము.) అపతర్పణము సంతర్పణమునను రెండువిధము లైనక్రియల జేయుటంజేసి రసము అపతర్పణీయము, సంతర్పణీయము నని రెండువిధముల నుండునని శాకుంతేయునిమతము.

రసత్రైవిధ్యపక్షము.

మూ. త్రయో రసా ఇతి పూర్ణాక్షో మౌద్గల్యః, చ్ఛేదనీయోపశమనీయా సాధారణశ్చేతి. ౧౦

వ్యా. మౌద్గల్యగోత్రజుడైన పూర్ణాక్షు డనుమునివరుడు పైజెప్పిన చ్ఛేదనీయ ఉపశమనీయముల రెంటితో సాధారణమునుజేర్చి రసములు మూడువిధములని చెప్పెను.

ఇచ్చట నీయభిప్రాయము నెరుంగునది:—లోకమునంగల సకలపదార్థములయందును సోమగుణము, అగ్నిగుణము అనురెండుగుణములు వ్యాపించియుండును. అందు చంద్రునకుసంబంధించిన శైత్యాదిగుణములు, సౌమ్యములు. అట్టిగుణములు ప్రబలముగ గల్గినవి సౌమ్యములనబడును. అట్టిగుణము స్వభావమునంజేసి శరీరధాత్వాదులను వృద్ధి నొందించి పుష్టిని కల్గించి పోషించును కావున నయ్యది బృంహణీయము. ఇదియే యుపశమనీయము. అగ్నికిసంబంధించిన ఉష్ణత్వము తీక్ష్ణతమున్నగునవి యాగ్నేయములు; అట్టి గుణములను ప్రబలముగకల్గిన ద్రవ్యములు ఆగ్నేయములు. వానియందలి యాగ్నేయ గుణము శరీరమునందలి ద్రవమును శోషింపజేసి కృశతనొందించును కావున నియ్యది కర్శనీయమనియు, చ్ఛేదనీయమనియు చెప్పబడును. ఇదియే లంఘనీయమనియు వాడ బడును. అట్టిద్రవ్యనిష్ఠములైన సౌమ్య-ఆగ్నేయగుణములను ప్రధానములుగ జేసి రసము బృంహణీయకర్శనీయభేదములచే రెండువిధములనుండునని రసద్వైధవాదియగు శాకుంతే యుని యాశయము.

అట్టి యాగ్నేయసౌమ్యగుణములు రెండును ఒకద్రవ్యమున సమముగ జేరియున్నచో నయ్యది సాధారణమనబడును. అయ్యది యొకసమయమునకృశతను, వేరొకసమయమున బృంహణమును చేయును. లేక కార్శ్యబృంహణముల జేయక సమస్థితినైననుంచును. ఉభయమిశ్రగుణమిది మూడవది. ఈవిషయమునే వాగ్భటాచార్యులు "కృశానాం బృంహణాయాలం స్థూలానాం కర్శనాయ చ" అని చెప్పిరి. (తైలమున సౌమ్యాగ్నేయ గుణములురెండును కలిసియుండుటంజేసి కృశించినవారికి బృంహణంబును, స్థూలులకు కర్శనంబును నగునని యర్థము). అట్టి సౌమ్యాగ్నేయమిశ్రమైనగుణము ననుసరించి కర్శనీయ-బృంహణీయ-సాధారణ భేదములచే రసము మూడువిధముల నుండునని పూర్ణాక్షుని యాశయము.

## రసచాతుర్విధ్యపక్షము.

మూ. చత్వారో రసా ఇతి హిరణ్యాక్షః కౌశికః; స్వాదుర్హితశ్చ, స్వాదురహితశ్చ, అస్వాదుర్హితశ్చ, అస్వాదురహితశ్చేతి ౧౧

వ్యా. శరీరమునకు ధాతుసామ్యరూపమైన హితమును జేయుంచు స్వాదుగనుండునదియొకటి. ధాతువైషమ్యరూపమైన ప్రతికూలమును చేయుచు స్వాదుగనుండునది వేరొకటి. స్వాదువుకాక శరీరమునకు హితకారి యింకొకటి. స్వాదువునుకాక శరీరమునకు ప్రతికూలమును జేయునది యింకొకటి. ఇత్తెరంగున రసము నాల్గు తెరంగులనుండునని కౌశిక గోత్రజుడైన హిరణ్యాక్షుడు నుడివెను. (ఇచ్చట స్వాదుశబ్దమునకు రుచియని యర్థము. "రస్యతే (ఆస్వాద్యతే) ఇతి రసః" అనువ్యుత్పత్తిచేత ఆస్వాదింపబడునది రసమని యర్థము. అనగ రుచియని భావము. ఈవివరణము ననుసరించి రసశబ్దముచేత ద్రవ్య సామాన్యముగ వ్యాపించియుండు రుచిరూపమైన గుణవిశేషము రసమునియుం ఫలితార్థము.)

## రసపంచవిధత్వపక్షము.

మూ. పఞ్చ రసా ఇతి కుమారశిరా భరద్వాజః; భౌమ-ఔదక-ఆగ్నేయ-వాయవీయ- ఆన్తరిక్షాః. ౧౨

వ్యా. భౌమము (భూమిసంబంధమైనది), ఔదకము (జలసంబంధమైనది), ఆగ్నేయము (అగ్నిసంబంధమైనది), వాయవీయము (వాయుసంబంధమైనది), ఆంతరిక్షము (ఆకసమునకుసంబంధించినది) నని రసము ఐదువిధములనుండునని కుమారశిరస్సను నామాన్తరముకల భరద్వాజుడు నుడివెను.

(పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అనుపంచభూతాత్మకములైన ద్రవ్యములలో నేభూతముయొక్కగుణము దేనియం దధికముగనుండునో ఆద్రవ్యము

అట్టిభూతముయొక్కభావము కల్గియుండును కావున పంచమహాభూతముల ననుసరించి యాహారాది పదార్థములును పంచరసాత్మకములుగనుండును. కావున రసములు భౌమాది భేదములచే నైదువిధముల నుండునని కుమారశిరునియభిప్రాయము.)

రసషడ్విధత్వపూర్వపక్షము.

మూ. షడ్రసా ఇతి వార్యోవిదో రాజర్షిః; గురు - లఘు-శీత - ఉష్ణ-స్నిగ్ధ-రూక్షాః. ౧౩

వ్యా. గురువు, లఘువు, శీతము, ఉష్ణము,స్నిగ్ధము,రూక్షము నని రసములారువిధములని రాజర్షియైన వార్యోవిదుడుచెప్పెను. (ద్రవ్యమునందలి గుర్వాదిగుణము లారును రసములని వ్యవహరింపబడి రసము లారువిధముల నుండునని వార్యోవిదునియాశయము.)

రససప్తవిధత్వపక్షము.

మూ. సప్త రసా ఇతి నిమిర్వైదేహః; మధుర-అమ్ల-లవణ-కటు-తిక్త - కషాయ-క్షారాః. ౧౪

వ్యా. మధురము (తీపి), అమ్లము (పులుపు), లవణము (ఉప్పు), కటువు(కారము), తిక్తము (చేదు), కషాయము (వగరు), క్షారము (సున్నమువలె తీవ్రముగనుండుట) నని రసము లేడువిధముల నుండునని విదేహదేశాధిపతియైన నిమియనురాజర్షి చెప్పెను. (సున్నము మున్నగువానియందు పొక్కునట్లుచేయు తీవ్రమైనశక్తి కలదు. దానిని కూడ చేర్చి మధురాదిరసము లేడువిధముల నుండునని నిమియభిప్రాయము).

రసాఽష్టవిధత్వపక్షము.

మూ. అష్టౌ రసా ఇతి బడిశో ధామార్గవః; మధుర-అమ్ల-లవణ-కటు - తిక్త-కషాయ - క్షార - అవ్యక్తాః. ౧౫

వ్యా. మధురము, అమ్లము, లవణము, కటువు, తిక్తము, కషాయము, క్షారము, అవ్యక్తమునని రసములు ఎనిమిదివిధముల నుండునని ధామార్గవుడను బడిశుడుచెప్పెను. (జలమునందు రసము (రుచి) వ్యక్తముగ దెలియక లీనమైయుండును కావున అట్టియవ్యక్త రసమును పైజెప్పిన మధురాదిరసము లేడిటితోగూడి రసము లెనిమిదివిధముల నుండునని బడిశునియాశయము).

రసాఽసంఖ్యేయత్వపక్షము.

మూ. అపరిసంఖ్యేయా రసా ఇతి కాఙ్కాయనో బాహ్లీకభిషక్, ఆశ్రయ-గుణ-కర్మ-సంస్వాదవిశేషాణామపరిమేయత్వాత్. ౧౬

వ్యా. ("ఆశ్రీయతే (గుణకర్మాదిభిః) ఇత్యాశ్రయః" అనువ్యుత్పత్తిచేత గురుమందాదిగుణములకును ధాతువర్ధనకర్శనాదికర్మములకును రుచికిని ఆశ్రయమైన (ఆధారమైన) ద్రవ్యము ఆశ్రయమనబడును.) అట్టిద్రవ్యంబును, దాని నాధారముగ జేసియుండు గుర్వాదిగుణంబులును, అట్టిద్రవ్యము నాశ్రయించిన ధాతువుల వృద్ధి నందించుట కృశింపజేయుట మున్నగుకృత్యంబులును, మధురాదులలోగల యవాంతర రుచిభేదంబును, వీనివిశేషభేదములు పలుదెరంగులై సంఖ్యాతీతములుగ నుండును. కావున ద్రవ్యనిష్ఠములైన రసంబులును లెక్కిడనలవికాక నానారూపములుగ నుండునని బాహ్లీకదేశ వైద్యవరుడగు కాంకాయనుడు చెప్పెను.

ద్రవ్యము లనంతములుకావున అట్టిద్రవ్యము నాధారముగ జేసికొనియుండు రసంబులు పలుదెరంగులైయుండును. ద్రవ్యమునకును రసమునకును ఆధారాధేయ సంబంధము. ఆధారమైనద్రవ్యము నానాభేదములు కల్గియున్నపుడు ఆధేయమైన రసంబును అనేకములగుట సాజము. మరియు గుర్వాదిగుణములును బృంహణాదిక్రియలును రసమూలమున ద్రవ్యాశ్రయములై యుండునుకావున గుణంబులును కృత్యంబులును అనంతములగును. మరియు సంస్వాదమన మధురజాతిలోచేరిన చెరకుబెల్లము శర్కర మున్నగువానికి అవాంతరభేదము ఈషన్మాత్రముండును. లవణాదులకును ఇత్తెరంగుననే యేకజాతియందును తారతమ్యభేదముండును. అదియే సంస్వాదమనబడును. ఇయ్యది కేవలము అనుభవైకవేద్యముగ నుండును. ఈవిషయమునే తంత్రాంతరమున నిట్లు చెప్పిరి:—"ఇక్షుక్షీరగుడాదీనాం మాధుర్యస్యాన్తరం మహత్, భేదస్తథాపి నాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే." (చెరకురసము, పాలు, బెల్లము మున్నగుద్రవ్యములలోగల మాధుర్యమునకు పరస్పరభేదము లనంతములుగ నుండును. వానిని నిర్ణయించి చెప్ప సరస్వతికైన నలవికాదని యర్థము). అట్టి సంస్వాదభేదంబులును పలుదెరంగులైయుండును.

ఇత్తెరంగున ద్రవ్యము నాధారముగ జేసికొనియుండు గుణకర్మసంస్వాదంబులును, వీనికి నాధారమైన ద్రవ్యంబులును సంఖ్యాతీతములై యుండుటంజేసి అట్టి ద్రవ్యము నాశ్రయించినరసంబును నానావిధములుగ నుండునని కాంకాయనుని పూర్వపక్షాశయము.

### రసషడ్విధత్వసిద్ధాంతము.

మూ. షడేవ రసా ఇత్యువాచ భగవానాత్రేయః పునర్వసుః; మధుర-అమ్ల-లవణ-కటు-తిక్త-కషాయాః. తేషాం షణ్ణాం రసానాం

యోనిరుదకమ్. ఛేదనోపశమనే ద్వే కర్మణీ. తయోర్మిశ్రీభావాత్సాధారణత్వం, స్వాద్వస్వాదుతా భక్తిః. ద్వౌ హితాహితౌ ప్రభావౌ. ౧౨

వ్యా. పైజెప్పినరీతిగ రసములనుద్దేశించి ఋషులచే జెప్పబడిన పూర్వపక్షి మతముల తొమ్మిదిటిని నిరసించుచు పునర్వసువను నాత్రేయుండు రసము లారువిధములని సిద్ధాంతితమైన తనమతమును 'షడేవ రసాః' అనువాక్యముచే నిరూపించుచున్నాడు:—

మధురము, అమ్లము, లవణము కటువు, తిక్తము, కషాయము నని రసము లారు విధములుగనే యుండును. (తక్కిన యేకవిధత్వాదినిరూపణమతములు సమంజసములు కావనుట). అట్టి మధురాదిరసములారిటికిని ప్రధానమైన యాధారకారణము జలము. అట్టిజలమును ఆధారముగజేసికొని రసముండును. (లోకమున నాధేయములైన ఘట పటాదులకు ఆధారభూతములైన వస్త్వంతరములకును పరస్పరభేదము అనుభవసిద్ధము. కావున ఆధారకారణరూపమైన జలమునకంటె రసము భిన్నమేకాని ఒక్కటియేయని చెప్పదగదు. ఇట్లు చెప్పుటచేత "ఏక ఏవ రసః...స పునరుదకాదనన్యః" అను వాక్యముచేత రసమొక్కటియే యనియు, అయ్యది జలమునకన్న నభిన్నమనియు రస జలైక్యమును చెప్పిన భద్రకాప్యునిమతము నిరసింపబడినది. రసనేంద్రియమున కాధార మైననాలుకచే గ్రహింపదగినది (రుచి) రసమని రససామాన్యలక్షణము. అయ్యది జల మును ప్రధానాధారముగను, భూమిని రెండవయాధారముగను జేసికొనియుండును. ఈవిషయము ప్రథమాధ్యాయమునందు "రసనార్థో రసస్తస్య ద్రవ్యమాపః క్షితిస్తథా" అను శ్లోకముచే జెప్పబడినది. మాచే నావ్యాఖ్యానమున వివరింపబడినది).

మరియు ఛేదనము (కార్శ్యమును కల్గించుట), ఉపశమనము (ధాత్వాదుల వృద్ధినొందించుట) ననునవి రసకృత్యములుకాని రసస్వరూపములు కావు. అట్టి ఛేదన ఛేదనకృత్యములు మిశ్రములుగ నున్నయెడ సాధారణ మనబడును. కాని యదియు రసము కానోపదు. (ఇట్లుచెప్పుటచేత రెండురసములను కాకుంతేయునిమతంబును, మూడు రసములను పూర్ణాక్షునిమతంబును ప్రత్యాఖ్యాతములు).

అట్టిరసములకు ఆరిటికిని స్వాదుత్వము (రుచిగనుండుట), అస్వాదుత్వము (రుచింపకుండుట), మనుజునియిచ్ఛ ననుసరించి యుండును. (భక్తియనగ ఇచ్ఛ. మధు రాదిరసములలో నెవ్వనికేది ప్రియమై తోచునో అయ్యది వానికి రుచ్యముగ నుండును. అయ్యది మనుజునియిచ్ఛ ననుసరించియుండు ధర్మములుగాని రసభేదమునకు కారణ ములు కానేరవు). మరియు ఆరోగ్యరూపమైన హితమును జేయుటయు, అనారోగ్య

రూపమైన యహితమును జేయుటయు ద్రవ్యనిష్ఠమైన ప్రభావమున గల్గును. కావున నట్టిహితాహితములు ప్రభావము లగునుకాని రసభేదములు కానోపవు. (ఇట్లు చెప్పుట చేత రసములు నాల్గువిధములని హిరణ్యాక్షుడు చెప్పినమతము ప్రత్యుక్తము).

పంచరస-షడ్రసపక్షముల నిరాకరణము.

మూ. పఞ్చమహాభూతవికారాస్త్వాశ్రయాః ప్రకృతివికృతివిచారదేశకాలవశాః, తేష్వాశ్రయేషు ద్రవ్యసంజ్ఞితేషు గుణాః గురులఘుశీతోష్ణస్నిగ్ధరూక్షాద్యాః. ౧౩

వ్యా. (పంచభూతాత్మకములైనవి ద్రవ్యములు. అట్టి భౌమాదిద్రవ్యభేదములచే రసములును భౌమాదిభేదములుకల్గి యైదువిధముల నుండునని కుమారశిరునిమతము) అట్టి భౌమాదిపంచభూతవికారములైనద్రవ్యములు రసమున కాశ్రయము లైయుండును కాని రసములు కానేరవు. (ఆధారమునకన్న నాధేయము వేరుగనుండుట యనుభవసిద్ధముకావున ద్రవ్యమునకన్న రసము వేరుగ నుండునని భావము. ఈవాక్యముచేత పంచవిధత్వపక్షము నిరస్తము).

గురు-లఘు-శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్షములు మున్నగునవి ఆశ్రయములైన ద్రవ్యములయందలిగుణములు. అయ్యవి ప్రకృతిని (వస్తుస్వభావమును), వికృతిని (సంస్కారాదులచే గల్గినవికారమును), విచారము (ఇతరవస్తుసంయోగము) దేశము (జాంగలాది ప్రదేశము)ను, కాలము (వసంతాదికాలము)ను అనుసరించి సంభవించునుకాని రసభేదములు కానోపవు. ఈవాక్యముచేత గురులఘ్వాదులారును రసములని చెప్పిన వార్యోవిద పక్షంబును ప్రత్యాఖ్యాతము.

షడ్రసపక్షమున జెప్పిన గురులఘ్వాదులారును, అవియేగాక తక్కినమందాదులు పదునారును రసముల కాశ్రయములైన ద్రవ్యములయందలి గుణములు. అయ్యవి ద్రవ్యప్రకృతివికృత్యాదుల కధీనములై తత్తదనుసారముగ సంభవించును. కావున నవి రసములు కానేరవని భావము. ("రూక్షాద్యాః" అనునాద్యశబ్దముచేత పైగనబరచిన యారుకాక తక్కిన పదునారును జేరి గురుమందాదు లిరువదియు ద్రవ్యస్వభావాదివశమున ద్రవ్యములయందు కల్గువిశేషములని యర్థము).

వస్తుస్వభావాదులచే గల్గు గుణభేదముల నిట్లెరుంగునది:—పెసలు కషాయమధుర రసములు కల్గియుండును. "స్వాదుర్గురుత్వాదధికః కషాయాల్లవణోఽవరః" అను ప్రమాణమునుబట్టి మధురరసముకల్గిన పెసలు గురుగుణము కల్గియుండవలసినను అటుగాక వస్తుస్వభావమునంజేసి లఘుగుణము కల్గియుండును. ఈలాఘవము వస్తుప్రకృతిచే (స్వభావముచే) గల్గినదికాని రసమువలన గల్గినది కాదు.

వరిధాన్యముయొక్క బోరుగు లఘుత్వము కల్గియుండును. వరిపిండిచే జేయ బడునుండ్రాళ్లు గురుత్వముకల్గియుండును. ఈగురులాఘవములు ధాన్యమునకు కల్గినవికృతి ననుసరించి కల్గినవిగాని రసకృతములు గావు.

విచారమన ద్రవ్యాంతరసంయోగము (ఒకవస్తువు నింకొకవస్తువుతో జేర్చుట) అట్టి ద్రవ్యాంతరసంయోగముచేత ద్రవ్యమునకు స్వాభావికమైనగుణము మారి వేరొండు గుణము కల్గును:—తేనె నెయ్యి ఈరెంటిని నొకటిగ సమభాగములుగ జేర్చినచో నయ్యది స్వాభావికగుణములమారి విషమునకు కలగుణములుకల్గి యపాయకరమగును. ఉష్ణవీర్యమైన తిలతైలము శీతవీర్యములైన చందనము వట్టివేళ్లు మున్నగు ద్రవ్యముల జేర్చి సంస్కరింపబడిన నయ్యది శీతగుణము కల్గియుండును. శీతవీర్యమైననెయ్యి ఉష్ణవీర్యములైన ద్రవ్యాంతరములతో జేరినప్పు డుష్ణగుణము కల్గియుండును. ఎఱ్ఱవరిధాన్యము స్వభావముచేత లఘువుగనున్నను మాంసరసమును జేర్చి పక్వము జేసినచో గురుత్వము కల్గియుండును. ఇది ద్రవ్యాంతరసంయోగవశమునగలుగు గుణవిశేషము.

దేశమనునది భూమి, శరీరము అను భేదములచే రెండువిధములు. అట్టి భూమి విశేషమును, శరీరమునందలి యవయవవిశేషములనుబట్టి గుణములు సంభవించును:—మాల్కంగిని (పెద్దమావేరు) పుట్టపై మొలిచి వైరైనయెడ నయ్యది విషమును హరించును. హిమవంతమునందలి యోషధులు మిక్కిలి గుణవంతములై యుండుననియు, జంతువుల శరీరావయవములలో తొడలయందలి మాంసముకన్న శిరస్సునందును మూపులయందును కల మాంసము మిక్కిలి గురుతరముగ నుండుననియు, "హిమవతి భేషజాని మహాగుణాని భవన్తి" "సక్థిమాంసాద్గురుతరం స్కన్ధక్రోడశిరస్పదాం" ఇత్యాదివచనములచే దెలిసెడి. ఇది దేశవిశేషవశమునగల్గు గుణవిశేషము.

కాలమనునది వసంతాదిరూపంబును, బాల్యాదిరూపంబునై రెండువిధముల నుండును. ద్రవ్యములయొక్క బాల్యావస్థానుసారముగను వసంతాదిఋత్వనుసారముగను గుణములుసంభవించును.—"తద్బాలం దోషహరం, వృద్ధం త్రిదోషం" అని యుండుట చేత లేతముల్లంగి త్రిదోషహరంబును, ముదిరినముల్లంగి త్రిదోషవృద్ధికరంబు నగును. ఇట్టిగుణభేదము ముల్లంగికి వయోవస్థాభేదముచే గల్గును. మరియు "యథర్తుపుష్పఫలమాదదీత" అని యుండుటచేత నేయేపుష్పఫలములకు నేయేఋతువు ప్రశస్తమైన కాలమగునో ఆయాఋతువులయం దాయాపుష్పములను ఫలములను గ్రహింపనగునని తెలిసెడి. ఇచ్చట పుష్పములకును ఫలములకును తమతమఋతువులసంబంధమున గుణాధిక్యము చెప్పబడినది. ఇది కాలవశమున గల్గుగుణభేదము.

పైవివరించినరీతిగ ద్రవ్యము నాధారముగ జేసికొనిన గుర్వాదిగుణములు ప్రకృతి మున్నగువానియధీనములై మారుచుండును కావున "ప్రకృతి-వికృతి-విచార-దేశకాలవశాః" అనునది విశేషణముగ గుర్వాదులకు చెప్పబడినది. ఇచ్చట వశాః అనుపదము ప్రకృత్యాదులతో ప్రత్యేకముగ జేర్చి "ప్రకృతివశాః, వికృతివశాః" ఇత్యాదిరూపము నెరుంగునది. పై జెప్పిన రససామాన్యలక్షణమునకును గురులఘ్వాదులకును సమన్వితముకాదు కావున రసములని గుర్వాదులచెప్ప వలనుపడదని భావము.

క్షారము రసముకాదని నిరూపించుచు రసస ప్తవిధపక్షనిరాకరణము.

**మూ** క్షరణాత్ క్షారో నాసౌ రసః, ద్రవ్యం తత్, అనేకరససముత్పన్నం అనేకరసం, కటుకలవణభూయిష్ఠం, అనేకేన్ద్రియార్థసమన్వితం, కరణాభినిర్వృత్తం. ౧౯

వ్యా. నిమియనురాజర్షి మధుర - అమ్ల - లవణ-కటు - తిక్త - కషాయ-క్షారములని రసముల నేడువిధముల నిరూపించెను. అందు మధురాదులారును సిద్ధాంతసమ్మతములు. క్షారమొక్కటిమాత్రము రసముకానేరదని చెప్పుటకై క్షారస్వరూపమును 'క్షరణాత్ క్షారః' అనువాక్యముచే నిరూపించుట:—

క్షరణమన నధోగమనానుకూలవ్యాపారము. అట్టివ్యాపారముచే సిద్ధమైనది క్షారమనబడును. ఉత్తరేణిమున్నగుకొన్నిద్రవ్యములనుచేర్చి కాల్చి బూడిదచేసి నీళ్లలో కలిపి యుంచినయెడ అందు(క్రిందికిదిగజారియుండుసత్తు కారమనిచెప్పబడును ) ఇయ్యది ద్రవ్యమగునుకాని రసముకాదు. (మరియు "ఛిత్వాచ్ఛిత్వాశయాత్ క్షారాః క్షారత్వాత్ క్షారయత్యధః" అనుప్రమాణాంతరముచేత వ్రణాదులయందలి పూయాదులను భేదించి దిగజార్చునౌషధవిశేషము క్షారమని తెలిసెడి). అట్టిక్షారరూపమైనద్రవ్యము అనేకరసములు కలమొక్కలపుచెట్టు ఉత్తరేణి మున్నగుద్రవ్యములచే నిర్మింపబడును. అట్టియనేకరసములు ద్రవ్యసమ్మేళనముచే గల్గుటంజేసి క్షారంబును అనేక రసముల కల్గియుండును. అందును కారము లవణము అధికముగకల్గియుండును. ఘ్రాణేంద్రియగోచరమైన గంధంబును త్వగింద్రియగోచరమైన స్పర్శంబును కల్గియుండుటంజేసి యనేకేంద్రియార్థముల గూడినది. భస్మస్రావాది వ్యాపారములచే నేర్పడురూపము కల్గియుండును. (ఉత్తరేణి మున్నగువానిని బూడిదచేసి యాబూడిదను నీటగలిపి సిద్ధముచేయబడును కావున వ్యాపారముచే నేర్పడునది యని భావము.)

ఇచ్చట నీవివరణము నెరుంగునది— "రసనార్థో రసస్తస్య ద్రవ్యమాపః క్షితిస్తథా" అని సూత్రస్థానమున జెప్పిన రససామాన్యలక్షణమున కేవలము రసనేంద్రియ

గ్రాహ్యమై జలమును ప్రధానాధారముగ జేసికొని ద్రవ్యనిష్ఠమైన భావవిశేషము రసమని యేర్పడినది. ప్రకృతమున క్షారమనునది స్రావణ(స్రవింపజేయుం) రూపమైన క్రియచే నుత్పన్నమైనద్రవ్యవిశేషము క్షారమనబడును. ఇయ్యది అనేకరసములుగల ద్రవ్యములచే నిష్పన్నమైనది. రసము అనేకరసద్రవ్యములచే నిష్పన్నమైనది కాదు. ఘ్రాణస్పర్శగ్రాహ్యములైన గంధస్పర్శములు కల్గినది క్షారము. రసము కేవలము రసనేంద్రియగ్రాహ్యమైనది. కొన్నికృత్యములచే నిర్మింపబడునది క్షారము. రసము స్వతస్సిద్ధమైనదికాని క్రియలచే నిర్మింపబడినదికాదు. ఇత్తెరంగున రసమునకును క్షారమునకును పరస్పరవైలక్షణ్యము ప్రత్యక్షముగ దెలియుచున్నది. కావున క్షారము రసమని చెప్పుట సమంజసము కాదని భావము.

అవ్యక్తరసపక్షనిరాకరణపూర్వక అష్టవిధత్వనిరసనము.

మూ. అవ్యక్తీభావస్తు ఖలు రసానాం ప్రకృతౌ భవత్యనురసే అనురససమన్వితే వా ద్రవ్యే. ౨౦

వ్యా. పైజెప్పిన సప్తవిధపక్షమునందలి మధురాదులయేడిటితోగూడ నవ్యక్తరసము నొకదానిని చేర్చి 'అష్టౌ రసాః' అని చెప్పిన బడిశునిపక్షమును నిరాకరించుచు నవ్యక్తరసమును ప్రత్యాఖ్యానము చేయుచున్నాడు.

అవ్యక్తమన ఇదిమధురము ఇదియమ్లము అనివిశేషముగ నిరూపింపనలవికాని స్థితియే యవ్యక్తమనదగును. అయ్యది మధురాదిరసముల వ్యక్తీభావమునకు ప్రధానమై (బీజమునందు వృక్షభావమంతయుం గానరాక యణగియుండువిధముగ) లీనముగ నుండు భావము. అయ్యది మధురాదిసర్వరసకారణాత్మకము; కాని వేరొండురసాంతరము కానోపదు ("అవ్యక్తభావస్తు" అను చ్విప్రత్యయముచేత మధురాదిరసములు వ్యక్తములగుటకుముందు కారణాత్మకమైయుండు పరిస్థితియే యవ్యక్తమని తెలిసెడి) అట్టిరసముల యవ్యక్తీభావము రసములకన్నిటికిని ప్రకృతియైన (ప్రధానకారణమైన) జలమునందును, అనురసమునందును, అనురసమునకాధారమైనద్రవ్యమునందు నుండును.(కావున అవ్యక్తమనునది రసములవ్యక్తీభావమునకు కారణమై రసోత్పత్తికి ప్రధానకారణమైన జలమునందు లీనముగ నుండునుకాని అయ్యది వేరొండురసము కానేరదనుట.)

అనురసమన నొకద్రవ్యమున ప్రధానముగ నొకరసముండుతరి దానిననుసరించిన వేరొండురసము. "రూక్షః కషాయానురసో మధురః కఫపిత్తహా" అని వెదురుబియ్యపుగుణముల చెప్పియున్నది. ఇచ్చట కషాయరసమును అనురసముగకల మధురరస

ముకల్గినది వెదురుబియ్యమని చెప్పబడినది. మధురరసము ప్రబలముగను కషాయరసము మిక్కిలి స్వల్పమగుటచే స్ఫుటముగ గానరాకయుం నుండునని భావము. ఇచ్చట కషాయ రసము అవ్యక్తస్థితినున్నది.

విషముయొక్క గుణాదుల జెప్పునపుడు "ఉష్ణమనిర్దేశ్యరసం" అని చెప్పి యున్నది. విషమున కీయది ప్రధానరసమని చెప్ప వీలుగాక అన్నిరసములును అనురస ములుగనుండునని యర్థము. అట్టిసర్వానురసయుక్తద్రవ్యమునందు రసములయవ్యక్తీ భావముండునని "అనురససమన్వితే వా ద్రవ్యే" అని చెప్పబడినది.

మరియుం నీరహాస్యము, నెరుంగునది.—జలగుణముల జెప్పునపుడు 'అవ్యక్తరసః' అని చెప్పబడినది. సుశ్రుతాచార్యుడును 'వ్యక్తరసతా రసదోషః' అని చెప్పెను. జలమున మధురాదిరసములు స్ఫుటముగ దెలియకుండుననియుం, అట్టిరసములు స్ఫుటముగ గానవచ్చి నచో జలము దుష్టమనియుం భావము. లోకమునందును నీళ్లుత్రాగునప్పుడు ఈజలమున మధురాదిరసములొక్కటియుం గానరాదని చెప్పుటయుం ననుభవసిద్ధము. దూరముగ నొక వస్తువు కనబడినప్పుడు శుక్లాదివర్ణవిశేషముల గుర్తింప నలవిగాకున్నను రూపమాత్రము దోచునట్లు జలము మధురాదిరసవిశేషములు గానరాకున్నను వానియభివ్యక్తికి కారణమా త్రము మనోగోచరమగును. లోకమున వస్త్వభివ్యక్తిపూర్వము వస్త్వభావమే తోచుట యనుభవసిద్ధము. ఈకారణములచేత మధురాదిరసాభివ్యక్తికి ప్రధానకారణమైన జల మునందు రసములయవ్యక్తీభావ మున్నదని తలంపనగును. ఈయుద్దేశముచేతనే జల మవ్యక్తరసమని చెప్పిన తంత్రకారులయాశయము.

### రసాపరిసంఖ్యేయత్వపక్ష నిరాకరణము.

మూ. అపరిసంఖ్యేయత్వం పునః తేషామాశ్రయాదీనాం విశేషాఽపరి సంఖ్యేయత్వాన్న యుక్తం, ఏకైకోఽపి హి పునరేషామాశ్ర యాదీనాం భావానాం విశేషానాశ్రయతే. విశేషాపరిసంఖ్యే యత్వాత్. న చ తస్మాదన్యత్వముపపద్యతే, పరస్పరసంసృష్ట భూయిష్ఠత్వాత్. న చైషామభినిర్వృత్తేర్గుణప్రకృతీనామపరి సంఖ్యేయత్వం భవతి. తస్మాన్న సంసృష్టానాం రసానాం కర్మోపది శన్తి బుద్ధిమన్తః, తచ్చైవ కారణమపేక్షమాణాః షణ్ణాం రసా నాం పరస్పరేణాఽసంసృష్టానాం లక్షణపృథక్త్వముపదేక్ష్యామః.

వ్యా. గుణకర్మాదుల కాశ్రయమైనద్రవ్యంబును అట్టిద్రవ్యము నాశ్రయించియుండు గుణకర్మసంస్వాదవిశేషంబులును అనంతములగుటంజేసి గుణకర్మాదుల కాశ్రయమైనరసంబును అనేకములై సంఖ్యాతీతములుగ నుండునని బాహ్లీకవైద్యవరుడైన కాంకాయనుడు నిరూపించెను. అట్టిరసాపరిసంఖ్యేయత్వపక్షము ఈవాక్యముచే నిరాకరింపబడును.

ఆశ్రయమైనద్రవ్యంబులయొక్కయు వానినాశ్రయించియుండు గుణకర్మసంస్వాదములయొక్కయు అవాంతరవిశేషము లనేకములుగ నుండుటంజేసి అట్టిద్రవ్యాదుల నాశ్రయించియుండు మధురాదిరసంబులును సంఖ్యాతీతములై యుండునని చెప్పుట సమంజసము కానోపదు. ఏలయన:—మధురాదిరసములలో నొక్కటొకటియు నాశ్రయాదుల విశేషముల నాశ్రయించియేయుండును. అట్టియాశ్రయాదివిశేషము లనంతములుగ నున్నను వానియందెల్ల మధురాదిరసములలో నొక్కొక్కటి యాశ్రయించియే యుండును. అంతమాత్రముచేతనే రసానంత్యము చెప్పవీలుండదు. (మధురఆమ్లాదిరసముల కాశ్రయములైనద్రవ్యములు చెరకు క్షీరము మున్నగువిశేషములచే భిన్నములుగనున్నను వాని యన్నిటియందును వ్యాపించియుండు మధురాదిరస మొక్కటియే యగును కాని ద్రవ్యభేదముచేత రసము వేరొండుగమారుటలేదు. వరిబియ్యము పెసలు నెయ్యి పాలు మున్నగుద్రవ్యములు మధురరసమునకు ఆశ్రయములు. ఆశ్రయములైనద్రవ్యములు పెసలు నెయ్యియని యనేకములుగ గానవచ్చినను వానియందెల్ల వ్యాపించియుండు మధురరస మొక్కటియే యగునుగాని ద్రవ్యభేదముచే రసము మారుటలేదు. హంసలు పాలు ప్రత్తి మున్నగుద్రవ్యము లనేకములై భిన్నభిన్నములుగనున్నను వానియందెల్ల వ్యాపించియుండు శ్వేతవర్ణ మొక్కటియేగాని వేరువేరుగ మారియుండుటలేదుకదా. ఆవిధముగనే మధురరసమున కాశ్రయములగువ్రీహ్యాదులు విలక్షణములైయున్నను వానియందు వ్యాపించియుండు మధురత్వజాతి యొక్కటియేగాని భిన్నముకాదు. కావున ద్రవ్యభేదముచే రసము లనేకములనిచెప్పుట యసంగతమని భావము.)

అత్తెరంగుననే మధురరసమునందలి గురుపిచ్ఛిలస్నిగ్ధాదిగుణములును, మధురరసకృత్యములైన ధాతువర్ధన-ఆయుర్వర్ధన-వర్ణకరణాదికకృత్యములును వేరువేరుగనున్నను అట్టిగుణాదిభేదములబట్టి మధురరసము మారుటలేదు. మధురరసముయొక్కరుచినిబట్టి బెల్లము చక్కెరమున్నగువానియందు కొంచెముమార్పు కానవచ్చినను మధురత్వము మారుటలేదు. కావున ఆశ్రయ-గుణ-కర్మ-సంస్వాదవిశేషములకుం గలయవాంతరభేదమునుబట్టి మధురాది రసములకు భేదమును అనేకత్వమును కల్పించుట యుక్తముకాదని భావము.

పూర్వపక్షము:—మధురాదిరసములకు ఆశ్రయగుణాదివిశేషములబట్టి యనేకత్వము లేకున్నను, రసములపరస్పరసంసర్గముచే రుచిభేదము కల్గును. మధురంబును అమ్లంబును కలిసినప్పుడు రుచి భిన్నముగ నుండును. అట్టిమధురామ్లములు కలిసినప్పుడు వాని కృత్యంబును వేరుగనే మారును. ఆరెండురసములును కలిసి చేయునట్టిపనిని కేవలము అమ్లమైనను మధురమైనను చేయుటలేదుకదా. కావున రససంసర్గమునందు అస్వాదంబును (రుచియు) కృత్యంబులునుమారుట ప్రత్యక్షముగ తెలిసినదియే. అట్టిరససంసర్గములు పారములేకుండునుకావున దానివలన రసము లసంఖ్యాకములగునన్నచో "పరస్పరసంసృష్ట......యత్వం భవతి" అనువాక్యముచే సిద్ధాంతము చెప్పబడుచున్నది.

అనేకరససంసర్గమునందు అట్టిసంసర్గభేదము లనేకములుగ నున్నను, మధురాదిరసాభినిర్వృత్తివలన (ద్రవ్యములయం దనేకరసవ్యాప్తివలన), రసములకు సంబంధించిన గుణములకైనను, అట్టిరసకృత్యములకైనను అసంఖ్యేయత్వము కల్గనేరదు. (మధురాదిరసములు పరస్పరసంసర్గముకల్గి ఘృతక్షీరాదిద్రవ్యములయందు వ్యాపించియుండును. అట్టి పరస్పరసంసర్గమాత్రముననే మధురాదులకు సంబంధించినగుణములును, వానికృత్యములును అసంఖ్యేయములగుటలేదు. రసములకు వేరువేరుగ నిర్ణీతములైన మాధుర్యాదిగుణంబులును ధాతువర్ధనాదికృత్యంబులును మిశ్రములగునుకాని వానికి స్వాభావికములగుగుణంబులును కృత్యంబులును స్వరూపముచే మారుటలేదు. (మధురఅమ్లరసములు కలిసినప్పుడు మధురరసమునకును అమ్లరసమునకు వేరువేరుగ చెప్పినగుణములును కృత్యములును మిశ్రములుగనుండునుకాని, అంతమాత్రముచేత మధురరసమునకైనను అమ్లరసమునకైనను వేరొండుకృత్యములును గుణములును క్రొత్తగ కల్గదనుట). వాతాదిదోషములుమూడును పరస్పరసంసర్గము కల్గినప్పుడు వానికృత్యములు మున్నగునవి మారినను, సంసర్గకృతభేదము లనేకములుగనున్నను, ప్రకృతిభూతములైన వాతపిత్తకఫములకన్న నతిరిక్తము లగుటలేదుకదా? అత్తెరంగుననే రసములకు పరస్పరసంసర్గముచే వానిగుణాదులు సంసృష్టములైనను వానికి ప్రత్యేకముగ నిర్ణీతములైన గుణాదులు మారుటలేదు. సంసర్గభేదము లనేకములుగ నున్నను ప్రకృతిభూతములైన మధురాదిషడ్రసములు మారుటలేదు. కావున సంసర్గభేదముచే రసానంత్యమును చెప్పుట సమంజసము కానేరదని సిద్ధాంతము).

పైజెప్పినరీతిగ రససంసర్గమునం జేసి వానిగుణములకును కృత్యములకును మిశ్రీభావము కల్గునుకావున పరస్పరమిశ్రములైన రసములకు గుణములను కృత్యములను ప్రత్యేకముగ నేశాస్త్రకర్తలును చెప్పియుండలేదు. రససంసర్గమున వానికి నియతములగుగుణములు కృత్యములుగాక వేరొండు క్రొత్తగుణములును కృత్యములును లేని

కారణమువలన పరస్పరసంసర్గములేక వేరువేరుగనుండు మధురాదిషడ్రసములకును ఒక్కొక్కదానికిని ప్రత్యేకలక్షణములను, పరస్పరభేదములను "తత్ర మధురో రసః" ఇత్యాదిగ్రంథముచేత నుపదేశించెదమని భావము.

ద్రవ్యభేదనిరూపణప్రతిజ్ఞ.

మూ. అగ్రే తు తావత్ ద్రవ్యభేదమభిప్రేత్య కిఞ్చిదభిధాస్యామః.

వ్యా. రసముల నిరూపించుటకు ముందుగ ద్రవ్యభేదములనుద్దేశించి కొంచెముగ (ఆయుర్వేదోపయుక్తమాత్రముగ) చెప్పెదనని యర్థము. (రసములవివరించుట యుద్దేశక్రమప్రాప్తమైనను ద్రవ్యపరిజ్ఞానములేక రసజ్ఞానము జనింపదు కావున తొలుత ద్రవ్యభేదములుచెప్పబడును. అందును కేవలము ఆయుర్వేదోపయుక్తద్రవ్యభేదములమాత్రము చెప్పబడునని 'కించిత్' అనుపదము సూచించును.

పాంచభౌతికద్రవ్యభేదములు, గుణాదులు.

మూ. సర్వం ద్రవ్యం పాఞ్చభౌతికం అస్మిన్నర్థే; తచ్చేతనావదచేతనం చ. తస్య గుణాశ్శబ్దాదయో గుర్వాదయశ్చ ద్రవాన్తాః, కర్మ పఞ్చవిధముక్తం వమనాది. ౨౩

వ్యా. (పృథివి, అప్పు (జలము), తేజస్సు (అగ్ని), వాయువు, ఆకాశము అనునవి పంచమహాభూతములు) ఈయాయుర్వేదోపయోగ్యములైన సకలద్రవ్యములును పృథివ్యాదిపంచభూతాత్మకములై యుండును. అయ్యది చేతనావంతమును చేతనారహితంబునై రెండువిధములుగనుండును. అట్టిద్రవ్యములకు పంచభూతములకును నైసర్గికములైన శబ్దస్పర్శరూపరసగంధములను నైదుగుణంబులును, గురుమందాదిద్రవాంతములుగ జెప్పబడినయిరువదియు అట్టిపంచభూతాత్మకద్రవ్యమునకు గుణములైయుండును. అపామార్గతండులీయాధ్యాయమున జెప్పిన వమనవిరేచన ఆస్థాపనవస్తినస్యకర్మములైదును ద్రవ్యమునకు సంబంధించిన పంచకర్మములు.

ఇచ్చట "అస్మిన్నర్థే" అని చెప్పుటచేత ద్రవ్యము పంచభూతాత్మకమను సిద్ధాంతము ఈయాయుర్వేదమునందు మాత్రము చెప్పబడినదికాని నైయాయికాదిమతమున పంచభూతాత్మకమనుసిద్ధాంతము లేదని భావము. "కర్మ పంచవిధం" అనునది యుపలక్షణముకావున బృంహణాదికర్మలును ద్రవ్యమునకుసంబంధించినవని యెరుంగునది.

## పాంచభౌతికద్రవ్యప్రత్యేకలక్షణములు, అందు పార్థివద్రవ్య లక్షణము (గుణములు) కృత్యములును.

మూ. తత్ర ద్రవ్యాణి గురు-ఖర-కఠిన-మన్ద-స్థిర-విశద-సాన్ద్ర-స్థూల-గన్ధగుణబహుళాని పార్థివాని. తాన్యుపచయసఙ్ఘాత గౌరవస్థైర్యకరాణి. ౨౪

వ్యా. అట్టిపాంచభౌతికద్రవ్యములలో గురుత్వము (బరువు) కర్కశత్వము, కాఠిన్యము, మందత్వము, స్థిరత్వము, విశదత్వము, సాంద్రత్వము (దట్టముగనుండుట), స్థూలము (లావు), గంధము అనుగుణములు అధికముగగలద్రవ్యములు పార్థివములు (పృథివికి సంబంధించినద్రవ్యములు). అయ్యవి ఉపచయమును (వృద్ధిని), సంఘాతమును (కాఠిన్యమును), గౌరవమును (బరువును) స్థైర్యమును (చంచలతలేక స్థిరముగనుండుటను) కల్గించును.

ఇచ్చట 'బహుళాని' అనుపదము గురుఖరాదిశబ్దములతో ప్రత్యేకము సంబంధించి యన్వయించుటచేత గురుఖరాదిగుణము లధికముగగల్గినద్రవ్యములు పార్థివములని యర్థము. లేక గంధశబ్దముతోమాత్రమన్వయించి గుర్వాదిగుణములు సామాన్యముగ నుండి పృథివికి ప్రధానమైనగంధగుణముమాత్ర మధికముగ నుండునది పార్థివద్రవ్యమని యర్థముచేసినను సంగతముగనుండును. పృథివికి గంధంబును, జలమునకురసంబును, అగ్నికి రూపంబును, వాయువునకుస్పర్శంబును, ఆకాశమునకు శబ్దంబును నైసర్గికములగు ప్రధానగుణములుకావున ఆయాభూతమునకు సంబంధించిన ప్రధానగుణము అధికముగ గల ద్రవ్యము ఆయాభూతమునకు సంబంధించినదియనిచెప్పుట సమంజసముకావున గంధగుణబహుళమైనది పార్థివద్రవ్యమని చెప్పుట యుక్తము. ఈయుద్దేశముచేతనే "గురు ఖర...గన్ధగుణబహుళాని" అని తంత్రకారుడు ప్రధానమైనగంధగుణమును బహుళపదమునకు చేరినట్లు నిర్దేశించెను. ఇత్తెరంగుననే ఆప్యాదిద్రవ్యలక్షణములయందును అన్వయించునది. (ద్రవ్యములన్నియు పంచభూతమయములైనను ప్రధానగుణాతిరేకమును బట్టి పార్థివాదిభేదములు కల్గియుండునని భావము.)

## ఆప్యద్రవ్యలక్షణము (గుణములు) కృత్యములు.

మూ. ద్రవ-స్నిగ్ధ-శీత-మన్ద-మృదు-పిచ్ఛిల-సర-రసగుణబహుళాని ఆప్యాని. తాన్యుపక్లేదస్నేహబన్ధనవిష్యన్దమార్దవప్రహ్లాదకరాణి. ౨౫

వ్యా. ద్రవము, స్నిగ్ధము (జిడ్డు), శీతము (చల్లదనము), మందత్వము, మృదుత్వము (మెత్తన), పిచ్ఛిలము (జిగటగనుండుట), సరము (వ్యాపించుస్వభావము), రసము (మధురాదిరసాభివ్యక్తికి కారణమై యవ్యక్తమైనరుచి) ఈగుణములు కల్గి అందు జలమునకు ప్రధానమైనరసగుణము అధికముగకల్గినద్రవ్యములు ఆప్యములు (జలాత్మకములు). ఆయ్యవి తడిని జిడ్డును కల్గించును. వేరువేరుగనుండుదాని నతుకజేయును, స్రవింపజేయును, మృదుత్వమును సంతోషమును కల్గించును.

## ఆగ్నేయద్రవ్యలక్షణము (గుణములు) కృత్యములును.

మూ. ఉష్ణ-తీక్ష్ణ-సూక్ష్మ-లఘు-రూక్ష-విశద-రూపగుణబహుళాని ఆగ్నేయాని; తాని దాహ-పాక-ప్రభా-ప్రకాశ-వర్ణకరాణి. ౨౬

వ్యా. ఉష్ణము (వేడి), తీక్ష్ణత్వము, సూక్ష్మత్వము, లఘుత్వము (తేలిక), రూక్షత్వము (జిడ్డులేక గరగరలాడుచుండుట), విశదత్వము (విరళముగనుండుట), రూపము అనునీగుణములు అధికములుగ కల్గినవి యాగ్నేయ (అగ్నిసంబంధమైన) ద్రవ్యములు. అందు అగ్నికి ప్రధానమైన రూపమనుగుణము మిక్కిలి యధికముగ నుండును. అట్టి యాగ్నేయద్రవ్యములు మంటబుట్టించును. పుండుచేయును. (లేక ఆహారాదిపదార్థముల జీర్ణింపజేయును). ప్రభను ప్రకాశమును కల్గించును. నీలపీతాదివర్ణముల గల్గించును.

ఇచ్చట సూక్ష్మత్వమన మిక్కిలి సన్ననిరంధ్రములయందును ప్రవేశించి యనుసరించియుండుగుణము. నీలపీతాదివర్ణముల దెలుపునట్టికాంతివిశేషము ప్రభ. స్పష్టముగ వ్యాపించు కాంతివిశేషము ప్రకాశము. ఈవిషయము "వర్ణమాక్రామతి చ్ఛాయా ప్రభా వర్ణప్రకాశినీ" యని తంత్రాంతరవాక్యముచే దెలిసెడి.

## వాయవ్యద్రవ్యలక్షణము (గుణములు) కృత్యములును.

మూ. లఘు-శీత-రూక్ష-ఖర-విశద-సూక్ష్మ-స్పర్శగుణబహుళాని వాయవ్యాని; తాని రౌక్ష్య-గ్లాని-విచార-వైశద్య-లాఘవకరాణి ౨౭

వ్యా. లాఘవము (తేలిక), శీతత్వము (చల్లదనము), రూక్షత్వము (జిడ్డులేనిది), ఖరత్వము (మరమరలాడుచుండుట), విశదత్వము, స్పర్శము అనునీగుణములు అధికముగ కల్గినది వాయవ్య (వాయ్వాత్మకములైన) ద్రవ్యములు. అయ్యవి రూక్షతను, గ్లానిని (వాడుటను), విచారమును (చలనమును), వైశద్యమును (ఒకటిగ చేరియుండుదానిని వేరువేరుగ జేయుట), లాఘవమును జేయును.

## ఆకాశాత్మకద్రవ్యలక్షణము (గుణములు) కృత్యములు.

మూ. మృదు-లఘు-సూక్ష్మ-శ్లక్ష్ణ-శబ్దగుణబహుళాని ఆకాశాత్మకాని; తాని మార్దవసౌషిర్యలాఘవకరాణి. ౨౮

వ్యా. మార్దవము, లాఘవము, సూక్ష్మత్వము, శ్లక్ష్ణత్వము, శబ్దము అనుగుణములు విశేషముగ కల్గినవి యాకాశాత్మకద్రవ్యములు. అయ్యవి మృదుత్వమును, సౌషిర్యమును (రంధ్రములను, బయలును), లాఘవమును కల్గించును.

ఇచ్చట శ్లక్ష్ణత్వమన ఘనమైనవస్తువులయందును లోపలను వ్యాపించు గుణవిశేషమని యెరుంగునది. 'శ్లిష ఆలింగనే' అనుధాతువువలన "శ్లిష్యతే (మహద్వస్తుషు) ఇతి శ్లక్ష్ణం" అనురూపముచే నీయర్థము సిద్ధము.

మరియు మృదాదిగుణములకన్న నాకాశమునకు ప్రధానమైనశబ్దగుణ మధికముగనుండునని యర్థము. పార్థివాదిద్రవ్యములయందును ఆకాశము వ్యాపించియున్నను వానికంటె నధికముగ నాకాశముగలద్రవ్యము ఆకాశాత్మకమని యెరుంగునది.

సకలద్రవ్యములకు ఔషధత్వనిర్ణయము, కర్మాదులస్వరూపము.

మూ. అనేనోపదేశేన న అనౌషధిభూతం జగతి కిఞ్చిద్ద్రవ్యముపలభ్యతే; తాం తాం యుక్తిమర్థం చ తంతమభిప్రేత్య, న చ గుణప్రభావాదేవ కార్ముకాణి భవన్తి; ద్రవ్యాణి హి ద్రవ్యప్రభావాత్, గుణప్రభావాత్, ద్రవ్యగుణప్రభావాచ్చ తస్మిఀస్తస్మిఀ కాలే తత్తదధిష్ఠానమాసాద్య; తాం తాం యుక్తిమర్థం చ తం తమభిప్రేత్య యత్కుర్వన్తి, తత్కర్మ, యేన కుర్వన్తి తద్వీర్యం,యత్ర కుర్వన్తి తదధికరణం,యదా కుర్వన్తి, స కాలః, యథా కుర్వన్తి స ఉపాయః, యత్సాధయన్తి తత్ఫలం.

వ్యా. పైజెప్పినరీతిగ పార్థివాదిద్రవ్యములకు వేరువేరుగ గుణముల నుపదేశించుటచేత లోకమునంగలద్రవ్యములలో నేకదేశమైనను ఔషధము కానిద్రవ్యముకానరాదు. అట్టిపాంచభౌతికద్రవ్యములన్నియుం అయాయుక్తిని (ఉపాయమును) అయాప్రయోజనము నపేక్షించి తత్తదనుసారముగ నుపయోగింపబడినచో నన్నిద్రవ్యములును ఔషధములే యగును కాని ఔషధముకానిది యొక్కటైనను ండదని భావము (కొన్నిరోగవిశేషములయందు కొన్నివిధములైనఫలముల నుద్దేశించి తత్తదనుగుణముగ శరీరసంబంధమును విధ్యుక్తముగకల్పించి యుపయోగించినచో నొక్కద్రవ్యమైనయౌషధము కాకపోదని భావము. సంయోగసంస్కారాదులచే విరుద్ధములైన క్షీరమత్స్యాదులు ఔషధము కాకున్నను అట్టివిరుద్ధసంయోగాదుల జేయక యుక్తియుక్తముగ నుపయోగించునెడ నౌషధమే యగును.ఈయభిప్రాయముచేతనే "తాం తాం యుక్తిం,అర్థం చ తంతమభిప్రేత్య"

అని చెప్పబడెను. యుక్తిదూరమైననాడు అన్నిద్రవ్యములు విరుద్ధములే యగును. యుక్తి యుక్తమైనచో విషము కూడ నుదరాదివ్యాధులయందు ఔషధమే యగును. కావున ఆయావ్యాధి ననుసరించి తత్తదనుగుణముగ ద్రవ్యము నుపయోగించినయెడ అన్నియు నౌషధమే యగునని నిష్కృష్టార్థము).

మరియు ద్రవ్యములు పైజెప్పినరీతిగ నాయాద్రవ్యమునకు నియతములైనగుణములయొక్క ప్రభావమాత్రముచేతనే వానివానికి నియమింపబడినకర్మముల జేయనోపవు. మరి యేమన; అట్టిద్రవ్యములలో కొన్ని తమయందలిప్రభావముచేతను; కొన్ని తమకు నియతములైనగుణములయొక్క ప్రభావముచేతను,మరికొన్ని ద్రవ్యములయొక్కయు గుణములయొక్కయు (రెండిటియొక్క) ప్రభావముచేతను తనకు నియతములైన కృత్యముల జేయును. (కాని కేవలము గుణముయొక్క ప్రభావముచేత నేకార్యముల నెరవేర్పవనుట).

ద్రవ్యప్రభావాదుల కుదాహరణము:—నేపాళపుగింజలు కేవలము ద్రవ్యముయొక్కప్రభావముచేతనే విరేచనకరములగును. మణులు స్వభావముచేతనే (గుణాదుల నపేక్షింపక) విషమునుహరించును. (ఇది ద్రవ్యప్రభావకృత్యము).తిక్తరసము జ్వరమును హరించును. (ఇయ్యది ద్రవ్యమునందలి రసకృత్యముకావున గుణప్రభావకృత్యము). స్వర్ణము పాలతో జేర్చి కాచిన నయ్యది గుణోత్తరమగును. పాల కట్టిగుణాధిక్యము బంగరుయొక్క స్వభావముచేతను గుణముల ప్రభావముచేతను కల్గును. (ఇది ద్రవ్యగుణములరెంటికి జేరినప్రభావకృత్యము).

మరియు వసంతాదులైన ఆయాకాలములయందు శిరస్సునకు నాయాస్థలముల (నధిష్ఠానముల)బొంది,తత్తదుచితమైన సంయోజనారూపమైనయుక్తినిఅనుసరించి,ఆయాప్రయోజనమున కనుగుణముగ నుపయోగింపబడిన పార్థివాదిద్రవ్యము, పైజెప్పినరీతిగ తనయందలి ప్రభావముచేతనైనను, తనకు నియతములైనగుణముల ప్రభావముచేనైనను, రెండిటిప్రభావముచేనైనను తనకు నియతమైనకృత్యమును జేయును.(కాలమును, శరీరావయవమును గమనించి, తత్తదనుగుణముగ నౌషధసంయోగమును తనకభిమతమైన ఫలానుగుణముగ విధ్యుక్తప్రకార ముపయోగించినయెడ, ద్రవ్యము తనయందలిప్రభావాదులచే తనకు నియమితములైన కృత్యముల జేయునుకాని వ్యతిరేకముగ నుపయోగించిననాడు స్వకృత్యమును జేయ నేరదనుట).

అట్టికృత్యము ద్రవ్యమునకు సంబంధించిన కర్మ యనబడును. అయ్యది యేశక్తిచే కర్మను జేయునో అట్టిసాధనము ద్రవ్యనిష్ఠమైన వీర్యమనబడును. ద్రవ్యము (ఔష

ధము)ఏస్థలమున జేరునో అయ్యది యధికరణము (ఔషధమున కాధారమనుట). ఎప్పుడు ఔషధప్రయోగము పనిచేయునో అది కాలము. పీడనమున్నగు నేయుపాయములచే నౌషధము పనిచేయునో అయ్యది యుపాయము (ఇదియే యుక్తి, యోజన), ఆయౌషధము దేనిని సాధించునో అయ్యది ఫలమునగును. (కావున నట్టికాలాదులగమనించి తత్తదనుసారముగ ద్రవ్యరూపమైనయౌషధము నుపయోగించినచో నయ్యది యథోక్తకృత్యమునుజేసి యారోగ్యరూపమైనఫలమును కల్గింప సమర్థమగుననిభావము).

ఇచ్చట 'యత్కుర్వన్తి తత్కర్మ' ఇది మున్నగువాక్యములచే కర్మాదులస్వరూపము బోధింపబడినది. వానిప్రత్యేకోదాహరణము లీక్రిందిరీతి నెరుంగునది:—శిరోవిరేచనద్రవ్యములు శిరోవిరేచనముజేయుట వానివానికర్మ. అట్టిద్రవ్యమునందలి శిరోవిరేచనకర్మమైనశక్తి వీర్యము. అయ్యది గుణమునకైనను ద్రవ్యమునకైనను సంబంధించియుండును. ఎచ్చటజేరి శిరోవిరేచనముజేయునో యాస్థలము ఔషధమున కధికరణము. అయ్యది శిరస్సు. శిరస్సుతప్ప వేరొకచోట నుపయోగించినచో శిరోవిరేచనము కాజాలదు. శిరోభారముకల్గియున్నపుడు వసంతాదికాలమున శిరోవిరేచనమునకు యుక్తమైన కాలము. ఇతరకాలమున శిరోవిరేచనము నుపయోగించినచో పనిచేయదు. శిరోవిరేచన కృత్యముజేయుటకు దగినయుపాయము (ఔషధయోజనాపద్ధతి) యుక్తి. ఇయ్యది నస్యకర్మయందు "ప్రసారితాంగముత్తానం శయనే సంస్తరావృతే, ఈషత్ప్రలంబశిరసం సంవేశ్యంచావృతేక్షణమ్" అనిచెప్పబడినది. నస్యకర్మజేయుటకుముందు శరీరమర్దనాదుల జేసి శయ్యపై రోగిని చక్కగబరుండనిచ్చి కొంచెముగ శిరస్సువ్రేలాడవేసి కన్నులమూసి నస్యమును నాసారంధ్రముల ప్రయోగించవలెనని యర్థము. ఈవిధానమే యుక్తి యనబడును. తలభారము నొప్పి మున్నగునవి శమించుట దానగల్గుఫలము. ఫలమనగ "యదుద్దేశేన క్రియాప్రవృత్తిరవగతా, తత్సిద్ధిః ఫలం"అనునిబంధనప్రకారము దేనినపేక్షించి క్రియజేయబడునో అట్టియుద్దేశము ఫలము. యాగాదులు స్వర్గాదుల నుద్దేశించి చేయబడునుకావున యాగములకు స్వర్గము ఫలమగును. ఇచ్చట శిరోభారనివృత్తి నుద్దేశించి నస్యకర్మచేయబడునుకావున అది నివృత్తించుటయే దానిఫలము. ఇత్తెరంగుననే వమనాది కర్మములకును ఊహించునది. (ఇత్తెరంగున ద్రవ్యభేదములు వానిగుణకర్మములబట్టి నిరూపింపబడినవి.)

రసకారణములు, రససంసర్గభేదముచే గల్గువికల్పములు అరువదిమూడు.

మూ. భేదశ్చైషాంత్రిషష్టివిధవికల్పో ద్రవ్య-దేశ-కాల-ప్రభావాత్ భవతి; తముపదేక్ష్యామః. 30

వ్యా. "షడేవ రసాః ఇత్యువాచ భగవానాత్రేయః" అను వాక్యముచేత సిద్ధాంతము చేయబడినరసము లారును ద్రవ్యముయొక్క ప్రభావముచేతను, దేశముయొక్క ప్రభావముచేతను, కాలముయొక్క ప్రభావముచేతను మధురాదిభేదములుగ నుండును. అట్టియారురసములును అరువదిమూడుభేదములు కల్గియుండును. అట్టిభేదము లీక్రింద నుపదేశింపబడును. (ఇచ్చట 'ప్రభావాత్' అనుపదము ద్రవ్యదేశకాల అనుమూడిటితో ప్రత్యేకముగ సంబంధించి యన్వయించవలెను.)

అందు 'సోమగుణాతిరేకాన్మధురః' ఇది మున్నగువాక్యములచే ద్రవ్యప్రభావంబును, "హిమవతి ద్రాక్షాదాడిమాదీని మధురాణి భవన్తి, అన్యత్రఅమ్లాని" అనువాక్యములచే దేశప్రభావంబును; "బాలామ్రం సకషాయం, తరుణమమ్లం, పక్వం మధురం" "ఓషధ్యో మధురాః వర్షాస్వమ్లాః" ఇవి మున్నగువాక్యములచే కాలప్రభావంబును చెప్పబడును (అట్టి ద్రవ్య - దేశ - కాలములప్రభావముచేత నారువిధములుగ భేదములుకల మధురాదిరసములకు (సంసర్గభేదముచేత) నరువదిమూడువిధములుగనైన వికల్పములు ఈక్రింద నుపదేశింపబడునని భావము.)

## రసద్వయసంసర్గభేదములు పదునైదు.

మూ॥ స్వాదురమ్లాదిభిర్యోగం శేషైరమ్లాదయఃపృథక్,
యాన్తి పఞ్చదశైతాని ద్రవ్యాణి ద్విరసాని తు. ౩౧

వ్యా. మధురరసము తక్కిన అమ్ల - లవణ - కటు - తిక్త-కషాయములను నైదు రసములతో వేరువేరుగ జేరును. తక్కిన అమ్లాదిరసములతో నొక్కొకటియు నితరములైనరసములలో నొక్కొకటితో మధురరసమునుబోలె కలియును. అట్టిభేదములన్నియుం కలిసి పదునైదువిధములగును. ఇది రసద్వయసంసర్గభేదములు.

దీనివివరణము.—మధురరసము తక్కిన యైదురసములలో నొక్కొకదానితో కలిసి మధురామ్లము, మధురలవణము, మధురకటుకము, మధురతిక్తము, మధురకషాయమునని యైదువిధములుగ వికల్పమునొందును.

ఈరీతిగనే అమ్లరసము తక్కినరసములతో నొక్కొకదానితోగలిసి అమ్లలవణము, అమ్లకటుకము, అమ్లతిక్తము, అమ్లకషాయము నని నాల్గుతెరంగులగును.

లవణరసము తక్కినవానితోగూడి లవణకటుకము, లవణతిక్తము, లవణకషాయము నని నాల్గువిధములగును.

కటురసము తక్కినవానితో గలిసి కటుతిక్తము, కటుకషాయము నని రెండు విధములగు తిక్తరసము కషాయరసముతోఁగూడి తిక్తకషాయమని యొక్కవిధముగనే యుండును. ఇవియన్నియు కలిసి రసద్వయసంసర్గమున గలభేదములు పదునైదుగనగును.

రసత్రయసంసర్గభేదము లిరువది.

మూ. పృథగమ్లాదియుక్తస్య యోగః శేషైః పృథగ్భవేత్;
మధురస్య, తథామ్లస్య, లవణస్య, కటో స్తథా. 3౨
త్రిరసాని యథాసంఖ్యం ద్రవ్యాణ్యుక్తాని వింశతిః,

వ్యా. మధురరసము తక్కినరసము లైదిటిలో నొక్కొకదానితో గలియుచు తక్కినరసములలో నొక్కొకదానితో వేరువేరుగ జేరును. (మధురము అమ్లముతోఁజేరి తక్కినలవణాదులలో నొక్కొకదానితో కలియును. మధురలవణములు కలిసి తక్కిన మూటితో వేరువేరుగ జేరును. ఇత్తెరంగుననే మధురతిక్తములును, మధురకటుకములును కలిసి వేరొండుదానితోఁజేరును). ఇత్తెరంగుననే అమ్ల-లవణ-కటు-రసములు ఒక్కొకటితో గూడి రెండునుగూడి యింకొకదానితోఁగూడును. ఇవి త్రిరసభేదములు ఇరువది యగును.

త్రిరససంసర్గముల కిరువదిటికిని వివరణము:—మధురరసము అమ్లాదిరసములలో నొక్కొకదానితోఁగూడి తక్కిన లవణాదుల నాల్గిటిలో నొక్కొకదానితో గలియును. అందు అమ్లరసయుక్తమైన మధురరసము తక్కినవానితోఁగూడి మధురామ్లలవణము, మధురామ్లకటుకము, మధురామ్లతిక్తము, మధురామ్లకషాయమునని నాల్గువిధములగును. లవణరసయుక్తమయిన మధురరసము తక్కిన కటు-తిక్త-కషాయములతో వేరువేరుగ గూడి మధురలవణకటుకము, మధురలవణతిక్తము, మధురలవణకషాయము ననిమూడు విధములగును. కటురసముతోఁగూడిన మధురరసము తిక్తకషాయములతో వేరువేరుగ గలియుటచే మధురకటుతిక్తము, మధురకటుకషాయము నని రెండువిధములు. తిక్తరసముతోఁగూడిన మధురరసము కషాయముతోఁగూడి మధురతిక్తకషాయమని యొకవిధమగును.

మధురరసమునుబోలె నమ్లరసము తక్కిన లవణాదిరసములలో నొక్కొకదానితో గలిసి, కటుకతిక్తకషాయములతో వేరువేరుగ గలియుటచే నమ్లలవణ కటుకంబును, అమ్లలవణ తిక్తంబును, అమ్లలవణకషాయంబు నని మూడుభేదములు కల్గియుండును. అమ్లరసము కటురసముతోఁగూడి తిక్తకషాయరసముతో వేరువేరుగ కలియుటచే నమ్లకటు తిక్తము, అమ్లకటుకషాయము నని రెండువిధములు. తిక్తరసయుక్తమైన అమ్లరసము కషాయరసముతోఁగూడి అమ్లతిక్తకషాయమునని యొకవిధమగును.

లవణరసము కటుకముతోఁగూడి తిక్తకషాయములతో వేరువేరుగ గలియుటచే లవణకటుతిక్తము, లవణకటు కషాయమునని రెండువిధములగును. తిక్తరసముతోఁ కలిసిన లవణరసము కషాయరసముతో గూడినయెడ లవణతిక్తకషాయమని యొకవిధము.

కటురసము తిక్తరసముతోఁ గూడి కషాయరసముతోఁ గలిసినయెడ కటుతిక్త కషాయమని యొకటి.

ఇవియన్నియు కలిసి త్రిరససంసర్గముచే గల్గిన వికల్ప భేదములు ఇరువదియగును.

{ నాల్గురసముల సంసర్గముచేగల్గు ద్రవ్య భేదములు పదునైదు అట్టిభేదములవివరణము. }

మూ. వక్ష్యన్తే తు చతుష్కేణ ద్రవ్యాణి దశ పఞ్చ చ. 33
స్వాద్వమ్లౌ సహితౌ యోగం లవణాద్యైః పృథగ్గతౌ,
యోగం శేషైః పృథగ్యాతః చతుష్కరససంఖ్యయా 34

వ్యా. నాల్గురసముల సంసర్గముచే గల్గు ద్రవ్యభేదములు పదునైదును ఈక్రింద వివరింపబడును:—మధుర-అమ్లరసములు రెండును ఒకటిగ కలిసి, తక్కిన లవణ-కటు-తిక్త-కషాయరసములలోఁ నొక్కొకదానితో వేరువేరుగ జేరుచు తక్కిన కటుతిక్తకషాయములలోఁ నొక్కొకదానితో వరుసగ కలియును. అట్లైన నాల్గురసముల సంసర్గమేర్పడును. (అట్టిభేదము లారు.)

దీనివివరణము:—మధురామ్లరసములు రెండును కలిసి, లవణరసముతోఁ గూడి, కటుక-తిక్త-కషాయములలోఁ నొక్కొకదానితో జేరిన మధురామ్లలవణకటుకంబును, మధురామ్లలవణతిక్తంబును, మధురామ్లలవణకషాయంబును నగును.

మరియు మధురామ్లములు రెండును లవణరసమును విడచి, కటురసముతో గూడి, యీమూడును తిక్తకషాయములరెండిటితో వేరువేరుగ కలియుటచే మధురామ్లకటు తిక్తంబును, మధురామ్లకటు కషాయంబును నగును.

మధురామ్లములు రెండును తిక్తరసమున కలిసి కషాయరసముతోఁ జేరి మధురామ్ల తిక్తకషాయమగును. (ఇవి యారును మధురామ్లములు తక్కినవానితోఁ కలియు క్రమము ననుసరించిన భేదములు.) (౬)

మూ. సహితౌ స్వాదులవణౌ తద్వత్కట్వాదిభిః పృథక్,
యుక్తౌ, శేషైః పృథగ్యోగం యాతః; స్వాదూషణౌ తథా. 35

వ్యా. మధురలవణములు (అమ్లమును వదలి) రెండును జేరి శక్కిన కటు-తిక్త-కషాయరసముల మూటిలో నొక్కొకదానితో కలియుచు, శేషించిన తిక్తకషాయకటు రసములతో వేరువేరుగ జేరును. (అట్టి భేదములు మూడు).

మధురలవణములు రెండును కటురసముతో కలిసి తిక్తరసముతో గూడినయెడ మధురలవణ, కటుతిక్తమును, కషాయరసముతో గూడినచో మధురలవణ కటుకషాయంబును నగును. మధురలవణములు గూడి తిక్తరసముతో చేరి, కషాయరసమున కలిసిన మధురలవణతిక్తకషాయమగును. ఇవి మూడు భేదములు.(3)

మరియు మధురకటురసములు (లవణమును వదిలి) కలిసి తిక్తకషాయములతో జేరిన మధురకటుతిక్తకషాయమగును. (౧)

ఈపదియును మధురరసముతో సంబంధముకల్గిన రసచతుష్కసంసర్గ భేదములు.

**మూ.** కట్వాద్యైరమ్లలవణౌ సంయుక్తౌ సహితౌ పృథక్,
యాతః శేషైః పృథగ్యోగం; శేషైరమ్లకటూ తథా. 3౬
యుజ్యతే తు కషాయేణ స తిక్తౌ లవణోషణౌ,

వ్యా. నాల్గురసముల సంసర్గములో మధురరసముతో సంబంధములేక నాల్గేసి రసముల సంసర్గ భేదములు ఐదు—అమ్లలవణరసములు రెండును కలిసి తక్కిన కటుతిక్త కషాయములతో వేరువేరుగ గలియుచు, శేషించిన తిక్తకషాయ కటురసములలో వరుసగ నొక్కొకదానితో గూడును. అట్టిసంసర్గ భేదములు ఐదువిధములగును.

వివరణము:—అమ్లలవణములుకలిసి, కటురసముతో కూడి, తిక్తకషాయములతో వేరువేర జేరిన అమ్లలవణకటుతిక్తము, అమ్లలవణకటుకషాయము నగును. అమ్లలవణములు తిక్తకషాయములతోగూడి అమ్లలవణతిక్తకషాయమగును.

మరియు అమ్లకటురసములు (లవణమును వదలి) తక్కిన తిక్తకషాయములతో గలిసి అమ్లకటుతిక్తకషాయమగును

మరియు మధురామ్లముల వదలి లవణకటురసములు తిక్తరసముతోగూడి కషాయరసముతో కలిసినయెడ, లవణకటుతిక్తకషాయమునని యగును. (ఇవి యైదును, పైజెప్పిన మధురరససంసర్గముతోజేరిన పదిసంసర్గ భేదములును జేరి నాల్గురసముల సంసర్గ భేదములచే పదునైదువిధముల భేదములు కల్గియుండునని భావము).

(ఇచ్చట 'యాతః' అనుపదము "యా ప్రాపణే" అనుధాతువునకు లట్ ప్రథమపురుషద్వివచనరూపమని యెరుంగునది).

పంచరస సంసర్గ భేదములారు, ఏకైకరసములారు, షడ్రససంసర్గ మొకటియు.

మూ. షట్ తు పఞ్చరసాన్యాహుః ఏకైకస్యాపమార్జనాత్. 32
షట్ చైవైకరసాని స్యుః ఏకం షడ్రసమేవ తు,

వ్యా. మధురాది షడ్రసములలో నొక్కొక్కరసమును వదలుచు తక్కినరసములను గూర్చుకొనిన పంచరససంసర్గ మేర్పడును. అయ్యవి యాఱువిధములగును.

వివరణము:—మధురరసమును వదలి తక్కినరసములు చేరినయెడ - అమ్లలవణ కటుతిక్తకషాయము, అమ్లమును వదలిన-మధురలవణ కటుతిక్తకషాయము, లవణమును వదలిన-మధుర-అమ్ల-కటు-తిక్తకషాయము, కటువును వదలిన - మధుర అమ్ల లవణతిక్త కషాయము, తిక్తమును వదలిన - మధుర అమ్ల లవణ కటుకషాయము, కషాయమును వదలిన-మధుర అమ్ల లవణ కటుతిక్తము నని యాఱువిధములు.

మరియు ఏకరసభేదములు మధురము, అమ్లము, లవణము, కటువు, తిక్తము, కషాయమునని యాఱగును. షడ్రసములుకలిసిన సంసర్గము మధుర-అమ్ల-లవణ-కటు-తిక్తకషాయమని యొకేవిధమగును.

(ఇత్తెఱంగున ద్విరససంసర్గభేదములు (15) పదునైదును, త్రిరససంసర్గభేదములు (20) ఇరువదియు, చతూరససంసర్గభేదములు (15) పదునైదును, పంచరససంసర్గ భేదములు (6) ఆరును, ఏకరసభేదములు (6) ఆరును, షడ్రససంసర్గభేదము (1) ఒకటియు కలిసి (63) అరువదిమూడువిధములుగ రససంసర్గము లేర్పడును. అట్టిభేదములచే వానికి నాశ్రయములైన ద్రవ్యములును అరువదిమూడువిధము లగునని యెఱుంగునది). ఈసంఖ్యాపరిగణనమునే వాగ్భటాచార్యులు క్లుప్తముగ నిట్లు చెప్పెను.—"షట్ పఞ్చకాః, షట్చ పృథగ్రసాస్స్యుః, చతు-ర్ద్వికౌ పఞ్చదశప్రకారౌ భేదాస్త్రికాః వింశతిః, ఏకమేకం ద్రవ్యం షడాస్వాద, మితి త్రిషష్టిః."

మరియు రససంసర్గముల కుదాహరణమును అష్టాంగహృదయవ్యాఖ్యయగు సర్వాంగసుందరమున దశమాధ్యాయమున శ్లోకరూపమున నిట్లు చూపిరి:—"క్షీరం సురా బిడం నింబః చవ్యం పద్మం రసాశ్రయం, ద్రవ్యం స్వాదు రసాదీనాం షణ్ణాం విద్ధి యథాక్రమం. ద్రవ్యం ద్రవ్యాన్తరేణైవ యోజయే ద్ద్విరసాదిషు, ధాత్రీఫలం శర్కరయా లవణేనార్ద్రకం తథా. ఏవమాదీని ద్రవ్యాణి యోజయే ద్భిషగుత్తమః, కానిచిద్ద్విరసా

దీని ద్రవ్యాణి స్యుః స్వభావతః. యథైణ షడ్రసః కృష్టో యథా పంచరసాభయా, మద్యం పంచరసం యద్వత్ తిలోయద్వచ్చతూరసః. ఏరణ్డతైలం త్రిరసం మాక్షికం ద్విరసం యథా, ఘృతమేకం స్వాదురసం మధురాదివిభాగతః, దిఙ్మాత్రాదుదితా దేవం శేషమూహ్యాం మనీషిణా." (మధురరసమునకు క్షీరంబును, అమ్లరసమునకు సురయను మద్యంబును, లవణరసమునకు బిడాలవణంబును, తిక్తరసమునకు వేమును, కటురసమునకు చెవ్యంబును, కషాయరసమునకు తామరపువ్వును ఆశ్రయము లైయుండును.

ద్విరసాదిసంయోగమునందు ఒకరసముకల ద్రవ్యమును మరియొకరసముకల ద్రవ్యముతో జేర్చవలెను. ఎట్టులన:—ఉసిరికకాయలను చక్కెరతోడను, లవణముతో అల్లమును చేర్పవలెను ఇత్తెరంగుననే భిన్నరసద్రవ్యముల నొకటిగజేర్చినచో ద్విరస-త్రిరసాది భేదములు కలుగును. ఇది ద్రవ్యసంయోగముచే కల్గు ద్విరసాది భేదములు. అట్టి యనేకరసద్రవ్యసంయోగము లేకయే కేవల మొక్కొకద్రవ్యమునందే వస్తుస్వభావము చేత ద్విరసాదిసంసర్గము కల్గియుండును. ఎట్టులన:—

కృష్ణసారమృగ (చిత్రవర్ణపుజింక) మాంసము మధురాదిషడ్రసములును కల్గి యుండును. కరకకాయ చేదు వగరు మున్నగునైదురసములు కల్గియుండును. మద్యంబును పంచరసములు కల్గియుండును. నువ్వులు నాల్గురసములు కల్గియుండును. ఆముదము మూడురసములు కల్గియుండును. మాక్షికమను తేనె రెండు (తీపి, పులుపు) రసములు కల్గియుండును. నెయ్యి మధురరసము కల్గియుండును. ఇత్తెరంగున రసములు అనేక రసద్రవ్యసంయోగముచేతను, ద్రవ్యసంయోగము లేకున్నను ఒకేద్రవ్యమునందు ద్రవ్య స్వభావమునం జేసియు అనేకరసములు జేరియుండును. ఇత్తెరంగున మధురాది రసాశ్రయంబులును, రససంసర్గరూపంబును దిఙ్మాత్రముగ నుదాహరింపబడినది. తక్కిన వానినెల్ల నూహింపవలెనని భావము).

మరియుం నావ్యాఖ్యయందే రససంసర్గభేదముల యరువదిమూటి వివరణము శ్లోకరూపముగ "పద్యేన చ సుఖస్మృత్యై రసభేదాన్ శ్రుణుష్వ మే" అని యుపక్రమించి, "కషాయ ఇతి భేదాస్స్యుః సర్వతోఽత్ర త్రిషష్టిధా" అనునంతవరకు నిరువది నాల్గు శ్లోకములచే జెప్పబడినది. విస్తరభీతిచే నిట నుదహరింపబడదయ్యె.

అష్టాంగహృదయమున రసములవరుసలో మధుర-అమ్ల-లవణ-తిక్త-కటు-కషాయములని చెప్పబడినది. ప్రకృతతంత్రమున మధుర-అమ్ల-లవణ-కటు-తిక్త-కషాయములని చెప్పబడినది. ఇంతమాత్రమే భేదము.

## ద్వారస త్రిరసాదిసంసర్గముచే గల్గు రసభేదముల నరువదిమూడిటిని సులభముగ దెలియజేయుపట్టిక.

| సంఖ్య | సంయుక్తరసములు. | వివరణము. |
|---|---|---|
| | **ద్విరససంయోగభేదములు. 15.** | |
| 1 | మధురామ్లము. | ఒక్కొకరసముకల ద్రవ్యములు రెండేసి యొకటిగ జేరినచో రసద్వయసంసర్గ మేర్పడును. ఉసిరికకాయలు చక్కెర కలిసిన ద్విరసమగును. మరియు "పృథివీసోమగుణాతిరేకాన్మధురః" అను ౪౪-వ సూత్రమున జెప్పబడు రసవిశేషోత్పత్తికారణములలో రెండేసి కారణముల మిశ్రభావముచే గల్గిన యొక్కద్రవ్యమునందును, అట్టి రెండేసి రసముల సమ్మేళనము సంభవించును. అయ్యవి మాక్షికము మున్నగునవి ఇత్తెరంగుననే త్రిరసాదిసంయోగము నెరుంగునది. |
| 2 | మధురలవణము. | |
| 3 | మధురకటుకము. | |
| 4 | మధురతిక్తము. | |
| 5 | మధురకషాయము. | |
| 6 | అమ్లలవణము. | |
| 7 | అమ్లకటుకము. | |
| 8 | అమ్లతిక్తము. | |
| 9 | అమ్లకషాయము. | |
| 10 | లవణకటుకము. | |
| 11 | లవణతిక్తము. | |
| 12 | లవణకషాయము. | |
| 13 | కటుతిక్తము. | |
| 14 | కటుకషాయము. | |
| 15 | తిక్తకషాయము. | |
| | **త్రిరస సంసర్గభేదములు. 20.** | |
| 16 | మధురామ్లలవణము. | ఈపదియును మధురరసమునాదిగ కల త్రిరససంసర్గ భేదములు. ఆముదము మున్నగునవి త్రిరసద్రవ్యములు. |
| 17 | మధురామ్లకటుకము. | |
| 18 | మధురామ్లతిక్తము. | |
| 19 | మధురామ్లకషాయము. | |
| 20 | మధురలవణకటుకము. | |
| 21 | మధురలవణతిక్తము. | |
| 22 | మధురలవణకషాయము. | |
| 23 | మధురకటుతిక్తము. | |
| 24 | మధురకటుకషాయము. | |
| 25 | మధురతిక్తకషాయము. | |

| సంఖ్య | సంయుక్తరసములు. | వివరణము. |
|---|---|---|
| 26 | అమ్లలవణకటుకము. | ఈ యారును అమ్లరసము నాదిగకల త్రిరససంసర్గ భేదములు. |
| 27 | అమ్లలవణతిక్తము. | |
| 28 | అమ్లలవణకషాయము. | |
| 29 | అమ్లకటుతిక్తము. | |
| 30 | అమ్లకటుకషాయము. | |
| 31 | అమ్లతిక్తకషాయము. | |
| 32 | లవణకటుతిక్తము. | ఈమూడును లవణరసమునాదిగకల త్రిరససంసర్గ భేదము. |
| 33 | లవణకటుకషాయము. | |
| 34 | లవణతిక్తకషాయము. | |
| 35 | కటుతిక్తకషాయము. | కటురసము నాదిగకల త్రిరససంసర్గ భేదము. ఈ యిరువదియు త్రిరససంసర్గ భేదము. |

రసచతుష్క సంసర్గభేదములు. 15.

| సంఖ్య | సంయుక్తరసములు. | వివరణము. |
|---|---|---|
| 36 | మధురామ్లలవణకటుకము. | ఈపదియును మధురరసము నాదిగకల నాల్గురసముల సంసర్గ భేదములు. నువ్వులు మున్నగునవి చతూరసద్రవ్యములు. |
| 37 | మధురామ్లలవణతిక్తము. | |
| 38 | మధురామ్లలవణకషాయము. | |
| 39 | మధురామ్లకటుతిక్తము. | |
| 40 | మధురామ్లకటుకషాయము. | |
| 41 | మధురామ్లతిక్తకషాయము. | |
| 42 | మధురలవణకటుతిక్తము. | |
| 43 | మధురలవణకటుకషాయము. | |
| 44 | మధురలవణతిక్తకషాయము. | |
| 45 | మధురకటుతిక్తకషాయము. | |
| 46 | అమ్లలవణకటుతిక్తము. | ఈనాల్గును అమ్లరసము నాదిగకల నాల్గు రసముల సంసర్గ భేదములు. |
| 47 | అమ్లలవణకటుకషాయము. | |
| 48 | అమ్లలవణతిక్తకషాయము. | |
| 49 | అమ్లకటుతిక్తకషాయము. | |
| 50 | లవణకటుతిక్తకషాయము. | ఇదియొకటి లవణరసము నాదిగకల సంసర్గ భేదము. ఈపదునైదును రసచతుష్కసంసర్గ భేదములు. |

| సంఖ్య | సంయుక్తరసములు. | వివరణము. |
|---|---|---|
| | **పంచరస సంసర్గభేదములు. 6.** | |
| 51 | అమ్లలవణకటుతిక్తకషాయము. | మద్యము మున్నగునవి పంచరసములు. ఈ యేబదియూరు భేదములును, అరువది మూడవదియగు షడ్రససంయోగ భేదమును చేరి యేబదియేడును రససంయోగ భేదములు ఇవియే 'సంయోగాస్సప్తపంచాశత్' అని చెప్పబడినవి. |
| 52 | మధురలవణకటుతిక్తకషాయము. | |
| 53 | మధురామ్లకటుతిక్తకషాయము. | |
| 54 | మధురామ్లలవణతిక్తకషాయము. | |
| 55 | మధురామ్లలవణకటుకషాయము. | |
| 56 | మధురామ్లలవణకటుతిక్తము. | |
| | **ఏకరసభేదములు. 6.** | |
| 57 | మధురము. | ఈ యేకరసభేదము లారును తక్కిన యేబదియేడును చేరి అరువదిమూడును చికిత్సోపయుక్త కల్పనా భేదములు. ఇవియే "కల్పనాతు త్రిషష్టిధా రసానాం" అని చెప్పబడినది. |
| 58 | అమ్లము. | |
| 59 | లవణము. | |
| 60 | కటుకము. | |
| 61 | తిక్తము. | |
| 62 | కషాయము. | |
| | **షడ్రసముల సంసర్గభేద మొక్కటి. 1.** | |
| 63 | మధురామ్లలవణకటుతిక్తకషాయము. | పొడలయిఱ్ఱిమాంసము మున్నగునవి. |

ఇవి యన్నియుం కలిసి రససంసర్గ భేదములు అఱువది మూడగును.

## రససంసర్గ సంఖ్యాతీతత్వనిర్ణయము.

మూ. ఇతి త్రిషష్టిర్ద్రవ్యాణాం నిర్దిష్టా రససంఖ్యయా. 3౭
త్రిషష్టిస్స్యాత్త్వసంఖ్యేయా రసానురసకల్పనాత్,
రసాస్తరతమాభ్యస్తాః సంఖ్యామతిపతన్తి హి. 3౮

వ్యా. పైజెప్పిన రససంసర్గ భేదముచే నరువదిమూడువిధములైన రససంఖ్య ననుసరించి (అట్టి రసములకాశ్రయములైన) ద్రవ్యములకును అరువదిమూడు భేదములగును. మరియు నట్టి త్రిషష్టి (అరువదిమూడు) భేదములును, రసానురసకల్పనా భేదముల ననుసరించియు, రసములయొక్క తరతమ భేదములవలనను సంఖ్యాతీతములగును. (మధురము, మధురతరము, మధురతమము మున్నగు రసతారతమ్యవిభాగముచేత సంఖ్యాతీతములగునని భావము.)

మరియు రససంసర్గము ఏబదియేడువిధములు. తక్కినయారును ఏకరసభేదములు. కావున అనురసకల్పనము సంసర్గభేదములయందు మాత్రము సంగతమగును కావున త్రిషష్టివిధములైన రసభేదములలో యథాసంభవముగ రసానురసకల్పనము చేయదగునని భావము. లేక మధురాదిరసములలో నొక్కొకదానియందును అనురసము అస్ఫుటముగ నగపడకయుండును కావున 'త్రిషష్టిః' అని చెప్పినది సంగతమని యెరుంగునది. అనురస లక్షణము. "వ్యక్తశ్శుష్కస........సప్తమః"అనువాక్యముచే చెప్పబడును.

—౼ చికిత్సాయోగ్యమైన కల్పనాభేదనిర్ణయము. ౼—

మూ. సంయోగాస్సప్తపఞ్చాశత్ కల్పనా తు త్రిషష్టిధా,
రసానాం తత్ర యోగ్యత్వాత్ కల్పితా రసచిన్తకైః. ౪౦

వ్యా. పైజెప్పినరీతిగ ద్విరస త్రిరసాది సంయోగభేదములు ఏబదియేడు విధములుగ నేర్పడును. ఔషధకల్పనము మాత్రము ఏకైకరసము లారునుజేరి యరువది మూడువిధములుగ నగును. ఇట్టిపరికల్పనము స్వస్థపరిపాలనమునకు ఆతురపరిరక్షణమునకును హితమైన చికిత్సాప్రయోగవిషయమై రసపరిజ్ఞానము నెరింగిన ఋషులచే నిర్ణయింపబడినది. (పైజెప్పినరీతిగ తరతమాది భేదములచేతను, రసానురసపరికల్పనము చేతను, రసము లనంతములుగ నగుచున్నను, స్వస్థాతురహితమునకైన చికిత్సాప్రయోగ విషయముగ ఔషధపరికల్పనాపద్ధతి యరువదిమూడువిధములుగనే అతివిస్తృతంబును సంక్షిప్తంబును గాకుండునట్లు నిర్ణయింపబడినదని భావము.)

—౼ చికిత్సాప్రయోగోపయుక్త ద్విరసాదికల్పనావిధానము. ౼—

మూ. క్వచిదేకో రసః కల్ప్యః సంయుక్తాశ్చ రసాః క్వచిత్,
దోషౌషధాదీన్ సఞ్చిన్త్య భిషజా సిద్ధిమిచ్ఛతా. ౪౧
ద్రవ్యాణి ద్విరసాదీని సంయుక్తాంశ్చ రసాన్ బుధాః,
రసానేకైకశో వాపి కల్పయన్తి గదాన్ ప్రతి. ౪౨

వ్యా. చికిత్సాసిద్ధినికోరు వైద్యవరుడు చికిత్సాప్రయోగసమయమున వాతాది దోషములను ఔషధభేదములను ఆతురాదిబలము దేశకాలాదులనుచక్కగ నాలోచించి తత్తదనుగుణముగ నొకసమయమున నొక్కరసమును,ఒకసమయమున అనేకముగ కలిసిన సంయుక్తరసములను కల్పింపవలెను. అట్టికల్పనము ఒక్కొక్కరసముకల యనేకద్రవ్యముల నొకటిగ జేర్చియైనను, ద్విరస త్రిరస చతూరసాదిసంయోగము పుట్టుకతోడనే స్వభావసిద్ధముగ గల్గియుండు పెసలుమున్నగు నొక్కొక ద్రవ్యమునైనను జేర్చి కల్పింప

నగును. అట్టి ద్వీరస త్రిరసాది కల్పనమును, ఏకరసాదికల్పనమును దోషకాలాదుల గమనించి తత్తదనుగుణముగ కల్పింపవలెనని యర్థము. (అనేక రసకల్పనము ఏకైకరస ద్రవ్య సంయోగముచేనైనను, అనేకరసములుకల యొకద్రవ్యముచేనైనను కల్పింపవచ్చునని ముఖ్యభావము.) అట్టి ద్వీరసాది పరికల్పనము రోగముల నుద్దేశించి యుపయోగార్హమై యుండునని కొందరిమతమని గ్రంథకర్తయభిప్రాయము. కావుననే "కల్పయన్తి బుధాః" అని పరోక్షనిర్దేశము చేసిరి. ఇచ్చట "ద్రవ్యాణి హి రసాదీని" అనుపాఠము అసమంజసము. "ద్వీరసాదీని" అనునదియే సాధువు.

మరియు "సమసర్వరసం సాత్మ్యం సమధాతోః ప్రశస్యతే" అను ప్రమాణము చేత స్వస్థవృత్తమునందు సర్వరసాభ్యాసము సమముగ విధింపబడినది కావున ద్వీరస త్రిరసాదిపరికల్పనము ఆతురవిషయికమని తలచి "గదాన్ ప్రతి" యని తంత్రకారులు నిర్దేశించిరని తోచెడిని.

స్వతస్సిద్ధ ద్వీరసాది ద్రవ్యముల నుదాహరణము:—పెసలు కషాయ మధుర రసములు కల్గినవి కాన ద్వీరసము లగును. "మధురామ్ల కషాయం చ విష్టంభి గురుశీతలం, పిత్తశ్లేష్మహరం భవ్యం" అను ప్రమాణముచే భవ్యఫలము మధుర-అమ్ల-కషాయరసములు కల్గినదని తెలిసెడి. (తాటిపండువలెయుండి స్వనామఖ్యాతమైనది భవ్యఫలము.) ఇది త్రిరసము.

"స్నిగ్ధోష్ణమధురస్తిక్తః కషాయః కటుకస్తిలః" అను ప్రమాణముచే మధురతిక్త కటుకషాయరసములు కల్గినవి నువ్వులని తెలిసెడి. ఇది చతూరసద్రవ్యము. "శివా పఞ్చరసం" అను ప్రమాణముచేత కరకకాయలును, ఉసిరికకాయలును, మధురమొకటి దక్క తక్కినరసములైదును కల్గియుండునని తెలిసెడి. షడ్రససంయోగము అవ్యక్తముగ కల్గినది విషము. వ్యక్తముగ షడ్రససంయుక్తద్రవ్యము జింకమాంసమని హారీత సంహితయందు చెప్పబడినది.

### రసవికల్పజ్ఞానప్రయోజనము.

మూ. యస్స్యాద్రసవికల్పజ్ఞః స్యాచ్చ దోషవికల్పవిత్,
న చ ముహ్యేద్వికారాణాం హేతులిఙ్గోపశాన్తిషు. ౪౩

వ్యా. పైజెప్పబడినరీతిగ మధురాదిరసముల ద్వీరసాది వికల్పములను, పదునేడవ యధ్యాయమున జెప్పబడిన వాతాదిదోషముల సంసర్గాదివికల్పములను చక్కగ నెరింగినవైద్యుడు, ఆయారోగములు కల్గుటకు హేతువులను గమనించుటకును, ఆయారోగముల లక్షణములబట్టి రోగనిర్ణయముజేయుటకును, తత్తదుచితముగ చికిత్సజేయుటకును

ఒకప్పుడును పొరబడడు. (కావున రసవికల్పములను, దోషవికల్పములను, సమర్థకముగ దెలిసికొనుట వైద్యున కవశ్యకరణీయమని యర్థము.)

ఇచ్చట నీవివరణము నెఱుంగునది.—ద్రవ్యములకు సంబంధించిన గుణాదులన్నియుం రసాధీనములై యుండును కావున రసవికల్పపరిజ్ఞానముచేత ద్రవ్యస్వరూపజ్ఞానము కల్గును. అట్టిద్రవ్యములు అహితములైనయెడ వానిని సేవించుటచే (మిథ్యాహారాదులచే) రోగములు కల్గును కావున అట్టి ద్రవ్యపరిజ్ఞానము కల్గినవాడు రోగహేతువుల నరయుటకు వీలు కల్గును. కావున రోగహేతువుల నిర్ణయించుటయందు రసవికల్పజ్ఞానముకలవాడు పొరబడడు.

జ్వరాదిరోగముల లక్షణములు వాతాదిదోషములకు సంబంధించి యుండును; కావున దోషముల సంసర్గాదిభేదముల జక్కగ దెలిసినవైద్యుడు రోగలక్షణముల గమనించుటయందు పొరబడడు.

పైజెప్పినరీతిగ రసపరిజ్ఞానముచే నౌషధద్రవ్యములను జక్కగ దెలిసి, వాతాదిదోషపరిజ్ఞానముచే రోగలక్షణముల గమనించి, తత్తదుచితముగ నౌషధమును కల్పింపవలెను కావున రసవికల్పములును, దోషవికల్పములును చక్కగ దెలిసినవైద్యుడు రోగములకు దగినచికిత్స గల్పించుటకు పొరబడడు. అను నభిప్రాయముచేత "హేతులిఙ్గోపశాన్తిషు" అని చెప్పబడినది.

## రసాఽనురసలక్షణములు.

మూ. వ్యక్తశ్శుష్కస్య చాదౌ చ రసో ద్రవ్యస్య లక్ష్యతే,
విపర్యయేణానురసో రసో నాస్తి హి సప్తమః. ౪౪

వ్యా. ఒకద్రవ్యము ఎండినప్పుడైనను, పచ్చిగనున్నప్పుడైనను, నాలుకతో సంబంధముకల్గినక్షణమునందైనను, చక్కగ నమలినప్పుడైనను, (ఇట్టినాల్గు అవస్థలయందును) స్ఫుటముగ నేరసము కానంబడునో అయ్యది రసము (ప్రధానరసము) అని చెప్పబడును. (ఒక ద్రవ్యమునందలి రసము పైజెప్పిన నాల్గవస్థలయందును, ఇయ్యది మధురము' ఇయ్యది యమ్లమునని స్ఫుటముగ రసనేంద్రియముచే నిర్ణయింపవీలుగ స్ఫుటమైయుండునది ప్రధానరసమని భావము.)

పైజెప్పిన లక్షణమునకు వ్యతిరేకముగ యెండినప్పుడును, పచ్చిగనున్నప్పుడును, జిహ్వాసంబంధము కల్గినప్పుడును, నమలినప్పుడును, ఇయ్యది మధురము, లేక అమ్లమునని నిర్ణయింప వీలుపడక ఛాయామాత్రముగ కార్యముచే నూహింపదగియుండునో,

అయ్యది యనురసమని చెప్పబడును. మధురాదిరసములే పైజెప్పినరీతిగ వ్యక్త-అవ్యక్తములై యుండుటంబట్టి రస-అనురసభేదములు కల్గియుండును కావున అవ్యక్తరసమనునది మధురాదులకు వేరుగ నేడవసరమొండు లేదు.

ఇచ్చట "శుష్కస్య చ, ఆదౌ చ" అను చకారము సముచ్చయార్థకము కావున శుష్కమునకు వ్యతిరేకమైన యార్ద్రంబును, ఆదికి వ్యతిరేకమైన యంతంబును జేర్చి నాల్గు అవస్థలని యర్థమగును. (క్షీరము, సురామద్యము, బిడాలవణము, వేము, చెవ్యము, పద్మము, అను నారుద్రవ్యములయందు వరుసగ మధురాదిరసముల లక్షణసమన్వయము నెరుంగునది.)

కొందరిట్లు వ్యాఖ్యానము చేసెదరు:—ఎండినప్పుడును, పచ్చిగ నుండునప్పుడును ఉపయోగించవలసిన ద్రవ్యమునకు శుష్కావస్థయందు ఏరసము వ్యక్తముగ (స్ఫుటముగ) గానంబడునో అయ్యది రసమనబడును. దీనికి వ్యతిరేకముగ నార్ద్రావస్థయందు ఏరసము వ్యక్తముగ గానంబడునో అయ్యది అనురసము. ఎట్టులన:—పిప్పలి పచ్చిదిగ నున్నపుడు మధురరసము వ్యక్తముగనుండును. ఎండినపుడు కటురసము వ్యక్తముగ నుండును. అట్టి పిప్పలియందు తిక్తము రసము, మధురము అనురసమగును. మరియు ద్రాక్ష మున్నగు ఫలములు పచ్చిగ నున్నపుడును, ఎండినపుడును, మధురముగనే యుండును కావున నవి మధురరసములనుట నిర్వివాదము. మరియు నిత్యార్ద్రముగ నుపయోగింపదగిన కాంజికము తక్రము మున్నగువానియందు తొలుత నేరసము వ్యక్తమగునో అయ్యది రసము. పిమ్మట నేది వ్యక్తమగునో అయ్యది యనురసము. అని యిత్తెరంగున కొందరు చెప్పెదరు. కాని "శ్లేష్మలా మధురా చార్ద్రా గుర్వీ స్నిగ్ధా చ పిప్పలీ" అనువాక్యముచే పిప్పలి పచ్చిగ నున్నపుడు మధురరసంబును, గురుస్నిగ్ధగుణములు కల్గినదియు, కఫమును వృద్ధినొందించునని తెలిసెడి. పిప్పలియందు ఆర్ద్రావస్థలో మధురముగనుండురసము శుష్కావస్థయందు లేమింజేసి మధురము అనురసమగునని చెప్పినయెడ ఆర్ద్రావస్థయందు దానికి చెప్పిన గుర్వాదిగుణములు విరుద్ధమగును. కావున ఆర్ద్రావస్థయందు పిప్పలి వ్యక్త మధురమగుటచే మధురరసంబనియు, శుష్కావస్థయందు కటురసము వ్యక్తమగుటచే కటురసంబనియు, మధురము సూక్ష్మముగనుండుటంజేసి యనురసమగుననియు చెప్పుట నిర్దుష్టము.

### చికిత్సాసిద్ధ్యుపాయములైన పరాపరత్వాదిగుణములు.

మూ. పరాఽపరత్వే యుక్తిశ్చ సంఖ్యా సంయోగ ఏవ చ,
విభాగశ్చ పృథక్త్వం చ పరిమాణమథాపి చ. ౨౫

సంస్కారోఽభ్యాస ఇత్యేతే గుణా జ్ఞేయాః పరాదయః,
సిద్ధ్యుపాయాః చికిత్సాయాః లక్షణైస్తాన్ ప్రచక్ష్యతే. ౪౯

వ్యా. పరత్వము, అపరత్వము, యుక్తి, సంఖ్య, సంయోగము, విభాగము, పృథక్త్వము, పరిమాణము, సంస్కారము, అభ్యాసము ఇవి పదియును పరాది (పరత్వము నాదిగకల) గుణములు. ఇయ్యవి చికిత్సాసిద్ధికి నుపాయములు. వీనిలక్షణము లీక్రింద వివరింపబడును.

పరత్వాఽపరత్వ, యుక్తిలక్షణములు.

మూ. దేశకాల వయోమాన పాకవీర్య రసాదిషు,
పరాఽపరత్వే, యుక్తిశ్చ యోజనా యాతు యుజ్యతే. ౫౦

వ్యా. పరత్వమన ప్రధానత్వము, అప్రధానత్వము, అపరత్వము. అట్టి పరత్వాపరత్వములు రెండును జాంగలాదిదేశము, విసర్గాదికాలము, యౌవనాదివయస్సు, శరీరాదిపరిమాణము, పాకము, వీర్యము, రసము అనునవి మున్నుగాగల ప్రకృత్యాదులను గూడ ననుసరించియుండును. (అట్టి పరత్వాఽపరత్వము పైజెప్పిన దేశకాలాదులయందు కల్పింపవలెననుట.)

ఔషధాది పరికల్పనము ఏది సంగతమైయుండునో అట్టి యోజనము యుక్తి యనబడును.

దీనివివరణము.—దేశకాలాదులవిషయములైన పరత్వాపరత్వములు చికిత్సాసిద్ధికి దగిన యుపాయములగును. ఎట్టులన:—జాంగలదేశము చికిత్సకు పరము (ప్రధానము) ఆనూపదేశము అపరము (అప్రధానము) విసర్గరూపమైనకాలము పరము, ఆదానకాలము అపరము, యౌవనరూపమైన వయస్సు పరము. తక్కినవయస్సు (వార్ధక్యాదులు) అపరము. శారీరమున జెప్పబడు శరీరపరిమాణము పరము. దానికి వ్యతిరేకమైన పరిమాణము అపరము. పాకవీర్యరసములలో నెవ్వి యెవరికి యుక్తములుగ నుండునో యవి పరములు. అయౌగికములై కూర్పదగనివి యపరములు. ఆదిశబ్దముచేత ప్రకృత్యాదుల ననుసరించియు పరాపరత్వముల గల్పింపవలెనని తెలిసెడి.

యుక్తి యన-దేశకాలప్రకృత్యాద్యనుసారముగ నౌషధాదుల పరికల్పనము ఏది యుక్తముగనుండునో అయ్యది యుక్తి.

సంఖ్య, యోగలక్షణములు.

మూ. సంఖ్యా స్యాద్గణితం, యోగః సహ సంయోగ ఉచ్యతే,
ద్రవ్యాణాం ద్వంద్వసర్వైకకర్మజోఽనిత్య ఏవ చ. ౫౧

వ్యా. ఒకటి రెండు మూడు మున్నగుగణితము సంఖ్య యనబడును. (ఇది యాపధాదులకు సంబంధించి చికిత్సాసిద్ధి కుపాయమగును.)

వేరువేరుగనుండు శుంఠి పిప్పలి మున్నగు నౌషధద్రవ్యముల నొకటిగ చేర్చుట యోగము. అయ్యది ద్వంద్వకర్మజము(రెండువస్తువుల వ్యాపారముచే కల్గు సంయోగము), సర్వకర్మజము (అనేక ద్రవ్యముల వ్యాపారముచే కల్గు సంయోగము), ఏకకర్మజము (ఒకేవ్యాపారముచేకల్గు సంయోగము) నని భేదములు కల్గియుండును. అట్టిసంయోగము (అనిత్యము.) అనేకద్రవ్యసంయోగము తత్తద్యోగానుసారముగ మారుచుండును కావున నేకాకారముగ నుండదు కావున అనిత్యమని భావము. (అట్టి ద్రవ్యసంయోగంబును చికిత్సాసిద్ధికి ఉపాయమగును.)

విభాగ, పరిమాణలక్షణములు.

మూ॥ విభాగస్తు విభక్తిస్స్యాత్, వియోగో భాగశో గ్రహః;
పృథక్త్వం స్యాదసంయోగః వైలక్షణ్యమనేకతా. ౪౯

వ్యా. ఒకటిగ జేరియుండుదానిని విభజించి యట్టిభాగములననుసరించి గ్రహించుట విభాగమనబడును. (అట్టివిభాగపూర్వకముగ నౌషధద్రవ్యముల గ్రహించుట చికిత్సాసిద్ధికరమని భావము.)

పృథక్త్వమనగ వేరుపరచుమార్గము. (అనేకద్రవ్యములు ఘటపటాదులున్నపుడు పటరూపమైన యాద్రవ్యము ఘటమునకన్న భిన్నమైనదని జనించు భేదజ్ఞానము పృథక్త్వమని భావము.) అట్టిపృథక్త్వము అసంయోగరూపము,వైలక్షణ్యము,అనేకత్వము అని మూడువిధములుగనుండును. అందు మేరుహిమాలయములవలె నొకప్పుడు ఒండొంట కలియకుండుట అసంయోగరూపమైన పృథక్త్వము, మహిషములు, వరాహములు మున్నగునవి జాతీయములు గుమిగూడియుండునపుడు వానికింగల పరస్పరభిన్నలక్షణములబట్టి వేరుపరచువిధముగ భిన్నజాతీయములగు ననేకద్రవ్యములు చేరియున్నపుడు వానివానిలక్షణములబట్టి వేరుపరచుట వైలక్ష్యరూపపృథక్త్వము. ఏకజాతీయద్రవ్యములనేకములుగ జేరియున్నపుడు వానివ్యక్తిభేదమునుబట్టి అనేకములుగ నేర్పరించుట అనేకతారూపమైన పృథక్త్వము. మినుములు ఒక్కజాతిగ నున్నను వాని వ్యక్తిభేదమునుబట్టి యనేకములుగ వేరుపరచుటయని యెరుంగునది.

పరిమాణ, సంస్కార, అభ్యాసలక్షణములు.

మూ. పరిమాణం పునర్మానం, సంస్కారః కరణం మతం,
భావాభ్యాసనమభ్యాసః శీలనం సతతక్రియా. ౫౦

ఇతి స్వలక్షణైరుక్తా గుణాస్సర్వే పరాదయః,
చికిత్సా యైరవిదితైః న యథావత్ప్రవర్తతే. ౫౧

వ్యా. ప్రస్థము, ఆఢకము మున్నగునవియు, పలము మున్నగునవియుం పరిమాణ మనబడును. ద్రవ్యమునకు స్వతస్సిద్ధమైన గుణముగాక వేరుగుణముల గల్గించుట సంస్కార మనబడును. పత్థ్యకరములైన యరువదినాళ్లు సంబావులు మున్నగువానిని, శరీరవ్యాయామాదులను నిరంతరముగ సేవించుట యభ్యాసమనబడును. దీనినే శీలన మనియు సతతక్రియ యనియుం పర్యాయపదములచే జెప్పెదరు.

ఇత్తెరంగున నుద్దేశక్రమానుసారముగ పరాఽపరత్వాదిగుణముల పదింటికిని వేరు వేరుగ లక్షణములు చెప్పబడినవి. ఈ పదిగుణములును చికిత్సాసిద్ధికి సాధనములై యుండును కాన వీనిని తెలియనినాడు చికిత్స యథోక్తమైన ఫలమును కల్గింపనోపదు; కావున వైద్యుడు ఈగుణములను కూడ తెలిసి చికిత్సజేయ గడంగవలెననుట.

"న యథావత్ప్రవర్తతే" అని చెప్పుటచేత ద్రవ్యాశ్రితములగు గుర్వాది గుణములకన్నను శబ్దాదిగుణములకన్నను వీనికి ప్రాధాన్యము తక్కువయని యాచార్యులు సూచించెను. మరియుం నీగుణములు ప్రధానములు కామింజేసియే వాగ్భటాదితంత్రకారులు చెప్పక విడచి గురుమందాదిగుణములనే చెప్పిరి.

రసగుణములు ద్రవ్యాశ్రితములను సిద్ధాంతము.

మూ. గుణా గుణాశ్రయా నోక్తాః, తస్మాద్రసగుణాన్ భిషక్,
విద్యాద్ద్రవ్యగుణాన్ కర్తురభిప్రాయాః పృథగ్విధాః. ౫౨

వ్యా. ఇచ్చట "యోగస్సహసంయోగ ఉచ్యతే" అను (౪౮-వ శ్లోకమునందలి) వాక్యముచే రసములకు పరస్పరసంయోగరూపగుణము నిర్దేశింపబడినది. రసముల వివరించునపుడు "తత్ర మధురో రసః.........స్నిగ్ధశ్శీతో గురుశ్చ" ఇది మున్నగు వాక్యములచే మధురాదిరసములకు స్నిగ్ధశీతగుర్వాదిగుణములు నిర్దేశింపబడినవి. గుణములు ద్రవ్యము నాశ్రయించి యుండును గాని స్వతంత్రముగ కార్యసమర్థములు కానోపవు. అట్టిరసముల నుద్దేశించి గుణములజెప్పుట యెట్లు సంగతమగును? అన్నచో దానికి సమాధానము ఈశ్లోకముచే చెప్పబడును,—

గుణములు గుణముల కాశ్రయములగునని చెప్పియుండలేదు; కావున మధురాది రసములనుద్దేశించి చెప్పబడిన స్నిగ్ధశీతగుర్వాదిగుణములు రసముల కాధారకారణమైన (ఆశ్రయమైన) ద్రవ్యమునకు సంబంధించినవి యని వైద్యు డెరుంగవలెను. తంత్ర

కర్తలయభిప్రాయములు పలుదెరంగులనుండును; (కావున అట్టి తంత్రకర్తలు ద్రవ్యము నాశ్రయించిన గుర్వాదిగుణములను, అట్టిద్రవ్యమునే ఆశ్రయించియుండు రసముల యందు ఆరోపించి, అట్టియభిప్రాయముచేత 'మధురః స్నిగ్ధశీతగురుగుణః' ఇత్యాది రూపముగ వ్యవహరించెదరని యర్థము.)

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—దీర్ఘంజీవితీయాధ్యాయమున గుణలక్షణమును చెప్పునపుడు "సమవాయీతు నిశ్చేష్టః కారణం గుణః" (సూత్ర. ౧. అ. శ్లో. ౫౧.) అని చెప్పిరి. క్రియారూపమైన చేష్టలులేక సమవాయసంబంధముచే (నీలపీతాదిగుణములు ఘటపటాదుల నాశ్రయించినట్లు) ఎల్లము మున్నగు ద్రవ్యముల నాధారముగ జేసికొని యుండునది గుణమని గుణలక్షణము చెప్పబడినది. ఈలక్షణమునుబట్టి గుడాదిద్రవ్యముల నాశ్రయించియుండు మధురాదిరసములు గుణములే యగును. తంత్రకారుడు అట్టిరసములు స్నిగ్ధాదిగుణములకాశ్రయములని చెప్పియుండలేదు. అట్టిరసములకును గుణములకును, ద్రవ్యము ఆశ్రయమగుననియే చెప్పిరి. కావున రసములకు చెప్పిన గుణములు అట్టి రసములకాశ్రయములగు ద్రవ్యముల గుణములనియే యెరుంగవలెను. 'మధురరసము గుర్వాదిగుణము కల్గినది' ఇది మున్నగు వ్యవహారము ద్రవ్యనిష్ఠములైనగుణములను రసములయందారోపించి గౌణముగగల్గినది. తంత్రకర్తల యభిప్రాయములు పలుదెరంగుల నుండును కావున "తత్ర మధురో రసః—గురుశ్చ" ఇత్యాదివాక్యములయందు తంత్రకర్తలయభిప్రాయానుసారముగ పైజెప్పినరీతి సమన్వయము చేసికొనవలెనని నిష్కృష్టార్థము.

## భిన్నాభిప్రాయస్థలములయం దర్థనిర్ణయనియమము.

మూ. అతశ్చ ప్రకృతం బుద్ధ్వా దేశకాలాన్తరాణి చ,
తన్త్రకర్తురభిప్రాయాన్ ఉపాయాంశ్చార్థమాదిశేత్.        ౫౩

వ్యా. తంత్రకర్తలయభిప్రాయములు భిన్నభిన్నములుగనుండును కావున ననేకవిధములుగ భావములేర్పడు సందిగ్ధస్థలములయందు ప్రకృతము (ప్రకరణము)ను, దేశభేదములను, కాలభేదమును, తంత్రకారులయభిప్రాయములను, తంత్రయుక్తిలో జెప్పిన యుపాయములను చక్కగ గమనించి తెలిసికొని తత్తదనుసారముగ తాత్పర్యమును నిర్ణయింపవలెనని యర్థము.

ఇచ్చట అంతరశబ్దమునకు భేదమని యర్థము. అయ్యది దేశ-కాల అనుపదములతో ("ద్వన్ద్వాన్తే శ్రూయమాణం పదం ప్రత్యేక మభిసంబధ్యతే" అనున్యాయము ననుసరించి) వేరువేరుగ నన్వయింపదగును. దేశభేదమును, కాలభేదమును, ప్రకరణ

మును, తంత్రకారుల యభిప్రాయమును, ఉపాయములను అనుసరించి యర్థనిర్ణయమును చేయవలెనని యభిప్రాయము. ఈన్యాయము ఒకపదమునకు అర్థాంతరముల కవకాశము గల్గి సందిగ్ధముగనున్నతరి యర్థనిర్ణయమునకై చెప్పబడినది.

ఉదాహరణము:—"క్షారాః క్షీరం ఫలం పుష్పం" అనుటచే క్షీరశబ్దమునకు 'పాలు' అని వాచ్యార్థము. అయ్యది గోవులు మున్నగువానికిని జెముడు మున్నగు ఔద్భిదములకును సంబంధించియుండును; కావున ప్రకృతక్షీరశబ్దముచే నేది గ్రహింపదగును అని సందేహము బొడమును. అట్టియెడ క్షారఫలపుష్పములు ఔద్భిదములు కావున అట్టి ప్రకరణము ననుసరించి ఔద్భిదముల (భూమిని భేదించి జనించు తరుగుల్మలతాదుల)లో జేరిన జెముడు మున్నగువాని పాలు క్షీరశబ్దమున కర్థమని చెప్పవలెను. (ఇది ప్రకరణానుసారమైన యర్థము.)

క్రిమిరోగచికిత్సయందు శోధనము విధింపబడినది. అట్టిశోధనచికిత్స శిరోగత క్రిమివ్యాధియందు శిరశ్శోధనరూపమైన నస్యము నుపయోగింపవలెనుకాని కోష్ఠశోధన రూపమైన వమనవిరేచనాదుల నుపయోగింపదగదు. శరీరావయవరూపమైన కోశము ననుసరించి యిచ్చట శిరోవిరేచనమని నిర్ణయింపనగును. ఇది దేశభేదానుసారమైన యర్థము.

వమనప్రకరణమున "ప్రతిగ్రహాంశ్చోపహారయేత్" ఇచ్చట ప్రతిగ్రహశబ్దమునకు గ్రహించుట అనునర్థము ప్రసిద్ధముగనున్నను, వమనమును క్రిందపడనీయక పట్టికొనుటకు తగినపాత్రమనియర్థము వమనకాలము ననుసరించి చెప్పవలెను. (ఇది కాలభేదము ననుసరించిన యర్థనిర్ణయము.)

ప్రకృతమున "గుణా గుణాశ్రయా నోక్తాః తస్మాద్రసగుణాన్ భిషక్, విద్యాద్ద్రవ్యగుణాన్" అనునట్టి పైశ్లోకమున జెప్పినరీతిగ ద్రవ్యగుణములను రసములయందారోపించి "స్నిగ్ధో మధురః" ఇత్యాదివ్యవహారములు గ్రంథకర్తయభిప్రాయానుసారముగ జెప్పబడినది. ఇదియే అభిప్రాయోదాహరణము.

ఉపాయములన—తంత్రయుక్తిరూపోపాయములు. అయ్యవి ఆయాస్థలముల యందు వివరింపబడును. ఈయుదాహరణములబట్టి ఆయాస్థలములయందు ప్రకరణాద్యనుగుణముగ సందిగ్ధస్థలములయందు నిర్ణయము చేయనగును.

—— రసషడ్విధత్వవిభాగవివరణము. ——

మూ. షడ్విభక్తీః ప్రవక్ష్యామి రసానామత ఉత్తరమ్,
షట్పఞ్చభూతప్రభవాః సంఖ్యాతాశ్చ యథా రసాః. ౫౪

వ్యా. మధురాదిరసములు ఆరువిధములుగ విభాగములేర్పడుటకు కారణములును, పంచభూతములవలన ఆరువిధములుగ రసములుజనించువిధంబును ఈక్రిందవివరింపబడును.

రసోత్పత్తికి తొల్లింటికారణము.

మూ. సౌమ్యాః ఖల్వాపోఽన్తరిక్షప్రభవాః ప్రకృతిశీతాః లఘ్వ్యశ్చ అవ్యక్తరసాశ్చ; తాస్త్వన్తరిక్షాద్భ్రశ్యమానాః భ్రష్టాశ్చ పఞ్చ మహాభూతగుణసమన్వితాః, జఙ్గమస్థావరాణాం భూతానాం మూర్తీరభిప్రీణయన్తి; యాసు (తాసు) మూర్తిషు షడభి మూర్ఛన్తి రసాః. ౫౩

వ్యా. అంతరిక్షమున పుట్టినజలములు సోమదేవతాకములు. (కావుననే) అయ్యవి స్వభావముచేతనే చల్లదనముకల్గినవియు, తేలికయైనవియు, అవ్యక్తరసంబులు (స్పష్టముగ దెలియక రసోత్పత్తికి మూలకారణములైన రససూక్ష్మాంశంబులు కల్గినవియు) నై యుండును. అట్టియాంతరిక్షజలము ఆకసమునుండి పుడమిపైకి జారునప్పుడును, భూమి పయింబడినవెన్కను, పృథివి, అప్పు (జలము), తేజస్సు (అగ్ని), వాయువు, ఆకాశము అనుపంచమహాభూతములకు వేరువేరుగ నేర్పడియుండుగుణములన్నియు కల్గినవియై, స్థావర (తరుగుల్మలతాదుల) రూపంబులును, జంగమ(ప్రాణికోటుల) రూపంబులునైన పాంచభౌతికవ్యక్తులకు తృప్తినొందించుచు నానాట నభివృద్ధినొందజేయును. (లేక అట్టి పంచభూతాత్మకముల గల్గించును). అట్టి రసోత్పత్తికారణమైన జలముచే జనించి యభివృద్ధినొందిన స్థావరజంగమరూపములైన పాంచభౌతికద్రవ్యములయందు మధురాది రసములారును స్ఫుటముగ నభివ్యక్తములగును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—జలము అంతరిక్షమున మేఘములవలన తొలుత బుట్టును. అయ్యది సోమ(చంద్రుడు) అధిదేవతగ గల్గియుండుటంజేసి స్వతస్సిద్ధముగనే చల్లదనముకల్గి తేలికగనుండును. అట్టియంతరిక్షజలమునందు రసోత్పత్తికి కారణములైనశక్తులు లీనములై (రసనేంద్రియగ్రాహ్యములుగాక)యుండును. అయ్యవి యంతరిక్షమునుండి దిగజారుసమయముననే అంతరిక్షమున పరమాణురూపముగనుండు పంచమహాభూతములగుణములతోగూడియు, పుడమిపయింబడినపిదప(భూస్పర్శమునంజేసి) అట్టిపంచభూతములగుణములతో గూడియునుండును. (అట్టియవస్థలరెండిటియందును పంచభూతగుణసంబంధము కల్గియుండుటయే రసోత్పత్తికి కారణమగును.) అట్టిపంచభూతగుణములతోగూడినజలము స్థావరజంగమరూపములైన తరుగుల్మాదులను ప్రాణులను నానాటవృద్ధినొందించును రసోత్పత్తికికారణములైన పంచభూతములగుణము కల్గిన

జలముచే పోషింపబడిన స్థావరజంగమద్రవ్యములయందు మధురాదిరసములు స్ఫుటముగ నభివ్యక్తములై రసనేంద్రియగ్రాహ్యము లగునని భావము. (కారణగుణములు కార్యములయందు అవశ్యముగ జేరియుండును. కావున రసోత్పత్తికి కారణములైన పంచభూతగుణములుకలజలముచే నుత్పన్నములై వృద్ధినొందిన స్థావరజంగమములయందు మధురాదిరసములు అభివ్యక్తము లగుననియు, అట్టిరసోత్పత్తికి జలము ప్రధానకారణం బనియు ముఖ్యతాత్పర్యము.)

షడ్రసోత్పత్తికి వేరువేరుగ విశేషకారణములు.

మూ॥ తేషాం షణ్ణాం రసానాం సోమ (పృథివీసోమ) గుణాతిరేకాన్మధురో రసః, పృథివ్యగ్నిభూయిష్ఠత్వాదమ్లః, సలిలాగ్నిగుణభూయిష్ఠత్వాల్లవణః, వాయ్వగ్నిభూయిష్ఠత్వాత్కటుకః, వాయ్వాకాశాతిరిక్తత్వాత్తిక్తః, పవనపృథివ్యతిరేకాత్కషాయ ఇతి ॥౪౮

వ్యా. మధురాదిరసములారిటిలో పైజెప్పినరీతిగ పంచభూతముల గుణములన్నియు జేరియున్నను సౌమ్యాత్మకమైన జలముయొక్కగుణ మధికముగ నుండుటచే మధురరసము కల్గును. అన్నిరసముల యుత్పత్తికిని పంచభూతగుణవిశిష్టమైనజలము సామాన్యముగ నాధారకారణ మైయుండును. అయినను అందు మధురరసోత్పత్తికి జలగుణము అధికముగనుండుట కారణమగును. రససామాన్యముగ జలము ఆధారకారణమనియు, మధురరసోత్పత్తికి జలగుణాతిరేకము విశేషమనియు భావము. ఇత్తెరంగున నే లవణరసోత్పత్తికిని జలము ఆధారకారణంబైయున్నను జలగుణాతిరేకము విశేషకారణ మగుననియు నెరుంగునది).

పృథివియొక్కయు అగ్నియొక్కయుగుణము లధికముగనుండుటచే నమ్లరసము కల్గును. ఉదకముయొక్కయు అగ్నియొక్కయు గుణములధికమునుండుటచే లవణరసము పుట్టును. వాయువుయొక్కయు అగ్నియొక్కయు గుణములధికములుగనుండుట చే కటుకరసము పుట్టును. వాయువుయొక్కయు ఆకాశముయొక్కయు గుణములధికముగనుండుటచే తిక్తరసము పుట్టును. వాయువుయొక్కయు పృథివియొక్కయుగుణము లధికముగ నుండుటచే కషాయరసము పుట్టును అనియర్థము.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—పైజెప్పినరీతిగ జల-అగ్ని అనువానియతిరేకముచే లవణరసము పుట్టునని తెలిసెడి దానంజేసి లవణరసమున శీతఉష్ణగుణములు రెండు నుండవలెను. అట్లులుండక ఉష్ణగుణము నే కల్గియుండుట యెట్లు సంగతమగును? అను ప్రశ్నము కల్గును. అయినను భూతములు ఏదో ఒకవిధముగ సంసృష్టములై యొకకార్య

మును కల్గించును. అట్టిభూతసంసర్గమాత్రముననే వానిగుణములన్నియు వానికార్యముల యందు కనబడుటలేదు. ఇదియే పంచభూతములప్రభావము. మత్స్యకములు జలాతిరేకమునంజేసి మధురరసము కల్గియుండియు స్నేహగుణమందులేదు. అత్తెరంగుననే లవణరసము జలాతిరేకముచే గల్గినను శీతగుణము మాత్రము కల్గుటలేదు. పైజెప్పినభూతముల సన్నివేశము మాత్రప్రభావకృతము. అట్టిప్రభావము కేవలము ప్రమాణవచనములచే మాత్రము నిర్ణయింపదగియుండును. వానికార్యములబట్టి గుణము లనుమానింపదగియుండును. లవణము ఉష్ణమగుటచే నగ్నియు, అభిష్యన్ది (నాసాదిరంధ్రములయందు ద్రవమును బుట్టించునది) యగుటచే జలంబును కలిసియున్నదని యూహింపదగియున్నది. అట్టిభూతములసన్నివేశము కేవలము ఆగమప్రమాణవేద్యమై పైజెప్పినరీతిగ కార్యానుమేయమైయుండునుకాని కేవలము మనజ్ఞానముచే గల్పింప నలవికాదు. భూతము లట్టి యచింత్యప్రభావము కల్గియుండుటంజేసియే జలము షడ్రసములనారంభించినవిధముగ తక్కినభూతములు స్వతంత్రముగ రసాంతరముల నారంభించుటలేదని యెఱుంగునది. కావున లవణము ఉష్ణగుణముకల్గి శీతగుణములేకుండుట యచింత్యమైన భూతప్రభావకృతమని యెఱుంగునది. మరియు "సోమగుణాతిరేకాన్మధురః" అనుచోట "పృథివీ సోమగుణాతిరేకాన్మధురః" అని పాఠాంతరమున్నది. వాగ్భటమున "క్ష్మాఽమ్భోఽగ్ని క్ష్మామ్బుతేజః ఖవాయ్వగ్న్యనిలగోనిలైః, ద్వయోల్బణైః క్రమాద్భూతైః మధురాదిరసోద్భవః" అనువాక్యముచే 'ద్వయోల్బణైః భూతైః' అని చెప్పియుండుటంబట్టి ప్రకృతమునను "పృథివీ సోమగుణాతిరేకాత్" అనుపాఠమే సమంజసముగ నున్నది. మరియు పైజెప్పినరీతిగ మధురాదిరసవిశేషములకు వేరువేరుగ జెప్పబడిన యుత్పత్తికారణములైన పృథివిసోమాదిభూతములసంసర్గముచేత ద్విరసాదిసంయోగము ద్రవ్యములయందుకల్గును. రసోత్పాదకకారణసంయోగమె ద్విరసాదిసంయోగమునకు హేతువగును.

## రసషడ్విధత్వమును దృష్టాంతపూర్వకముగ నిర్ణయించుట.

మూ. ఏవమేషాం షణ్ణాం రసానాం షట్త్వముపపన్నం, ఊనాతిరేకవిశేషాన్మహాభూతానాం, భూతానామివ జఙ్గమస్థావరాణాం నానావర్ణాకృతివిశేషాః, షడృతుకత్వాచ్చ కాలస్యోపపన్నో మహాభూతానాం ఊనాతిరేకవిశేషః. ౪౭

వ్యా. పైజెప్పినరీతిగ మధురాదిరసము లారిటికిని ఉత్పత్తికారణములైన పంచమహాభూతముల న్యూనాతిరేకము లారువిధములుగ నుండును; కావున అట్టియుత్పత్తికారణభేదములచే వానికార్యములైన వానిచేజనించిన రసంబులును మధురాదిభేదములచే

నారువిధములనుండును. ఎట్లనగా—పాంచభౌతికములైన స్థావరజంగమద్రవ్యములకు పలుతెరంగులైన వర్ణంబులును ఆకృతివిశేషంబులును పంచభూతముల న్యూనాతిరేకముల చేతనే కల్గుచుండును; (కావున అత్తెరంగుననే పంచభూతములన్యూనాతిరేకముచే నారు భేదములు రసముల కేర్పడుట నిరపవాదమని భావము.)

మరియుం గాలము వసంతాది భేదములచే నారువిధములనుండును. అట్టిఋతుభేదముచే నాయాఋతువుల ననుసరించి మహాభూతములు ఒక్కొకఋతువున కొన్నివృద్ధి నొందియుం, కొన్ని న్యూనములయ్యునుండును; కావున అట్టిఋతుభేదముతోఁగూడిన కాలము ననుసరించి ఆయాకాలమున మహాభూతములు న్యూనాతిరిక్తములై యుండుట సాజము. (అట్టియెడ వృద్ధినొందినభూతముచే జనించినరసము మధురాదిభేదములు కల్గియుండుననుట).

వివరణము.—ఆదానవిసర్గాత్మకమైనకాలము శిశిరాదిఋతుభేదములచే నారువిధములుగ విభక్తమైయుండును. అట్టిఋతువులయందు ఋతుస్వభావమునంజేసి యొక్కొక ఋతువున పంచభూతములలోఁ గొన్ని వృద్ధినొందియుం, కొన్ని న్యూనతనొందియునుండును. అట్టియెడ నేఋతువున నేభూతము వృద్ధినొందియుండునో అట్టిభూతముచేకల్గిన రసము ఆఋతువున వృద్ధినొందియుండును. హేమంతకాలమున సోమగుణ మధికముగ నుండును. అయ్యది జలరూపము, కావున నది వృద్ధినందినపుడు "సోమగుణాతిరేకాన్మధురః" అనువాక్యప్రకారము సోమగుణాతిరేకమునంజేసి మధురరసము పుష్టినందును. ఇత్తెరంగుననే శిశిరవసంతగ్రీష్మములయందు తిక్తకషాయ కటురసంబును, వర్షాశరత్ హేమంతములయందు అమ్ల-లవణ-మధురంబులును వరుసగ వృద్ధినొందును. అట్టివృద్ధికి ఆయారసముల కుత్పాదకకారణంబగుభూతములు వృద్ధినొందుటయే కారణము. అట్టి ఋత్వాత్మకమైన కాలవిశేషమునంజేసి ఆయాభూత మధికమగును. ఈవిషయము తస్యాశితీయమను నారవయధ్యాయమున 'తత్ర రవిర్భాభిః' అని యుపక్రమించి యాచార్యులుపదేశించిరి.(మహాభూతముల న్యూనాతిరేకములకు వసంతాదిఋత్వాత్మకమైనకాలమే కారణమని ముఖ్యభావము.)

లోకమునంగల సకలస్థావరజంగమద్రవ్యములును పంచభూతములచేతనే జనించును. అయినను అట్టిభూతములకు (పైజెప్పినరీతిగ) కల్గిన న్యూనాతిరేకములచేత నానావిధవర్ణంబులును పలుతెరంగులైన యాకృతులును సంభవించును. అత్తెరంగుననే "సోమగుణాతిరేకాన్మధురః, పృథివ్యగ్నిభూయిష్ఠత్వాదమ్లః" ఇత్యాదివాక్యములనే జెప్పినరీతిగ పంచభూతముల నధికభూతమునంజేసి మధురాదిరసము లారుగ నుత్పత్తినొందును;

కావున నట్టియుత్పత్తికారణము లారుగనుండుటంజేసి రసములు నారువిధము లగుననుట యుక్తియుక్తమని సముదితార్థము.

ఇచ్చట 'షడృతుకత్వాచ్చ' అనుచకారముచేత అహోరాత్రరూపమైనకాలంబును, అదృష్టరూపమైన ప్రభావంబును గ్రహింపబడును. అందువలన అహోరాత్రరూపకాలమందును కాలవిశేషమునంజేసియు భూతముల న్యూనాతిరేకభావము కల్గుచుండుననియు, అదృష్టవశమున హేమంతాదిఋతువులయందును కొన్నిద్రవ్యములయందు రసాంతరము జనించుననియు నెఱుంగనగును.

మరియు "తావేతావర్కవాయూ సోమశ్చ.........కాలర్తుదోష దేహబల నిర్వృత్తిప్రత్యయభూతాస్సముపదిశ్యన్తే" (సూత్ర 6-వ అధ్యాయ) అనువాక్యముచేత హేమంతాదికాలవిభాగమునకు భూతోత్కర్షము కారణమని చెప్పబడినది. ఇచ్చట "షడృతుకత్వాచ్చ కాలస్య......మహాభూతానామూనాతిరేకవిశేషః" అని భూతముల న్యూనాతిరేకములకు ఋత్వాత్మకకాలము కారణమని చెప్పబడినది యెట్లు సంగతమన్నచో, బీజాంకురములబోలె భూతవిశేషములకును కాలవిశేషమునకును కార్యకారణభావము సంస్కృతివలె ననాదియని యెఱుంగునది.

## అగ్నివాయ్వాత్మకద్రవ్యస్వరూపము.

మూ. అత్రాఽగ్నిమారుతాత్మకాః రసాః ప్రాయేణ ఊర్ధ్వభాజః లాఘవాత్ ప్లవనత్వాచ్చ (తిర్యగూర్ధ్వగమనత్వాచ్చ) వాయోః, ఊర్ధ్వజ్వలనత్వాచ్చ వహ్నేః. ౫౮

వ్యా. పైజెప్పిన యుత్పత్తిక్రమము ననుసరించి వాయువు-అగ్ని-ఈరెండుభూతములచే జనించినరసములు (రసములుకలద్రవ్యములు), వాయువు తేలికయై గమనస్వభావము కల్గియుండుటచేతను, అగ్ని పైకి జ్వలించుస్వభావముకల్గియుండుటచేతను, ప్రాయికముగ పైకివ్యాపించుస్వభావము కల్గియుండును. (గాలి చంచలమై తేలికయై వ్యాపించుస్వభావముకల్గినది. అగ్నియు పైకి జలించుస్వభావముకల్గినది. కావున అగ్ని వాతాత్మకమగు (కటుక) రసముకల మ్రంగకాయమున్నగు ద్రవ్యములు తరుచుగ పైకి వ్యాపించుస్వభావముకల్గియుండునని భావము) ఇచ్చట ప్రాయేణఅనుటచేత అట్టిరసముకలద్రవ్యములన్నింటికిని నియమములేదని తెలియదగును. వాతమునకు గమనస్వభావము సామాన్యముగ నున్నను, తేలికయగుటచే (బూరుగదూదిబోలె) పైకి వ్యాపించునేగాని క్రిందికి వ్యాపించుటలేదు. "తిర్యగూర్ధ్వగమనత్వాచ్చ" అనుపాఠము నిర్వివాదము. (ఇచ్చట

రసశబ్దముచేత రసాశ్రయములగు ద్రవ్యములు గ్రహింపబడును. పైవాక్యములయందు ద్రవ్యపరముగనే యూహించునది.)

**పృథివీజలాత్మకద్రవ్యస్వరూపము.**

**మూ.** సలిలపృథివ్యాత్మకాస్తు ప్రాయేణ అధోభాజః; పృథివ్యాః గురుత్వాత్, నిమ్నగత్వాచ్చోదకస్య. ౫౯

వ్యా. పృథివి (భూమి) భారము కల్గియుండును. ఉదకము తగ్గుగనుండు ప్రదేశమునకే వ్యాపించును. కావున జలపృథివ్యాత్మకమైన రసము (మధురరసము)కల తెగడమున్నగు ద్రవ్యములు తరుచుగ క్రిందికి వ్యాపించుస్వభావము కల్గియుండును.

**వ్యామిశ్రదవ్యస్వరూపము.**

**మూ.** వ్యామిశ్రాత్మకాః పునః ఉభయతోభాజః. ౬౦

వ్యా. పైజెప్పినవికాక మిశ్రాత్మకములైనరసములు కలద్రవ్యములు ఊర్ధ్వాధోరూపములైన రెండుమార్గములవ్యాపించు స్వభావముకల్గియుండును.

పృథివి-అగ్ని ఆత్మకమైనది అమ్లరసము, కావున నీరసముకలద్రవ్యములు రెండువిధముల వ్యాపించును. ఇత్తెరంగుననే సలిలాగ్న్యాత్మకమైన లవణరసమును, వాయుంపృథివ్యాత్మకమైన కషాయరసమునుకల ద్రవ్యములును ఉభయమార్గములవ్యాపించు స్వభావము కల్గియుండునని యెరుంగునది. (తిక్తరసము వాయ్వాత్మకము కావున నూర్ధ్వాగామియే యగును).

ఇచ్చట నిది సంగ్రహము:—శరీరమునందు ఊర్ధ్వభాగమునవ్యాపించి వమనాదిరూపమున శరీరమునందలి దోషములహరించు ద్రవ్యములు (మ్రంగకాయమున్నగునవి) వాయ్వగ్నిగుణము లధికముగ నున్నదనియు, శరీరమునందధోభాగమున వ్యాపించి విరేచనాదిమార్గమున దోషముల వెడలించు తెగడమున్నగుద్రవ్యములు పృథివిజలభూయిష్ఠములనియు, ఉభయమార్గముల వ్యాపించి శరీరమునందలి యూర్ధ్వాధోభాగములయందలి దోషములహరించుద్రవ్యములు మిశ్రస్వరూపములనియు నెరుంగునది.మరియు కరకకాయమున్నగు కొన్నిద్రవ్యములు వాయ్వగ్నిభూయిష్ఠములయ్యును ఊర్ధ్వభాగమునవ్యాపించక శరీరమునందధోభాగమున వ్యాపించి యందలిదోషముల నిచట హరింపజేయుచున్నవి. కావున నిచ్చట "ప్రాయేణ" అని చెప్పబడినది. ఈవిషయమునే వాగ్భటాచార్యులు "ద్రవ్యమూర్ధ్వగమం తత్ర ప్రాయోఽగ్నిపవనోత్కటం, అధోగామిచ భూయిష్ఠం భూమితోయగుణాదికం" అని క్లుప్తముగ జెప్పెను.

### షడ్రసములకు గుణకర్మనిరూపణము.

మూ. తేషాం షణ్ణాం రసానాం ఏకైకస్య యథాద్రవ్యం గుణకర్మాణి అనువ్యాఖ్యాస్యామః.  ౬౧

వ్యా. పైవివరించబడిన మధురాదిరసముల కారిటికిని ఒక్కొకదానికి సంబంధించినగుణములను, వానికృత్యములను, అట్టిరసములకాశ్రయమైన (సమవాయికారణమైన) ద్రవ్యము నతిక్రమింపక వేరువేర నీక్రింద వివరించెదననియర్థము. (ఇచ్చట "యథాద్రవ్యం గుణకర్మాణి" అని చెప్పుటచేత ఏరసమున కేద్రవ్యమాధారమగునో అట్టిద్రవ్యము ననుసరించి, రసమునకు సంబంధించినగుణములను కృత్యములను వివరించెదనని యర్థము. గుణకర్మలు రసములకు సంబంధించినవి యైనను అట్టిరసమున కాధారమైనద్రవ్యమునే యాశ్రయించునని భావము).

### మధురరసకృత్యములు, గుణములును.

మూ. తత్ర మధురో రసః శరీరసాత్మ్యాద్రసరుధిరమాంసమేదోఽస్థిమజ్జౌజశ్శుక్రాభివర్ధనః, ఆయుష్యః, షడిన్ద్రియప్రసాదనః, బలవర్ణకరః, పిత్తవిషమారుతఘ్నః, తృష్ణాప్రశమనః, త్వచ్యః, కేశ్యః, కణ్ఠ్యః, ప్రీణనో, జీవనః, తర్పణో, బృంహణః, స్థైర్యకరః, క్షీణక్షతసన్ధానకరః, ఘ్రాణ-ముఖ-కణ్ఠౌష్ఠ-జిహ్వాప్రహ్లాదనః, దాహమూర్ఛాప్రశమనః, షట్పదపిపీలికానామిష్టతమః, స్నిగ్ధశ్శీతో గురుశ్చ.  ౬౨

వ్యా. అట్టిరసములారిటిలో మధురరసము శరీరమున కనుకూలముగ నుపయోగించి యలవాటుచేయుటవలన శరీరమునందలి రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము అనునీయేడుధాతువులను, ఓజస్సును వృద్ధినొందించును. ఆయువును వృద్ధిజేయును. మనస్సుకూడిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను ఆరుఇంద్రియములను నిర్దుష్టములుగజేయును. శరీరమునకు బలమును వర్ణమునుకల్గించును. పిత్తమును, విషమును, వాతమును హరించును. దప్పినిశమింపజేయును. చర్మమునకు హితమునుజేయును. వెండ్రుకలకును కంఠస్వరమునకును హితకరము. ప్రీతిని (సంతోషమును) పుట్టించును. దెబ్బలు గాయములుతగిలి మూర్ఛజెందినపుడు దానిని తొలగించి ప్రాణము కల్గించును. ఆత్మేంద్రియములకు తృప్తినొందించును. శరీరము చిక్కియున్నయెడ బలియజేయును. సంధిబంధాదులను అవయవములను స్థిరముగ (దృఢముగ)జేయును. ధాతువులు క్షీణించినవానికి

ధాతువుల వృద్ధినొందించి పోషించును. ఉరఃక్షతముకలవానిని బాగుపరచును. ముక్కును నోటికిని కంఠమునకును పెదవులకును నాలుకకును ఆహ్లాదమును కల్గించును. తాపమును మూర్ఛను శమింపజేయును. (ఇట్టికృత్యములను మధురరసముకల ద్రవ్యముచేయును). మరియు నామధురరసము తుమ్మెదలకును, చీమలకును మిక్కిలి యిష్టమైయుండును. స్నిగ్ధము (జిడ్డు), శీతము (చల్లదనము), గురుత్వము (భారము), అనునీమూడుగుణముల గల్గియుండును.

ఇచ్చట మధుమేహమునందు మూత్రమునందలి తీపినికనిపెట్టుటకై "షట్పదపిపీలికానామిష్టతమః" అని చెప్పబడినది. ప్రమేహనిదానమున "మూత్రేఽభిధావన్తి పిపీలికాశ్చ" "మాక్షికాక్రాన్తం" ఇని మున్నగువాక్యములచేత మూత్రమున చీమలును తేనెటీగెలును గుమికూడినపుడు వానిమూత్రమున తీపి యున్నదని యెరుంగునుపాయములు చెప్పబడినవి. (మధురరసము గుణకరంబును సర్వజనాదరణీయంబు నగుటచే తొలుత జెప్పబడినది.)

మధురరసము నధికముగ నుపయోగించుటచే గల్గురోగములు.

మూ. స ఏవంగుణోఽపి ఏక ఏవాత్యర్థముపయుజ్యమానః స్థౌల్యం, మార్దవ, మాలస్యం, అతిస్వప్నం, శ్వాస-కాస-ప్రతిశ్యాయాఽలసక-శీతజ్వరాఽఽనాహాఽఽస్య మాధుర్య-వమథు-సంజ్ఞాస్వరప్రణాశ-గళగణ్డ-గణ్డమాలా-శ్లీపద-గళశోఫ-వస్తిధమనీగళోపలేపాఽక్ష్యామయాన్, అభిష్యన్దమిత్యేవం ప్రభృతీన్ కఫజాన్ వికారాన్ ఉపజనయతి. ౬౩

వ్యా. మధురరసము పైజెప్పిన మంచిగుణములగల్గియున్నను ఆరసమును మాత్రమొక్కదానినే (తక్కినరసముల వదలి) విశేషముగ నుపయోగించినయెడ శరీరమును స్థూలముగజేయును. శరీరపటుత్వమును మాన్పి మృదువుగజేయును. పనులయందు ప్రాలుమాలికను పుట్టించును. నిద్ర నధికముగ దెచ్చిపెట్టును. మరియు శ్వాసము, కాసము, ప్రతిశ్యాయము (పీనస), అలసకము, శీతజ్వరము, ఆనాహము (కడుపుబ్బరము), నోటితీపి, వాంతి, సంజ్ఞానాశము, కంఠస్వరహాని, గళగండము, గండమాల, శ్లీపదము (బోదకాలు), కంఠమునందువాపు, వస్తియందును ధమనులయందును కుత్తుకయందును ఉపలేపము (కఫము మున్నగునవి జేరియుండుట), అభిష్యందము మున్నగునేత్రరోగములు, ఇవిమున్నగాగల కఫజనితరోగముల గల్గించును. (ఇచ్చట నభిష్యందమనునది నేత్ర

రోగముకావున "అక్ష్యామయాన్" అని చెప్పిననే చాలును. అభిష్యందమని మరల చెప్పుట ప్రౌఢోక్తి. లేక అభిష్యందమన నాసానిరంధ్రములయందు స్రావమని యర్థము).

## అమ్లరసకృత్యములు, గుణములును.

మూ. అమ్లో రసో భుక్తం రోచయతి, అగ్నిం దీపయతి, దేహం బృంహయతి, ఊర్జయతి, మనో బోధయతి, ఇన్ద్రియాణి దృఢీ కరోతి, బలం వర్ధయతి, వాత మనులోమయతి, హృదయం తర్పయతి, ఆస్యమాస్రావయతి, భుక్తమపకర్షయతి క్లేశయతి, జరయతి, ప్రీణయతి, లఘురుష్ణః స్నిగ్ధశ్చ. ౬౪

వ్యా. అమ్ల (పులుపు) రసము ఆహారపదార్థమునకు రుచిబుట్టించును. జఠరాగ్నిని దీపింపజేయును (ఆకలి పుట్టించును). శరీరమును బలియజేసి పుట్టిని కల్గించును మనసుకు బోధమును కల్గించును. చక్షురాదీంద్రియములను దృఢముగజేయును. బలమును వృద్ధి నొందించును. వాతమును అనులోమముగ సంచరింప జేయును. హృదయమునకు తృప్తి నొందించును. నోట నీరుస్రవింపజేయును. భుజింపబడిన యాహారము నుడికించి జీర్ణించి స్థలాంతరమునకు లాగును. ఆహారమునందు ప్రీతి బుట్టించును. మరియు నాయమ్లరసము లఘుత్వంబును (తేలికయు), ఉష్ణంబును, స్నిగ్ధంబు ననుగుణముల గల్గియుండును.

## అమ్లరసము నధికముగ నుపయోగించుటచే గల్గురోగములు.

మూ. స ఏవం గుణోఽపి ఏక ఏవాఽత్యర్థ ముపయుజ్యమానః దన్తాన్ హర్షయతి, తర్పయతి, నిమీలయతి అక్షిణీ, సంవీజయతి లోమాని, కఫం విలాపయతి, పిత్తమభివర్ధయతి, రక్తందూషయతి, మాంసం విదహతి, కాయం శిథిలీకరోతి, క్షీణ-క్షత-కృశ-దుర్బలానాం శ్వయథు మాపాదయతి, అపిచ క్షతాఽభిహతదష్ట దగ్ధభగ్న శూనచ్యుతాఽవమూత్రిత పరిసర్పితమర్దితచ్ఛిన్న విద్ధోత్పిష్టాదీన్ పాచయత్యాగ్నేయస్వభావాత్, పరిదహతి కణ్ఠ మురోహృదయం చ. ౬౫

వ్యా. అట్టి యమ్లరసము పైజెప్పినమంచిగుణములు కల్గియుండినను దాని నొక్క దానినే యధికముగ నుపయోగించినయెడ దంతములను పులియజేయును. అధికముగ తృప్తినొందించి వెక్కసమును కల్గించును. కన్నుల మూయునట్లు చేయును. వెండ్రుకల

జుమ్మరింపజేయును. గడ్డగట్టినకఫమును పలుచగ జేయును. పిత్తమును వృద్ధిపొందించును. శరీరమునందలి రక్తమును చెరచును. మాంసమును దహింపజేయును (మంటబుట్టించును), శరీరావయవముల శిథిలములుగ జేయును. ధాతువులు క్షీణించినవారికిని, ఉరఃక్షతము కల్గినవారికిని, కృశించినవారికిని, బలహీనులకును వాపునుపుట్టించును. మరియు గాయము తగులుట, దెబ్బలు తగులుట, జంతువులచే కరవబడుట, నిప్పుచే కాలుట, అవయవాదులు విరుగుట, వాపు, సంధిబంధాదులు జారుట, మూత్రము విషముగ గల్గినకీటాదుల మూత్రము శరీరముపై సోకుట, విషజంతువులు శరీరముపై ప్రాకులాడుట, దోగికొనుట, కత్తిమున్నగువానిచే ఛేదింపబడుట, శూలముమున్నగు నాయుధములు గ్రుచ్చుకొనుట, శరీరమునం దొరిబిడికల్గుట. ఇవి మున్నగువానిని పచింపజేయును. కంఠమునందును, హృదయమునందును, రొమ్మునందును మంటబుట్టించును అమ్లరసము అగ్నితత్వముకల్గినది కావున పైజెప్పినక్షతాదులను పచింపజేయుననియు, కంఠహృదయవక్షస్థ్సలముల యందు మంటబుట్టించుననియు భావము.

లవణరసకృత్యములు, గుణములును.

మూ॥ లవణో రసః పాచనః, క్లేదనః, దీపనః, చ్యావనః, ఛేదనః, భేదనః, తీక్ష్ణః, సరో, వికాస్యధస్స్రంస్యవకాశకరో, వాతహరః, స్తమ్భబన్ధసఙ్ఘాతవిధమనః, సర్వరసప్రత్యనీకభూతః; ఆస్యమాస్రావయతి, కఫం విష్యన్దయతి, మార్గాన్ శోధయతి, సర్వశరీరావయవాన్ మృదూకరోతి, రోచయత్యాహారం, ఆహారయోగీ, నాత్యర్థగురుః, స్నిగ్ధః, ఉష్ణశ్చ. ౬౬

వ్యా. లవణరసము (ఉప్పు) భుజింపబడిన యాహారమును పచింపజేయును. ఆహారమును మృదువుగ జేయును. జఠరాగ్నిని జ్వలింపజేసి యాకలిపుట్టించును. మలమును వెడలించును. కఫము మున్నగువానిని ఛేదించును. గట్టిగనుండుమలమును భేదించును. తీక్ష్ణముగ నుండును. శరీరమున సూక్ష్మావకాశములయందును వ్యాపించును. వ్యాపించు స్వభావముకల్గినది. మలాదుల నధోమార్గమున స్రవింపజేయును. అవకాశమును కల్గించును. (కడుపు నిండియున్నపుడు అట్టి యపక్వపదార్థమును తొలగించి యెడము కల్గించును). వాతమును హరించును. స్తంభించిన యవయవముల సడలించును. సంధిబంధములు పట్టియున్నదాని విడదీయును. ఘనీభవించిన కఫాదులను కరగించును. మరియు నీరసము ప్రమాణమునకన్న కొంచెము అధికమైనయెడ తక్కిన మధురాదిరసములకు విరుద్ధమై వానిరుచిని చెరచును. నోటనీరును స్రవింపజేయును. గట్టిగనుండు

కఫమును ద్రవింపజేసి స్రవింపజేయును. స్రోతోమార్గములను శుభ్రపరచును. శరీరావయవములనన్నిటిని మెత్తబరచును. ఆహారమును రుచింపజేయును. ఆహారపదార్థములతో గూర్చుటకు యుక్తముగనుండును. కొంచెముగ గురుత్వమును కల్గియుండును. స్నిగ్ధ-ఉష్ణ గుణములు కల్గియుండును.

లవణరసము నధికముగ నుపయోగించుటచే గల్గురోగములు.

మూ. స ఏవంగుణోఽపి ఏక ఏవాత్యర్థ ముపయుజ్యమానః పిత్తం కోపయతి, రక్తం వర్ధయతి, తర్షయతి, మూర్ఛయతి,(మోహయతి), తాపయతి, దారయతి, కుష్ణాతి మాంసాని, ప్రగాలయతి కుష్ఠాని, విషం వర్ధయతి, శోఫాన్ స్ఫోటయతి, దన్తాంశ్చ్యా(శ్చా)వయతి, పుంస్త్వముపహన్తి, ఇన్ద్రియాణ్యుపరుణద్ధి, వలీపలితఖాలిత్యమాపాదయతి అపిచ లోహితపిత్త-అమ్లపిత్త-వీసర్ప-వాతలోహిత-విచర్చిక-ఇన్ద్రలుప్తప్రభృతీన్ వికారానుపజనయతి.　　౭౭

వ్యా. లవణరసము పైజెప్పినగుణములు కల్గియున్నను దాని నొక్కదానినే యధికముగ నుపయోగించినచో పిత్తమును ప్రకోపింపజేయును. రక్తము నధికముగ వృద్ధినొందించును. అధికముగ డప్పిని కల్గించును. చిత్తభ్రమమును గల్గించును. మూర్ఛ నొందించును. తాపమును బుట్టించును. చర్మమును పగులదీయును. మాంసమును కరగించును. కుష్ఠములనుండి నీరును స్రవింపజేయును. శరీరమున విషమున్నపుడు దానిని వృద్ధినొందించును. వాపులను పగులదీయును. దంతముల నల్లగజేయును. పురుషత్వమును (శుక్రమును) నశింపజేయును. చక్షురాదీంద్రియవ్యాపారముల నిరోధించును. వలీపలితములను (శరీరముపై ముడతలను వెండ్రుకల నెరపును) కల్గించును. తలవెండ్రుకల నూడరాల్చి బట్టగట్టునట్లుచేయును. మరియు రక్తపిత్తము, అమ్లపిత్తము, విసర్పము, వాతరక్తము, విచర్చిక, ఇంద్రలుప్తము మున్నగురోగములను కల్గించును.

కటురసకృత్యములు, గుణములును.

మూ. కటుకోరసో వక్త్రం శోధయతి, అగ్నిం దీపయతి, భుక్తం శోషయతి, ఘ్రాణమాస్రావయతి, చక్షుర్విరేచయతి, స్ఫుటీకరోతీన్ద్రియాణి. అలసక-శ్వయథూపచయోదార్దాభిష్యన్ద స్నేహస్వేదక్లేదమలానుపహన్తి, రోచయత్యన్నం, కణ్డూర్వినాశయతి,

వ్రణానవసాదయతి, క్రిమీన్ హినస్తి, మాంసం విలిఖతి, శోణితసఙ్ఘాతం భినత్తి, బన్ధాంశ్ఛిన్నత్తి-మార్గాన్ వివృణోతి, శ్లేష్మాణం శమయతి, లఘురుష్ణో రూక్షశ్చ. ౬౫

వ్యా. కటురసము (కారము) నోటిమలినమును పారందోలి శుభ్రపరచును, జఠరాగ్నిని దీపింపజేసి యాకలి బుట్టించును. భుజింపబడిన యాహారమునందలి ద్రవమును పీల్చి శోషింపజేయును. నాసారంధ్రములనుండి ద్రవమును స్రవింపజేయును. కన్నులనుండి నీరు మొదలగుమలముల వెడలించును. చక్షురాదీంద్రియములను స్ఫుటముగ జేయును. అలసకము (విరేచనరూపమైన వ్యాధివిశేషము), వాపు, ఒడలిబలుపు, ఉదర్దము (దద్దులు), అభిష్యందము (కండ్లలో నీరుగారు నేత్రవ్యాధి, లేక శరీరమునందలి రంధ్రములనుండి స్రవించురోగము), శరీరమునందలి జిడ్డు, చెమట, ద్రవము, మలములు వీని నన్నింటిని పోగొట్టును. అన్నమును రుచింపజేయును. దురదను పోగొట్టును. వ్రణముల మాన్పును. ఆన్తరబాహ్యక్రిములను చంపును. శరీరమునందలి మాంసమును లేఖనముచేయును. గడ్డకట్టిన రక్తమును భేదించును. శరీరబంధములను (అవయవముల పట్టును) విడదీయును. స్రోతోమార్గముల నడ్డులేకుండునట్లు చేయును. కఫమును శమింపజేయును. లఘుత్వము (తేలిక), ఉష్ణము (వేడి), రూక్షత్వము (జిడ్డులేకుండుట) అను నీగుణములు కల్గియుండును.

కటురసాతిమాత్రోపయోగమున గల్గురోగములు.

మూ స ఏవంగుణోఽపి ఏక ఏవాత్యర్థ ముపయుజ్యమానః విపాకప్రభావాత్ పుంస్త్వముపహన్తి, రసవీర్యప్రభావాన్మోహయతి, గ్లాపయతి, సాదయతి, కర్శయతి, (వర్ధయతి), మూర్ఛయతి, నమయతి, తమయతి, భ్రమయతి, కణ్ఠం పరిదహతి, శరీరతాపముపజనయతి, బలం క్షిణోతి, తృష్ణాం జనయతి, వాయ్వగ్నిబాహుళ్యాత్ భ్రమ-దవథు-(మద-వమథు)-కమ్ప-తోద-భేదైః చరణభుజపార్శ్వపృష్ఠప్రభృతిషు, మారుతజాన్ వికారాన్ ఉపజనయతి. ౬౬

వ్యా. కటురసము పైజెప్పినగుణముల గల్గియున్నను దానినొక్కదానినే మితిమీరి యుపయోగించినచో దానివిపాకముయొక్క ప్రభావమునంజేసి పురుషత్వమును (శుక్రమును) నశింపజేయును. రసముయొక్కయు వీర్యముయొక్కయు ప్రభావమునం

జేసి చిత్తభ్రమమును కల్గించును. మనస్సంతోషమును హరించును. శరీరమును కృశింప జేయును. ధాతువుల క్షీణింపజేయును. మూర్ఛ కల్గించును. శరీరమును వంగునట్లు చేయును. చీకటిలోనున్నవిధముగ కండ్లబూచులు గ్రమ్మజేయును. చక్రముపైనున్నవానివలె నొడలు తిరుగునట్లు చేయును. కుత్తుకలో మంటబుట్టించును. శరీరమున మంటను వేడిని పుట్టించును. శరీరబలమును నశింపజేయును. డప్పిని కల్గించును.

మరియు నీకటురసము వాయ్వగ్నిబాహుళ్యముచే కల్గినది కావున అట్టికారణమునంజేసి పాదములు, భుజములు, ఇరుప్రక్కలు, వీపు మున్నగునవయవములయందు భ్రమము, కంపము, పోటు, పగులదీయువిధముగ బాధ, ఇట్టియుపద్రవములతో గూడిన వాతరోగముల గల్గించును.

ఇచ్చట చరణాద్యవయవములయందు వాతరోగములు ప్రాయికముగ కల్గును కావున నుదహరింపబడినది. మరియు "విపాకప్రభావాత్" "రసవీర్యప్రభావాత్" అను హేతువులు ఉదాహరణముగ జూపబడినవి. దీనినిబట్టి తక్కినరసములయందు విపాక రసవీర్యములకు సంబంధించిన కార్యముల నూహించునది. (తక్కినరసములయందును వానివానికి జెప్పిన కృత్యములు రసవీర్యవిపాకకృత్యములని యర్థము. కటురసమునకు విపాకము కటువుగనే యుండును. ఆయారసముల విపాకములు క్రింద వివరింపబడును)

## తిక్తరసకృత్యములు, గుణములు.

మూ. తిక్తో రసః స్వయమరోచిష్ణుః, అరోచకఘ్నః, విషఘ్నః, క్రిమిఘ్నః, మూర్ఛా-దాహ-కణ్డూ-కుష్ఠ-తృష్ణా-ప్రశమనః, త్వఙ్మాంసయోః స్థిరీకరణః, జ్వరఘ్నో, దీపనః, పాచనః, స్తన్యశోధనో, లేఖనః, క్లేదమేదోవసామజ్జలసీకా పూయస్వేదమూత్రపురీషపిత్తశ్లేష్మోపశోషణః, రూక్షశ్శీతో లఘుశ్చ.                ౨౦

వ్యా. తిక్తరసము (చేదు) తినుటకు రుచికరముగనుండదు. అయినను అరోచకమును హరించును. విషమును క్రిములను హరించును. మూర్ఛ, తాపము, దురద, కుష్ఠరోగము, దప్పి వీనినన్నిటెని శమింపజేయును. చర్మమును మాంసమును దృఢపరచును. జ్వరమును హరించును. అగ్నిని దీపింపజేసి యాహారమును జీర్ణింపజేయును. స్తన్యమును (చనుబాలను) శుభ్రపరచును. దోషముల (మలాదుల) లేఖనముచేయును. ద్రవము, మేదస్సు, వస (మాంసస్నేహము), మజ్జ (మూలగ), చీము, చెమట, మూత్రము, పురీషము, పిత్తము, శ్లేష్మము, వీనిని శోషింపజేయును. రూక్షశీతలఘుగుణముల గల్గియుండును.

తిక్తరసము నధికముగ నుపయోగించుటచే గల్గురోగములు.

మూ. స ఏవంగుణోఽపి ఏక ఏవాత్యర్థముపయుజ్యమానః రౌక్ష్యాత్ ఖరవిశదస్వభావాచ్చ రసరుధిరమాంసమేదోఽస్థిమజ్జశుక్రాణ్యుచ్ఛోషయతి, స్రోతసాంఖరత్వముపపాదయతి,బలమాదత్తే, కర్షయతి, గ్లపయతి, మోహయతి, భ్రమయతి, వదనముపశోషయతి, అపరాంశ్చ వాతవికారానుపజనయతి. ౭౧

వ్యా. తిక్తరసము పైజెప్పినగుణముల గల్గియున్నను దానినొక్కదానినే యధికముగ మితిమీరి యుపయోగించినయెడ రూక్షగుణంబును ఖరవిశదస్వభావంబును కల్గియుండుటవలన రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థులు, మజ్జ, శుక్రమునను సప్తధాతువులను శోషింపజేయును. స్రోతోమార్గముల ద్రవము నెండించి కరకుదనమును కల్గించును. శరీరబలమును నశింపజేసి కృశింపజేయును. హర్షమునునశింపజేయును. మూర్ఛనొందించును. ఒడలు తిరుగునట్లుచేయును. నోట ద్రవము నెండించును. ఇవియేగాక యితరములగు వాతరోగముల గూడ కల్గించును.

కషాయరసకృత్యములు, గుణములును.

మూ. కషాయో రసః సంశమనః, సంగ్రాహీ, సన్ధారణః, పీడనో, రోపణః, శోషణః, స్తమ్భనః, శ్లేష్మరక్తపిత్తప్రశమనః, శరీరక్లేదస్యోపయోక్తా, రూక్షశ్శీతో గురుశ్చ. ౭౨

వ్యా. కషాయరసము (వగరు) దోషముల శమింపజేయును. విరేచనాదుల నిరోధించును. మలాదుల వెడలనీయక ధరింపజేయును. వ్రణవ ల బిగదీయును. వ్రణముల మాన్పును. ద్రవమును శోషింపజేయును. ఆమమును స్తంభింపజేయును.(పక్వముకానిపదార్థమును ఆమాశయముననే స్తంభింపజేయును). శ్లేష్మమును రక్తమును పిత్తమును శమింపజేయును. శరీరమునందలి ద్రవమునుపీల్చును. రూక్ష శీత గురు గుణములగల్గియుండును.

ఇచ్చట "రూక్షశ్శీతో లఘుశ్చ" అను పాఠాంతరమున అకారమును ప్రశ్లేషము చేసి 'అలఘుః' అని విభజించనగును. గురువు అని యర్థము. వాగ్భటాచార్యులును "కషాయః పిత్తకఫహా గురురస్రవిశోధనః" అని గురుగుణమునే చెప్పిరి. సుశ్రుతాచార్యులు "కషాయో రసో లాఘునాత్ వాతం వర్ధయతి" అని లాఘువమును చెప్పినది విపాకకృతలాఘువమని యెరుంగునది. కషాయము విపాకమున కటువగుటచే లఘుత్వము సంగతమగును. ప్రకృతమున 'గురుశ్చ' అనుపాఠము నిర్వివాదము.

—॥ కషాయరసము నధికముగ నుపయోగించుటచే గల్గురోగములు. ॥—

మూ. స ఏవం గుణోఽపి ఏక ఏవాత్యర్థముపయుజ్యమానః ఆస్యం శోషయతి, హృదయం పీడయతి, ఉదరమాధ్మాపయతి, వాచం నిగృహ్ణాతి, స్రోతాంస్యవబధ్నాతి, శ్యావత్వమాపాదయతి, పుంస్త్వముపహంతి, విష్టభ్య జరాం గచ్ఛతి, వాతమూత్ర పురీషరేతాంసి అవగృహ్ణాతి, కర్శయతి, గ్లాపయతి, తర్షయతి, స్తమ్భయతి, ఖరవిశదరూక్షత్వాత్ పక్షవధగ్రహాఽపతానకాఽర్దితవాతప్రభృతీంశ్చ వాతవికారానుపజనయతి. ౭౩

వ్యా. కషాయరసము పైజెప్పినగుణములు కల్గియున్నను దాని నొక్కదానినే యధికముగ నుపయోగించినచో నోటిని యెండించును. హృదయమున పట్టినట్లు బాధ కల్గించును. కడుపు నుబ్బరింపజేయును. కాక్కును బంధించి మాటవెడలనీయక పట్టు బట్టును. స్రోతోరంధ్రముల బంధించును. శరీరముపై శ్యామలవర్ణమును కల్గించును. పుంస్త్వమును నశింపజేయును. మలమును బంధించి కడుపులో గడబిడచేసి జీర్ణమగును. వాతమును మూత్రమును పురీషమును శుక్రమును వెడలనీయక బంధించును. శరీరమును కృశింపజేయును. హర్షమును నశింపజేయును. దప్పిని కల్గించును. అవయవాదులను స్తంభింపజేయును. ఖరవిశదరూక్షగుణములు కల్గియుండుటంబట్టి వాతమును ప్రకోపింప జేసి పక్షవధము, పార్శ్వగ్రహము, అపతానకము, అర్దితము మున్నగువాతరోగముల గల్గించును.

—॥ షడ్రసములగుణ-అవగుణములు మాత్రాధీనములనుట. ॥—

మూ. ఇత్యేవమేతే షడ్రసాః పృథక్త్వేనైకత్వేన వా మాత్రశః సమ్యగుపయుజ్యమానాః ఉపకారకరా భవన్తి అధ్యాత్మలోకస్య; అపకారకరాః పునరతోఽన్యథా ఉపయుజ్యమానాః; తాన్విద్వానుపకారార్థమేవ మాత్రశః సమ్యగుపయోజయేత్. ఇతి.

వ్యా. పైజెప్పినరీతిగ నారురసములను తగినపరిమాణము ననుసరించి వేరువేరుగ నైనను, ఒకటిగ రెండేసిమూడేసి యనేకరసముల నొకటిగ జేర్చి తగినపరిమాణము గల్పించియైన నుపయోగించినచో ప్రాణికోటి కుపకారమును కల్గించును. అటుగాక పరిమితిలేక మితిమీరి యుపయోగించినచో రోగరూపమైన యపకారమును కల్గించును. కావున విద్వాంసుడగు వైద్యవరుడు పైజెప్పిన రసకృత్యములను గుణాదులను చక్కగ

గమనించి ప్రాణికోటి కుపకారమును గల్గింపగోరి యుక్తమైనపరిమితిని కల్పించి విధ్యుక్త ప్రకారము చక్కఁగ నుపయోగింపవలెను.

ఉష్ణశీతద్వివిధవీర్యనిర్ణయము.

మూ. శీతం వీర్యేణ, యద్ద్రవ్యం మధురం రసపాకయోః,
తయోరమ్లం యదుష్ణం చ, యద్ద్రవ్యం కటుకం తయోః. ౭౫

వ్యా. ఏద్రవ్యము రసమునందును విపాకమునందును మధురముగ నుండునో అట్టి ద్రవ్యము వీర్యముచే శీతముగ నుండును. (రసవిపాకములయందు మధురముగనుండు ద్రవ్యము శీతవీర్యము కల్గియుండునని భావము.) మరియు రసవిపాకములయందు అమ్లముగనుండుద్రవ్యము ఉష్ణవీర్యము కల్గియుండును. మరియు రసవిపాకములయందు కటుకముగనుండు ద్రవ్యము కూడ ఉష్ణవీర్యము కల్గియుండును.

ఇచ్చట "ఏద్రవ్యము రసముచే మధురమో అయ్యది శీతవీర్య"మని చెప్పక "రసపాకయోః" అని చెప్పుటచేత మధురరసోచితపాకము కలద్రవ్యము శీతవీర్యమని యర్థము. (రసమునందైనను విపాకమునందైనను మధురమైనద్రవ్యము శీతవీర్యమని ఫలితార్థము). ఈరీతిగనే యమ్లకటుకములకును ఉష్ణవీర్యము నెరుంగునది. రసవిశేషమును బట్టియు, విపాకవిశేషమునుబట్టియు శీత-ఉష్ణవీర్యముపరిజ్ఞానము నెరుంగవలెననిభావము. (విపాకము క్రింద వివరింపబడును).

రసమూలకముగ ద్రవ్యగుణనిర్దేశమున విశేషవిధి.

మూ. తేషాం రసోపదేశేన నిర్దేశ్యో గుణసఙ్గ్రహః,
వీర్యతోఽవిపరీతానాం పాకతశ్చోపదేక్ష్యతే. ౭౬
యథా పయో యథా సర్పిః యథా వా చవ్యచిత్రకౌ,
ఏవమాదీని చాన్యాని నిర్దిశేద్రసతో భిషక్. ౭౭

వ్యా. మధురాదిరసములకు గుణముల చెప్పునపుడు "తత్ర మధురో రసః...... శీతో గురుశ్చ"ఇత్యాదిగ్రంథముచేత మధురాదిద్రవ్యములకు రసద్వారకముగ గుణములు నిర్దేశింపబడినవి. అందు మధురతిక్తకషాయరసములు కలద్రవ్యములకు శీతగుణంబును, కటు-అమ్ల-లవణరసములు కలద్రవ్యములకు ఉష్ణగుణంబును చెప్పబడినది. అట్టినిర్ణయము వీర్యముచేతను విపాకముచేతను విపరీతము (విరుద్ధము) కాని మధురాదిరసములుగల క్షీరాదిద్రవ్యములకు మాత్రము నిర్దేశింపదగును; కాని వీర్యవిపాకములకు విరుద్ధములైన రసములుకలద్రవ్యములకు నిర్దేశింపదగదు.

వివరణము—"కటుతిక్త........లవణస్తథా" అనుశ్లోకముచేత కటుతిక్త కషాయరసములకు కటువిపాకంబును, అమ్లరసమునకు అమ్లవిపాకంబును, మధురలవణములకు మధురవిపాకంబు నుపదేశింపబడును. "శీతం వీర్యేణ.........కటుకం తయోః" అనుశ్లోకముచేత రసవిపాకములచే మధురమైనద్రవ్యము శీతవీర్యమగుననియు, అట్టి రసవిపాకములచే నమ్లంబైనను కటుకంబైనను అట్టిద్రవ్యము ఉష్ణవీర్యమనియుం నిర్ణయింపబడినది. ఇట్టి నిర్ణయము ననుసరించి వీర్యమునకును విపాకమునకు విరుద్ధముకాని మధురాది రసములు కలద్రవ్యములు ఆయారసములకు నియమింపబడిన శీతగుణంబైనను ఉష్ణగుణంబైనను కల్గియుండునని చెప్పదగును. అటుగాక రసవిపాకములకు విరుద్ధమైయున్నచో రసమూలకముగ వానిగుణము నిర్దేశింపదగదు. (కొన్నిద్రవ్యములయందు రసమునకు విహితమైన వీర్యవిపాకములుగాక వ్యత్యస్తముగకూడ కల్గును. అట్టి యెడ రసమునకు విహితమైనగుణము ద్రవ్యమునకు చెప్పదగదని భావము.)

వీర్యవిపాకములకు విపరీతముకానిరసమున కుదాహరణము "యథాపయః......భిషక్" అని యుపదేశింపబడినది:—క్షీరము (ఆవుపాలు), చవ్యము, చిత్రమూలము, మున్నగునవి వీర్యవిపాకములకు విపరీతముకానిరసము కల్గినవికావున అయ్యవి రసమునకు చెప్పబడినగుణములు కల్గియుండునని రసమూలకముగ గుణనిర్దేశము వైద్యుడు చేయవలెనని యర్థము.

ఇచ్చట పాలును నెయ్యియుం మధురరసంబును మధురవిపాకంబును నగును. శీతవీర్యముగ నుండును. కావున నీరెండును వీర్యవిపాకములకు విపరీతముకాని మధురరసము కల్గినవి. దానంజేసి యీరెండును రసద్వారకముగ శీతగుణము కల్గినదని యెరుంగునది. చవ్యచిత్రకములకు నిత్తెరంగున రసద్వారకముగ గుణనిర్దేశము చేయదగును. "ఏవమాదీని" అనుటచేత గోధుమలు మున్నగు వీర్యవిపాకావిపరీతముల కిత్తెరంగున గుణనిర్దేశము చేయదగును.

మరియుం పిప్పలి కటురసము కల్గినది. విపాకమున మధురమగును. కటురసమునకు కటువిపాకము సహజము. అటుగాక విరుద్ధమగు మధురవిపాకము కల్గినది. కావున రసద్వారకముగ ఉష్ణగుణమును చెప్పదగదు. మధురవిపాకము ననుసరించి శీతగుణమునే నిర్దేశింపనగునని యెరుంగునది.

### రసాదివైపరీత్యమున గుణనిర్దేశనిర్ణయము.

మూ. మధురం కిఞ్చిదుష్ణం స్యాత్ కషాయం తిక్తమేవ చ,
యథా మహత్పఞ్చమూలం, యథాఽబ్జానూపమామిషం. ౭౮
లవణం సైంధవం నోష్ణం, అమ్లమామలకం తథా,

వ్యా. మధురరసములుకల ద్రవ్యములలో నొకానొకటి యుష్ణగుణమగును. అత్తెరంగుననే కషాయతిక్తరసములు కలద్రవ్యములలో కొన్ని యుష్ణగుణములగును. మధురరసముకలద్రవ్యము విపాకభేదముచే నుష్ణవీర్యమగును. ఎట్లులన జలజంతువుల మాంసంబును అనూపజంతువులమాంసంబును మధురరసంబైనను వీర్యముచే నుష్ణంబగును. కషాయతిక్తరసములు ఒకప్పుడు ఉష్ణవీర్యము లగును. ఎట్లులన.—బిల్వాదిమహాపంచమూలములు కషాయతిక్తరసములు కల్గియున్నను శీతవీర్యములుగాక ఉష్ణవీర్యములగును.

మరియు లవణరసము ఉష్ణగుణము కల్గియున్నను, సైంధవలవణము ఉష్ణముగాక శీతవీర్యమగును. ఉసిరికాయ అమ్లరసమగుటచే నుష్ణగుణమగుట యుక్తముగనున్నను, అటుగాక శీతవీర్యమగును. ఇది రసాదివిపరీతవీర్యగుణకల్పనక్రమము.

కొన్నిద్రవ్యములలో రసమునకు విరుద్ధగుణములు.

మూ. అర్కాఽగురుగుడూచీనాం తిక్తానాముష్ణముచ్యతే. ౭౯
కిఞ్చిదమ్లం హి సఙ్గ్రాహి కిఞ్చిదమ్లం భినత్తి చ,
యథా కపిత్థం సఙ్గ్రాహి, భేది చామలకం తథా. ౮౦

వ్యా. మరియుం జిల్లేడు, అగరు, తిప్పతీగె ఈమూడును తిక్తరసము కల్గియున్నను ఉష్ణవీర్యములగును. (తిక్తరసము శీతగుణము శీతవీర్యను కల్గియుండవలసినను జిల్లేడు మున్నగునవి వీర్యముచే విపరీతముగ నుష్ణమై యుండునని భావము.) మరియు నమ్లరసము కలద్రవ్యములలో కొన్ని మలమును బద్ధగించును. కొన్ని మలమును భేదించును. ఎట్లులన:—వెలగ అమ్లరసము కల్గియుం మలమును బంధించును. ఉసిరికకాయ యమ్లరసమైయ్యును మలమును భేదించును.

మూ. కషాయ స్తమ్భనశ్శీతః సోఽభయాయామతోఽన్యథా,
పిప్పలీ నాగరం వృష్యం, కటు చాఽవృష్యముచ్యతే ౮౧

వ్యా. కషాయరసము స్తంభనంబును శీతగుణంబునునగును. అట్టి కషాయరసముకల కరకకాయ పైజెప్పినగుణములకు విపరీతముగ మలము భేదించును. ఉష్ణవీర్యము కల్గియుండును. మరియుం పిప్పళ్లును శుంఠియు కటురసము కల్గియుండియుం వృష్యము(శుక్రవర్ధకము)లగును. కటురసకృత్యము అవృష్యత్వము అయినను దానికివిపరీతముగ వృష్యములగును. (ఈరెండును కటుకరసము కల్గియున్నను కటువిపాకములు కాక రసవిపరీతమైన మధురవిపాకము కల్గియుండును. దానంజేసి వృష్యములని భావము).

మూ. తస్మాద్రసోపదేశేన న సర్వం ద్రవ్యమాదిశేత్,
దృష్టం తుల్యరసేఽప్యేవం ద్రవ్యే ద్రవ్యే గుణాన్తరం. ౮౨

వ్యా. పైజెప్పినరీతిగ సమానరసములు కల ద్రవ్యములయందును గుణాంతరము (గుణభేదము) కానవచ్చుచున్నది. కావున ద్రవ్యములకు కేవలము రసములబట్టియే గుణాదుల నిర్ణయింపవలనుపడదు. (కావున రసవీర్యాద్యనుసారముగ వానివానిగుణాంతరముల ననుభవసిద్ధముగ నిర్ణయింపనగునని భావము.)

రసములకు నిర్ణీతములైనగుణములకు రసభేదముచే తారతమ్యము.

మూ. రౌక్ష్యాత్కషాయో రూక్షాణాం ఉత్తమో మధ్యమః కటుః,
తిక్తోఽవరః తథోష్ణానాముష్ణత్వాల్లవణః పరః. ౮౩
మధ్యోఽమ్లః కటుకశ్చాన్త్యః; స్నిగ్ధానాం మధురః పరః,
మధ్యోఽమ్లః లవణశ్చాన్త్యః రసస్స్నేహాన్నియచ్ఛతి (న్నిరుచ్యతే)
మధ్యోత్కృష్టావరాః శైత్యాత్ కషాయ-స్వాదు - తిక్తకాః,
స్వాదుర్గురుత్వాదధికః, కషాయాల్లవణోఽవరః. ౮౪
అమ్లాత్కటుః తతస్తిక్తో లఘుత్వాదుత్తమోత్తమః,

వ్యా. కషాయాదిద్రవ్యములకు రూక్షాదిగుణములు గుణనిర్దేశమున చెప్పబడినది. అట్టిగుణములకు రసభేదములచే తారతమ్యము "రౌక్ష్యాత్కషాయః" ఇత్యాదిగ్రంథముచే నిర్ణయింపబడును.—రూక్షద్రవ్యములలో కషాయరసము కలద్రవ్యము రూక్షత్వముచే నుత్తమముగ నుండును. కటురసద్రవ్యము మధ్యమముగను, తిక్తరసద్రవ్యము అధమముగను ఉండును. (కషాయరసమున రూక్షత్వమధికముగను, కటురసమున మధ్యమముగను, తిక్తరసమున స్వల్పముగను ఉండునని భావము. ఇత్తెరంగుననే క్రింద చెప్పబడు నుష్ణాదులకును తారతమ్యము నెరుంగునది.)

ఉష్ణగుణముచే లవణరసము ఉత్తమంబును, మధురరసము మధ్యమంబును, కటురసము అధమంబును నగును. స్నిగ్ధద్రవ్యములలో స్నిగ్ధత్వముచే మధురరస ముత్తమంబును, అమ్లరసము మధ్యమంబును, లవణరసము అధమంబునగును.

శీతత్వగుణము కషాయరసమున మధ్యమముగను, మధురరసమున నుత్తమముగను, తిక్తరసమున అధమముగను ఉండును.

గురుత్వము మధురరసమున నధికముగను, కషాయరసమున మధ్యమముగను, లవణరసమున స్వల్పముగను ఉండును.

లఘుత్వము చేత అమ్లరసమునకన్న కటురసంబును, దానికన్న తిక్తరసంబును ఉత్తమోత్తమములు. (లఘుత్వము తిక్తరసమున నధికముగను, కటురసమున మధ్యమంబుగను, అమ్లరసమున స్వల్పముగను ఉండునని భావము.)

గుణతారతమ్యమున మతాంతరము.

మూ. కేచిల్లఘూనామవరమిచ్ఛన్తి లవణం రసం. ౮౬
గౌరవే లాఘవే చైవ సోఽవరస్తూభయోరపి,

వ్యా. కొందరాచార్యులు లఘుగుణముకల ద్రవ్యములలో లవణరసము అధవమని (అల్పలాఘవముకలదని) చెప్పెదరు. ఈ రెండుమతములయందును లఘుత్వగుణమందును గురుత్వమునందును లవణరసము అధమముగనే యుండునని యభిప్రాయము.

వివరణము:—ఈతంత్రకారుడు "స్వాదుర్గురుత్వాదధికః కషాయాల్లవణోఽవరః" అనువాక్యముచేత లవణరసము మధుర కషాయరసములకన్న స్వల్పముగ గురుత్వము కల్గియుండునని చెప్పెను గాన వీరిమతమున లవణరసము అల్పగురువు. ఇంకొకమతమున లఘుగుణముకల అమ్ల కటు తిక్తరసములకన్న కొంచెము గురుత్వము కల్గియుండునని యభిప్రాయము. వీరిమతమునను అమ్లాది మూడురసములయందు గురుత్వము బొత్తుగ లేదు. లవణరసమున అటుకాక కొంచెముగ గురుత్వము కల్గియుండుననియు అమ్లరసమునకన్న కొంచెము లాఘవమును కల్గియుండుననియు నభిప్రాయము. ఈరెండు మతములయందును గౌరవమునందైనను, లాఘవమునందైనను లవణరసము అవరము. ఉభయమతములయందును లవణరసము అల్పగురువనుట నిర్వివాదమని "సోఽవరస్తూభయోరపి" అని ప్రతిసంస్కర్త మతద్వయమునకు సామరస్యమును జెప్పెను.

## త్రివిధవిపాకలక్షణములు.

మూ. పరం చాతో విపాకానాం లక్షణం సంప్రచక్ష్యతే, ౮౭
కటుతిక్తకషాయాణాం విపాకః ప్రాయశః కటుః,
అమ్లోఽమ్లం పచ్యతే స్వాదుర్మధురం లవణస్తథా. ౮౮

వ్యా. పిమ్మట నీక్రింద విపాకలక్షణము చెప్పబడును.—("జాఠరేణాగ్నినా యోగాద్యదుదేతి రసాన్తరం, రసానాం పరిణామాన్తే సవిపాక ఇతిస్మృతః" అను తంత్రాంతరవాక్యముచేత విపాకసామాన్యలక్షణము చెప్పబడినది. మధురాదిరసములుకల ద్రవ్యములను భుజించినయెడ నయ్యవి జాఠరాగ్నిసంబంధమునంజేసి జీర్ణమయిన పిదప కల్గునట్టిరూపాంతరము విపాకమని యర్థము. అయ్యది మధుర, అమ్ల, కటుభేదములచే మూడువిధములని "త్రిధా విపాకో ద్రవ్యస్య స్వాద్వమ్లకటుకాత్మకః" అనువాక్యముచే వాగ్భటాచార్యులు చెప్పిరి.)

అందు కటుతిక్తకషాయరసములుకల ద్రవ్యములు ప్రాయికముగ కటువిపాకము కల్గియుండును. (అట్టిరసములుకల ద్రవ్యములను భుజించినచో జాఠరాగ్ని సంయోగమునంజేసి జీర్ణమైనపిదప కటురసముగ పరిణమించునని భావము.) అమ్లరసముకల ద్రవ్యము అమ్లముగనే తరుచుగ విపాకము జెందును. మధురలవణరసములుకల ద్రవ్యములు తరుచుగ మధురముగనే విపాకము జెందును.

ఇచ్చట కేవలరసములకు (ద్రవ్యసంబంధము లేక) జాఠరాగ్నిసంయోగము అసంభవము కావున మధురాదిశబ్దములచే వాని కాశ్రయములగు గుడము లవణము మున్నగు ద్రవ్యములు గ్రహింపబడును. మరియుం "ప్రాయశః" అనుటచేత కొన్నిద్రవ్యములు ఈ నియమమునకు వ్యతిరేకముగను విపాకము జెందునని భావము. ఎట్లులన వరిబియ్యము మధురరసము కల్గినది. అయ్యది పైజెప్పినప్రకారము మధురముగ విపాకము జెందవలసినను, అటుగాక అమ్లవిపాకము జెందును. కరకకాయలో కషాయరస మధికముగ నుండుటంజేసి కటువిపాకము జెందవలెను. అటుగాక మధురముగ విపాకము జెందును. శుంఠి, పిప్పలి, అమ్లము, ఇవి మూడును కటురసము కల్గినవి. ఇయ్యవి కటువిపాకము జెందవలసినను మధురముగ విపాకము జెందును. ఇట్టిరసాననుగుణవిపాకము లుండుటంజేసియే "ప్రాయశః"అని చెప్పబడినది.

### విపాకముల ప్రత్యేకలక్షణములు.

మూ. మధురో లవణామ్లౌ చ స్నిగ్ధభావాత్త్రయో రసాః,
వాతమూత్రపురీషాణాం ప్రాయో మోక్షే సుఖా మతాః. ౧౯
కటుతిక్తకషాయాస్తు రూక్షభావాత్త్రయో రసాః,
దుఃఖాయ మోక్షే దృశ్యన్తే వాతవిణ్మూత్రరేతసామ్ ౨౦

వ్యా. మధురరసంబును, అమ్లలవణరసంబులును ఈ మూడురసములును స్నిగ్ధగుణము కల్గియుండును. అట్టి స్నిగ్ధత్వమువలన వాతమూత్రపురీషములను విసర్జింపజేయుటకు సుఖకరములై యుండును. (సుఖముగ వాతాదుల విసర్జింపజేయుననుట.) ఈ మూడురసములకు జెప్పిన స్నిగ్ధభావము అట్టిరసములచే గల్గిన విపాకావస్థయందును కల్గును కావున మధురలవణరసములచేనైన మధురవిపాకమునకును, అమ్లరసముచేనైన యమ్లవిపాకమునకును స్నిగ్ధగుణముండును. దాంజేసి మధురామ్లవిపాకంబులును మధురామ్లలవణములబోలె వాతమూత్రపురీషముల విసర్జనమునకు సుఖకరములని యర్థము.)

మరియుం కటుతిక్తకషాయరసములు మూడును రూక్షగుణము కల్గియుండుటంజేసి వాతమూత్రపురీషశుక్రముల విసర్జించుటకు కష్టమునుకల్గించును.(కావున అట్టి రసములచేనైన కటువిపాకమునందును వాతాదివిసర్జనమునకు కష్టమును కల్గించునని భావము.) ఇచ్చట ప్రాయః అనుటవలన పైజెప్పినగుణములు తరుచుగ నుండునని యర్థము.

### విపాకకృత్యములు, స్వరూపలక్షణము.

మూ. శుక్రహా బద్ధవిణ్మూత్రో విపాకో వాతలః కటుః,
మధురస్సృష్టవిణ్మూత్రో విపాకః కఫశుక్రలః. ౨౧
పిత్తకృత్ సృష్టవిణ్మూత్రః పాకోఽమ్లః శుక్రనాశనః,
తేషాం గురుస్స్యాన్మధురః కటుకాఽమ్లావతోఽన్యథా. ౨౨

వ్యా. కటువిపాకము శుక్రమును నశింపజేయును. మలమూత్రముల బంధించును. (పైజెప్పినరీతిగ రూక్షగుణము కల్గియుండుటంజేసి శుక్రహానికరంబును మలమూత్రబద్ధకంబు నగునని భావము.)

మరియు మధురవిపాకము (అట్టి స్నిగ్ధగుణము కల్గియుండుటచేత) మలమూత్రముల సుఖముగ విసర్జింపజేయును. శుక్రమును వృద్ధినందించును. అమ్లవిపాకము మలమూత్రముల విసర్జింపజేయును. శుక్రమును నశింపజేయును. మరియు సామాన్యముగ విపాకములలో మధురవిపాకము గురుత్వము కల్గియు, కటుకామ్లవిపాకములు లఘుత్వము కల్గియు నుండును.

ద్రవ్యగుణతారతమ్యముచేత విపాకతారతమ్యము.

మూ. విపాకలక్షణస్యాఽల్పమధ్యభూయిష్ఠతాం ప్రతి,
ద్రవ్యాణాం గుణవైశేష్యాత్ తత్ర తత్రోపలక్షయేత్. 63

వ్యా. ఇత్తెరంగున విపాకలక్షణము వానిరసముల గుణములబట్టియు, విపాకకృత్యములబట్టియు నిర్ణయింపబడినది. అట్టివిపాకములకు వేరువేర జెప్పినలక్షణములు అల్పముగను, మధ్యముగను, అధికముగను ఉండుటకు ఆయామధురాదిద్రవ్యముల గుణవిశేషములు కారణము లైయుండును; కావున అట్టివిశేషగుణ తారతమ్యమునుబట్టి ఆయావిపాకములకు తారతమ్యమును గమనింపవలెనని భావము.

వివరణము:—మధురాదిరసములు కొన్నిద్రవ్యములయందు స్వల్పముగను, కొన్నిటియందు మధ్యమముగను, కొన్నిటియందు అధికముగను ఉండును. అట్టియెడ విపాకంబును అల్పమధ్య అధిక భేదముల గల్గియుండును. కావున అట్టి రసతారతమ్యమునుబట్టి ఆయారసగుణములు న్యూనాతిరేకములుగ నుండును. అట్టి గుణతారతమ్యముచేత ఆయాస్థలములయందును విపాకలక్షణముల తారతమ్యమును గమనింపవలెనని యాశయము.

ఇచ్చట కొందరు మధురాదిరసము లారును, వేరువేరుగ మధురపాకాదిపాకము నొందును. దానంజేసి మధురపాకము, అమ్లపాకము, లవణపాకము మున్నగు భేదములచే విపాకము లారువిధములుగ నుండునని చెప్పెదరు. మరికొందరు ద్రవ్యమున కొన్నిరసములు జేరియుండునపుడు అందు ఏరసము ప్రబలముగ (అధికముగ) నుండునో అట్టిరసము తక్కినరసములను తనవశముజేసికొనియుండును. అట్టియెడ బలిష్ఠమైన రసముయొక్క పాకమే గానవచ్చును. అప్పుడు రసమునుబట్టి విపాకము లివియని లెక్కించి చెప్ప వీలుకాదు. కావున విపాకమునకు వ్యవస్థ లేదని చెప్పెదరు. ఈరెండుపక్షములయందును రసమునకు విపాకమునకును కృత్యములయందును గుణములయందును భేదమించుకేనియు కనపట్టదు. కావున విపాకమును వేరుగ చెప్పియు ప్రయోజనములేదు. కావున నీరెండుపక్షములును రమణీయములు కానేరవు.

## మధురాదిరసములకు ఉత్పత్తికారణాదుల సులభముగ దెల్పు పట్టిక.

| సంఖ్య | రసము | ఉత్పత్తి కారణము | గుణము | విపాకము | వీర్యము | వృద్ధి కాలము | దోషహరము | దోషకరము | గుణ తార తమ్యము | వివరణము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | మధురము | పృథివి; జలము | స్నిగ్ధము<br>శీతము<br>గురువు | మధురము | శీతము | హేమంత ఋతువు | పిత్తవాత హరము | కఫకరము | స్నిగ్ధతమము<br>శీతతమము<br>గురుతమము | రసముల కన్నిటికిని సమవాయి కారణముజలము మధురాదివిశేషోత్పత్తి కారణము లంపటమునజూపబడినవి. వీనివివరమంతయును నీయధ్యాయమునను తస్యాశితీయమున (౬ అధ్యా) కాలనిర్ణయమును జూచునది. |
| 2 | ఆమ్లము | పృథివి, అగ్ని | లఘువు<br>ఉష్ణము<br>స్నిగ్ధము | ఆమ్లము | ఉష్ణము | వర్ష ఋతువు | వాతహరము | పిత్తకఫ కరము | ఉష్ణతరము<br>స్నిగ్ధతరము<br>అల్పలఘువు | |
| 3 | లవణము | జలము; అగ్ని | గురువు<br>స్నిగ్ధము<br>ఉష్ణము | మధురము | ఉష్ణము | శరదృతువు | వాతహరము | కఫపిత్త కరము | ఉష్ణతమము<br>అల్పస్నిగ్ధము<br>అల్పగురు | |
| 4 | కటుకము | వాయువు; అగ్ని | లఘువు<br>ఉష్ణము<br>రూక్షము | కటువు | ఉష్ణము | గ్రీష్మము | కఫహరము | వాతపిత్త కరము | రూక్షతరము<br>అల్పఉష్ణము<br>లఘుతరము | |
| 5 | తిక్తము | వాయువు; ఆకాశము | రూక్షము<br>శీతము<br>లఘువు | కటువు | శీతము | శిశిరము | పిత్తకఫ హరము | వాతకరము | అల్పరూక్షము<br>అల్పశీతము<br>లఘుతమము | |
| 6 | కషాయము | వాయువు; పృథివి | రూక్షము<br>శీతము<br>గురువు | కటువు | శీతము | వసంతము | కఫపిత్త హరము | వాతకరము | రూక్షతమము<br>శీతతరము<br>గురుతమము | |

## అష్టవిధ, ద్వివిధవీర్యపక్షములు. (పారిభాషికవీర్యము)

మూ. మృదుతీక్ష్ణం గురు లఘు స్నిగ్ధ-రూక్షోష్ణ-శీతలం,
వీర్యమష్టవిధం కేచిత్ కేచిద్ద్వివిధ మాస్థితాః. ౬౪
శీతోష్ణమితి,

వ్యా. మృదువు, తీక్ష్ణము, గురువు, లఘువు, స్నిగ్ధము, రూక్షము, ఉష్ణము, శీతము నని వీర్యము ఎనిమిదివిధముల నుండునని కొందరాచార్యులు వచించెదరు. మరికొందరు శీతము ఉష్ణమునని రెండువిధముల నుండునని చెప్పెదరు.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—పైజెప్పిన యెనిమిదిటిలో గుర్వాదు లారును మధురాదిరసములకు నైసర్గికగుణము లగును. మృదుతీక్ష్ణములు ద్రవనిష్ఠ గుణములు. వాని నిర్దేశించి వీర్యము ఎనిమిదివిధములని అష్టవిధ వీర్యపక్షము. వీర్యము రసాది విపరీతకార్యమును చేయును. అష్టవిధ వీర్యపక్షమున పిచ్ఛిల విశదాదిగుణములు రసాదులకు విపరీతకార్యమును జేయ నేరవు. అట్టియెడ రసమునకు విధించినకృత్యముల నే పిచ్ఛిలాదిగుణములు చేయును. పైజెప్పిన మృద్వాదులకు వీర్యసంజ్ఞ చెప్పియుండుట చేత నవిమాత్రము రసాదుల తిరస్కరించి స్వకృత్యముల జేయును. ఎట్టులన:— పిప్పలి కటురసమగుటంజేసి పిత్తప్రకోపనరూపమైన రసకృత్యమును తిరస్కరించి, దానియందలి మృదుశీతవీర్యము పిత్తమును శమింపజేయును. ఇదియే వీర్యమునకు రస విపరీతకార్యకారిత్వము, తిక్తానురసమై కషాయరసముకల పంచమూలములు రసకృత్యమైన వాతప్రకోపమును జేయక, ఉష్ణవీర్యముచే వాతశమనరూపమైన రస విపరీతకార్యమును జేయును. ఇదియును రసవిపరీతకృత్యము వీర్యకృతము. సుశ్రుతా చార్యుడును "ఏతాని ఖలు వీర్యాణి స్వబలగుణోత్కర్షాత్ రసమభిభూయ ఆత్మకర్మ కుర్వన్తి" అనువాక్యముచేత వీర్యమునకు రసవిపరీతకార్యకారిత్వము నుపదేశించెను. ఇది అష్టవిధ వీర్యపక్షాశయము.

"నానాత్మకమపి ద్రవ్యం అగ్నీషోమౌ మహాబలౌ, వ్యక్తావ్యక్తం జగదిదం నాతిక్రామతి జాతుచిత్" అని చెప్పినప్రకారము స్థావరజంగమరూపమైన ద్రవ్యజాల మంతయుం పాంచభౌతికమైనను కొన్ని యాగ్నేయంబులును కొన్ని సౌమ్యంబులునై యుండునుకాని అగ్నిసోమగుణముల నతిక్రమించి యుండుటలేదు. మధురాదిరసముల లోను ఉత్పత్తికారణానుగుణముగ మధుర-తిక్త-కషాయములు మూడును సౌమ్యంబు లును, అమ్లలవణకటుకములు ఆగ్నేయంబులు నగును. అందు సౌమ్యగుణము శీతం బును, ఆగ్నేయగుణము ఉష్ణంబు నగును కావున వానిని ప్రధానముగ జేసి ద్రవ్యనిష్ఠ

వీర్యము శీతోష్ణభేదములచే రెండువిధముల నుండునని వీర్యద్వైవిధ్యమతాభిప్రాయము. ఈరెండు మతములయందును వీర్యమనునది పారిభాషికము. కార్యనిర్వాహకమైన ద్రవ్యనిష్ఠ గుణవిశేషమునకు వీర్యమని పేరు. అయ్యది మృదుతీక్ష్ణాది రూపముగ నుండు ననియు, లేక శీతోష్ణరూపముగ నుండుననియు, పైపక్షముల రెంటియందు సంజ్ఞ చేయబడినది. కావున వీర్యము పారిభాషికము, (ఈరెండుపక్షములకును విశేషభేదము కన్పట్టదు.)

ఇట్టి పారిభాషికమైన ద్వివిధవీర్యంబులును ఈతంత్రకారుల కభిమతములు.కావు ననే యీక్రింద ప్రభావమును చెప్పునపుడు "రసవీర్యవిపాకానాం...స్మృతః" అని చెప్పిరి. (పారిభాషికరసవీర్యాదులచే నిర్దేశింప నలవిగాని కృత్యము ప్రభావకృతమని యర్థము.)

మూ. వీర్యంతు క్రియతే యేన యా క్రియా,
నాఽవీర్యం కురుతే కిఞ్చిత్ సర్వా వీర్యకృతా క్రియా. ౬౫

వ్యా. రసవిపాక ప్రభావములకన్న వేరై, వాతశామకాదికార్యముల జేయం నట్టిగుణవిశేషము వీర్యమని యాయుర్వేదమున పారిభాషికముగ జెప్పబడినది. అయ్యది మృద్వాదిరూపమున నష్టవిధమనియుం, శీతోష్ణరూపమున రెండువిధములనియుం పక్ష ద్వయము కొందరిమతమని పైన చెప్పబడినది. అట్టిపక్షద్వయమున పారిభాషికవీర్యమును అంగీకరించుచు తంత్రకారుడు స్వమతమున శక్తిపర్యాయరూపమైన వీర్యలక్షణమును "వీర్యంతు...క్రియా" అనిచెప్పెను:—

('యేన' అనునది కరణార్థకతృతీయాన్తము.) ద్రవ్యము దేనిని (ఏశక్తిని) సాధనముగ జేసికొని యేకార్యమును జేయంనో, అట్టిసాధనము (శక్తి) ఆక్రియయందు వీర్యమని చెప్పబడును. లోకమున వీర్యములేక యేదియుం నొకపనిని చేయనోపదు. ఏపని చేయుంటకైనను అట్టిపనిని సాధింపదగినశక్తి ప్రతివస్తువునందును అవశ్యముండి తీరవలెను. అట్టిశక్తిని సాధనముగ జేసికొనియే ప్రతివస్తువును కార్యసమర్థమగును. కావున నట్టిలోకన్యాయము ననుసరించి ద్రవ్యము దేనినిసాధనముగ జేసికొని కార్యముల జేయంనో అట్టిసాధనము వీర్యమని యర్థము.)

వివరణము:—లోకమున నేపని జేయవలెనన్నను అట్టిపనిని సాధింపదగినశక్తి ప్రతివస్తువునందును అవశ్యముగ నుండును. అగ్ని ఇతరపదార్థములను కాల్చుట యను భవసిద్ధము. ఆయగ్నియందు కాల్చునట్టి గుణమొక్కటి యుండవలెను. అయ్యది యుష్ణము. దానిని సాధనముగజేసియే అగ్ని కాల్ప సమర్థమగును. అట్టియుష్ణమే

యగ్నికి దహనక్రియయందు శక్తి యనబడును. అట్టి శక్తిమంతములైన ద్రవ్యములే పనులజేయుటకు సమర్థము లగును. అట్టిశక్తి ఒక్కొకకార్యమునకు ఒక్కొకరూపమై యుండును. కావున అనేకశక్తులు తత్తత్కార్యసాధకములుగ వస్తువుల నాశ్రయించి యుండును. అట్టిన్యాయము ననుసరించి ద్రవ్యములయందును పాచన దీపనాదికృత్యముల నిర్వహించుశక్తులు ఇమిడియుండును. అయ్యవి ద్రవ్యములయందు రసములు, విపాకము, ప్రభావము,గుర్వాదిగుణములు నైయుండును. అవియే ఆయాక్రియల జేయ సాధనములు.

కావున ద్రవ్యము తనయందలి క్రియాసాధనశక్తిరూపమైన మధురాదిరసముచేనైనను, మధురాది విపాకముచేనైనను, అచింత్యమైన ప్రభావముచేనైనను గుర్వాది గుణములచేనైనను, తర్పణ హ్లాదనశోధనశమనాదికృత్యముల జేయునో అట్టి ద్రవ్యనిష్ఠమై రసవిపాకాది రూపమైనశక్తి వీర్యమని చెప్పబడునని సముదితార్థము. ఈవిషయమునే సుశ్రుతాచార్యులు "యేన కుర్వన్తి తద్వీర్యం" అని చెప్పెను.

దీనిచేత ద్రవ్యము రసముచే తర్పణాదిక్రియల జేయునెడ రసము అట్టి క్రియనుజేయుటకు సాధనమగును కావున నదియే వీర్యమగును. విపాకప్రభావాదులకును ఆయా క్రియాసాధకత్వము ననుసరించి వీర్యసంజ్ఞ కల్గును. ఇది సర్వానుగతమైన లక్షణము. మరియు కరణరూపములగు రసవిపాకాదులకు వీర్యసంజ్ఞ యగునుగాని కర్త యగు ద్రవ్యమునకు వీర్యసంజ్ఞ రానేరదు. ఈయర్థము "యేన యా క్రియతే క్రియా" అను కరణతృతీయచే లభించును.

మరియు ద్రవ్యములలో కొన్ని రసముచేతను, కొన్ని విపాకముచేతను, కొన్ని మృద్వాదిగుణములచేతను ఆయాకృత్యములజేయును. ఇది సర్వమతసమ్మతము. ఈ విషయమునే వాగ్భటాచార్యులు "కించిద్రసేన కురుతే కర్మ పాకేన చాపరం, గుణాన్తరేణ వీర్యేణ ప్రభావేణైవ కించన" అని చెప్పిరి.అట్టిరసాదులు ద్రవ్యము నాశ్రయించినవి.వానినే ద్రవ్యశక్తులనియు, అయ్యవి వానివాని కృత్యముల జేయునపుడు ద్రవ్యమునకు సంబంధించిన వీర్యమగుననియు నీతంత్రకర్త యభిప్రాయము. ఇది తంత్రకారుల కందరకును విప్రతిపత్తి లేనిసిద్ధాంతము.

### రస-విపాక-వీర్యములపరిజ్ఞానము.

మూ. రసో నిపాతే ద్రవ్యాణాం, విపాకః కర్మనిష్ఠయా,
వీర్యం యావదధీవాసాత్ నిపాతాచ్చోపలభ్యతే. ౯౬

వ్యా. బెల్లము లవణము మున్నగు ద్రవ్యములమధురాదిరసము అట్టిద్రవ్యములకు నాలుకతో స్పర్శము కల్గినప్పుడే ఇయ్యది మధురము ఇదిలవణము ననురసపరిజ్ఞానము కల్గును. అట్టిమధురాదిద్రవ్యముల తినినప్పుడు అవి పూర్తిగ జాతరాగ్నిసంబంధముచే జీర్ణమైనపిమ్మట అట్టియవస్థయందు దాన కల్గు క్రియలచేత ఇది మధురవిపాకము, ఇది యమ్లవిపాకము, మున్నగు జ్ఞానము కల్గును. (విపాకము జీర్ణానంతరకృతములైన కఫవృద్ధి శుక్రవృద్ధి మున్నగుకార్యములచే ననుమానింపవగియుండునని భావము). వీర్యము మాత్రము ఒకసమయమున మధురాదిద్రవ్యము శరీరమునందు పూర్తిగ నుండుటవలనను, ఒకసమయమున జిహ్వాసంబంధముమాత్రముచేతను తెలియదగియుండును. అనియర్థము.

వివరణము:—రసము జిహ్వాసంధక్షణముననే మధురాది భేదముచే రసనేంద్రియమునకు గ్రాహ్యమగును కావున ప్రత్యక్షముగనే తెలియదగియుండును. విపాకము ఆహారము పూర్తిగ జీర్ణమైన యవస్థయందు కల్గుకృత్యములబట్టి యూహింపదగియుండును కావున కేవలము అనుమానజ్ఞేయము.

సైంధవలవణమునందలి శీతవీర్యంబును, అనూపమాంసగత ఉష్ణవీర్యంబును వాని కృత్యములచే దెలియదగియుండును కాన అనుమానగమ్యము. ఆవాలు మున్నగువానిని మూర్కొనిన మాత్రముననే తీక్ష్ణత్వము ఘ్రాణేంద్రియగ్రాహ్యమగును. పిచ్ఛిలరూక్షాది గుణములు శరీరస్పర్శముననే ప్రత్యక్షముగ తెలియదగియుండును. కావున వీర్యము మాత్రము కొన్నిద్రవ్యములయందు ప్రత్యక్షముగను, కొన్నిద్రవ్యములయందు (మిరియములు మున్నగువానియందలి దీపనీయ పాచనీయాదులు) అనుమానముచేతను తెలియదగియుండుననియు భావము.

మరియు వీర్యము కొన్నిద్రవ్యములయందు సహజముగను, కొన్నిద్రవ్యములయందు కృత్రిమముగ (సంస్కారాదులచేత సంభవించినవిగ)ను ఉండును. అందు మాషములకు గురుత్వంబును, పెసలకు లఘుత్వంబును సహజవీర్యము (నైసర్గికము). వరి పేలాలు మున్నగువానియందు లఘుత్వము సంస్కారముచే గల్గినది కావున కృత్రిమము. ఇత్తెరంగుననే తక్కినవానికిని యూహించునది.

## ప్రభావలక్షణము.

మూ. రసవీర్యవిపాకానాం సామాన్యం యత్ర లక్ష్యతే,
విశేషః కర్మణాం చైవ ప్రభావస్తస్య చ స్మృతః. ౬౭

వ్యా. రెండుద్రవ్యములు రసవీర్యవిపాకములచే సమానములుగనుండినను ఆరెండిటియందు కృత్యములు వేరువేరుగనున్నయెడ అట్టికృత్యవిశేషమును జేయుశక్తియే ద్రవ్యప్రభావమని యర్థము.

ఎట్టులన:—నేపాళపుగింజలును చిత్రమూలంబును రసవీర్యవిపాకములచే సమానములు. అయినను నేపాళము విరేచనములజేయును. చిత్రమూలము విరేచనము చేయుంట లేదు. సమానగుణములైన యీరెండును భిన్నకృత్యముల జేయుటకు ద్రవ్యనిష్ఠమైన యచింత్యప్రభావమే కారణము కానోపును. ఈయుదాహరణమునే వాగ్భటాచార్యులు "దన్తీరసాద్యైస్తుల్యాపి చిత్రకస్య విరేచనీ, మధుకస్య చ మృద్వీకా ఘృతం క్షీరస్య దీపనం" అని చెప్పెను. (ఈప్రభావము కేవలము అనుమానగమ్యము).

ప్రభావమున కుదాహరణములు.

మూ. కటుకః కటుకః పాకే వీర్యోష్ణశ్చిత్రకో మతః,
తద్వద్దన్తీ ప్రభావాత్తు విరేచయతి మానవం. ౯౮
విషం విషఘ్నముక్తం యత్ ప్రభావస్తత్ర కారణం,
ఊర్ధ్వానులోమికం యచ్చ తత్ప్రభావప్రభావితం. ౯౯

వ్యా. చిత్రమూలము రసమునందును విపాకమునందును కటుకము, ఉష్ణవీర్యము కల్గినది. నేపాళంబును అట్టి రసవీర్యవిపాకములు కల్గియుండును; కావున చిత్రమూలముతో సమానమైనది. అట్లుండియు నేపాళము విరేచనముల జేయుచున్నది. చిత్రమూలము మాత్రము విరేచనముల గల్గించుటలేదు. నేపాళమునకు విరేచనకారిత్వము ఎట్లు కల్గినదన్నచో నదియే ప్రభావకృతము.

మరియు విషము విషమును హరించునని 'తస్మాద్దంష్ట్రావిషం మౌలం' ఇది మున్నగు వాక్యములచే చెప్పబడినది. ఇచ్చట విషము సమానరసవిపాకాదులగల్గిన విషాంతరము నెట్లుహరింపనోపును? అదియును ప్రభావకృతము. శరీరమునందలి యూర్ధ్వాధోభాగముల రెంటియందును నొక్కసమయముననే వ్యాపించి రెండుభాగములయందలిదోషమును ఒకద్రవ్యము హరించును. ఇట్టికార్యద్వయకర్తృత్వము ప్రభావకృత్యము. (ఇట్టికృత్యములబట్టి ద్రవ్యమునందలి రసవీర్యాదుల కతిరిక్తముగ నచింత్యమైన ప్రభావము అనుమానింపబడును).

మణులయందలిప్రభావము.

మూ. మణీనాం ధారణీయానాం కర్మ యద్వివిధాత్మకం,
తత్ప్రభావకృతం తేషాం ప్రభావోఽచిన్త్య ఉచ్యతే. ౧౦౦

వ్యా. శరీరముపై హారాదిరూపముగ ధరింపదగినమణులు విషముల హరించుననియు, శూలను హరించుననియు పలుదెరంగులైన కృత్యములు చెప్పబడినవి. అట్టి

కృత్యములు మణిధారణముచే నెట్లు కల్గు నన్నచో నదియును ప్రభావకృతము. ద్రవ్యము నందలి ప్రభావము బాహ్యకారణములకు అగోచరమై, మనస్సుచే నిర్ణయింపనలవికానిది. ఇచ్చట ప్రభావమన ద్రవ్యనిష్ఠమైన యపూర్వశక్తివిశేషమని యెరుంగునది. "భేదశ్చైషాం త్రిషష్టి......ద్రవ్యదేశకాలప్రభావాత్" "ద్రవ్యాణి హి ద్రవ్యప్రభావాత్ గుణప్రభావాత్" ఇత్యాదిస్థలములయందును ప్రభావమనగ శక్తివిశేషమని యర్థము జేయుంట సమంజసము. మణులయందును విషమునందును రసవీర్యవిపాకాదుల నిశ్చయింప నలవికాదు. అట్టియెడ "రసవీర్యవిపాకానాం.........స్మృతః" అని చెప్పబడిన ప్రభావలక్షణము ఎట్లు సమన్విత మగునన్నచో, మణ్యాదులయందలి విషహరత్వాది యపూర్వమైన శక్తియే ప్రభావమని తంత్రకారునియభిప్రాయము. కావుననే "ప్రభావోఽచిన్త్యఉచ్యతే" అని చెప్పిరి.

## రసాదులకు ప్రత్యేకకార్యకర్తృత్వము.

మూ. సమ్యగ్విపాకవీర్యాణి ప్రభావశ్చాప్యుదాహృతః,
కిఞ్చిద్రసేన కురుతే కర్మ వీర్యేణ చాపరం.　　౧౦౧
ద్రవ్యం గుణేన పాకేన ప్రభావేణ చ కించన,

వ్యా. ఇత్తెరంగున ద్రవ్యాశ్రితములై, రసములకు సంబంధించిన విపాక-వీర్యములకును, ప్రభావమునకును లక్షణములు విస్తరముగ చెప్పబడినవి. అట్టి రసవిపాకవీర్య ప్రభావగుణముల కాశ్రయమైన ద్రవ్యములు తనయందలి మధురాదిరసములచే నొక పనిని చేయును, వీర్యముచే వేరొండుపనిని చేయును, గుణముచే నింకొకపనిని, విపాకముచే మరియొకకృత్యమును, ప్రభావముచే వేరొకపనిని చేయును.

వీని కుదాహరణము:—మధువు కషాయరసముచే పిత్తమును హరించును. అదియే కటువిపాకముచే కఫమును హరించును (ఇది రసవిపాకకృత్యములు) అమ్లరసముకల కాంజికము రౌక్ష్యగుణముచే కఫమును హరించును. (ఇది గుణకృత్యము). కషాయతిక్త రసములు కల మహాపంచమూలములు ఉష్ణవీర్యముచే వాతమును మాత్రము హరించును. అమ్లముగ నుష్ణముగనుండు సురయనుమద్యము ప్రభావముచే క్షీరమును వృద్ధిజేయును. ఇత్తెరంగుననే యుదాహరణాంతరముల నూహించునది.

## రసాదులకు నైసర్గికశక్తి.

మూ. రసం విపాకః తౌ వీర్యం ప్రభావస్తా నపోహతి.　　౧౦౨
బలసామ్యే (గుణసామ్యే) రసాదీనాం ఇతి నైసర్గికం బలం,

వ్యా. ఒకద్రవ్యమునందు రసంబును విపాకంబును సమానబలముగ నుండునెడ అట్టిరసమును తిరస్కరించి విపాకము తనయందలి స్వాభావికశక్తిచే తనకృత్యమును నెరవేర్చును. (తేనె మధురరసము కల్గినది. కటు విపాకము కల్గినది. ఇచ్చట రసవిపాకములు సమానబలములుగ నున్నను మధురరసమును తిరస్కరించి, కటువిపాకము తన స్వభావముచే వాతమును ప్రకోపింపజేయును).

మరియు రసవిపాకవీర్యములు సమానబలము లైయుండునెడ రసవిపాకముల రెండిటిని తిరస్కరించి వీర్యము తనకృత్యమును జేయును. (మహిషమాంసముననుండు మధురరసవిపాకముల రెంటిని తిరస్కరించి, ఉష్ణవీర్యము పిత్తాదుల దూషించును).

రసవిపాకవీర్యముల మూడిటిని తిరస్కరించి ప్రభావము కార్యాంతరమును నిర్వర్తించును. (అమ్లరసవిపాకములును ఉష్ణవీర్యమును కలసురయను మద్యము ప్రభావముచే రసవిపాకవీర్యముల మూడిటిని తిరస్కరించి క్షీరమును వృద్ధిచేయును).

ఇత్తెరంగున ద్రవ్యమునందు రసవిపాకవీర్యములు సమానబలములుగ నున్నపుడు పైజెప్పినరీతిగ రసమును, విపాకంబును, రసవిపాకములరెంటిని వీర్యంబును, రసవిపాకవీర్యముల మూడిటిని ప్రభావంబును తిరస్కరించి, వానివానికృత్యముల జేయును. ఇదియే రసవిపాక వీర్యప్రభావములకు నైసర్గికమైన (స్వభావసిద్ధమైన) బలము. (ఇదియే రసాదులనైజశక్తియని భావము).

### రసలక్షణములు, అందు మధురరసలక్షణము.

మూ. షణ్ణాం రసానాం విజ్ఞానం ఉపదేక్ష్యామ్యతః పరం. ౧౦౩
స్నేహన-ప్రీణనాఽఽహ్లాద-మార్దవైరుపలక్ష్యతే,
ముఖస్థో మధురశ్చాస్యం వ్యాప్నువన్ అమ్మృతీవ చ. ౧౦౪

వ్యా. ఇచ్చట నీక్రింద మధురాదిరసముల కొరిటికిని వేరువేరుగ లక్షణము లుపదేశింపబడును:—అందు మధురరసము (బెల్లము మున్నగుమధురద్రవ్యమును నోట నుంచుకొన్నప్పుడు) నోట జిడ్డును కల్గించును. ప్రీతి బుట్టించును. ఆహ్లాదమును కల్గించును. మృదుత్వమును పుట్టించును. నోట వ్యాపించునపుడు పూసినట్లు (జిగటగ) ఉండును. ఇట్టి లక్షణములచే నియ్యది మధురరసమని యెరుంగదగును. (ఇది మధురరసలక్షణము) ఇచ్చట విజ్ఞానమన "విజ్ఞాయతే అనేనేతి విజ్ఞానం" అనుకరణవ్యుత్పత్తిచేత రసములను దెల్పునట్టిలక్షణములని యర్థము).

—⊸ అమ్లరసలక్షణము. ⊸—

మూ. దన్తహర్షాత్ ముఖస్రావాత్ స్వేదనాత్ ముఖబోధనాత్,
విదాహాచ్చాస్యకణ్ఠస్య ప్రాశ్యైవాఽమ్లరసం వదేత్. ౧౦౫

వ్యా. ద్రవ్యమును నోట నుంచుకొన్నప్పుడు దంతములు జలదరించి నోట ద్రవము కార్చుచు శరీరముపై చెమటబట్టి నోరు ఉద్దీపితమై నోటియందును కంఠమునందును విదాహము (తాపము) కల్గినచో నయ్యది యమ్లరసమని యెరుంగునది.

—⊸ లవణరసలక్షణము. ⊸—

మూ. ప్రలీయన్ క్లేదవిష్యన్దమార్దవం కురుతే ముఖే,
యశ్శీఘ్రం లవణో జ్ఞేయః స విదాహాన్ముఖస్య చ. ౧౦౬

వ్యా. ద్రవ్యమును నోట నుంచుకున్నమాత్రముననే కరగును. నోట ద్రవము పుట్టి స్రవించును. నోట మృదుత్వమును కల్గించును. నోట మంటబుట్టును. అట్టిలక్షణములబట్టి యయ్యది లవణరసమని యెరుంగునది.

—⊸ కటురసలక్షణము. ⊸—

మూ. సంవేజయేద్యో రసనాం నిపాతే తుదతీవ చ,
విదహన్ ముఖనాసాక్షీ సంస్రావీ స కటుః స్మృతః. ౧౦౭

వ్యా. ఏద్రవ్యమును నోట నుంచినమాత్రముననే నాలుకనల్లలనాడించి, సూదుల గ్రుచ్చినవిధముగ బాధకల్గించి, మంటబుట్టించి, నోటియందును ముక్కులయందును కన్నులయందును నీరుగార్చునో, అట్టిద్రవ్యమునందలి రసము కటుకమని యెరుంగునది.

—⊸ తిక్తరసలక్షణము. ⊸—

మూ. ప్రతిహన్తి నిపాతే యో రసనం స్వదతే న చ,
స తిక్తో ముఖవైశద్యశోషప్రహ్లాదకారకః. ౧౦౮

వ్యా. ఏద్రవ్యమును నోట నుంచినప్పుడేరసనేంద్రియమును చెరచి రుచినికల్గింపక ముఖము విశదత్వమునుకల్గించి ద్రవమును ఎండించునో, అయ్యది తిక్తరసమని యెరుంగునది. మరియు తినునప్పుడు ఈరసము నోట. రుచిని చెరచినను పిమ్మట అరుచిని పోగొట్టి రుచిని కల్గించును; కావున నాహ్లాదకరమగును.

## కషాయరసలక్షణము.

మూ. వైశద్య స్తమ్భజాడ్యైర్యో రసనం యోజయేద్రసః,
బధ్నాతీవ చ యః కణ్ఠం కషాయస్స వికాస్యపి. ౧౦౯

వ్యా. ఏరసము నాలుకయందలి విశదత్వము కల్గించి స్తంభింపజేసి జడత్వము కల్గించునో, నోటిని కంఠమును బిగబట్టునో, హృదయమున బిగబట్టినట్టులు బాధ కల్గించునో, అయ్యది కషాయరసమని యెఱుంగునది. (ఇచ్చట "వికాసీ వికసన్ ధాతూన్" అనులక్షణమునుబట్టి రసాదిధాతువులను బాధించునదియని యర్థమును కొందరు చెప్పెదరు.) వికాసియన సొక్కుత్తునట్లు చేయుఃబాధను కల్గించునది యనిచెప్పుట సమంజసము. వక్క మొదలగు వగరుపదార్థముల నుపయోగించునపుడు వైలక్షణములన్నియుం కల్గి రొమ్మడచి సొక్కుత్తుట లోకమున ననుభవసిద్ధము.

## విరుద్ధాహారవిషయజిజ్ఞాసాప్రశ్నము.

మూ. ఏవం వాదినం భగవన్తం ఆత్రేయం అగ్నివేశ ఉవాచః—
"భగవన్ ! శ్రుతమేతదవితథమర్థసమ్పద్యుక్తం యథావత్
ద్రవ్యగుణకర్మాధికారే వచః; పరం తు ఆహారవికారాణాం
వైరోధికానాం లక్షణమనతిసంక్షేపేణోపదిశ్యమానం శుశ్రూ
షామహే" ఇతి. ౧౧౦

వ్యా. పైజెప్పినరీతిగ జెప్పిన భగవత్స్వరూపుడైన యాత్రేయుని జూచి యగ్నివేశు డిట్టు లడిగెను:—ఓమహాత్మా! ద్రవ్యములగుణములను కర్మములను ఉద్దేశించిన ప్రకరణమున అర్థవంతముగను నిరబద్ధముగను చెప్పినవాక్యములను చక్కగ గమనించి వింటిని. మఱియు శరీరధాతువులకు విరోధముల కల్గించు నాహారద్రవ్యముల లక్షణమును మిక్కిలి సంగ్రహంబును విస్తృతంబును గాకుండున ట్లుపదేశించినచో (నట్టి శరీరధాతు విరోధకాహారద్రవ్యముల దెల్పునట్టిగ్రంథమును) వినగోరినాము. (కావున నానతిండని యర్థము).

"వైరోధికానాం" అనగ "విరోధం (శరీరధాతూనాం) కుర్వన్తీతి వైరోధికాః" అను వ్యుత్పత్తిచేత శరీరధాతువులకు విరోధమును కల్గించునవి వైరోధికములు. 'వికారాః' అన పంచభూతవికారములైన ద్రవ్యములని యర్థము. (ఆహారోపయుక్తములగు ద్రవ్యములు). 'వైరోధికాః' అను విశేషణముచేత 'వైరోధికానాం ఆహారవిహారాణాం లక్షణం=శరీరధాతువులకు విరోధమును కల్గించు నాహారద్రవ్యముల దెల్పు లక్షణమును వినగోరెదమని సముదితార్థము.

—॥ విరుద్ధద్రవ్యలక్షణము, అట్టిద్రవ్యములనిర్దేశము. ॥—

మూ. తమువాచ భగవానాత్రేయః — దేహధాతుప్రత్యనీకభూతాని ద్రవ్యాణి దేహధాతుభిర్విరోధమాపద్యన్తే:— పరస్పరగుణ విరుద్ధాని కానిచిత్, కానిచిత్ సంయోగాత్, సంస్కారాదపరాణి, దేశకాలమాత్రాదిభిశ్చాపరాణి, తథాస్వభావాదపరాణి. ౧౧౧

వ్యా. పైజెప్పినరీతిగ ప్రశ్న జేసిన యగ్నివేశునితో త్రికాలజ్ఞానవేత్తయగు నాత్రేయుం డిట్లు చెప్పదొడంగెను:— శరీరమునందలి రసరక్తాదిధాతువులకు విరుద్ధములగు ద్రవ్యములు శరీరధాతువులకు విరోధమును చేయును. (రసరక్తాదిధాతువులను చెరచి శరీరమును చెడగొట్టునని భావము). అట్టిద్రవ్యము లెవ్వియన:— పరస్పరము విరుద్ధములగు గుణములుకల్గిన క్షీరమత్స్యాదులు (క్షీరములును మత్స్యములును ఒకటి కొకటి విరుద్ధములైన గుణములు కల్గినవి. వానిని ఒకటిగ జేర్చి యుపయోగించినచో రక్తమును చెరచును. ఇది "న మత్స్యాన్ పయసా సహ" అను వాక్యముచే క్రింద చెప్పబడును).

మరియుం గొన్ని పరస్పరసంయోగమునం జేరి విరుద్ధములగును. (అయ్యవి "తదేవ నికుచం పక్వం" అను వాక్యముచే జెప్పబడును). మరికొన్ని సంస్కారవిశేషమునం జేసి విరుద్ధములగును. అయ్యవి "న కపోతాన్ సర్షపతైలభృష్టాన్" అను వాక్యముచే జెప్పబడును). దేశముచేతను కాలముచేతను పరిమాణముచేతను విరుద్ధములైనవి కొన్ని ద్రవ్యములు. (అందు దేశమనునవి శరీరము దేహమునని రెండువిధములు. అందు "తదేవ భస్మపాంసు పరిధ్వస్తం" అను వాక్యముచేత భూమి విరుద్ధంబును, "ఉష్ణార్తస్య మధు మరణాయ" అను వాక్యముచేత శరీరవిరుద్ధంబును చెప్పబడును). "పర్యుషితం కాకమాచీ మరణాయ" అను వాక్యముచే కాలవిరుద్ధంబును, "సమఘృతే మధుసర్పిషీ మరణాయ" అను వాక్యముచే మాత్రావిరుద్ధంబును చెప్పబడును. మాత్రాది యనుటచేత దోషము, ప్రకృతి మున్నగువానికిని విరుద్ధద్రవ్యములు శరీరమును చెరచునని యెఱుంగునది). విషముస్వభావముచేతనే విరుద్ధము.

ఇత్తెరంగున పరస్పరవిరుద్ధగుణములుకల ద్రవ్యములును, సంయోగముచే విరుద్ధంబులును, సంస్కారవిశేషముచే విరుద్ధంబులును, దేశముచేతను శరీరభేదముచేతను విరుద్ధంబులును, పరిమాణవిశేషముచేతను కాలవిశేషముచేతను విరుద్ధంబులును, దోషప్రకృత్యాదులకు విరుద్ధంబులును, స్వభావముచేతనే విరుద్ధంబులు నైనద్రవ్యములు శరీరమునందలి రక్తాదిధాతువులకు విరుద్ధములై శరీరమును చెడగొట్టునని సముదితార్థము.

విరుద్ధద్రవ్యముల కుదాహారణము, అందు గుణవిరుద్ధద్రవ్యోదాహారణము.

మూ. తత్ర యాన్యాహారమధికృత్య భూయిష్ఠముపయుజ్యన్తే తేషా మేకదేశం వైరోధికమధికృత్యోపదేక్ష్యామః — న మత్స్యాన్ పయసా సహాభ్యవహరేత్; ఉభయం హ్యేతన్మధురం, మధుర విపాకం, మహాభిష్యన్ది, శీతోష్ణత్వాద్విరుద్ధవీర్యం; విరుద్ధవీర్య త్వాచ్ఛోణితప్రదూషణాయ, మహాభిష్యన్దిత్వాత్ మార్గోప రోధాయ చ. ౧౧౨

వ్యా పైజెప్పినరీతిగ విరుద్ధములగు ద్రవ్యములలో విశేషముగ నాహారమునకై యుపయోగింపబడు ద్రవ్యములలో విరుద్ధములగువాని గొన్నిటిని దీసికొని వానికింగల విరోధలక్షణములు క్రింద నుపదేశింపబడును:—అందు మత్స్యములను పాలతో గూర్చి భుజింపదగదు. ఈరెండుద్రవ్యములును మధురరసంబును మధురవిపాకంబును కల్గినవి. మిక్కిలి యభిష్యందమును (స్రోతస్సులయందు ద్రవమును) బుట్టించునవి. ఈమూడును క్షీరమత్స్యములకు రెంటికిని సమానములుగ నున్నను క్షీరము శీతవీర్యంబును, మత్స్యములు ఉష్ణవీర్యంబులును నగును. కావున పరస్పరము విరుద్ధములగువీర్యములు కల్గినవి. అట్టి విరుద్ధవీర్యము కల్గియుండుటచే రక్తమును చెరచును. అభిష్యందము లగుటంజేసి స్రోతోమార్గముల నిరోధించును. (కావున పైజెప్పినరీతిగ శీతోష్ణరూపములగు పరస్పర విరుద్ధగుణములుగల క్షీరమత్స్యములను ఒకటిగ జేర్చి భుజింపదగదని భావము). ఇది విరుద్ధగుణద్రవ్యమున కుదాహారణము.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—పైని చెప్పినరీతిగ పరస్పరవిరుద్ధగుణములగు ద్రవ్యముల భుజించినచో శరీరధాతువులకు విరోధమును కల్గించునని చెప్పినచో మధురాదిషడ్రసముల భుజించునప్పుడు మధుర అమ్లరసములు శీతోష్ణగుణముల గల్గియుండుటంజేసి పరస్పరవిరుద్ధగుణములు; కావున వానినుపయోగించుట శరీరధాతువిరోధము కల్గునుకదా? అని శంకించి; క్షీరమత్స్యములు ప్రభావముచే విరుద్ధమని సమాధానము కొందరు చెప్పెదరు. అట్టియెడ గుణవిరుద్ధమునకు పైయుదాహారణము సంగతము కానేరదు. కావున నీసమాధానము నెరుంగునది:—గుణముచేనైనను ప్రభావముచేనైన క్షీరమత్స్యములు పరస్పరవిరుద్ధములనుట యుభయవాదులకును సమ్మతము. అందు ప్రత్యక్షముగ శీతోష్ణరూపములగుటచే గుణవిరోధము సయుక్తికము. అమ్లమధురములకు గుణకృతవిరోధము ప్రభావముచే లేనుదనుట సమంజసము. అట్టిప్రభావమే క్షీరమత్స్యములకును విరోధకారణమని చెప్పుదమన్నచో శీతోష్ణములు స్వభావముగనే విరోధములు

కావున దృష్టకారణమును వదలి ప్రభావమును కల్పించుట యుక్తముకాదు. మధురామ్లములకు మాత్రము అగతికగతికముగ ప్రభావముచేతనే విరోధపరిహారమును ఉభయవాదులును ఒప్పికొనకతీరదు. కావున క్షీరమత్స్యములు విరుద్ధగుణము లగుటచే రెంటి నొక్కటిగజేర్చి యుపయోగించినచో శరీరధాతుప్రతికూలకరమనియు, అమ్లమధురములు విరుద్ధగుణములైనను ప్రభావముచే శరీరమునకు ప్రతికూలమును చేయవనియుం సర్వసిద్ధాంతము.

మరియు క్షీరమత్స్యములును సంయోగముచేతనే విరుద్ధమగును. అట్టివిరోధంబును విరుద్ధగుణమూలకమగుటంజేసి గుణవిరుద్ధమని ప్రత్యేకముగ జెప్పబడినది.

విరుద్ధగుణములలో మతాంతరము.

మూ. తదనన్తరమాత్రేయవచన మనుమన్య భద్రకాప్యోఽగ్నివేశముమువాచ:—"సర్వానేవ మత్స్యాన్ పయసా సహాఽభ్యవహరేత్ అన్యత్రైకస్మాత్ చిలిచిమాత్; స పునశ్శకలీ, సర్వతో లోహితరాజిః, లోహితప్రకారః, ప్రాయో భూమౌ చరతి. తం చేత్ పయసా సహాఽభ్యవహరేత్ నిస్సంశయం శోణితజానాం విబన్ధజానాం చ వ్యాధీనామన్యతమం, అథవా మరణం ప్రాప్నుయాత్" ఇతి. ౧౧౩

వ్యా. ఆత్రేయుం డిట్లు చెప్పినవాక్యమును సహేతుకముగ నాలోచించి భద్రకాప్యు డగ్నివేశునితో నిట్లు పల్కెను:—చిలిచిమమను మత్స్యమునుమాత్రము వదలి తక్కినమత్స్యము లనన్నిటెని పాలతోగూడజేర్చి యుపయోగింప (తిన) దగును. (చిలిచిమము మాత్రము పాలతోగూడ తినదగదనుట). అయ్యది శరీరముపై దట్టమైనచర్మము కవచమువలె కల్గియుండును. (శకులి, శకలి), దానిశరీరముపై నెఱ్ఱనిరేఖలుకల్గి యెఱ్ఱనిడాలునుకల్గి బురదనేలలో విశేషముగసంచరించును. (ఇది మత్స్యమునుగుర్తించుటకు చెప్పినలక్షణము). అట్టిచిలిచిమ మనుమత్స్యమును పాలతోగూడ తినినయెడ రక్తప్రకోపమున కల్గు రోగంబులును, స్రోతోబంధమున కల్గు రోగంబులును తప్పక సంభవించును. దానంజేసి యొకసమయమున మరణముకూడ సంభవించును; కావున దాని నొకప్పుడును పాలతోజేర్చి తినగూడదని యర్థము. (ఈమత్స్యము మిక్కిలి యుష్ణవీర్యమగుటంజేసి తప్పక యపాయకరమగునని భద్రకాప్యునియాశయము)

శకలియన శకలమునుకల్గినది. మత్స్యములకు శరీరముపైని దట్టముగ కవచమును బోలిన చర్మము శకలము. దానిని కల్గినది శకలి, శకులి యనియుం పర్యాయము. ఇది

మత్స్యసామాన్య వాచకము. చిలిచిమమన—"చీయతే (లీయతే) ఇతి చిలిచిమః" అను వ్యుత్పత్తిచేత బురదలో దాగియుండునదియని యర్థము. అయ్యది పైజెప్పినలక్షణ ములగల్గియుండును. మరియు అభి, అవ, అనునుపసర్గములతో జేరిన 'హృఞ్' అను ధాతువునకు 'భుజించుట'యని యర్థము. ఈయర్థమునందే "అభ్యవహరతి సైన్ధవాన్, అభ్యవహారయతి సైన్ధవైః. అని భాష్యకారులు ప్రయోగించిరి.

### గుణవిరుద్ధములలో విశేషవిధి.

మూ. నేతి భగవాన్ ఆత్రేయః—సర్వానేవ మత్స్యాన్ న పయసా అభ్యవహారేత్, విశేషతస్తు చిలిచిమం, స హి మహాభిష్యన్ది త్వాత్ స్థూలలక్షణతరానేతాన్ వ్యాధీనుపజనయతి ఆమ విషముదీరయతి చేతి. ౧౧౮

వ్యా. ఆత్రేయులు భద్రకాప్యునిసిద్ధాంతమును నిషేధింపుచు, అట్టిసిద్ధాంతమున కొంచెము విషయభేదమును జూపుచు తనసిద్ధాంతము నిట్లు చెప్పెను:—సామాన్యముగ నన్నిజాతుల మత్స్యములను పాలతోగూడ తినగూడదు; కాని అందును చిలిచిమమను మత్స్యమును మాత్రము పాలతోగూడ బొత్తుగ తినగూడదు. ఆచిలిచిమము మహా భిష్యందియగుటవలన మిక్కిలి ప్రబలమైన లక్షణములుకల నానావిధవ్యాధుల గల్గించు టయేకాక శరీరమున జీర్ణముకానివిషమును రేపెట్టి శరీరమునకు బాధకల్గించును (కావున దాని నొకప్పుడు తినదగదనుట).

### మరికొన్ని విరుద్ధద్రవ్యములు.

మూ గ్రామ్యానూపౌదకపిశితాని చ మధు-తిల-గుడ-పయో-మాష-మూలక-బిసైః, విరూఢధాన్యైర్వా న ఏకధా అద్యాత్; తస్మా లం చ బాధిర్యాన్ధ్య వేపథుజాడ్య కలమూకతామైణ్మిణ్యం, అథవా మరణమాప్నోతి. ౧౧౯

వ్యా. గ్రామమునందలి జంతువులయొక్కయు, ఆనూప (బురదనేలవసించు) జంతువులయొక్కయు, ఔదక (జలమునవసించు)జంతువులయొక్కయు మాంసములను; తేనె నువ్వులు బెల్లము పాలు ఉద్దిపప్పు ముల్లంగి తామరకాడలు అను నీద్రవ్యముల తోడను, ఇతరములగు మొలకలెత్తిన పెసలు మున్నవానితోడను నేకకాలమున తిన గూడదు. తినినచో దానంజేసి చెవుడు, గ్రుడ్డితనము, వణకు, జాడ్యము (అలసత్వము), కలమూకత్వము (మాటలు స్ఫుటముగ దెలియనట్లుచ్చరించు మూగతనము), మిణ్మిణ

త్వము (ముక్కున మాటలాడుట, ముక్కిడితనము) అను నీవ్యాధులు కల్గును. ఒకవేళ మరణంబును కల్గును (పైజెప్పినమాంసములు తేనె మున్నగువానితో గూడిన విరుద్ధము లగును కావున వానితోకూడ సమకాలమున భుజింపజనదనుట).

మూ. న పౌష్కరం రోహిణీకం వా శాకం, న కపోతాన్ సార్షపతైల భృష్టాన్ మధుపయోభ్యాం సహాఽభ్యవహరేత్, తన్మూలం హి శోణితాభిష్యన్దధమనీప్రవిచయాఽపస్మారశఙ్ఖకగళగణ్డరోహిణీకానామన్యతమం ప్రాప్నోత్యథవా మరణమితి. ౧౧౬

వ్యా. పుష్కరమూలశాకమునైనను, రోహిణీ (కటుకరోహిణి) శాకమునైనను: ఆవనూనెచేర్చి వేచబడిన కపోతమాంసమునైనను, తేనెతోడనైనను, పాలతోగూడనైనను సమకాలమున భుజింపజనదు. అటుగాక భుజించినచో దానిమూలమున రక్తముచెడి రక్తాభిష్యందంబును, సిరలలో గ్రంథియు, అపస్మారము, శంఖకమను శిరోవ్యాధి, గళగండము, రోహిణియను వ్రణవిశేషము. అను నీవ్యాధులలో నేదైన సంభవించును. లేక మరణంబైన కల్గును.

ఇచ్చట 'న కపోతాన్' అనునది సంస్కారవిరుద్ధమని యెరుంగునది.

మూ. న మూలక-లశున-కృష్ణగన్ధాఽర్జక - సుముఖ-సురసాదీని భక్షయిత్వా పయస్సేవ్యం, కుష్ఠబాధాత్ ౧౧౭

వ్యా. ముల్లంగియాకు, ఉల్లిగడ్డలు, కృష్ణగంథ (శాకవిశేషము) లేక మునగాకు, తెల్లతులసి, అడవితులసి, నల్లతులసి, మున్నగు శాకములను తిని, తోడనే పాలు త్రాగకూడదు. త్రాగినచో కుష్ఠరోగముచే బాధకల్గును.

మూ న చాతు శాకం, న నికుచం పక్వం మధుపయోభ్యాం సహోపయోజ్యం, ఏతద్ధి మరణాయ; అథవా బలవర్ణతేజోవీర్యోపరోధాయ, అలఘువ్యాధయే, షాణ్ఢ్యాయ చేతి. ౧౧౮

వ్యా. వెదురుమోవు (లేక వెనురాకు) కూరనైనను, పండిన రేగుపండునైనను తేనెతోడను పాలతోడను భుజింపంజనదు. అట్లు సమకాలమున తిన్నచో మరణము కల్గును. లేక బలము వర్ణము తేజస్సు వీర్యము వీనిని చెరచును. లేక ఇతరములగు గొప్పవ్యాధుల కల్గించును. లేక పుంస్త్వమును చెరచును.

### సంయోగవిరుద్ధములు.

మూ॥ తదేవ నికుచం పక్వం న మాషసూపగుడసర్పిర్భిః సహోపయోజ్యం వైరోధికత్వాత్. ౧౧౯

వ్యా. మరియు పక్వమైనరేగుపండును ఉద్దిపప్పు, బెల్లము, నెయ్యి అనువానితో నేకముగ కలిపి భుజించినచో విరోధమును చేయును.

మూ॥ తథా అమ్లాఽఽమ్రాతక మాతులుఙ్గ నికుచ కరమర్ద మోచదన్తశఠ బదర కోశామ్ర భవ్య జామ్బవ కపిత్థ తిన్తిడీక పారావతాఽఽక్షోట పనస నాళికేర దాడిమామలకాని, ఏవం ప్రకారాణి చాన్యాని ద్రవ్యాణి, సర్వం చామ్లం ద్రవమద్రవం చ పయసా సహ విరుద్ధం. ౧౨౦

తథా కఙ్గువనక (వరక) మకుష్ఠకకుళుత్థమాష పయసా సహ విరుద్ధాః ౧౨౧

వ్యా. చింతపండు, మామిడి, మాదీఫలములు, గజనిమ్మపండు, కలివికాయలు, అరటిపండు, నిమ్మపండు, కమ్మరేగు, కోశామ్రము (మామిడిలో భేదము), భవ్యమను ఫలవిశేషము, నేరేడుపండ్లు, వెలగపండ్లు, కొండచింతపండు, ఈదెపండు, అక్రోడు, పనసపండు, కొబ్బరికాయ, దానిమ్మ, ఉసిరికకాయ అను నీకాయలు పండ్లును, వీనికి సమానములగు నితరద్రవ్యములును, ఇవియేకాక పులుపుకల ద్రవపదార్థములును, ద్రవములేక యెండినపులుపుపదార్థము లేవియైనను, ఇవియన్నియు పాలతో జేరిన విరుద్ధములగును. మరియు కొఱ్ఱలు, అడవియారుకలు (లేక వరిగెలు), ఆరుకలు, ఉలవలు, ఉద్దులు, ఇవియు పాలతోకూడిన విరుద్ధములగును. (కావున వీనినన్నిటిని (వీనిలో దేనినైన) పాలతో జేర్చినయెడ సంయోగముచే విరుద్ధములగును. కావున అటుచేర్చి భుజింపజనదనుట).

మూ. పద్మోత్తరికాశాకం, శార్కరో, మైరేయో, మధు చ సహోపయుక్తం విరుద్ధం, వాతం చాతికోపయతి. ౧౨౨

వ్యా. మరియు కుసుమ్భశాకమును చక్కెరతో జేయబడిన మద్యము, తేనె ఈమూడిటి నొకటిగ జేర్చి యుపయోగించిన సంయోగవిరుద్ధమగును. ఇవి వాతమును అధికముగ ప్రకోపింపజేయును. ('వాతంచాతి' అని చెప్పుటచేత కఫపిత్తములును కూడ సామాన్యముగ ప్రకోపింపజేయునని యెరుంగునది. ఈరీతిగనె క్రింద ''పిత్తం చాతి

కోపయతి" "శ్లేష్మాణం చాతికోపయతి" అను స్థలములయందును అర్థముచేయుచున్నది. ఇవి సంయోగవిరుద్ధముల కుదాహరణము).

—సంస్కారవిరుద్ధములు.—

మూ. హారిద్రకః సర్షపతైలభృష్టః విరుద్ధః, పిత్తం చాతికోపయతి.

వ్యా. హారిద్రకము (హరితాలము) ఆవనూనెలో పక్వముజేయబడిన (సంస్కారముచే) విరుద్ధమగును. పిత్తము నధికముగ (వాతకఫములను మితముగ) ప్రకోపింపజేయును. (ఇచ్చట హారిద్రమన "హరితాల ఇతి ఖ్యాతః" అని చక్రపాణి వ్యాఖ్యానము చేసెను. గమనింపవలసియున్నది). పచ్చనిరంగుకల పావురమని మరియొకరి యభిప్రాయము.

మూ. పాయసో మన్థానుపానో విరుద్ధః, శ్లేష్మాణం చాతికోపయతి. ౧౨౪

వ్యా. పాయసము సత్తుపిండితో పక్వముజేసి యుపయోగించినచో విరుద్ధమగును. కఫము నధికముగ (వాతపిత్తములను స్వల్పముగ) ప్రకోపింపజేయును.

మూ. ఉపోదికా తిలకల్కసిద్ధా హేతురతీసారస్య. ౧౨౫

బలాకా వారుణ్యా సహ కుల్మాషైరపి విరుద్ధా ౧౨౬

సైవ సూకరవసాపరిభృష్టా సద్యో వ్యాపాదయతి ౧౨౭

వ్యా. బచ్చలికూర నువ్వులనూనె జేర్చి పక్వము జేసినచో సంస్కారవిరుద్ధమై యతిసారము కల్గుటకు కారణమగును. బలాకములు (హంసములు) మద్యముననుకుల్మాషములతోడను జేర్చి పక్వముచేయబడినచో విరుద్ధమగును. దానినే సూకర (పంది) వసతో జేర్చి వేయించిన నయ్యది సంస్కారవిరుద్ధమై యాక్షణముననే చంపును. (యవపిష్టమున కొంచెముగ వేడినీళ్లు పోసి యావిరిచే నుడికించి యపూపముగ జేసిన నయ్యది కుల్మాషమని కొందరు చెప్పెదరు. వేచబడినఉద్దులని ఛాందోగ్యోపనిషద్వ్యాఖ్యానమున నున్నది).

మూ. మయూరమాంసమేరణ్డసీసకావసక్తం, ఏరణ్డాగ్నిప్లుష్టం, ఏరణ్డతైలయుక్తం సద్యో వ్యాపాదయతి. ౧౨౮

వ్యా. నెమలిమాంసమును పాత్రలోనునిచి ఆముదపుకొయ్యచే వేయించి కలియబెట్టుచు ఆముదపుకొయ్యల మంటవేయుచు ఆముదమును చేర్చి పక్వముజేసినయెడ నయ్యది సంస్కారవిరుద్ధమై క్షణకాలముననే తప్పక చంపును. (ఇచ్చట సీసకమన వేయించుటకును కలియబెట్టుటకును సాధనమైన గరిటెయని యర్థము. మయూరమాంస

మునకు ఆముదపుజాతితో నేవిధమైన స్పర్శము కల్గించి సంస్కారించినను విరుద్ధమగునని ముఖ్యభావము).

మూ. హారిద్రకమాంసం హారిద్రకసీసకావసక్తం హారిద్రాగ్ని ప్లుష్టం సద్యో వ్యాపాదయతి ౧౨౯

వ్యా. పచ్చనిరంగుగలపిట్టి హారిద్రము, దానిమాంసమును మ్రానిపసుపు కట్టెకు గ్రుచ్చి, ఆకట్టెలనిప్పులతో కాల్చి పక్వము జేసిన నయ్యది భుజించినతోడనే చంపును. (ఇవియన్నియు సంస్కారవిరుద్ధములు).

దేశవిరుద్ధము.

మూ తదేవ భస్మపాంసుపరిధ్వస్తం, సక్షౌద్రం మరణాయ. ౧౩౦

వ్యా. అట్టి హారిద్రమాంసము భస్మముకల ప్రదేశమునందును, ధూళిచే వ్యాప్తమైన ప్రదేశమునందును ఉంచబడినది విరుద్ధమగును. దానిని తేనెతో గూర్చి యుపయోగించినచో మరణము నొందించును. (ఇచ్చట భస్మపాంసుప్రదేశము సంబంధించుటచే విరుద్ధముగ నగును కావున నియ్యది భూమిరూపమైన దేశవిరుద్ధమున కుదాహరణమగును. మరియుం ఏద్రవ్యము పంచభూతసంబంధమును నిర్ణయింప గోచరము కాకుండునో ఆద్రవ్యంబును దేశవిరుద్ధమగునని చక్రపాణి వ్యాఖ్యలో జెప్పియున్నది).

మరికొన్ని విరుద్ధములు.

మూ మత్స్యనిస్తాలనసిద్ధాః పిప్పల్యః, తథా కాకమాచీ మధు చ మరణాయ ౧౩౧

వ్యా. (మత్స్యములను పక్వము జేయునట్టి పాత్రము మత్స్యనిస్తాలనము) అట్టి పాత్రలో నునిచి పక్వము చేయబడిన పిప్పళ్లు సంస్కారవిరుద్ధములై చంపును. కాచికూరను తేనెను చేర్చి తినినచో మరణమును కల్గించును. (ఇది సంయోగవిరుద్ధము). (ఇచ్చట "మత్స్యనిస్తాలన" అనుచోట నిస్తాలనమన వసయని యర్థము. మత్స్యముల వసతో జేర్చి పక్వము చేయబడిన పిప్పళ్లు సంస్కారవిరుద్ధమనునర్థము యుక్తము. ఈ యభిప్రాయమునే జతూకర్ణతంత్రమున "మత్స్యవసాసిద్ధాః పిప్పల్యః" అని చెప్పిరి.)

సంస్కారవిరుద్ధము, శరీరవిరుద్ధము.

మూ. మధు చోష్ణం, ఉష్ణార్తస్య మధు మరణాయ. ౧౩౨

వ్యా. తేనె వేడిచేసిన (నిప్పున వెచ్చచేసిన) నయ్యది చంపును (ఇదియుం సంస్కారవిరుద్ధము.) మరియుం నుష్ణముచే బాధింపబడువానిని తేనె చంపును. (ఇది శరీరరూపమైన దేశమునకు విరుద్ధము).

### ప్రమాణ, కాలవిరుద్ధములు.

మూ. మధుసర్పిషీ సమధృతే, మధువారిచాన్తరిక్షం సమధృతం, మధుపుష్కరబీజం, మధుపీతోష్ణోదకం, భల్లాతకోష్ణోదకం, తక్రసిద్ధః కమ్పిల్లకః, పర్యుషితా కాకమాచీ, అంగారశూల్యో భాసశ్చేతి విరుద్ధాని, ఇత్యేతద్యథా ప్రశ్నం అభినిర్దిష్టం భవతి, ఇతి. ౧౩౩

వ్యా. తేనెను నేతిని సమభాగములగజేర్చి తినిన యవి పరిమాణమునంజేసి విరుద్ధమగును. తేనెను అంతరిక్షోదకమును (క్రిందపడనీయక ఆకసముననే గ్రహింపబడిన వర్షోదకము) సమభాగముగ జేర్చిన నదియును విరుద్ధమగును. (ఈ రెండును మాత్రావిరుద్ధముల కుదాహరణములు).

మధువును (తేనెను) పుష్కరబీజమును గూర్చి తినిన విరుద్ధమగును. (ఇది సంయోగవిరుద్ధము). తేనెను త్రాగి వెంటనే వేడినీళ్లు త్రాగినను, జీడిగింజలతో గూడ నుష్ణోదకమును కల్పినను నదియు సంయోగవిరుద్ధములగును.

కంపిల్లకమును మజ్జిగలో పక్వముజేసిన విరుద్ధమగును. (ఇది సంస్కారవిరుద్ధము). కాచియాకు మరుసటినాటికుంచిన నయ్యది విరుద్ధమగును (ఇది కాలకృత విరుద్ధము). భాసపక్షిమాంసమును నిప్పులో కాల్చిన నయ్యది విరుద్ధమగును. (ఇది సంస్కారవిరుద్ధము.) ఇత్తెరంగున నగ్నివేశుని ప్రశ్నమునకు తాను నిర్దేశించినప్రకారము విరుద్ధద్రవ్యములను అనతిసంక్షేపము గాకుండునట్లు చెప్పెనని యర్థము.

(పైజెప్పిన విరుద్ధద్రవ్యములు ఉదాహరణమాత్రముగ జూపబడినవి; కావున ద్రవ్యము లన్నిటియందును వానిగుణములను సంయోగమును సంస్కారమును, దేశభేదాదులను చక్కగ గమనించి విరోధము నెరింగి యథాయుక్తముగ నుపయోగింపనగును).

### అనుక్తవైరోధికద్రవ్యసంగ్రహము.

భవన్తి చాత్ర శ్లోకాః.—

మూ. యత్కిఞ్చిద్దోషమాస్రావ్య న నిర్హరతి కాయతః,
ఆహారజాతం; తత్సర్వం అహితాయోపపద్యతే. ౧౩౪

వ్యా. ఏదైననొకద్రవ్యము శరీరమునందలి ఆమాదిదోషములను రేపెట్టి బైటవెడలింపక శమింపజేయకయుండునో అట్టిద్రవ్యము (ఆహారరూపమైనను ఔషధరూప

మైనను) శరీరమునకు హితముకానిదియగును. (రోగముల గల్గించి శరీరమును కష్టపరచు నని భావము.)

ఇచ్చట ఆహారమన "ఆహ్రియతే ఇత్యాహారః" అనువ్యుత్పత్తిచేత తినదగిన పదార్థమని యర్థము. అయ్యది భోజనోపయుక్తంబును ఔషధోపయుక్తంబు నగును. అట్టిభోజనపదార్థములైనను ఔషధద్రవ్యములైనను శరీరమునందలి ఆమాదిదోషములను రేపెట్టి బైటవెడలింపకయుం, శమింపజేయకయుం నున్నచో, అవియన్నియుం శరీరమునకు కష్టమును కల్గించుటంజేసి యహితము (విరుద్ధము) అగునని సముదితార్థము. ఈవాక్యమునుబట్టి అనుక్తములగు విరుద్ధద్రవ్యముల నన్నిటిని యూహించునది.

ఉక్త-అనుక్తవైరోధికద్రవ్యనిర్దేశము.

మూ॥ యచ్చాపి దేశకాలాగ్నిమాత్రాసాత్మ్యానిలాదిభిః,
సంస్కారతో వీర్యతశ్చ కోష్ఠావస్థాక్రమైరపి. ౧౩౫
పరిహారోపచారాభ్యాం పాకాత్సంయోగతోఽపి చ,
విరుద్ధం తచ్చ న హితం హృత్సమ్పద్విధిభిశ్చ యత్ ౧౩౬

వ్యా॥ మరియు, జాంగలానూపదేశముల చేతను, శీతోష్ణరూపమైన కాలము చేతను జాఠరాగ్ని చేతను, మాత్రారూపమైన పరిమాణము చేతను, సాత్మ్యము చేతను, సంస్కార విశేషము చేతను, శీతోష్ణరూపవీర్యము చేతను, మృదుక్రూరకోష్ఠముల చేతను, అవస్థా భేదము చేతను, క్రమము చేతను, పరిహారోపచారముల చేతను, పాకము చేతను సంయోగము చేతను, (వీనిలో దేనిచేనైన) విరుద్ధములగు నన్నపాన విహారాదులును శరీరమునకు హితములు కావు. మరియు హృదయమున (మనస్సున) కైనను, ఆహారమున నుండవలసిన సంపత్తునకైనను, భోజనాదివిధానమునకైనను విరుద్ధమైనదియు దేహమునకు ప్రతికూలమును చేయునని యర్థము.

దేశముచే విరుద్ధము.

మూ॥ విరుద్ధం దేశతస్తావత్ రూక్షతీక్ష్ణాదిధన్వని,
ఆనూపే స్నిగ్ధశీతాది భేషజం యన్నిషేవ్యతే. ౧౩౭

వ్యా॥ జాంగలదేశమున రూక్షతీక్ష్ణాదిగుణములుకల యౌషధమును సేవించుట విరుద్ధమగును. జలప్రాంతమున స్నిగ్ధశీతాదిగుణాదులుకల యౌషధమును సేవించుట విరుద్ధమగును. ఇది దేశముచే విరుద్ధము.

(ఔషధాన్నవిహారములు రోగహేతువులకును దేశకాలాదులకును విరుద్ధములై నవిగ నుండవలెను. అటుగాక దేశకాలాదులకు సమానగుణములుగ నున్నచో "వృద్ధిస్సమానై స్సర్వేషాం విపరీతైర్విపర్యయః" అనువాక్యప్రకారము వ్యాధిని పెంపొందించును కావున జాంగలదేశమునకు సమానము లగుటంజేసి రూక్షతీక్ష్ణాద్యౌషధముల సేవించుటయుం, ఆనూపదేశమున స్నిగ్ధశీతాద్యౌషధముల సేవించుటయుం దేశవిరుద్ధమని భావము. ఇత్తెరంగుననే కాలాదులయందును విరుద్ధము నెరుంగునది.)

ఇచ్చట వాక్యములచే జెప్పినవిషయములను మరల "భవన్తి చాత్ర" అని యుపక్రమించి వివరించుట తంత్రకర్తలయాచారము కావున నీవివరణమున పునరుక్తదోషమని భ్రమింప నవసరములేదు.

## కాలముచే విరుద్ధములు.

మూ. కాలతోఽపి విరుద్ధం యత్ శీతరూక్షాదిసేవనం,
శీతే కాలే తథోష్ణే చ కటుకోష్ణాదిసేవనమ్. ౧౩౮

వ్యా. శీతకాలమున శీతరూక్షాద్యాహారాదుల సేవించుటయుం, ఉష్ణకాలమున కటుకోష్ణాద్యాహారాది సేవనంబును కాలముచే విరుద్ధములు.

## అగ్నిచేవిరుద్ధము, మాత్రావిరుద్ధంబును.

మూ. విరుద్ధమనలే తద్వత్ అన్నపానం చతుర్విధే,
మధుసర్పిస్సమధృతం మాత్రయా తద్విరుధ్యతే. ౧౩౯

వ్యా. "తైర్భవేద్విషమస్తీక్ష్ణో మందశ్చాగ్నిస్సమైస్సమః" అను ప్రమాణప్రకారము వాతపిత్తకఫముల యాధిక్యముచేతను, సామ్యముచేతను జాఠరాగ్ని విషమ-తీక్ష్ణ-మంద-సమభేదములచే నాలుగుతెరంగులనుండును. అట్టినాల్గువిధములనుండు జాఠరాగ్నికి విరుద్ధముగ సేవింపబడిన యన్నపానము అగ్నివిరుద్ధమగును.

మరియుం తేనెను నేతిని సమభాగముగగూర్చి సేవించిన నయ్యది భాగరూపమైన పరిమాణమునంజేసి విరుద్ధమగును. ఇది మాత్రావిరుద్ధము.

## సాత్మ్యముచే విరుద్ధము.

మూ. కటుకోష్ణాది సాత్మ్యస్య స్వాదుశీతాదిసేవనం,
యత్తత్సాత్మ్యవిరుద్ధం తు విరుద్ధాన్నౌషధిక్రియా. ౧౪౦

వ్యా. కటుకరసము ఉష్ణగుణాబులును కల యాహారాదులు నాడుకచేసి శరీరధాత్వాదుల కిమిడియుండువారికి స్వాదుశీతాదిగుణములుకల యాహారాదులు సాత్మ్య

విరుద్ధములగును. కావున నౌషధ-ఆహార-విహారములను అలవాటులోనుండు వానికన్న విరుద్ధముగ సేవింపదగదు. (ఇదియే సాత్మ్యవిరుద్ధము).

సంస్కారముచే విరుద్ధము.

మూ. సంస్కారతో విరుద్ధం తత్ యద్భోజ్యం విషవద్భవేత్,
ఏరణ్డసీసకాసక్తం శిఖిమాంసం తథైవ హి. ౧౮౧

వ్యా. వివిధముగ నాహారాదులను సంస్కరించినచో భుజింపదగిన యాహారాది పదార్థములు విషముతో సమానములగునో అయ్యవి సంస్కారవిరుద్ధము లనబడును. ఎట్టులన:— నెమలిమాంసమును ఆముదపుకొయ్యకు గ్రుచ్చి ఆముదపుకొయ్యల నిప్పున కాల్చినయెడ నయ్యది విషతుల్యమగును. (ఇది సంస్కారవిరుద్ధము).

వీర్యముచే విరుద్ధము.

మూ. విరుద్ధం వీర్యతో జ్ఞేయం వీర్యతశ్శీతలాత్మకం,
తత్సంయోజ్యోష్ణవీర్యేణ ద్రవ్యేణ సహ సేవ్యతే. ౧౮౨

వ్యా. వీర్యముచే శీతలమైన ద్రవ్యమును ఉష్ణవీర్యమైన ద్రవ్యముతో కలిపి సేవించినచో నయ్యది విరుద్ధవీర్యమగును. (ఇది వీర్యముచే విరుద్ధము).

కోష్ఠవిరుద్ధము.

మూ. క్రూరకోష్ఠస్య చాత్యల్పం మన్దవీర్యమభేదనం,
మృదుకోష్ఠస్య గురు చ భేదనీయం తథా బహు. ౧౮౩
ఏతత్కోష్ఠవిరుద్ధం తు;

వ్యా. "కోష్ఠః క్రూరో మృదుర్మధ్యః మధ్యస్స్యాత్తైస్సమైరపి" అను ప్రమాణముచే కోష్ఠము క్రూరాది భేదములచే నాల్గువిధములుగ నుండునని తెలిసెడి. అందు క్రూరకోష్ఠమునకు మిక్కిలి స్వల్పముగ భుజించినను, సత్తులేనిపదార్థముల భుజించినను, మలాదుల భేదించిన భోజనంబును కోష్ఠవిరుద్ధమగును. మృదుకోష్ఠముకలవారికి గురుపదార్థంబులును, మలముల భేదించునవియు, మితిమీరిన యాహారంబును విరుద్ధమగును. (ఇది కోష్ఠవిరుద్ధము.)

అవస్థావిరుద్ధము.

మూ. విరుద్ధం స్యాదవస్థయా,
శ్రమవ్యవాయవ్యాయామసక్తస్యాఽనిలకోపనం. ౧౮౪
నిద్రాలసస్యాఽలసస్య భోజనం శ్లేష్మకోపనం,

వ్యా. శ్రమముచేతను సంభోగముచేతను శరీరపరిశ్రమముచేతను బడలియున్న వానికి, వాతమును ప్రకోపింపజేయునట్టి భోజనము విరుద్ధముగ నగును. మరియు నీచేనైనను స్వభావముచేనైనను అలసుడైనవానికి కఫమును ప్రకోపింపజేయునాహారము విరుద్ధమగును. ఇది యాలస్యాదిరూపమైన యవస్థచే విరుద్ధముకావున అవస్థావిరుద్ధ మనబడును.

### క్రమవిరుద్ధము.

మూ. యచ్చానుత్సృజ్యవిణ్మూత్రంభుఙ్క్తే, యశ్చాఽబుభుక్షితః ౧౮౫
తచ్చ క్రమవిరుద్ధం స్యాత్, యచ్చాఽతిక్షుద్వశానుగః,

వ్యా. క్రమమన నియమము. మలమూత్రాదివేగములు లేక, ఆకలి కల్గినప్పుడు భుజింపవలెనని భోజనక్రమము. ఆట్టినియమమును విడచి మలమూత్రవేగములు కల్గినప్పుడు వానిని విసర్జింపక భుజించినను, ఆకలిలేనప్పుడు భుజించినను, మిక్కిలితీవ్రముగ నాకలియగునంతవరకు జాగుజేసి భుజించినను, అయ్యది క్రమవిరుద్ధమగును.

### పరిహారవిరుద్ధము.

మూ. పరిహారవిరుద్ధం తు వరాహాదీన్ నిషేవ్య యత్. ౧౮౬
సేవేతోష్ణం ఘృతాదీంశ్చ పీత్వా శీతం నిషేవతే,

వ్యా. వరాహాది జంతుమాంసమును భుజించినచో శీతజలమును పానముజేసిన యెడ అట్టియాహారమున గల్గుదోషము పరిహరింపబడును. నెయ్యి పెరుగు మున్నగు వానిసేవించి యుష్ణోదకమును త్రాగినచో అట్టియాహారమున గల్గుదోషము పరిహృతమగును. దానికి విరుద్ధముగ పందిమాంసము మున్నగువాని సేవించిన వేడినీళ్లు త్రాగినను, నెయ్యి మున్నగువానిని సేవించి చల్లనినీళ్లుత్రాగినను అయ్యది పరిహారవిరుద్ధమగును.

### పాకవిరుద్ధము.

మూ. విరుద్ధం పాకతశ్చాపి దుష్టదుర్దారుసాధితం. ౧౮౭
అపక్వతణ్డులాఽత్యర్థపక్వం దగ్ధం చ యద్భవేత్,

వ్యా. చెడినపాత్రలయందును చెడినగరిటెలు మున్నగువానిచేతను విషగుణములు కల్గిన కట్టెలచేతను పక్వముచేయుబడిన యన్నాదులు పాకముచే విరుద్ధములగును. మరియు బియ్యము పూర్తిగ పక్వముగాకుండునట్టిలును, మిక్కిలి యధికముగ చిముడునట్లును, అడుగంటి మాడునట్లును పక్వముచేయబడిన యాహారపదార్థములును పాకముచే విరుద్ధములుగ నగును.

### సంయోగవిరుద్ధము, హృద్విరుద్ధంబును.

మూ. సంయోగతో విరుద్ధం తత్ యథామ్లం పయసా సహ. ౧౪౭
అమనోరుచితం యచ్చ హృద్విరుద్ధం తదుచ్యతే,

వ్యా. కొన్నిద్రవ్యములు పరస్పరసంయోగమునంజేసి విరుద్ధములగును. పులుపుగలద్రవ్యము లన్నియుం పాలతోఁగూడిన విరుద్ధములగును, (ఇది సంయోగవిరుద్ధము). మనసు కింపుగానిది హృద్విరుద్ధ మనబడును.

### సంపద్విరుద్ధము.

మూ. సమ్పద్విరుద్ధం తద్విద్యాత్ అసంజాతరసం తు యత్. ౧౪౮
అతిక్రాన్తరసం వాపి విపన్నరసమ మేవ వా,

వ్యా. ఆహారమునకు ముఖ్యముగ నుండవలసిన గుణాదిసంపత్తు చెడినయెడ నయ్యది సంపద్విరుద్ధ మనబడును. ఎట్టులన:—కాయకూరదినుసులు మున్నగువానికి రుచికల్గకున్నను, అట్టిరసము అధికముగనై చెడినను, లేక వ్యత్యస్తముగ మారియున్నను, అయ్యది సంపద్విరుద్ధ మనబడును.

### విధివిరుద్ధము.

మూ జ్ఞేయం విధివిరుద్ధం తు భుజ్యతే నిభృతేన యత్. ౧౫౦
తదేవం విధమన్నం స్యాత్ విరుద్ధముపయోజితం,

వ్యా. ఏకాకిగ నున్నపుడు భుజించినచో నయ్యది విధివిరుద్ధము. (ఇత్తెరంగున "యచ్చాపి దేశ......విధిభిశ్చ యత్" అని నిర్దేశింపబడిన విరుద్ధములన్నియుం పరుసగ వివరింపబడినవి. అట్టివిరుద్ధమైన యాహారమును భుజించినయెడ శరీరమునందలి రక్తాదిధాతువులను చెడగొట్టి, వాతపిత్తకఫములను చెరచి యనేకవిధములైన రోగముల కల్గించును. లేక విషతుల్యమై మరణము నైన కల్గించును. ఈవిషయమునే వాగ్భటాచార్యుడును "విరుద్ధమపి చాహారం విద్యాద్విషగరోపమమ్" అని యష్టాంగహృదయమునను, "కుర్యాద్విరుద్ధమశనం జ్వరమస్రపిత్తం అష్టౌ గదాంశ్చ మహతో విషవచ్చ మృత్యుం" అని యష్టాంగసంగ్రహమునను చెప్పిరి. కావున పైజెప్పిన విరుద్ధములన్నిటిని మిక్కిలి గమనించి యుపయోగించవలెను).

### విరుద్ధాహారాభ్యనుజ్ఞ.

మూ. సాత్మ్యతోఽల్పతయా వాపి దీప్తాగ్నే స్తరుణస్య చ,
స్నేహవ్యాయామబలినః విరుద్ధం వితథం భవేత్. ౧౫౧

వా. అట్టివిరుద్ధమైన యాహారమును తీవ్రమైన జాఠరాగ్నికలవారును, మంచి యౌవనమున నుండువారును, స్నేహవ్యాయామములచే మిక్కిలి బలిష్ఠులును శరీర సాత్మ్యము ననుసరించి స్వల్పముగ భుజించినను వారికి విరోధమును కల్గింపనేరదు. (అట్టి వారికి జీర్ణశక్తి పూర్తిగ నుండును కావున విరుద్ధాహారమును స్వల్పముగ జేసినను అయ్యది జీర్ణమై తనకు గల్గిన విరుద్ధగుణమును మాని రోగాదుల కల్గింపవని భావము. మరియుం విరుద్ధమైన యాహారమును అలవాటు చేసియుండువారికి విరోధము చేయనేరదు.)

ఈ విషయమునే వాగ్భటాచార్యులు "వ్యాయామస్నిగ్ధదీప్తాగ్నివయస్థస్బలశాలినామ్, విరోధ్యపి న పీడాయై సాత్మ్యమల్పం చ భోజనమ్" అని యుపదేశించిరి.

విరుద్ధాహారముచే గల్గు రోగములు.

మూ. షాణ్డ్యాన్ధ్యవీసర్పదకోదరాణాం
విస్ఫోటకోన్మాదభగన్దరాణామ్,
మూర్ఛామదాధ్మానగళామయానాం
పాణ్డ్వామయస్యామవిషస్య చైవ. ౧౫౨
కిలాసకుష్ఠగ్రహణీగదానాం
శోషాఽస్రపిత్తజ్వరపీనసానామ్,
సన్తానదోషస్య తథైవ మృత్యోః
విరుద్ధమన్నం ప్రవదన్తి హేతుమ్. ౧౫౩

వ్యా. నపుంసకత్వము, అంధత్వము, విసర్పము, జలోదరము, స్ఫోటకము, ఉన్మాదము, భగందరము, మూర్ఛారోగము, మదము (తిక్క), ఆధ్మానము (కడుపుబ్బరము), కంఠరోగములు, పాండురోగము, అజీర్ణము, విషరోగము, కిలాసము (సిబ్బెమనుక్షుద్రకుష్ఠము), కుష్ఠము, గ్రహణీరోగము, శోషము, (ధాతుక్షయము), రక్తపిత్తము, జ్వరము, పీనసము (పడిసెము), సంతానదోషము (చావుబిడ్డలు కలుగుట మున్నగుదోషము, ఇది శుక్రదోషమున సంభవించును), అనునీవ్యాధులకు పైజెప్పిన విరుద్ధాశనము కారణమగును. (విరుద్ధాశనముచే నీవ్యాధులు కల్గునని భావము.) మరియుం నకాలమృత్యువును కూడ నొకసమయమున గల్గించును. (ఇచ్చట దకోదరమనుచోట దకమనుపదము ఉదకశబ్ద పర్యాయము. "ఉదకశబ్దపర్యాయో దకశబ్దో నిపాత్యతే" అని భాష్యకారవచనము ప్రమాణము.)

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—పైజెప్పిన విరుద్ధములు కొన్నిచోట్ల విశేష విధిచే బాధింపబడును. ఎట్టులన —"సాధయేచ్ఛుద్ధశుష్కస్య లశునస్య చతుష్పలం,

క్షీరోదకేఒష్టగుణితే క్షీరశేషం చ పాచయేత్'' "మూలకస్వరసంక్షీరం" ఇవి మున్నగు యోగములయందు పాలకు ఉల్లిగడ్డలతోడను, ముల్లంగిరసముతోడను సంయోగము చెప్పబడినది. ఇది సంయోగవిరుద్ధమైనను విశేషశాస్త్రముచే వాచనికముగ విధింపబడినది కావున అట్టి స్థలములయందు విరుద్ధము బాధకరము కాదని యెరుంగునది. మరియు నే ద్రవ్యములకు నే ద్రవ్యముతో జేరినప్పుడు విరోధము చెప్పబడినదో అట్టి ద్రవ్యములు మాత్రము పరస్పరసంయోగము కల్గినప్పుడు విరుద్ధమగును కాని, అవిగాక యితర ద్రవ్యము లనేకములును ఒకటిగ జేరినప్పుడు విరుద్ధగుణము సంభవించదని తంత్రకారుల యభిప్రాయము. కావున లశునమూలకాదిద్రవ్యములకు విరోధిద్రవ్యములుగ వేనిని చెప్పియున్నదో అట్టిద్రవ్యములతో మాత్రము సంబంధము కల్గినప్పుడు విరోధి యగును గాని ఇతరద్రవ్యము లనేకములు చేరినప్పుడు విరోధి కానోపదని యార్షసిద్ధాంతము. తేనె మాత్రము ఎప్పుడైనను ఉష్ణద్రవ్యసంబంధము కల్గిన విరుద్ధమే యగును తేనె విష జాతిలో జేరియుండుటంబట్టి యుష్ణసంస్పర్శమున విరుద్ధమే యగును.

విరుద్ధాహారముచే గల్గు రోగములకు ప్రతీకారము.

మూ. ఏషాం చ ఖలు పరేషాం చ వైరోధికనిమిత్తానాం వ్యాధీనా మిమే భావాః ప్రతీకారా భవన్తి యథా:—వమనం విరేచనం చ తద్విరోధినాం చ ద్రవ్యాణాం సంశమనార్థముపయోగః; తథావిధైశ్చ ద్రవ్యైః పూర్వమభిసంస్కారః శరీరస్యేతి. ౧౫౭

వ్యా. సంయోగాదులచే విరుద్ధములగు నాహారాదులచే గల్గిన పైజెప్పబడిన నపుంసకత్వాదిరోగములకును, తదితరములైన విరుద్ధనిమిత్తరోగములకును ఈ క్రింద జెప్పంబడునవి ప్రతీకారము (చికిత్స) లగును.—అట్టి వ్యాధులు సంభవించినపుడు వమనవిరేచనముల జేయింపనగును. మరియు నపుంసకత్వాదిరోగములకు విరుద్ధములగు శుక్రవర్ధన రసాయనాది ద్రవ్యములను శమనార్థముగ నుపయోగింపనగును. అట్టి వ్యాధులు కలగకమునుపే అట్టి రసాయనాదిద్రవ్యముల నుపయోగించి శరీరమును సంస్కరించియుండుట చాల మంచిది. (అట్టి ద్రవ్యముల నుపయోగించుటచే గల్గిన సంస్కారవిశేషమునంజేసి విరుద్ధాహారములచే గల్గబోవు పాండ్వాదివ్యాధులకు శరీరమునం దవకాశము కల్గనీయక యాపుదలచేయునని భావము. ఇయ్యది వ్యాధులు రాకుండునట్లు వ్యాధులు కల్గుటకు మున్ను చేయుచికిత్స) ఈ విషయమునే వాగ్భటాచార్యులును "ద్రవ్యైస్తైరేవ వా పూర్వం శరీరస్యాభిసంస్కృతిః" అని చెప్పెను.

## ఉక్తచికిత్సానువాదము.

భవతిచాత్ర:—

మూ. విరుద్ధాశనజాన్ రోగాన్ ప్రతిహన్తి విరేచనమ్,
వమనం శమనం చైవ పూర్వ్వం వా హితసేవనమ్.   ౧౦౫

వ్యా. విరుద్ధాహారమువలన జనించిన రోగములను విరేచనంబైనను వమనంబైనను హరించును. మరియు నట్టివ్యాధుల కుపత్యనీకములైన చికిత్సలును వ్యాధుల శమింప జేయును. (వమన విరేచనరూప శోధనంబును, వ్యాధి విరుద్ధరూపమైన శమనచికిత్సయుం చేయదగునని భావము.) లేక జరావ్యాధినాశకరూపమై మహాప్రభావవంతములైన రసాయనము నభ్యసించియున్నచో నట్టిరసాయనభావితమైన శరీరమునకు విరుద్ధాశనముగ గల్గువ్యాధులు ఎప్పటికైన కల్గనేరవని యర్థము.

## అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకా:—

మూ. మతిరాసీన్మహర్షీణాం యా యా రసవినిశ్చయే,
ద్రవ్యాణి గుణకర్మభ్యాం ద్రవ్యసంఖ్యా రసాశ్రయా.   ౧౦౬
కారణం రససంఖ్యాయా: రసాఽనురసలక్షణమ్,
పరాదీనాం గుణానాం చ లక్షణాని పృథక్ పృథక్   ౧౦౭
పఞ్చాత్మకానాం షట్త్వం చ రసానాం యేన హేతునా,
ఊర్ధ్వానులోమభాజశ్చ యద్గుణాతిశయాద్రసా:.   ౧౦౮
షణ్ణాం రసానాం షట్త్వే చ సవిభక్తా విభక్తయ:,
ఉద్దేశశ్చాపవాదశ్చ ద్రవ్యాణాం గుణకర్మణీ.   ౧౦౯
ప్రవరాఽవరమధ్యత్వం రసానాం గౌరవాదిషు,
పాకప్రభావయోర్లిఙ్గం వీర్యసంఖ్యావినిశ్చయ:.   ౧౧౦
షణ్ణామాస్వాద్యమానానాం రసానాం యత్ స్వలక్షణం,
యద్యద్విరుధ్యతే యస్మాత్ యేన యత్కారి చైవ యత్.
వైరోధికనిమిత్తానాం వ్యాధీనామౌషధం చ యత్,
ఆత్రేయభద్రకాప్యీయే తత్సర్వ్వమవదన్మునిః.   ౧౧౧

వ్యా. రసనిశ్చయము విషయమై మహర్షులకు గల్గిన మతభేదములు, ద్రవ్యములు, వాని గుణకర్మములు, రసము నాశ్రయించిన ద్రవ్యసంఖ్య, రససంఖ్యాకారణము, రసానురసముల లక్షణములు, పరత్వాదిగుణములకు వేరువేరు లక్షణములు, పంచభూతములచే గల్గినరసములు ఆరువిధములగుటకు కారణము, రసములు ఊర్ధ్వముగను అనులోమముగను వ్యాపించుటకు ఎట్టిగుణములు కల్గియుండునదియు, ఆరురసములయొక్క షట్త్వమునంగల భేదంబులు, రసములకు విభాగకారణములు, ద్రవ్యములకు సంబంధించిన గుణకర్మల యుద్దేశము, వానికపవాదము, రసములకు సంబంధించిన గురుత్వాది గుణములకుగల తారతమ్యము, విపాకప్రభావముల లక్షణములు, వీర్యసంఖ్యానిర్ణయము, మధురాదిరసములకు రుచినిబట్టి వేరువేరుగ స్వరూపలక్షణములు, ద్రవ్యములు విరుద్ధములగుటకు సంయోగాదికారణములు, అట్టి విరుద్ధద్రవ్యాహారమున గల్గురోగములు, అట్టి వ్యాధులకు దగిన చికిత్స అను నీవిషయముల నన్నింటిని ఈ యాత్రేయభద్రకాప్యీయమను నధ్యాయమునం దగ్నివేశమహర్షి వివరించి చెప్పెను.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
ఆత్రేయభద్రకాప్యీయో నామ షడ్వింశోఽధ్యాయః
సమాప్తః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమునందలి సూత్రస్థానమున నాత్రేయభద్రకాప్యీయ మనునది యిరువదియారవయధ్యాయము సమాప్తము.

---

## సప్తవింశాధ్యాయము.

అవతారిక:—పైగ్రంథముచేత ద్రవ్యసామాన్యముగ గుణకర్మలు వివరింపబడినవి గాని ఒక్కొకద్రవ్యమునకు సంబంధించిన విశేషగుణకర్మములు నిర్దేశించి చెప్పబడలేదు. చెప్పబడని విశేషగుణకర్మముల సామాన్యవ్యక్తి నుద్దేశించి వివరించుటకై యన్నపానవిధియను నీయధ్యాయము చెప్పబడును.

మూ. అథాతోఽన్నపానవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. ద్రవ్యసామాన్యముగ గుణ కర్మముల చెప్పినపిదప నన్నపానములకు సంబంధించిన గుణకర్మకథన రూపమైన విధానమును బోధించునట్టి యన్నపానవిధియను నధ్యాయమును త్రికాలజ్ఞానవేత్తయగు నాత్రేయు లుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము.

ఇచ్చట నన్నము సామాన్యముగ కొంచెము కఠినముగ నుండును కావున నీశబ్ద ముచేత ఖాద్యంబును, పానీయము ద్రవరూపముగ నుండుటంబట్టి పానీయశబ్దముచేత ద్రవరూపమైన లేహ్యంబును గ్రహింపబడును. "అన్నపానం విధీయతే (విశిష్టగుణకర్మ తయా) ఇతి అన్నపానవిధిః, తమధికృత్య కృతోఽధ్యాయః అన్నపానవిధిః అధ్యాయః" అను వ్యుత్పత్తిచేత కఠినరూపంబును ద్రవరూపంబునునైన యాహారపదార్థములు, విశేషగుణకర్మములచే వివరించువిషయము నధికరించి చెప్పబడిన యన్నపానవిధియను నధ్యాయమును వివరించెదనని యర్థము. "అన్నపానవిధిం" అనుచోట ఛప్రత్యయము లుప్తమైనది కావున నీయర్థము లభించును. (కఠినరూపంబును ద్రవరూపంబునైన యాహారద్రవ్యములకు సంబంధించిన విశేషగుణంబులును, విశేషకృత్యంబులును వేరువేర వివరించి యీయధ్యాయమున చెప్పబడునని ఫలితార్థము).

## అన్నపానస్వరూపము, వానిసామాన్యకృత్యములు.

మూ. ఇష్టవర్ణగన్ధరసస్పర్శం విధివిహితమన్నపానం ప్రాణినాం ప్రాణి
సంజ్ఞకానాం ప్రాణమాచక్షతే కుశలాః ప్రత్యక్షఫలదర్శనాత్,
తదిన్ధనాహ్యన్తరాగ్నేః స్థితిః,తత్సత్త్వమూర్జయతి,తచ్ఛరీరధాతు
వ్యూహబలవర్ణేన్ద్రియప్రసాదకరం యథోక్తముపసేవ్యమానం;
విపరీతమహితాయ సమ్పద్యతే 3

వ్యా. మన కింపైనదియు శరీరమునకు హితంబునైనవర్ణము గంధము మధురాది రసము (రుచి) స్పర్శంబును కల్గినదియు, విధివిహితంబునైన యన్నము (ఆహారపదార్థము) ప్రాణులని లోకమున వ్యవహరింపబడు మానవులకు ప్రాణమని (ప్రాణమున కాధారమని) వైద్యతత్త్వజ్ఞులగు పండితులు చెప్పెదరు ఎట్లులన:—ప్రత్యక్షముగ ఫలమును జూచుటవలనను (ఆహారము లేనియెడ ప్రాణి జీవించుటలేదు. ఆహారమున్నపుడు జీవించును. ఇట్టి యనుభవసిద్ధమైన జ్ఞానమువలన), జాఠరాగ్నిస్థితి అట్టియాహారము నే సమిధలు (అగ్నిని జ్వలింపజేయుపుల్లలు)గ గల్గియుండుటచేతను ప్రాణికోటికెల్ల విధి విహితమైనయాహారము ప్రాణముగ నుండును. (లోకమున ప్రాణికోటులెల్ల నాహారమున్నపుడె జీవించియుండును. ఆహారము లేనినాడు జీవించుటలేదు. ఇదియే అన్వయి, వ్యతిరేకి యని నైయాయికమతము. అట్టియన్వయవ్యతిరేకదృష్టాంతములచేత ప్రాణములు నిలచియుండుటకు అన్నము కారణమని యనుమానముచే యూహింపబడును. అట్టి యనుమానముచే స్థిరముగ నేర్పడినజ్ఞానము ప్రత్యక్షముకావున అట్టి ప్రత్యక్ష

జ్ఞానముచేత ప్రాణులకు ప్రాణముగనుండునది యాహారమని యేర్పడును. అయ్యది యింపైన వర్ణగంధరసస్పర్శములకల్గి విధివిహితమైయున్ననే ప్రాణమున కాధారమగు నని యర్థము. మరియు లోకమునందు బాహ్యాగ్నిని చిదుకులు మున్నగునవి జ్వలింప జేసి వృద్ధినొందించును. అట్లేయగునే భుజింపబడిన యాహారము జాఠరాగ్నిని వృద్ధి నొందించును. అట్టి జాఠరానలపరిస్థితి చక్కగ నున్నపుడే ప్రాణములు నిరపాయముగ నుండును. ఈవిషయము "బలమారోగ్య మాయుశ్చ ప్రాణాశ్చాగ్నౌ ప్రతిష్ఠితాః" అను వాక్యముచేత నీయధ్యాయోపాంతమున చెప్పబడును. అట్టిప్రాణమున కాధారమైన జాఠరాగ్నికిని హేతువుగ నుండుటంజేసియు నాహారము ప్రాణమని చెప్పబడును).

అట్టి నిర్దుష్టమైనయాహారమును విధ్యుక్తముగ సేవించినయెడ మనోబలమును కల్గించును. శరీరమునందలి రసరక్తాది ధాతుసముదాయమునకు బలమును, శరీరవర్ణమును చక్షురాదీంద్రియములకు ప్రసన్నతను కల్గించును. విధివిపరీతముగ సేవించినచో మనస్సునకు శరీరవర్ణాదులకు హితముకాక హానికరమగును.

ఇచ్చట "విధివిహితమన విధినా (విధానేన) విహితం-విధివిహితం" అను విగ్రహముచేత విధాయకవాక్యముచే విధింపబడినదియని యర్థము. అయ్యది "నారత్న పాణిః నాస్నాతః...నచ్ఛిత్వా ద్విజైర్భక్షయేత్" అను వాక్యముచే నింద్రియోపక్రమణీయమునను (౮. వ అ. సూత్రము ౨౩), విమానస్థానమున "తత్రేదమాహార విధానం అరోగాణామపి ..తస్మాదాత్మనాత్మానమభిసమీక్ష్య భుంజీత" అను వాక్యము చేతను చెప్పబడినది. ఆహారము పంచభూతాత్మకము కావున నయ్యది పంచభూతములకు సంబంధించిన శబ్దస్పర్శరూపరసగంధము లనుగుణములు కల్గియుండును. అందు ద్రవ్యములలో ఆకాశగుణమైనశబ్దము ప్రాయికముగ నుండదు కావున నిచ్చట వదలబడినది.

అన్నపానవిధి.

సూ. తస్మాదితోఽహితోఽవబోధనార్థం అన్నపానవిధిమఖిలేన ఉపదేక్ష్యామః అగ్నివేశ!—తత్స్వభావాదుదకం క్లేదయతి, లవణం విష్యన్దయతి, క్షారః పాచయతి, మధు సన్దధాతి, సర్పిః స్నేహయతి, క్షీరం జీవయతి, మాంసం బృంహయతి, రసః ప్రీణయతి, సురా జర్జరీకరోతి, శీధురవధమయతి, ద్రాక్షాసవో దీపయతి, ఫాణిత మాచినోతి, దధి శోఫం జనయతి, పిణ్యాకశాకం గ్లపయతి, ప్రభూతాన్తర్మలో మాషసూపః, దృష్టిశుక్రఘ్నః క్షారః

వ్యా. విధివిహితమైన యాహారము నుపయోగించినచో హితకరంబును, విధివిపరీతముగ నుపయోగింపబడిన యాహారము అహితంబును నగుటంజేసి యట్టి హితాహితముల నరయుటకై (యన్నపానముల విధించుటకు సాధనమైన పరిజ్ఞానమును దెల్పునట్టి) యన్నపానవిధిని పూర్తిగ నీక్రింద నుపదేశించెద:—అందు ఉదకము తడుపునట్టి స్వభావము కల్గినదికావున ద్రవరూపమైన యుదకము ద్రవమును కల్గించును. ఉప్పు ద్రవపదార్థములను స్రవింపజేయును. క్షారము జాఠరాగ్నిచే నాహారపదార్థములను జీర్ణింపజేయును. (జఠరాగ్నిని వృద్ధినందించి దానిమూలమున భుజింపబడిన యాహారమును పచింపజేయుననుట) తేనె శరీరమునందలి వీడియున్న చర్మమాంసాదుల నతుకజేయును. (ఒండొంట జేర్చుననుట), నెయ్యి శరీరమున జిడ్డును కల్గించును. పాలు బలమును కల్గించును. మాంసము శరీరమును బలియజేయును. మాంసరసము క్షీణించిన రక్తాదిధాతువులకు పుష్టిని కల్గించును. సురయనుమద్యము చర్మమాంసాదులను శిథిలముగ జేయును. శీధువనుమద్యము శరీరమునందలి మాంసాదులను కృశింపజేయును. ద్రాక్షాసవము జాఠరాగ్నిని జ్వలింపజేయును (ఆకలి బుట్టించును). ఫాణితము (అర్ధపాకమై ద్రవరూపముగనుండు చక్కెరపాగు, జీరా) దోషములను వృద్ధినొందించును. పెరుగు శోఫమును కల్గించును. పిణ్యాకశాకము (ఆకుకూర విశేషము, లేక నువ్వుల గానుగపిండి జేర్చి పక్వముజేయబడినకూర) గ్లానిని (బడలికను) కల్గించును ఉద్దిపప్పుచే చేయబడిన సూపము శరీరమునందలి పురీషమును వృద్ధిజేయును. క్షారము దృష్టిని శుక్రమును నశింపజేయును.

ఇచ్చట "అన్నపానం విధీయతే యేన జ్ఞానేన విధీయతే తం విధిం (తత్తద్విశిష్టకర్మనిబంధనం ప్రకారం) ఇతి అన్నవిధిం" అను వ్యుత్పత్తిచేత అన్నపానవిధానమునకు ముఖ్యమైనకృత్యమును (ఆహారపదార్థముల కృత్యములను) తెలియజేయు జ్ఞానమును దెలిపెదనని యర్థము. (అన్నపానముల నిర్ణయించుటకు ఆహారపదార్థముల గుణకర్మపరిజ్ఞాన మావశ్యకము. కావున అట్టియాహారపదార్థముల గుణకర్మాదులను వివరించెదనని భావము). అన్నపానముల రెండిటియందును వ్యాపించియుండునది జలముకావున దానిని ప్రధానముగజేసి తొలుత "ఉదకం క్లేదయతి" అని నిర్దేశింపబడియె. "జలమాశ్వాసకరాణాం" "జలం స్తమ్భనానాం" అను వాక్యములచే నుపకకృత్యము చెప్పబడియున్నను అనుక్తమగు క్లేదనకృత్యము ఇచ్చట నుపదేశింపబడినది. మరియు జలము లవణము మున్నగువానికృత్యము లనేకములున్నను ఇచ్చట చెప్పబడిన కృత్యములు మాత్రము ముఖ్యములని యెరుంగునది. 'క్షారః పాచయతి' అనుచోట 'హేతుమతి చ' అని ప్రేరణార్థమున ణిచ్ ప్రత్యయము. జాఠరాగ్ని యాహారమును

పచించును. దానిని ప్రేరేపించునది క్షారమని యర్థము. "సర్పిః స్నేహయతి" అనునది మున్నగుచోట్ల "తత్కరోతి తదాచష్టే" అని కర్త్రర్థమున ణిచ్ స్నిగ్ధముగ జేయునని యర్థము.

మరియు "మాంసం బృంహయతి, రసః ప్రీణయతి" అనుచోట మాంసము శరీరమును మిక్కుటముగ బలియజేయుననియు, మాంసరసము శరీరమున కృశించిన ధాతువుల మాత్రము మితముగ పుష్టినొందించుననియు నీరెండిటికిని యర్థభేదము నెరుంగునది.

మరియు "వాతపిత్తకఫాంస్తస్మాదాచినోతి చ ఫాణితం" అని తంత్రాంతరమున నున్నదిగాన నిచ్చట "ఫాణితమాచినోతి" అను వాక్యమునను ఫాణితము వాతపిత్తకఫములను చయావస్థ నొందించునని యర్థము.

## అమ్లాద్యాహారముల ప్రధానకృత్యములు.

మూ॥ ప్రాయః పిత్తలమమ్లమన్యత్ర దాడిమామలకాత్, ప్రాయ శ్లేష్మలం మధుర మన్యత్ర మధునః పురాణాచ్చ శాలియవగోధూమాత్, ప్రాయస్సర్వం తిక్తం వాతలమవృష్యం చ అన్యత్ర వేత్రాగ్రపటోలాత్, ప్రాయః కటుకం వాతలమవృష్యం చ అన్యత్ర పిప్పలీవిశ్వభేషజాత్. ౫

వ్యా. అమ్లరసముకల పదార్థములలో దానిమ్మయు, ఉసిరికకాయలును దక్క తక్కినవియన్నియుపిత్తమును అధికముగవృద్ధినొందించును. మధురరసము కలద్రవ్యములలో తేనెయు, ప్రాతవియగు రాజనంబులును, యవలును, గోధుమములును దక్క తక్కినవియన్నియు కఫము నధికముగ వృద్ధినొందించును. తిక్తరసము కలద్రవ్యములలో వేత్రాగ్రంబును (వెదురుమోవు) పొట్లకాయయు (చేదుపొట్ల) దక్క తక్కినవి యన్నియు వాతమును అధికముగ వృద్ధినొందించును. కటురసముకల పదార్థములలో పిప్పళ్లను శుంఠియుందక్క తక్కినద్రవ్యములన్నియు వాతము నధికముగ వృద్ధినొందించును. వృష్యము (శుక్రమును వృద్ధినొందించునది) కానేరవు.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—"యదన్నం దేహధాత్వోజోబలవర్ణాది పోషకం, తత్రాగ్నిర్హేతురాహారాన్నపక్వాద్రసాదయః" అను ప్రమాణముచేత జఠరాగ్నిచే చక్కగ పక్వమైన యన్నము (ఆహారము) చేత రసాదులు ధాతువులు వృద్ధినొందు దానంజేసి శరీరముయొక్క బలవర్ణాదులకు పుష్టికల్గునని తెలిసెడి. భుజింపబడిన యాహారమును పచింపజేయునది జాఠరాగ్ని. అయ్యది పిత్తముయొక్క వేడియే యగును. కావున

శరీరపోషణమునకు ముఖ్యకారణమైన యాహారమును పచింపజేయు పిత్తరూపమైన యగ్ని ప్రధానమని తలంచి త్రిదోషములలో పిత్తము తొలుత జెప్పబడినది. రసములలో మధురరసము ప్రధానమైనను అట్టి ప్రాధాన్యమును వదలి పైజెప్పినరీతిగ పిత్తప్రాధాన్యము ననుసరించి పిత్తకరమైన యమ్లరసము చెప్పబడినదని యెరుంగునది. మరియు "న తే పృథక్పిత్తకఫానిలేభ్యః" "సమపిత్త కఫానిలాః" అనునవి మున్నగుస్థలములలో నిత్తెరంగుననే పిత్తప్రాధాన్యము నెరుంగునది

మరియు "ప్రాయః" అను పదము విశేషార్థము. అయ్యది పిత్తశబ్దముతో జేర్చబడును. పిత్తవర్ధకములగు తిక్తాన లవణ కటుకములకన్న అమ్లము అధికముగ కల్గించునని యర్థము. ఇత్తెరంగుననే తిక్తాన వాతకఫములకును అర్థవిశేషమును ప్రాయశ్శబ్దముచే నెరుంగునది.

పై వాక్యముచేత షడ్రసములకును ప్రధానమైన కృత్యము నిరూపింపబడినది. ఎట్టులన:—లవణము విపాకమున మధురమగును కావున మధురశబ్దముచేతనే గ్రహింపబడును. తిక్తకషాయములు రెండును ప్రాయికముగ విపాకమున కటుకములగును కావున కటుశబ్దముచేతనే గ్రహింపబడును. ఇట్టి విపాకభేదములు "కటుతిక్తకషాయాణాం విపాకః ప్రాయశః కటుః, అమ్లోఽమ్లం పచ్యతే స్వాదుర్మధురంలవణస్తథా" అను శ్లోకముచే పై యధ్యాయమున చెప్పబడినవి. పైజెప్పినరీతిగ అనుక్తములగు లవణ తిక్తకషాయరసములకును ప్రధానకృత్యము లిచట జెప్పబడును. తిక్తరసము నుద్దేశించి "ప్రాయస్సర్వం తిక్తం వాతలమవృష్యం చాన్యత్ర వేత్రాగ్రపటోలాత్"అని చెప్పిన వాక్యము హారీతసంహితలోనిది. దానిని కొందరీగ్రంథమున జేర్చిరి. ఈ విషయము చక్రదత్తవ్యాఖ్యానమున చెప్పబడినది.

## ధాన్యాదివర్గవిభాగము.

మూ. పరమతో వర్గసఙ్గ్రహేణ ఆహారద్రవ్యాణ్యనువ్యాఖ్యాస్యామః.—

శూకధాన్యశమీధాన్యమాంసశాకఫలాశ్రయాన్,
వర్గాన్ హరితమద్యామ్బుగోరసేక్షువికారికాన్.　౬
దశ ద్వౌ చ పరౌ వర్గౌ కృతాన్నాహారయోగినాం,
రసవీర్యవిపాకైశ్చ ప్రభావైశ్చోపదేక్ష్యతే　౭

వ్యా. పిమ్మట నాహారద్రవ్యములగు శూకధాన్యాదులను వర్గరూపములుగ సంగ్రహించి (పరిగణనముచేసి) ఈక్రింద వివరింపబడును.—శూకధాన్య (ముండ్లుకల్గిన

ధాన్యముల)వర్గము, శమీధాన్య (పెసలు మున్నగు కాయధాన్యముల) వర్గము, మాంస వర్గము, శాకవర్గము, ఫలవర్గము, హరితవర్గము, మద్యవర్గము, జలవర్గము, గోరస వర్గము, ఇక్షువికారవర్గము, కృతాన్నవర్గము, ఆహారయోగివర్గము అను నీ పండ్రెండు వర్గములతో జేరిన యాహారద్రవ్యములకు జేరిన రసవీర్యవిపాకములను ప్రభావమును వివరింపుచు నుపదేశింపబడునని యర్థము.

ఇచ్చట నానావర్గములలో జేరిన యాహారద్రవ్యములకు యథోచితముగ రస వీర్యవిపాకప్రభావములు నిర్దేశింపబడును; కాని ద్రవ్యముల కన్నింటికిని రసాదు లన్నియుం వివరింపబడవు. (అనగా కొన్నిటికి రసములు కొన్నిటికి వీర్యము మరికొన్నిటికి విపాకము ప్రభావము. కొన్నిటికి రసవీర్యాదులలో కొన్నియు యథాసంభవముగ నిర్దే శింపబడునని భావము. అట్టి యాహారద్రవ్యములలో శూకధాన్యములు ప్రధానములు కావున తొలుత జెప్పంబడినవి.

(౧) శూకధాన్యవర్గము, అందు రక్తశాల్యాదిభేదములు వానిగుణములు.

అథ శూకధాన్యవర్గః.—

మూ. రక్తశాలిర్మహాశాలిః కలమశ్శకునాహృతః,
తూర్ణకో దీర్ఘశూకశ్చ గౌరః పాణ్డుకలాఙ్గలౌ. ౮
సుగన్ధికా లోహవాలాః శారిబాఖ్యాః ప్రమోదకాః,
పతఙ్గాస్తపనీయాశ్చ యే చాన్యే శాలయశ్శుభాః. ౯
శీతా రసే విపాకే చ మధురాస్స్వల్పమారుతాః,
బద్ధాఽల్పవర్చసః స్నిగ్ధాః బృంహణాశ్శుక్రమూత్రలాః ౧౦

వ్యా. రక్తశాలి (ఎఱ్ఱని రాజనములు) మహాశాలి (లావుగనుండు పెద్దవరి ధాన్యము), కలమధాన్యము (ఎఱ్ఱబుడవవడ్లు), శకునాహృతము (ఇది యుత్తరకురు దేశమునుండి హంసలచే తేబడినది కావున నన్వర్థముగ జెప్పబడినది) తూర్ణకము(కాశ్మీర దేశమున ప్రసిద్ధమైన వరిధాన్యము),దీర్ఘశూకము(పొడుముండ్లుకల నెమలివరిధాన్యము) గౌరము (వరిధాన్యవిశేషము), పాండుకము, లాంగులము, సుగంధికము, లోహవాలము, శారిబములు, ప్రమోదకములు, పతంగములు, తపనీయములు, ఇవి గాక శుభ్రములైన యితరములగు వరిధాన్యములును శీతవీర్యములై రసవిపాకములచే మధురములై యుండును. కొద్దిగ వాతమును కల్గించును. మలమును స్వల్పముగ బంధిం చును. స్నిగ్ధగుణము కల్గినవి శరీరమును బలియజేసి శుక్రమును మూత్రమును వృద్ధి

నొందించును. (మరియు "కషాయానురసాః పథ్యాః" అని వాగ్భటమున జెప్పియుండుటం జేసి యీ ధాన్యములు కషాయమును అనురసముగ గల్గి పథ్యకరములని తెలిసెడి).

ఇచ్చట రక్తశాల్యాది ద్రవ్యములు ఆయా దేశములయందు ప్రసిద్ధములు. వాని భేదములును నామరూపభేదములును ఆయా దేశమునందలి వారికే సుప్రసిద్ధములై యుండును. అన్నింటి నామరూపాదుల వివరించుట కెట్టివ్యాఖ్యాతలకు నలవికాక వదలియున్నవారు. కావున నాయా దేశమునందలి కర్షకులచే నెరుంగదగియున్నవి. ఆయినను అష్టాంగహృదయాది వ్యాఖ్యానకర్తలు వివరించినదాని ననుసరించి యీక్రింద కొంతమట్టుకు వివరింపబడును:—

కలమము లనునవి మగధదేశమునందు ప్రసిద్ధము. దీనిని కాశ్మీరదేశమున మహాతండులములని చెప్పెదరట! శకునాహృతములు:—ఈ ధాన్యమును అవంతిదేశమున వక్రమని చెప్పెదరట. మగధదేశమున పాశకమనియెదరు. ద్వీపాంతరమునుండి (ఉత్తరకురుదేశమునుండి) హంసలచే దేబడినవి కావున శకునాహృతమని యన్వర్థకముగ జెప్పబడును. వృద్ధవైద్యమునందు "ద్వీపాంతరాత్సమానీతో గరుడేన మహాత్మనా, శకునాహృతస్స శాలిస్స్యాత్ గరుడాపరనామకః" అని చెప్పబడినది. ఈశ్లోకముచేత మహనీయుండగు గరుత్మంతునిచే ద్వీపాంతరమునుండి తేబడుటంజేసి శకునాహృతమనియు, గరుడములనియు చెప్పబడినవని యర్థము. ఈశ్లోకము సుశ్రుతవ్యాఖ్యానమున డల్హణాచార్యులచే జూపబడినది. ఇవి యుత్తరకురుభూములనుండి హంసలచే తేబడ్డి బుద్ధునికాలమున మృగారి యనువానితల్లియగు విశాఖయను నామెచే పైరుచేయబడి వ్యాపింపబడినదనియు, దానంజేసి శకునాహృతమని యన్వర్థముగ జెప్పబడుననియు నష్టాంగహృదయవ్యాఖ్యానమున నున్నది.

తూర్ణకము—ఇది కాశ్మీరదేశమునందు అజవము అని ప్రసిద్ధమైనదని యరుణదత్తుడు చెప్పెను. సుగంధికము—ఇయ్యది గంధశాలి దేవశాలి (వాసనగలవరిధాన్యము) యను పేరులచే జాలంధరమగధాది దేశములయందు పిలిచెదరట! తక్కినవానిని యథాలబ్ధముగ నెరుంగునది.

## రక్తశాల్యాదులలో గుణతారతమ్యము.

మూ. రక్తశాలిర్వరస్తేషాం తృష్ణాఘ్నస్త్రిమలాపహః,
మహాంస్తస్యాను కలమః తస్యాప్యను తతః పరే. ౧౧

వ్యా. పైజెప్పిన వరిధాన్యములలో రక్తశాలి (ఎఱ్ఱవరివడ్లు) మిక్కిలి శ్రేష్ఠమైనది. అయ్యది దప్పి నణచును. త్రిదోషముల హరించును. దానికి పిమ్మట మహాశాలియనునది

శ్రేష్ఠము. ఈ రెండిటికన్న కలమములును, వానికన్న నితరధాన్యములును తక్కువ గుణము కల్గియుండును. (పై జెప్పిన రక్తశాల్యాది ధాన్యములు రసవిపాకములచే మధురములైనను ప్రభావముసంజేసి మలబద్ధకములని యెరుంగునది)

యవకాది ధాన్యగుణములు.

మూ. యవకా హాయనాః పాంసువాప్యా నైషధకాదయః,
శాలీనాం శాలయః కుర్వన్త్యనుకారం గుణాఽగుణైః. ౧౨

వ్యా. యవకములు, హాయనములు, పాంసువాప్యములు, నైషధకములు ఇవి మున్నగు శాలిధాన్యములు పైజెప్పిన రక్తశాలిధాన్యమునకు జెప్పినగుణములకన్న వ్యతిరేకములైన గుణముల ననుకరించి యుండును. (రక్తశాలిధాన్యము దప్పిన ణచుననియుం త్రిదోషముల హరించుననియుం పైని చెప్పబడినది. యవకాదులు దానికి వ్యతిరేకముగ దప్పిని కల్గించి త్రిదోషముల వృద్ధినొందించునని భావము. ఈయర్థము "గుణాఽగుణైః" అనుపదముచే లభించును. ఎట్టులన— "గుణానాం అగుణైః—గుణాఽగుణైః" అని విగ్రహము. ఇది యసమర్థసమాసము. "శాలీనాం యే గుణాః ఉక్తాః, తేషాం అగుణైః (వ్యతిరేకగుణైః) అనుకారం యవకాదయః కుర్వన్తి" అని యన్వయము. రక్తశాలిధాన్యమునకు జెప్పినగుణములకు వ్యతిరేకములైన గుణముల ననుసరించి యవకాదులు కార్యము జేయునని యర్థము.)

ఈయర్థమును వాగ్భటాచార్యులు "యావకాహాయనాః పాంసుబాష్పనైషధకాదయః, స్వాదూష్ణాః గురవః స్నిగ్ధాః పాకే మ్లాః శ్లేష్మపిత్తలాః" అని చెప్పిరి.

షష్టికాది ధాన్యభేదములు; వానిగుణములు.

మూ. శీతస్నిగ్ధోఽగురుస్స్వాదుః త్రిదోషఘ్నః స్థిరాత్మకః,
షష్టికః ప్రవరో గౌరః కృష్ణగౌరస్తతోఽను చ ౧౩
వరకోద్దాలకౌ చీనశారదోజ్జ్వలదర్దురాః,
గన్ధనాః కురువిన్దాశ్చ షష్టికాల్పాన్తరా గుణైః. ౧౪

వ్యా షష్టిక. (అరువదినాళ్లకు ఫలించు) ధాన్యము శీతవీర్యంబును, స్నిగ్ధలఘుగుణంబులును, మధురరసంబును కల్గియుండు, త్రిదోషముల హరించును, శరీరమునకు పటుత్వమును కల్గించును. అట్టి షష్టికధాన్యము గౌర మని (గౌర వర్ణము కల్గినది)యును, కృష్ణగౌరమనియు, (నలుపు కలిసిన గౌర వర్ణముకల్గి) రెండువిధములు. అందు గౌర షష్టికములు మిక్కిలి శ్రేష్ఠములు. (కావున రసాయ ప్రయోగమునందును జ్వరాది రోగములయందును పథ్యకరములు)

మరియు వరకములు, ఉద్దాలకములు, చీనములు, శారదములు (శరత్కాలమున ఫలించు ధాన్యవిశేషము), ఉజ్జ్వలములు, దర్దురములు, గంధనములు, కురువిందములు ఇవియన్నియు పైజెప్పిన షష్టికధాన్యమునకంటె కొంచెము తక్కువగుణములు కల్గి యుండును.

(పైజెప్పిన వరక ఉద్దాలకాదిధాన్యములు షష్టికభేదములని చక్రవ్యాఖ్యానమున నున్నది. ఇవి కుధాన్యములని కొందరు తంత్రకారులు చెప్పిరి).

వ్రీహి, పాటలధాన్యగుణములు.

మూ. మధురశ్చాఽమ్లపాకశ్చ వ్రీహిః పిత్తకరో గురుః,
బహుమూత్రపురీషోష్ణః త్రిదోష స్త్వేవ పాటలః. ౧౫

వ్యా. వ్రీహియను ధాన్యవిశేషము మధురరసంబును అమ్లవిపాకంబును గురుత్వగుణంబును కల్గియుండును. పిత్తమును వృద్ధినొందించును. పాటలమను ఎఱ్ఱని వరిధాన్యము మూత్రపురీషములను అధికముగజేయును. ఉష్ణవీర్యము. త్రిదోషకరము. (ఇచ్చట వ్రీహి, పాటల అనునవి ఒకేజాతివరిధాన్యము. ఆకారగుణములచే కొంచెము భేదము కల్గియుండునని యెఱుంగునది. "ఆశు వ్రీహిః పాటలస్స్యాత్" అని కోశమున నొకటిగనే పర్యాయపదములచే జెప్పబడినది) పైశ్లోకమే వాగ్భటాచార్యునిచే జెప్పబడినది.

అళ్లు, చామలు, వీనిగుణములు.

మూ. స కోరదూషశ్శ్యామాకః కషాయమధురో లఘుః,
వాతలః కఫపిత్తఘ్నః శీతసంగ్రాహిశోషణః. ౧౬

వ్యా. ఆరుకలును చామలును కషాయ మధురరసములు కల్గియుండును. లఘుగుణము కల్గినవి. వాతకరములును కఫపిత్తహరంబులును నగును. శీతవీర్యము కల్గినవి. మలాదుల బంధించును. ధాతువుల శోషింపజేయును.

తృణధాన్యగుణములు.

మూ. హస్తిశ్యామాకనీవారతోయపర్ణీగవేధుకాః,
ప్రశాంతికామ్భశ్శ్యామాకలోహిత్యాణుప్రియఙ్గవః. ౧౭
ముకున్దో ఝిణ్టిగర్మూటీ చారుకా వరకా స్తథా,
శిబిరోత్కటజూర్ణాహ్వాః శ్యామాకసదృశా గుణైః. ౧౮

వ్యా. హస్తిశ్యామాకము (చామలలో పెద్దవి), నీవారము (నివ్వరిధాన్యము), తోయపర్ణి, గవేధుకములు (అడవిగోధుమలు), ప్రశాతికములు, అంభశ్శ్యామాకము (నీటిలో బుట్టుచామలు), లౌహిత్యములు, అణుధాన్యము, ప్రియంగు (కొఱ్ఱలు), ముకుందములు, ఝింటి, గర్మోటి, చారుకములు, వరకములు, శిబిరములు, ఉత్కటములు, జూర్ణములు (జొన్నలు), ఇవియన్నియుం చామధాన్యముతో సమానములైన గుణములు కల్గినవి. (చామలు మున్నుగా పైజెప్పబడినవి తృణధాన్యవిశేషములు).

ఈవిషయమునే వాగ్భటాచార్యులు "కంగుకోద్రవనీవారశ్యామాకాది హిమం గురు, తృణధాన్యం పవనకృత్ లేఖనం కఫపిత్తహృత్" అని చెప్పెను. ఈవచనమున లేఖనమని గుణవిశేషము చెప్పబడినది. "విలిఖత్యతితైక్ష్ణ్యాద్యద్ధాతూన్ తల్లేఖనం మతమ్" అను లక్షణముచే తీక్ష్ణగుణమువలన రసాదిధాతువులను భేదించునదియని యర్థము.

యవలగుణము.

మూ. రూక్షశ్శీతో గురుస్స్వాదుః బహువాతశకృద్యవః,
స్థైర్యకృత్ సకషాయశ్చ బల్యః శ్లేష్మవికారనుత్. ౧౯

వ్యా. యవలు రూక్ష-శీత-గురుగుణంబులును, మధురరసంబును కల్గియుండును. వాతమును పురీషమును అధికముగ జేయును. అవయవములకు స్థైర్యమును కల్గించును. కొద్దిగ కషాయరసము కల్గినది. బలమును కల్గించును. కఫరోగములను హరించును.

ఇచ్చట యవలు గురుగుణము కల్గియుండుటవలన వాతహారము కావలసియున్నను రూక్షగుణముచే వాతమును వృద్ధిజేయునని యెరుంగునది. లేక సుశ్రుతమున యవలకు లఘుగుణము చెప్పబడినది. తదనుసారముగ నిచ్చట "శీతోఽగురుః" అనుచోట 'అగురుః' అని విభజించి లఘుగుణము కల్గినదని యర్థము సమంజసముగ నుండును. మరియుం 'లఘుః' అని విస్పష్టముగ జెప్పక సందిగ్ధముగ నకారప్రశ్లేషము చేయుటచే కొంచెముగ గురుత్వము కల్గియుండునని చెప్పదగియున్నది. (నఞ్ ఈషదర్థకమని భావము) బలకరత్వము ప్రభావకృతము. మరియుం శీత మధురకషాయములు కల్గినది యనుటచే పిత్తహారంబునగునని చెప్పకున్నను తెలియదగియున్నది. కావుననే సుశ్రుతమున 'కషాయపిత్తహాస్తా' అనునదియుం సమంజసమని యెరుంగునది.

వేణుయవలగుణము.

మూ. రూక్షః కషాయానురసో మధురః కఫపిత్తహా,
మేదః క్రిమివిషఘ్నశ్చ బల్యో వేణుయవో మతః. ౨౦

వ్యా. వేణుయవలు (వెదురుబియ్యము) రూక్షగుణంబును, కషాయమును అను రసముగగల మధురరసంబును కల్గినది. కఫపిత్తములను మేదస్సును క్రిములను విషమును హరించును. బలమును కల్గించును.

(యవలును వెదురుబియ్యమును రూక్షగుణము కల్గియున్నను స్రోతస్సుల శుద్ధి జేయునవి యగుటంజేసి రససంచారమును చక్కగ చేయునుకావున నంతమాత్రముననే బలకరమని చెప్పబడినదికాని ఉపచయరూపమైన బలమునుకల్గించునని యర్థముకాదు).

గోధుమములగుణములు.

మూ. సన్ధానకృద్వాతహరో గోధూమస్స్వాదుశీతలః,
జీవనో బృంహణో వృష్యః స్నిగ్ధః స్థైర్యకరో గురుః. ౨౧
నన్దీముఖీ మధూలీ చ మధురస్నిగ్ధశీతలే,
ఇత్యయం శూకధాన్యానాం పూర్వో వర్గస్సమాప్యతే. ౨౨
ఇతి శూకధాన్యవర్గః.

వ్యా. గోధుమలు విరిగినయంగముల నతుకజేయును. వాతమును హరించును. మధురరసంబును శీతగుణంబును కల్గినది. బలమును కల్గించును. శరీరమును బలియ జేయును. శుక్రమును వృద్ధినొందించి సంభోగేచ్ఛను ఇనుమడింపజేయును. స్నిగ్ధముగ నుండును. అవయవములకు స్థైర్యమును కల్గించును. గురుత్వము కల్గియుండును.

నందీముఖము (నిడుపుగ సన్నగనుండుగోధుమ) లును, మధూలియను గోధుమ విశేషములును మధురరసంబును స్నిగ్ధశీతగుణంబులును కల్గియుండును. ఇత్తెరంగున శూకధాన్యవర్గ మనునది మొదటివర్గము రసవీర్యవిపాకాదులచే వివరించి సమాప్తి చేయబడినది.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—గోధుమలు స్వాదుశీత స్నిగ్ధాదిగుణములు కల్గియుండుటంజేసి కఫమును వృద్ధిజేయును. కావుననే సుశ్రుతమునందు గోధుమల గుణమును జెప్పుతరి.—"శ్లేష్మకరః" అని చెప్పబడినది. మరియు కఫప్రధానమైన వసంతఋతువునందు "చన్దనాగురుదిగ్ధాంగో యవగోధూమభోజనః" అను వాక్యముచేత గోధుమభోజనము చెప్పినది ప్రాతగోధుమములయన్నము నుద్దేశించి విధింపబడినదియని యెరుంగునది. లేనియెడ కఫప్రధానమైన వసంతకాలమున కఫమును వృద్ధినొందించు గోధుమలయాహారమును విధించుట యుక్తము కానేరదు. "మధురం

శ్లేష్మం ప్రాయో జీర్ణాచ్ఛాలి యవాదృతే, ముద్గా ద్గోధూమతః క్షౌద్రాత్ సితాయాజాఙ్గలామిషాత్" అను శ్లోకముచేత ప్రాతగోధుమలు మధురములైనను కఫకరములు కావని తెలియుచున్నది. ఈయధ్యాయమునందును ఐదవసూత్రమున "ప్రాయశ్శ్లేష్మలం మధురం అన్యత్ర మధునః పురాణాచ్చ శాలియవగోధూమాత్" అను వాక్యముచేతను ప్రాతగోధుమలకు కఫకరత్వము లేదని చెప్పబడినది. కావున కఫప్రధానమైన వసంతఋతువున గోధుమభోజనము విధింపబడినది ప్రాతగోధుమాభిప్రాయముచేతనని యెరుంగునది. సామాన్యవిధిచేత క్రొత్తగోధుమలు మధురాదిగుణయోగమునంజేసి కఫకరములనుట నిర్వివాదాంశము.

మరియు 'పూర్వో వర్గస్సమాప్తః' అని చెప్పక 'సమాప్యతే' అనుటచేత ఈవర్గమున జేరినద్రవ్యము లనంతములుగ నుండుటంజేసి వానికన్నిటికిని పూర్తిగ గుణాదుల జెప్ప నలవికాదు కావున ప్రధానముగ కొన్నిద్రవ్యముల మాత్రము గ్రహించి వాని గుణాదులు ఎట్టకేలకు పూర్తికావింపబడినవియని యాచార్యులయాశయము. ఇత్తెరంగుననే "షష్ఠో వర్గస్సమాప్యతే" ఇది మున్నగుస్థలములయందును అర్థవిశేషము నెరుంగునది.

శూకధాన్యవర్గము సమాప్తము.

---

(౨) శమీధాన్యవర్గము, అందు పెసలగుణములు.

అథ శమీధాన్యవర్గః.—

మూ. కషాయమధురో రూక్షః శీతః పాకే కటుర్లఘుః,
విశదః శ్లేష్మపిత్తఘ్నః (శ్లేష్మపిత్తప్రశమనః)
ముద్గస్సూప్యోత్తమో మతః. ౨౩

వ్యా. పెసలు కషాయమధురరసంబులును, రూక్షశీతగుణంబులును, కటువిపాకంబును, లఘువిశదగుణంబులును కల్గినవి. కఫపిత్తములను హరించును. ఇయ్యది సూపయోగ్యమైన శమీధాన్యములలో మిగుల శ్రేష్ఠమైనది.

(ఇయ్యది కషాయరూక్షత్వాది గుణములు కల్గియుండుటంజేసి కొంచెముగ వాతమును ప్రకోపింపజేయును. కావుననే వాగ్భటాచార్యులు "వరోఽత్ర ముద్గోఽల్పచలః" అని చెప్పిరి. 'అల్పచలః' అనగ అల్పముగ వాతకరమని యర్థము. సుశ్రుతమునను "నాత్యర్థవాతలః" అని చెప్పబడినది.) శమీధాన్యములలో నుత్తమం బగుటచే పెసలు తొలుత జెప్పబడినది.

## ఉద్దులగుణము.

మూ. వృష్యః పరం వాతహరం స్నిగ్ధోష్ణమధురో గురుః,
బల్యో బహుమలః పుంస్త్వం మాషః శీఘ్రం దదాతి చ. ౨౪

వ్యా. ఉద్దులు మిక్కిలి వృష్యము, వాతమును పూర్తిగ హరించును. స్నిగ్ధ-ఉష్ణ-గురుత్వగుణంబులును మధురరసంబును కల్గినది. బలకరము. మలమును అధికముగ జేయును. శుక్రమును అతిశీఘ్రముగ కల్గించును.

ఇచ్చట స్నిగ్ధ-మధురత్వాదియోగముచేతనే మాషములు వాతహారములని తెలియుచున్నను మరల 'వాతహరః' అని చెప్పుటచేత విశేషముగ వాతహారమని యర్థము. ఇట్టి స్థలములయందెల్ల నీవిధముగనే యర్థవిశేషము నెరుంగునది. "పుంస్త్వం శీఘ్రం దదాతి" అనుటచేత శుక్రమును స్రవింపజేసినను మరల శీఘ్రముగ నుత్పత్తిజేయునని యర్థము. వృష్యమనగ—"శుక్రస్రుతికరం కించిత్ కించిత్ శుక్రవివర్ధనం, స్రుతివృద్ధికరం కిఞ్చిత్ త్రివిధం వృష్యముచ్యతే" అను వచనాంతరముచేత శుక్రమును స్రవింపజేయునదియు, శుక్రమును వృద్ధినొందించునదియు, శుక్రమును స్రవింపజేసి మరల వృద్ధినొందించునదియు వృష్యమని తెలిసెడి. ఇచ్చట "వృష్యః, పుంస్త్వం శీఘ్రం దదాతి" అని చెప్పుటచేత మాషములకు పైజెప్పిన త్రివిధవృష్యత్వము పూర్తిగ కలదని యెరుంగునది. ఈవిషయమునే వాగ్భటాచార్యులు—'శుక్రవృద్ధివిరేకకృత్' అని చెప్పిరి. శింబీధాన్యమన పెసలు ఉద్దులు మున్నగు కాయధాన్యములని యెరుంగునది. శమీధాన్యము శింబాధాన్యము అనియు చెప్పబడును.

## అలచందులగుణము.

మూ. రాజమాషః సరో రుచ్యః కఫశుక్రామ్లపిత్తకృత్,
తత్స్వాదుర్వాతలో రూక్షః కషాయో విశదో గురుః. ౨౫
(రూక్షశ్చైవ కషాయశ్చ వాతలః శ్లేష్మపిత్తహా,
విష్టంభీ చాప్యవృష్యశ్చ రాజమాషః ప్రకీర్తితః.)

వ్యా. అలచందులురసము (నీటిలో నుంచబడిన తైలబిందువువలె శరీరమున వ్యాపించు స్వభావముకలది) రుచికరమైనది. కఫమును శుక్రమును అమ్లపిత్తమును కల్గించును. పైజెప్పిన మాషములవలె మధురమైనది. వాతమును వృద్ధిజేయును, రూక్షగుణము కల్గినది. కషాయరసమును అనురసముగను విశదగురుగుణములను కల్గియుండును.

ఇయ్యది ఉత్పత్తికారణమైన జలగుణము అధికముగ కల్గియుండుటచే వ్యాపించు స్వభావము కల్గినది యని యెరుగునది. "తత్స్వాదుః" అనుచోట "తయోః (రస

పాకయోః) స్వాదుః" అని విగ్రహమును చేసి రసవిపాకముల రెంటియందును మధురమని కొందరుచెప్పెదరు. ఈయర్థము నేసుశ్రుతాచార్యుడు ఇట్లు ఇచ్చెను.—"కషాయబావాన పురీష భేదోన మూత్రలోసైవ కఫస్య కర్తా, స్వాదుర్విపాకే మధురోఽలసాన్ద్రః సంతర్పణః స్తన్యరుచిప్రదశ్చా" అలచందులు కషాయరసము కల్గియుండుటచే మలమూత్రములను బంధించును. కఫమును వృద్ధిజేయును. విపాకమన మధురము. తృప్తినొందించును స్తన్యము (చనుబాల)ను కల్గించును. అని యర్థము. "అలసాన్ద్ర" అనగా రాజమాష పర్యాయపదము. దీని తద్భవమే అలచందులు అని తెనుగున వ్యవహరింపబడును.

### ఉలవలగుణము.

మూ. ఉష్ణాః కషాయాః పాకేఽమ్లాః కఫశుక్రానిలాపహాః,
కులత్థా గ్రాహిణః కాసహిక్కాశ్వాసార్శసాం హితాః. ౨౬

వ్యా. ఉలవలు కషాయరసంబును అమ్లవిపాకంబును ఉష్ణగుణంబును కల్గియుండును. కఫవాతములను శుక్రమును హరించును. మలమూత్రముల బంధించును కాసశ్వాసములును ఎక్కిళ్లును అర్శోరోగంబును కలవారికి మిక్కిలి హితకరము.

ఉలవలు తెలుపు నలుపు పసుపు చిత్రవర్ణము కల్గియుండుటచే నాల్గువిధము సుండును. మఱియు పల్లెలోపుట్టునవి గ్రామ్యములనియు అడవిలోపుట్టునవి వన్యములనియు రెండు భేదములు కల్గియుండును. ఈ భేదము ననుసరించియే "వన్యః కులత్థస్తద్వచ్చ విశేషాన్నేత్రరోగనుత్" అని తంత్రాంతరమున చెప్పబడినది.

### అడవిపెసలగుణము.

మూ. మధురా మధురాః పాకే గ్రాహిణో రూక్షశీతలాః,
మకుష్ఠకాః ప్రశస్యన్తే రక్తపిత్తజ్వరాదిషు. ౨

వ్యా. అడవిపెసలు రసవిపాకములచే మధురములు మలాదుల బంధించును. రూక్ష శీతగుణములు కల్గియుండును. రక్తపిత్తము జ్వరము మున్నగువ్యాధులయందు మిక్కిలి ప్రశస్తములు.

(భావప్రకాశమునందు "మకుష్ఠో వనముద్గః స్యాత్ మకుష్టకముకుష్టకౌ" అని యుండుటచే మకుష్ఠకము, మకుష్ఠము, ముకుష్ఠకము అని పర్యాయపదములు కాన బడియెడు.)

### సెనగలు బటాణుల గుణములు.

మూ. చణకాశ్చ మసూరాశ్చ ఖండికాః సహరేణవః,
లఘవః శీతమధురాః సకషాయా విరూక్షణాః. ౨

పిత్తశ్లేష్మణి శస్యన్తే సూపేష్వాలేపనేషు చ,
తేషాం మసూరః సఙ్గ్రాహీ కలాయో వాతలః పరః. ౨౯

వ్యా. సెనగలు, మసూరములు (చిరుసెనగలు), ఖండికములు (మూడుదబ్బలు చేరియుండు బటాణులు), హరేణువులు (గుండ్రముగనుండు బటాణులు), ఇవి యన్నియు లఘుగుణంబును శీతవీర్యంబును మధురకషాయరసంబులును కల్గి రూక్షగుణములైయుండును. పిత్తకఫములయందు ప్రశస్తము. సూపముగను, ఆలేపముగను పిత్తకఫములయం దుపయోగింపదగును. వానిలో చిరుసెనగలు మలమును బంధించును. మూడు పుటములుగనుండు బటాణులు మిక్కిలి వాతమును వృద్ధినొందించును. (ఖండిక, హరేణు కలాయ, అనునవి బటాణులలో భేదములు. వీనిని లంకలని కొందరు చెప్పెదరు.)

## నువ్వుల గుణములు.

మూ. స్నిగ్ధోష్ణమధురస్తీక్ష్ణః కషాయః కటుకస్తిలః,
త్వచ్యః కేశ్యశ్చ బల్యశ్చ వాతఘ్నః కఫపిత్తకృత్. ౩౦

వ్యా. నువ్వులు స్నిగ్ధ-ఉష్ణ-తీక్ష్ణగుణంబులును, మధుర-కషాయ-తిక్తరసంబులును కల్గియుండును చర్మమునకును తలవెండ్రుకలకును హితకరములు. బలమును కల్గించును. వాతమును హరించును. కఫపిత్తముల హరించును.

తంత్రాంతరమున—"ఈషత్కషాయో మధురస్సతిక్తః సంగ్రాహకః పిత్తకరస్తథోష్ణః, తిలో విపాకే మధురో బలిష్ఠః స్నిగ్ధో వ్రణాలేపన ఏవ పథ్యః" అని చెప్పబడినది. తదనుసారముగ నిచ్చట నువ్వులు రసవిపాకములచే మధురంబును, కషాయతిక్తములను రసములుగ కల్గియు, వ్రణములయం దాలేపనమునకే పథ్యముగను ఉండుననియు చెప్పదగు.

మరియు తంత్రాంతరమున "మాధుర్యాచ్చ తథైవోష్ణ్యాత్ స్నేహాచ్చానిలనాశనః, కషాయభావాన్మాధుర్యాత్ తిక్తత్వాచ్చాపి పిత్తకృత్, ఔష్ణ్యాత్కషాయభావాచ్చ తిక్తత్వాచ్చ కఫేహితః" అను వాక్యముచేత త్రిదోషహారముగ జెప్పబడినది. త్రిదోషహారత్వము నువ్వులకు వ్రణాలేపనమునందు మాత్రము కలదని పై వాక్యమునకు అర్థముచెప్పుట సమంజసము. తినుటకు మాత్రము కఫపిత్తకరమగుటచే హితముకానేరదు. ఈయభిప్రాయముచేతనే సుశ్రుతమున "వ్రణలేప ఏవ పథ్యః" అని చెప్పబడినది. వాగ్భటాచార్యుడును "మేధాగ్నికఫపిత్తకృత్" అని చెప్పెను.

మరియు నువ్వులు నలుపు, తెలుపు, ఎరుపు అను వర్ణభేదములచే మూడువిధములుగ నుండును. అందు నల్లనువ్వులు చాల ప్రశస్తము. ఈవిషయమును "తిలేషు

సర్వేష్వసితః ప్రధానః, మధ్యస్సితః, హీనతరా స్తతోఽన్యే" అని సుశ్రుతులును; కృష్ణః ప్రశ స్తస్తమను శుక్లస్తపును చారుణః" అని సంగ్రహమున వాగ్భటులును నుడివిరి. నల్లనువ్వు లుత్తమంబులును, తెల్లనివి మధ్యమంబులును, ఎఱ్ఱనివి అధమంబులును నగునని యర్థము. ఆమూడిటిలో ప్రధానము లగుటంజేసి నల్లనువ్వుల నుద్దేశించి యిచ్చట గుణములు చెప్పబడినవి యని యెఱుంగునది.

## శింబీధాన్యసామాన్యగుణము.

మూ. గుర్వ్యోఽథ మధురాఽశీతాః బలఘ్న్యో రూక్షణాత్మికాః,
సస్నేహాః బలిభిర్భోజ్యాః వివిధాశ్శిమ్బిజాతయః 31
(శిమ్బీ రూక్షా కషాయా చ కోష్ఠే వాతప్రకోపనీ,
న చక్షుష్యా న వృష్యా చ విష్టభ్య చ విపచ్యతే.) 32

వ్యా. శింబీధాన్యజాతులన్నియుం మధురంబులును, గురులఘుగుణంబులును, శరీరమునందలి బలమును హరించునవియుం, శరీరమును రూక్షముగ జేయునవియుం, స్నిగ్ధంబులును నగును. వీనిని మిక్కిలి బలవంతులై జాఠరాగ్నిని బలముగనుండువారలే భుజింపదగును (గాని శరీరాగ్నిబలహీనులు భుజింపదగదు).

(శింబిధాన్యము రూక్షమై కషాయరసముకల్గినది. కోష్ఠములోనివాతమును ప్రకోపింపజేయును. కన్నులకు హితముకానేరదు. శుక్రమునకు హితముకాదు. కడుపులో గడబిడచేసి పిమ్మట పక్వమగును).

ఇది శింబీధాన్యసామాన్యగుణము. ఇచ్చట "శింబీ రూక్షా" అను శ్లోకము ప్రాచీనముద్రిత ప్రతులయందు కానరాదు. ఆధునికముద్రితములలోమాత్ర మున్నది. ఇయ్యది పైశ్లోకములో గతార్థమగుటంజేసి ప్రక్షిప్తమని తోచెడి. ఏది యెట్లున్నను విషయము ప్రధానముకావున నియ్యెడ వ్యాఖ్యాతము.

## కందులు మున్నగువానిగుణము.

మూ. ఆఢకీ కఫపిత్తఘ్నీ వాతలా కఫవాతనుత్,
అవల్గుజః సైడగజో నిష్పావాః వాతపిత్తలాః. 33

వ్యా. కందులు కఫపిత్తములను హరించును. వాతమును వృద్ధిజేయును. భావంచి విత్తులును, తగిరిసగింజలును కఫవాతముల హరించును. అనుములు వాతపిత్తములను వృద్ధి నొందించును.

మరియుం వాగ్భటాచార్యులు—“నిష్పావో వాతపిత్తాస్రస్తన్యమూత్రకరో గురుః, సరో విదాహీ దృక్శుక్రకఫశోఫవిషాపహః” అని చెప్పిరి. అనుములు వాతపిత్తములను రక్తమును స్తన్యమును మూత్రమును వృద్ధిచేయుననియుం; నేత్రములను శుక్రమును కఫమును శోఫమును విషమును హరించుననియుం నర్థము.

కాకాణ్డాదిగుణములు.

మూ. కాకాణ్డో మాత్మగుప్తానాం మాషవత్ఫల మాదిశేత్,
ద్వితీయోఽయం శమీధాన్యవర్గః ప్రోక్తో మహర్షిణా. ౩౪

ఇతి శమీధాన్యవర్గః.

---

వ్యా. కాకాణ్డము (సూకరశింబము), అగసివిత్తులు, తీటకసింద (దురదగొండి) విత్తనములు, ఈ మూడును మినుములకు జెప్పిన గుణాదుల గల్గియుండును. ఇత్తెరంగున శమీధాన్యవర్గ మనునది రెండవవర్గము మహర్షియగు నగ్నివేశునిచే చెప్పబడియె.

ఇచ్చట కాకాండమనునది నల్లని అనుములని కొందరు వ్యాఖ్యాతలు నుడివిరి. “శూకశిమ్బీసదృశశిఖిః శూకరశిమ్బీతి లోకే” అని శివదాసటిప్పణమున నున్నది. “కాకాణ్డః శూకరశిమ్బః” అని చక్రదత్తవ్యాఖ్యానమున నున్నది. దూలగొండివిత్తుల బోలిన ధాన్యవిశేషమని తోచెడిని. (మినుములు మున్నగువానిపై కవచమువలెనుండు పొట్టు, శమి, శింబ యనబడును. అట్టి పొట్టులోనుండు ధాన్యములు శమీ (శింబ) ధాన్యమనబడును )

శమీధాన్యవర్గము సమాప్తము.

---

ఆహారమునకు ముఖ్యమైన సూప్యవర్గమును (పప్పుగ నుపయోగింపదగిన శింబీధాన్యవర్గమును) జెప్పిన పిదప వ్యంజనములలో మాంసము ప్రధానము కావున మాంసవర్గ మిక్రింద వివరింపబడును.—

జంతువులలో ప్రసహములు.

అథ మాంసవర్గః.—

మూ. గోఖరాశ్వతరోష్ట్రాశ్వద్వీపిసింహర్క్షవానరాః,
వృకో వ్యాఘ్రః తరక్షుశ్చ బభ్రుమార్జారమూషికాః. ౩౫
లోపాకో జమ్బుకః శ్యేనో వాన్తాదశ్చాష (స) వాయసౌ,
శశఘ్నీ మధుహా భాసో గృధ్రోలూకకులిఙ్గకాః. ౩౬
ధూమికా కురరశ్చేతి ప్రసహా మృగపక్షిణః,

వ్యా. గోవు, గాడిదె, అశ్వతరము (కంచరగాడిదె, ఇది ఆడగుఱ్ఱమునకు గాడిదె వలన బుట్టిన సంకరజాతి), ఒంటె, గుఱ్ఱము, ద్వీపి (మచ్చలపులి, దీనిని చిరుత, ఇబ్బంది యందురు). సింహము, ఎలుగ్గొడ్డు, కోతి, తోడేలు, వ్యాఘ్రము (చారల పెద్దపులి), సివంగి, ముంగిస, పిల్లి, ఎలుక, (కొక్కు), లోపాక (వరడునక్క), నక్క, డేగ, వాంతాదము (కుక్క), పాలపిట్ట, కాకి, శశఘ్ని, (కుందేటిని చంపునట్టి పక్షివిశేషము) మధుహ (తేనెను చెరచు పక్షివిశేషము), భాసపక్షి, గద్ద, గుడ్లగూబ, కులింగము (నల్లని ఊరబిచ్చుక), ధూమిక, కురరము (పెన్నెడపులుగు, దీనినే 'కన్నెలేడి' అనియుం నందురు), అను నీమృగంబులును పక్షులును ప్రసహములని చెప్పబడును. ('ప్రసహ్య ఆహృత్య భక్షయన్తీతి—ప్రసహాః' అను వ్యుత్పత్తిచేత ఆహారపదార్థమును బలవంతముగ లాగికొని తినునవియని యన్వర్థసంజ్ఞ.)

ఈ యర్థము "ప్రసహ్య భక్షయన్త్యేతే ప్రసహా ఇతి కీర్తితాః" "ప్రసహాః కీర్తితాహ్యేతే ప్రసహ్యాచ్ఛిద్య భక్షణాత్" ఇత్యాది వచనాంతరములచే తెలిసెడి.

భూమిశయములు.

మూ. శ్వేతశ్శ్యామశ్చిత్రపృష్ఠః కాకలః కాకులీమృగః. 32
కూర్చికా చిల్లటో భేకో గోధా శల్లకగణ్డకౌ,
కదలీ నకులశ్శ్వావిత్ ఇతి భూమిశయాః స్మృతాః. 3౮

వ్యా. కాకులీ మృగమనునది శ్వేతము (తెల్లనిది), శ్యామము (నల్లనిది), చిత్రపృష్ఠము (చిత్రవర్ణమైన వీపుకల్గినది), కాకలము నని నాల్గువిధములు. అవియును; కూర్చిక, చిల్లటము, భేకము, (కప్ప), గోధ (ఉడుము), శల్లకము (తెల్లని యేదుపంది) గాండకము (ఉడుములోభేదము), కదలి (పులివంటి యాకారముకల పిల్లి), నకులము (ముంగిసలో నొకవిధమైనది), శ్వావిత్ (నల్లని యేదుపంది), ఇవియన్నియుం (భూమిలో నుండు బొరియల నివసించుటంజేసి) భూమిశయము లని చెప్పబడును. (ఇచ్చట జంతు విశేషముల నామ రూపములు తెలియుట కరుదుగనున్నది. వ్యాఖ్యాతలును వివరింపరైరి).

అనూపమృగములు.

మూ. సృమరశ్చమరః ఖడ్గో మహిషో గవయో గజః,
న్యఙ్కుర్వారాహశ్చానూపాః మృగాస్సర్వే రురుస్తథా. 3౯

వ్యా. సృమరము (అడవిపంది, పెద్దసవరపు చమరీమృగము), చమరము (చమరీమృగము) ఖడ్గమృగము (గండంగి), మహిషము (ఎనుబోతు), గవయము (గోవుతో

సమానాకారమైనది, గురుబోతు), గజము (ఏనుగు), న్యంకు (జింకబోతు), వరాహము (పంది), రురువు (నల్లచారలదుప్పి, దీనికి కొమ్ములు అనేకశాఖలుగనుండును). ఈమృగములన్నియు ఆనూపములు (నదులు మున్నగు జలాశయముల తీరమున సంచరించునవి యానూపములు).

వాగ్భటాచార్యులు—“వరాహమహిషన్యఙ్కు రురురోహితవారణాః సృమరశ్చమరః ఖడ్గో గవయశ్చ మహామృగాః” అని చెప్పిరి. వీరిమతమున పైజెప్పిన జంతువులు మహామృగములని తెలిసెడి.

వారిశయము (జలజంతువు)లు

మూ. కూర్మః కర్కటకో మత్స్యః శింశుమార స్తిమింగిలః,
శుక్తిశఙ్ఖోద్రకుమ్భీరచులుకీమకరాదయః. ౮౦
ఇతి వారిశయాః ప్రోక్తాః

వ్యా. తాబేలు, ఎండ్రకాయ, చేప, శింశుమారము (శిశువులచంపు మొసలి), తిమింగిలము (తిమియను మత్స్యము చాల గొప్పది, దానిని మ్రింగునట్టి పెద్దచేప), శుక్తి (ముత్యపుచిప్పజంతువు), శంఖము, ఉద్రము (నీటిపిల్లి), కుంభీరము (ఏనుగను లాగికొనుపోవు బలముకల జలజంతువు), చులుకి (ఉలసమీను), మకరము (చొరమీను, ఇదియే కారుమొసలి) ఇవి మున్నగుజంతువులు వారిశయములు. (జలముననే వసించు జంతువులు). అనబడును. ఇచ్చట ఆదిశబ్దముచేత ఇతరములగు జలజంతువులన్నియు గ్రహింపబడును. వీనినన్నిటిని వాగ్భటాచార్యులు మత్స్యజాతిలో జేర్చి పరిగణించిరి.

వారిచరములు.

మూ. వక్ష్యన్తే వారిచారిణః,
హంసః క్రౌఞ్చో బలాకా చ బకః కారణ్డవః ప్లవః. ౮౧
శరారిః పుష్కరాహ్వశ్చ కేశరీ మానతుణ్డకః,
మృణాళకణ్ఠో మద్గుశ్చ కాదమ్బః కాకతుణ్డకః. ౮౨
ఉత్క్రోశః పుణ్డరీకాక్షో మేఘరావోఽమ్బుకుక్కుటః (టీ)
ఆరా నన్దీముఖో (ఖీ) వాటీ స్సుముఖా స్సహచారిణః. ౮౩
రోహిణీ కళికానీ చ సారసో రక్తశీర్షకః,
చక్రవాక స్తథాన్యే చ ఖగాః సన్త్వమ్బుచారిణః. ౮౪

వ్యా. హంసము (రాజహంసము), క్రౌంచము (కొంగ) బలాక (తెల్లకొక్కెర), బకము (వక్కవకొంగ) కారండవము (కన్నెలేడు అను పక్షివిశేషము, ఇది నీరుకోడిలో చేరినది). ప్లవము (నీళ్లపై తేలుచుండు నీరుకోడి), శరారి (ఆడెలు), పుష్కరమను పేరుగల జలపక్షి, మానతుండకము, మృణాళకంఠము, (తామరకాడవలె సన్ననిమెడ గల్గిన పక్షి), మద్గువు (నల్లని నీరుకోడి) కాదంబము (ముక్కును కాళ్లును రెక్కలును ధూమ్రవర్ణమైన హంసవిశేషము), కాకతుండకము (కాకిముక్కువంటి ముక్కుగల పక్షి నీరుకాకి), ఉత్క్రోశము (పెన్నెడపులుగు), పుండరీకాక్షము, మేఘరావము (మేఘ గర్జనమువలె ధ్వనిచేయుపక్షి), అంబు కుక్కుటము (తెల్లనినీటికోడి), ఆర అను పక్షి విశేషము, నందీముఖి, వాటి, సుముఖ, సహచారి, రోహిణి, కాళికాని, సారసము (బెగ్గురుపక్షి), రక్తశీర్షకము (ఎఱ్ఱనితలగల సారసపక్షి), చక్రవాకము (జక్కవపిట్ట), ఈ చెప్పబడిన పక్షులును, వీనివలెనుండు నితరపక్షులును నీటిపై సంచరించుటంజేసి అంబుచరములు అని చెప్పబడును.

## జాంగల మృగములు.

మూ. పృషతశ్శరభో రామః శ్వదంష్ట్రా మృగమాతృకాః,
శశోరణౌ కురఙ్గశ్చ గోకర్ణః కోట్టకారకః. ౪౫
చారుష్కో హరిణైణౌ చ శమ్బరః కాలపుచ్ఛకః,
ఋశ్యశ్చ వరపోతశ్చ విజ్ఞేయాః జాఙ్గలా మృగాః. ౪౬

వ్యా. పృషతము (చిత్రవర్ణముకల యిఱ్ఱి), శరభము, రామము (పెద్దదుప్పి, ఇది హిమాలయమున నుండును). శ్వదంష్ట్ర (నాల్గు వాడికోరలుకల మృగవిశేషము, ఇది కార్తికపురమున ప్రసిద్ధము), మృగమాతృక (గొప్ప కడుపుకల్గి స్వల్పమైన మృగ విశేషము), కుందేలు, ఉరణము (కొండగొఱ్ఱె), కురంగము (ఇఱ్ఱిజాతిలో చేరిన మృగ విశేషము), గోకర్ణము (కణితి ఇది ఆవుమూతివంటి మూతికల్గి హరిణజాతిలో చేరినది), కోటకారకము (ఇది జింకజాతిలో చేరినది), చారుష్కము, హరిణము (ఎఱ్ఱనిజింక), ఏణము (నల్లనై పెద్దకండ్లుకల జింక), శంబరము (స్వల్పాకారమై యెఱ్ఱగనుండుజింక), కాలపుచ్ఛకము (నల్లని తోకకల జింక), ఋశ్యము (మనుబోతు), వరపోతము, ఇవి యన్నియు జాంగలమృగములు. (మెట్టభూముల సంచరించుమృగములు).

ఇచ్చట చారుష్కాది జంతువులు హరిణభేదములలో జేరిన మృగములు. శశమును (కుందేటిని) సుశ్రుతాచార్యులు బిలేశయములలో జేర్చిరి. గుణాంతరమును జెప్పుటకై యట్లు చేర్చిరి. మరియు శరభమనునది వీపున నాల్గుకాళ్లను గొప్పకొమ్ములును, గొప్ప

యాకారమును కల్గి యొంటెవలె నుండు మహామృగమనియు, ఇయ్యది కాశ్మీరదేశమున నుండుననియు, చక్రదత్తవ్యాఖ్యయందు చెప్పబడినది. మహాభారతమున "అష్టపాదోర్ధ్వ నయనః శరభో వనగోచరః" అని యున్నది. ఈ వచనముచే శరభము ఎనిమిదికాళ్ల జంతువని తెలిసెడి. (అష్టపాదమనియే ప్రసిద్ధము).

లావాది విష్కిరగణము.

మూ. లావో వార్తీవకశ్చైవ వాతీకః సకపిఞ్జలః,
చకోరశ్చోపచక్రశ్చ కుక్కుభో రక్తవర్ణకః. ౫౭
లావాద్యా విష్కిరాస్త్వేతే; వక్ష్యన్తే వర్తకాదయః,

వ్యా. లావుకపిట్ట, వార్తీవకము (నేల నెమలిపిట్ట), వాతీకము, కపింజలము (ఎఱ్ఱనిరంగుగల తీతువుపిట్ట), చకోరము (వెన్నెలపులుగు), ఉపచక్రకము, (ఇది చకోర భేదము), కుక్కుభము, (గంపపులుగు, బెళగువ్వ) మరియు నివి రక్తవర్ణమైయుండును. శారుకోడియనియు అడవికోడియనియు, దీని కొందరు చెప్పెదరు. ఇచ్చట చెప్పబడిన లావుకము మున్నగునవి విష్కిరములని చెప్పబడును. క్రింద జెప్పబడు వర్తకాదిగణము నందలి పక్షిజాతియు విష్కిరములు, (విష్కిరములన కాళ్లచే భూమిని గీరి పురుగులు మున్నగువానిని యేరి తినునవియని యర్థము).

వర్తకాది విష్కిరగణము.

మూ. వర్తకో వర్తికా చైవ బర్హీ కుకుభకుక్కుటౌ. ౫౮
కఙ్కశారపదేన్ద్రాభ గోనర్దగిరివర్తకాః,
క్రకరో వృకరశ్చైవ వారటాశ్చేతి విష్కిరాః. ౫౯

వ్యా. వెలిచెపిట్ట, మీనవల్లంకిపిట్ట, నెమలి, కుక్కుభము (కోడిలో భేదము), కోడి, కంకము (గద్ద) శారదేంద్రాభము (మల్లంకమను రాబులుగు), గోనర్దము (కంకజాతిలో నొకవిధమైనపక్షి), క్రకరము, వృకరము, వారటము, అను నివియును విష్కిరములు. (లావాదులును వర్తకాదులును విష్కిరములైనను గుణభేదమును చెప్పుటకై రెండుగణములుగ మూలకారులు విభజించిరి).

ప్రతుదపక్షిగణము.

మూ. శతపత్రో భృఙ్గరాజః కోయష్టి ర్జీవజీవకః,
కైరాతః కోకిలోఽత్యూహః గోపాపుత్రః ప్రియాత్మజః. ౬౦
లట్వా లటూషకో బభ్రుః వటహా డిణ్డిమానకః,

జటీదున్దుభి పాక్కార (ఘూంకోర) లోహపృష్ఠకులింగకాః. ౫
కపోతశుకసారఙ్గశ్చిరిటీ కంకుయష్టికాః,
శారికాః కలవిఙ్కాశ్చ చటకోఽఙ్గారచూడకః. ౫
పారావతః పానవిక (పాండవిక) ఇత్యుక్తాః ప్రతుదా ద్విజాః,

వ్యా. వడ్లవల్లంకిపిట్ట, పసులపోలుగాడు అను భారద్వాజము, కోయష్టికమ (చీకుకొంగ), జీవజీవము (వన్నెపులుగు), కైరాతము, కోయిల, అత్యూహము (కూకుడ గుడ్డంగి, భరతపిట్ట-దీనికి దాత్యూహమని నామాంతరము కలదు), గోపాపుత్రమను పక్షి విశేషము, ప్రియాత్మజము, లట్వ (ఊరపిచ్చుక) లటూషకము, బభ్రువు (పింగ పర్ణముకలపక్షి), వటహ, డిండిమానకము (డిండిమమువలె ధ్వనిచేయుపక్షి) జటి దుందుభిపారము, లోహపృష్ఠము (రాబులుగు), కుళింగము (అడవిపిచ్చుక), కపోతమ (పావురము, గువ్వ), చిలుక, సారంగము (చాతకభేదము), చిరిటి, కంకు, యష్టికమ శారిక (గోరువంకపక్షి), కలవింకము (అడవిపిచ్చుక), చటకము (చిన్నపిచ్చుక, జిట్ట) అంగారచూడక (ఎఱ్ఱని కొండికల్గినది), పారావతము (అడవిపావురము), పానవికము అను నీపక్షిజాతులన్నియుం ప్రతుదము లనబడును. (ముక్కుతో బొడిచి యాహారముం తినునట్టి పక్షిజాతులు ప్రతుదములు).

ఇచ్చట మృగములు పక్షులు మున్నగునవి మూలానుసారముగ చెప్పబడినవి. వీని దేశభాషలో పరివర్తనముచేయుటకు సుశ్రుతాదివ్యాఖ్యానాంతరములను కోశములం ప్రమాణముగజేసి సాధ్యమైనవట్టుకు వివరింపబడినవి. అప్రసిద్ధములైన కొన్నిటికి భాషా తరమున జెప్ప వలనుపడక యథాశ్రుతనామములే చూపబడినవి. వానిని ఆయాదేశము యందు వారి వాడుకనుబట్టి అరయదగును వ్యాఖ్యాతలును నామాంతరవివరణముని వీలుపడక యిట్లు చెప్పిరి:—"యాన్యత్రానుక్తాని అప్రసిద్ధాని తాని తద్విద్భ్యోపదేశా-రిభ్యః జ్ఞేయాని"

## ప్రసహాదిసంజ్ఞానిర్వచనము.

మూ. ప్రసహ్య భక్షయన్తీతి ప్రసహాస్తేన సంజ్ఞితాః. ౫
భూశయా బిలవాసిత్వాత్, ఆనూపానూపసంశ్రయాత్,
జలే నివాసాజ్జలజాః, జలేచర్యాజ్జలేచరాః, ౫
స్థలజాః జాఙ్గలాః ప్రోక్తాః మృగా జాఙ్గలచారిణః,
వికీర్య విష్కిరాశ్చేతి, ప్రతుద్య ప్రతుదాః స్మృతాః. ౫
యోనిరష్టవిధా త్వేషాం మాంసానాం పరికీర్తితా,

వ్యా. ఆహారపదార్థమును బలవంతముగ లాగికొని తినుటంజేసి యట్టిజంతువులు ప్రసహము లనబడును. పుడమియందలి బొరియలలో నుండునవిగాన ధూమిక మున్నగునవి భూశయము లనదగును. అనూపమన జలము విశేషముగ నుండునదులు మున్నగువాని సమీపప్రదేశము. అట్టి జలప్రాంతమునందుండు స్వభావముకల చమరాదిజంతువులు ఆనూపము లనబడును. ఉదకమునసే నివసించుటంజేసి మత్స్యాదులు జలజములనబడును. ఉదకముపై సంచరించుటంజేసి హంసాదులు జలచరము లనదగును. నీరులేని మెట్ట ప్రదేశము జాంగలము. అట్టిస్థలములబుట్టి యచ్చటనే సంచరించు పొడల యిఱ్ఱి మున్నగుమృగములు జాంగలము లనబడును. కాళ్లచే నేలపై గీచి యెరను గమనించి తినునట్టికోడి మున్నగుపక్షులు విష్కిరము లనబడును. ఆహారపదార్థములను ముక్కుతో బొడిచి తినునట్టిపక్షులు ప్రతుదము లనదగును.

ఇత్తెరంగున పైజెప్పబడిన యెనిమిదివిధములైనజంతువులు మాంసమునకు ప్రధాన కారణములగును. మరియు ఏనుగు మున్నగునవియు స్థలజములైనను జలప్రాంతముల విశేషముగ సంచరించుస్వభావము కల్గినవికావున జాంగలములు కానేరవు. ఈయర్థమునకే 'జాంగలచారిణః' అని చెప్పబడినది. మెరకభూముల బుట్టి మెరకస్థలములయందే సంచరించునవి జాంగలములని యర్థము. ("అనూపాహానూపసంశ్రయాత్" అనుచోట "అనూపాః, అనూపసంశ్రయాత్" అని విభాగము. ఆర్షముకావున అసిద్ధశాస్త్రమునకు అనిత్యత్వము నంగీకరించి సవర్ణదీర్ఘసంధియని చెప్పవలెను. ఇది యగతికగతి కల్పనము).

### ప్రసహాదిజంతువులమాంసగుణము.

మూ. ప్రసహా భూశయానూపవారిజా వారిచారిణః. ౫౬
గురూష్ణస్నిగ్ధమధురా బలోపచయవర్ధనాః,
వృష్యాః పరం వాతహరాః కఫపిత్తాభివర్ధినః. ౫౭
హితాః వ్యాయామనిత్యానాం నరా దీప్తాగ్నయశ్చ యే,

వ్యా. పైజెప్పిన జంతుగణములలో ప్రసహములు, భూశయములు, ఆనూపములు, జలజములు, వారిచరములు అనుజంతువులు గురు-ఉష్ణ-స్నిగ్ధగుణంబులును మధురరసంబును కల్గినవి. బలమును శరీరమున బలుపును వృద్ధినొందించును. సంభోగేచ్ఛ నధికముగజేయును. వాతమును హరించును. కఫపిత్తముల వృద్ధినందించును. ఈజంతువుల మాంసము ఎల్లప్పుడు వ్యాయామమును చేయువారికిని, జాఠరాగ్ని ప్రబలముగ దీపించువారికిని మిక్కిలి హితకరము.

### మాంసమునుతిను ప్రసహముల మాంసోపయోగము.

మూ. ప్రసహానాం విశేషేణ మాంసం మాంసాశినాం భిషక్. ౫౮
జీర్ణార్శోగ్రహణీదోషశోషార్తానాం ప్రయోజయేత్,

వ్యా. ప్రసహములలో మాంసమును తినునట్టి పెద్దపులి మున్నగుజంతువుల మాంసమును చాలకాలమునుండి యనుసరించి ప్రాపడిన యర్శోరోగము (మూల వ్యాధి) కలవారికిని, గ్రహణీరోగము కలవారికిని రసాదిధాతువులు క్షీణించినవారికిని వైద్యుడు విశేషముగ నుపయోగింపవలెను.

(ప్రసహములలో పులి మున్నగునవి మాంసమును తినుజంతువులు. గోజాతి మున్నగునవి మాంసమును తినవు. అందు మాంసమును తిను ప్రసహములమాంసమునకు విశేషవిధిగ నుపయోగము చెప్పబడినది).

### లావాదివిష్కిర-ప్రతుద-జాంగలమాంసగుణములు.

మూ. లావాద్యో విష్కిరో వర్గః ప్రతుదా జాఙ్గలా మృగాః. ౫౯
లఘవశ్శీతమధురాః సకషాయా హితా నృణాం,
పిత్తోత్తరే వాతమధ్యే సన్నిపాతే కఫానుగే. ౬౦

వ్యా. లావాదిగణములో జేరిన విష్కిరవర్గంబును, ప్రతుదంబులును, జాంగల మృగంబులును, (వీనిమాంసము) లఘుగుణంబును శీతవీర్యంబును మధురరసంబును, కషాయారసంబును కల్గియుండును. ఈమాంసము పిత్త మున్కటమై వాతము మధ్యమముగను కఫముతో కూడియుం నుండు సన్నిపాతమున మనుజుల కుపయోగించిన మిక్కిలి హితముగ నుండును.

### వర్తకాదివిష్కిరమాంసగుణము.

మూ. విష్కిరా వర్తకాద్యాస్తు ప్రసహాఽల్పాన్తరా గుణైః,

వ్యా. వర్తకాదిగణములో విష్కిరంబులును ప్రసహములకు కొంచెం మించుగ సమానగుణములై యుండును. (ఇట్టి గుణభేదమును చెప్పుటకై విష్కిరములు లావాది వర్తకాదియని రెండుగణములుగ విభజింపబడినవియని యెరుంగునది).

### మేకలమాంసగుణము.

మూ. నాతిశీతగురుస్నిగ్ధం మాంసమాజమదోషలమ్. ౬౧
శరీరధాతుసామాన్యాత్ అనభిష్యన్ది బృంహణమ్,

వ్యా. మేకలమాంసము స్వల్పముగ శీతంబును గురుత్వంబును కల్గి స్నిగ్ధముగ ండును. వాతాదిదోషములను స్వల్పముగ జేయును. ఇయ్యది మనుజులశరీరమునందలి ాంసధాతువునకు సమానములైనగుణముల గల్గియుండుటంజేసి కఫమును వృద్ధిజేయదు. గ్రోతస్సుల ద్రవమును పుట్టింపదు. శరీరమునకు బలమును పుష్టిని కల్గించును.

ఇచ్చట మేకమాంసము నాతి శీత గురు స్నిగ్ధగుణమని చెప్పి, "శరీరధాతుసామా న్యాత్" అని చెప్పుటవలన మనుజులమాంసంబును అట్టి నాతిశీతాదిగుణములు కల్గి యుండునని యూహింపదగియున్నది. దీనిచేత తంత్రకారుడు మనుజమాంసమునకును ుణముల జెప్పకయే చెప్పినట్లగును 'వృద్ధిస్సమానై స్సర్వేషాం' అను న్యాయప్రకారము మానగుణమైన మేకమాంసము మనుజులకు బృంహణమగును. (వృద్ధికరమని భావము). ట్టివృద్ధికి 'శరీరధాతుసామాన్యాత్' అని శరీరధాతుసామ్యము కారణముగ జెప్పబడినది. క్కిన మాంసవర్గము ధాతుసమానగుణముకాదు కావున మేకమాంసమువలె బృంహ ము కానోపదు. ఈయభిప్రాయమునే 'త్రిదోషమలనుత్ ధాతుసామాన్యా చ్ఛాగ ం లఘు" అని హారీతసంహితయందును చెప్పియున్నది. ఇయ్యది బృంహణమైనను ప్రభావముచే కఫమును వృద్ధినొందించదని 'అనభిష్యన్ది' అని చెప్పబడినది.

## గొఱియల మాంసగుణము.

సూ. మాంసం మధురశీతత్వాత్ గురుబృంహణమావికమ్.  ౬౨
యోనావజావికే మిశ్రగోచరత్వా దనిశ్చితే,

వ్యా. గొఱియలమాంసము మధురరసంబును, గుణవీర్యములచే శీతంబు నగును. ురుత్వము కల్గియుండును; కావున బృంహణమగును.

మరియు మేకలజాతియు గొఱ్ఱెలజాతియు మిశ్రగోచరములై యుండును నియమములేక జాంగలదేశమందును అనూపదేశమందును సంచరించుచుండును) ావున జాంగల-అనూపభేదముల నిర్ణయింప నలవికానేరదు. (దానంజేసి జాంగలాది భేదములలో జేర్చియుండలేదని భావము).

ఇచ్చట నీవివరణము నెరుంగునది.—మేకలును, గొఱియలును ఒకప్పుడు ాంగలప్రదేశమునను, మరియొకప్పుడు అనూపప్రదేశమునందును, వేరొకప్పుడు రెండు ప్రదేశములయందును వ్యవస్థ లేక సంచరించును; కావున మిశ్రగోచరములు. దానం జేసియే పైజెప్పిన ప్రసహాదిభేదములలో జేర్పలేదు. ఈవిషయమునే వాగ్భటాచార్యులు 'యోనిష్వజావీవ్యామిశ్రగోచరత్వాదనిశ్చితే" అని చెప్పిరి.

"యోనావజావికే మిశ్రగోచరత్వాదనిశ్చితే" అనుచోట "మిశ్రగోచరత్వాత్, అజావికే, యోనౌ అనిశ్చితే" అని యన్వయము. తిత్తిరిపక్షి విశేషభేదముచే నొక జాతి యానూపంబును, వేరొకటి జాంగలంబు నగును; కావున విష్కిరగణమున జెప్పినది సంగతము. అట్టి యవాంతరభేదములు అజావిజాతులలో లేవు; కావున గణమున జేర్ప వలనుపడవు.

మరియు గొఱియమాంసము మధురశీతమగుటవలన పిత్తమునుహరించును. కావున నే పిత్తాధికమైన శరత్కాలమున "ఉరభ్రశరభాః" ఇత్యాది వాక్యములచేత గొఱ్ఱె మాంసము విధింపబడినది. రక్తపిత్తనిదానమున గొఱ్ఱెమాంసము రక్తపిత్తమునకు కారణమని చెప్పినది ద్రవ్యాంతరముతో గూడినప్పుడు రక్తపిత్తకారణమగునని యర్థము. కావున విరుద్ధము కాదు. (ద్రవ్యాంతరముతో జేరనిది పిత్తహరమని ఫలితార్థము.) సుశ్రుతాచార్యుడును "బృంహణం మాంసమౌరభ్రం పిత్తశ్లేష్మాపహం గురు" అను వాక్యముచేత పిత్తహరమనియే చెప్పెను.

### కొన్నింటికి విశేషగుణకథనము.

మూ. సామాన్యేనోపదిష్టానాం మాంసానాం స్వగుణైః పృథక్. ౬౩
కేషాంచిద్గుణవైశేష్యాద్విశేష ఉపదేక్ష్యతే,

వ్యా. ఇంతదనుక ప్రసహాదిగుణముల నుద్దేశించి యాయాగణములకు వేరవేరుగ గుణములు సామాన్యముగ జెప్పబడినవి. అట్టిప్రసహాదిగణముల జేరిన కొన్ని జంతువులమాంసములు గుణవిశేషము గల్గియుండుటంజేసి అట్టి జంతువుల నుద్దేశించి విశేషగుణము లీక్రింద నుపదేశింపబడును.

### నెమలిమాంసగుణవిశేషము.

మూ. దర్శనశ్రోత్రమేధాగ్నివయోవర్ణస్వరాయుషామ్. ౬౪
బర్హీ హితతమో బల్యో వాతఘ్నో మాంసశుక్రలః,

వ్యా. నెమలిమాంసము దృష్టి, శ్రోత్రము(శ్రవణేంద్రియము), బుద్ధి, జఠరాగ్ని వయస్సు (యౌవనము), వర్ణము (శరీరకాంతి), కంఠస్వరము, ఆయుంవు, వీనికన్నిటికి మిక్కిలి మేలుచేయును. బలమును కల్గించును. వాతమును హరించును. శరీరమునందు మాంసమును శుక్రమును వృద్ధినొందించును.

మయూరము (నెమలి) వర్తకాదిగణమున జెప్పబడినది కావున వర్తకాదిగణమునకు జెప్పిన గురుస్నిగ్ధత్వాది గుణంబులును బలకరత్వాది గుణంబులును సిద్ధమగును ఐనను మరల చెప్పుటచేత అట్టిగుణములు ఆగణమునందలి తక్కినవానికన్న నధికము

నుండునని యెరుంగునది. ఇత్తెరంగుననే గణనిర్దిష్టగుణముల మరలచెప్పిన స్థలములయందెల్ల గుణోత్కర్షము నెరుంగునది.

హంసమాంసగుణము.

మూ. గురూష్ణస్నిగ్ధమధురాః స్వరవర్ణబలప్రదాః. ౬౫
బృంహణాశ్శుక్రలాశ్శోక్తాః హంసా మారుతనాశనాః,

వ్యా. హంసమాంసము గురు-ఉష్ణ-స్నిగ్ధగుణంబులును, మధురరసంబును కల్గినది. కంఠస్వరమును శరీరబలమును వర్ణమును కల్గించును. శరీరము బలియజేయును. శుక్రమును వృద్ధిజేయును. వాతమును హరించును.

కోడిమాంసగుణము.

మూ. స్నిగ్ధాశ్చోష్ణాశ్చ వృష్యాశ్చ
బృంహణా స్స్వరబోధనాః (స్వరవర్ధనాః). ౬౬
బల్యాః పరం వాతహరాః స్వేదనాశ్చరణాయుధాః,

వ్యా. కోడిమాంసము స్నిగ్ధ-ఉష్ణగుణములు కల్గినది. వృష్యము (శుక్రవృద్ధికరము), శరీరమును బలియజేయును. కంఠస్వరమును చక్కగజేయును. బలమును మిక్కుటముగ జేయును. వాతమును హరించును. శరీరముపై జెమట బుట్టించును.

"గ్రామ్యస్తు శ్లేష్మలోగురుః" అని వాగ్భటులు చెప్పిరి. గ్రామముల నుండు కోడి కఫమును వృద్ధిజేయునని విశేషము తెలిసెడి.

తిత్తిరిమాంసగుణము.

మూ. గురూష్ణమధురో నాతిధన్వానూపనిషేవణాత్. ౬౭
తిత్తిరిస్సంజయేచ్ఛీఘ్రం త్రీన్దోషాననిలోల్బణాన్.

వ్యా. తిత్తిరిపక్షి జాంగలానూపదేశముల రెండిటియందును సంచరించుటంజేసి గురు-ఉష్ణగుణంబులును మధురరసంబును కల్గియుండును. అట్టి సంచారముకల తిత్తిరిపక్షి వాతోల్బణమైన సన్నిపాతమును (మూడుదోషములను) అతిశీఘ్రముగ హరించును.

ఇచ్చట 'ధన్వానూపనిషేవణాత్' అని చెప్పుటవలన మరుస్థలమునందును అనూపప్రదేశమునను సంచరించు తిత్తిరిపక్షియే త్రిదోషముల హరించునని తెలిసెడి. ఇత్తెరంగుననే గోవులు మున్నగునవి ధన్వానూపసంచారమునంజేసి యిట్టిగుణము కల్గియుండునని తంత్రకారునియాశయము. తిత్తిరిమాత్రము అందు ముఖ్యముగ జెప్పబడినది.

వాగ్భటాచార్యులు.—"తిత్తిరిస్త్వేపివరో.........సన్నిపాతనిబర్హణః" అని యష్టాంగహృదయమునను, "ధన్వానూపవిచారిత్వాత్ స్నిగ్ధోష్ణగురుబృంహణః" అని సంగ్రహమునను జెప్పిరి.

## కపింజలమాంసగుణము.

మూ. పిత్తశ్లేష్మవికారేషు సరక్తేషు కపింజలాః. ౬౹
మన్దవాతేషు శస్యన్తే శైత్యమాధుర్యలాఘవాత్,

వ్యా. కపింజలములు శీతలఘుగుణంబులును మధురరసంబును కల్గియుండుటవల వాతము తగ్గియుండు పిత్త కఫరోగములయందును రక్తమునకు సంబంధించిన రోగము యందును ప్రశస్తము లైయుండును.

## లావమాంసగుణములు.

మూ. లావాః కషాయమధురాః లఘవోఽగ్నివివర్ధనాః. ౬౹
సన్నిపాతప్రశమనాః కటుకాశ్చ విపాకతః,

వ్యా. లావుకపిట్టలు (వానిమాంసము) కషాయ మధురరసంబులును లఘుగుణ బును కటువిపాకంబును కల్గియుండును. అగ్నిని దీపింపజేసి సన్నిపాతమును శమిం జేయును.

## పెంపుడుపావురములమాంసగుణము.

మూ. కషాయవిశదాః (మధురాః) శీతా రక్తపిత్తనిబర్హణాః. ౭
విపాకే మధురాశ్చైవ కపోతా గృహవాసినః,

వ్యా. గ్రామములనుండు పావురములమాంసము కషాయమధురరసంబులును వీర్యంబును మధురవిపాకంబును నగును. రక్తపిత్తమును హరించును.

## అడవిపావురములమాంసగుణము.

మూ. తేభ్యో లఘుతరాః కిఞ్చిత్ కపోతా వనవాసినః. ౭
శీతాః సంగ్రాహిణశ్చైవ స్వల్పమూత్రకరాశ్చ తే,

వ్యా. అడవిలోనుండు పావురముల మాంసము పైజెప్పినదానికన్న లఘుతర శీతవీర్యమగును. మలమును బంధించును. మూత్రమును స్వల్పముగ వృద్ధినొందించును.

## శుకమాంసగుణము.

మూ. శుకమాంసం కషాయామ్లం విపాకే రూక్షశీతలమ్. ౭
శోషకాసక్షయహితం సంగ్రాహి లఘు దీపనం,

వ్యా. చిలుకమాంసము కషాయ-అమ్లరసంబులును, అమ్ల విపాకంబును, రు శీతగుణంబులును, లఘుత్వంబును కల్గియుండును. ధాతుశోషమునను కాసమునను క్ష మునను హితకరము. మలమును బద్ధకముజేయును. అగ్నిని దీపింపజేయును.

ఈందేటి మాంసగుణము.

మూ. కషాయవిశదో రూక్షః శీతః పాకే కటుః లఘుః. ౨౩
శశస్స్వాదుః ప్రశస్తశ్చ సన్నిపాతేఽనిలాఽవరే,

వ్యా. ఈందేటి మాంసము కషాయరసంబును విశద-రూక్ష-శీత-లఘు గుణంబులును శీతవీర్యంబును, రుచికరంబు నై యుండును. ఇయ్యది వాతము స్వల్పముగగల సన్నిపాతమున చాల ప్రశస్తము.

అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినది.—"గ్రాహీ రూక్షో హిమశ్శశః, కటుపాకోఽగ్నికృత్ పథ్యశ్శన్నిపాతేఽనిలావరే"

పిచ్చుకమాంసగుణము.

మూ. చటకా మధురాః స్నిగ్ధాః బలశుక్ర (కఫశుక్ర) వివర్ధనాః. ౨౪
సన్నిపాతప్రశమనాః శమనా మారుతస్య చ,

వ్యా. ఊరబిచ్చుకలు మధురరసంబును స్నిగ్ధగుణంబును కల్గినవి. వీనిమాంసము శరీరబలమును శుక్రమును వృద్ధినొందించును. సన్నిపాతమును శమింపజేయును. అందును వాతమును ముఖ్యముగ శమింపజేయును.

పొడలజింకమాంసగుణము.

మూ. మధురా మధురాః పాకే త్రిదోషశమనాశ్శివాః. ౨౫
లఘవో బద్ధవిణ్మూత్రాః శీతాశ్చైణాః ప్రకీర్తితాః,

వ్యా. పొడలయిఱ్ఱి మిక్కిలి పరిశుద్ధమైనది. దీనిమాంసము రసవిపాకములచే మధురంబును త్రిదోషశమనంబు నగును. లఘుశీతగుణంబులు కల్గినది. మలమూత్రముల బంధించును.

ఉడుముమాంసగుణము.

మూ. గోధా విపాకే మధురా కషాయకటుకా రసే. ౨౬
వాతపిత్తప్రశమనీ బృంహణీ బలవర్ధనీ,

వ్యా. ఉడుముమాంసము కషాయమధురరసంబును, మధురవిపాకంబును నగును. వాతపిత్తముల హరించును. శరీరమును బలియజేయును. బలమును వృద్ధినొందించును.

ఏదుపందిమాంసగుణము.

మూ. శల్లకీ మధురామ్లశ్చ విపాకే కటుకస్స్మృతః. ౨౭
వాతపిత్తకఫఘ్నశ్చ శ్వాసకాసహరస్తథా,

వ్యా. ఏదుపందిమాంసము మధురామ్లరసంబులును కటువిపాకంబునుకల్గినది. వాత పిత్తకఫములను శ్వాసకాసములను హరించును.

మత్స్యసామాన్యగుణములు.

మూ. గురూష్ణమధురా బల్యా బృంహణాః పవనాపహాః ౭౮
మత్స్యాః స్నిగ్ధాశ్చ వృష్యాశ్చ బహుదోషాః ప్రకీర్తితాః,

వ్యా. మత్స్యములు గురు-ఉష్ణగుణంబులును మధురరసంబును స్నిగ్ధగుణంబును కల్గినవి. శరీరబలమునుకల్గించి బలియజేయును. వాతహరములు. వృష్యములు. దోషముల నధికముగ జేయును.

రోహితమత్స్యగుణములు.

మూ. శైవలాహారభోజిత్వాత్ స్వప్నస్య చ వివర్జనాత్. ౭౯
రోహితో దీపనీయశ్చ లఘుపాకో మహాబలః,

వ్యా. రోహితమను ఎఱ్ఱనిమత్స్యము నీటియందలి పాచిని తిని నిద్రలేకుండును, కావున అగ్నిని దీపింపజేయును. చుఱ్ఱుగ జీర్ణమగును. బలమును అధికముగ జేయును.

వాగ్భటాచార్యులు "మత్స్యాః పరం కఫకరాః చిలిచీమ స్త్రిదోషకృత్" అని యష్టాంగహృదయమునను, "కఫపిత్తకరా మత్స్యాః పరంపవననాశనాః" అని సంగ్రహమునను జెప్పిరి. ఈవాక్యములచేత మత్స్యములు సామాన్యముగ కఫపిత్తముల వృద్ధిజేసి వాతమును హరించుననియు, చిలిచిమమను మత్స్యము మాత్రము త్రిదోషకరమనియు తెలిసెడి. (చిలిచిమమనునది క్రాలుకసమున దిరుగులాడు మత్స్యవిశేషము).

పందిమాంసగుణము.

మూ. స్నేహనం బృంహణం వృష్యం శ్రమఘ్నమనిలాపహమ్. ౮౦
వరాహపిశితం బల్యం రోచనం స్వేదనం గురు,

వ్యా. పందిమాంసము చమురుకల్గినది. శరీరమును బలియజేయును శుక్రమును వృద్ధినొందించి సంభోగేచ్ఛను అధికముగజేయును. శరీరశ్రమమును వాతమును హరించును. బలమును కల్గించును. రుచి బుట్టించును. చెమట కల్గించును. గురుత్వము కల్గినది (చాలకాలమునకు జీర్ణమగునది).

తాబేటి మాంసగుణము.

మూ. వర్ణ్యో వాతహరో వృష్యః చక్షుష్యో బలవర్ధనః. ౮౧
మేధాస్మృతికరః పథ్యః శోషఘ్నః కూర్మ ఉచ్యతే,

వ్యా. తాజేటిమాంసము శరీరమునకు వర్ణమును (రంగును) కల్గించును. వాతమును హరించును. వృష్యము. నేత్రములకు హితకరము. బలమును వృద్ధినొందించును. బుద్ధిని జ్ఞాపకశక్తిని కల్గించును. ధాతుశోషమును హరించును. మిక్కిలి పథ్యకరము.

గోమాంసగుణము.

మూ. గవ్యం కేవలవాతేషు పీనసే విషమజ్వరే. ౮౨
శుష్కకాసశ్రమాత్యగ్నిమాంసక్షయహితం చ తత్,

వ్యా. గోజాతిమాంసము కేవల వాతరోగములయందును, పీనసము (పడిసెము) నందును, విషమజ్వరమునందును, పొడిదగ్గునందును, వ్యాయామాదులచే శ్రమజెందినప్పుడును, జఠరాగ్ని మిక్కిలి దీపించియున్నప్పుడును మిక్కిలి హితకరమగును.

మహిషమాంసగుణము.

మూ. స్నిగ్ధోష్ణమధురం వృష్యం మాహిషం గురు బృంహణం. ౮౩
దార్ఢ్యం బృహత్త్వముత్సాహం స్వప్నం చ జనయత్యపి,

వ్యా. ఎనుబోతుమాంసము స్నిగ్ధ-ఉష్ణగురుగుణంబును, మధురరసంబును నగును. వృష్యము, శరీరమును బలియజేయును. శరీరధాత్వాదుల దృఢముగను స్థూలముగను జేయును. ఉత్సాహమును కల్గించును. సుఖనిద్రను కల్గించును.

హస్తిమాంసగుణము

మూ. (హస్తిమాంసం తు మధురం ఉష్ణం చ గురు నిర్దిశేత్,
గజమాంసగుణైస్తుల్యం గావయం మాంసముచ్యతే.)

వ్యా. ఏనుగుమాంసము మధురంబును ఉష్ణగురుగుణంబును నగును. గవయమాంసంబును ఏనుగుమాంసతుల్యగుణమగును. (ఈశ్లోకము అధికపాఠమని యొక్క ప్రతియందు మాత్రము కానవచ్చుచున్నది. ఏప్రతులయందును మూలమున గానరాదు).

అండములగుణము.

మూ. ధార్తరాష్ట్రచకోరాణాం దక్షాణాం శిఖినామపి. ౮౪
చటకానాం చ యాని స్యుః అణ్డాని చ హితాని చ,
రేతఃక్షీణేషు కాసేషు హృద్రోగేషు క్షయేషు చ. ౮౫
మధురాణ్యవిపాకీని సద్యోబలకరాణి చ,
శరీరబృంహణే నాన్యత్ ఖాద్యం మాంసాద్విశిష్యతే.

వ్యా. రాజహంసలు, చకోరములు, కోళ్లు, నెమళ్లు, పిచ్చుకలు వీని గ్రుడ్లును, హితములగు నితరపక్షిజాతుల గ్రుడ్లును శుక్రము క్షీణించినవారికిని, కాసము, హృద్రోగము, ధాతుక్షయము అనునీవ్యాధులు కలవారికిని మిక్కిలి హితములై యప్పుడే బలమును కల్గించును. మధురములైయుండును. ఆలస్యముగ జీర్ణములగును.

మరియు శరీరమునకు బృంహణమునకై మాంసమునకంటె నితరఖాద్యపదార్థము వేరొండులేదు. మరియు "మాంసం బృంహణానాం" అనుఅగ్ర్యాధికారమునందలి వచనము చేతనే మాంసము బృంహణములలో శ్రేష్ఠమని తెలిసినను, అట్టిగుణమునే స్థిరపరచుటకై యిచ్చట తంత్రకారులచే మరల 'శరీరబృంహణే నాన్యాత్" అని యుపదేశింపబడినది కావున పునరుక్తము కాదని యెరుంగునది.

మూ. ఇతి వర్గస్తృతీయోఽయం మాంసానాం పరికీర్తితః. ౮౬

ఇతి మాంసవర్గః.

---

వ్యా. ఇత్తెరంగున మాంసములవర్గమనునది యుద్దేశానుసారముగ మూడవవర్గము వివరింపబడినది.

మాంసవర్గము సమాప్తము.

---

## (౪) శాకవర్గము.

వ్యంజనములలో ప్రధానమైనమాంసవర్గమును చెప్పినపిదప వ్యంజనసామాన్యమైన శాకవర్గము ఈక్రింద చెప్పబడును.

### అందు పాఠాదిగుణము.

అథ శాకవర్గః —

మూ. పాఠా తుషా శఠీశాఖం వాస్తుకం సునిషణ్ణకం,

విద్యాత్ గ్రాహి త్రిదోషఘ్నం భిన్నవర్చస్తు వాస్తుకం. ౮౭

వ్యా. చిరుబొద్ది, కసివెంద, కచోరములయాకు, చక్రవర్తిశాకము, నీరుచెంచలియాకు, ఈశాకములు మలాదుల నిరోధించును. త్రిదోషముల హరించును. పురీషమును భేదించును.

### కాచికూరగుణము.

మూ. త్రిదోషశమనీ వృష్యా కాకమాచీ రసాయనీ,

నాత్యుష్ణశీతవీర్యా చ భేదినీ కుష్ఠనాశనీ. ౮౮

వ్యా. కాచియాకు త్రిదోషముల శమింపజేయును. శుక్రవృద్ధిజేయును. రసాయనము (జరావ్యాధుల హరించునది), మిక్కిలి యుష్ణంబును శీతంబును కాని (సమశీతోష్ణమైన) వీర్యముకల్గినది. కఠినమైన మలమును భేదించును. కుష్ఠమును హరించును.

## చిలుకకూరగుణము.

మూ. రాజక్షవకశాకం తు త్రిదోషశమనం లఘు,
గ్రాహి శస్తం విశేషేణ గ్రహణ్యర్శోవికారిణాం. ౮౯

వ్యా. చిలుకకూర త్రిదోషముల శమింపజేయును. లఘుగుణము (తేలికగ జీర్ణమగును). గ్రాహి (మలమును గట్టిపరచును). గ్రహణిరోగమునందును, అర్శోరోగమునందును మిక్కిలి ప్రశస్తము.

## కరివేపాకుగుణము.

మూ. కాలశాకం తు కటుకం దీపనం గరశోషజిత్,
లఘూష్ణం వాతలం రూక్షం కాలాఖ్యం శాకముచ్యతే. ౯౦

వ్యా. కరివేపాకు కటురసంబును, లఘూష్ణగుణంబును రూక్షంబు నైయుండును. జఠరాగ్నిని దీపింపజేయును. విషమును శోషమును హరించును. వాతమును వృద్ధిజేయును.

## పులిచింతాకుగుణము.

మూ. దీపనీ చోష్ణవీర్యా చ గ్రాహిణీ కఫమారుతే,
ప్రశస్యతే ౽మ్లచాఙ్గేరీ గ్రహణ్యర్శోహితా చ సా. ౯౧

వ్యా. పులిచింతాకు అగ్నిని దీపింపజేయును. అమ్లరసంబును ఉష్ణవీర్యంబునగును. మలమును గట్టిపరచును. ఇయ్యది కఫవాతములయందును, అర్శోరోగమునందును మిక్కిలి హితకరము.

## దుంపబచ్చలిగుణము.

మూ. మధురా మధురా పాకే భేదినీ శ్లేష్మవర్ధనీ,
వృష్యా స్నిగ్ధా చ శీతా చ మదఘ్నీ చాప్యుపోదికా. ౯౨

వ్యా. దుంపబచ్చలియాకుకూర రసపాకములయందు మధురము. మలమును భేదించును. కఫమును వృద్ధిజేయును. వృష్యము. స్నిగ్ధగుణంబును శీతవీర్యంబును నగును. మదమును (మత్తతను) హరించును.

### చిట్టికూరగుణము.

మూ. రూక్షో మదవిషఘ్నశ్చ ప్రశస్తో రక్తపిత్తినాం,
మధురో మధురః పాకే శీతల స్తణ్డులీయకః ౩

వ్యా. చిట్టికూర రూక్షగుణము, మత్తును విషమును హరించును. రక్తపిత్తరోగము కలవారికి మిగుల ప్రశస్తము. రసవిపాకములచే మధురము. శీతవీర్యము.

### వల్లారాకు మున్నగుశాకములగుణము.

మూ మణ్డూకపర్ణీ వేత్రాగ్రం కుచేలా వనతిక్తకం,
కర్కోటకా౽వల్గుజకౌ పటోలం శకులాదనీ. ౪
వృషపుష్పాణి శార్ఙ్గేష్టా కేలుకం సకటిల్లకం,
నాడీకలాయం గోజిహ్వా వార్తాకం తిలపర్ణికా. ౫
కులకం కార్కశం నిమ్బం శాకం పార్పటికం చ యత్,
కఫపిత్తహరం తిక్తం శీతం కటు విపచ్యతే. ౬

వ్యా. మండూకబ్రంహి (వల్లారాకు), వెదురుమోవు (పేముమోవులు), కటురోహిణి, వనతిక్తక (అగరుశుంఠి, లేక విషబొద్ది), డావరడంగి, బావంచి, చేదుపొ... ఎఱ్ఱగలిజేరు, అడ్డసరపుపువ్వులు, గినియ, కేముకము, కాకర, నాడీకలాయము (సువర...లాభేదము), నాడీశాకము, కలాయము (గుండ్రముగనుండు బటాణులయాకు), గోజిహ (ఎద్దునాలుకచెట్టాకు), కత్తిరివంగ తిలపర్ణిక, (ఎఱ్ఱనిచందనము), చిట్టితుమికి, పిన్నకాక వేము, పర్పాటకము ఇవియన్నియు తిక్తరసంబును, కటువిపాకంబును, శీతవీర్యంబు కల్గినవి కఫపిత్తముల హరించును.

### సూప్యశాకాదిగుణములు.

మూ. సర్వాణి సూప్యశాకాని ఫంజీ చిల్లీ కుతుంబకః,
ఆలుకాని చ సర్వాణి సపత్రాణి కుటింజరః. ౭
శణశాల్మలిపుష్పాణి కర్బుదారస్సువర్చలా,
నిష్పావః కోవిదారశ్చ పత్తూరశ్చుచుపర్ణికా. ౮
కుమారజీవో లోట్టాకః పాలంక్యో మారిష స్తథా,
కలంబనాలికా౽సూర్యః కుసుమ్భవృకధూమకౌ. ౯
లక్ష్మణా ప్రపునాడీ చ నలినీకా కుఠేరకః,

లోణికా యవశాకం చ కూశ్మాణ్డకమవల్గుజమ్. ౧౦౦
యాతుకః శాలకల్యాణీ త్రిపత్రీ పీలుపర్ణికా,
శాకం గురు చ రూక్షం చ ప్రాయో విష్టభ్య జీర్యతి. ౧౦౧
మధురం శీతవీర్యం చ పురీషస్య చ భేదనం,
స్విన్నం నిష్పీడితరసం స్నేహాఢ్యం తత్ప్రశస్యతే. ౧౦౨

వ్యా. (సూపముగ నుపయోగింపదగిన మాషపర్ణి మున్నగునవి శింబీధాన్యవర్గములో జెప్పబడినవి. వానియన్నిటియాకుకూరలు సూప్యశాకలు) సూప్యశాకములు. ఫంజి (బ్రాహ్మణయష్టిక, గంటుభారంగి) శాకము, చిల్లీశాకము (పెద్దాకులు కలయవ శాకము), కుతుంబక (తుమ్మియాకు), అన్నివిధములైన యాలుకముల యాకుకూర, వాని దుంపలు, (ఆలుకమనునది ఆలుకము బంగాళాదుంపలు (ఉర్లగడ్డలు), పిండాలుకము (పెండలు,) కాష్ఠాలుకము (కఱ్ఱపెండలము), చిరుగడదుంపలు, మున్నగునవి యాలుక భేదములు); ఎఱ్ఱనిముల్లంగి, జనుపకూర, బూరుగపువ్వులు, ఎఱ్ఱమందారము, సువర్చల (ప్రొద్దుతిరుగుడుచెట్టాకు), ఆనపాకు, ఎఱ్ఱకాంచనము, పత్తూరశాకము, చుచుపర్ణిక (నాడీశాకభేదము), పుత్రజీవికూర, లోట్టాక (తోటకూరలోభేదము), పాలంక్యశాకము, పెరుగుతోటాకు, కడిమియాకుకూర, నాడిక (ఇది పొడవైనకాడలవలె నుండును, నడశాకమనియుం నామాంతరము), ఆసురి (ఆవకూర), కుసుమకూరు, వృకధూమకము (నేలదిరిసనము), లక్ష్మణశాకము, తగిరిసఆకు, తామరకాడలు, నల్లగగ్గెర (తులసి), లోణీ శాకము, యవశాకము, పెద్దగుమ్మడి, బావంచియాకు, యాతుక (ముయ్యాకుపొన్న తెల్లనిది), సీమపొన్నగంటి, దొండాకు, హంసపాదియాకు, కొయ్యతోటాకు, ఈయాకు కూరలన్నియు గురుగుణంబును రూక్షంబు నగును. ఇయ్యది కడుపులో గడబిడచేసి జీర్ణించును. ఈయాకుకూరలు మధురంబును శీతవీర్యంబును నగును. పురీషమును భేదించును. ఈయాకుకూరలను చక్కగ నుడికించి రసము పిండి నెయ్యి మున్నగువాని నధికముగ జేర్చి సంస్కరించి తిరుగబోతపెట్టి యుపయోగించుట మంచిది.

—శణపుష్పాదిశాకగుణము.—

మూ. శణస్య కోవిదారస్య కర్బుదారస్య శాల్మలేః,
పుష్పం గ్రాహి ప్రశస్తం చ రక్తపిత్తే విశేషతః. ౧౦౩

వ్యా. జనుముయొక్కయు, రక్తకాంచనముయొక్కయు, ఎఱ్ఱమందారము యొక్కయు, బూరుగయొక్కయు పువ్వులు మలమును గట్టిపరచును. రక్తపిత్తమునందు చాల ప్రశస్తము.

### పటపల్లవాదిశాకగుణము.

మూ. న్యగ్రోధోదుమ్బరాశ్వత్థ ప్లక్షపద్మాదిపల్లవాః,
కషాయా స్తమ్భనాః శీతా హితాః పిత్తాతిసారిణామ్. ౧౦౪

వ్యా. మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, తామర మొదలగువానిచిగుళ్లు కషాయరసము కల్గినవి. శీతవీర్యములు. ఇయ్యవి మలాదుల స్తంభింపజేయును. పిత్తాతిసారము కలవారికి చాల ప్రశస్తము.

### తిప్పతీగెమున్నగువానిశాకగుణములు.

మూ. వాయుం వత్సాదనీ హన్యాత్ కఫం గణ్డీరచిత్రకౌ,
శ్రేయసీ బిల్వపర్ణి చ బిల్వపత్రం తు వాతనుత్. ౧౦౫

వ్యా. తిప్పతీగెఆకుకూర వాతమును హరించును. గణ్డీరము (ఏటిపంగ, గురుజ కూరయు, చిత్రమూలపుకూరయు అగరు శుంఠియాకుకూరయు హింగుపత్రిశాకంబు కఫమును హరించును. బిల్వపత్రి (లేక తెల్లగగ్గెర) వాతమును హరించును.

మూ. భణ్డీశతావరీశాకం బలా జీవన్తికం చ యత్,
పర్వణ్యాః పర్వపుష్ప్యాశ్చ వాతపిత్తహరం స్మృతం. ౧౦౬

వ్యా. మంజిష్ఠి, పిల్లిపీచర, చిట్టాముట్టి, పాలకూర, పర్వణి, (పర్వశాకము) పర్వపుష్పి అనువానిశాకములు వాతపిత్తహరము.

### లాంగలక్యాదిశాకగుణములు.

మూ. లఘు భిన్నశకృత్ తిక్తం లాఙ్గలక్యురుబూకయోః,
తిలవేతసశాకం చ శాకం పంచాంగులస్య వా. ౧౦౭
వాతలం కటుతిక్తామ్లం అధోమార్గప్రవర్తనమ్,

వ్యా. లాంగలిక (నీరుపిప్పలి) ఎఱ్ఱాముదపుఆకు వీనికూర తిక్తరసము తేలిక జీర్ణమగును. మలమును భేదించును.

నువ్వు, నీరుప్రబ్బలి, చిట్టాముదపాకు వీనియాకుకూర కటుతిక్తఆమ్లరసము కల్గియుండును. వాతమును వృద్ధిజేయును. వాతము నధోమార్గముగ వెడలించును.

### కుసుంభశాకగుణము.

మూ. రూక్షమ్లముష్ణం కౌసుమ్భం కఫఘ్నం పిత్తవర్ధనమ్. ౧౦౮

వ్యా. కుసుమముయొక్క ఆకుకూర రూక్షగుణంబును ఆమ్లరసంబును ఉష్ణవీర్యంబు నగును. కఫమును హరించును. పిత్తమును వృద్ధినందించును.

### దోసకూరగుణము.

మూ. త్రపుసైర్వారుకం స్వాదు గురు విష్టమ్భి శీతలం,
ముఖప్రియం చ రూక్షం చ మూత్రలం త్రపుసం త్వతి. ౧౦౯

వ్యా. ములుదోస (కీరదోస), దోస ఈరెండును మధురముగ నుండును. గురుత్వము కల్గినది. మలమును బంధించును. శీతవీర్యము (చలువజేయును). అందు ములుదోస నోటికింపుగను రూక్షముగను ఉండును. మూత్రమును వృద్ధిజేయును.

### పండినదోసకాయగుణము.

మూ. ఏర్వారుకం చ సంపక్వం దాహతృష్ణాక్లమార్తినుత్,

వ్యా. దోసకాయ చక్కగ పండినది తాపమును దప్పిని బడలికను శ్రమమును హరించును.

### సొరకాయగుణము.

మూ. వర్చోభేదీన్యలాబూని రూక్షశీతగురూణి చ. ౧౧౦

వ్యా. సొరకాయలు రూక్షశీతగురుత్వము కల్గియుండును. మలమును భేదించును.

### బుడమ-పెద్దదోసకాయలగుణము.

మూ. చిర్భటైర్వారుకే తద్వత్ వర్చోభేదహితే తు తే,

వ్యా. బుడమకాయలును పెద్దదోసకాయలును రూక్షాదిగుణములుకల్గి మలమును భేదించును. హితకరములు.

### బూడిదెగుమ్మడికాయగుణము.

మూ. కూశ్మాణ్డముక్తం సక్షారం మధురామ్లం తథా లఘు. ౧౧౧
సృష్టమూత్రపురీషం చ సర్వదోషనిబర్హణమ్,

వ్యా. పెద్దగుమ్మడికాయ (బూడిదెగుమ్మడికాయ) మధురంబును కొద్దిగ కారము పులుపునుకల్గి చుల్కనగ జీర్ణమగును. మలమూత్రముల వెడలించును. దోషములనన్నిటిని హరించును.

ఇచ్చట గుమ్మడికాయ లేతగను మధ్యమముగను ఉన్నపుడు క్షారత్వము సంభవించదు కావున చక్కగ పండినదాని నుద్దేశించి గుణములు చెప్పబడినవి. ఈవిషయమును తంత్రాంతరమున నిట్లు చెప్పిరి.—"పిత్తఘ్నం తేషు కూశ్మాణ్డం బాలం, మధ్యం, కఫావహం, పక్వం లఘూష్ణం సక్షారం, దీపనం వస్తిశోధనం, సర్వదోషహరం హృద్యం పథ్యం చేతోవికారిణాం" పెద్దగుమ్మడికాయ లేతది పిత్తమును హరించును. మధ్యమ

ముగ (ముదిరి) నుండునది కఫమును కల్గించును. చక్కగ పండినది లఘూష్ణగుణం బులును, క్షారంబును కల్గియుండును. అగ్నిని దీపింపజేయును. వస్తిని (మూత్రపుతిత్తిని) శోధించును. దోషముల నన్నిటిని హరించును. హృదయమునకు మంచిది. బుద్ధికి సంబంధించిన రోగములు కలవారికి మిక్కిలి హితకరమునని యర్థము.

మరియు వాగ్భటాచార్యులు—"వల్లీఫలానాం ప్రవరం కూశ్మాణ్డం వాతపిత్త జిత్, వస్తి శుద్ధికరం వృష్యం" అని చెప్పిరి. తీగెకాయలలో బెద్దగుమ్మడి చాల శ్రేష్ఠ మనియు, వాతపిత్తములను హరించుననియు, వస్తిని శుభ్రపరచుననియు, వృష్యమనియు నర్థము. వీరు బాలాది భేదము ననుసరింపక సామాన్యముగ జెప్పిరి.

### కే లూ టా ది గు ణ ము లు.

మూ. కేలుటం చ కదమ్బం చ నన్దీ మాషక మైన్దుకం (మైన్దవం). ౧౧౨
విశదం గురు శీతం చ సమభిష్యన్ది చోచ్యతే,

వ్యా. కేలుటము, కదంబము, నంది, మాషకము, ఐందుకము అను నీ శాకములు విశదగురు శీతగుణంబులును స్రవింపజేయునవియు నగును. (పైజెప్పినవి స్వనామప్రసిద్ధములైన శాకభేదములుగ నున్నవి. నామాంతరముకూడ కానరాదు.) "కేలూటం స్వాదువిటపం తత్కన్దః స్వాదుశీతలః" అని హారీతమున నున్నది. దీనింబట్టి గోసుగడ్డ యని తోచెడి. దీని యాభాసముగ "క్యాబేజి" యగును.

### కలువలు మున్నగువానిగుణములు.

మూ. ఉత్పలాని కషాయాణి రక్తపిత్తహరాణి చ. ౧౧౩
తథా తాలప్రలమ్బం చ ఉరఃక్షతరుజాపహం,
ఖర్జూరతాలశస్యం చ రక్తపిత్తక్షయాపహం. ౧౧౪

వ్యా. కలువజాతికి సంబంధించిన కాడలు దుంపలు మున్నగునవి కషాయరసము కల్గినవి. రక్తపిత్తమును హరించును. తాటికేగులు ఉరఃక్షతమును హరించును. ఖర్జూరము, తాటిచెట్లు. ఈచెట్ల కొనలలోపలనుండు మోవులు రక్తపిత్తమును క్షయమును హరించును.

### కలువగడ్డలు మున్నగువానిగుణములు.

మూ. తరూటబిసశాలూక క్రౌంచాదనకశేరుకం,
శృఙ్గాటమంకాలోడ్యం చ గురువిష్టమ్భి శీతలం. ౧౧౫

వ్యా. కలువగడ్డలు, తామరకాడలు, తామర మున్నగువానిగడ్డలు, క్రౌంచాదనము (దేశాంతరమునందలి పద్మవిశేషము) నిమ్మదుంప, శృంగాటకము (సింగాణి దుంపలు), చిన్నకలువదుంపలు ఇవియన్నియు గురుగుణంబులును శీతవీర్యంబులు నగును. మలమును బంధించును.

కలువకాడలు మున్నగువానిగుణములు.

మూ. కుముదోత్పలనాళాస్తు సపుష్పాః సఫలాః స్మృతాః,
శీతాస్స్వాదు కషాయాస్తు కఫమారుతకోపనాః. ౧౧౬

వ్యా. తెల్లకలువలయొక్కయు, నల్లకలువలయొక్కయు, కాడలును, పువ్వులును, కాయలును, శీతగుణంబులును, కషాయమధురరసంబులును, కఫవాతముల ప్రకోపింపజేయునవియు నగును.

తామరగింజలగుణము.

మూ. కషాయమీషద్విష్టమ్భి రక్తపిత్త హరం స్మృతం,
పౌష్కరం తు భవేద్బీజం మధురం రసపాకయోః ౧౧౭

వ్యా. తామరగింజలు కొంచెము కషాయముకలిసిన మధురరసంబును, మధురవిపాకంబును నగును. మలమును బంధించును. రక్తపిత్తమును హరించును

ముంజాతగుణము.

మూ. బల్యశ్శీతో గురుస్స్నిగ్ధః తర్పణం బృంహణాత్మకః, [స్మృతః.
వాతపిత్తహరః స్వాదుః వృష్యో ముంజాతకః (యుంజాతకః)

వ్యా. ముంజాతమనుదుంప బలమును కల్గించును. శీతవీర్యము-గురుస్నిగ్ధగుణములు కల్గినది. ధాతువుల తృప్తినందించును. శరీరమును బలియజేయును. వాతపిత్తములను హరించును. మధురముగనుండును. వృష్యమగును. (ఇయ్యది యుత్తరదేశమున స్వనామప్రసిద్ధమైన గడ్డజాతిలో చేరినది. నేపాళమునుండి తేబడిన తియ్యనికంద విశేషమని కొందరియభిప్రాయము) 'ముంజాతము, యుంజాతము'నని రెండు పాఠములు గానంబడియెడు.

నేలగుమ్మడుగడ్డ గుణము.

మూ. జీవనో బృంహణో వృష్యః కణ్ఠ్యశ్శస్తో రసాయనే,
విదారికన్దో బల్యశ్చ మూత్రలః స్వాదుశీతలః. ౧౧౯

వ్యా. నేలగుమ్మడుగడ్డ శరీరమును బలియజేయును. శుక్రమును వృద్ధిజేయును. కంఠస్వరమునకు చాల మేలుచేయును. రసాయనమునకు ప్రశస్తము. బలమును మూత్రమును వృద్ధిచేయును. మధురంబును శీతవీర్యంబును నగును.

అమ్లికాశాకగుణము.

మూ. అమ్లికాయాః స్మృతః కన్దో గ్రహణ్యర్శోహితో లఘుః,
అత్యుష్ణః కఫవాతఘ్నః గ్రాహీ శస్తో మదాత్యయే. ౧౨౦

వ్యా. అమ్లికాశాకము తేలికగ జీర్ణమగును. గ్రహణీరోగమునందును అర్శో రోగమునందును చాల మంచిది. మిక్కిలి యుష్ణమైనది. కఫవాతముల హరించును. మలమును గట్టిపరచును. మదాత్యయమున ప్రశస్తము. (అమ్లిక యనునది స్వల్పవిటపిజాతిలో జేరినది. కామరూపాది దేశములలో ప్రసిద్ధమని చక్రదత్తవ్యాఖ్యానమున నున్నది.)

ఆవకూర పెండలము, వీనిగుణములు.

మూ. త్రిదోషం బద్ధవిణ్మూత్రం సార్షపం శాకముచ్యతే,
తద్వత్పిణ్డాలుకం విద్యాత్ కన్దత్వాచ్చ ముఖప్రియం. ౧౨౧
(తద్వత్స్యాద్రక్తనాలస్య రూక్షమమ్లం విశేషతః.)

వ్యా. ఆవకూర త్రిదోషమును వృద్ధిచేయును. మలమూత్రముల బంధించును. పెండలముకూరయు నట్టిగుణముల గల్గినది. గడ్డదినుసు అగుటచే నోటి కింపుగ నుండును.

పుట్టకొక్కుల గుణము.

మూ. సర్పచ్ఛత్రకవర్జ్యాస్తు బహ్వ్యోఽన్యచ్ఛత్రజాతయః,
శీతాః పీనసకర్త్ర్యశ్చ మధురా గుర్వ్య ఏవ చ. ౧౨౨

పాముపడిగెవంటి యాకారము కల్గినది పుట్టకొక్కు సర్పఛత్ర మనబడును. అది యొక్కటిదక్క తక్కిన (ఎఱ్ఱవి నల్లవి తెల్లవి మున్నగు) పుట్టగొగులన్నియు శీతవీర్యములు. పడిసెమును కల్గించును. మధురములుగ నుండును. గురుత్వము జేయును.

శాకవర్గసమాప్తి.

మూ. చతుర్థశ్శాకవర్గోఽయం పత్రకన్దఫలాశ్రయః.
ఇతి శాకవర్గః

---

వ్యా. ఆకులు దుంపలు పండ్లును (పువ్వులు) కాయలు, వీనికి జేరినకూరల (శాక) వర్గమను నాల్గవవర్గము చెప్పబడినది.

(ఇచ్చట "పత్రకందఫలాశ్రయః" అని ప్రాధాన్యోద్దేశముగ జెప్పినది కావున ఆనుషంగికముగ పుష్పములును గ్రహింపదగినవి.)

మరియు "పత్రే పుష్పే ఫలే నాళే కన్దే చ గురుతా క్రమాత్" అను వాగ్భట వచనప్రకారము ఆకు, పువ్వులు, కాయలు, కాడలు, గడ్డలు అను వానిలో క్రమముగ నొకటికన్న నొకటి గురుత్వము కల్గియుండునని యెరుంగునది.

ఇది శాకవర్గము సమాప్తము.

---

## ఫలవర్గము.

భోజనకాలమునందు శాకములబోలె పండ్లనినుసులును స్వల్పముగ నుపయోగింపబడును. అయ్యది భోజనాంతమున నుపయోగింపదగినదని "భుక్తావసానే ఫలం భుజ్యతే" అను ఖరనాదవచనముచే దెలిసెడి; కావున శాకవర్గమును జెప్పినపిదప ఫలవర్గము చెప్పబడును. అందును ఫలములలో నుత్తమంబగుటచే ద్రాక్షపండ్లగుణము తొలుత జెప్పబడును.

## ద్రాక్షపండ్లగుణము.

అథ ఫలవర్గః.—

మూ. తృష్ణా దాహజ్వరశ్వాసరక్తపిత్తక్షతక్షయాన్,
వాతపిత్తముదావర్తం స్వరభేదం మదాత్యయమ్.　　౧౨౩
తిక్తాస్యతామాస్యశోషం కాసం చాశు వ్యపోహతి,
మృద్వీకా బృంహణీ వృష్యా మధురస్నిగ్ధశీతలా.　　౧౨౪

వ్యా. ద్రాక్షపండు మధురరసంబును స్నిగ్ధగుణంబును శీతవీర్యంబును కల్గియుండును. దప్పిని, తాపమును, జ్వరమును, శ్వాసమును, రక్తపిత్తమును, ఉరఃక్షతమును, ధాతుక్షయమును, వాతపిత్తములను, ఉదావర్తమును, స్వరభేదమును, మదాత్యయమును, నోటిచేదును, నోరెండుటను, దగ్గును (వీని నన్నింటిని) శీఘ్రముగ పోగొట్టును. శరీరమునకును శుక్రమునకును పుష్టిని కల్గించును.

## ఖర్జూరపుపండు గుణము.

మూ. మధురం బృంహణం వృష్యం ఖర్జూరం గురు శీతలం,
క్షయేఽభిఘాతే దాహే చ వాతపిత్తే చ తద్ధితం.　　౧౨౫

వ్యా. ఖర్జూరపుపండు మధురరసంబును గురుత్వంబును శీతవీర్యంబును కల్గినది. శరీరమునకును శుక్రమునకును పుష్టిని కల్గించును. ధాతుక్షయమునందును, అభిఘాతమునందును, తాపమునందును, వాతపిత్తరోగములయందును ద్రాక్షపండువలె హితకరము.

## అత్తిపండుగుణము.

మూ. తర్పణం బృంహణం ఫల్గు గురు విష్టమ్భి శీతలం,

వ్యా. అత్తిపండు తృప్తినొందించును. పుష్టినిచ్చును. గురుత్వముకల్గినది. మలమును బంధించును. శీతవీర్యమైనది.

—◎ ఇప్ప ఈతపండ్లగుణము. ◎—

మూ. పరూషకం మధూకం చ వాతపిత్తే ప్రశస్యతే. ౧౨౬

వ్యా. ఈతపండును ఇప్పపండును వాతపిత్తములయందు చాల ప్రశస్తములు.

—◎ అంబాళపుపండుగుణము. ◎—

మూ. మధురం బృంహణం బల్యం ఆమ్రాతం తర్పణం గురు,
సస్నేహం శ్లేష్మలం శీతం వృష్యం విష్టభ్య జీర్యతి. ౧౨౭

వ్యా. అంబాళపుపండు మధురము. శరీరమునకు పుష్టిని బలమునుకల్గించును. గురుత్వముకల్గినది. స్నిగ్ధముగ నుండును. కఫమును వృద్ధినొందించును. శీతవీర్యము కల్గినది. శుక్రమును బలపరుచును. కడుపులో గడబిడచేసి జీర్ణమగును.

(అంబాళపుకాయలు మామిడికాయలబోలియుండును. అయ్యవి తీపు పులుపురసములచే రెండువిధముల నుండును. అందు తీపికలజాతిగుణము లిచ్చట చెప్పబడినవి.)

—◎ తాటిపండు టెంకాయలగుణములు. ◎—

మూ. తాలస (శ) స్యాని సిద్ధాని నారికేళఫలాని చ,
బృంహణస్నిగ్ధశీతాని బల్యాని మధురాణి చ. ౧౨౮

వ్యా. చక్కగ పండిన తాటిపండ్లును, కొబ్బెరకాయలును స్నిగ్ధశీతగుణంబులును మధురరసంబును కల్గినవి. శరీరపుష్టిని కల్గించును. బలకరములు.

—◎ భవ్యఫలగుణము. ◎—

మూ. మధురామ్లకషాయం చ విష్టమ్భి గురు శీతలం,
పిత్తశ్లేష్మకరం (హారం) భవ్యం గ్రాహి వక్త్రవిశోధనం. ౧౨౯

వ్యా. భవ్యఫలము మధురామ్లకషాయరసములుకల్గి గురుత్వంబును శీతవీర్యంబును కల్గినది. ఇది మలమును బంధించును. పిత్తకఫములను హరించును. మలము గట్టిపరచును. నోటిని శుభ్రపరచును.

ఈఫలముయొక్క స్వరూపమునుగూర్చి "భవ్యం కర్మరంగఫలం, కేచిత్తు తత్సంహాతిఫలం వదన్తి" అని చక్రదత్తవ్యాఖ్యలో నున్నది. దీనిచేత ఉవ్వపండు లేక పప్పర పనసపండు అని యూహింపదగియున్నది. మరియు "మధురామ్లక...పిత్తశ్లేష్మకర" మనియు, "పిత్తశ్లేష్మహారం" అనియు పాఠభేదములు కానబడుచున్నవి. మదనపాలనిఘంటువున "కర రంగం నాగఫలం భవం పిచ్ఛిలబీజకం. కర రంగం హిమం గాహి

స్వాద్వమ్లం కఫపిత్తజిత్" అని యున్నది. కర్మరంగము, నాగఫలము, భవ్యము అనునవి ఒకఫలమునకు పర్యాయనామములు. అట్టిఫలము మధురామ్లంబును శీతంబునై గ్రాహియుం కఫపిత్తహరంబునగునని యర్థము. ఈనిఘంటుప్రమాణముచేత భవ్యఫలము కఫపిత్తహర మనియే స్పష్టమగుచున్నది. కావున ప్రకృతతంత్రమున "పిత్తశ్లేష్మహారం" అనియే యాచార్యులసమ్మతమని చెప్పదగును. ప్రాచీనముద్రితకోశమున 'కఫపిత్తహర' మనియే యున్నది.

పరూషకాదిగుణములు.

మూ. అమ్లం పరూషకం ద్రాక్షా బదరాణ్యారుకాణి చ,
పిత్తశ్లేష్మప్రకోపీని కర్కన్ధూనికుచాన్యపి　౧౩౦

వ్యా. (ఈత, ద్రాక్ష, రేగు, ఆరుకము (గజనిమ్మ), కమ్మరేగు, పిన్నరేగు, ఇవి పులుపు, తీపి అనురసభేదములచే రెండువిధములుగ నుండును) అందు పులుపుగల్గినవి పిత్తకఫముల ప్రకోపింపజేయును.

తియ్యనిగజనిమ్మపండుగుణము.

మూ. నాత్యుష్ణం గురు సంపక్వం స్వాదుప్రాయం ముఖప్రియం,
బృంహణం జీర్యతి క్షిప్రం నాతిదోషలమారుకం.　౧౩౧

వ్యా. పైజెప్పినవానిలో తీపికలగజనిమ్మపండు చక్కగపండినది కొంచెముగ వేడి చేయును. గురుత్వము కల్గినది. నోటికింపుగనుండును. పుష్టినిచ్చును. అతిశీఘ్రముగ జీర్ణ మగును. స్వల్పముగ దోషములజేయును.

ఈడెపండుగుణము.

మూ. ద్వివిధం శీతముష్ణం చ మధురం చామ్లమేవ చ,
గురు పారావతం జ్ఞేయమరుచ్యత్యగ్నినాశనం.　౧౩౨

వ్యా. పారావతఫలము (ఈడెపండు) మధుర-అమ్లభేదములచే రెండువిధముల నుండును. అందు మధురమైనది చలువజేయును. పులుపైనది వేడిచేయును. గురుత్వము కల్గినది. అరుచిని అత్యగ్నిని హరించును.

ఇచ్చట మధుర-అమ్లరసములచేతనే శీత-ఉష్ణవీర్యములని యర్థమగుచున్నను, మరల 'శీతముష్ణం చ' అని చెప్పుటచేత రసములకు చెప్పినవీర్యనియమము ఒకచోట నిత్యముకాదని తెలిసెడి. కావుననే ఉసిరికకాయలు అమ్లరసము కల్గియున్నను శీతవీర్య మగుట సమంజసము.

### కాశ్మర్యఫలగుణము.

మూ. భవ్యాదల్పాన్తరగుణం కాశ్మర్యఫలముచ్యతే,
తస్మాదల్పాన్తరగుణం తూదమమ్లపరూష (కం) కాత్. ౧౩౩

వ్యా. అడవిగుమ్మడిపండు భవ్యఫలమునకంటె కొంచెముతక్కువగ సమానగుణముగ నుండును. తూదఫలంబును పుల్లనియీతపండుతో కొంచెమించుమించుగ సమానగుణముగ నుండును. (తూదమనుఫలము మహాలయమున ప్రసిద్ధమట).

### టంకఫలగుణము.

మూ కషాయమధురం టఙ్కం వాతలం గురు శీతలం,

వ్యా. (టంకఫలము కాశ్మీరదేశమున స్వసామప్రసిద్ధము) అయ్యది కషాయ మధురంబును, గురుగుణంబును, శీతవీర్యంబును, వాతకరంబును నగును.

### వెలగపండుగుణము.

మూ. కపిత్థం విషకణ్ఠఘ్నం ఆమం సంగ్రాహి వాతలం. ౧౩౪
మధురామ్లకషాయత్వాత్ సౌగన్ధ్యాచ్చ రుచిప్రదం,
తదేవ సిద్ధం దోషఘ్నం విషఘ్నం గ్రాహి గుర్వపి. ౧౩౫

వ్యా. (వెలగకాయ పక్వముగాక పిందెగా నున్నపుడు వగరుగ నుండును. కాయగనున్నపుడు పులుపును వగరును కలిసియుండును. చక్కగ పండినప్పుడు మధుర రసము ప్రధానముగను తక్కిన రెండురసములును స్వల్పముగ నుండును.) అయ్యది కాయగ నున్నపుడు విషమును హరించును. కంఠమునకు చెరుపుచేయును. మలమును గట్టిపరచును. వాతమును కల్గించును. మంచివాసన కల్గియుండుటంజేసి రుచికరమగును, అయ్యది చక్కగ పండినది దోషహరము. విషమును హరించును. మలమును గట్టిపరచును. గురుత్వ మును చేయును.

### బిల్వఫలగుణము.

మూ. బిల్వం తు దుర్జరం సిద్ధం దోషలం పూతిమారుతం,
స్నిగ్ధోష్ణతీక్ష్ణం తద్బాలం దీపనం కఫవాతజిత్. ౧౩౬

వ్యా. మారేడుకాయ చక్కగ పండినది చక్కగ జీర్ణముకాదు. త్రిదోషముల వృద్ధిచేయును. దుర్గంధముతోగూడిన వాతమును వెడలించును. అయ్యది లేతగనున్న పుడు స్నిగ్ధ-ఉష్ణ-తీక్ష్ణగుణముల గల్గియుండును. అగ్నిని దీపింపజేయును. కఫవాతముల హరించును.

### మామిడికాయ, పండుగుణములు.

మూ. వాతపిత్తకరం బాలం ఆపూర్ణం పిత్తవర్ధనం,
పక్వమామ్రం జయేద్వాయుం మాంసశుక్రబలప్రదం. ౧౩౭

వ్యా. మామిడికాయ లేతది వాతపిత్తములను వృద్ధిచేయును. ముదిరినమామిడికాయ పిత్తమును వృద్ధినొందించును. చక్కఁగ పండినది వాతమును హరించును. మాంసమును శుక్రమును బలమును వృద్ధినొందించును.

### నేరేడుపండుగుణము.

మూ. కషాయమధురప్రాయం గురు విష్టమ్భి శీతలం,
జామ్బవం కఫపిత్తఘ్నం గ్రాహి వాతకరం పరం. ౧౩౮

వ్యా. నేరేడుపండు వగరునుతీపిని ఎరుచుగ గల్గినది. గురుత్వంబును శీతవీర్యంబును కల్గినది. మలమును బంధించును. కఫపిత్తములను హరించును. మలమును గట్టిపరచును. వాతమును అధికముగ జేయును.

### రేగుపండుగుణము.

మూ. మధురం బదరం స్నిగ్ధం భేదనం వాతపిత్తజిత్,
తచ్ఛుష్కం కఫవాతఘ్నం పిత్తే న చ విరుధ్యతే. ౧౩౯

వ్యా. రేగుపండు మధురంబును స్నిగ్ధంబునగును. మలమును భేదించును. వాతపిత్తముల హరించును. అయ్యది యెండినచో కఫవాతముల హరించును. పిత్తమును విరోధించ సమస్థితినుండును.

### సించితికాఫలగుణము.

మూ. కషాయమధురం శీతం గ్రాహి సిఞ్చితికాఫలం,

వ్యా. సించితికాఫలము కషాయమధురరసములుకల్గినది. శీతవీర్యము. మలమును గట్టిపరచును. (ఇయ్యది రేగుభేదములోఁ చేరినది. దీనిని యూనానీయులు 'ఆపిల్' అని భాషాంతరమున జెప్పెదరు).

### నాగబలాదిఫలముల గుణము.

మూ. గాఙ్గేరుకీ కరీరం చ బిమ్బీ తోదనధన్వనం. ౧౪౦
మధురం సకషాయం చ శీతం పిత్తకఫాపహం,

వ్యా. నాగబలా (అడవిబీర) ఫలము, కరీర (వెణుతురు) ఫలము, బింబీ (దొండ) ఫలము, తోదనఫలము, ధన్వనఫలము, ఇవియన్నియు తీపిగను వగరుగను ఉండును. శీతవీర్యముకల్గినవి, పిత్తకఫముల హరించును.

[ఈఫలముల స్వరూపమును "గాంగేరుకం నాగబలాఫలం, కరీరో మరుజో ద్రుమః, తోదనం ధన్వనభేదః" అని చక్రదత్తవ్యాఖ్యలో నున్నది. కరీరమనునది మరుభూమిలో బుట్టునది వెణుతురు అని నిఘంటువులలో నున్నది. తోదన ధన్వనములును ఆట్టివేయని తోచెడి. "తోదనం వామ్రప్రియఫలమాహుః" అని యొకరు చెప్పిరి. అప్రసిద్ధమని యింకొకరు వ్రాసిరి.]

పనస-అరటి-మొరళిపండ్లగుణము.

మూ. సమ్పక్వం పనసం మోచం రాజాదనఫలాని చ. ౧౪౧
స్వాదూని స కషాయాణి స్నిగ్ధశీతగురూణి చ,

వ్యా. చక్కగ పండిన పనసపండును, అరటిపండును, మొరళిపండును వగరును తీపియుం కల్గి స్నిగ్ధశీతగురుత్వము కల్గియుండును. ఇయ్యవి పిత్తకఫముల హరించును.

మరియు "ప్రియాళు మజ్జామధురో వృష్యః పిత్తానిలాపహః" అని వాగ్భట వాక్యముచేత మొరళిగింజలలోని పప్పు (చారపప్పు) మధురంబును వృష్యంబును పిత్తానిలహరంబు నగునని తెలిసెడి.

లవలీఫలగుణము.

మూ. కషాయవిశదత్వాచ్చ సౌగన్ధ్యాచ్చ రుచిప్రదం. ౧౪౨
అవదంశక్షమం రూక్షం వాతలం లవలీఫలం,

వ్యా. లవలీఫలము వగరును విశదగుణంబును సుగంధంబును కల్గినది కావున రుచిని పుట్టించును. అవదంశమునకు మంచిది. రూక్షగుణము కల్గినది. వాతమును కల్గించును. (అవదంశక్షమ మన దీని నమలినచో నోట రుచికల్గిన తక్కిన నాహారపదార్థములకును రుచిని కల్గించునని యర్థము.)

నీపాదిఫలగుణము.

మూ. నీపం శతాహ్వాకం (సభాజ్గకం, శతాక్షకం) పీలు
తృణశూన్యం వికఙ్కతం. ౧౪౩
ప్రాచీనామలకం చైవ దోషఘ్నం గరహారి చ,

వ్యా. నీపము (కడిమి), శతాహ్వకము, పీలు (వరగోగు), తృణశూన్యము, వికం కతము (పుల్లవెలగ), ప్రాచీనామలకము (నీటియుసిరిక, చిరునెల్లి) వీనిపండ్లు దోషముల హరించును. విషమును పోగొట్టును. (తృణశూన్యం-కేతకీఫలం' అని చక్రదత్తులా నున్నది.) ఇవియన్నియు స్వనామఖ్యాతములుగ నున్నవి.)

ఇంగుదఫలగుణము.

మూ. ఇఙ్గుదం తిక్తమధురం స్నిగ్ధోష్ణం కఫవాతజిత్. ౧౪౪

వ్యా. పుత్రజీవిఫలము చేదును తీపియు కల్గినది. స్నిగ్ధంబును, ఉష్ణవీర్యంబును, కఫవాతహారంబును నగును. ('ఇంగుదం-పుత్రజీవిఫలం' అని చక్రదత్తవ్యాఖ్య).

తుమికిపండుగుణము.

మూ. తిన్దుకం కఫపిత్తఘ్నం కషాయమధురం లఘు,

వ్యా. తుమికిపండు కఫపిత్తముల హరించును. వగరును తీపియు లఘుగుణంబును కల్గినది.

ఉసిరికపండ్లగుణము.

మూ. విద్యాదామలకే సర్వాన్ రసాన్ లవణవర్జితాన్. ౧౪౫
స్వేదమేదఃకఫోత్క్లేదపిత్తరోగవినాశనం,

వ్యా. ఉసిరికపండ్లయందు ఉప్పు ఒక్కటిదక్క తక్కిన ఐదురసములును చేరి యుండును. అయ్యది చెమట మేదోవృద్ధి కఫము వాంతియగుట పిత్తరోగములు వీని నన్నింటిని హరించును.

తాండ్రకాయలగుణము.

మూ. రూక్షం స్వాదు కషాయామ్లం కఫపిత్తహారం పరం. ౧౪౬
రసాసృఙ్మాంసమేదోజాన్ దోషాన్ హన్తి విభీతకం,

వ్యా. తాండ్రకాయలు తీపి వగరు పులుపును కల్గినది. రూక్షగుణము. కఫపిత్తములను, రసరక్తమాంసమేదస్సులను నాల్గుధాతువులలో కల్గినదోషముల (రోగముల)ను హరించును.

దానిమ్మపండుగుణము.

మూ. అమ్లం కషాయమధురం వాతఘ్నం గ్రాహి దీపనం. ౧౪౭
స్నిగ్ధోష్ణం దాడిమం హృద్యం కఫపిత్తావిరోధి చ,

రూక్షామ్లం దాడిమం యత్తు తత్పిత్తానిలకోపనం. ౧౭౮
మధురం పిత్తనుత్తేషాం పూర్వం దాడిమముత్తమం,

వ్యా. దానిమ్మపండు పులుపు వగరు తీపి కల్గియుండును. స్నిగ్ధంబును ఉష్ణంబు నగును కఫపిత్తములయందు విరోధము కాకుండును. వాతహరంబును మలమును గట్టి పరచునదియు నగును. అందు రూక్షగుణంబును అమ్లరసంబును అధికముగ కల్గినది పిత్త వాతములను ప్రకోపింపజేయును. మధురముగనుండునది పిత్తమును హరించును. అయ్యది చాల మంచిది.

ఇచ్చట నీవివరణము నెరుంగునది.—దానిమ్మపండు పులుపు తీపి అను రసభేదము చేత పుల్లదానిమ్మ, తియ్యదానిమ్మ అని రెండువిధములు. అందు మధురమైనది (తీయ దానిమ్మ) కషాయానురసమై స్నిగ్ధోష్ణగుణములగల్గి వాతహరంబునగును. మలమును గట్టి పరచును. అగ్నిని దీపింపజేయును. హృదయమునకు హితకరము. కఫపిత్తములకు విరోధ ముగాకుండును. పిత్తమును హరించును.

పుల్లదానిమ్మపండు రూక్షగుణము కల్గినది. పిత్తమును వాతమును ప్రకోపింప జేయును. ఇందులో తొలుత జెప్పినది (తియ్యనిది) యుత్తమము. రెండును హృదయ మునకు అనుకూలంబుగ నుండును. అది యర్థము చేయనగును.

సుశ్రుతమున నిట్లు చెప్పిరి.—"ద్వివిధం తత్తు విజ్ఞేయం మధురం చామ్లమేవ చ, త్రిదోషఘ్నం తు మధురం అమ్లం వాతకఫాపహం" ఈవాక్యముచేత తీయదానిమ్మ త్రిదోషహరమనియు, పుల్లదానిమ్మ వాతకఫహరమనియు తెలిసెడి. వాగ్భటాచార్యు లును ఇట్లు చెప్పిరి.—"ఉద్రిక్తపిత్తాఞ్జయతి త్రీన్ దోషాన్ స్వాదుదాడిమం,పిత్తా విరోధి నాత్యుష్ణం అమ్లం వాతకఫాపహం, సర్వంహృద్యం లఘు స్నిగ్ధం గ్రాహి రోచన దీపనం" వీనికన్నిటికిని సమరసముగ పైని వివరింపబడినది.

## చింతపండుగుణము.

మూ. వృక్షామ్లం గ్రాహి రూక్షోష్ణం వాతశ్లేష్మణి శస్యతే. ౧౭౯
అమ్లికాయాః ఫలం పక్వం తస్మాదల్పాన్తరం గుణైః,

వ్యా. చింతపండు మలమూత్రాదుల బంధించును. రూక్షోష్ణగుణములు కల్గినది. వాతకఫరోగములయందు ప్రశస్తము (వాతకఫహరమనుట) అమ్లికాఫలము (కొండ చింతపండు) వృక్షామ్లమునకన్న గుణములచేత కొంచెము భేదము కల్గియుండును.

"వృక్షామ్లం గ్రాహి రూక్షోష్ణం లఘు రోచనదీపనం" అని యష్టాంగసంగ్రహ మున నున్నది. ఈవాక్యముచేత రుచికరంబును అగ్నిదీపనంబును నగునని తెలిసెడి.

### అమ్లవేతసగుణము.

మూ. గుణైస్తైరేవ సంయుక్తం భేదనం త్వమ్లవేతసం. ౧౫౦

వ్యా. అమ్లవేతసము చింతపండుకు చెప్పినగుణములు కల్గియుండును. మలమును భేదించును.

### మాదీఫలములగుణము.

మూ. శూలేఽరుచౌ విబన్ధే చ మన్దేఽగ్నౌ మద్యవిప్లవే,
హిక్కాకాసే చ శ్వాసే చ వమ్యాం వర్చోగదేషు చ. ౧౫౧
వాతశ్లేష్మసముత్థేషు సర్వేష్వేతేషు దిష్యతే,
కేసరం మాతులుఙ్గస్య లఘు శేషమతోఽన్యథా. ౧౫౨

వ్యా. మాదీఫలములలోని కేసరములు (గిజరు) శూలరోగమునందును, అరుచియందును, మలబంధమునందును, అగ్నిమందగించినప్పుడును, అధికముగ మద్యపానముచే గల్గినరోగముల (మదాత్యయము) యందును, ఎక్కిళ్లయందును, శ్వాసకాసములయందును, వమనవ్యాధియందును, పురీషమునకు సంబంధించిన రోగములయందును, వాతకఫములచేగల్గిన రోగములయందును, (వీనియన్నింటియందును) చాల ప్రశస్తము (ఈ వ్యాధులనన్నింటిని హరించుననుట). ఇయ్యది తేలికగ జీర్ణమగును. లోపలికేసరములు తక్క తక్కిన పైతోలుమున్నగునవి పైజెప్పిన కేసరములకన్న విపరీతములైనగుణములు (గురుత్వంబును శూలాదుల కహితంబులునగు గుణములు) కల్గియుండును.

### కర్చ్బురఫలగుణము.

మూ. రోచనో దీపనో హృద్యః సుగన్ధిస్త్వగ్వివర్జితః,
కర్చ్బురః కఫవాతఘ్నః శ్వాసహిక్కార్శసాం హితః. ౧౫౩

వ్యా. కర్చ్బురమనుఫలము చర్మముదక్క తక్కినది రుచిని బుట్టించును. అగ్నిని దీపింపజేయును. హృదయమునకు చాలమంచిది. కఫవాతముల హరించును. శ్వాసరోగమునందును ఎక్కిళ్లయందును అర్శోరోగమునందును మిక్కిలి హితకరము. (ఇది స్వనామఖ్యాతఫలవిశేషము).

### నారింజపండుగుణము.

మూ. మధురం కిఞ్చిదమ్లం చ హృద్యం భక్తప్రరోచనం,
దుర్జరం వాతశమనం నాగరఙ్గఫలం గురు. ౧౫౪

(సుగన్ధిమధురం సామ్లం విశదం భక్తరోచనం,
గురువాతప్రశమనం విద్యాన్నారఙ్గజం ఫలం).

వ్యా. (నారింజపండు కొంచెము పులుపుకల్గిన తీపిగనుండును. గురుత్వముకల్గినది. హృదయమునకు చాలమంచిది. ఆహారమున రుచిపుట్టించును. కష్టముగ జీర్ణమగును. వాతమును హరించును. మంచిపరిమళముకల్గి విశదగుణముగనుండును).

బాదము పప్పుమున్నగువానిగుణములు.

మూ. వాతమాభిషుకాక్షోట మకూలకనికోచకాః (నికోటకాః),
గుర్వూష్ణస్నిగ్ధమధురాః సోరుమాణా బలప్రదాః. ౧౫౫
వాతఘ్నాః బృంహణాః వృష్యాః కఫపిత్తాభివర్ధనాః,

వ్యా. వాతామము (బాదంపప్పు), అభిషుక (పిస్తాపప్పు), అక్షోట (అక్రోడుపప్పు), మకూలకము (అక్రోడులోభేదము), నికోచకము (స్వనామఖ్యాతము), ఉరుమాణము, అనునవియన్నియు గురు-ఉష్ణ-స్నిగ్ధ-గుణంబులును, మధురరసంబునుకల్గినవి. శరీరబలమును కల్గించును. వాతమును హరించును. శరీరమును బలియజేయును. శుక్రమును వృద్ధినందించును. కఫపిత్తములను వృద్ధినొందించును. (వాతామయనునది బాతామయనియు చెప్పబడును. ఇవియన్నియు నుత్తరదేశమున హిమాలయప్రాంతమున సుప్రసిద్ధములని వ్యాఖ్యాతలు చెప్పిరి.)

చారపప్పుగుణము.

మూ. పియాలమేషాం సదృశం విద్యాదౌష్ణ్యం వినా గుణైః. ౧౫౬

వ్యా. చారపప్పు పైజెప్పినవానిగుణములలో నుష్ణగుణమొకటిదక్క తక్కిన గుణములన్నియు కల్గియుండును.

విరిగిపండుగుణము.

మూ. శ్లేష్మలం మధురం శీతం శ్లేష్మాతకఫలం గురు,

వ్యా. విరిగిపండు మధురంబును శీతవీర్యంబును గురుత్వమును కల్గించునదియు నగును.

ఊడుగపండుగుణము.

మూ శ్లేష్మలం గురు విష్టమ్భి చాంకోటఫలమగ్నిజిత్. ౧౫౭

వ్యా. ఊడుగపండు కఫమును వృద్ధిచేయును. గురుత్వము జేయును. మలమును బంధించును. జఠరాగ్నిని చెరచును.

### శమీ-కారంజఫలములగుణములు.

మూ. గుర్వూష్ణమధురం శీతం కేశఘ్నం చ శమీ ఫలం,
విష్టమ్భయతి కారఞ్జం వాతశ్లేష్మావిరోధి చ.                    ౧౫౮

వ్యా. జమ్మిపండు గురు-ఉష్ణమధురముగ నుండును. శీతవీర్యము. వెండ్రుకలకు చెరుపుజేయును. కరంజఫలము మలమును బంధించును. వాతకఫరోగములయం దనుకూలముగ నుండును.

### ఆమ్రాతకాదిఫలగుణములు.

మూ. ఆమ్రాతకం దన్తశఠం అమ్లం సకరమర్దకం,
రక్తపిత్తహరం విద్యా ద్దైరావతకమేవ చ.                    ౧౫౯

వ్యా. అంబాళము, నిమ్మపండు, కలివిపండు, నారదబ్బపండు, ఇవి పులుపుకల్గినవి. రక్తపిత్తమును హరించును.

### వార్తాకాదిఫలగుణములు.

మూ. వాతఘ్నం దీపనం చైవ వార్తాకం కటు తిక్తకం,
వాతలం కఫపిత్తఘ్నం విద్యాత్పర్పటకీఫలం.                    ౧౬౦
పిత్తశ్లేష్మఘ్నమమ్లం చ వాతలం చాక్షికీఫలం,
మధురాణ్యనుపాకీని వాతపిత్తహరాణి చ.                    ౧౬౧

వ్యా. వార్తాకఫలము (వంగపండు) కటుతిక్తరసములు (వగరుచేదును) కల్గియుండును. వాతమును హరించును. అగ్నిని దీపింపజేయును. పర్పటకీఫలము వాతమును కల్గించును. కఫపిత్తముల హరించును. అక్షికీఫలము పిత్తకఫముల హరించును. పులుపుకల్గియుండును. వాతమును వృద్ధిపొందించును. అనుపాకియనుఫలములు తీపికల్గినవి. వాతపిత్తముల హరించును.

["వార్తాకమనునది గోష్ఠవార్తాకమనియు చెప్పబడును. దీనిని దక్షిణదేశమున పండుగనే తిందురు. లేక పక్వముచేయక పండుగనే యుంపయోగింపదగిన ఫలవిశేషము. ఆక్షీకియను తీగెలోపుట్టినది ఆక్షికఫలము. అనుపాకియనునది అను యను అనుఫలవిశేషము" ఈవివరణము చక్రదత్తవ్యాఖ్యానమున నున్నది.]

మూ. అశ్వత్థోదుమ్బరప్లక్షన్యగ్రోధానాం ఫలాని చ,
కషాయమధురామ్లాని వాతలాని గురూణి చ.                    ౧౬౨

వ్యా. రావి, అత్తి, జువ్వి, మఱ్ఱి, వీనిపండ్లు వగరును తీపియుం కొంచెము పులుపును కల్గియుండును. గురుత్వమును వాతమును జేయును.

జీడిగింజలు-పండు వీనిగుణము.

మూ. భల్లాతకాస్థ్యగ్నిసమం త్వఙ్మాంసం స్వాదు శీతలం,

వ్యా. జీడిగింజలు నిప్పువలె తగిలినచోట పుండును జేయును. దానితోలును గిజరును తీపిగ నుండును. చలువజేయును.

మూ. పఞ్చమః ఫలవర్గోఽయం ఉక్తః ప్రాయోపయోగికః. ౧౬౩

ఇతి ఫలవర్గః.

---

వ్యా. ఇత్తెరంగున ప్రాయికముగ నుపయోగింపదగిన ఫలములవర్గము ఆయిదవది చెప్పబడినది.

ఇది ఫలవర్గము.

---

## (౬) హారితవర్గము.

హారితములన ఊరుగాయలు మున్నగునవి. అయ్యవి ఫలములవలె నగ్నిపక్వము జేయక పచ్చిగనే భోజనసమయమున ముందును వెనుకను నుపయోగింపదగియుండును. కావున ఫలవర్గమును జెప్పినపిదప జెప్పబడును. మరియు ఫలములు తృప్తిని కల్గించును. ఇయ్యవి తృప్తిని కల్గింపక వానిగుణమును మాత్రము జూపును. కావున ఫలముల ముందు నిరూపించి పిమ్మట చెప్పబడెను.

అల్లపుగుణము.

అథ హారితవర్గః.—

మూ. రోచనం దీపనం వృష్యం ఆర్ద్రకం విశ్వభేషజం,
వాతశ్లేష్మవిబన్ధేషు రసస్తస్యోపదిశ్యతే. ౧౬౪

వ్యా. పచ్చియల్లము రుచిని పుట్టించును. అగ్నిని దీపింపజేయును. శుక్రమును వృద్ధినందించును. దానిరసమును వాతకఫములయందును మలబంధమునందును ఉపయోగింపదగును.

## నిమ్మకాయగుణము.

మూ. రోచనో దీపన స్తీక్ష్ణః సుగన్ధిర్ముఖశోధనః,
జమ్బీరః కఫవాతఘ్నః క్రిమిఘ్నో భుక్తపాచనః.    ౧౬౫

వ్యా. మంచినిమ్మపండు రుచిని పుట్టించును. ఆకలికల్గించును. తీక్ష్ణముగ నుండును. పరిమళముకల్గినది. దోషముల శుభ్రముగ జేయును. కఫవాతములను హరించును. క్రిముల హరించును. భుజింపబడిన యాహారమును పచింపజేయును.

## ముల్లంగిగుణము.

మూ. బాలం దోషహరం, వృద్ధం త్రిదోషం, మారుతాపహం,
స్నిగ్ధసిద్ధం, విశుష్కం తు మూలకం కఫవాతజిత్.    ౧౬౬

వ్యా. లేతముల్లంగి దోషహరము. అయ్యది ముదిరి రసపూర్ణమైనది త్రిదోషముల వృద్ధినందించును. నెయ్యి మున్నగుస్నేహముల జేర్చి సిద్ధముచేయబడినది వాతహారము. ద్రవములేక యెండివరుగైనది కఫవాతముల హరించును. (అగ్ర్యాధికారమున "మూలకం కన్దానామపథ్యతమే ప్రకృష్టతమం" అని చెప్పినది ముదిరినముల్లంగి నుద్దేశించి యని యెరుంగునది.)

మరియుం 'బాలం' అన రసపూర్ణముగాక అవ్యక్తరసముగ నుండునది త్రిదోషహారమని యర్థము. ఈయర్థమునే తంత్రాంతరమున నిట్లు చెప్పిరి.—"యావద్ధి చావ్యక్త రసాన్వితాని నవప్రరూఢాని చ మూలకాని, భవన్తి తావల్లఘు దీపనాని పిత్తానిలశ్లేష్మ హరాణి చైవ" ముల్లంగి మొలచి లేతవిగ నున్నను, కొంచెము ముదిరి రసము స్ఫుటముగ దెలియని యవస్థయందున్నను, అయ్యది చులకనగ జీర్ణమై యగ్నిని దీపింపజేసి త్రిదోషముల శమింపజేయును. అని యర్థము.

మరియుం "శుష్కాణి కఫవాతఘ్నాన్యేతాన్యేషాం ఫలాని చ" అని వర్గాంతమున జెప్పిన వాక్యముచేత ఎండినవి కఫవాతహారములని తెలియుచున్నను ఇవి విశేషముగ కఫవాతహారము లగునని తెలియుటకై యిచ్చట "మూలకం కఫవాతజిత్" అని చెప్పబడెను.

## తులసి (గగ్గెర) గుణము.

మూ. హిక్కాకాసవిషశ్వాసపార్శ్వశూలవినాశనః,
పిత్తకృత్ కఫవాతఘ్నః సురసః పూతిగన్ధహా.    ౧౬౭

వ్యా. నల్లతులసి ఎక్కిళ్లను దగ్గును శ్వాసమును విషమును పార్శ్వశూలమును (ప్రక్కనొప్పిని) హరించును. పిత్తమును చేయును. కఫవాతముల హరించును. ఆహార పదార్థములయొక్కయుం శరీరముయొక్కయుం దుర్గంధమును పోగొట్టును.

యవాన్యాదిగుణము.

మూ. యవానీ చార్జకశ్చైవ శిగ్రు శాలేయమృష్టకం,
హృద్యాన్యాస్వాదనీయాని పిత్తముత్క్లేశయన్తి చ. ౧౬౮

వ్యా. యవాని (అజమోదము, ఓమము), నల్లగగ్గెర, మునగ, శాలేయము, మృష్టకము (నల్లనియావాలు), ఇవి మనోహరములై రుచ్యములుగ నుండును. పిత్తమును రేపెట్టును.

["శిగ్రువిటపం - శోభాఞ్జనం; శాలేయః - చాణక్యమూలం; మరౌ ప్రసిద్ధం; 'చాణక్యమూలవిస్తేయే శాలేయాభిఖ్యయా జగుః' మృష్టకం రాజికా" అని చక్రపాణివ్యాఖ్యానమున నున్నవి. ఈద్రవ్యముల కింతకన్న నాధార మగపడలేదు.]

గండీరాదిగుణము.

మూ. గణ్డీరో జలపిప్పల్యః తుమ్బురుః శృఙ్గబేరికా,
తీక్ష్ణోష్ణకటురూక్షాణి కఫవాతహరాణి చ. ౧౬౯

వ్యా. గండీరము (ఎఱ్ఱని గురుజకూర), నీరుపిప్పలి, తుంబురు (కొతిమిరినిబోలినది), శృంగబేరము (ఇది అల్లమును బోలినది) ఇవి తీక్ష్ణ - ఉష్ణ - రూక్షగుణంబులును, కటురసంబును కల్గియుండును. కఫవాతముల హరించును.

గండీరమన గురుజఅను శాకవిశేషము. ఇయ్యది తెల్లగను, ఎఱ్ఱగను రెండువిధములనుండును. తెల్లనిది నీటిలోబుట్టును. అయ్యది శాకవర్గమున జెప్పబడినది. ఎఱ్ఱనిది తీక్ష్ణోష్ణాదిగుణముల కల్గియుండునని యిచ్చట హరితవర్గమున జెప్పబడినది.

తుమ్బురు, శృంగబేరములు గ్రంథాంతరమున నిట్లు చెప్పబడినది:—"శృఙ్గబేరవదాకృత్యా శృఙ్గబేరీతి భాషితా, కుస్తుమ్బురుసమాకృత్యా తుమ్బురూణి వదన్తి చ" దీనియర్థము పైని చెప్పబడినది.

గంధతృణము, నల్లజీలకర, వీనిగుణములు.

మూ. పుంస్త్వఘ్నః కటురూక్షోష్ణః భూస్తృణో వక్త్రశోధనః,
ఖరాశ్వా కఫవాతఘ్నీ వస్తిరోగరుజాపహా. ౧౭౦

వ్యా. భూస్తృణము (గంధతృణము, కామంచిగడ్డి), కటురసంబును రూక్ష - ఉష్ణగుణంబులును కల్గియుండును. పుంస్త్వమును హరించును. నోటిని శుభ్రపరచును. నల్లజీలకర కఫవాతముల హరించును. వస్తి (మూత్రపుతిత్తిలోని) రోగములను, నొప్పులను హరించును.

ధాన్యకాదిగుణము.

మూ. ధాన్యకం చాజగన్ధా చ సుముఖా శ్చేతి రోచనాః,
సుగన్ధాః నాతికటుకాః దోషానుత్క్లేశయన్తి చ.　　౧౭౧

వ్యా. కొతిమిరి, వాయింట, తెల్లగగ్గెర, ఇవి రుచిని బుట్టించును. మంచివాసన కల్గినవి. కొంచెముగ కారముకల్గియుండును. దోషముల రేపెట్టును. ఇచ్చట ధాన్యకాదులకు పచ్చిగనుండువానికే గుణములు చెప్పబడినవి. ఆహారయోగిగణమున నెండినవాని గుణములు చెప్పబడును.

గృంజనగుణము.

మూ. గ్రాహీ గృంజనక స్తీక్ష్ణః వాతశ్లేష్మార్శసాం హితః,
స్వేదనేఽభ్యవహార్యే చ యోజయే త్తమపిత్తినాం.　　౧౭౨

వ్యా. గృంజనము స్వల్పముగ కాడలును ఆకులును కలనీరుల్లి మలములబంధించును. తీక్ష్ణగుణము కల్గినది. వాతమునందును కఫమునందును అర్శోరోగమునందును హితకరము. దీనిని పిత్తప్రకోపము లేనివారికి స్వేదనమునకును భుజించుటకును ఉపయోగింపదగును.

నీరుల్లిగుణము.

మూ. శ్లేష్మలో మారుతఘ్నశ్చ పలాణ్డుర్న చ పిత్తనుత్,
ఆహారయోగీ బల్యశ్చ గురుర్వృష్యోఽథ రోచనః.　　౧౭౩

వ్యా. నీరుల్లిదుంపలు కఫమును వృద్ధిచేయును. వాతమును హరించును. పిత్తమును శమింపజాలదు. (వృద్ధిని చేయదనుట). ఆహారపదార్థములకు యుక్తముగ (రుచిని పుట్టించునదిగ) నుండును. బలకరము. గురుత్వముకల్గినది. శుక్రమును వృద్ధినొందించును. రుచిని పుట్టించును.

వెల్లుల్లిగుణము.

మూ. క్రిమికుష్ఠకిలాసఘ్నః వాతఘ్నో గుల్మనాశనః,
స్నిగ్ధశ్చోష్ణశ్చ వృష్యశ్చ లశునః కటుకో గురుః.　　౧౭౪

వ్యా. వెల్లుల్లిపాయలు క్రిములను, కుష్ఠములను, కిలాసము (సిబ్బెము)ను, వాత రోగములను, గుల్మరోగమును హరించును. స్నిగ్ధ - ఉష్ణగుణములు కల్గియుండును. వృష్యము కటురసముకల్గినది. గురుత్వముకల్గినది.

శుష్కహారితవర్గగుణములు.

మూ. శుష్కాణి కఫవాతఘ్నాన్యేతాన్యేషాం ఫలాని చ,
హారితానామయం చైషాం షష్ఠో వర్గస్సమాప్యతే. ౧౭౫

ఇతి హారితవర్గః.

వ్యా. ఈహారితవర్గమున జెప్పబడినవియు వీనిఫలములును ఎండినవిగా నున్న యెడ నయ్యది కఫవాతములను హరించును. ఇత్తెరంగున హారితములుగ (పచ్చిగ) నుప యోగింపదగిన శాకద్రవ్యములవర్గ మనునది యారవవర్గము సమాప్తిచేయబడినది.

ఇది హారితవర్గము.

## (౭) మద్య వర్గము

అన్నమును అందుకుసంబంధించిన శాకాదులను జెప్పినపిదప ద్రవరూపమై త్రాగ నుపయోగింపదగిన ద్రవద్రవ్యము లుపదేశింపబడును. అందును పానీయమైనజలమును జెప్పవలసియున్నను మనస్సున కుల్లాసము హర్షము మున్నగు మనోవికాసముల గల్గిం చుటవలన మద్యము ప్రధానమని తలచి మద్యవర్గము తొలుత జెప్పబడును:—

మద్యసామాన్యగుణములు.

మూ. అథ మద్యవర్గః—

ప్రకృత్యా మద్యమమ్లోష్ణం అమ్లం చోక్తం విపాకతః,
సర్వం సామాన్యతః తస్య విశేష ఉపదేక్ష్యతే. ౧౭౬

వ్యా. మద్యము సామాన్యముగ స్వభావముచేతనే రసవిపాకములచే నమ్లంబును ఉష్ణవీర్యంబును నగును. ఇది సర్వవిధమద్యములకు సామాన్యమైనగుణము. అట్టి మద్యమ నకు సంబంధించినవిశేషములు ఈక్రింద నుపదేశింపబడును.

మద్యమున పులుపు స్ఫుటముగ దెలియకున్నను పండ్లు పులుపెక్కుట, నోట జొల్లుకారుట మున్నగు నమ్లరసకృత్యములను ప్రభావవిశేషముచే గల్గించుటంజేసి యమ్ల రసముగ జెప్పబడినది. ఈయభిప్రాయముచేతనే "సర్వేషా మమ్లజాతానాం ఉపర్యుపః వర్తతే" అని యమ్లజాతిలో ప్రధానముగ జేర్కొనబడియె.

### సుర, మదిరయను మద్యములగుణములు.

మూ. కృశానాం సక్తమూత్రాణాం గ్రహణ్యర్శోవికారిణాం,
సురా ప్రశస్తా వాతఘ్నీ స్తన్యరక్తక్షయేషు చ. ౧౭౭
హిక్కాశ్వాసప్రతిశ్యాయకాసవర్చోగ్రహారుచౌ,
వమ్యానాహవిబన్ధేషు వాతఘ్నీ మదిరా హితా ౧౭౮

వ్యా. సురయనుమద్యము కృశించినవారికిని, మూత్రము అడ్డుపడియుండువారికిని, గ్రహణీరోగముచే బాధింపబడువారికిని, అర్శోరోగముచే పీడింపబడినవారికిని, స్తన్యంబును రక్తంబును క్షీణించినవారికిని మిగుల ప్రశస్తము. వాతమును హరించును.

మదిరయనుమద్యము ఎక్కిళ్లు, శ్వాసము, ప్రతిశ్యాయము (పీనసము), దగ్గు, మలబద్ధకము, అరుచి, వాంతి, కడుపుబ్బరము, కడుపు బిగబట్టియుండుట, ఈవ్యాధుల యందు మిక్కిలి హితకరము. ఇది వాతహారము.

### జగలగుణము.

మూ. శూలప్రవాహికాటోపకఫవాతార్శసాం హితః,
జగలో గ్రాహీ రూక్షోష్ణః శోథఘ్నో భక్తపాచనః ౧౭౯

వ్యా. మద్యమునకుగా జేర్పబడిన పిండి మున్నగువాని ముద్ద జగలము. దాన గల్గిన మద్యము శూలరోగము, ప్రవహిత, ఆటోపము (కడుపులో గడబిడశబ్దము) కఫవాతరోగములు, అర్శోరోగము అను నీవ్యాధులయందు హితకరము. మలమును గట్టిపరచును. రూక్ష-ఉష్ణగుణములు కల్గినది. శోఫరోగమును హరించును. భుజింపబడిన యన్నమును పచింపజేయును.

### అరిష్టగుణము.

మూ. శోఫార్శోగ్రహణీదోషపాణ్డురోగారుచిజ్వరాన్,
హన్త్యరిష్టః కఫకృతాన్ రోగాన్ రోచన (పాచన) దీపనః.

వ్యా. (కషాయము కాచి దానిచే సిద్ధముచేయబడిన మద్యము అరిష్టము.) అయ్యది శోఫమును (వాపును), అర్శోరోగమును, గ్రహణీదోషమును, పాండురోగమును, అరుచిని, జ్వరమును హరించును. కఫముచే గల్గిన యితరరోగములను కూడ హరించును. ఆహారమును పచింపజేయును. ఆకలి బుట్టించును.

### శర్కరామద్యగుణము.

మూ. ముఖప్రియస్సుఖమదః సుగన్ధిర్వస్తిరోగనుత్ (దోషనుత్),
జరణీయః పరిణతో హృద్యో వర్ణ్యశ్చ శార్కరః ౧౮౧

వ్యా. (చక్కెరను ప్రధానముగజేసి సిద్ధము చేయబడిన మద్యము శార్కరము.) అయ్యది నోటికింపుగను సుఖముగ మదమును కల్గించునదియుంనగును. మంచివాసనకల్గినది. వస్తిగాని (మూత్రపుతిత్తిలోని) రోగములను పోగొట్టును. భుజింపబడినయాహారమును జీర్ణింపజేయును. అయ్యది మిక్కిలి ప్రాతదియగునెడ హృదయమునకు హితకారియు, శరీరవర్ణకరంబుచు నగును.

## పక్వరసమద్యగుణము.

మూ. రోచనో దీపనో హృద్యః శోషశోఫార్శసాం హితః,
స్నేహశ్లేష్మవికారఘ్నః వర్ణ్యః పక్వరసో మతః ౧౮౨

వ్యా. (పక్వమైన (కాచబడిన) చెరకురసముచే సిద్ధము చేయబడిన మద్యము పక్వరస మనబడును) అయ్యది రుచిని పుట్టించును. జఠరాగ్నిని ప్రజ్వలింపజేయును మనోహారముగ (హృదయమున కనుకూలముగ) నుండును. ధాతుక్షయమునందును శోఫ రోగమునందును అర్శోరోగమునందును హితకరముగ నుండును. స్నేహముల (చమురుల) చేతను కఫముచేతను కల్గినరోగముల హరించును శరీరమునకు వర్ణోత్కర్షమున కల్గించును.

## శీతరసమద్యగుణము.

మూ జరణీయో విబన్ధఘ్నః స్వరవర్ణవిశోధనః,
లేఖనః శీతరసికః హితశ్శోఫోదరార్శసాం ౧౮౩

వ్యా. (కాచక చల్లగనుండు చెరకురసముచే సిద్ధమైన మద్యము శీతరసిక మ బడును.) ఇయ్యది యాహారమును జీర్ణింపజేయును. మలబద్ధకము పోగొట్టును. కంఠస్వ మును శరీరవర్ణముచు శుభ్రపరచును. దోషముల లేఖనము చేయును. శోఫమునందున ఉదర (మహోదర) రోగమునందును అర్శోరోగమునందు హితకరము.

ఇచ్చట "శీధురిక్షురసైః పక్వైః అపక్వైరాసవో భవేత్" అను తంత్రాంత వచనముచేత పక్వరసమునకు శీధువనియు, శీతరసమునకు ఆసవమనియు నామాంతరవ నెరుంగునది.

## గౌడమద్యగుణము.

మూ. సృష్టభిన్నశకృద్వాతః గౌడః తర్పణదీపనః,

వ్యా. (బెల్లమును ముఖ్యద్రవ్యముగ జేసి సిద్ధము చేయబడిన మద్యము గౌడమ అయ్యది పురీషమును అపానవాతము భేదించి బైట వెడలించును. తృప్తినొందించు అగ్నిని దీపింపజేయును.

## తాంత్రకాయలమద్యగుణము.

మూ. పాణ్డురోగవ్రణహితా దీపనీ చాత్రికీ మతా. ౧౮౪

వ్యా. తాంత్రకాయను ప్రకృతిగజేసి సిద్ధముచేయబడిన మద్యము పాండురోగమునందును వ్రణములయందును చాల హితకరము. అగ్నిని దీపింపజేయును.

## సురాసవగుణము.

మూ. సురాసవస్తీవ్రమదః వాతఘ్నో వదనప్రియః,

వ్యా. (సురయను మద్యమును ద్రవద్రవ్యముగ జేర్చి సిద్ధముచేయబడినది సురాసవము.) ఇయ్యది తీవ్రమైనమత్తును కల్గించును. వాతహరము. నోటి కింపైయుండును.

## మధ్వాసవ, మైరేయములగుణములు.

మూ. ఛేదీ మధ్వాసవః తీక్ష్ణః మైరేయో మధురో గురుః. ౧౮౫

వ్యా. (ఇప్పపువ్వులచేత చేయబడిన యాసవము మధ్వాసవము.) ఇయ్యది మలమును విడదీయుచు తీక్ష్ణముగ నుండును. మైరేయమను ఆసవము మధురముగను గురుత్వము కల్గియుండును.

మైరేయలక్షణము తంత్రాంతరమున నిట్లున్నది—"ఆసవస్య సురాయాశ్చ ద్వయోరేకత్ర భాజనే, సన్ధానం తద్విజానీయాత్ మైరేయ ముభయాత్మకం" ఆసవమును సురను ఒకపాత్రముననే సంధానము చేసినయెడ ఆరెండిటి మిశ్రముగనుండు మద్యము మైరేయ మనబడునని యర్థము. మరియు "మైరేయం ధాతకీపుష్ప గుడధాన్యామ్ల సంయుతం" అని మైరేయలక్షణము గ్రంథాంతరమున కానంబడియెడు.

## ధాతక్యాదిమద్యగుణములు.

మూ. ధాతక్యభిషుతో హృద్యో (జీర్ణో) రూక్షో రోచన దీపనః,
మాధ్వీకవన్న చాత్యుష్ణః మృద్వీకేక్షురసాత్మకః. ౧౮౬

వ్యా. ఆరెపువ్వుల జేర్చి సంధానముచేయబడిన యాసవము హృద్యమగును. రూక్షంబును, రుచికరంబును, అగ్నిదీపనంబును నగును. ద్రాక్షపండ్లను చెరకురసమును (ఈరెంటిని) కలిపి సిద్ధము చేయబడిన యాసవము క్రింద చెప్పబడు మాధ్వీకాసవగుణములు కల్గియుండును. కొంచెముగ వేడిచేయును.

## మాధ్వీకాసవగుణము.

మూ. రోచనం దీపనం హృద్యం బల్యం పిత్తావిరోధి చ,
విబన్ధఘ్నం కఫఘ్నం చ మధు లఘ్వల్పమారుతం. ౧౮౭

వ్యా. (తేనెను ప్రధానముగ జేసి సిద్ధముచేయబడిన యాసవము మధు అని చెప్ప బడును.) ఇయ్యది రుచిని బుట్టించును. అగ్నిని దీపింపజేయును. హృదయమునకు హిత కరము. బలమునుకల్గించును. పిత్తమునకు విరోధముచేయదు మలబంధమును పోగొట్టును. కఫమును హరించును. తేలికగ జీర్ణమగును. కొంచెముగ వాతమును కల్గించును.

(ఈ మద్యమును మార్ద్వీక మనియు చెప్పెదరు. "మధుమార్ద్వీకమద్యయోః" అని అమరకోశమున నున్నది. ద్రాక్షపండ్లరసముచే సిద్ధము చేయబడిన యాసవము మార్ద్వీక మని యీపదముచే దెలిసెడి.)

## యవలచేసైన సురాగుణము.

మూ. సురా సమణ్డా రూక్షోష్ణా యవానాం వాతపిత్తలా,
గుర్వీ జీర్యతి విష్టభ్య శ్లేష్మలస్తు మధూలకః ౧౭౭

వ్యా. యవలబియ్యపు తేటయైన మద్యముచేత సిద్ధమైనసుర రూక్షంబును ఉష్ణం బును నగును. వాతపిత్తముల కల్గించును. గురుత్వము కల్గినది. మలమును బంధించి జీర్ణ మగును. అడవి గోధుమలచే చేయబడిన సుర కఫమును వృద్ధిచేయును.

## సౌవీరక, తుషోదకగుణములు.

మూ. దీపనం జరణీయం చ హృత్పాణ్డుక్రిమిరోగనుత్,
గ్రహణ్యర్శోహితం భేది సౌవీరకతుషోదకం. ౧౭౮

వ్యా. (పొట్టులేని యవలబియ్యముచే చేయబడిన కాంజికము సౌవీరకము పొట్టుతో కూడిన యవలచే చేయబడిన కాంజికము తుషోదకము) ఈరెండును అగ్నిని దీపింపజేయును. ఆహారమును జీర్ణింపజేయును. హృదయరోగమును, పాండురోగమును క్రిమిరోగమును మాన్పును. గ్రహణిదోషమునందును, అర్శోరోగమునందును హిత కరము. మలముల భేదించును.

## అమ్లకాంజికగుణము.

మూ. దాహజ్వరాపహం స్పర్శాత్ పానాద్వాతకఫాపహం,
విబన్ధఘ్నమవిస్రంసి దీపనం చామ్లకాఞ్జికం ౧౭౯

వ్యా. అమ్లకాంజికము (పులిసినగంజి) శరీరస్పర్శముచేత తాపమును జ్వరమును హరించును. త్రాగినచో వాతకఫముల హరించును. మలబంధమును సడలించును. కా ల్పైట వెడలింపదు. అగ్నిని దీపింపజేయును.

—● నవీన-పురాణమద్యములగుణములు. ●—

మూ. ప్రాయశోఽభినవం మద్యం గురుదోషసమీరణం,
స్రోతసాం శోధనం జీర్ణం దీపనం లఘు రోచనం. ౧౯౧

వ్యా. పైజెప్పబడిన మద్యములలో క్రొత్తది యగుమద్యము ప్రాయికముగ గురుత్వము కల్గినదియు దోషముల ప్రేరేపించునదియు నగును. ప్రాతమద్యము స్రోతో రంధ్రముల శుభ్రపరుచును. అగ్నిని దీపింపజేయును. తేలికగ జీర్ణమగును. రుచిని పుట్టించును.

—● విధ్యుక్తముగ సేవింపబడిన మద్యసామాన్యగుణములు. ●—

మూ. హర్షణం ప్రీణనం బల్యం (మద్యం) భయశోకశ్రమాపహం,
ప్రాగల్భ్యవీర్యప్రతిభాతుష్టిపుష్టిబలప్రదం. ౧౯౨
సాత్వికై ర్విధివద్యుక్త్యా పీతం స్యాదమృతోపమం,

వ్యా. సాత్వికస్వభావము కలమనుజులు విధ్యుక్తప్రకారము మద్యమును త్రాగినచో నయ్యది హర్షమును (మనస్సు కుల్లాసమును) ప్రీతిని బలమును కల్గించును. భయమును దుఃఖమును శ్రమమును పోగొట్టును. వాచాలత్వమును కల్గించును. వీర్యమును వృద్ధినందించును. మనస్సుకు సమయోచితముగ నూహ కల్గించును. సంతసమును శరీర పుష్టిని కల్గించుచు అమృతమునుబోలె నన్నివిధముల సుఖప్రదమగును.

—● మద్యవర్గసమాప్తి. ●—

మూ. వర్గోఽయం సప్తమో మద్యమధికృత్య ప్రకీర్తితః ౧౯౩
ఇతి మద్యవర్గః

వ్యా. ఇత్తెరంగున మద్యముద్దేశించి చెప్పబడినవర్గము ఏడవది పూర్తి గావింపబడినది.

ఇది మద్యవర్గము సమాప్తము.

—● (౮) జలవర్గము. ●—

మద్యవర్గమును జెప్పినపిదప పానప్రధానమైన జలవర్గగుణములు చెప్పబడును.

—● జలభేదకారణము. ●—

అథజలవర్గః.—

మూ జలమేకవిధం సర్వం పతత్యైన్ద్రం నభస్తలాత్,
తత్పత (ఉత్పత) త్పతితం చైవ దేశకాలావపేక్షతే. ౧౯౪

వ్యా. సుశ్రుతమున ధార-కార-హైమ-తౌషారభేదములచే జెప్పబడిన జలభేదములన్నియుం నాకసమునుండి ప్రాణులయదృష్టవశమున నింద్రప్రేరితమై పుడమిం బడునవి కావున నేకవిధముగనే యుండును. అయినను నయ్యది యింద్రప్రేరితమై భూమికి దిగుసమయమునను భూమిపయిం బడిన పిమ్మటను దేశకాలముల నపేక్షించి యవాంతరభేదములు కల్గియుండును.

మనయదృష్టమునంజేసి యింద్రునిచే ప్రేరితంబైనజలము భూమికి దిగజారునప్పుడు ఆకాశరూపమైన దేశముయొక్కయు, శీతోష్ణాదిరూపమైన కాలవిశేషముయొక్కయుం సంబంధమునంజేసి గుణభేదము కల్గియుండును. భూమిపై బడినపిమ్మటను శ్వేతాదిభూమిసంబంధముచేతను, శీతోష్ణాదికాలసంబంధముచేతను గుణవిశేషముల గల్గియుండును. అట్టి దేశకాలసంబంధముచే సంక్రమించిన గుణవిశేషములంబట్టి జలమునకు భేదము లేర్పడును కాని అయ్యది స్వభావముచే నేకరూపముగనే యుండునని భావము.

జలమునకు దేశకాలములసంబంధము.

మూ॥ ఖాత్పతత్సోమవాయ్వర్కైః స్పృష్టం కాలానువర్తిభిః,
శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైః యథాసన్నం మహీగుణైః ౧౯౫

వ్యా. ఆకసమునుండి క్రిందికి దిగజారుచున్న వర్షోదకము శీతోష్ణాదిరూపమైన కాలము ననుసరించియుండు చంద్రునిచేతను గాలిచేతను సూర్యునిచేతను స్పృశింపబడియుండును. (శీతోష్ణాదికాలము ననుసరించి ప్రవర్తించు సోమ-వాయు - సూర్యుల సంబంధము, ఆకసమునుండి దిగువకు వచ్చుచుండు జలమునకు అవశ్యము సంభవించును. అట్టి సంబంధవిశేషమునంజేసి జలమునకు గుణభేదములు కల్గుచుండును. అట్టి గుణభేదములంబట్టి వర్షజలమునకును భేదములుసంభవించునని భావము. ఇచ్చట "వాయ్వర్కైః" అనునది యుపలక్షణము కావున గాలిచే నెగురగొట్టబడిన ధూళియొక్కయు, మేఘములతోగూడి సంచరించు విషకీటాదులయొక్కయు స్పర్శమునంజేసి వర్షజలమునకు గుణభేదము కల్గునని యెరుంగునది. ఇదియే ఆకసమునుండి క్రిందపడుచుండు జలమునకు దేశకాలసంబంధ స్వరూపము).

మరియు పైజెప్పినరీతిగ నింద్రప్రేరితమై భూమిపయిం బడినజలము, శీతోష్ణాదికాలము ననుసరించి తత్తదనుగుణముగ భూమికి కల్గు శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్షాదిగుణములచే స్పృశింపబడును. కావున అట్టిదేశకాలసంబంధముచేత భూగతమైన జలమునందును గుణభేదములు కల్గుచుండును. (ఏకాలమున నేదేశమునం దెట్టిగుణములు కల్గియుండునో అట్టి భూమిసంబంధమునంజేసి భూగతజలమునకును గుణములు మారుచుండును. ఇదియే భూమిగతజలమునకును దేశకాలసంబంధము.)

అంతరిక్షజలమునకు విషజంతుకీటాదిసంబంధము ఇట్లు జతూకర్ణతంత్రమున జెప్పబడినది:—"వర్షాసు చరన్తి ఘనైస్సహోరగాః వియతి చ కీటలూతాశ్చ, యన్నిజుష్టమపేయం ఖజలమగస్త్యోదయాత్పూర్వం" వర్షాకాలమున మేఘములతోగూడ కీటములు సాలెపురుగులు సర్పములు మున్నగుజంతువులు సంచరించుచుండును కావున అట్టి వర్షజలము పానార్హము కాదు. ఆశ్వయుజమున అగస్త్యోదయముచేత అట్టివిషము హరించును కావున నగస్త్యోదయమైనపిమ్మట నంతరిక్షజలము నుపయోగింపదగునని యర్థము.

## దివ్యోదక (ఆకాశోదక) గుణములు.

మూ. శీతం శుచి శివం మృష్టం విమలం లఘు షడ్గుణం,
ప్రకృత్యా దివ్యముదకం, భ్రష్టం పాత్రమపేక్షతే ౧౯౬

వ్యా. చల్లదనము, పరిశుద్ధత, శుభకరత్వము, నోటి కింపుగనుండుట, మాలిన్యము లేకుండుట, తేలిక అను నీయారుగుణములును అంతరిక్షజలమునకు స్వాభావసిద్ధములు. అట్టిగుణములు కలజలము ఆకసమునుండి క్రిందికి దిగజారినది మున్నగు ఆయాస్థలవిశేష సంబంధమునుబట్టి విశేషగుణములు కల్గినదిగ మారుచుండును.

పైజెప్పిన "దేశకాలావపేక్షతే" అనువాక్యముచేతనే దేశవిశేషసంబంధముచే గుణములు విశేషముగ మారునని తెలియుచున్నను, జలమునకు గుణవిశేషములు కాలసంబంధమునకంటె నద్యాదిదేశసంబంధముచేత నధికముగ సంభవించునని తెలుపుటకై మరల "భ్రష్టం పాత్రమపేక్షతే" అని చెప్పబడెను.

## జలమునకు భూవిశేషమున గల్గుగుణవిశేషములు.

మూ. శ్వేతే కషాయం భవతి, పాణ్డరే చైవ తిక్తకం,
కపిలే క్షారసంసృష్టం, ఊషరే లవణాన్వితం,
(కపిలే కటుకం తోయం, ఊషరే లవణాన్వితం)
కటు పర్వతవిస్తారే, మధురం కృష్ణమృత్తికే. ౧౯౭
ఏతత్ షాడ్గుణ్యమాఖ్యాతం మహీస్థస్య జలస్య హి,

వ్యా. ఆకసమునుండి వర్షరూపముగ తెల్లనిభూమిపై బడినజలము (అట్టిభూమి సంబంధమునంజేసి) వగరుకల్గియుండును. పాండువర్ణమైన భూమియందలిజలము చేదుగ నుండును. (కొంచెము పసుపురంగుకలిసిన తెలుపు పాండువర్ణము) కపిలవర్ణము (పసుపు నలుపుకలిసిన) కలభూమియందలి జలము కారముగనుండును. చౌటినేలయందలి జలము

ఉప్పగనుండును. పర్వతప్రాంతమునందలి జలము కారముగ నుండును. నల్లనిమట్టికలభూమి యందలి జలము మధురముగ నుండును. ఇత్తెరంగున భూమియందలిజలము పైజెప్పిన విధముగ దేశభేదమునుబట్టి యారువిధములైన గుణములు కల్గియుండును.

ఐంద్ర-కార-హిమజలగుణము.

మూ. తథావ్యక్తరసం విద్యాదైన్ద్రం కారం హిమం చ యత్. ౧౯౮

వ్యా. ఐంద్రజలంబును (మేఘోదకము), కార (వడగండ్ల) జలంబును, హిమ (మంచు) జలంబును అవ్యక్తరసముగ (రుచివిశేషము తెలియనిదిగ) నుండును.

ఐంద్రజలము, దానియుత్కృష్టత.

మూ. యదన్తరిక్షాత్పతతీన్ద్రసృష్టం
చోక్తైశ్చ పాత్రైః పరిగృహ్యతేఽమ్బః,
తదైన్ద్రమిత్యేవ వదన్తి ధీరా
నరేన్ద్రపేయం సలిలం ప్రధానమ్. ౧౯౯

వ్యా. ఆకసమునందలి మేఘములనుూలమున నింద్రప్రేరితమై స్రవించువర్ష ధారలనుండి వెండి బంగరు మున్నగు శుభ్రమైనపాత్రములచే (భూమిపయిం బడనీయక నడుమనే) గ్రహింపబడినజలము ఐంద్ర మనబడును. ఈజలము తక్కినజలములకన్న ప్రధానమై రాజులకు పానయోగ్యమై యుండును.

వాగ్భటాచార్యులును "ఐన్ద్రమమ్బు సుపాత్రస్థం అవిపన్నం సదా పిబేత్" అని ఐంద్రజలమునకు ప్రాముఖ్యమును జెప్పిరి.

పానార్హజలము.

మూ. ఋతావృతావభిఖ్యాతాః సర్వ ఏవామ్భసో గుణాః.
ఈషత్కషాయమధురం సుసూక్ష్మం విశదం లఘు. ౨౦౦
అరూక్షమనభిష్యన్ది సర్వం పానీయముత్తమమ్,

వ్యా. వసన్తాదిఋతువులలో నాయాఋతుగుణముల ననుసరించి యుందకము యొక్కగుణంబులును మారుచుండును. మరియు ఎట్టిజలమైనను కొంచెము వగరును తీపియుంకల్గి మిక్కిలి సూక్ష్మమై విశదమై తేలికగనుండి రూక్షగుణము లేకయున్నచో నట్టిజలము యుత్తమమై పానార్హముగ నుండును.

వర్షర్తుజలగుణము.

మూ గుర్వభిష్యన్ది పానీయం వార్షికం మధురం నవమ్. ౨౦౧

వ్యా. వర్షర్తువునందలి వర్షోదకము భారముగ నుండును. జలుంబు చేయును. మధురముగ నుండును. క్రొత్తదియగును.

### శరత్కాలవర్ష జలగుణము.

మూ. తను లఘ్వనభిష్యన్ది ప్రాయశ్శరది వర్షతి,
తత్తు యే సుకుమారాస్స్యుః, స్నిగ్ధభూయిష్ఠభోజనాః. ౨౦౨
తేషాం భోజ్యే చ భక్ష్యే చ లేహ్యే పేయే చ శస్యతే,

వ్యా. శరత్కాలమునందలి వర్షోదకము సూక్ష్మమై తేలికగానుండును. ఈజలము జలుబుచేయదు. మిక్కిలి సుకుమారులును, నెయ్యి మున్నగు స్నిగ్ధపదార్థముల భుజించువారును, అధికముగ భుజించువారును, భక్ష్య - భోజ్య - లేహ్య - పేయరూపములైన యాహారములయందు పైజెప్పిన శరత్కాలమునందలి వర్షజలము నుపయోగించుట చాల ప్రశస్తము.

### హేమంత-శిశిరఋతువులజలగుణములు.

మూ. హేమన్తే సలిలం స్నిగ్ధం వృష్యం బలహితం గురు. ౨౦౩
కిఞ్చిత్తతో లఘుతరం శిశిరే కఫవాతజిత్,

వ్యా. హేమంతఋతువునందలి జలము స్నిగ్ధంబును వృష్యంబును బలకరంబును హితంబునగును. గురుత్వము కల్గియుండును. శిశిరఋతువునందలి జలము హైమన్తికజలమునకన్న కొంచెము తేలికగ నుండును. ఇయ్యది కఫవాతముల హరించును.

### వసంత-గ్రీష్మఋతువులజలగుణములు.

మూ. కషాయమధురం రూక్షం విద్యాద్వాసన్తికం జలమ్. ౨౦౪
గ్రైష్మికం త్వనభిష్యన్ది రూపమిత్యేష నిశ్చయః,

వ్యా. వసంతఋతువునందలి జలము వగరుగను, మధురముగను, రూక్షముగను ఉండును. గ్రీష్మఋతువునందలి జలము స్రోతస్సుల ద్రవమును కలుగజేయక యుండును. ఇది ఋతుభేదములగల్గు జలభేదము.

### విభ్రాంతకాలమునందలి జలగుణము.

మూ. విభ్రాన్తేషు తు కాలేషు యత్ప్రయచ్ఛన్తి తోయదాః. ౨౦౫
సలిలం తత్తు దోషాయ యుజ్యతే నాత్ర సంశయః,

వా. ఋతుధర్మములు మారియుండు కాలమునందును ప్రచండవాతము మున్నగు నుపాధులు కల్గిన కాలమునందును మేఘములు వర్షించు జలము మిక్కిలి దుష్టమై దోషముల గల్గించును.

### శరత్కాల వర్షోదకప్రాశస్త్యము.

మూ. రాజభీ రాజమాత్రైశ్చ సుకుమారైశ్చ మానవైః. ౨౦౬
గృహీత్వా తు శరద్వ్యాపః ప్రయోక్తవ్యా విశేషతః,

వ్యా. శరత్కాలమున వర్షధారలనుండి గ్రహింపబడిన జలమును భోగార్హులగు ప్రభువులును, రాజతుల్యులును, సుకుమారులును విశేషముగ నుపయోగింపదగియుండును.

ఇచ్చట 'యదన్తరిక్షాత్పతతీన్ద్రసృష్టం' అని యుపక్రమించి చెప్పబడిన పైగ్రంథ మంతయు ఆయాఋతువులకు సంబంధించిన వర్షజలముయొక్క గుణములు చెప్పబడినవి. మరియు "కేచిత్తు శ్వేతే కషాయం భవతీత్యాదిగ్రన్థం పఠన్తి, తత్తు నాతిప్రసిద్ధం" అని చక్రదత్తవ్యాఖ్యానమున నున్నది. ఈ వ్యాఖ్యాతయభిప్రాయము ప్రక్షిప్తమని వీరికి తోచినట్లున్నది. ఏది యెట్లున్నను విషయసంగ్రహము ప్రధానమని తలంచి యథాశ్రుతముగ మాచే వివరింపబడినది.

### హిమాలయమునందలి నదుల జలగుణము.

మూ. నద్యః పాషాణవిచ్ఛిన్నవిక్షుబ్ధాభిహతోదకాః. ౨౦౭
హిమవత్ప్రభవాః పథ్యాః పుణ్యా దేవర్షిసేవితాః,

వ్యా. హిమవంతమున బుట్టిన నదులు రాళ్లచే నడ్డగింపబడి వాని తాకుడుచే ఛిన్నభిన్నములై పలుదెరంగుల నెగురగొట్టబడిన జలము కల్గియుండును. అట్టి నదులు దేవతలచేతను, ఋషులచేతను, సేవింపబడి పరమపావనములై మిక్కిలి పథ్యము లైయుండును. (అట్టి నదీజలము మిక్కిలి పథ్యముగ నుండునని భావము.)

పై వాక్యముచేత హిమాలయమున నూర్ధ్వభాగమునుండి బైలువెడలి ప్రవ హించు నదులయందలి జలము రాళ్లతాకుడుచేత పలుదెరంగుల విశీర్ణమై నిర్మలమైన జలము ప్రశస్తమని చెప్పబడినది. ఇట్లు చెప్పుటచేత హిమాలయప్రాంతములనుండు నదు లకు ఇట్టిగుణము లుండదని తెలిసెడి. (పర్వతము పైభాగమునుండి వెడలు నదుల జలము గుణోత్తరమనియు, పర్వతసమీపముల బుట్టిన నదుల జలమున కట్టిగుణముండదనియు భావము.) ఈయభిప్రాయముచేతనే సుశ్రుతాచార్యులు—'హిమవత్ప్రభవాహృద్రోగాన్ జనయన్తి'అని చెప్పిరి. హిమవత్పరిసరప్రదేశమునందలి నదులు హృద్రోగమును కల్గించ నని యర్థము.

### మలయపర్వతనదీజలగుణము.

మూ. నద్యః పాషాణసికతావాహిన్యో విమలోదకాః. ౨౦౮
మలయప్రభవాః యాశ్చ జలం తాస్వమృతోపమం,

వ్యా. మలయపర్వతమున బుట్టి రాళ్లయందును, ఇసుకయందును, ప్రవహించు నదులు నిర్మలమైన జలము కల్గియుండును; కావున వానియందలి జలము అమృతమును బోలి సుఖకరమై యుండును.

మలయపర్వతమునబుట్టి రాళ్లయందును, ఇసుకయందును, ప్రవహించు నదీజలమునకు మాత్ర మీగుణము చెప్పబడినది. మలయపర్వతమున బుట్టినను రాళ్లయొక్కయుం ఇసుకయొక్కయుం సంబంధము లేక ప్రవహించు నదులజలము దుష్టముగనే యుండును. ఈ యభిప్రాయముచేతనే "మలయప్రభవాః క్రిమీన్ జనయన్తి" అని స్థలాంతరమున చెప్పబడినది. మలయమున బుట్టి రాళ్ల యిసుక సంబంధము లేక ప్రవహించునదులు క్రిములు కల్గించునని యర్థము. వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి.—"హిమవన్మలయోద్భూతాః పథ్యాః తాఏవ చ స్థిరాః, కృమిశ్లీపదహృత్కంఠశిరోరోగాన్ ప్రకుర్వతే" ఈవాక్యమునుబట్టి హిమాలయమునను మలయమునను ప్రవహించక నిల్కడగనుండు నదీజలము క్రిమిశ్లీపదాది రోగముల గల్గించునని తెలిసెడి.

### పశ్చిమాభిముఖ-ప్రాఙ్ముఖనదీజలగుణములు.

మూ. పశ్చిమాభిముఖా యాశ్చ పథ్యాస్తా నిర్మలోదకాః.          ౨౦౯
ప్రాయో మృదువహా గుర్వ్యో యాశ్చ పూర్వసముద్రగాః,

వ్యా. పడమటిదిక్కున కభిముఖముగ ప్రవహించునదు లేవికలవో అవియన్నియుం నిర్మలమైన జలము కల్గియుండును. అట్టి జలము హితకరము. తూర్పుసముద్రమున గలయునదులు తరుచుగ మెల్లగ ప్రవహించును. వానిజలము బరువుగ నుండును. (ఇచ్చట 'ప్రాయః' అనుటవలన గంగానది పూర్వసముద్రగామి యైనను గంగాజలము పథ్యమని యెరుంగునది.)

### పారియాత్రాది పర్వత నదీజలగుణము.

మూ. పారియాత్రభవా యాశ్చ విన్ధ్యసహ్యభవాశ్చ యాః          ౨౧౦
శిరోహృద్రోగకుష్ఠానాం తా హేతుః శ్లీపదస్య చ,

వ్యా. పారియాత్ర పర్వతమునందును, వింధ్యపర్వతమునందును, సహ్యపర్వతమునందును పుట్టిన నదులజలము శిరోరోగమును, హృదయరోగమును, కుష్ఠమును, శ్లీపదమును (బోదకాలును) కల్గించుటకు కారణమగును.

ఇచ్చట 'పారియాత్రభవాః' అను పదముచేత పారియాత్రమున పుట్టి ప్రవహింపక నిల్కడగ నిలిచియుండు హ్రదాది జలము గ్రహింపబడును. అట్టి జలము శిరో

రోగాదుల గల్గించునని యర్థము. అటుగాక పారియాత్రమునుండి ధారాళముగ ప్రవహించు నదీజలము పథ్యముగ నుండును. ఈయభిప్రాయముచేతనే వాగ్భటాచార్యులు "దోషఘ్న్యః పారియాత్రజాః బలపౌరుషకారిణ్యః" అని పారియాత్రనదీజలమునకు ప్రాశస్త్యము చెప్పిరి.

వర్షాజలవహానదీజలగుణము.

మూ. వసుధాకీటసర్పాఖుమలసన్దూషితోదకాః, ౨౧౧
వర్షాజలవహా నద్యః సర్వదోషసమీరణాః,

వ్యా. వర్షోదకమునే యాధారముగ జేసికొని ప్రవహించునదులజలము భూమియందలి మట్టిచేతను, పురుగులు, సర్పములు, ఎలుకలు మున్నగువాని మలముచేతను చెడియుండును. కాన నయ్యది దోషముల నన్నిటిని ప్రేరేపించును. కావున పథ్యము కాదని భావము. అగ్ర్యాధికారమున 'వర్షానాదేయముదకానాం" (వర్షోదకమును ప్రవహించు నదీజలము ఉదకజాతిలో నపథ్యతమమని) చెప్పబడినది. ఇచ్చట నపథ్యమగుటకు కీటాది మలస్పర్శము కారణముగ జూపబడినది కావున పునరుక్తము కాదు.

వాపీకూపాదిజలగుణములు.

మూ వాపీకూపతటాగోత్ససరఃప్రస్రవణాదిషు, ౨౧౨
ఆనూపశైలధన్వానాం గుణదోషైః విభావయేత్,

వ్యా. [వాపి=ఇటికెరాళ్లు మున్నగువానిచే కట్టబడినజలముకల నడబావి. కూపము=సాధారణముగ త్రవ్వబడినబావి, తటాగము=గట్టునుండి పల్లమునజేరి నిలచిన నీళ్లుకల్గిన గుంట. (ఈయర్థము "తటాత్ అగః (గతిః) యస్యసః తటా(డా)గః" అను వ్యుత్పత్తిచే నేర్పడును.) ఉత్సము=క్రిందినుండి పైకి నుబికిన యూటనీళ్లు కల జలాధారము (ఇదియే బుగ్గ). సరస్సు=పురుషవ్యాపారములేక దేవనిర్మితమైన జలాశయము. (అయ్యది పంపాసరస్సు మున్నగునవి). ప్రస్రవణము = పర్వతాద్యున్నతస్థలమునుండి ధారగ స్రవించి నిలచిన జలముకల జలాశయము. ఆదిపదముచేత కేదారాదులును గ్రహింపబడును.]

పైజెప్పబడిన వాపీకూప తటాకాది జలాశయముల జలము ఆనూప (జలప్రాంత ప్రదేశము) శైల (పర్వతప్రదేశము) ధన్వ (మెట్ట) ప్రదేశములకుజేరిన జలమునకు జెప్పి గుణంబులును దోషంబులును కల్గియుండును. (పై జెప్పిన వాపీకూపాదులు ఆనూపశైల ధన్వస్థలములయందుండును కావున, అందు ఆనూపదేశమునందుండు వాపీకూపాదుల

అనూపజలమునకు జెప్పిన గుణదోషంబులును, పర్వతప్రదేశములబుట్టినవానికి పర్వతజలమునకు జెప్పిన గుణదోషంబులును, జాంగలప్రదేశమున నున్నవానికి జాంగల జలగుణదోషంబులును గల్గియుండునని భావము.)

అనూపజాంగల జలగుణము లిత్తెరంగున హారీతమున జెప్పబడినవి:—"అనూపదేశే యద్వారి గురు తత్ శ్లేష్మవర్ధనం, విపరీత మతో ముఖ్యం జాఙ్గలం లఘు చోచ్యతే" అనూపదేశమునందలి జలము బరువుకల్గి కఫమును వృద్ధిచేయును. జాంగలప్రదేశమునందలి జలము అనూపమునకు విపరీతముగ తేలికయై కఫహరముగ నుండునని యర్థము. పర్వతాది జలగుణములు తంత్రకారులు పైని వివరించిరి.

అష్టాఙ్గసంగ్రహమున "భూమ్యుత్ఖాతసముద్భూతం-నాదేయముచ్యతే" అనియు; సుశ్రుతమున "కౌపం సారస - తాడాగ-అనవస్థితలాఘవం" అనియు కౌపాదిజలలక్షణంబులు గుణాదులును వేరువేరుగ వివరింపబడినవి. విస్తరభీతిచే నవి యిట వివరింపబడవయ్యె. అష్టాంగహృదయమున "విద్యాత్కూపతడాకాదీన్ జాంగలానూపశైలతః" అని సంగ్రహముగ జెప్పబడినది.

## అగ్రాహ్య జలము.

మూ. పిచ్ఛిలం క్రిమిలం క్లిన్నం పర్ణశైవాలకర్దమైః.                ౨౧౩
విపర్ణం విరసం సాన్ద్రం దుర్గన్ధి న హితం జలం,
విస్రం త్రిదోషం లవణం అమ్బు యద్వరుణాలయం.                ౨౧౪

వ్యా. జిగటగ నున్నదియు, పురుగులతో గూడినదియు, ఆకులు, పాచి, బురద మున్నగువానిచే కుళ్లినదియు, రంగుమారినదియు, రసహీనంబును (చెడ్డరుచి కల్గినది). చిక్కగ నుండునదియు, దుర్గంధయుక్తంబును నగు జలము పానాదుల కుపయోగింపజనదు.

సముద్రమునందలి జలము ఆమగంధంబును, లవణరసంబును, కల్గియుండును. అయ్యది త్రిదోషముల వృద్ధినొందించును.

మరియు వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి.—"సూర్యేన్దుపవనాదృష్టం అభివృష్టం ఘనం గురు, ఫేనిలం జన్తుమత్తప్తం దన్తగ్రాహ్యతిశైత్యతః" సూర్యచంద్రకిరణ వాత సంబంధములేని జలంబును, అప్పుడే వర్షించిన జలంబును, నురుగుతోకూడిన జలంబును, పురుగులు మున్నగువానిచే వ్యాప్తమైన జలంబును, అగ్ని సంబంధము లేకయే యెండచేత వేడిగ నుండుజలంబును, మిక్కిలి చల్లనై పండ్లు కిట్టికొనజేయు జలంబును, పానార్హము కాదు అని యర్థము.

మరియు—"వార్షికం తదహర్వ్యుష్టం భూమిస్థమహితం జలం,వ్యుష్టం త్రిరాత్రం తచ్చైవ ప్రసన్నమమృతోపమం" అని ఖరనాదమున నున్నది. అప్పుడే వర్షించినజలము భూమిసంబంధమునంజేసి కలకబారియుండును కావున హితముకానేరదు. అదియే మూడు రాత్రులు గడచినపిమ్మట నిర్మలముగ తేటగ నగును కావున నమృతమును బోలె హితముగ నుండునని యర్థము.

—జలవర్గసమాప్తి.—

మూ. ఇత్యమ్బువర్గః ప్రోక్తోఽయం అష్టమ స్సువినిశ్చితః.

ఇతి జలవర్గః

---

వ్యా. ఇత్తెరంగున జలవర్గమనునది యెనిమిదవవర్గము చక్కగ వివరింపబడియె.

ఇది జలవర్గము సమాప్తము.

---

## (౯) క్షీరవర్గము

క్షీరము జలమునుబోలె జీవనీయము. "క్షీరం జీవనీయానాం, క్షీరఘృతాభ్యాసో రసాయనానాం" ఇత్యాది వాక్యములచే క్షీరము ప్రశస్తముగ జెప్పబడినది; కావున జలవర్గమును జెప్పినపిమ్మట క్షీరవర్గము చెప్పబడును. క్షీరశబ్దముచేత క్షీరవికారములగు పెరుగు మున్నగునవికూడ గ్రహింపబడును.

—ఆవుపాలగుణములు.—

అథ క్షీరవర్గః—

మూ. స్వాదు శీతం మృదు స్నిగ్ధం బహులం శ్లక్ష్ణపిచ్ఛిలం,
గురు మన్దం ప్రసన్నం చ గవ్యం దశగుణం పయః. ౨౧౫
తదేవం గుణమేవౌజః సామాన్యాదభివర్ధయేత్,
ప్రవరం జీవనీయానాం క్షీరముక్తం రసాయనం. ౨౧౬

వ్యా. క్షీరభేదము "గవ్యం మాహిషమాజం చ కారభం స్త్రైణమావికం,ఐభమైకశఫం చేతి క్షీర మష్టవిధం స్మృతం" అని అష్టాంగసంహితయందు ఎనిమిదివిధములుగ జంతుభేదముచే చెప్పబడినవి. ఈ యెనిమిదివిధములైన క్షీరముల గుణములు ఈక్రింద వివరింపబడును:—

అందు ఆవుపాలు రసవిపాకములచే మధురంబును, గుణవీర్యములచే శీతంబును, మృదుత్వము స్నిగ్ధత్వము, బహుల (వ్యాపించు స్వభావ)ము శ్లక్ష్ణత్వము, పిచ్ఛిలము, గురుత్వము (భారము) మందత్వము, ప్రసన్నత (నిర్దోషము) అను నీ పదిగుణములు కల్గియుండును. ఓజస్సును పైజెప్పిన పదిగుణములు కల్గియుండును కావున గుణ సామాన్యముచేత ఆవుపాలు ప్రధానముగ నోజస్సును వృద్ధినందించును. బలకరములగు ద్రవ్యములలో నిది మిగుల శ్రేష్ఠమైనది. జరావ్యాధినాశనరూపమైన రసాయనమగును.

ఇచ్చట "వృద్ధిస్సమానైస్సర్వేషాం" అనువచనప్రకారము ఆవుపాలు ఓజస్సుతో సమానగుణమగుటంజేసి యోజోవర్ధకమగునని "తదేవం గుణమేవౌజః సామాన్యాదభివర్ధయేత్" అని చెప్పబడెను.

## బఱ్ఱెపాలగుణము.

మూ. మహిషీణాం గురుతరం గవ్యాచ్ఛీతతరం పయః,

స్నేహాఽన్యూనం అనిద్రాయ హితమత్యగ్నయే చ తత్. ౨౧౭

వ్యా. బఱ్ఱెపాలు ఆవుపాలకంటె నధికముగ బరువును శీతవీర్యంబును స్నిగ్ధత్వంబును కల్గియుండును. ఇయ్యది నిదురబట్టని వారికిని జఠరాగ్ని మిక్కుటముగ దీపించియున్న వారికిని మిక్కిలి హితముగ నుండును

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది.—"స్నేహాన్యూనం" అనుచోట స్నిగ్ధత్వముచేత నావుపాలకంటె బఱ్ఱెపాలు అధికముగ నుండునని యర్థము. గురుత్వము, శీతత్వము, స్నిగ్ధత్వము అను నీమూడు గుణములును ఆవుపాలకంటె గేదెపాలలో నధికముగ నుండునని యీతంత్రకారుని నిర్ణయము. ఈవిషయమునే జతూకర్ణతంత్రమునందలి "గురుశీతం స్నిగ్ధతరం మాహిషమతిబల్యం బృంహణం చాగ్ర్యం" అను వాక్యంబును;'గవ్యాత్ స్నిగ్ధతరం' అను సుశ్రుతవాక్యంబును చాటుచున్నది. మరియు రవిగుప్తుడు సిద్ధసారమున "గవ్యాత్ స్నిగ్ధం గురుతరం మాహిషం స్వప్నకృత్పయః" అను వాక్యముచేత నీయర్థమునే విస్పష్టముగ జెప్పెను. ఈసిద్ధాంతమునే చక్రదత్తవ్యాఖ్యానమున చెప్పిరి.

అష్టాఙ్గహృదయవ్యాఖ్యాత సర్వాంగసుందరమున "మసిరప్యాహ" అని యుపక్రమించి "మహిషీణాం గురుతరం........<u>స్నేహాదూన</u>మనిద్రాయ" అను పాఠమును జూపి, మహిషీక్షీరమున ఆవుపాలకంటె స్నేహము తక్కువయని చెప్పుచు, "గవ్యం స్నేహోత్తమం క్షీరం గవ్యాచ్చ పయసః పయః, యథోత్తరం <u>స్నేహహీనం</u> పౌరభ్రఛాగ <u>మాహిషం</u>" అను ఖరనాద వచనమును; "గురుశీతతరం గవ్యాత్ <u>మాహిషం</u> స్వప్నలంపయః, <u>చతుర్థభాగస్నేహోనం</u> పిత్తఘ్నం చ విశేషతః" అను వచనాంతరమును,

పైజెప్పిన "స్నేహాదూనం" అను పాఠమున కుపబలముగ జూపుచు స్నేహోనమనియే సిద్ధాంతము చేసి, స్నేహాధికమను పక్షమును "తద్బుద్ధైశ్చిన్త్యం సర్వమతవిరుద్ధత్వాత్" అని దూరముగ నిరసించిరి.

సర్వస్వతంత్రులగు తంత్రకర్తల మతముల నిర్ణయింపబూనుట కడుంగడు సాహస కృత్యము. అయినను జనసామాన్యముగ నావుపాలకంటె బఱ్ఱెపాలలో స్నిగ్ధాంశము (నెయ్యి) అధికముగ చూచుచుండుట యనుభవసిద్ధము. స్నేహబాహుళ్యము చేతనే గురుతరాది గుణంబులును, అత్యగ్నిహితత్వంబును మిక్కిలి సమంజసమగును. కావున ప్రకృతతంత్రమున 'స్నేహాఽనూనం' అనుపాఠము నవలంబించి చక్రపాణిదత్త వ్యాఖ్యాత చేసినసిద్ధాంతము రమణీయమని తోచెడిని. పండితవరులు గమనించెదరుగాత!

## ఒంటెపాల గుణము.

మూ. రూక్షోష్ణం క్షీరముష్ట్రీణాం ఈషత్సలవణం లఘు,
శస్తం వాతకఫానాహక్రిమిశోఫోదరాఽర్శసాం. ౨౧౮

వ్యా. ఒంటెపాలు రూక్ష-ఉష్ణగుణంబులును, కొంచెముగ నుప్పనైన మధురరసంబును కల్గి తేలికనై యుండును. ఇయ్యది వాతకఫములయందును, కడుపుబ్బరమునందును, క్రిమిరోగమునందును, శోఫ (నంజు), మహోదరము, అర్శస్సు (మూలవ్యాధి), అను నీరోగములందును మిక్కిలి ప్రశస్తముగ నుండును. (పాలయందు సామాన్యముగ మధురము ప్రధానముగ నుండును. కావున లవణరసము అనురసముగ నుండునని 'ఈషత్స లవణం' అని చెప్పబడినది. ఇత్తెరంగుననే "సామ్లం సలవణం" ఇత్యాది స్థలముల యందును మధురప్రాధాన్యము నెరుంగునది.)

## ఏకశఫముల (గుఱ్ఱముమున్నగువాని) పాలగుణము.

మూ. బల్యం స్థైర్యకరం సర్వముష్ణం చైకశఫం పయః,
సామ్లం సలవణం రూక్షం శాఖావాతహరం లఘు. ౨౧౯

వ్యా. ఏకశఫముల (ఒకటే గిట్టగలగుఱ్ఱము గాడిదె మున్నగుజంతువుల) పాలు బలకరంబును,అవయవములకు స్థిరత్వకరంబును నగును. ఉష్ణవీర్యంబును, పులుపును ఉప్పును కలిసిన మధురరసంబును రూక్షగుణంబును, కల్గి తేలికనైయుండును. కాళ్లు చేతులయందలి వాతరోగమును హరించును.

ఇచ్చట "సర్వం, ఏకశఫం" అనుటచే ఏకశఫజాతియంతయు గ్రహింపబడును. 'ఉష్ణం' అనగ తక్కినక్షీరములకన్న నుష్ణమని యర్థము. శాఖాశబ్దముచేత బాహువులును ఊరువులును గ్రహింపబడును.

## మేకపాలగుణము.

మూ. ఛాగం కషాయమధురం శీతం గ్రాహి పయోలఘు,
రక్తపిత్తాతిసారఘ్నం క్షయకాసజ్వరాపహం. ౨౨౦

వ్యా. మేకపాలు వగరుతోఁగూడిన మధురరసంబును, శీతవీర్యంబును, లఘుగుణంబును కల్గియుండును. మలమును గట్టిపరచును. రక్తపిత్తమును, అతిసారమును, క్షయమును, కాసమును, జ్వరమును హరించును.

## గొఱియలయొక్కయు, ఏనుగులయొక్కయు పాలగుణములు.

మూ. హిక్కాశ్వాసకరం తూష్ణం పిత్తశ్లేష్మలమావికం,
హాస్తినీనాం పయో బల్యం గురు స్థైర్యకరం పరమ్. ౨౨౧

వ్యా. గొఱియలపాలు హిక్క(ఎక్కిళ్లు)ను, శ్వాసమును కల్గించును. ఉష్ణవీర్యమైనది. పిత్తకఫముల వృద్ధినొందించును.

ఏనుగుపాలు బలమును వృద్ధినొందించును. బరువుగ నుండును. శరీరావయవముల దృఢముగజేయును. (ఏనుగులపాలు ఆయాయోగముల జెప్పియుండలేదు. అయినను దానిగుణాదులబట్టి యథాయోగముగ నుపయోగింప దగును).

## చనుబాలగుణము.

మూ. జీవనం బృంహణం సాత్మ్యం స్నేహనం మానుషం పయః,
నావనం రక్తపిత్తే చ తర్పణం చాక్షిశూలినామ్ ౨౨౨

వ్యా. మనుజులచనుబాలు శరీరమునకు బలమునిచ్చును. పుష్టి కల్గించును. బాల్యమున నలవాటైయుండుటంజేసి సాత్మ్యముగనుండును (శరీరమునందలి రసాదిధాతువులు బాల్యమున చనుబాలు త్రాగుటచేతనే వృద్ధినందినవి కావున అట్టి రసరక్తాదిధాతువులకు అనుకూలముగ నుండుననుట). నస్యమున కుపయోగింపదగినది. రక్తపిత్తమునందు హితకరము. తృప్తినందించును. కన్నులనొప్పి కలవారికి మిక్కిలి హితకరమై నేత్రములకు తృప్తికరమగును.

## పెరుగుగుణము.

మూ. రోచనం దీపనం వృష్యం స్నేహనం బలవర్ధనం,
పాకేఽమ్ల ముష్ణం వాతఘ్నం మఙ్గళం బృంహణం దధి. ౨౨౩

వ్యా. పెరుగు తినునప్పుడు నోటికి రుచికరముగ నుండును. జఠరాగ్నిని దీపింప జేయును. ఇంద్రియపుష్టిని శుక్రవృద్ధినిచేయును. శరీరమున జిడ్డునుకల్గించుచు. బలమును వృద్ధినొందించును. రసవిపాకముల పులుపుగ నుండును. ఉష్ణగుణము కల్గినది. వాతమును హరించును. మంగళకరమైనది. శరీరమును బలియజేయును.

'అమ్లపాకరసం' అని వాగ్భటులు చెప్పిరి, కావున నిచ్చట 'పాకేఽమ్లం' అనునది రసమునకు నుపలక్షణము.

పెరుగు నుపయోగింపదగినవిషయములు.

మూ॥ పీనసే చాతిసారే చ శీతకే విషమజ్వరే,
అరుచౌ మూత్రకృచ్ఛ్రే చ కార్శ్యే చ దధి శస్యతే. ౨౨౪

వ్యా. పీనసము, అతిసారము, చలితోకూడినవిషమజ్వరము, అరుచి, మూత్రకృచ్ఛ్రము, శరీరకార్శ్యము, అనునీరోగములయందు పెరుగు నుపయోగించుట చాల ప్రశస్తము. (రోచనమన తినుసమయముననే రుచి పుట్టినదియని యర్థము. కావుననే అరుచిని పోగొట్టునని 'అరుచౌ శస్యతే' అని చెప్పబడినది. బృంహణమన రోగములచే గల్గిన కృశత్వమును పోగొట్టునదియని యర్థము. స్వాభావికముగనే కృశించియుండు వారలకు పుష్టికరమని తెలియుటకై 'కార్శ్యే శస్యతే' అని చెప్పబడినది). మరియు 'రూక్షంతు గ్రహణీగదే' అనువాగ్భటవచనప్రకారము రూక్షముగ (జిడ్డు లేక) నుండు పెరుగును గ్రహణీరోగమున నుపయోగింపనగునని యెరుంగునది.

పెరుగు నుపయోగింపకూడని సమయములు.

మూ. శరద్గ్రీష్మవసన్తేషు ప్రాయశో దధి గర్హితం,
రక్తపిత్తకఫోత్థేషు వికారేష్వహితం చ తత్. ౨౨౫

వ్యా. శరత్-గ్రీష్మ-వసంతఋతువులయందు ప్రాయికముగ పెరుగు నుపయోగింప జనదు. మరియు రక్తపిత్తమునందును కఫప్రకోపమున గల్గినవ్యాధులయందును పెరుగు హితకరము కానేరదు.

మరియు వాగ్భటాచార్యులు—"నైవాద్యాన్నిశి, నైవోష్ణం, వసన్తోష్ణశరత్సుచ నాముద్గసూపం, నాఽక్షౌద్రం తన్నాఘృతసితోపలం. న చాఽనామలకం, నాపి నిత్యం నామన్దమన్యథా, జ్వరాసృక్పిత్తవీసర్పకుష్ఠపాణ్డుభ్రమప్రదం" అని చెప్పిరి. పెరుగును రాత్రులయందు భుజింపజనదు. వెచ్చజేసియు, పెసలపప్పు, తేనె, నెయ్యి, తెల్లచక్కెర ఉసిరికకాయలు, వీనితో జేర్పకయు భుజింప జనదు. ప్రతిదినంబును భుజింపజనదు.

జెప్పిన నియమము నుల్లంఘించి భుజించినచో జ్వరము, రక్తపిత్తము, విసర్పము, కుష్ఠము, పాండువు, భ్రమము, అనురోగముల కల్గించునని యర్థము.

### మస్తక-జాత-సర-మండముల గుణములు.

మూ. త్రిదోషం మస్తకం, జాతం వాతఘ్నం దధి, శుక్రలః (శుక్రలం),
సరః, శ్లేష్మానిలఘ్నస్తు మణ్డః, స్రోతోవిశోధనః. ౨౨౬

వ్యా. (పాలను చక్కగకాచి తోడుబెట్టినవెంటనే చక్కగ పేరకయుండునట్టి (పేరిపేరకయుండు) పెరుగు మందకము). ఇయ్యది త్రిదోషముల ప్రకోపింపజేయును. (చక్కగపేరి ఘనీభవించి కొంచెము పులుపునుకలిసి తీపుకల్గినపెరుగు జాతమనబడును.) ఇయ్యది వాతమును హరించును. (పెరుగుపైని తేరియుండుస్నేహము (నెయ్యి) సరమన బడును). ఇయ్యది శుక్రమును వృద్ధిజేసి స్రవింపజేయును. మండము (పెరుగుమీది మీగడ (పరక) కఫవాతములను హరించును. స్రోతస్సులను శుభ్రపరచును. ఇచ్చట 'శుక్రలః' అనుపదముచేత శుక్రమును వృద్ధినందించి స్రవింపజేయునది యని యర్థము. ఈవిషయమునే 'వృష్యశ్శుక్రవివర్ధనః' అని సుశ్రుతులు చెప్పిరి.

'శుక్రలం' అనుపాఠమున 'దధి' అనుదానికి విశేషణ మగును.

మరియు దధిగుణముల చెప్పునపుడు సుశ్రుతమున "దధ్యాజం కఫపిత్తఘ్నం" అని యుపక్రమించి మేకపెరుగు మున్నగువానికి వేరువేరుగ గుణములు చెప్పబడినవి. విస్తరభీతిచే నిట వివరింపబడవయ్యె.

### తక్రగుణములు.

మూ. శోఫార్శోగ్రహణీదోషమూత్రగ్రహోదరారుచౌ,
స్నేహవ్యాపది పాణ్డుత్వే తక్రం దద్యాద్గరేషు చ. ౨౨౭

వ్యా. శోఫము, అర్శోరోగము, గ్రహణీదోషము, మూత్రబంధము (కృచ్ఛ్రము) ఉదరరోగము, అరుచి, స్నేహపానముచే నైనవ్యాపత్తు, పాండురోగము, గరము (సర్పాదివిషము), వీనియందెల్ల మజ్జిగ నుపయోగింపదగును.

### నవనీతగుణము.

మూ. సఙ్గ్రాహి దీపనం హృద్యం నవనీతం నవోద్ధృతం,
గ్రహణ్యర్శోవికారఘ్నం అర్దితాఽరుచినాశనమ్. ౨౨౮

వ్యా. క్రొత్తగతీయబడినవెన్న సంగ్రాహి (మలమూత్రాదుల బంధించును). అగ్నిని దీపింపజేయును. హృదయమునకు హితకరము. గ్రహిణిరోగమును, అర్శోరోగమును,

అర్దితవాతమును, అరుచిని హరించును. (ఇచ్చట 'నవోద్ధృతం, అనువిశేషణముచేత నూతనముగ పెరుగునుండి గ్రహింపబడిన వెన్నకు పైజెప్పినగుణములు కల్గియుండును, కాని ప్రాతవెన్న కీగుణములు బలవత్తరములుగ నుండునని భావము).

మూ. స్మృతిబుద్ధ్యగ్నిశుక్రౌజఃకఫమేదోవివర్ధనం,
వాతపిత్తవిషోన్మాదశోషాఽలక్ష్మీజ్వరాపహం. ౨౨౯
సర్వస్నేహోత్తమం శీతం మధురం రసపాకయోః,
సహస్రవీర్యం విధిభిర్ఘృతం కర్మసహస్రకృత్. ౨౩౦

వ్యా. ఘృతము (నెయ్యి) తక్కినస్నేహద్రవ్యములలో నుత్తమముగ నుండును. శీతవీర్యంబును మధురరసవిపాకంబులును కల్గినది. స్మృతి (జ్ఞాపకశక్తి), బుద్ధి, జఠరాగ్ని, శుక్రము, ఓజస్సు, కఫము, మేదస్సు, వీనిని వృద్ధినొందించును. వాతపిత్తములు, విషము, ఉన్మాదము, ధాతుశోషము, అలక్ష్మి, జ్వరము, వీని నన్నింటిని హరించును. ఆయాద్రవ్యములజేర్చి సంస్కారవిశేషముచే సంస్కరింపబడిన ఘృతము అనేకవీర్యములు (శక్తులు) కలిగి పలుతెరంగులైన పనులజేయును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—'ఘృతం యోగవాహి' అనుతంత్రాంతరమున జెప్పి యుండుటంజేసి నెయ్యి యోగవాహియగును. యోగవాహియన—ఏద్రవ్యముతో నియ్యది జేర్పబడునో ఆద్రవ్యముయొక్కగుణమునకు దోడ్పడి దానిగుణము నధికముగ జేయునదియని యర్థము. అట్టియోగవాహిత్వము కల్గినది యగుటవలన ఆయాద్రవ్యసంబంధములచేతను, సంస్కారవిధానములచేతను అనేకవిధములైన శక్తులు కల్గియుండును. దానంజేసి యనేకకృత్యముల జేయ సమర్థముగ నుండును. ఈవిషయమునే "నాన్యః స్నేహస్తథా కశ్చిత్ సంస్కారమనువర్తతే" అని వచనాంతరము చాటుచున్నది. నేతి కిట్టియపూర్వశక్తి కలదనియే "సహస్రవీర్యం ......సహస్రకృత్" అని చెప్పబడియె.

ప్రాతనెయ్యిగుణము.

మూ. మదాపస్మారమూర్ఛాయశోషోన్మాదగరజ్వరాన్,
యోనికర్ణశిరశ్శూలం ఘృతం జీర్ణమపోహతి. ౨౩౧

వ్యా. ప్రాతనెయ్యి మదము (తిక్కయెత్తినట్లుండుట), అపస్మారము, మూర్ఛ, శోషము, ఉన్మాదము, విషము, జ్వరము, యోనిశూలము, చెవిపోటు, తలనొప్పి, అను రోగముల నన్నింటిని మాన్పును.

ఇచ్చట జీర్ణఘృతమన పదివత్సరముల కాలమునకు ముందటి ప్రాతనెయ్యి అని యీవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది—"పురాణం దశవర్షం

స్యాత్, ప్రపురాణమతః పరం" పదివత్సరకాలము గడచిన నెయ్యి పురాణమనియు, అంతకన్న నధికముగ గడచినది ప్రపురాణమనియు భావము. మరియు "యథా యథా జరాం యాతి గుణవత్స్యాత్తథా తథా" అని హారీతసంహితావచనమునుబట్టి నెయ్యి ప్రాతదియగుకొలది గుణోత్తరమగునని తెలిసెడి. "పరమేకాదశం ప్రాప్తం సర్వదోష హారం పరం, స్థితం వర్షశతం భూమా కేమ్భ మిత్యపదిశ్యతే" అని తంత్రాంతరమున నున్నది. పదునొకండవ సంవత్సరమున (అంతకాలము ప్రాతదియైన) నెయ్యి మిగుల శ్రేష్ఠమై సర్వదోషహర మగుననియు, నూరువత్సరములకాలము భూమిలో నుంచబడిన నెయ్యి కేంభమనబడుననియు నర్థము. ఇట్టిప్రమాణములబట్టి నెయ్యి ప్రాతదియగుకొలది గుణాధికమగునని స్ఫుటమగుచున్నది.

## మేకలుమున్నగువాని నేతిగుణములు.

మూ. సర్పింష్యజావి మహిషీ క్షీరవత్ స్వాని నిర్దిశేత్,

వ్యా. మేకలయొక్కయు, గొఱియలయొక్కయు, బఱ్ఱెలయొక్కయు నెయ్యి ఆయాజంతువులపాలకు వేరువేరజెప్పినగుణముల గల్గియుండును. (మేకనేతికి మేకపాల గుణంబును, గొఱ్ఱెనేతికి దానిపాలగుణంబును, గేదనేతికి దానిపాలగుణంబును కల్గి యుండునని భావము. ఏనుగు ఒంటెమున్నగువాని నేతికిని ఈన్యాయమననుసరించి వాని వాని పాలగుణము కల్గియుండునని యెరుంగునది. ఆజంతువులనెయ్యి వాడుకలోనుండుట యరుదగుటంజేసి తంత్రకారులు నిర్దేశింపరైరి.)

## పీయూష-మోరట-కిలాటగుణములు.

మూ. పీయూషో మోరటం చైవ కిలాటాః వివిధాశ్చ యే. ౨౩౨

దీప్తాగ్నీనాం అనిద్రాణాం సర్వ ఏ తే సుఖప్రదాః,

గురవస్తర్పణా వృష్యాః బృంహణాః పవనాపహాః. ౨౩౩

వ్యా. (అపుడు ఈనినయావు మున్నగువానిపాలు పీయూషము. (ఇదియే జున్ను పాలు), అట్టిక్రొత్తపాలు కాచినప్పుడు తేటగనుండక విరిగి జున్నువలె నగును, ఆరీతిగ నెంతకాలమగునో అంతదనుక నయ్యది మోరట మనబడును. పాలు విరిగి ముద్దగ నేర్పడిన క్షీరభాగము (జున్ను) కిలాటమనబడును.) పీయూషంబును, మోరటంబును, పలుదెరంగులైన కిలాటంబులును మిక్కిలి గురుత్వము కల్గియుండును. ఇయ్యవి మిక్కిలి తీవ్రమైన జాఠరాగ్ని కలవారికిని, నిదురలేని (పట్టని) వారికిని, సుఖకరములగును. తృప్తి నొందించును. వృష్యములగును. శరీరపుష్టి నిచ్చును. వాతమును హరించును.

పీయూషాదిలక్షణము తంత్రాంతరమున నిట్లున్నది:—

"క్షీరం సద్యః ప్రసూతాయాః పీయూషమితి సంజ్ఞితం, సప్తరాత్రాత్పరం క్షీరం అప్రసన్నం చ మోరటం" కిలాటలక్షణము తంత్రాతరమున భేదముగనున్నది. "స్వల్ప క్షీరో బహుస్తక్రః కిలాటస్స్వల్పశర్కరః" ఈవాక్యముల ననుసరించియే పైని వివరింప బడినది. అందు కొద్దిగ పాలును అధికముగ మజ్జిగను చేర్చి పేరబెట్టిన కిలాటము, మోరటమని పాఠాంతరము. విరిగినపాలలో ఘనభాగమును విడిచిన తేటనీరు మోరటము, ఇది వాగ్భటపాఠము.

## తక్రపిండక (జున్ను) గుణము.

మూ. విశదా గురవో రూక్షా గ్రాహిణస్తక్రపిణ్డకాః,

వ్యా. తక్రపిండకములు విశదములుగను గురుత్వముకల్గినవిగను రూక్షగుణంబులు నైనవి. మలాదులను గట్టిపరచును.

తక్రపిండకమన—పచ్చిపాలలో మజ్జిగనైనను పెరుగునైనను కలిపి కాచినయెడ అందు పాలలో సారమంతయుం ముద్దగ ఘనీభవించియుం ద్రవమంతయుం నీరుగ ఏర్పడు ఈసముదాయమునకు మజ్జిగచేనైనది తక్రకూర్చిక యనియుం, పెరుగుచేనైనది దధి కూర్చిక యనియుం చెప్పబడును. అందు నీరును వదలి ముద్దగనుండు ఘనరూపమైనది తక్రపిండమనబడును. ఈకూర్చికాలక్షణమునే తంత్రాంతరమున నిట్లు చెప్పిరి:—"దధ్నా సహపయః పక్వం యత్తత్స్యాత్ దధికూర్చికా, తక్రేణ పక్వం యత్ క్షీరం సా భవేత్తక్ర కూర్చికా" (పైని వివరింపబడినది).

## క్షీరవర్గసమాప్తి.

మూ. గోరసానామయం వర్గో నవమః పరికీర్తితః. ౨౩౪

ఇతి గోరసవర్గః.

---

వ్యా. ఇత్తెరంగున గోరసరూపమైన పాలుపెరుగు మజ్జిగ మున్నగువానివర్గమను నది తొమ్మిదియవది యగువర్గము వివరింపబడినది.

ఇచ్చట 'గోరసానాం' అనుచోట 'గవాదిరసానాం' అని ఆదిశబ్దము లుప్తనిర్దిష్టము. కావున మహిష్యాదిరసములును వివరింపబడినదియని యర్థము. రసశబ్దముచేత క్షీర వికారములైన దధితక్రాదు లన్నియుం చెప్పబడును. లోకమునందును క్షీరవికారములనన్నిటిని గోరసమని చెప్పుట యలవాటు కలదు.

ఇది గోరసవర్గము సమాప్తము.

---

## (౧౦) ఇక్షువర్గము.

చెరకు క్షీరమునకు సమానమైన గుణములుకల్గినది కావున క్షీరవర్గమును చెప్పిన పిదప ఇక్షువికారముల దెల్పువర్గము చెప్పబడును.

### ఇక్షురసగుణము.

అథ ఇక్షువర్గః.—

మూ. వృష్యశ్శీతస్సరః స్నిగ్ధో బృంహణో మధురో రసః,
శ్లేష్మలో భక్షితస్యేక్షోః, యాన్త్రికస్తు విదహ్యతే. ౨౩౫

వ్యా. చెరకుతుంటను నోట నమలి రసమును మ్రింగిన నయ్యది వృష్యమగును. శీతవీర్యము. శరీరమున శీఘ్రముగ వ్యాపించుస్వభావము కల్గినది. స్నిగ్ధముగ నుండును. బలమును (పుష్టిని) కల్గించును. కఫమును వృద్ధినొందించును. అటుగాక యంత్రమునుండి (చెరకుగానుగనుండి) తీయబడినరసము విదాహమును (తాపమును) కల్గించును (విదాహమన జాఠరాగ్నిసంబంధముచేత పాకంబై పిత్తమును ప్రేరేపించి చిరకాలమువరకు జీర్ణముకాకుండు గుణవిశేషమని యర్థము).

యంత్రముచే నిష్పన్నమైన యిక్షురసము విదాహియగుటకు కారణము హారీతమున నిట్లుచెప్పబడినది:—"వ్యాపిత్వాత్సుకుమారో హిరసో యన్త్రనిపీడితః, సౌక్ష్మ్యాత్ స్పృష్టోఽనిలార్కాభ్యాం భృశం కాయే విదహ్యతే" చెరకురసము మిక్కిలి సుకుమారంబును సూక్ష్మగుణంబును నగును. కావున నయ్యది యంత్రనిపీడనముచేత సూర్యవాయుస్పర్శనమున విదాహగుణముకల్గియుండును. దానినుపయోగించినచో శరీరమునజేరి విదాహియగునని యర్థము. మరియు నీయాంత్రికరసమునకు విదాహిత్వము ప్రాయికము. కావుననే "మధూదరస్యేక్షురసస్య చైవ పానాచ్ఛమం గచ్ఛతి రక్తపిత్తం" అని రక్తపిత్తము శమనమునకై యిక్షురసపానము విహితము సంగతమగుచు. లేక రక్తపిత్తమున దంతపీడితేక్షురసపానము విధింపబడియెనని చెప్పనగును. కొందరు ఈదోషపరిహారమునకై "యాన్త్రికస్తు విదహ్యతే" అనుచోట శీఘ్రముగ పాకమునొందునని యర్థము చేసెదరు.

మరియు వాగ్భటాచార్యులు:—"సోఽగ్రే సలవణో దన్తపీడితశ్శర్కరాసమః" అని చెప్పిరి. చెరకుకొనయందు కొంచెముగ నుప్పు కలిసియుండుననియు, దంతపీడితమైన చెరకురసము చక్కెరతో సమానగుణంబగుననియు భావము.

### పౌండ్రక-వాంశికేక్షుగుణములు.

మూ. శైత్యాత్ప్రసాదాన్మాధుర్యాత్ పౌండ్రకాద్వాంశకో వరః,

వ్యా. శైత్యము, ప్రసాదము (తేటనైయుండుట), తీపి, ఈమూడుగుణముల చేత పౌండ్రకమునకంటె వాంశికమనుచెరకు శ్రేష్ఠముగ నుండును. (ఈమూడుగుణములను పౌండ్రకమను చెరకున సామాన్యముగ నుండుననియు, అంతకన్న నధికముగ వాంశికమనుచెరకున నుండుననియు భావము) ఇది మూలానుసారముగ వ్యాఖ్యాతము.

వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి:—"తత్ర పౌణ్డ్రకః, శైత్యప్రసాదమాధుర్యైః వరః, తమనువాంశికః" శైత్యప్రసాదమాధుర్యములచేత పౌండ్రకము శ్రేష్ఠమనియు, అట్టిగుణములచేత పౌండ్రకమునకన్న వాంశికము తక్కువయనియు నర్థము. ఈయర్థమునే స్థిరపరచుచు సర్వాంగసుందరవ్యాఖ్యానమున "శైత్యాదిభిః పౌండ్రకాత్ వాంశికో హీనఇత్యర్థః" అని ముక్తకంఠముగ నుడివిరి. దీని ననుసరించి ప్రకృతగ్రంథమున "పౌండ్రకాత్ వాంశికః అవరః" అని విభజించుట సమంజసము.

బెల్లపుసామాన్యగుణములు.

మూ. ప్రభూతక్రిమిమజ్జాసృఙ్మేదోమాంసకరో గుడః. ౨౩౬

వ్యా. బెల్లము క్రిములు, మజ్జ, రక్తము, మేదస్సు, మాంసము, వీనిని మిక్కిలి వృద్ధి నొందించును.

క్షుద్రగుడాదిగుణములు.

మూ. క్షుద్రో గుడశ్చతుర్భాగత్రిభాగార్ధావశేషితః,
రసో గురుర్యథాపూర్వం, ధౌతః స్వల్పమలో గుడః. ౨౩౭

వ్యా. క్షుద్రగుడము (నల్లబెల్లము) నాల్గుభాగములు మిగులునట్లు కాచబడిన రసమునకన్న గురుత్వముకల్గియుండును. అయ్యదియు త్రిభాగములు (మూడుభాగములు) మిగులునట్లు కాచబడినరసమునకన్న గురుత్వముకల్గినది. త్రిభాగావశిష్టరంబును, అర్ధభాగావశేషితరసముకన్న గురుత్వము కల్గియుండును. చెరకురసమున మాలిన్యము కొద్దిగ నుండునట్లు పరిశుద్ధము చేయబడిన బెల్లము పైజెప్పినక్రిములు మున్నగువానిని స్వల్పముగ గల్గించును.

మత్స్యండికాదిగుణములు.

మూ. తతో మత్స్యణ్డికా ఖణ్డశర్కరా విమలాః పరం,
యథా యథైషాం వైమల్యం భవేచ్ఛైత్యం తథా తథా.

వ్యా. (పాకభేదముచే మత్స్యములయండముల బోలిన శర్కరావిశేషము మత్స్యండిక. ఖండశర్కర యన కల్కండ) పైజెప్పిన ధౌతగుడమునకన్న మత్స్యండికయు, దీనికన్న ఖండకల్కండయు, దీనికన్న చక్కెరయు నిర్మలముగ నుండును.

మరియుం ధౌతగుడము, మత్స్యండిక, ఖండశర్కరలు అను నీమూటిలో నిర్మలత్వ తారతమ్యము ననుసరించి శైత్యమాధుర్యాదిగుణములకును తారతమ్యముండును.(మత్స్యం డికకన్న కల్కండ శీతతరమనియుం, దానికన్న చక్కెర శీతతమమనియు భావము.)

## శర్కరాభేదములగుణములు.

మూ. వృష్యాః క్షీణక్షతహితాః సస్నేహా గుడశర్కరాః,
కషాయమధురాశ్శీతాః సతిక్తా యాః సశర్కరాః　　౨౩౯
రూక్షా వమ్యతిసారఘ్నీ చ్ఛేదనీ మధుశర్కరా,
తృష్ణాసృక్పిత్తదాహేషు ప్రశస్తాః సర్వశర్కరాః.　　౨౪౦

వ్యా. బెల్లముచే నైనశర్కర (చక్కెర) ధాతువులు క్షీణించినవారికిని, ఉరః క్షతముకలవారికిని హితముగ నుండును. ఈచక్కెర స్నిగ్ధముగ నుండును. దూలగొండి కషాయపాకముచే చేయబడిన చక్కెర వగరును చేదును తీపియు కల్గియుండును. శీత వీర్యము. తేనెచే చేయబడిన చక్కెర రూక్షంబును, వమనములను అతిసారములను హరించును. మలాదుల ఛేదించును. తక్కినచక్కెరలు (ఉక్తానుక్తములగు) అన్నియు దప్పిని రక్తపిత్తమును తాపమును శమింపజేయును.

## తేనెజాతిలో నాల్గుభేదములు.

మూ. మాక్షికం భ్రామరం క్షౌద్రం పౌత్తికం మధుజాతయః,
మాక్షికం ప్రవరం తేషాం విశేషాద్భ్రామరం గురు (మధు).

వ్యా. మాక్షికము, భ్రామరము, క్షౌద్రము, పౌత్తికము నని మధు (తేనె) జాతులు నాల్గువిధముల నుండు. అందు మాక్షికమను తేనె మిగుల శ్రేష్ఠము. భ్రామరమను నది తక్కినవానికన్న మిక్కిలి గురుత్వముకల్గినది.

పైజెప్పిన మాక్షికాదభేదములు ఉత్పత్తిభేదమునుబట్టి కల్గినవి. ఎట్లులన:— పింగళవర్ణములైన తేనెటీగలు మక్షికములు; వానిచే నానాజాతులపుష్పములనుండి మక రందమును తెచ్చి చేర్చబడినతేనె మాక్షికము. భ్రమరముల (తుమ్మెదల)చేత జేర్పబడినది భ్రామరము. స్వల్పములుగనుండు తేనెటీగలచే గూర్పబడినది క్షౌద్రము. పింగళవర్ణములై మిక్కిలి పెద్దవియగు తేనెటీగలు పుత్తకములు, (ఇవియే కొండయీగలు). వీనిచే గూర్ప బడినతేనె పౌత్తికము. (దీనిని కొండతేనె యనియుం నందురు).

మరియు వాగ్భటులు సంగ్రహమున "భ్రామరం పైత్తికం క్షౌద్రం మాక్షికం తద్యథోత్తరం" అనువాక్యమున పౌత్తికమనుదానిని పైత్తికమని చెప్పిరి. అష్టాంగసంహిత

యందును పైత్తికమనియే యున్నది. (మధుశర్కరా ప్రస్తావవశమున మధుగుణము లిచ్చుట జెప్పబడినవని యెరుంగునది).

మాక్షికాదిమధుభేదములవర్ణములు.

మూ. మాక్షికం తైలవర్ణం స్యాత్ ఘృతవర్ణం తు పౌత్తికం,
క్షౌద్రం తు కపిలం విద్యాత్ శ్వేతం భ్రామరముచ్యతే. ౨౮౨

వ్యా. పైజెప్పిన మధుజాతులలో మాక్షికము తైలవర్ణముగను, పౌత్తికము నేతి రంగుకల్గియుం, క్షౌద్రము కపిల (పింగళ) వర్ణముగను, భ్రామరము శ్వేతవర్ణముగను నుండును.

తేనెగుణములు.

మూ వాతలం గురు శీతం చ రక్తపిత్తకఫాపహం,
సన్ధాతృ చ్ఛేదనం రూక్షం కషాయమధురం మధు. ౨౮౩

వ్యా. తేనె వాతము ప్రకోపింపజేయును. గురుత్వంబును చల్లదనంబును కల్గినది. రక్తపిత్తమును కఫమును హరించును. విరిగిన యవయవముల నతుకజేయును. మలమును భేదించును. రూక్షగుణంబును కొంచెము వగరుతోగూడిన మధురరసంబును కల్గియుండును

మరియు "చక్షుష్యం చ్ఛేది తృట్శ్లేష్మవిషహిధ్మాస్రపిత్తనుత్, మేహకుష్ఠ క్రిమిచ్ఛర్ది శ్వాసకాసాఽతిసారనుత్, వ్రణశోధనసన్ధానరోపణం వాతలం మధు" అని వాగ్భటులుచెప్పిరి. ఈవచనముచేత తేనె నేత్రమునకు హితకరమనియు, దప్పి, విషము, ఎక్కిళ్లు, ప్రమేహము, కుష్ఠము, క్రిమిరోగము, వాంతి, శ్వాసకాసములు, అతిసారము అను నీరోగముల హరించుననియు, వ్రణముల శుభ్రపరచి మాన్పుననియు తెలిసెడి. (ఈచెప్పబడినవి తేనెసామాన్యములు.)

భ్రామరాదిమధుగుణములు వేరువేరుగ వాగ్భటులచే అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినవి:—"భ్రామరం తర్పణం స్వాదు త్రిదోషం పైత్తికం విదుః, వరం చ గుర్వభిష్యన్ది క్షౌద్రం రూక్షం మనాగ్గురు. మాక్షికం లఘుపవనం మధురం శస్యతే వ్రణే" భ్రామరము తృప్తిని కల్గించును. మధురముగ నుండును. పైత్తికము (పౌత్తికము) త్రిదోషముల వృద్ధినందించును. క్షౌద్రము శ్రేష్ఠమై తక్కినవానికన్న గురువుగ నుండును. కఫమును వృద్ధిజేయును. మాక్షికము రూక్షంబును స్వల్పముగ గురువునై వాతమును వృద్ధినొందిం

చును. అని యర్థము. అష్టాంగసంహితయందును ఇత్తెరంగుననే విశేషగుణములు చెప్ప బడినవి.

## తేనెకు ఉష్ణసంబంధనిషేధము.

మూ॥ హన్యాన్మధూష్ణం, ఉష్ణార్తమథవా సవిషాఽన్వయాత్,

వ్యా. తుమ్మెదలచే (తేనెటీగలచే) పలుదెరంగులైన పుష్పములనుండి యందలి పూదేనెను తెచ్చి యొక్కచోట చేర్పబడును. అదియే తేనె యని చెప్పబడును. కావున తేనెను చేర్చు కీటములును, తేనెకు తృప్తికారణములైన నానావిధపుష్పంబులును ముఖ్య కారణములగును. అట్టికారణములైన కీటములును పుష్పములును విషముతో కూడినవి యగును. అట్టి విషసంబంధమువలన విషమునందలి యుష్ణగుణమునకు విరుద్ధమైన స్వభావముమాత్రము తేనెకును సంబంధించును. కావున తేనెకు అగ్ని మున్నగువాని సంబంధముచే వేడిగ నున్నపుడు అయ్యది విషతుల్యమై మనుజుని చంపును. ఇంతియేకాక ఉష్ణముచే బీడింపబడిన మనుజుని గూడ పైజెప్పినకారణముచే తేనె చంపును అని యర్థము. ("మధు, ఉష్ణం, హన్యాత్. సవిషాన్వయత్వాత్; అథవా ఉష్ణార్తం హన్యాత్, సవిషాన్వయత్వాత్." అని రెండువాక్యములుగ సమన్వయము చేయవలెను. "విషాః (విషయుక్తకీటాః), అన్వయాః (ఉత్పత్తిస్థానాని), యస్యతత్—సవిషాన్వయం మధు, తస్మాత్కారణాత్." అని విగ్రహము చేసి యన్వయించవలెను. ఈయన్వయఫలితార్థమే పైని వివరింపబడినది.) ఈవిషయమునే వాగ్భటాచార్యులు "ఉష్ణముష్ణార్తముష్ణే చ యుక్తం చోష్ణైర్నిహన్తి తత్" అని యుపదేశించిరి. తేనెనుకాచి యుపయోగించినను, ఉష్ణపీడితున కుపయోగించినను, ఉష్ణములగు దేశకాలాదులయం దుపయోగించినను, లేక ఉష్ణములగు నాహారాదిపదార్థములతో జేర్చి యుపయోగించినను విషతుల్యమై చంపునని యర్థము. విషము ఉష్ణముగ నుండువానిస్పర్శను నెంతమాత్రమును సహింపజాలదు. అట్టిసంబంధము కల్గినప్పు డుత్కటమై తప్పక చంపును. అట్టి విషవస్తుసంబంధమును గల్గిన తేనెయందును ఉష్ణాసహత్వగుణము సంక్రమించును అని ముఖ్యముగ నెరుంగునది.

మరియు కొన్నిసమయములయం దుష్ణ మధూపయోగమును వాగ్భటు లిట్లు చెప్పిరి:—"ప్రచ్ఛర్దనే నిరూహే చ మధూష్ణం న నివార్యతే, అలబ్ధపాకమాశ్వేత తయోర్యస్మాన్నివర్తతే" వమనవిధియందును నిరూహవస్తియందును కాచబడిన తేనె నుపయోగించినను అయ్యది పాకము జెందుటకుముందుగనే శీఘ్రముగ బైట వెడలును; కావున వమననిరూహములయందు కాచబడిన తేనె నుపయోగించినను ప్రత్యవాయము లేదని యర్థము.

### తేనెను స్వల్పముగ నుపయోగించుట హితమనుట.

మూ. గురురూక్షకషాయత్వాత్ శైత్యాచ్చాల్పం హితం మధు ౨౪౪

వ్యా. మఱియుం తేనె గురుత్వంబును రూక్షంబును వగరును శీతగుణంబును కల్గి యుండుటవలన దానిని స్వల్పముగ పుచ్చుకొనిన హితకరమగును. (అధికముగ నుపయోగించినచో గురుత్వముకల్గినది యగుటవలన జీర్ణము కాదు. రూక్షకషాయశీతత్వములు కల్గినదియగుటంజేసి వాతమును మిక్కుటముగ ప్రకోపింపజేయును; కావున స్వల్ప పరిమాణముగ సేవించినయెడ హితకరమగునని భావము.)

### తేనె యజీర్ణమైనచో కష్టతమమనుట.

మూ నాఽతః కష్టతమం కిఞ్చిత్ మధ్వామాత్ తద్ధి మానవం,
ఉపక్రమవిరోధిత్వాత్ సద్యో హన్యాద్యథా విషం. ౨౪౫
ఆమే సోష్ణా క్రియా కార్యా సా మధ్వామే విరుధ్యతే,
మధ్వామం దారుణం తస్మాత్సద్యో హన్యాద్యథా విషం. ౨౪౬

వ్యా. భుజింపబడిన ఆహారాదిపదార్థములు జీర్ణముగాక యజీర్ణావస్థనొందినపుడు జీర్ణమగుటకై ఉష్ణవీర్యముగ నుండునౌషధాదుల నుపయోగించుట సమంజసమైన చికిత్స యగును. తేనెను అధికముగ త్రాగుటచే నయ్యది జీర్ణముగాక యామావస్థ నొందినపుడు ఉష్ణవీర్యమైన చికిత్స జేసినచో విరుద్ధమగును. (ఉష్ణవీర్యమైన పదార్థములకును తేనెకును విరోధమగుటంజేసి అట్టిచికిత్స విరుద్ధమై మహానర్థము ననుభవించుననిభావము). శీతవీర్యమైనచికిత్స తేనెకు హితము; అయ్యది యామదోషమును వృద్ధినొందించును. కావున శీతక్రియచేయ వలనుపడదు. ఇత్తెరంగున చికిత్స విరుద్ధముగనుండుటంజేసి తేనె యజీర్ణమైనచో నయ్యది మిక్కిలి క్రూరమై తగినచికిత్స కవకాశ మియ్యక చంపజూచును. కావున తేనె యజీర్ణమునకంటె వేరొండుకష్టములేదు. అట్టితేనెయజీర్ణము మిక్కిలి క్రూరమైనది. అయ్యది విషమునుబోలె మానవుని అతిశీఘ్రముగనే చంపునని యర్థము.

### తేనెకు యోగవాహిత్వము.

మూ. నానాద్రవ్యాత్మకత్వాచ్చ యోగవాహీ పరం మధు,

వ్యా. తేనె పై వివరింపబడినరీతిగ నానావిధములైనపుష్పముల రసాదిరూపమై యుండుటవలన యోగవాహి యగును. నానావిధము లైనపుష్పములు పలుతెరంగులైన రసాదుల గల్గియుండును. దానిసారమగు తేనెయు నానాద్రవ్యస్వరూపమై నానావిధ

గుణములు కల్గియుండవలసి వచ్చును. కావున తేనె యేద్రవ్యముతో జేర్చి యుప యోగింపబడునో అట్టి ద్రవ్యముయొక్క గుణాదులు కల్గియుండును. ఇదియే యోగ వాహిత్వము.)

ఇచ్చట చకారమువలన ప్రభావమునంజేసియు తేనె యోగవాహి యగునని యర్థము. తేనె యోగవాహి యగుటంజేసి తనయందలి రసవీర్యాదుల నతిక్రమించిన ప్రభావవిశేషముచేత వమనద్రవ్యముతో జేరినప్పుడు వమనకరంబును, ఆస్థాపనౌషధ ముతో జేరినపుడు ఆస్థాపనంబును, వృష్యరసాయనాదుల జేరినపుడు తత్తత్కార్య నిర్వాహకంబు నై యుండునని భావము.

మరియు తేనె యోగవాహి యైనను రూక్షకషాయగుణాధికము లైనవానిసంబం ధము ప్రధానముగ కల్గియుండునుకావున వాతమును ప్రకోపింపజేయును. దానంజేసి స్నేహమునకై యుపయోగింపంజనదు.

మరియు "నవీనం గుర్వభిష్యన్ది విద్యాజ్జీర్ణమతోఽన్యథా" అని యష్టాంగసంహితా వాక్యముచేత క్రొత్తతేనె గురుత్వమును కఫమును కల్గించుననియు, ప్రాతది తేలికయై కఫహార మగుననియు తెలిసెడి.

ఇక్షువర్గసమాపనము.

మూ. ఇతీక్షువికృతిప్రాయో వర్గోఽయం దశమో మతః.　　　　౨౮౭

ఇతి ఇక్షువర్గః.

---

వ్యా. ఇత్తెరంగున నిక్షువికారమైన గుడశర్కరాదులను ప్రధానముగగల యిక్షు వర్గమనునది పదియవవర్గము వివరింపబడియెనని యర్థము.

(ఇచ్చట 'ఇక్షువికృతిప్రాయః' అనుటవలన యవాసశర్కర మున్నగునవి ఇక్షు వికృతి కాకున్నను వానిని వివరించినది విరుద్ధము కాదని యెరుంగునది.)

ఇది యిక్షువర్గము.

## (౧౧) కృతాన్న వర్గము.

ఆహారమునకు సంబంధించిన శూకశింబీధాన్యాదిగుణములు వివరింపబడినవి. అట్టి ధాన్యాదులకు సంస్కారవిశేషమునం గల్గుగుణాదుల వివరించుటకై కృతాన్నవర్గము చెప్పబడును:—

### పే యా గు ణ ము.

మూ. క్షుత్తృష్ణాగ్లానిదౌర్బల్యకుక్షిరోగవినాశినీ,
స్వేదాగ్నిజననీ పేయా వాతవర్చోఽనులోమనీ. ౨౪౮

వ్యా. ("సిక్థైర్విరహితో మణ్డః పేయా సిక్థసమన్వితా, ఘనసిక్థా విలేపీ స్యాత్ యవాగూర్విరళద్రవా" అనువచన ప్రకారము మెతుకులు లేకుండునట్లు కాచబడినగంజి మండము. కొంచెముగ మెతుకులుండునట్లు కాచబడినగంజి పేయ. మెతుకులు మెండుగ నుండునట్లు కాచబడినగంజి విలేపి. మిక్కిలి ద్రవమై తేటగ కాచబడినగంజి యవాగువు నని చెప్పబడును).

పేయ యనుగంజి ఆకలిని, దప్పిని, బడలికను, బలహీనమును, కుక్షిలోసంభవించు రోగములను ధ్వంసముజేయును. ఒడలిపై జెమటను అగ్నిదీప్తిని పుట్టించును. అపానవాతమును పురీషమును అనులోమముగ వెడలింపజేయును.

### వి లే పి గు ణ ము.

మూ. తర్పణీ గ్రాహిణీ లఘ్వీ హృద్యా చాపి విలేపికా,

వ్యా. విలేపి యనుగంజి తృప్తినొందించును. మలమును నిరోధించును. తేలికగ జీర్ణమగును. హృదయమునకు హితకరము.

### మ ం డ గు ణ ము.

మూ. మణ్డస్తు దీపయత్యగ్నిం వాతం చాప్యనులోమయేత్. ౨౪౯
మృదూకరోతి స్రోతాంసి స్వేదం సంజనయత్యపి,
లఙ్ఘితానాం విరిక్తానాం జీర్ణే స్నేహే చ తృష్యతాం. ౨౫౦
దీపనత్వాల్లఘుత్వాచ్చ మణ్డస్స్యాత్ప్రాణధారణః,

వ్యా. మండమనుగంజి అగ్నిని దీపింపజేయును. వాతము ననులోమముగ సంచరింపజేయును. స్రోతస్సుల మృదువుగ జేయును. శరీరముపై చెమటబుట్టించును. ఇయ్యది లంఘనము జేసినవారికిని, విరేచనముల జేసికొనినవారికిని, స్నేహపానము జేసినపుడు అట్టి స్నేహము జీర్ణమైనవారికిని, దప్పిగొనినవారికిని, ఇయ్యది అగ్నిని దీపింపజేసి తేలికగ శీఘ్రముగ జీర్ణమగును గాన మిక్కిలి ప్రాణధారకమగును.

### లాజపేయ, లాజమండగుణములు.

మూ. లాజపేయా శ్రమఘ్నీ తు క్షామకణ్ఠస్య దేహినః    ౨౫౧
తృష్ణాఽతీసారశమనః ధాతుసామ్యకరశ్శివః,
లాజమణ్డోఽగ్నిజననః దాహ (గ్రాహీ) మూర్ఛానివారణః.

వ్యా. (లాజ (పేలాల) కణము లుండునట్లు పక్వముచేయబడినగంజి లాజ యగును.) ఇయ్యది శ్రమమును హరించును. కంఠస్వరము హీనమై యుండువారికి హితకరమగును.

(పేలాలను చేర్చి కాచి మెతుకులులేకయుండునట్లు పక్వముచేయబడిన పేలాల గంజి లాజమండ మనబడును.) ఇయ్యది దప్పిని అతిసారమును శమింపజేయును. వ్యత్యస్తముగ నుండు ధాతువులను సమస్థితికి దెచ్చును. (అట్టి ధాతుసామ్యమును చెడనీయక కాపాడును.) జఠరాగ్నిని కల్గించును. తాపమును మూర్ఛను నివర్తింపజేయును. (మలమును గట్టిపరచును).

### సంస్కరింపబడిన లాజమండగుణము.

మూ. మన్దాగ్నివిషమాగ్నీనాం బాలస్థవిరయోషితాం,
దేయశ్చ సుకుమారాణాం లాజమణ్డస్సుసంస్కృతః.    ౨౫౩
క్షుత్పిపాసాసహః పథ్యః శుద్ధానాం చ మలాపహః.

వ్యా. పైజెప్పిన లాజమండమునందు దనియాలు పిప్పళ్లు మున్నగువానిని జేర్చి సంస్కరించినచో నయ్యది యగ్ని మందగించినవారికిని, బాలవృద్ధులకును, స్త్రీలకును, సుకుమారులకును ఇయ్యదగియుండును. మరియు నియ్యది ఆకలిదప్పుల నణచును. శోధన చికిత్సజేసికొనినవారికి కొంచెముగ మలము చిక్కియుండువారలకును అట్టిమలలేపమును హరించును. మిక్కిలి పథ్యమైయుండును

ఇచ్చట శోధనచికిత్సచేత చక్కగ దోషములు హరించినవారికిని దోషలేశము చిక్కియున్నయెడ దానిని నివర్తింపజేసి పథ్యముగ నుండునని "శుద్ధానాం చ మలాపహః" అనువాక్యముచే జెప్పబడినది. కొందరు "శుద్ధానాం-ఈషచ్ఛుద్ధానాం మలాపహః" అని యర్థముజేసి శోధనచికిత్సచే కొంచెముగ శుద్ధమై మలశేషమున్నపుడు అట్టి మలమును హరించునది యని చెప్పెదరు. "కఫపిత్తే విశుద్ధేఽల్పే మద్యపే వాతపైత్తికే, తర్పణాదిక్రమః కార్యః పేయాఽభిష్యన్దయేద్ధితాన్" అను వచనాంతరముచేత అల్ప

శుద్ధియందు తర్పణాదిక్రమముగ విధానము యుక్తముగాని పేయాదిక్రమము అట్టి దోషము శేషమునందు చేయదగదని నిషేధింపబడినది కావున "ఈషచ్ఛుద్ధానాం మలాపహాః" అని చెప్పుట సమంజసము కాదు. ఈవివరణము చక్రదత్తవ్యాఖ్యానమున నున్నది.

## సంస్కరింపబడినమండము.

మూ॥ శృతః పిప్పలిశుణ్ఠిభ్యాం యుక్తో లాజాఽమ్లదాడిమైః ౨౫౪
మణ్డస్సన్దీపయత్యగ్నిం వాతం చాప్యనులోమయేత్,

వ్యా. పేలాలను దానిమ్మపులుపును శుంఠిపిప్పళ్లను జేర్చి కాచబడినమండము అగ్నిని దీపింపజేయును. వాతమును అనులోమముగ సంచరింపజేయును

సంస్కృతమండమును తంత్రాంతరమున నిట్లు చెప్పిరి:—"లాజామ్బుసైన్ధవకణా ధాన్యనాగరదాడిమైః, యుక్తో విమృదితః పూతో మణ్డస్సంస్కృత ఉచ్యతే. నిర్ద్రవ్యా ప్రాకృతా పేయా తక్రదాడిమతణ్డులైః" పేలాలు, సైంధవలవణము, దనియాలు, శుంఠి, దానిమ్మరసము వీనినన్నిటిని జేర్చి నీళ్లుబోసి చక్కగ కాచి పిసికి వడగట్టబడినది సంస్కృతమండమనియు, శుంఠి పిప్పళ్లు మున్నగుద్రవ్యముల జేర్పక మజ్జిగను, దానిమ్మ పులుపును, బియ్యమును జేర్చి కాచబడినగంజి సామాన్యముగ పేయయనియు నర్థము.

మరియు మండపేయాదులకు లాఘవతారతమ్యమును వాగ్భటు లిట్లుచెప్పిరి:—"మణ్డపేయావిలేపీనా మోదనస్య చ లాఘవం, యథాపూర్వం శివః తత్ర మణ్డో వాతానులోమనః" మండము, పేయ, విలేపి, ఓదనము (అన్నము) అను నీనాల్గిటిలో ముందునకు ఒకటికన్న నొకటి (అన్నమునకంటె విలేపియు, దానికంటె పేయయు, దానికన్న మండంబును) లఘువుగ నుండునని యర్థము.

## ఓదనగుణములు.

మూ. సుధౌతః ప్రస్రుతస్స్విన్నః సన్తప్తశ్చౌదనో లఘుః. ౨౫౫
భృష్టతణ్డులమిచ్ఛన్తి గతశ్లేష్మామయేష్వపి,
అధౌతః ప్రస్రుతః స్విన్నః శీతశ్చాప్యోదనో గురుః. ౨౫౬
(తథా పర్యుషితశ్చైవ ఖరః పిచ్ఛిల ఏవ చ)

వ్యా. బియ్యమును నీళ్లుబోసి చక్కగ కడిగి మెత్తగ నుడికినపిమ్మట గంజివార్చి దానినావిరియందే చక్కగ పక్వముకానిచ్చినయన్నము తేలికగ నుండును. బియ్యము

వేచి పక్వముచేయబడిన యన్నము విషమునందును కఫవ్యాధులయందు నుపయోగింప దగియుండును. నీళ్లు బోసి కడగక చక్కగ నుడకబెట్టి పక్వముజేసి గంజివార్చబడిన యన్నంబును, చల్లబడినయన్నంబును గురుత్వము కల్గియుండును.

ఇచ్చట 'సన్తప్తః' అనగా నుడికినపిమ్మట దానియావిరియంటే మరల చక్కగ పక్వమైనదని యర్థము. చల్లబడినయన్నమును మరల పక్వముచేసినచో నయ్యది వ్యతిరేకమగును. "వివర్జయేత్ స్థిరం శీతమన్నముష్ణీకృతం పునః" అనువాక్యాంతరముచేత చల్లబడి మరల వెచ్చజేయబడిన యన్నము నిషిద్ధము. 'స్విన్నః' అనుపదమునకు ధాన్యము నుడికించి దానిబియ్యముచే చేయబడిన (ఉప్పుడిబియ్యముచే సిద్ధమైన) యన్నమని కొందరు చెప్పెదరు. ఇచ్చట "తథా పర్యుషితశ్చైవ ఖరః పిచ్ఛిల ఏవ చ" అని అధిక పాఠము కొన్నిప్రతులలో నున్నది. రాత్రి గడచినయన్నంబును, చక్కగ పక్వము కాక బిరుసుగ నుండు అన్నంబును, అధికముగ నుడికి (చిమిడి) జిగటగనుండు అన్నంబును గురుత్వము కల్గినదని యర్థము.

మాంసశాకాదుల జేర్చి సిద్ధముచేయబడిన యన్నముగుణము.

మూ. మాంసశాకవసాతైలఘృతమజ్జఫలౌదనాః,

బల్యాః సన్తర్పణా హృద్యా గురవో బృంహయన్తి చ. ౨౫౭

వ్యా. మాంసము, కాయగూరలు, వస, తైలము, నెయ్యి, మజ్జ, పండ్లు వీనిని కూడచేర్చి సిద్ధముచేయబడిన యన్నము బలమును కల్గించును. తృప్తినందించును. హృదయమునకు హితకరమగును. గురుత్వము కల్గియుండును. శరీరపుష్టి నిచ్చును.

మాషాదులచేర్చి పక్వమైన యన్నముగుణము.

మూ. తద్వన్మాషతిలక్షీరముద్గసంయోగసాధితాః,

వ్యా. మరియు ఉద్దిపప్పు, నువ్వులు, పాలు, పెసలపప్పు వీనిలో దేనినైన జేర్చి పక్వముచేయబడిన యన్నంబును పైజెప్పిన బల్యాదిగుణముల గల్గియుండును

కుల్మాష గుణము.

మూ. కుల్మాషా గురవో రూక్షా వాతలా భిన్నవర్చసః　　౨౫౮

వ్యా. (యవలపిండిలో వేడినీళ్లు పోసి యావిరిచే కొద్దిగ నుడికించి యాపిష్టమును పడలపలె జేసిన నయ్యవి కుల్మాషము లనబడును.) అయ్యవి గురుత్వంబును రూక్షగుణంబును కల్గియుండును. వాతమును వృద్ధిజేయును. పురీషమును భేదించును.

## స్విన్నభక్ష్యములగుణములు.

మూ. స్విన్నభక్ష్యాస్తు యే కేచిత్ సౌప్యగోధూమయావకాః,
భిషక్ తేషాం యథాద్రవ్యం ఆదిశేద్గురులాఘవమ్. ౨౮౯

వ్యా. పప్పుదినుసులనైనను గోధుమపిండినైనను యవలపిండినైనను అపూపముల వలె జేసి యావిరిచే నుడికింపబడిన భక్ష్యములు, ఆయాద్రవ్యములకు గల్గిన గురుత్వమైనను లఘుత్వమైనను కల్గియుండునని వైద్యుడు నిర్ణయించునది.

ఇచ్చట "యథాద్రవ్యం గురు లాఘవం" అని నియమించుటచేత లాజలు మున్నగువానికి ప్రకృతిద్రవ్యము నపేక్షింపక సంస్కారవిశేషమునంజేసి గురుత్వాది గుణవిశేషములు సంభవించునటుల సౌప్యాదిభక్ష్యములకు సంస్కారవిశేషమున గుణాంతరము సంభవించక దానిప్రకృతిద్రవ్యములకుం గలగుణములే కల్గియుండునని యెరుంగునది. (స్విన్నమన ఒకపాత్రలో నీళ్లుబోసి వానినగట్టి దానిపైనునిచి మూసి యానీటియావిరిచే నుడికింపబడినది యని యర్థము. అయ్యవి కుడుములు ఉండ్రాళ్లు మున్నగునవి.)

## అకృతకృతయూషాదిగుణతారతమ్యము.

మూ. అకృతం కృతయూషం చ తనుం సంస్కారికం రసం,
సూపమమ్లం అనమ్లం చ గురుం విద్యాద్యథోత్తరం. ౨౯౦

వ్యా. ("అస్నేహ లవణం సర్వం అకృతం కటుకైర్వినా, విజ్ఞేయం లవణస్నేహ కటుకైః సంస్కృతం కృతం" అను తంత్రాంతరవచనము ననుసరించి నెయ్యి మున్నగు చమురులను, ఉప్పును, కారమును జేర్పక పక్వము జేయబడిన పెసరకట్టు మున్నగునది అకృతయూషమనియు, లవణస్నేహకటుకముల జేర్చి సంస్కరించి సిద్ధము చేయబడినది కృతయూషమనియుం దెలిసెడి. మరియు మాంసమును స్వల్పముగ జేర్చి పలుచగ పక్వముచేయబడిన మాంసరసము 'తను' అనియు, మాంసము నధికముగ జేర్చి సంస్కరింపబడి చిక్కనైయుండు మాంసరసము సంస్కారికమనియు చెప్పబడును.)

అకృతయూషము, కృతయూషము, తనుమాంసరసము, సంస్కారికమాంసరసము, పులుపుజేర్చి పక్వముచేయబడిన సూపము (పుల్లనిపప్పు), పులుపుజేర్పక పక్వము చేయబడిన సూపము (తియ్యనిపప్పు), ఇవి యొకదానికన్న నొకటి యధికముగ గురుత్వము కల్గియుండును.

మరియు "పిశితేన రసస్తత్ర యూషో ధాన్యైః ఖలః ఫలైః, మూలైశ్చ తిలకల్కాఢ్యః ప్రాయః కామ్బలికః స్మృతః. జ్ఞేయాః కృతాఽకృతాస్తేతు స్నేహాదియుత

వర్జితాః, అల్పమాంసాదయః స్వచ్ఛా దకలావణికాః స్మృతాః" అను తంత్రాంతరవచనము చేత రసయూషాదిస్వరూపము చెప్పబడినది. మాంసమును చేర్చి సంస్కరించి చేయబడిన ద్రవరూపమైనది రసమనియుం, పెసలపప్పు మున్నగు ధాన్యముల జేర్చి ద్రవరూపముగ జేయబడినది యూషమనియుం, ఫలములను మూలములను జేర్చి పక్వము జేయబడిన ద్రవరూపపదార్థము ఖలమనియుం, నువ్వులపిండిని పులిచింత మున్నగువాని జేర్చి చేయబడినది కాంబలికమనియుం, అయ్యవి స్నేహాదుల జేర్చి సిద్ధము జేయబడినవి కృతములనియుం, అట్టి సంస్కారములేనివి అకృతములనియుం, స్వల్పముగ మాంసము జేర్చినది దకలావణికమనియుం నర్థము. ఇంకయుం వీని భేదములు విస్తరభీతిచే నిట వివరింపబడదయ్యె.

## సత్తుపిండి (పేలపిండి) గుణములు.

మూ. సక్తవో వాతలా రూక్షా బహువర్చోఽనులోమినః,
తర్పయన్తి నరం సద్యః పీతాః సద్యోబలాశ్చ తే.　　౨౬౧

వ్యా. సత్తుపిండి (పేలపిండి) రూక్షగుణమును కల్గినది. వాతమును వృద్ధినొందించును. పురీషము నధికముగ జేసి యనులోమముగ వెడలించును. ఈసత్తుపిండిని ద్రవమున జేర్చి త్రాగినచో వెంటనే (వాజీకరణమునుబోలె) బలమును కల్గించును. తృప్తి నొందించును.

ఇచ్చట "పీతాః" అని చెప్పుటవలన సత్తుపిండిని మజ్జిగ మున్నగు ద్రవపదార్థముతో జేర్చి త్రాగవలెగాని ముద్దజేసి తినకూడదని తెలిసెడి. "సద్యోబలాః" అనుటవలన తాత్కాలికబలకరముగాని కాలాంతరమునకు బలహానిచేయునని యూహింపదగియున్నది. తంత్రాంతరమున "సక్తూనాం ద్రవతాయోగా ల్లఘుత్వ యస్యవలేహికా" అని ద్రవముతో యోగముననే గుణాధిక్యము చెప్పబడినది.

మరియుం సక్తూపయోగమున కొన్నివిశేషముల వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి:—
"నోదకాన్తరితా నద్విః ననిశాయాం న కేవలాన్, న భుక్త్వా న ద్విజైశ్ఛిత్వా సక్తూ నద్యాన్నవా బహూన్" వేపుడుబియ్యపు (పేల) పిండిని త్రాగునప్పుడు నడుమ నీళ్లు త్రాగజనదు. దానిని రెండుపూటలు తినదగదు. రాత్రికాలమునందును భోజనానంతరంబును తినదగదు. ఉదకము మున్నగు ద్రవపదార్థముల జేర్పక పిండిమాత్రము తినకూడదు. పిండిని ఉండలుజేసి పండ్లతో నమలి తినజనదు. అధికముగ తినకూడదు.

## వరిపేలపిండిగుణము.

మూ. మధురా లఘవశ్శీతాః సక్తవశ్శాలిసమ్భవాః,
గ్రాహిణో రక్తపిత్తఘ్నాః తృష్ణాచ్ఛర్దిజ్వరాపహాః.　　౨౬౨

వ్యా. వరిబియ్యముతో చేయబడు పేలపిండి మధురముగను లఘువుగను చల్లదనము గల్గినదిగ నుండును. మలముల నిరోధించును. రక్తపిత్తమును హరించును. దప్పిని వాంతిని జ్వరమును హరించును.

గ్రాహియన తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"భేది తత్పిణ్డితాన్ భావాన్ శకృదాదీన్ భినత్తి యత్, విపరీతమతో గ్రాహి తచ్చ స్తమ్భనముచ్యతే" ఉండలు కట్టి ద్రవము లేకయుండు పురీషాదులను వేరుపరచి భేదించునది భేది యనబడును. దానికి విరుద్ధముగ పురీషాదుల బంధించునది గ్రాహి. ఇదియే స్తంభనమునని యర్థము. భేదిగ్రాహి అనుస్థలములయందెల్ల నీలక్షణము నెరుంగునది.

యవాపూప-యావకవాట్యగుణములు.

మూ. హన్యాద్వ్యాధీన్ యవాపూపో యావకో వాట్య ఏవ చ,
ఉదావర్తప్రతిశ్యాయకాసమేహగళగ్రహాన్. ౨౬౩

వ్యా. యవలపిండిచే చేయబడిన అపూపములు(అప్పములు)ను,యవలను వేయించి చేయబడిన యన్నమును, ఈరెండును ఉదావర్తము, ప్రతిశ్యాయము (పీనసము), దగ్గు, ప్రమేహము, గళగ్రహము (కుత్తుక పట్టియుండుట), అను నీవ్యాధులను హరించును.

వేపుడుబియ్యపుగుణము.

మూ. ధానాసంజ్ఞాస్తు యే భక్ష్యాః ప్రాయస్తే లేఖనాత్మకాః,
శుష్కత్వాత్తర్పణాశ్చైవ విష్టమ్భిత్వాచ్చ దుర్జరాః. ౨౬౪

వ్యా. ధానలు (వేపుడుబియ్యము) ప్రాయికముగ మలాదుల లేఖనము చేయును. అయ్యవి శుష్కము లగుటంజేసి దప్పిని కల్గించును. మలమును బంధించును. దానంజేసి కష్టముగ జీర్ణమగును.

కొన్ని భక్ష్యవిశేషములగుణములు.

మూ. విరూఢధానాశ్శష్కుల్యః మధుక్రోడాః సపిణ్డకాః,
పూపాః పూపలికాద్యాశ్చ గురవః పైష్టికాః పరం. ౨౬౫

వ్యా. మొలకలెత్తినయవల వేయించి చేయబడిన వేపుడుబియ్యము, శష్కులి (చక్కిలములు), మధుక్రోడములు, పూపములు, పూపలికములు ఇవి మున్నగు పిష్టవికారములైన భక్ష్యములు మిక్కిలి గురుత్వము కల్గియుండును.

మధుక్రోడాదిస్వరూపము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"విమర్ద్య సమితాచూర్ణం మృదుపాకం గుడాన్వితం, ఘృతావగాహే గుటికాం వృతాం పక్వాం సకేసరాం. సౌగన్ధికాధివాసాం చ కుర్యాత్పూపలికాం బుధః, స ఏవ ఖణ్డసంయావః సితామ్రాతకపూరితః, మాతులుఙ్గ త్వచా చైవ వేష్టితో మధుశీర్షికః" గోధుమపిండిని చక్కగ మర్దనముచేసి బెల్లము (చక్కెర)తో జేర్చి మృదుపాకముగ పక్వముజేసి కుంకుమపువ్వు పచ్చకప్పురముకల్పి యుండలుజేసి నేతిలోముంచి దానిని (ఆపూర్ణమును) గోధుమపిండిలో పొదిగి అప్పములవలె తట్టి నేతిలో కాల్చిన నయ్యది పూపలికము లనబడును. అదియే ఖండసంయావమనియు చెప్పబడును. (సొజ్జెఅప్పములు). పైజెప్పిన పూర్ణమున చక్కెరను మామిడిపండ్లగుంజును పొదిగి మాదీఫలముల పైతోలుచే గప్పి పక్వముచేసిన మధుశీర్షిక మనబడును. (ఇది పూర్ణముబూరెల బోలియుండును). ఇదియే మధుక్రోడములని చక్రదత్తవ్యాఖ్యలో నున్నది. సపిండకములు సుహియలు, పూపములు అప్పములలో జేరినవి.

## ఫలాదిసంస్కృతభక్ష్యముల గుణవిశేషములు.

మూ. ఫలమాంసవసాశాకపలలక్షౌద్రసంస్కృతాః,
భక్ష్యాః వృష్యాశ్చ బల్యాశ్చ గురవో బృంహణాత్మకాః. ౨౬౬

వ్యా. పండ్లు, మాంసము, వస, శాకములు, పలలము (నువ్వులపిండి), తేనె, వీనిని చేర్చి సంస్కరింపబడిన భక్ష్యములు వృష్యంబులును, బలకరంబులును, గురుత్వము చేయునవియు, శరీరపుష్టికరంబులును నగును.

## వేశవారము, పాలపోళీలు మున్నగువానిగుణములు.

మూ. వేశవారో గురుస్స్నిగ్ధః బలోపచయవర్ధనః,
గురవస్తర్పణా వృష్యాః క్షీరేక్షురసపూపకాః. ౨౬౭
సగుడాస్సతిలాశ్చైవ సక్షీరక్షౌద్రశర్కరాః,
వృష్యా బల్యాశ్చ భక్ష్యాస్తు తే పరం గురవః స్మృతాః. ౨౬౮

వ్యా. వేశవారము గురుత్వంబును స్నిగ్ధత్వంబును కల్గినది. శరీరమునకు బలమును పుష్టిని వృద్ధినొందించును. పాలయందైనను చెరకురసమునందైనను భావనచేయబడిన (నానబెట్టబడిన) పూపకములు (పూరీలు ఇవి పాలపోళీలు మున్నగునవి) గురుత్వమును చేయును. తృప్తినొందించును. వృష్యములు (శుక్రవర్ధకములు) అగును. మరియు

బెల్లము, నువ్వులు, పాలు, తేనె, చక్కెర వీనిని చేర్చి చేయబడినభక్ష్యములు వృష్యంబులును, బలకరంబులును నగును. అయ్యవి తక్కిన భక్ష్యములకన్న మిక్కిలి గురుత్వము కల్గియుండును.

"క్షీరేక్షురసపూపకాః" అనుచోట క్షీరప్రధానంబులును, ఇక్షురసప్రధానంబులు నైన పూపకములని యర్థము. సక్షీర అనుచోట క్షీరము అప్రధానముగ కలిసిన భక్ష్యములని యర్థము. కావున పునరుక్తముకాదు. మరియు వేశవారస్వరూపము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"మాంసం నిరస్థి సుస్విన్నం పునర్దృషదపేషితం, పిప్పలీ ఖణ్డమరిచ గుడసర్పిస్సమన్వితం, ఐకత్ర్యం విపచేత్సమ్యక్ వేశవార ఇతి స్మృతః" ఎముకలు లేక మెత్తగనుండు మాంసమును ఆవిరిచే నుడికించి మరల రాతిపైనునిచి మెత్తగనూరి అందు పిప్పళ్లు, మిరియములు, బెల్లము, నెయ్యి వీనికలిపి అన్నిటి నేకముగజేర్చి చక్కగ నుడికించిన నయ్యది వేశవారమని చెప్పబడును.

## కొన్ని భక్ష్యవిశేషముల గుణనిర్ణయము.

మూ. సస్నేహాః స్నేహసిద్ధాశ్చ భక్ష్యా వివిధలక్షణాః,
గురవస్తర్పణాః వృష్యాః హృద్యా గోధూమికా మతాః ౨౬౯
సంస్కారాల్లఘవస్సన్తి భక్ష్యా గోధూమపైష్టికాః,
ధానాపర్పటపూపాద్యాః తాన్ బుద్ధ్వా నిర్దిశేత్తథా. ౨౭౦

వ్యా. గోధుమనూకలలో చక్కెర నెయ్యి చేర్చి చేయబడిన రవలడ్డు మున్నగు భక్ష్యంబులును, నేతిలోకాల్చబడిన గోధుమలచేనైన భక్ష్యంబులును గురుత్వముచేయును. తృప్తినొందించును. శుక్రమును వృద్ధినందించును. రుచ్యంబులును (హృదయమున కనుకూలంబులును) నగును. మరియు గోధుమపిండిచే చేయబడిన కొన్ని భక్ష్యవిశేషంబులును, ధానలు (వేపుడుబియ్యము)ను, పర్పటకములు (అప్పడములు)ను, పూరీలు మున్నగునవియు సంస్కారవిశేషమునంజేసి లఘుత్వము కల్గియుండును. వానినెల్ల సంస్కారద్రవ్యవిశేషములను, ప్రకృతిద్రవ్యభేదమును చక్కగ గమనించి తత్తదుచితముగ గుణవిశేషమును నిర్ణయింపనగును.

## అటుకులగుణములు.

మూ. పృథుకా గురవో భృష్టాన్ భక్షయేదల్పశస్తు తాన్,
యావా విష్టభ్య జీర్యన్తి సరసా భిన్నవర్చసః. ౨౭౧

వ్యా. వరిధాన్యముచే చేయబడిన అటుకులు గురుత్వచేయును. (కావున) వానిని మరల వేయించి కొద్దిగ తినవలెను. యవలచే చేయబడిన యటుకులు కడుపులో గడబిడ చేసి జీర్ణమగును. మరల వేచకుండునటుకులు పురీషమును భేదించును.

## సూప్యాదిభక్ష్యవిశేషములగుణములు.

మూ. సూప్యాఽన్నవికృతా భక్ష్యా వాతలా రూక్షశీతలాః,
సకటుస్నేహలవణా నల్పశో భక్షయేత్తు తాన్. ౨౭౨

వ్యా. పెసలు మినుములు మున్నగు పప్పుదినుసులచేనైనను, అన్నముచేనైనను చేయబడిన భక్ష్యములు రూక్షగుణంబును శీతవీర్యంబును కల్గియుండును. వాతమును వృద్ధిచేయును. కావున వానిలో కారమును నేతిని ఉప్పును జేర్చి తినవలెను.

## మృదుపక్వ - స్థూల - కఠినభక్ష్యములగుణములు.

మూ. మృదుపాకాశ్చ యే భక్ష్యాః స్థూలాశ్చ కఠినాశ్చ యే,
గురవస్తే వ్యతిక్రాన్తపాకాః పుష్టిబలప్రదాః. ౨౭౩

వ్యా. పూర్తిగ కాలక పచ్చియుండునట్లు కాల్చబడిన భక్ష్యంబులును, స్థూలంబులును కఠినంబులు నైన భక్ష్యంబులును గురుత్వము కల్గించి చిరకాలమునకు జీర్ణించును. శరీరపుష్టిని బలమును చేయును.

## అనుక్తభక్ష్యముల గుణనిర్ణయము

మూ. ద్రవ్యసంయోగసంస్కారం ద్రవ్యమానం పృథక్తథా,
ద్రవ్యాణామదిశేద్బుద్ధ్వా యథాస్వం గురులాఘవం. ౨౭౪

వ్యా. గుణములను ప్రత్యేకముగ నిర్దేశించి చెప్పబడని నానావిధభక్ష్యములకును వానియందు జేర్పబడిన ద్రవ్యవిశేషములను, సంస్కారవిశేషములను, అందు జేర్పబడిన ద్రవ్యములకు సంబంధించి వేరువేరు ప్రమాణమును చక్కగ గమనించి అట్టి ద్రవ్య-సంస్కార-పరిమాణానుసారముగ నెట్టి గురులాఘవగుణము లేర్పడునో అట్టి గుణములను ఆయాభక్ష్యములకు నిర్ణయింపనగునని యర్థము.

(కొన్నిభక్ష్యములకు ద్రవ్యసంయోగమునుబట్టియు, కొన్నిటికి సంస్కారవిశేషమునుబట్టియు గురులాఘవముల నిర్ణయింపనగును. అనేకగుణములు కలద్రవ్యము లనేకములు భక్ష్యవిశేషమున జేరినపుడు వానిభాగములపరిమితిని గమనించి యేది యధికముగ బలాధికముగ నుండునో అట్టి ద్రవ్యమునుబట్టి గుణనిర్ణయము చేయవలెనని భావము.)

### విమర్దక (భక్ష్యవిశేష) గుణము.

మూ. నానాద్రవ్యైస్సమాయుక్తైః పక్వామక్లిన్నభర్జితైః,
విమర్దకో గురుర్హృద్యో వృష్యో బలవతాం హితః. ౨౭౫

వ్యా. పక్వములు, పచ్చిదియు, తడిసినవియు, వేచబడినవియు నైన నానా ద్రవ్యములచే చేయబడిన విమర్దకమను భక్ష్యవిశేషము గురుత్వము చేయును. హృదయమునకు రమ్యముగ నుండును. శుక్రమును వృద్ధినందించును. మిక్కిలి బలముకలవారికి హితకరమగును.

(ఈశ్లోకము ప్రాచీనముద్రితప్రతిలో గానరాదు. వ్యాఖ్యాతయు నేమియు కనపరచలేదు. సర్వాంగసుందరములో నరుణదత్తు డుదాహరణరూపముగ గనపరచెను. గాని "తంత్రాంతరే" అని పేరూరు లేక చెప్పెను.)

### రసాలగుణము.

మూ. రసాలా బృంహణీ వృష్యా స్నిగ్ధా బల్యా రుచిప్రదా.

వ్యా. రసాలయను పానకవిశేషము బలియజేయును. శుక్రవృద్ధిచేయును. స్నిగ్ధముగ నుండును. బలమును రుచిని కల్గించును.

రసాలాస్వరూపము తంత్రాంతరమున నిట్లున్నది:— "సచాతుర్జకాజాజీసగుడార్ద్రకనాగరం, రసాలా స్యాచ్ఛిఖరిణీ సంఘుష్టం సరసం దధి" మీగడతో గూడిన పెరుగు చేతితో చక్కగ చిలికి అందు చాతుర్జాతమును (ఏలకులు, లవంగాలు, దాల్చిని చెక్క, నాగకేసరములు), జీలకర, బెల్లము, అల్లము, శుంఠి వీనినన్నిటిని చేర్చిన నయ్యది రసాల, శిఖరిణి యనియు చెప్పబడును.

### బెల్లముకలిపిన పెరుగుగుణము.

మూ. స్నేహనం తర్పణం హృద్యం వాతఘ్నం సగుడం దధి. ౨౭౬

వ్యా. బెల్లమును జేర్చిన పెరుగు శరీరమును స్నిగ్ధముగజేయును. తృప్తినొందించును. హృదయమునకు హితకరము. (మనోజ్ఞము), వాతమును హరించును.

### ద్రాక్ష, ఖర్జూరపుపండు మున్నగువాని పానకములగుణములు.

మూ. ద్రాక్షాఖర్జూరకోలానాం గురు విష్టమ్భి పానకం,
పరూషకాణాం క్షౌద్రస్య యచ్చేక్షువికృతిం ప్రతి ౨౭౭
తేషాం కట్వమ్లసంయోగాః పానకానాం పృథక్పృథక్,
ద్రవ్యమానం చ విజ్ఞాయ గుణకర్మాణి చాదిశేత్. ౨౭౮

వ్యా. ద్రాక్షపండ్లరసము, ఖర్జూరపుపండ్లరసము, కమ్మరేగుపండ్లరసము వీనిచే చేయబడిన పానకములు గురుత్వముచేయును. మలబద్ధకనుచేయును. మరియు ఈతపండ్ల పానకంబును, తేనెపానకంబును, చెరుకు రసవికారములగు బెల్లము చక్కెర మున్నగు వాని పానకంబులును పైజెప్పిన గుణములగల్గియుండును. అట్టి పానకములయందు పులుపును కారమును జేర్చినయెడ ఆయాద్రవ్యముల సంయోగమును ఆద్రవ్యముల పరిమాణమునుబట్టి తత్తదనుగుణముగ గుణకర్మాదుల నెరుంగునది.

## రాగ - షాడబములగుణము.

మూ. కట్వమ్లస్వాదులవణాః లఘవో రాగషాడబాః,
ముఖప్రియాశ్చ హృద్యాశ్చ దీపనాః భక్తరోచనాః.    ౨౭౯

వ్యా. రాగములు, షాడబములు, అనుపానకభేదములు కారము పులుపు తీపి ఉప్పును కలిసియుండును. తేలికగ జీర్ణమగును. నోటికి చాల యింపుగ నుండును. మనోహరములై హృదయమున కనుకూలంబులును నగును. అగ్నిని దీపింపజేయును. అన్నము చక్కగ రుచించును.

రాగషాడబముల స్వరూపములు తంత్రాంతరమున నిట్లున్నది.—"క్వథితం తు గుడోపేతం సహకారఫలం నవం, తైలనాగరసంయుక్తం విజ్ఞేయో రాగషాడబః" "సితారుచకసిద్ధార్థైః సవృక్షామ్లపరూషకైః, జమ్బూఫలరసైర్యుక్తో రాగో రాజికయాన్వితః" నీళ్లతో బెల్లమును తియ్యమామిడిపండ్లను చేర్చి చక్కగ కాచి యారసమున తైలమును శుంఠిని చేర్చిన నయ్యది రాగషాడబ మనబడును. (ఇది యొక పద్ధతి) చక్కెర,మాదీఫలములరసము, (లేక సౌవర్చలలవణము), తెల్లావాలు, వృక్షామ్లము (చింతపండు) చిట్టీతపండు, నేరేడుపండ్లరసము వీని నన్నిటిని జేర్చి పక్వముజేసి ఆవాలతిరుగబోతపెట్టిన నయ్యది రాగ మనబడును. (ఇది రెండవపద్ధతి) ఇందు మొదటిపద్ధతిలో రాగషాడబమని యొకటిగనే తెలిసెడి. రెండవపద్ధతిలో రాగమనునది మాత్రము చెప్పబడినది. ఈపక్షమున షాడబ మనునది వేరుగ నుండవలెను. "షాడబస్తు మధురామ్లద్రవ్యకృతః" అని చక్రదత్తవ్యాఖ్యానమున నున్నది.

## మామిడిపండ్లు మున్నగువానిలేహములగుణములు.

మూ. ఆమ్రామలకలేహాశ్చ బృంహణా బలవర్ధనాః,
రోచనాస్తర్పణాశ్చోక్తాః స్నేహమాధుర్యగౌరవాత్    ౨౮౦

వ్యా. మామిడిపండ్లరసముచేతను ఉసిరికకాయలరసముచేతను చేయబడిన లేహములు (అట్టిరసమున చక్కెర కలిపి ముద్దగ నుండునట్లు చేయబడినలేహములు) శరీర

పుష్టిని బలమును వృద్ధినొందించును. రుచి పుట్టించును. తృప్తి నందించును. అయ్యది స్నిగ్ధములై మాధుర్యంబును గురుత్వంబును కల్గియుండుటంజేసి బృంహణాదిక్రియల జేయునని భావము.

## అనుక్తలేహముల గుణకర్మములనిర్ణయము.

మూ. బుద్ధ్వా సంయోగసంస్కారం ద్రవ్యమానం చ తచ్ఛ్రితం,
గుణకర్మాణి లేహానాం తేషాం తేషాం తథా వదేత్. ౨౮౧

వ్యా. పైని జెప్పబడిన లేహములలో నేయేలేహమున నేయేద్రవ్యము లెంతెంత మాత్రము జేర్పబడునో, ఆయాద్రవ్యములయొక్క గుణములను, ద్రవ్యపరిమాణమును చక్కగ గమనించి తత్తదనుసారముగ గుణములను వానికృత్యములను నిర్ణయింపవలెనని భావము.

## శుక్త - ఆసుతగుణములు.

మూ. రక్తపిత్తకఫోత్క్లేది శుక్తం వాతానులోమనం,
కన్దమూలఫలాద్యం చ తద్వద్విద్యాత్తదాసుతం. ౨౮౨

వ్యా. ("యన్మస్త్వాదిశుచౌ భాణ్డే సగుడక్షౌద్రకాంజికం, ధాన్యరాశౌ త్రిరాత్రస్థం శుక్తం చుక్రం తదుచ్యతే" మీగడ మున్నగువానియందు బెల్లమును తేనెను కాంజికమును (పులిగంజిని) కలిపి, పరిశుద్ధమైన యొకకుండలో బోసి మూడురాత్రులు ధాన్యరాశియం దునిచిన నయ్యది శుక్తమనియు చుక్రమనియు చెప్పబడును.) అట్టి శుక్తమున నూరవేయబడిన కందమూలఫలాదులు ఆసుతము) పైజెప్పినశుక్తంబును, అందూరబెట్టబడిన కందమూలఫలాదులును రక్తపిత్తమును కఫమును రేపెట్టును. వాతమును అనులోమముగ జేయును. "తద్వద్విద్యాత్తదాసుతం" అనుటచేత ఏద్రవ్యముచే సిద్ధమైనశుక్తమునందు కందమూలఫలాదు లూరవేయబడునో, అట్టిశుక్తమునకు నైసర్గికములగు గుణాదులు ఆయాఆసుతములకును కల్గును, కాని కందమూలాదులకు నైసర్గికములైన గుణాదు లుండవని భావము.

## శాండాకీగుణములు.

మూ శాణ్డాకీ చాసుతం చాన్యత్ కాలామ్లం రోచనం లఘు,

వ్యా. (ముల్లంగియాకు ఆవకూర ఈరెంటిని చేర్చి కషాయముబెట్టి అందు నల్లజీలకర, ఆవాలు చేర్చి తిరుగబోతబెట్టి పైజెప్పినరీతిగ పులియబెట్టిన నయ్యది శాండాకి యనబడును.) శాండాకియు ఇతరద్రవ్యములతో సంధానముచేయబడి ఆమ్లద్రవ్యముల సంబంధములేకయే తనంతనే పులిసినదియు రుచిని బుట్టించును. తేలికగ జీర్ణమగును.

శాండాకీస్వరూపము తంత్రాంతరమున నిట్లున్నది.—"శాండాకీ రాజికా యుక్తాత్ స్యాన్మూలికదళద్రవాత్, సర్షపస్య రసైర్వాపి శాలిపిష్టకసంయుతాత్" దీని వివరణమే పైని చెప్పబడినది.

కృతాన్నవర్గసమాప్తి.

మూ. విద్యాద్వర్గం కృతాన్నానాం ఏకాదశతమం భిషక్. ౨౮౩

ఇతి కృతాన్నవర్గః.

---

వ్యా. ఇత్తెరంగున కృతాన్నవర్గమును పదునొకండవవర్గమును వైద్యవరు డెరుంగునది. (పాకాదిక్రియలచే రూపాంతరమునొందిన మండపేయాద్యాహారపదార్థములు కృతాన్నములు. వానివర్గము కృతాన్నవర్గము పదునొకండవది యని యర్థము.)

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది.—శూకశింబి మున్నగుధాన్యాదివర్గములలో జెప్పినయాహారపదార్థములను సంస్కారాదిక్రియలంజేసి రూపాంతరము నొందించిన యాహారద్రవ్యము కృతాన్నము. అయ్యది భక్ష్యభోజ్యలేహ్యపేయాదిరూపభేదములు కల్గియుండును. అట్టికృతాన్నములవర్గము (సముదాయము) నుద్దేశించి గుణకర్మాదులు వేరువేరుగ పైవర్గమున వివరింపబడినవి. అందు శూకశింబి మున్నగువర్గములలో నాయాద్రవ్యములకు వేరువేరగుణాదులు చెప్పబడినవి. కృతాన్నవర్గములో మండపేయాదులకు వేరువేరుగ గుణకర్మాదులు చెప్పబడినవి. ఈవర్గమున జెప్పినగుణకర్మాదులలో కొన్ని సంస్కారవిశేషమున కల్గునవి. కొన్ని వానికి ప్రకృతిభూతమగుద్రవ్యము నాశ్రయించి యుండునవి. అందు ప్రకృతిభూతద్రవ్యగుణంబులును, సంస్కారాదివిశేషమున గల్గిన గుణంబులును అనుగుణంబులైయున్నచో అట్టిమండపేయాదులు వానికి నియమితకృత్యములను పూర్తిగ జేయనోపును అటుగాక కృతాన్నద్రవ్యమునకన్న దానిప్రకృతిభూతద్రవ్యగుణము విరుద్ధముగ నున్నయెడ అట్టిపేయాదులకు విధించినగుణములు స్వల్పములై వానికృత్యముల స్వల్పముగనే జేయును. కావున నింతమాత్రముననే ధాన్యాదివర్గములకు జెప్పినగుణాదు లెప్పుడును వ్యర్థములని భ్రమింప గూడదు. (రక్తశాల్యాదిప్రకృతిభూతద్రవ్యములకు దానగల్గుమండపేయాదులకు గుణైక్యమున్నచో నవి స్వకృత్యమును పూర్తిగ జేయ సమర్థమగుననియు, అటుగాక మండపేయాదిగుణములకు విరుద్ధగుణములు వానిప్రకృతిభూతద్రవ్యమున గల్గియుండునేని, అట్టియాహారద్రవ్యమునకు సంస్కారవశమున గల్గినగుణకృత్యములు స్వల్పముగ నుండుననియు ఫలితార్థము.)

ఇది కృతాన్నవర్గము.

## (౧౨) ఆహారయోగివర్గము

ఆహారమున కుపయోగింపదగిన వర్గగుణాదుల జెప్పినపిమ్మట అట్టియాహారమున జేర్పబడు (సంస్కారవిశేషమున జేర్పబడు) ద్రవ్యము గణము వివరింపబడును.

### నువ్వులనూనెగుణములు.

మూ. అథ ఆహారయోగివర్గః—

కషాయానురసం స్వాదు సూక్ష్మముష్ణం వ్యవాయి చ,
పిత్తలం బద్ధవిణ్మూత్రం న చ శ్లేష్మాభివర్ధనం ౨౮౪
వాతఘ్నేషూత్తమం బల్యం త్వచ్యం మేధాగ్నివర్ధనం,
తైలం సంయోగసంస్కారాత్ సర్వరోగాపహం మతం. ౨౮౫
తైలప్రయోగాదజరాః నిర్వికారాః జితశ్రమాః,
ఆసన్నతిబలాః సజ్యే దైత్యాధిపతయః పురా. ౨౮౬

వ్యా. నువ్వులనూనె వగరు ననురసముగను తీపి ప్రధానరసముగను కల్గియుండును. (సూక్ష్మగుణమును శరీరమునందలి సూక్ష్మరంధ్రములయందును వ్యాపించు స్వభావమును) కల్గినది. ఉష్ణవీర్యము. వ్యవాయి (శరీరమున తొలుత నే వ్యాపించి పిమ్మట జీర్ణమగు స్వభావముకల్గినది). పిత్తమును వృద్ధినందించును. మలమూత్రముల బంధించును. కఫమును వృద్ధినందించక సమస్థితి నుంచును. వాతహరద్రవ్యములలో నయ్యది యుత్తమము. బలకరము. అభ్యంజనమువలన చర్మమునకు హితకరము. బుద్ధికౌశలమును జఠరాగ్నిని వృద్ధినొందించును. ఇయ్యది వస్త్వంతరసంయోగముచేతను, లేక పానరూపమైనసంయోగమునను,సంస్కారము (ఓషధులజేర్చి పాకముజేయుట) వలనను, పలుతెరంగులైనరోగముల నన్నింటిని హరించును. మరియు మున్ను దేవాసురయుద్ధమున రాక్షసులు తైలము నుపయోగించుటచే ముదిమిని బాసి రోగరహితులై యుద్ధశ్రమమును సరకుజేయక బలాధికులై జయమునొందిరి. (కావున నియ్యది మిగుల శ్రేష్ఠమని భావము.)

ఇచ్చట త్వచ్యమన నభ్యంగనముచే చర్మమునకు హితకరమని యర్థము. పానము చేత చర్మమునకు హితకరము కాక దోషకరమని యెరుంగునది. ఈయభిప్రాయము చేతనే 'త్వగ్దోషకృదచక్షుష్యం' అని వాగ్భటాచార్యులు చెప్పిరి. దీనివ్యాఖ్యానమున "తథా త్వగ్దోషకృత్, పానాఖ్యాసేన త్వచం దూషయతి" అని వచించిరి.

### ఆముదపుగుణము.

మూ. ఏరణ్డతైలం మధురం గురు శ్లేష్మాభివర్ధనం,
వాతాసృగ్గుల్మహృద్రోగజీర్ణజ్వరహరం పరం. ౨౮౭

వ్యా. ఆముదము మధురరసము కల్గినది. గురుత్వముకల్గి కఫమును వృద్ధి నొందించును. వాతరక్తమును, గుల్మరోగమును, హృద్రోగమును, జీర్ణ (ప్రాతబడిన) జ్వరమును హరించును.

### ఆవనూనెగుణము.

మూ. కటూష్ణం సార్షపం తైలం రక్తపిత్తప్రదూషణం,
కఫశుక్రానిలహరం కణ్డూకోఠవినాశనం ౨౮౮

వ్యా. ఆవనూనె కారంబును ఉష్ణవీర్యంబును కల్గినది. రక్తపిత్తమును కల్గించును. కఫమును శుక్రమును వాతమును హరించును. దురదను దద్దులను పోగొట్టును.

### చారపప్పునూనెగుణము.

మూ. ప్రియాలతైలం మధురం గురు శ్లేష్మాభివర్ధనం,
హితమిచ్ఛన్తి నాత్యౌష్ణ్యాత్ సంయోగే వాతపిత్తయోః.

వ్యా. చారపప్పునుండి తీయబడిననూనె మధురముగ నుండును. గురుత్వము చేయును. కఫమును వృద్ధినొందించును. ఇయ్యది మిక్కిలి యుష్ణముగాక (సమోష్ణముగ) నుండుటంబట్టి వాతపిత్తములు రెండును కలిసినవ్యాధియందు హితకరమని చెప్పెదరు.

### అగసినూనెగుణము.

మూ. ఆతస్యం మధురామ్లం తు విపాకే కటుకం తథా,
ఉష్ణవీర్యం హితం వాతే రక్తపిత్తప్రకోపనం ౨౯౦

వ్యా. అగసినూనె మధుర, అమ్లరసంబును, కటువిపాకంబును, ఉష్ణవీర్యంబును కల్గినది. వాతమున నిది హితకరము, రక్తపిత్తముల ప్రకోపింపజేయును. మరియు "ఉమాకుసుమ్భజైతలం చ త్వగ్దోషకఫపిత్తకృత్" అను వాగ్భటవచనము ననుసరించి అగసినూనెయును కుసుమనూనెయును చర్మరోగముల గల్గించునని తెలిసెడి.

### కుసుమలనూనెగుణము.

మూ. కుసుమ్భతైలముష్ణం చ విపాకే కటుకం గురు,
విదాహి చ విశేషేణ సర్వరోగప్రకోపనం. ౨౯౧

వ్యా. కుసుమనూనె ఉష్ణవీర్యంబును కటువిపాకంబును కల్గినది. గురుత్వమును జేయును. విదాహిగుణము కల్గినది. ఇయ్యది యన్నిరోగములను విశేషముగ ప్రకోపింపజేయును.

## అనుక్తతైలముల గుణకర్మ నిర్ణయము.

మూ. ఫలానాం యాని చాన్యాని తైలాన్యాహారసన్నిధౌ,
యుజ్యన్తే గుణకర్మభ్యాం తాని బ్రూయాద్యథాఫలం. ౨౯౨

వ్యా. మరియు పైనివివరింపకుండు నితరములైన తైలములకు ఆహారవిషయమున నేయేఫలములకు నేయేగుణకర్మములు తగియుండునో, అట్టిఫలాదులవిత్తనములచే నీతైలములకును ఆయాఫలములగుణము కల్గియుండునని యెరుంగునది.(ఆయాఫలములకు జెప్పిన గుణములే ఆయాఫలముల విత్తనములచేనైన చమురులకును ఉండునని భావము.)

ఇచ్చట 'ఫలానాం' అనుపదము సారమునకు నుపలక్షణము కావున శ్రీగంధము దేవదారు మున్నగు చేవకొయ్యలవలన బుట్టుతైలములును, పాలమడ్డి సాంబ్రాణి మొదలగు జిగురులవలన బుట్టుతైలములును ఆయాతైలముల కుత్పత్తికారణములైనద్రవ్యముల గుణములు కల్గియుండునని యర్థము.

ఇచ్చట తైలమన "తిలేభ్యో భవం తైలం" అనువ్యుత్పత్తిచేత యోగరూఢముగ నువ్వులనూనె యని యర్థము. అట్లున్నను అట్టి నువ్వులనూనెతో సమానగుణములు కల్గియున్న ఏరండాదిస్నేహములైన ఆముదము ఆవనూనె మున్నగు చమురుజాతులన్నియు తైలమని చెప్పబడును. ('అగ్నిర్మాణవకః' అన్నచోట బ్రహ్మచారి అగ్ని కాకున్నను, పారిశుద్ధ్యాదిగుణములసాదృశ్యమునుబట్టి అగ్నిశబ్దముచే జెప్పబడునట్లు తైలము (నువ్వులనూనె)నందలి వాతహరత్వాదిగుణములు తక్కినవానియందును ఉండుటంబట్టి గౌణవృత్తి నవలంబించి ఏరండతైలము, సర్షపతైలము ఇత్యాదివ్యవహారము కల్గినదని భావము.) ఈయర్థమునే సుశ్రుతాచార్యులు ఇట్లు చెప్పిరి:—"యావన్తః స్థావరాః స్నేహాః సమాసాత్పరికీర్తితాః, సర్వే తైలగుణాః జ్ఞేయాః సర్వే చానిలనాశనాః" స్థావరస్నేహము(నూనె ఆముదము మున్నగునవి) లన్నియు వాతహరములై తైలగుణము కల్గియుండునని భావము. మరియు "నిష్పత్తేస్తద్గుణత్వాచ్చ తైలత్వమితరేష్వపి" అనియు సుశ్రుతులు చెప్పిరి.

## మజ్జవసలగుణములు.

మూ. మధురో బృంహణో వృష్యో బల్యో మజ్జా తథా వసా,
యథాసత్వం తు శైత్యోష్ణే వసామజ్జ్ఞోర్వినిర్దిశేత్. ౨౯౩

వ్యా. జంగమస్నేహములలోఁ జేరిన మజ్జ (అస్థులలోపల నుండు క్రొవ్వు), వస (శుద్ధమాంసమునందలి చమురు) ఈరెండును మధురముగ నుండును. శరీరమునకును శుక్రమునకు పుష్టిని బలమును కల్గించును. మరియు నీరెండును అవి యేజంతువులకు సంబంధించినవి యగునో ఆజంతువులకు సంబంధించిన యుష్ణగుణం బైనను శీతగుణం బైనను కల్గియుండును. (జాంగలానూపదేశభేదములచే జంతువులకు శీతోష్ణగుణభేదములు కల్గియుండును. వానివలన పుట్టినవసామజ్జలకును అట్టిగుణములే కల్గియుండునని భావము.) "శుద్ధమాంసస్య యస్స్నేహః సా వసా పరికీర్తితా" అని వసాస్వరూపము తంత్రాంతరమున నున్నది.

శుంఠిగుణము.

మూ. స్నేహనం దీపనం వృష్యం ఉష్ణం వాతకఫాపహం,
విపాకమధురం హృద్యం రోచనం విశ్వభేషజం.    ౨౯౪

వ్యా. విశ్వభేషజము (శుంఠి) శరీరమును స్నిగ్ధముగ జేయును. అగ్నిని దీపింపజేయును. శుక్రమును వృద్ధినందించును. ఉష్ణవీర్యము కఫమును హరించును. విపాకమున మధురమగును. హృదయమునకు హితకరము. రుచిని పుట్టించును.

పిప్పలిగుణము.

మూ. శ్లేష్మలా మధురా చార్ద్రా గుర్వీ స్నిగ్ధా చ పిప్పలీ,
సా శుష్కా కఫవాతఘ్నీ కటూష్ణా వృష్యసమ్మతా.    ౨౯౫

వ్యా. పిప్పలి పచ్చిదిగ నున్నప్పుడు కఫమును వృద్ధినందించును. మధురముగ నుండును. గురుత్వము జేయును. స్నిగ్ధముగ నుండును. అయ్యది యెండినచో కఫవాతముల హరించును. కటురసంబును ఉష్ణవీర్యంబును కల్గి యుండును. వృష్యమగును.

మిరియాలగుణము.

మూ. నాత్యర్థముష్ణం మరిచం అవృష్యం లఘు రోచనం,
ఛేదిత్వాత్ శోధనత్వాచ్చ దీపనం కఫవాతజిత్    ౨౯౬

వ్యా. మిరియాలు కొంచెముగ నుష్ణగుణము కల్గినది. వృష్యము కానేరదు. తేలికగ జీర్ణమగును. రుచిని పుట్టించును. ఇయ్యది భేదనంబును శోధనంబును నగుటం జేసి యగ్నిని దీపింపజేయును. కఫవాతముల హరించును.

మరియు "స్వాదు పాక్యార్ద్రమరిచం గురు శ్లేష్మవివర్ధనం" అను సుశ్రుతవాక్యమునుబట్టి పచ్చిమిరియాలు మధురవిపాకంబును గురుత్వంబు కల్గి కఫవర్ధకమగునని తెలిసెడి. కావున ప్రకృతమున చెప్పినగుణములు ఎండుమిరియాలకని తెలియునది.

### ఇంగువగుణము.

మూ. వాతశ్లేష్మవిబన్ధఘ్నం కటూష్ణం దీపనం లఘు,
హిఙ్గు శూలప్రశమనం విద్యాత్పాచనరోచనం. ౨౯౭

వ్యా. ఇంగువ కారముగను ఉష్ణవీర్యముగను తేలికగ జీర్ణమగునదిగ నుండును. వాతకఫములను మలబంధమును పోగొట్టును. అగ్నిని దీపింపజేయును, శూలరోగమును శమింపజేయును. ఆహారమును జీర్ణముజేసి రుచి పుట్టించును.

### సైంధవలవణగుణము.

మూ. రోచనం దీపనం వృష్యం చక్షుష్యమవిదాహి చ,
త్రిదోషఘ్నం సమధురం సైన్ధవం లవణోత్తమం. ౨౯౮

వ్యా. సైంధవలవణము (ఇందుప్పు) రుచిని పుట్టించును. అగ్నిని దీపింపజేయును. వృష్యమగును. కన్నులకు హితకరము. అవిదాహి (విపాకమున తాపము కల్గింపనిది), త్రిదోషముల హరించును. కొంచెముగ మధురమగును. ఇయ్యది లవణములలో మిగుల శ్రేష్ఠమైనది.

### సౌవర్చలలవణగుణము.

మూ. సౌక్ష్మ్యాదౌష్ణ్యాల్లఘుత్వాచ్చ సౌగన్ధ్యాచ్చ రుచిప్రదం,
సౌవర్చలం విబన్ధఘ్నం హృద్యముద్గారశోధి చ. ౨౯౯

వ్యా. సౌవర్చలలవణము సూక్ష్మగుణము (శరీరమున సూక్ష్మరంధ్రములయందును వ్యాపించు స్వభావము), ఉష్ణగుణము, లఘుత్వము (తేలిక), మంచి పరిమళము అను నీగుణములు కల్గినది. కావున రుచిని పుట్టించును. మలబంధమును హరించును. హృదయమునకు హితకరము త్రేనుపులను ఓకళింతలను నివర్తిపరచును.

### బిడాలవణగుణము.

మూ. తైక్ష్ణ్యాదౌష్ణ్యాద్వ్యవాయిత్వాద్దీపనం శూలనాశనం,
ఊర్ధ్వం చాధశ్చ వాతానామానులోమ్యకరం బిడం. ౩౦౦

వ్యా. బిడాలవణము తీక్ష్ణత్వంబును, ఉష్ణత్వంబును, వ్యవాయిత్వంబును (తొలుత శరీరమునందెల్ల వ్యాపించి పిమ్మట జీర్ణమగుస్వభావము) కల్గినది; కావున అగ్నిని దీపింపజేయును. శూలరోగమును పోగొట్టును. ఊర్ధ్వవాతమును అధోవాతమును అనులోమముగ జేయును.

### ఔద్భిదలవణగుణము.

మూ. సతిక్తకటుకం క్షారం (సక్షారం) తీక్ష్ణముత్క్లేది చౌద్భిదం,

వ్యా. (ఉత్తరదేశమున నుత్కారికయను నామాంతరముకలలవణము ఔద్భిదము) ఇయ్యది కారముగను ఉప్పగ నుండును. చేదు కూడ కలిసి యుండును. తీక్ష్ణగుణము కల్గినది. నోట ద్రవమును వెడలించును. (దీనిని పూనీరు అని దాక్షిణాత్యులు చెప్పె దరు.) భూమిని పగులదీసి పుట్టినది ఔటి ఉప్పు అని కొందరు చెప్పెదరు.

### కృష్ణలవణగుణము.

మూ. న కాలలవణే గన్ధః సౌవర్చలగుణాశ్చ తే. 300

వ్యా. కాలలవణము (నల్లనియుప్పు) సౌవర్చలలవణమునకు జెప్పిన గుణములలో సుగంధమొక్కటి దక్క తక్కిన సౌత్మ్యాదిగుణములు కల్గియుండును.

### సాముద్ర-కాచలవణములగుణములు.

మూ. సాముద్రకం సమధురం సతిక్తం కటు పాంసుజం

వ్యా. తూర్పుసముద్రమునబుట్టిన వాడుకలోని యుప్పు సాముద్రము. ఇది కొంచెము మధురముగ నుండును. పాంసువుల బుట్టిన లవణము(దీనిని సిరాలవణమనియు, కాచలవణ మనియు నందురు). చేదుగను ఉప్పగను ఉండును. వాగ్భటులు 'పాంసూత్థం సక్షారం శ్లేష్మలం గురు' అని చెప్పిరి.

### సర్వలవణసామాన్యగుణములు.

మూ. రోచనం లవణం సర్వం పాకి స్రంస్యనిలాపహం. 30౨

వా. పైజెప్పిన లవణంబును ఇతర లవణంబులును అన్నియు రుచిని పుట్టించును. జీర్ణశక్తిని కల్గించును. మలమును వెడలించును. వాతమును హరించును. (పిత్తకఫముల వృద్ధినొందించుట లవణములకు సహజగుణమని యెరుంగునది. వాగ్భటులు "కఫపిత్త కృత్" అని కంఠోక్తిగనే చెప్పిరి).

### య వ క్షా ర గు ణ ము.

మూ. హృత్పాణ్డుగ్రహణీదోషప్లీహానాహగళగ్రహాన్,
కాసం కఫజమర్శాంసి యావశూకో వ్యపోహతి 303

వ్యా. యవలముండ్లవలన బుట్టిన క్షారము యావశూకము. (ఇదియే యవ క్షారము). ఇయ్యది హృదయరోగమును, పాండురోగమును, గ్రహణిదోషమును, ప్లీహ

వృద్ధిని, కడుపుబ్బరమును, గళగ్రహము (కుత్తుకపట్టియుండుట)ను, కఫమునకల్గిన దగ్గును, అరోచకరోగము వీని నన్నింటిని హరించును. (ఇచ్చట క్షారములయందును లవణ ముండుటచే వాని గుణములును చెప్పబడినవని యెరుంగునది).

సర్వక్షార సామాన్యగుణములు.

మూ. తీక్ష్ణోష్ణో లఘు రూక్షశ్చ క్లేదీ పక్తా విదారణః,
దాహనో దీపనశ్ఛేత్తా సర్వః క్షారోఽగ్నిసన్నిభః 304

వ్యా. సర్వక్షారము మున్నగు క్షారములన్నియుం తీక్ష్ణ-ఉష్ణ-లఘు-రూక్షగుణముల గల్గియుండును. ద్రవమును పుట్టించును. ఆహారమును పచింపజేయును. వ్రణాదుల పగులదీయును మంట బుట్టించును. అగ్నిదీప్తిని కల్గించును. గ్రంథులు మున్నగువానిని భేదించును. ఇయ్యది యగ్ని తుల్యమైయుండును.

జీలకఱ్ఱ మున్నగువానిగుణములు.

మూ కారవ్యః కుఞ్చికాఽజాజీ యవానీ ధాన్యతుమ్బురు,
రోచనం దీపనం వాతకఫదౌర్గన్ధ్యనాశనం. 305

వ్యా. నల్లజీలకర, పెద్దజీలకర, సన్నజీలకర, ఓమము, దనియాలు, నేపాళపు దనియాలు, ఇవి యన్నియుం రుచిని పుట్టించును. అగ్నిని దీపింపజేయును. వాతమును కఫమును, దుర్గంధమును హరించును.

ఆహారయోగివర్గసమాప్తి.

మూ ఆహారయోగినాం భక్తినిశ్చయో న తు విద్యతే,
సమాప్తో ద్వాదశశ్చాయం వర్గ ఆహారయోగినాం. 306

ఇత్యాహారయోగివర్గః.

---

వ్యా. ఆహారపదార్థములలో చేర్పదగిన ద్రవ్యములు ఇవియే యని నిర్ణయించి చెప్ప వీలుపడదు. అయినను సామాన్యముగ నాహారయోగిద్రవ్యముల గొన్నిటిమాత్రము ఇందుదాహరణరూపముగ జూపి యాహారవర్గమను పండ్రెండవవర్గము ముగింపబడినది.

(భక్తి యనగ ప్రీతి. లోకమున మనుజులకు ప్రీతి యాహారమున జేర్పగల ద్రవ్య ములవిషయమై యొకవిధముగ నుండబోదు. కావున నివియే యాహారయోగిద్రవ్యము

లనియుఁ, ఇవి యందరకును ఇష్టములైనవనియుఁ నిర్ణయింప సాధ్యముకాదు కావున వారి వారియిష్టము ననుసరించి యీచెప్పినవానిలో విడచుటకును చెప్పకుండు ఉల్లిపాయలు మున్నగువాని జేర్చుటకును వారివారి యిచ్ఛానుగుణముగ నుండును. ఇచ్చట దిఙ్మాత్రముగ జెప్పబడినదని భావము.)

ఇది యాహారయోగివర్గము.

---

ఇత్తెరంగున "శూకధాన్యం శమీధాన్య... యోగినాం" అని యుద్దేశించినప్రకారము ఆహారద్రవ్యములయొక్క పండ్రెండువర్గములలోని ద్రవ్యములకును గుణాదులు సామాన్యముగ వేరువేర జెప్పబడినవి. అట్టి ద్రవ్యగుణములకు సంబంధించిన విశేష (పైని చెప్పబడని) గుణము లీక్రింద నాయావర్గములకు వేరు వేరుగ వివరింపబడును.

ధాన్య విశేష గుణము.

మూ. శూకధాన్యం శమీధాన్యం సమాతీతం ప్రశస్యతే,
పురాణం ప్రాయశో రూక్షం ప్రాయేణాఽభినవం గురు. ౩౦౭
యద్యదాగచ్ఛతి క్షిప్రం తత్తల్లఘుతరం స్మృతం,
నిస్తుషం యుక్తిభృష్టం తు సూప్యం లఘు విపచ్యతే. ౩౦౮

వ్యా. పైజెప్పిన శూక (వరి) ధాన్యంబును శమీ (కాయ) ధాన్యంబును పండిన పిదప నొకసంవత్సరము గడచిన ప్రాతది మిగుల ప్రశస్తము. అంతకన్న నధికకాలము (రెండుమూడు సంవత్సరములు) గడచి మిక్కిలి ప్రాతది యగునెడ నయ్యది రూక్ష గుణము కల్గినది యగును. (ఒకవత్సరకాలము ప్రాతబడినధాన్యము చులకనగ జీర్ణమగు లఘుగుణము కల్గియుండుటచే ప్రశస్తమగుననియుఁ, అంతకన్న నధికకాలము ప్రాతది యగునెడ రూక్షగుణము గల్గియుండును కావున శ్రేష్ఠము కాదనియు భావము.)

పైజెప్పినవిధముగాక నూతనమైనధాన్యము (ఆసంవత్సరమున పండిన క్రొత్త ధాన్యము) గురుత్వము కల్గియుండును. (అందును మిక్కిలి నూతనమైనది మిక్కిలి గురుత్వముకల్గి చాలకాలమునకు జీర్ణమగునని యర్థము).

మఱియుఁ నేయేధాన్యము శీఘ్రముగ ఫలించునో అవి యన్నియుఁ మిక్కిలి లఘుత్వము కలిగియుండును. (షష్టికధాన్యము అరువదిదినములకే ఫలించును. కావున నియ్యది మిక్కిలి చులకన కల్గియుండునని భావము.) మరియుఁ సూపయోగ్యమైన పెసలు మున్నగునవి పొట్టూడదీసి కొంచెముగ వేచబడినయెడ తేలికగ జీర్ణమగును.

ఇచ్చట "ప్రాయో రూక్షం ప్రాయేణాభినవం" అనుచోట ప్రాయశ్శబ్దమునకు విశేషమని యర్థము కావున మిక్కిలి ప్రాతధాన్యము, మిక్కిలి నవీనమునని విశేషార్థ మగును. (ఇది ధాన్యవర్గమున ననుక్తగుణకథనము.)

## నిషిద్ధమాంసము.

మూ. మృతం కృశాఽతిమేధ్యం చ (కృశమమేధ్యం చ)
వృద్ధం బాలం విషైర్హతం,
అగోచరభృతం వ్యాళసూదితం మాంసముత్సృజేత్. 309
అతోఽన్యథా హితం మాంసం బృంహణం బలవర్ధనం,

వ్యా. తనంతటనే చచ్చిన జంతువుయొక్కయు కృశించిన జంతువుయొక్కయు మిక్కిలి బలిసిన జంతువుయొక్కయు, ముసలిజంతువుయొక్కయు, మిక్కిలి పసిది యగు జంతువుయొక్కయు, విషముచే జచ్చిన జంతువుయొక్కయు, తనకు యుక్తము కాని ప్రదేశమున పెరిగిన జంతువుయొక్కయు, పులులు సర్పములు మున్నగు క్రూర జంతువులచే జంపబడిన జంతువులయొక్కయు, మాంసమును విడువవలెను. (తినదగదనుట పైజెప్పిన దోషములు లేకయుండు జంతువులమాంసము మిక్కిలి హితకరము. శరీర మునకు పుష్టిని బలమును కల్గించును. అగోచరభృతమన:—గోచరము ప్రదేశము. ఏ జంతువు ఏ ప్రదేశమున పెరుగుట సహజమగునో అట్టి ప్రదేశమున గాక దానికి వ్యతి రేకమైనచోట పెరిగిన నయ్యది యగోచరభృతము. వరాహ మహిషాదిజంతువులు జల ప్రాంతమున సంచరింపవలసినవి. అటుగాక యవి మరుభూమిలో సంచరించుచు పెరిగిన నవి యగోచరభృతములగు. ఇత్తెరంగుననే గ్రామ్యాదిజంతువులకు నూహించునది.

## మాంసరససేవనగుణములు.

మూ. ప్రీణనః సర్వజన్తూనాం హృద్యో మాంసరసః పరం. 310
శుష్యతాం వ్యాధిముక్తానాం కృశానాం క్షీణరేతసాం,
బలవర్ణార్థినాం చైవ రసం విద్యాద్యథామృతం. 311
సర్వరోగప్రశమనం యథాస్వం విహితం రసం,
విద్యాత్ స్వర్యం బలకరం వయోబుద్ధీన్ద్రియాయుషాం. 312
వ్యాయామనిత్యాః స్త్రీనిత్యా మద్యనిత్యాశ్చ యే నరాః,
నిత్యం మాంసరసాహారా నాతురాస్స్యుః న దుర్బలాః. 313

వ్యా. మాంసరసము సర్వప్రాణులకును ప్రీతిని బుట్టించును. హృదయమునకు హితకరము. ధాతువులు శోషించువారికిని వ్యాధులచే చాలకాలము బాధింపబడి వ్యాధులచే విడువబడినవారికిని, శరీరము కృశించినవారికిని, శుక్రము క్షీణించినవారికిని, బలమును శరీరవర్ణమును కోరువారికిని, మాంసరసము అమృతమునుబోలె మిక్కిలి గుణకరముగ నుండును. ఆయాావ్యాధికి పథ్యకరమగు మాంసమునకు సంబంధించిన రసము నుపయోగించినయెడ ఆయాావ్యాధిని శమింపజేయును. ఇత్తెరంగున ననేకరోగముల హరించును. కంఠస్వరమును బాగుగ జేయును. బలమును కల్గించును. వయస్సునకును, బుద్ధికిని చక్షురాదీంద్రియములకును, ఆయువునకును, బలమును కల్గించును. మరియు నియతముగ దేహపరిశ్రమమును స్త్రీసంభోగమును చేయువారును, మద్యపానము చేయువారును, ప్రతిదినమున మాంసరసమును ఆహారముగ జేసినచో వారు అట్టి పనులచే రోగములు కల్గకయు బలహీనత లేకయు సుఖంబుందురు.

ఇచ్చట "సర్వరోగప్రశమనం" అనుచోట సర్వశబ్దము బహ్వర్థకము. అనేక రోగములను మాంసరసము శమించునని యర్థము. అన్ని రోగములననిన యర్థము కానేరదు. ఇట్లు చెప్పుటచేత "వర్జయే ద్ద్విదలం శూలీ కుష్ఠీ మాంసం, క్షయీ స్త్రియం" అని కుష్ఠమున మాంసనిషేధంబును, "నివృత్తామిషమద్యో యః" అని ఉన్మాదరోగమున జెప్పిన మాంసనివృత్తియు సంగతమగును. (ఇది మాంసవర్గమున కనుక్తగుణకథనము).

### వర్జింపవలసిన శాకములు.

మూ. క్రిమివాతాతపహతం శుష్కం జీర్ణమనార్తవం,
శాకం నిస్స్నేహసిద్ధం చ వర్జ్యం యచ్చాపరిస్రుతం. ౩౧౭

వ్యా. పురుగులచేతను, గాలిచేతను, ఎండచేతను దూషితమైనదియు, ద్రవము లేక యెండినదియు, రసహీనంబును, అకాలమున బుట్టినదియు, చమురు లేక పక్వము చేయబడినదియు, ఉడకబెట్టినవెనుక నీరు వడియబోయక పక్వము చేయబడినదియునగు శాకముల (కూరదినుసుల) వదలవలెను. (భుజింపదగదనుట.) ఇది శాకవర్గానుక్తగుణకథనము.

### వ ర్జ నీ య ఫ ల ము లు.

మూ. పురాణమామం సంక్లిష్టం క్రిమివ్యాడహిమాతపైః,
అదేశకాలజం క్లిన్నం యత్ స్యాత్ ఫలమసాధు తత్. ౩౧౮

వ్యా. ప్రాతగిలినఫలంబును, పక్వముకాని (పండని) ఫలంబును, పురుగులు బట్టిన ఫలంబును, సర్పములు మున్నగు విషజంతువులచే దూషితఫలంబును, మంచుచేతను ఎండ చేతను కొట్టుబడిన ఫలంబును, ఆయాఫలములకు స్వాభావికములగు దేశములయందును కాలములయందును గాక యితర దేశకాలముల బుట్టిన ఫలంబును, కుళ్లినపండ్లును మంచివికావు గనుక అట్టిఫలముల నుపయోగింపజనదు. (ఇది ఫలవర్గానుక్తగుణకథనము.)

### హరితశాకగుణవిశేషము.

మూ. హరితానాం యథాశాకం నిర్దేశస్సాధనాదృతే,

వ్యా. హరితశాకవర్గమున జెప్పబడిన అల్లము ఉల్లిపాయలు మున్నగునవి "క్రిమివాతాతపహతం" అని శాకములకు జెప్పిన దోషములు లేక యుండవలెను. అందు పక్వమున జెప్పిన "నిస్స్నేహసిద్ధ, యచ్చాపరిస్రుతం" అను నియమములు మాత్రము హరితశాకములకు లేవు. (హరితశాకములు పచ్చిగనే యుపయోగింపబడునవి కావున స్నేహాది సంస్కారంబును వడబోయుటయు వీనికి లేదని భావము.) ఇది హరితవర్గమున కనుక్తగుణకథనము.

### మద్యాదివర్గముల గుణదోషనిర్ణయము.

మూ. మద్యామ్బుగోరసాదీనాం స్వే స్వే వర్గే వినిశ్చయః. ౩౦౯

వ్యా. మద్యవర్గమునకును, అంబువర్గమునకును, గోరసవర్గమునకును, తక్కిన కృతాన్నాదివర్గములకు ఆయావర్గములయందు గుణదోషముల నిర్ణయము చెప్పబడినది.

ఇచ్చట నీవివరణము నెరుంగునది.—శాకధాన్యాది వర్గములలో జెప్పబడని గుణదోషములు ఆయావర్గానుసారముగ శాకధాన్యవర్గము మొదలు హరితవర్గమువరకుం గల యారువర్గములకును నిర్ణయింపబడినది. తక్కిన మద్యాదివర్గముల కారిటికిని ఆయావర్గములయందే గుణదోషనిర్ణయము జెప్పబడినదిగాన వానినిబట్టియే యెరుంగ నగును. అందు "ప్రాయశోఽభినవం మద్యం" అనువాక్యమున మద్యదోషము మద్యవర్గంబునను "పిచ్ఛిలం క్రిమిలం క్లిన్నం........యద్వరుణాలయం" అను వాక్యముచేత జలదోషము జలవర్గంబునను చెప్పబడినవి. ఇక్షువర్గమునను గుణదోషము లచ్చటనే నిర్ణయింపబడినవి. తక్కిన గోరస-కృతాన్న-ఆహారయోగివర్గముల మూడింటియందును చెప్పబడినపద్ధతి నతిక్రమింపకుండునవి గుణవంతములనియుం, దానికన్న విరుద్ధముగ నుండునవి దుష్టములనియుం గుణదోషముల నెరుంగునది. ఇత్తెరంగున పండ్రెండువర్గములకును గుణదోషముల నిర్ణయము పూర్వతంత్రకారులచే [illegible]

ఇత్తెరంగున నాహారపదార్థముల గుణదోషములను వివరించి, పిమ్మట నట్టియాహారములను సుఖముగ చక్కగ జీర్ణము జేయునది యనుపానము కావున నట్టి యనుపానము వివరింపబడును.

## అనుపాన సామాన్యగుణము.

మూ. యదాహారగుణైః పానం విపరీతం తదిష్యతే,
అన్నానుపానం ధాతూనాం దృష్టం యన్న విరోధి చ. ౩౧౭

వ్యా. (అనుపానమన—"అను (పశ్చాత్) పీయతే ఇత్యనుపానం" అను వ్యుత్పత్తిచేత ఆహారాదిపదార్థముల తినునప్పుడు దానితోగూడ వెంటనే త్రాగబడు ద్రవాదిపదార్థము అనుపాన మనబడును)· ఎట్టిగుణముకల యాహారపదార్థము భుజింపబడునో అట్టి యాహారమునకు విరుద్ధములగు గుణములు కల యనుపానము అన్నమునకు హితకరమగును. మరియు నట్టి యనుపానద్రవ్యము రసాదిధాతువులకు విరోధించక యాహారగుణమునకు విపరీతముగ నుండవలెను. (పెరుగు అమ్లరసము కల్గినది. దీనికి విపరీతముగ మధురరసము కల్గినది క్షీరము. ఆహారరూపమైన పెరుగుకు విరుద్ధగుణ మగుటం జేసి పెరుగు కనుపానము పాలు యుక్తమగునా? యన్నచో ధాతువులకు విరోధము చేయకుండవలె ననుటచే దధిక్షీర సంయోగమున ధాతువులకు ప్రతికూలము కల్గును కావున నట్టి యనుపానము కూడదని "ధాతూనాం దృష్టం యన్న విరోధి చ" అను వాక్యముచే చెప్పబడినది. ఇత్తెరంగుననే పాయసమునకు కాంజికము జేరినచో ధాతువిరుద్ధమగుటచే ననుపానయుక్తము కాదని యెరుంగునది. తక్కినవాని నన్నింటి నిత్తెరంగున నెరుంగునది. సంయోగాది విరుద్ధములు యజ్జఃపురుషీయమను నిరువదియైదవ యధ్యాయమున జెప్పబడినవి.)

## ఆసవాది పేయాపేయ నిర్ణయము.

మూ. ఆసవానాం సముద్దిష్టా అశీతిశ్చతురుత్తరా,
జలం పేయ మపేయం చ పరీక్ష్యాను పిబేద్ధితం. ౩౧౮

వ్యా. ఎనుబదినాల్గు విధములైన యాసవంబులును, జలభేదంబులును వివరింపబడినవి. వాని గుణాదుల చక్కగ గమనించి యేపదార్థమునకు ఏది హితమో దాని ననుపానము జేయనగును. హితము కానిదానిని గుర్తించి విడువదగును.

దోషాది విశేషానుసారముగ ననుపానవిశేషములు.

మూ. స్నిగ్ధోష్ణం మారుతే శస్తం పిత్తే మధురశీతలం,
కఫేఽనుపానం రూక్షోష్ణం క్షయే మాంసరసః పరం. 3౧౯
ఉపవాసాధ్వభాష్యస్త్రీమారుతాతపకర్మభిః,
క్లాన్తానామనుపానార్థం పయః పథ్యం యథామృతమ్ 3౨౦
సురా కృశానాం పుష్ట్యర్థమనుపానం ప్రశస్యతే,
కార్శ్యార్థం స్థూలదేహానాం అనుశస్తం మధూదకమ్. 3౨౧
అల్పాగ్నీనామనిద్రాణాం తన్ద్రాశోకభయక్లమైః,
మద్యమాంసోచితానాం చ మద్యమేవానుశస్యతే. 3౨౨

వ్యా. వాతప్రకోపమునందు స్నిగ్ధంబును ఉష్ణంబునైన యనుపానంబును, పిత్తప్రకోపమున మధురంబును శీతలంబును నగు అనుపానంబును, కఫప్రకోపమున రూక్షంబును ఉష్ణంబునైన యనుపానంబును హితముగ నుండును. మఱియు ధాతుక్షయమున మాంసరసానుపానము చాల ప్రశస్తము. ఉపవాసము, త్రోవనడచుట, అధికముగ మాటలాడుట, స్త్రీసంభోగము, గాలియందును, ఎండయందును సంచరించుట, పనుల జేయుట అను నీకృత్యములచే బడలినవానికి అనుపానమునకై పాలు అమృతమునుబోలె మిక్కిలి పథ్యకరముగ నుండును.

శరీరము కృశించినవానికి పుష్టి కలుగుటకై సురయను మద్యమును అనుపానము చేయుట ప్రశస్తము. స్థూలదేహులకు శరీరము కృశించుటకై తేనెలో నుదకము జేర్చి యనుపానముజేయుట యుక్తము. జఠరాగ్ని మందగించినవారికిని, కునికిపాటుచేతను, దుఃఖముచేతను, భయముచేతను, బడలికచేతను, నిదురబట్టనివారికిని, మద్యమాంసము లలవాటయినవారికిని మద్యమునే యనుపానము చేయుట చాల మంచిది.

అనుపానకృత్యములు.

మూ. అథానుపానకర్మ ప్రవక్ష్యామః—అనుపానం తర్పయతి, ప్రీణయతి, ఊర్జయతి, పర్యాప్తిమభినిర్వర్తయతి, (భుక్త) భక్తమవసాదయతి, అన్నసంఘాతం భినత్తి, మార్దవమాపాదయతి, క్లేదయతి, జరయతి, సుఖపరిణామితాం ఆశు వ్యవాయితాఞ్చ ఆహారస్యోపజనయతీతి. 3౨3

వ్యా. పిమ్మట అనుపానద్రవ్యము చేయుఁకృత్యములు ఈక్రింద వివరింపబడును:- ఆహారపదార్థముల ననుసరించి పైజెప్పబడినరీతిగ చేయబడిన యనుపానము చక్షురాది ఇంద్రియములకు ప్రసన్నతను గల్గించి వానివాని విషయములయందు చక్కగ ప్రవర్తింపజేయును. మనస్సును నిర్మలముగ జేయును. ఉత్సాహమును కల్గించును. ఆహారపరిపూర్ణతను కల్గించును. భుజింపబడినయాహారమును ఆమాశయమునకు క్రిందిభాగమున జేర్చును. ఆహారపదార్థమునందలి కాఠిన్యమును భేదించును. మృదుత్వము కల్గించును. ద్రవమును పుట్టించి జీర్ణింపజేయును. సుఖముగా నాహారపదార్థమునకు రూపాంతరమును కల్గించి శీఘ్రముగ శరీరమున వ్యాపింపజేయును.

## ఉక్తార్థానువాదము.

మూ. అనుపానం హితం యుక్తం తర్పయత్యాశు మానవమ్,
సుఖం పచతి చాహారం ఆయుషే చ బలాయ చ. ౩౨౮

వ్యా. విధ్యనుసారముగ చేయబడిన యనుపానము హితకరమై మానవునకు నాహారమువలని తృప్తి నొందించును. సుఖముగ జీర్ణింపజేయును. ఆయుంవును బలమును వృద్ధి నందించును.

## జలానుపాననిషేధవిషయములు.

మూ. నోర్ధ్వజత్రుగదార్తా విష్టాః న హిక్కాశ్వాసకాసినః,
న గీతభాష్యాధ్యయనప్రసక్తా నోరసిక్షతాః. ౩౨౯
పిబేయురుదకం భుక్త్వా తద్ధి కణ్ఠోరసి స్థితమ్,
స్నేహమాహారజం హత్వా భూయో దోషాయ కల్పతే. ౩౩౦

వ్యా. శరీరమునం దూర్ధ్వభాగమున వాతవ్యాధికలవారును, ఎక్కిళ్లచేతను, శ్వాసకాసములచేతను, బాధపడువారును, సంగీతమును పాడువారును, అధికముగ మాటలాడువారును, చదువువారును, ఉరఃక్షతరోగము కలవారును వీరందరును భుజించిన తోడనే జలపానము చేయరాదు. అట్లు చేసినయెడ కంఠమునందును, ఉరఃస్థలము (రొమ్ము)నందును, కల యాహారసారమును చెరచి, మరల వాతరూపమయినదోషమును వృద్ధినొందించును.

(పైజెప్పిన ఊర్ధ్వాంగవాతాదిదోషములుకలవారు స్నిగ్ధాహారము చేసినచో నట్టి యాహారముచేత వాతము శమించవలసి యుండును. అట్టియెడ జలమును పానముచేసి

నచో జలమునందలిశైత్యగుణముచేత ఆహారస్నేహమును చెరిచి, వాతమును మరింత రేపెట్టునుకాన ఊర్ధ్వాంగవాతాదివిషయములయందు జలానుపానము యుక్తము కాదని భావము.)

జలమును పానముజేసినచో నయ్యది యాహారముతో గూడి జఠరాగ్నిసంబంధముచే నాహారమును చక్కగ పచింపజేయును. అప్పుడు ఆహారముచే నైనస్నేహము వాతహర మగును. ఊర్ధ్వాంగవాతాదులయందు జలపానము చేసినచో నయ్యది వ్యాధిస్వభావమునంజేసి యాహారముతో గలియక కంఠమునందును హృదయమునందును నిలచును. దానంజేసి యాహారమున స్నేహము చక్కగ గల్గనోపదు. కావున నాహారస్నేహమునకు భంగకారణమగును. అట్టియాహారస్నేహము లేనినాడు వాతము మరింత వృద్ధిజెంది రోగవర్ధక మగునని ముఖ్యభావము.

## అనుక్తాన్నపానగుణాదినిర్ణయోపాయము.

మూ. అన్నపానైకదేశోఽయం ఉక్తః ప్రాయోపయోగికః,
ద్రవ్యాణి న హి నిర్దేష్టుం శక్యం కార్త్స్న్యేన నామభిః. ౩౨౭
యథా నానౌషధం కిఞ్చిత్ దేశజానాం వచో యథా,
ద్రవ్యం తత్తత్తథా వాచ్యం అనుక్తమిహ యద్భవేత్. ౩౨౮

వ్యా. అన్నపానరూపములైనద్రవ్యములు లోకమున ననంతము లైయుండును. వాని నన్నింటిని పూర్తిగ నామమాత్రమున నైన నిర్దేశింప నేరికిని శక్యముకాదు. (నామమాత్రమున నిర్దేశింపనే శక్యము కానినాడు, వానినుద్దేశించి గుణకర్మాదుల విభజింప నంతకన్న కానిపనియని భావము). కావున లోకమున తరుచుగ నుపయోగమున నున్నయాహార (అన్నపాన) ద్రవ్యములలో నేకదేశము (కొన్నిమాత్రము) వివరించి గుణకర్మాదుల జూపి చెప్పబడినవి. మరియు—అట్టి యుద్దేశించి చెప్పనలవికాక వదలిన యన్నపానద్రవ్యములను "నానౌషధం కించిత్" అని యుపక్రమించి పైయధ్యాయమునం దనుక్తౌషధపరిజ్ఞానమార్గము నవలంబించి ఆయాదేశమున ద్రవ్యముల నామరూపాదుల నాయాదేశముల నుండువారు చెప్పునట్టి మాటలచేత తెలిసికొని వారియనుభవమున నున్నరసాదుల గమనించి తత్తద్గుణాద్యనుసారముగ కార్యముల నూహించి నిర్ణయింపవలెనని యర్థము. (అనుక్తద్రవ్యములను ఆయాదేశములగలవారివాడుకలో నుండు మాటలబట్టి తెలిసికొని గుణాదుల గమనించి తత్తదనుగుణకృత్యముల నూహించి యాహారమున నుపయోగింపదగునని భావము).

అనుక్తాన్నపానగుణనిర్ణయమున కుపాయాంతరము.

మూ. చరశ్శరీరావయవాః స్వభావో ధాతవః క్రియా,
లిఙ్గం ప్రమాణం సంస్కారో మాత్రా చాత్ర పరీక్ష్యతే. ౩౨౯

వ్యా. (చరమనగ 'చర్యత ఇతి చరః' అనువ్యుత్పత్తిచేత జంతువులు సంచరించు ప్రదేశంబును జంతువులచే తినబడునాహారపదార్థంబులును చరశబ్దముచే చెప్పబడును. 'చర గతిభక్షణయోః' అను గత్యర్థకభక్షణార్థకమైన చరధాతువుచే నిష్పన్నమైనది చర శబ్దము కావున నీరెండర్థములను బోధించును). ఆయాజంతువులు సంచరించుటకును, ద్రవ్యోత్పత్తికిని కారణమైన జాంగలానూపాదిప్రదేశవిశేషంబులును, ఆయాజంతువులచే తినబడు నాహారపదార్థంబులును, ఆయాజంతువులశరీరావయవ (తొడలు కాళ్లు మున్నగు) విశేషంబులును, ఆయాద్రవ్యమునకు స్వాభావికధర్మంబును, జంతువుల రక్తాది ధాతువులను, ఆయాజంతువులు చేయు చేష్టావిశేషంబులును, స్త్రీజాతిపురుషజాతి (ఆడది మగదియను) చిహ్నములును, ఆయాద్రవ్యములయొక్కయు జంతువులయొక్కయు హ్రస్వదీర్ఘాదిప్రమాణంబును, గుణాంతరమును కల్గించు సంస్కారవిశేషంబును ద్రవ్య పరిమాణంబును (మాత్ర), అట్టిమాత్ర పరికల్పనమునకు కారణమైన జాఠరాగ్నియు, ఇవి యన్నియు నీయన్నపానగుణపరికల్పనమున ముఖ్యముగ గమనింపదగినవి. (వీని నన్నిటిని పరీక్షించి తత్తదనుసారముగ నాహారపదార్థములకు గుణాదుల నిర్ణయింపవలెనని భావము). దీని వివరణము క్రింద చెప్పబడును.

చరవివరణము, తదనుసారముగ ద్రవ్యగుణనిర్దేశము

మూ చరోఽనూపజలాకాశధన్వాద్యో భక్ష్యసంవిధిః,
జలజాఽనూపజాశ్చైవ జలానూపచరాశ్చ యే. ౩౩౦
గురుభక్ష్యాస్తు యే సత్త్వాః సర్వే తే గురవస్స్మృతాః,
లఘుభక్ష్యాస్తు లఘవః ధన్వజా ధన్వచారిణః ౩౩౧

వ్యా. చరమన సంచారప్రదేశము. అయ్యది అనూపము (జలప్రాయస్థలము), జలము, ఆకాశము, ధన్వప్రదేశను (మరుస్థలము) మున్నగునది. జంతువులు తినునట్టి యాహారపదార్థంబును చరమనబడును. (దీనివ్యుత్పత్తి పైని చెప్పబడినది). పుట్టినజంతువులును, జలమున సంచరించుజంతువులును, అనూపదేశమున పుట్టి అనూపదేశమున సంచరించుజంతువులును, ఈరెండుప్రదేశములయందును సంచరించుజంతువులును, గురుపదార్థముల తినునట్టి పశుపక్ష్యాదిజంతువులును, ఇవి యన్నియును గురుత్వము కల్గియుండును.

మరియు—లఘుగుణము కలయాహారముల తినుజంతువులును, మెట్టభూముల పుట్టినజంతువులును, మెట్టప్రదేశమున సంచరించుజంతువులును లఘుగుణము కల్గియుండును. (నీరుకోడి హంసములు మున్నగునవి జలమునందును అనూపమునందును సంచరించునవి కావున వానిని కూడ జేర్చుటకై "జలానూపచరాః" అని వేరుగ జెప్పబడినది). ఆకాశమున సంచరించు శ్యేనాదిపక్షిజాతులకు ఆకాశసిద్ధమైన లాఘవగుణము కల్గియుండునని యెరుంగునది.

### శరీరావయవములు, వాని విశేషముచే గురుత్వతారతమ్యము.

మూ. శరీరావయవాస్సక్థిశిరస్స్కంధాదయ స్తథా,
సక్థిమాంసాద్గురుస్స్కంధః తతః క్రోడః తతశ్శిరః. (శిరస్స్పదం)

వ్యా. పశ్వాదిజంతువుల తొడలు, శిరస్సు, మూపులు మున్నగునవి శరీరావయవములు. అందు తొడలయందలి మాంసమునకన్న మూపులయందలిమాంసము గురుత్వము కల్గియుండును. దానికన్న భుజమధ్యమున (రొమ్మున) నున్నమాంసంబును, అంతకన్న శిరమునందలిమాంసంబును గురుత్వము కల్గియుండును.

### మరికొన్ని యవయవములగుణవిశేషము.

మూ. వృషణౌ చర్మ మేఢ్రం చ శ్రోణీ వృక్కౌ యకృద్గుదం,
మాంసాద్గురుతరం విద్యాత్ యథా స్వం మధ్యమస్థి చ. 333

వ్యా. మరియు వృషణంబులును, చర్మంబును, మేఢ్రంబును, పిరుదులయందలి మాంసంబును, వృక్కంబులును, యకృత్తును (నల్లదబ్బ), గుదనాళమును ఆయాజంతువుల మాంసమునకంటె గురుత్వము కల్గియుండును. మరియు శరీరమధ్యమున నుండుమాంసంబును, అస్థులలో నడుమనుండుమాంసంబును తక్కినమాంసమునకన్న గురుత్వము కల్గినది. (ఇది అవయవపరీక్షముచే గుణనిర్ణయము).

### స్వభావసిద్ధమైనగుణమును నిర్ణయించుట.

మూ. స్వభావాల్లఘవో ముద్గాః తథా లావకపింజలాః,
స్వభావాద్గురవో మాషాః వరాహమహిషా స్తథా. 334

వ్యా. పెసలును, లావకపింజలమాంసంబును స్వభావముచేతనే లఘుత్వము కల్గియుండును. ఉద్దులు స్వభావముగనే గురుత్వము కల్గియుండును. పందియు ఎనుబోతు

లంను స్వభావముచేతనే గురుత్వము కల్గియుండును (కావున వానిమాంసము గురుత్వముగ నుండును.)

ధాతు, క్రియ, అనునీరెండిటినిబట్టి గుణనిర్దేశము.

మూ. ధాతూనాం శోణితాద్యానాం గురుం విద్యాద్యథోత్తరం,
అలసేభ్యో విశిష్యన్తే ప్రాణినో యే బహుక్రియాః. 33౫

వ్యా. రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము, అనుధాతువులు ఒకటికన్న నొకటి గురుత్వము కల్గియుండును.

మరియు ప్రాలుమాలి నిశ్చేష్టములుగ నుండుజంతువులకన్న విశేషముగ కర్షణాది సంచారాదిక్రియల జేయుజంతువులు (వానిమాంసము) లఘుత్వము కల్గియుండును. (ఇది ధాతువులను చేష్టలనుబట్టి గుణనిర్ణయము.)

లింగమునుబట్టి గురులాఘవనిర్ణయము.

మూ. గౌరవం లిఙ్గసామాన్యే పుంసాం స్త్రీణాం చ లాఘవం,

వ్యా. ("లింగ్యతే (జ్ఞాయతే) అనయేతి లిఙ్గం" అనువ్యుత్పత్తిచేత స్వరూపమును దెల్పునట్టిజాతి లింగ మనబడును). జంతువులజాతి సమానముగ నుండునెడ అట్టి జంతువులలో పురుషజాతిజంతువుల (మగజంతువుల)మాంసము గురుత్వము కల్గియుండును, ఆడజంతువులమాంసము లఘుత్వము కల్గియుండును. (ఒక్కజాతిలో పుట్టిన పశ్వాది జంతువులలో మగజంతువులు గురుత్వంబును, ఆడవి లఘుత్వంబును కల్గియుండునని భావము).

ఈగురులాఘవనిర్ణయము నాల్గుకాళ్లజంతువులగు పశ్వాదులకు మాత్ర మెఱుంగునది. పక్షిజాతిలో దీనికి విపర్యయముగ పురుషజాతి లాఘవంబును, స్త్రీజాతి గురుత్వంబును కల్గియుండును. ఈవిషయమునే హారీతమున నిట్లు చెప్పిరి:—"చతుష్పాదేషు లఘ్వీ స్త్రీ విహఙ్గేషు లఘుః పుమాన్" మరియు వాగ్భటులును "లఘుర్యోషిత్ చతుష్పాత్సు విహఙ్గేషు పునః పుమాన్" అని యీయర్థమునే చెప్పిరి. మరియు "పుంస్త్రియోః పూర్వపశ్చార్ధే గురుణీ గర్భిణీ గురుః" అనియు వాగ్భటులు చెప్పిరి. పురుషజాతి జంతువులయొక్క పూర్వభాగమునందలిమాంసమును, ఆడజంతువులయొక్క వెనుప్రక్క మాంసంబును, చూలుగ నుండు జంతువులమాంసంబును గురుత్వము కల్గియుండునని భాగభేదము ననుసరించియు గుణభేదమును జెప్పిరి. (పక్షులయందు లింగభేదముచే గుణభేదము వ్యత్యయముగ నుండుటకు స్వభావమే కారణమని యెఱుంగునది).

## జంతువులపరిమాణమును బట్టి గురులాఘవనిర్ణయము.

మూ. మహాప్రమాణాః గురవః స్వజాతౌ లఘవోఽన్యథా. 336

వ్యా. ఒకజాతియందు పుట్టిన పశ్వాదిజంతువులలో గొప్పవిగ నుండునవి గురుత్వము కల్గియుండును. చిన్నవిగ నుండునవి లఘుత్వము కల్గియుండును. (మేకలలో పెద్దవి గురుత్వంబును, చిన్నవి లాఘవంబును కల్గియుండును. ఇత్తెరంగుననే పశ్వాదులకు స్వస్వజాతిలో పరిమాణమును బట్టి గురులాఘవనిర్ణయము నెరుంగునది).

## సంస్కారముచే గురులాఘవనిర్ణయము.

మూ. గురూణాం లాఘవం విద్యాత్ సంస్కారాత్ సవిపర్యయం,
వ్రీహేర్లాజాః యథా చ స్యుః సక్తూనాం సిద్ధపిణ్డకాః. 337

వ్యా. స్వభావముచే గురుత్వము కల కొన్నిపదార్థములు సంస్కారవిశేషమునం జేసి లఘుత్వము కల్గియుండును. లఘుత్వము కల కొన్నిపదార్థములు సంస్కారమునం జేసి గురుత్వము కల్గియుండును, ఎట్టులనః—

గురుత్వము కల వరిధాన్యముచేసైన పేలాలకు సంస్కారముచే లాఘవము గల్గును. లఘువైన సత్తుపిండిని యుండలుజేసి కాల్చినచో నయ్యది గురుత్వము కల్గియుండును. (ఇత్తెరంగున సంస్కారవిశేషమునం జేసియుం గురులాఘవములు వ్యత్యస్తముగ నగునని భావము).

## మాత్రచే గురులాఘవనిర్ణయము.

మూ., అల్పాదానే గురూణాం చ లఘూనాం చాతిసేవనే,
మాత్రా కారణముద్దిష్టం ద్రవ్యాణాం గురులాఘవే. 338

వ్యా. గురుద్రవ్యములను స్వల్పపరిమాణముగ సేవించినపుడు అట్టిగురుద్రవ్యములకు లాఘవము కల్గుటకును, లఘుద్రవ్యములకును అధికపరిమాణముగ సేవించినయెడ వానికి గురుత్వము కల్గుటకును మాత్ర (ఆహారపరిమాణము) కారణమగును. (గురుపదార్థములను తాను మామూలుగ భుజించు పరిమాణమునకన్న స్వల్పముగ భుజించినచో నయ్యవి స్వాభావికమైనగురుత్వమును మాని లాఘవము కల్గి శీఘ్రముగ జీర్ణమగును. స్వభావముచే లఘుత్వముగల పదార్థములను మితిమీరి మిక్కుటముగ భుజించినచో నయ్యది లాఘవము నుడిగి గురుతరమై చిరకాలమునకు జీర్ణము కానోపదు. గురులాఘవము లిట్లు మారుటకు మాత్ర కారణమగునని భావము.)

—● అగ్నిబలానుసారముగ మాత్రానిర్ణయము. ●—

మూ॥ గురూణామల్పమాదేయం లఘూనాం తృప్తిరిష్యతే,
మాత్రాం ద్రవ్యాణ్యపేక్షన్తే మాత్రా చాగ్నిమపేక్షతే ౩౩౯

వ్యా. గురుపదార్థములను (తన కెంతపరిమాణము పూర్తిగ తృప్తి కల్గునో అంత కన్న) స్వల్పపరిమాణముగ భుజింపవలెను. లఘుపదార్థములను తనకు తృప్తి కల్గునంతపరిమాణముతో భుజింపవలెను. మరియు ఆయాద్రవ్యములు పరిమాణము ననుసరించి యుండును. (మాత్రననుసరించి పైజెప్పినరీతిగ గురులాఘవములు మారుచుండును కావున ద్రవ్యములగుణనిర్ణయము మాత్ర నపేక్షించునని భావము.) అట్టిమాత్రయు మనుజుల జాఠరాగ్ని నపేక్షించి యుండును. (మనుజులకు దేశము, కాలము, వయస్సు, అవస్థ మున్నగువాని ననుసరించి యొక్కొకపురుషున కొక్కొకదినంబును జాఠరాగ్నిబలము మారుచుండును; కావున అట్టియగ్నిబలానుసారముగ మాత్రను కల్పింపవలెను. దానం జేసి మాత్ర అగ్నిబలము నపేక్షించునని భావము).

ఈవిషయమునే వాగ్భటులు "గురూణామర్ధసౌహిత్యం లఘూనాం నాతితృప్తతా, మాత్రాప్రమాణం నిర్దిష్టం" అని చెప్పిరి. ఈవచనమున లఘుపదార్థములను కొంచెము తక్కువగ భుజించవలెననియు, గురుపదార్థములను తనపరిమితికన్న సగభాగముగ పరిమితి కల్పించి తినవలెననియు మాత్రాపరిమాణము చెప్పబడినది.

—● బలారోగ్యాదులకు అన్నపానములును, అగ్నియు నాధారమనుట. ●—

మూ॥ బలమారోగ్యమాయుశ్చ ప్రాణాశ్చాగ్నౌ ప్రతిష్ఠితాః,
అన్నపానేన్ధనైశ్చాగ్నిః జ్వలతి వ్యేతి చాన్యథా.	౩౪౦

వ్యా. బలము, ఆరోగ్యము, ఆయువు, ప్రాణంబులు ఇవి యన్నియు అగ్నిని ఆధారముగ జేసి నిలచియుండును. (జఠరాగ్నిపరిస్థితి నాశ్రయించియుండునని భావము). అట్టిజాఠరానలంబులును అన్నపానములను సమిధములుగ జేసికొని జ్వలించుచుండును. అట్టియన్నపానములు లేనినాడు చల్లారును. (బాహ్యాగ్ని సమిధలచే జ్వలించి వృద్ధినొందును. సమిధలు లేనినాడు తనంతనే నానాటికి తగ్గి చల్లారును. అత్తెరంగున జాఠరాగ్నియు నన్నపానముల నాధారముగ జేసి జ్వలించును. అట్టి యన్నపానములు లేనినాడు తనంతనే నశించి తుట్టతుదకు పూర్తిగ చల్లారునని భావము. అట్టియగ్ని హీనమైనపుడు దాని నాశ్రయించి సంభవించు శరీరబలాదులు నశించునని ఫలితార్థము). ఇత్తెరం

గున పైయుద్దేశప్రకారము చర-శరీరావయవాదుల పరీక్షించి యాహారపదార్థముల గురు లాఘవముల నిర్ణయించు ప్రణాళిక దిఙ్మాత్రముగ చెప్పబడినది.

గురులాఘవపరిజ్ఞానవిషయము.

మూ॥ గురులాఘవచిన్తేయం ప్రాయేణాల్పబలాన్ ప్రతి,
మన్దక్రియాన్ అనారోగ్యాన్ సుకుమారాన్ సుఖోచితాన్.
దీప్తాగ్నయః ఖరాహారాః కర్మనిత్యా మహోదరాః,
యే నరాః ప్రతి తాంశ్చిన్త్యం నావశ్యం గురులాఘవం. 382

వ్యా. పైజెప్పినరీతిగ చరశరీరావయవాదిపరీక్షణపూర్వకముగ నిర్ణయింపబడిన గురులాఘవచింత ప్రాయికముగ మందాగ్నికలవారిని, పనులులేక నిర్వ్యాపారముగ నుండువారిని, ఆరోగ్యము లేనివారిని, సుకుమారులను, సుఖము ననుభవించు అలవాటు కలవారిని యుద్దేశించి చెప్పబడినది. (పైజెప్పినవారికి జాఠరాగ్ని మందముగ నుండును కావున వారి నుద్దేశించి చెప్పబడినదని భావము.)

అటు గాక ప్రజ్వలించుజాఠరాగ్ని కలవారికిని, కఠినమైన యాహారమును తిను వారికిని, నియతముగ పనుల జేయువారికిని, గొప్పకడుపు కలవారికిని ఆహారవిషయమై పైజెప్పినగురులాఘవతారతమ్యము ముఖ్యముగ యోచింప బనియుండదు. (దీప్తాగ్న్యాదులకును పైజెప్పిన గురులాఘవచింత యొకప్పుడు కించిత్కార్యకారి యగును కావున అవశ్యముగ జూడ పనిలేదని "నావశ్యం" అనుపదముచే సూచింపబడినది).

హితాహారసేవనక్రమము, దాన గల్గుఫలము.

మూ. హితాభిర్జుహుయాన్నిత్యం అన్తరాగ్నిం సమాహితః,
అన్నపానసమిద్భిర్నా మాత్రాకాలౌ విచారయన్. 383
ఆహితాగ్నిస్సదా పథ్యాన్యన్తరాగ్నౌ జుహోతి యః,
దివసే దివసే బ్రహ్మ జపత్యథ దదాతి చ. 384
నరం నిశ్శ్రేయసే యుక్తం సాత్మ్యజ్ఞం పానభోజనే,
భజన్తే నామయాః కేచిత్ భావినోఽప్యన్తరాదృతే. 385

వ్యా. లోకమున నాహితాగ్నిగా నుండుమనుజవరుడు ప్రాతస్సాయంకాలముల రెంటియందును పాలాశాదిసమిధలు హవిస్సు మున్నగువానిచే శ్రౌతాగ్నియందు హోమము చేయువిధముగ మానవుడు సమాహితచిత్తుడై పథ్యకరములైన యన్నపానము

లను సమిధలచే సాంతరమైనజాఠరాగ్నియందు ప్రాతస్సాయంకాలముల రెంటియం దును ప్రతిదినంబును భోజనరూపమైన హోమమును మాత్రాకాలాదుల విచారించి హోమము జేసి, ప్రతిదినంబును బ్రహ్మరూపమైన ప్రణవమును జపము చేయుచు, యథో చితముగ దానము చేయుచు నున్నచో, పానభోజనములయందు దేశకాలాదిసాత్మ్యమును దెలిసి నటించునట్టిమనుజుని యీజన్మమునందును, వేరొకజన్మమునందును ఒకప్పుడును (మిథ్యాహారవిహారాదులచేతను అధర్మము చేతను సంభవించు) రోగములు బాధింప నేరవు.

సకలరోగములకును మిథ్యాహారవిహారాదులును, ప్రజ్ఞాపరాధరూపమైన యధ ర్మంబును కారణములు. దేశకాలాదిసాత్మ్యమును ఆహారాదిగుణకర్మాదులను చక్కగ నెరింగి, దేశాదిసాత్మ్యమును గమనించి, యన్నపానముల విధ్యుక్తప్రకారము చేసి నచో నీజన్మమున రోగములు వానిచెంత జేరవనియు, జపదానాదుల జేయుటంజేసి యట్టిధర్మముచే రాబోవుజన్మంబునను అధర్మకర్మపరిపాకముచే సంభవించు రోగ ములు వానిచెంత జేరవనియు భావము.

## హితభోజనముచే నూరువత్సరములు ఆయువు గల్గుననుట.

మూ. షట్త్రింశతం సహస్రాణి రాత్రీణాం హితభోజనః,
జీవత్యనాతురో జన్తుః జితాత్మా సమ్మతస్సతాం. ఇతి. ౩౮౬

వ్యా. పైజెప్పినరీతిగ జితేంద్రియుండై హితముగ విధ్యుక్తప్రకారము భుజించు చున్నమానవుడు జన్మాంతమువరకును రోగవిముక్తుడై పెద్దలలో పూజితుడై ముప్పదియారు వేలయహోరాత్రములు నూరుసంవత్సరములకాలము) సుఖముగ జీవించును.

## అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. అన్నపానగుణాః సాగ్ర్యాః వర్గాః ద్వాదశనిశ్చితాః,
సగుణాన్యనుపానాని గురులాఘవసంగ్రహః. ౩౮౭
అన్నపానవిధావుక్తం తత్పరీక్ష్యం విశేషతః.

వ్యా. అన్నపానగుణంబులును, వానిలో శ్రేష్ఠంబులును, ఆహారమునకు సంబంధిం చినపండ్రెండువర్గంబులును, అనుపానంబులును, వానిగుణంబులును, వానిగురులాఘవసంగ్ర హాంబును ఈవిషయము లన్నియు నీయన్నపానవిధియను నధ్యాయమున జెప్పబడినవి. ఇందలివిషయమునంతయు వైద్యవరులును మనుజసామాన్యముగను పరీక్షింపదగినవి. (ఇది

ప్రాణబలాదులకు ముఖ్యములైనవిషయముల దెల్పునది కావున ముఖ్యముగ దీనిని గమనించుట జనసామాన్యముగ నవశ్యకర్తవ్యమని భావము )

## ఆహారద్రవ్యపరీక్షావశ్యకత.

మూ. ప్రాణాః ప్రాణభృతామన్నం అన్నం లోకోఽభిధావతి. 348
వర్ణః ప్రసాదః సౌస్వర్యం జీవితం ప్రతిభా సుఖం,
తుష్టిః పుష్టిః బలం మేధా సర్వమన్నే ప్రతిష్ఠితం. 349
లౌకికం కర్మ యద్వృత్తౌ స్వర్గతౌ యచ్చ వైదికం,
కర్మాపవర్గే యచ్చోక్తం తచ్చాప్యన్నే ప్రతిష్ఠితం. 350

వ్యా. ప్రాణికోటి కెల్ల అన్నము ప్రాణములుగ నుండును; కావున లోకమున నుండు ప్రాణులందరును అన్నమునే కోరి ప్రార్థించెదరు. మరియు శరీరవర్ణమునకు నిర్మలత్వంబును కంఠస్వరసౌష్ఠవంబును, ప్రాణధారణంబును, ప్రకర్షజ్ఞానంబును, శరీరేంద్రియాది సౌఖ్యంబును, మనస్సంతోషంబును, శరీరపుష్టియు, శారీరమానసబలంబును, మేధ (ధారణాశక్తి) యు, జీవనమునకు సంబంధించినకృష్యాది లౌకికకర్మలును, స్వర్లోకసుఖమునకు సంబంధించిన యాగాది వేదచోదితకర్మంబులును, ముక్తికిసంబంధించిన నిర్గుణబ్రహ్మోపాసనాది మానసికకర్మంబులును, అన్నమునే యాధారముగ జేసి నెరవేర్పదగియుండును. ఈతంత్రమున జెప్పబడినసత్యము బ్రహ్మచర్యము మున్నగునవియును అన్నమునే ఆధారముగ జేసియుండును కావున, అన్నింటికిని అన్నము మూలకారణము. కావున నీయధ్యాయమున జెప్పిన యాహారమునకు సంబంధించిన విషయముల నన్నింటిని అవశ్యముగ పరీక్షింపవలెనని 'తత్పరీక్ష్యం విశేషతః' అను పైశ్లోకముతో నన్వయించునది.

ఈయన్నపరిజ్ఞానప్రాశస్త్యమునే బ్రహ్మప్రతిపాదకములగునుపనిషత్తులయందును "ప్రాణో వా అన్నం శరీరమన్నానం ప్రాణేశరీరం ప్రతిష్ఠితం, శరీరే ప్రాణః ప్రతిష్ఠితః, తదేతదన్నమన్నే ప్రతిష్ఠితం, సయ ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి." ఇత్యాదివాక్యములచే శాసింపబడినది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, సూత్రస్థానే,
అన్నపానవిధిర్నామ సప్తవింశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకమహర్షిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమునందలి సూత్రస్థానమున అన్నపానవిధియను నిరువదియేడవ యధ్యాయము. సమాప్తము.

## అష్టావింశాధ్యాయము.

అవతారిక:—అన్నపానచతుష్కముతో జేరిన పైయధ్యాయముల మూఁటియందును అన్నపానములకు సంబంధించిన స్వరూపగుణకర్మాదులు వివరింపబడినవి. అందు చెప్పబడని కొన్నివిశేషము లీయధ్యాయమున వివరింపబడును. మరియు పైయధ్యాయాంతమున "ప్రాణాః ప్రాణభృతామన్నం" అనువాక్యముచేత నన్నము ప్రాణులకెల్ల ప్రాణాధారకమగునని చెప్పబడినది. కావున అన్నము ప్రాణముల కాధార మెట్లగునదియు నీవివిధాశితపీతీయాధ్యాయమున వివరింపబడును.

మూ. అథాతో వివిధాశితపీతీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. అన్నపానవిధ్యధ్యాయమును జెప్పినపిమ్మట పలుదెరంగులైన అశితపీతభేదముల నధికరించిన వివిధాశితపీతీయమనునధ్యాయము భగవత్స్వరూపుడగు నాత్రేయమహర్షి యుపదేశించిన దానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరింపబడునని యర్థము.(అశితమన అశనము, పీతమన పానము. పలుదెరంగులైన యశనములనుపానములను ప్రధానముగ జేసి వివరించునధ్యాయము వివిధాశితపీతీయమని యెరుంగునది.)

### ఆహారముచే శరీరధారణక్రమము.

మూ. వివిధమశితపీతలీఢఖాదితం, జన్తోర్హితం, అన్తరగ్నిసన్ధుక్షితబలేన యథాస్వేనోష్మణా సమ్యగ్విపచ్యమానం; కాలవదనవస్థిత సర్వధాతుపాకం, అనుపహతసర్వధాతూష్మమారుతస్రోతః, కేవలం శరీరం, ఉపచయబలవర్ణసుఖాయుషా యోజయతి, శరీరధాతూనూర్జయతి; ధాతవో హి ధాత్వాహారాః ప్రకృతి మనువర్తన్తే. 3

వ్యా. (పలుదెఱంగులైన యాహారద్రవ్యములును భోజనము (విశేషముగ దంతములచే నమలవలసినపనిలేక తినుటకు యోగ్యమైన యన్నాదిమృదుపదార్థములు), పేయము (త్రాగదగినపాలు నీళ్లు మున్నగుద్రవపదార్థములు) లేహ్యము (నాలుకచే గాకిచప్పరించి తినదగిన పచ్చడిమున్నగు కొంచెము ద్రవముకల్గినపదార్థములు), ఖాద్యము దంతములచే చక్కగ నమలి తినదగి కఠినములైన చక్కిలములు మున్నగుపదార్థములు) నని నాల్గువిధములుగ నుండును.) మనుజులశరీరతత్త్వాదులకు ప్రతికూలము గాకుండునట్లు భుజింపబడిన (అశిత - పీత - లీఢ - ఖాదిత) చతుర్విధాహారపదార్థము

జాఠరాగ్నిచే వృద్ధినొందినబలముకల ఆయాపంచభూతములకు సంబంధించిన తమతమ యగ్నుల (పంచభూతాగ్నుల) చే నానాభూతగుణము కలది చక్కగ పచింపబడి; కాలమునుబోలె విరామములేని రసాది సర్వధాతుపాకము కల్గినదియు, ధాతువులన్నిటి యొక్క వేడియు (ధాత్వగ్నులును), అట్టి ధాత్వగ్నులకు సహకారియగు వాతంబును (ధాతువులపోషించురసమును వ్యాపింపజేయువ్యానవాతంబును), అట్టిధాతుపోషకరసమున కాధారమైన స్రోతస్సులును (నాడులును) ఇవి మూడును వికృతిజెందకయుండునదియు నగుశరీరమునందెల్ల పైజెప్పినయాహారము) పుష్టిని, బలమును, వర్ణవిశేషమును, (ఆరోగ్య రూపమైన) సుఖమును, నియమితమైన యాయుంవును కల్గించును. శరీరమునందలి రసాది ధాతువులను బలపరచును. రసాదిధాతువులు ఒకధాతువు ఇంకొకధాతువున కాహారముగ గల్గియుండును కావున శరీరమునందలి ధాతువులన్నియు చక్కగ నుండునపుడు వికృతి జెందక స్వభావస్థితినుండును. (ఇది మూలమునకు యథాశ్రుతమైన యర్థము).

వివరణము.—మనుజులచే భుజింపబడిన భోజ్యాదిచతుర్విధాహారపదార్థములను ప్రాణవాతము కోష్ఠమున జేర్చును. అట్టియాహారము పంచభూతాత్మకములై యుండును కావున పంచభూతములకును వేరువేరుగనుండు పంచవిధములైన భూతాగ్నులచే వృద్ధి నొందిన ధాత్వగ్నులచేత పచింపబడును. అందు ఏభూతమునకు సంబంధించినది యేపదార్థమో దానిని ఆభూతమునకు సంబంధించిన యగ్ని పచింపజేయును. పార్థివాహారాంశమును పార్థివాగ్నియు, జలవికారమయిన పదార్థమును జలనిష్టమైన ధాత్వగ్నియు పచింపజేయును. ఇత్తెరంగుననే యాహారమునందలి యాయాభూతమునకు సంబంధించిన యంశమును ఆయాభూతాగ్ని పచింపజేయను. ఈవిషయమును వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి:—"భౌమాఽఽప్యాగ్నేయవాయవ్యాః పంచోష్మాణః సనాభసాః, పఞ్చాహార గుణాన్ స్వాన్ స్వాన్ పార్థివాదీన్ పచన్త్యను. యథాస్వం తేన పుష్ణంతి పక్వా భూత గుణాన్ పృథక్, పార్థివాః పార్థివానేవ శేషాశ్శేషాంశ్చ దేహజాన్." (అష్టాంగ హృదయశారీర, 3 అధ్యాయము.)

ఇత్తెరంగున జఠరాగ్ని భూతాగ్నులచే చక్కగ పాకము నొందిన పంచభూతాత్మకమైన యాహారము రసరక్తాదిధాతువుల యూష్మరూపమైన ధాత్వగ్నులును, ఆహారరసమును స్రోతస్సులమూలమున వ్యాపింపజేయు వ్యానవాతంబును, ఆహారరసమున కాధారభూతములగు స్రోతస్సులు వికృతిజెందక యుండుశరీరమునకు పుష్టిని, బలమును, వర్ణమును కల్గించి యాయుంవును వృద్ధినందించును. శరీరమునందలి రసరక్తాదిధాతువులను పోషించును. రసాదిధాతువులతో రసమువలన రక్తంబును, దానివలన మాంసంబును, దాని వలన మేదస్సును, దానిచే నస్థులును, వానివలన మజ్జయు, దానివలన శుక్రంబును వరు

సగ నుత్పన్నములై వానివలననే వృద్ధినందుచుండు కావున ధాతువులు ధాతువులనె యాహారములుగ గల్గియుండును. అట్టియెడ నొకధాతువు చెడినను తక్కినధాతువు లన్నియుం చెడుచుండును. కావున ధాతువులప్రకృతికిని యాహారము కారణమగునని భావము.

ఆహారరసముచే శరీరపోషణక్రమము.

మూ. తత్రాహారప్రసాదాఖ్యో రసః, కిట్టం చ మలాఖ్య మభినిర్వర్తతే. కిట్టాత్ స్వేదమూత్రపురీషవాతపిత్తశ్లేష్మాణః, కర్ణాక్షినాసికాస్య లోమకూపప్రజననమలాః కేశశ్మశ్రులోమనఖాదయశ్చ అవయవాః పుష్యన్తి. ౪

వ్యా. పైజెప్పినరీతిగ పచింపబడిన యాహారమునందలి ద్రవరూపమైన సారము రసముగను, సారములేనిది (పిప్పి) కిట్టముగను ఆహారము రెండువిధముల మారును. (అట్టికిట్టము అన్నముయొక్క ద్రవరూపమైన కిట్టము మూత్రంబును, ఘనసీభవించిన కిట్టము మలంబునని రెండువిధములు. ఈరెండు నిస్సారమైనవి. ఈవిషయమును వాగ్భటు లిట్లు చెప్పిరి—"కిట్టం సారశ్చ తత్పక్వం అన్నం సమ్భవతి ద్విధా, తత్రాచ్ఛం కిట్టమన్నస్య మూత్రం, విద్యాద్ఘనం శకృత్.")

అందు కిట్టమువలన చెమట, మూత్రము, పురీషము, వాతపిత్తకఫములు, చెవులు కన్నులు నాసారంధ్రములు, నోరు, రోమరంధ్రములు, గుహ్యములు అను నీప్రదేశముల పుట్టుమలంబులును, వెండ్రుకలు మీసములు రోమములు గోళ్లు మున్నగునవయవంబులును పుష్టినొందును.

ఇచ్చట కిట్టమన నిస్సారమైనమలములని యర్థము. అయ్యవి యీతంత్రకారునిచే స్థలాంతరమున నిట్లు చెప్పబడినది.— "కిట్ట మన్నస్య విణ్మూత్రం, రసస్య తు కఫోఽసృజః, పిత్తం మాంసస్య ఖమలో మలః స్వేదస్తు మేధసః. స్యాత్కిట్టం కేశలోమాస్థ్నో మజ్జః స్నేహోఽక్షివిట్త్వచః." అన్నముయొక్క కిట్టము మలమూత్రములు, రసధాతువుయొక్కమలము కఫము, రక్తధాతువులయొక్కమలము పిత్తము, నాసాదిరంధ్రముల యందలిమలములు మాంసధాతువువలన పుట్టునవి. రోమరంధ్రములనుండి స్రవించెడు చెమట మేదస్సుయొక్కమలము, గోళ్లును వెండ్రుకలును అస్థులవలన బుట్టుమలములు. కన్నులయందును పురీషమునందును చర్మము పైభాగమునను కల్గుస్నేహము (జిడ్డు) మజ్జ (మూలగ)వలన కల్గినమలము అని యర్థము. ఇవి క్రమముగ రసాదిధాతువులమలములు.

మలమూత్రములు మాత్రము ఆహారమలములు, (అట్టిమలములవలన మలమూత్రాదులు పైజెప్పినరీతిగ పోషింపబడునని భావము.)

రసాదిధాతుపోషణ క్రమము.

మూ. పుష్యన్తి హ్యాహారరసాత్ రస-రుధిర-మాంస-మేదో-ఽస్థి, మజ్జ-శుక్రౌ-జాంసి, పంచేంద్రియద్రవ్యాణి ధాతుప్రసాదసంజ్ఞకాని, శరీరసన్ధిబన్ధపిచ్ఛాదయశ్చావయవాః. ౫

వ్యా. పైజెప్పిన యాహారరసమువలన రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము అను నీయేడుధాతువులును, రసాదిధాతుసారరూపమైన యోజస్సును, చక్షురాదీంద్రియముల పుట్టించునవియు, శరీరమునందలి ధాతుప్రసాదరూపంబులైన పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము ననుపంచేంద్రియద్రవ్యములును, శరీరము నందలికీళ్లను బంధించు (ఒండొంట సంబంధముకల్గునట్లుచేయు) స్నాయువులు సిరలు మున్నగునవియు, (ఆర్తము స్తన్యము మున్నగునవియు) ఇవియన్నియు పుష్టినొందును.

మూ. తే సర్వే ఏవ ధాతవో మలాఖ్యాః ప్రసాదాఖ్యాశ్చ రసమలాభ్యాం పుష్యన్తః స్వం మానమనువర్తన్తే. యథావయశ్శరీరం ఏవం రసమలౌ స్వప్రమాణావస్థితౌ ఆశ్రయస్య సమధాతో ర్ధాతుసామ్యమనువర్తయతః, నిమిత్త తస్తు క్షీణవృద్ధానాం ప్రసాదాఖ్యానాం ధాతూనాం వృద్ధిక్షయాభ్యాం ఆహారమూలాభ్యాం రసః సామ్యముత్పాదయతి; ఆరోగ్యాయ, కిట్టం చ మలానామేవమేవ; స్వమానాతిరిక్తాశ్చ ఉత్సర్గిణః శీతోష్ణపర్యాయగుణైశ్చోపచర్యమాణాః మలాః శరీరధాతుసామ్యకరాః సముపలభ్యన్తే. ౭

తేషాన్తు మలప్రసాదాఖ్యానాం ధాతూనాం స్రోతాంస్యయనముఖాని, యథాస్వం తాని యథా విభాగేన యథాస్వం ధాతూనాపూరయన్తి. ౮

ఏవమిదం శరీరం అశితపీతలీఢఖాదితప్రభవం. ౯

వ్యా. ఇత్తెరంగున ప్రసాదరూపంబులును మలరూపంబులు నగుసప్తధాతువులును పైజెప్పినరీతిగ నాహారరసముచేతను ధాతురూపమైన మలములచేతను పుష్టినొందుచు

శరీరమునందలి ఆయాయవయవములను ఆయావయస్సునకుతగిన ప్రమాణము కల్గి యుండును.

ఇత్తెరంగున రసమలములురెండును స్వప్రమాణమున నుండినవియై తమ కాశ్రయమైనసమధాతువుగనుండు శరీరమునకు ధాతుసామ్యమును చెడనీయక కాపాడుచుండును. ఏదైన కారణాంతరముచేత క్షయముసైనను వృద్ధిసైనను పొందిన ప్రసాదరూపములగు ధాతువులను ఆహారమూలమున కల్గువృద్ధిక్షయములచేత నాహారరసము సామ్యమును కల్గించును. దానంజేసి యారోగ్యము కల్గును. ఏదైన నొకకారణముచే ప్రసాదరూపమైన ధాతువులు క్షీణతసైనను వృద్ధిసైనను పొందియున్నచో ఆహారమూలమున కల్గిన వృద్ధినందిన యాహారరసము క్షీణించినధాతువును వృద్ధినొందించును. ఆహారమూలమున క్షీణించినయాహారరసము ప్రమాణాధికముగ వృద్ధినందిన ధాతువును క్షీణింపజేయును. ఇత్తెరంగున ఆహారమూలమైన వృద్ధిక్షయములనందిన యాహారరసము కారణాంతరమున (స్వప్రమాణమునకన్న) వృద్ధిక్షయముల నొందినధాతువులను సమస్థితినందించి ధాతుసామ్యరూపమైన యారోగ్యము ననువర్తింపజేయునని భావము).

కిట్టమనునదియుం పైజెప్పినవిధముగనే మలములకు సామ్యమును కల్గించును.

మరియు నుత్సర్గధర్మము (బైటవెడలుస్వభావము) కలమలములు శీతోష్ణాదుల చేత స్వప్రమాణమునకన్న నధికములుగ సైనచో శీతోష్ణాదిగుణములకు విరుద్ధగుణములు గల యుపచారములచేత శరీరధాతుసామ్యమును కల్గించును. (బైటవెడలునట్టి స్వభావము కలమలములు శీతగుణముల యపథ్యములచేత వృద్ధినొందినయెడ అట్టిగుణమునకు విరుద్ధమగు ఉష్ణగుణముల యుపచారములచే సామ్యస్థితినొందింపనగును. ఇత్తెరంగున వృద్ధికి కారణములగు శీత-ఉష్ణాదులకు విరుద్ధములైన గుణములుగల చికిత్సలచే మలములు సమస్థితినంది ధాతుసామ్యమును కల్గించునని భావము )

మరియుం వట్టిమల ప్రసాదరూపములైన ధాతువులను వ్యాపింపజేయురంధ్రములుగల స్రోతస్సులు (నాడులు) ఆయాధాతువులచే నిండియుండి (వానివానికి పోష్యములగు) నాయాధాతువులను పోషించుచు నాయాధాతువులను పూరింపుచుండును.

ఇత్తెరంగున అశిత-పీత - లీఢ-ఖాదితరూపమైన యాహారముచే శరీరము పుట్టి ధాత్వాదిమూలమున వృద్ధిజెందినదని యెరుంగునది.

ఆరోగ్య-అనారోగ్యములకు నాహారము కారణమనుట.

మూ. అశిత-పీత-లీఢ-ఖాదితప్రభవాశ్చాస్మిన్ శరీరే వ్యాధయో భవన్తి, హితాహితోపయోగవిశేషాస్త్వత్ర శుభాఽశుభవిశేషకరా భవన్తి, ఇతి. ౧౦

వ్యా. మరియు నట్టియశితపీతాదిరూపములగు నాహారములచే పైవివరించినవిధముగ పుట్టి వృద్ధినొందినశరీరమునందు అట్టి యశిత-పీత-లీఢ-ఖాదితములను అహితముల సేవించినవాడు దానంజేసి (అట్టి యాహారమువలననె) జ్వరాదిశారీరమానసికవ్యాధులు సంభవించును. (అట్టి శుభ-అశుభముల (ఆరోగ్య-అనారోగ్యముల) కు హితాఽహితాహారాదులు కారణములగును. హితాహారాదులచే నారోగ్యంబును, అహితాహారాదులచే ననారోగ్యంబును కల్గునని భావము.)

ఆరోగ్యానారోగ్యవిషయమై యగ్నివేశుని ప్రశ్నము.

మూ. ఏవం వాదినం భగవన్తమాత్రేయం అగ్నివేశ ఉవాచ:—దృశ్యన్తే హి భగవన్! హితసమాఖ్యాతమప్యాహార ముపయుఞ్జానాః వ్యాధిమన్తశ్చ; అగదాశ్చ, తథైవాహితసమాఖ్యాతం, ఏవం దృష్టే కథం హితాఽహితోపయోగవిశేషాత్మకం శుభాఽశుభ విశేష ముపలభామహే ఇతి. ౧౧

వ్యా. పైవివరింపబడిన విషయమహావాక్యముచేత హితాహారోపయోగమున నారోగ్యంబును, అహితోపయోగమువలన అనారోగ్యంబును కల్గునని సముదితార్థమేర్పడినది. ఈవిషయమున విప్రతిపత్తిజూపుచు ప్రశ్నముచే నతివ్యాప్త్యవ్యాప్తిని చెప్పుచు భగవంతుడైన యాత్రేయుని అగ్నివేశు డిట్లడిగెను.

లోకమున హితమని యేర్పడినయాహారమునే యుపయోగించు మానవులు కొందరు వ్యాధిపీడితులగుచున్నారు. అహితముగ జెప్పబడునాహారముల నుపయోగించువారును కొందరు రోగబాధితులుకాక స్వస్థతనున్నవారు. ఇట్లుండ హితోపయోగమున ఆరోగ్యంబును, అహితోపయోగమున అనారోగ్యంబును కల్గునని నిశ్చితముగ నెట్లు చెప్పగలము? (అని అగ్నివేశు డడిగెను.)

హితాహారోపయోగము చేయువారికిని రోగములుకల్గుటకు కారణవిశేషములు

మూ. తమువాచ భగవానాత్రేయః—న హితాహారోపయోగినాం అగ్నివేశ! తన్నిమిత్తా వ్యాధయో జాయన్తే, న చ కేవలం హితాహారోపయోగాదేవ సర్వవ్యాధిభయ మతిక్రాన్తం భవతి. సన్తి హ్యృతేఽప్యహితాహారోపయోగాత్ అన్యా రోగ ప్రకృతయః, తద్యథా:—కాలవిపర్యయః, ప్రజ్ఞాపరాధః, పరిణామశ్చ, శబ్ద-స్పర్శ-రూప-రస-గన్ధాశ్చాఽసాత్మ్యాః ఇతి. ౧౨

తాశ్చ రోగప్రకృతయో రసాః సమ్యగుపయుజ్యమానం పురుష మశుభేనోపపాదయన్తి, తస్మాద్ధితాహారోపయోగినోఽపి దృశ్యన్తే వ్యాధిమన్తః.		౧౩

వ్యా. పైజెప్పినవిధముగ నడిగిన యగ్నివేశున కాత్రేయుం డిట్లు బదులు సెప్పెను:—హితాహారముల నుపయోగించువారికి అట్టియాహారమును కారణముగజేసి వ్యాధు లెన్నడును కల్గవు. కేవలము హితాహారముల నుపయోగించుమాత్రముననే సకల వ్యాధులవలని భయంబును పూర్తిగ నివర్తింపజాలదు. అహితాహారములే కాక యితరము లగు కొన్నిరోగకారణములు కలవు. అవియెవ్వి యన:—కాలవిపర్యయము [ఋతువుల ధర్మములు (శీతకాలమున నుష్ణముగను, ఉష్ణకాలమున శీతముగను) వ్యత్యస్తముగ మార్పు జెందియుండుట], ప్రజ్ఞాపరాధము, పరిణామము, అసాత్మ్యములగు శబ్దస్పర్శ రూపరసగంధములు, (ఇదియె అసాత్మ్యేంద్రియార్థసంయోగము) అనునవి. ఇవియును రోగకారణములు. (వీనివివరణము తిస్రైషణీయము ౧౧ అధ్యాయమున జూచునది.)

అట్టి కాలవిపర్యయము మున్నగుకారణములును హితాహారముల నుపయోగించు వారికింగూడ ననారోగ్యమును కల్గించుచున్నవి. కావున హితాహారముల సేవించు వారును గొందరు ఆరోగ్యములేనివారుగ (పైకారణములచే) నగుచున్నారు.

## అహితాహారము జేసినను రోగోత్పత్తిలేని కారణములు.

**మూ.** అహితాహారోపయోగినాం పునః కారణతో న సద్యో దోషవాన్ భవత్యపచారః న హి సర్వాణ్యపథ్యాని తుల్యదోషాణి, న చ సర్వే దోషాః తుల్యబలాః, న హి సర్వాణి శరీరాణి వ్యాధిక్షమత్వే సమర్థాని భవన్తి, తదేవ హ్యపథ్యం దేశ-కాల-సంయోగ-వీర్య-ప్రమాణాతియోగాత్ భూయస్తరమపథ్యం సమ్పద్యతే. స ఏవ దోషః సంసృష్టయోనిః విరుద్ధోపక్రమో గమ్భీరానుగతః చిరస్థితః ప్రాణాయతనసముత్థో మర్మోపఘాతీ వా భూయాన్ కష్టతమః క్షిప్రకారితమశ్చ సమ్పద్యతే.౧౪

వ్యా. మరియు అహితాహారముల నుపయోగించువారికి (ప్రతిబంధకములగు) కొన్నికారణాంతరములచేత నట్టి యపథ్యాహారము తత్కాలముననే రోగముల కల్గింప జాలకుండును. అపథ్యములన్నియు సమాన (ఎల్లప్పుడు నొక్కతీరుగనే) దోషకరములు కానేరవు. (అపథ్యములలో భేదమునుబట్టి కొన్ని రోగకరములు

కాకయుం నుండవచ్చునని భావము.) దోషములన్నియును సమానబలములు కానోపవు. శరీరములన్నియుం వ్యాధుల నోర్వదగినస్థితి నుండబోదు. కావున అట్టియపథ్యము దేశము, కాలము, సంయోగము, వీర్యము, పరిమాణము అనునీమైదిటియొక్క అతియోగమునం జేసి మిక్కిలి యపథ్యమగును. అట్టిరోగమే దోషద్వయసంసర్గముచే గల్గినను, విరుద్ధచికిత్స జేయవలసినదియైనను, గంభీరములగు అస్థిమజ్జాదుల నాశ్రయించి పుట్టియున్నను, చిరకాలమునుండి యనుసరించినదైనను, ప్రాణములకు ఆధారములైన స్థానముల పుట్టినదైనను, మర్మస్థానముల పుట్టినదైనను అట్టివ్యాధి మిక్కిలి కష్టమును కల్గించునదియై అతిశీఘ్రముగ హింసించునది యగును.

మూ. శరీరాణి చాతిస్థూలాన్యతికృశాని, అనివిష్టమాంసశోణితాస్థీని, దుర్బలాన్యసాత్మ్యాహారోపచితాన్యల్పాహారాణి అల్పసత్వాని వా భవన్తి అవ్యాధిసహాని విపరీతాని పునర్వ్యాధిసహాని' ఏభ్యశ్చైవా పథ్యాహారదోషశరీరవిశేషేభ్యో వ్యాధయో మృదవో దారుణాః క్షిప్రసముత్థాః చిరకారిణశ్చ భవన్తి అత ఏవ చ వాతపిత్తశ్లేష్మాణః స్థానవిశేషే ప్రకుపితాః వ్యాధివిశేషానభినిర్వర్తయన్త్యగ్నివేశ! ౧౫

వ్యా. మరియుం అతిస్థూలంబులును, అతికృశంబులును, శిథిలములై విషమములైన మాంస-రక్త-అస్థులు కల్గినవియుం, బలహీనములైనవియుం, అసాత్మ్యములగు నాహారములచే వృద్ధిజెందినవియుం, పరిమాణమునకు తక్కువగ నాహారము చేయుటచే వృద్ధినొందినవియుం, మిక్కిలి యల్పబలముకల్గినవియుం నగుశరీరములు వ్యాధిసహములు కానోపవు. (పైజెప్పిన అతిస్థూల-అతికృశాదిలక్షణములు కలశరీరములు వ్యాధినికల్గించునవి యగునని భావము). అటుగాక పైజెప్పిన లక్షణములకు విరుద్ధములగు అనతిస్థూలములును అనతికృశంబును మున్నగులక్షణములు కలశరీరములు వ్యాధిసహములగును. వ్యాధులు బుట్టుటకు ప్రతిబంధములగునని భావము).

అపథ్యాహారమును దోషములను శరీరభేదముల నుద్దేశించి చెప్పబడినవిశేషముల వలన రోగములు మృదువులును, చిరకాలమునకు బాధించునవియుం, మిక్కిలి దారుణంబులును, అతిశీఘ్రముగ జనించి బాధించునవియు నగును. ఇంతియేకాక దోషములయొక్క స్థానవిశేషమువలనను నానావిధములగు రోగవిశేషములను కల్గించునని యర్థము.

ఇచ్చట నీవిషయసంగ్రహము నెరుంగునది:—అపథ్యములగునాహారములు దేశకాలసంయోగాదివిశేషములంజేసి మిక్కిలి ప్రబలములై యపథ్యతమములై యుండును. (ఈవిషయము 'తదేవ హ్యాపథ్యం......సమ్పద్యతే" అనువాక్యమున జూపబడినది). కావున నపథ్యములన్నియు నేకరీతిగ నుండవు. రోగములును అనేకదోషసంసర్గముచే జనించుట మున్నగుకారణములచే నేకరీతిగనే యుండక కష్టములును క్షిప్రకారులునైయుండును. (ఈవిషయము "స ఏవ దోషః......క్షిప్రకారితమశ్చ సమ్పద్యతే" అను వాక్యముచే జెప్పబడినది.) అతిస్థూలకృశాదిశరీరములు వ్యాధిసహములు (వ్యాధుల బుట్టింపని ప్రతిబంధకములు లేనివి) కానోపవు. (ఈవిషయము "శరీరాణి చాతి...... త్యవ్యాధిసహాని" అనువాక్యముచే జెప్పబడినది) కావున శరీరములన్నియు నేకరీతిగ వ్యాధిసహములుకావు. ఇవియే అపథ్యాహారములకును దోషములకును శరీరములకును కల విశేషములు. అట్టి మూడువిధములైన కారణములచే రోగములు మిక్కిలి క్రూరంబులును అతిశీఘ్రముగ జనించి బాధించునవియు నగును. అటుకాక అపథ్య-దోష-శరీరములు వానివానికి పైజెప్పినలక్షణములకు విరుద్ధములగు లక్షణములు కల్గియుండునెడ మృదువులు (అల్పబాధాకరములు) ను, చిరకారిణులు (తగినసంపత్తిలేమింజేసి యణగియుండి చిరకాలమునకు బాధించునవియు) నైయుండును. కావున నహితాహారములజేయు వారి పైజెప్పినరీతిగ నపథ్యదోష-బలాబలములబట్టి కొన్నిసమయములయందు వ్యాధులు క్రూరంబులును, కొన్నిసమయములయందు కాలాంతరమున బాధించునవియు నైయుండునుకాని అహితాహారములవలన వ్యాధిభయము సర్వథా నివర్తింపనేరదని భావము. ఇచ్చట హితాహారములజేయువారికి రోగములు ఎట్లు కల్గుచున్నవి? అనుప్రశ్నమునకు "నచ కేవలం......దృశ్యన్తే వ్యాధిమన్తః" అనువాక్యంబును; అహితాహారముసేయు వారి కెట్లు వ్యాధులు కల్గకుండును? అనుప్రశ్నమునకు "అహితాహారోపయోగినాం పునః......నభినిర్వర్తయం త్యగ్నివేశ" అనువాక్యంబును ఉత్తరములుగ జెప్పబడినవని యెరుంగునది.

## రసాదిదృష్టిచే గల్గురోగములవివరణము.

మూ. తత్ర రసాదిస్థానేషు ప్రకుపితానాం దోషాణాం యస్మిన్ యస్మిన్ స్థానే యే యే వ్యాధయస్సమ్భవన్తి; తాంస్తాన్ యథావదనువ్యాఖ్యాస్యామః.　　౧౬

వ్యా. అందు రసాదిస్థానములయందు ప్రకోపమునొందిన వాతాదిదోషములకు సంబంధించి యేయేస్థానమున జేరినపు డేయేవ్యాధులు సంభవించునో ఆయారోగములను యథాశ్రుతముగ నీక్రింద వివరించెదమని యర్థము.

### రసదుష్టిచే గల్గురోగములు.

మూ. అశ్రద్ధా చారుచిశ్చాస్యవైరస్యమరసజ్ఞతా,
హృల్లాసో గౌరవం తన్ద్రా సాఙ్గమర్దో జ్వర స్తమః. ౧౭
పాణ్డుత్వం స్రోతసాం రోధః క్లైబ్యం సాదః కృశాఙ్గతా,
నాశోఽగ్నే రయథా కాలం వళయః ఫలితాని చ. ౧౮
రసప్రదోషజాః రోగాః,

వ్యా. వాతపిత్తకఫములలో నేదోషమైనను ప్రకోపమునొంది రసధాతు నాశ్రయించి ఆట్టిధాతువును చెరిచి (స్వభావస్థితి నుండనీయకజేసి)నపుడు అశ్రద్ధ (ఆహారమును భుజించుటయం దిచ్ఛలేకుండుట), అరుచి (నోటనుంచుకొనినయాహారము రుచిలేక మ్రింగనుకూడ యిష్టములేకుండుట), నోరు రుచిమారియుండుట (మధురాదిరసములు రుచిమారి (తీపు చేదుగను చేదు పులుపుగను వ్యత్యస్తముగ) నుండుట), మధురాది రసము లెవ్వియు నోటికి దెలియకుండుట, హృల్లాసము (ఓకరింతలు), శరీరము బరువుగ నుండుట, కునికిపాటు, ఒడలినొప్పులు, జ్వరము, చీకటిలో నున్నవిధముగ మైకము, పాండురోగము, స్రోతోమార్గములు అడ్డగించియుండుట; బలహీనత, ప్రాలుమాలిక, శరీరము కృశించుట, జఠరాగ్ని మందగించుట, అకాలమున వలీపలితములుకల్గుట అను నీ రోగములు సంభవించును.

ఇచ్చట వాతాదిదోషములలో నెద్దియైన రసధాతువు నాశ్రయించి ప్రకోపించి యట్టిధాతువును దుష్టముగజేసినప్పుడు అట్టిదోషము ఆశ్రయప్రభావమునంజేసి తమకు నియతములుకాని అశ్రద్ధాదిరోగములగూడ గల్గించునని భావము. ఇత్తెరంగుననే రక్తాదుల దుష్టములుగజేసినపుడును ఆశ్రయబలముచే (ప్రభావమువలన) రోగవిశేషము గల్గించునని యెరుంగునది.

### రక్తదుష్టిచే గల్గురోగములు.

మూ. వక్ష్యన్తే రక్తదోషజాః,
కుష్ఠవీసర్పపిడకా రక్తపిత్తమసృగ్దరః. ౨౦
గుదమేఢ్రాస్యపాకశ్చ ప్లీహా గుల్మోఽథవిద్రధీ,
నీలికా కామిలా వ్యఙ్గం పిప్లవ స్తిలకాలకాః ౨౧
దద్రుశ్చర్మదలం శ్విత్రం పామా కోఠా స్రమణ్డలమ్,
రక్తప్రదోషాజ్జాయన్తే

వ్యా. కుష్ఠము విసర్పము ప్రమేహపిటికలు రక్తపిత్తము రక్తప్రదరము (కుసుమ రోగము) గుదమునందును, మేఢ్రమునందును, నోటియందును పుండగుట, ప్లీహావృద్ధి, గుల్మము, విద్రధి, నీలిక (శరీరముపై నల్లనిచుక్కలేర్పడుట,) కామిలారోగము, వ్యంగము (మందు), పిప్లవములు, (తెలుపునలుపురంగులుగలచుక్కలు), తిలకాలకములు (నువ్వులవంటి నల్లనిచుక్కలు), దద్రుకుష్ఠము, చర్మదళకుష్ఠము, శ్విత్రము (తెల్లని బొల్లి), తీట, కోఠములు, మండలాకారములై రక్తమును స్రవించుపొడలు అను నీ రోగములన్నియుం వాతాదిదోషములు రక్తమునజేరి దానిని దుష్టముగజేసినపుడు కల్గును.

## మాంసదుష్టిచే గల్గురోగములు.

మూ.

శ్రుణుమాంసప్రదోషజాన్.  
అధిమాంసార్బుదం కీలగళశాలూకశుణ్డికాః, ౨౨  
పూతిమాంసాలజీగణ్డాగణ్డమాలోపజిహ్వికాః.  
విద్యాన్మాంసాశ్రయాంశ్చ ౨౩

వ్యా. అధిమాంసము, అర్బుదము, గుదస్థానమున జనించుమాంసాంకురములు, (మొలలజాడ్యము), శాలూకము, (కుత్తుకలోకల్గువాతరోగవిశేషము), గలశుండిక, (ఎదురుకుత్తుక), పూతిమాంసము, (మాంసముకుళ్లుట), అలజి, (వ్రణరోగవిశేషణము), గలగండము, గండమాల ఉపజిహ్వక అను నీరోగములు మాంసదుష్టిచే కల్గును.

## మేదోదుష్టిచే గల్గురోగములు.

మూ.

మేదస్సంశ్రయాస్తు ప్రవక్ష్యతే,  
మాంసప్రదోషజాన్ విద్యాత్ దోషాన్మేదఃప్రదోషజాన్. ౨౪  
నిన్దితాని, ప్రమేహాణాం పూర్వరూపాణి యాని చ,

వ్యా. వాతాదిదోషము మేదస్సున జేరి దానిని చెరచినపుడు పైజెప్పినమాంస దుష్టికికల్గు అధిమాంసాదిరోగములు సంభవించును. మఱియుం అష్టానిందితీయమను ఇరువదియొకటవయధ్యాయమున "అతిదీర్ఘశ్చాతిహ్రస్వశ్చ అతిలోమాచ అలోమాచ అతికృష్ణశ్చ అతిగౌరశ్చ, అతి స్థూలశ్చ అతికృశశ్చ" అని చెప్పిన నిందితములైన అతిదీర్ఘత్వాదు లెనిమిదియు సంభవించును. మఱియుం ప్రమేహములకు పూర్వరూపములుగ జెప్పబడిన కేశజటిలత్వాదిదోషములును కల్గును.

### అస్థిదుష్టిచే గల్గురోగములు.

మూ. అధ్యస్థి ద_న్తదన్తాస్థిభేదశూలం వివర్ణతా. ౧౭

కేశలోమనఖశ్మశ్రుదోషాశ్చాస్థిప్రకోపజాః,

వ్యా. అధ్యస్థి (ఎముకలో వేరొకయెముక పుట్టుట), అధిదంతము (అధికముగ వేరొకపల్లుమొలచుట), దంతములు అస్థులును చీలుట, వానియందు నొప్పిపుట్టుట, దంతములును, అస్థులును రంగుమారుట, వెండ్రుకలు రోమములు గోళ్లు మీసములు వీనికిసంబంధించినరోగములు. ఇవియన్నియు దోషములు అస్థులను చెరచినప్పుడు సంభవించును.

### మజ్జదోషమున గల్గురోగములు.

మూ. రుక్పర్వణాం భ్రమో మూర్ఛా దర్శనం తమసో మతాః. ౧౮

అరుషాం స్థూలమూలానాం పర్వజానాం చ దర్శనం,

మజ్జప్రదోషాత్

వ్యా. కీళ్లలోనొప్పి, భ్రమము (చక్రముపై నున్నవానివలె నొడలు తిరుగుట), మూర్ఛగ్రమ్ముట, కన్నులకు చీకటిగ్రమ్మినట్లుండుట, రూఢమూలములైన వ్రణములు కీళ్లయందు పుట్టుట ఇవియన్నియు మజ్జ (మూలగ)లో వాతాదులు చేరినపుడు సంభవించును.

### శుక్రదుష్టిచే గల్గురోగములు.

మూ. శుక్రస్య దోషాత్ క్లైబ్యమహర్షణమ్. ౧౯

రోగిణం క్లీబమల్పాయుం విరూపం వా ప్రజాయతే,

న వా సఞ్జాయతే గర్భః, పతతి, ప్రస్రవత్యపి. ౨౦

శుక్రం హి దుష్టం సాపత్యం సదారం బాధతే నరమ్,

వ్యా. వాతాదులచే శుక్రము చెడినప్పుడు నపుంసకు డగును. సంభోగేచ్ఛ తప్పును. అట్టివానికి కల్గినసంతతి రోగముతో కూడినదైనను, పుంస్త్వము లేకదైనను, అల్పాయుస్సుగనైనను, కురూపముగనైన పుట్టును. అట్టివానిభార్య కొకవేళ వానివలన సంతతికల్గకయుం నుండును. ఒకసమయముగ గర్భముకల్గినను అయ్యది నిలువక (పూర్తికాకముందుగనే) పడిపోవును. లేక ద్రవరూపముగ నున్నపుడే స్రావము కల్గును. ఇత్తెరంగున నరునకు శుక్రము చెడినపుడు వానితోపాక వానిసంతతిని వానిభార్యను వానినికూడ వేధించి బాధించును.

### ఇంద్రియదుష్టిచే గల్గురోగములు.

మూ. ఇన్ద్రియాణి సమాశ్రిత్య ప్రకుప్యన్తి యదా మలాః. ౨౯
ఉపఘాతోపతాపాభ్యాం యోజయన్తీన్ద్రియాణి తే,

వ్యా. వాతాదిదోషములు ప్రకుపితములై చక్షురాదీంద్రియముల జేరినపుడు ఆట్టియింద్రియములకు హాని కల్గును. లేక ఆయింద్రియముల శక్తి తగ్గును.

### స్నాయ్వాదిదుష్టిచే గల్గురోగములు.

మూ. స్నాయూసిరాకణ్డరాభ్యో (స్నాయూ సిరాకణ్డరయోః) దుష్టాః
క్లిశ్యన్తి మానవమ్ ౩౦
స్తమ్భసంకోచఖల్లీభిః గ్రన్థి స్ఫురణసుప్తిభిః,

వ్యా. వాతాదిదోషములు స్నాయువులను సిరలను కండరములను ఆశ్రయించి ప్రకోపించినపుడు ఆట్టిస్నాయువు మున్నగునవి స్తంభించును. లేక అవి ముడుచుకొనును. లేక ఖల్లి యనువాతరోగము కల్గును. గ్రంథులు పుట్టును. అయ్యవి అధికముగ నదరును. స్పర్శము నెరుంగకుండును. (ఇట్టిబాధలచే మానవుని బాధించును).

ఇచ్చట 'కండరాభ్యః' అనుచోట ల్యబ్లోపమున పంచమి. "స్నాయుసిరాకణ్డరాః, ఆశ్రిత్య, దుష్టాః" అని యన్వయించుటచే పైయర్థము లభించును. పాఠాంతరమున నిర్వివాదము.

### దోషములు మలములజేరినపుడు గల్గురోగములు.

మూ. మలానాశ్రిత్య కుపితాః భేదశోషప్రదూషణమ్. ౩౧
దోషా మలానాం కుర్వన్తి సఙ్గోత్సర్గావతీవ చ,

వ్యా. శరీరమునందలి పురీషాదిమలములను వాతాదులు చేరి ప్రకోపము నొందినపుడు భేదము (పురీషము ఉండలుగ భేదించుట), శోషము (ద్రవములేక యెండుట) సంభవించును. ఆట్టి మలములకు స్వాభావవర్ణాదుల చెడగొట్టును. మలమూత్రాదుల వెడలనీయక నిరోధించును. లేక అధికముగ వెడలించును. (ఇట్టిదోషములు మలమూత్రాదులలో నానామలములకు యథాసంభవముగ కల్గునని భావము).

### రసజాదిరోగములు కల్గుటకు కారణములు, కల్గకుండునుపాయములు

మూ. వివిధాదశితాత్ పీతాదహితాత్ లీఢఖాదితాత్. ౩౨
భవన్త్యేతే మనుష్యాణాం వికారా యే ఉదాహృతాః,

తేషా మిచ్ఛన్ననుత్పత్తిం సేవేత మతిమాన్ సదా. 33
హితాన్యేవాఽశితాదీని నస్యుస్తజ్జాస్తథామయాః,

వ్యా. పలుదెరంగులైన అశిత-పీత-లీఢ-ఖాదితరూపములగు నాహారములలో నహితంబులగువాని నుపయోగించుటవలన మనుజులకు పైజెప్పిన రస-రక్తాదిజన్యరోగములు సంభవించును. కావున అట్టిరోగములు కల్గకుండవలె ననుకోరిక గలమానవులు అట్టియశితాదిరూపమైన యాహారములను హితములగువానినే సేవించవలెను. అట్టిహితాహారముల సేవించినంత పైజెప్పినవ్యాధులు కల్గబోవు.

రస-రక్త-మాంస-మజ్జాజన్యరోగములకు చికిత్స.

మూ రసజానాం వికారాణాం సర్వం లఙ్ఘనమౌషధమ్. 34
విధిశోణితకేఽధ్యాయే రక్తజానాం భిషగ్జితమ్,
మాంసజానాం తు సంశుద్ధిః శస్త్రక్షారాగ్నికర్మ చ. 35
అష్టౌ నిన్దితకేఽధ్యాయే మేదోజానాం చికిత్సితమ్,

వ్యా పైజెప్పినవ్యాధులలో రసజవ్యాధులకు లంకణముచేయుట ప్రధానమైన చికిత్స యగును. రక్తజవ్యాధులకు విధిశోణితీయ మనునిరువదినాల్గవయధ్యాయమున ("కుర్యాచ్ఛోణితరోగేషు......స్రావణం శోణితస్య వా" ౧౮ శ్లోకము అని యుపక్రమించి) చెప్పబడిన చికిత్సల నెరుంగునది.

మాంసమునబుట్టిన రోగములకు సంశోధనంబును, శస్త్ర-క్షార-అగ్నికర్మల జేయుటయు తగినచికిత్స యగును.

మేదోరోగములకు (స్థౌల్యాదులకు) అష్టౌనిందితీయమను నిరువదియొకటవ యధ్యాయమున ("గురుచాతర్పణం శ్రేష్ఠం స్థూలానాం కర్షణం హితం" అని యుపక్రమించి) చెప్పబడినచికిత్సలు హితకరములగును.

అస్థిజన్యరోగములచికిత్స.

మూ. అస్థ్యాశ్రయాణాం వ్యాధీనాం పఞ్చకర్మాణి భేషజమ్. 36
వస్తయః క్షీరసర్పీంషి తిక్తకోపహితాని చ,

వ్యా. అస్థుల నాశ్రయించి సంభవించినరోగములకు వమనవిరేచనాదిపంచకర్మల జేయుటయు, పాలను నేతిని తిక్తరసమునుగూర్చిన యౌషధములచే వస్తికర్మల జేయుటయు మిక్కిలి హితకరములు. (ఇచ్చట పంచకర్మలనుటచేతనే వస్తికర్మకూడ చెప్పబడినను మరల "వస్తయః ... హితాని చ" అని చెప్పినది తిక్తకాదిరసయుక్త వస్తులకు ప్రాశస్త్యమును జూపుటకని యెరుంగునది.)

—•◎ మజ్జ-శుక్రముల బుట్టిన రోగములచికిత్స. ◎•—

మూ. మజ్జశుక్రసముత్థానాం ఔషధం స్వాదుతిక్తకమ్. ౩౭
అన్నం వ్యవాయవ్యాయామౌ శుద్ధిః కాలేచ మాత్రయా,

వ్యా. మజ్జయందును శుక్రమునందును పుట్టినరోగములకు మధురతిక్తరసములు కలయన్నంబులును, సంభోగంబును, దేహపరిశ్రమము జేయుంటయును హితకరము. మరియును తగినకాలమున యుక్తపరిమాణము ననుసరించి (సిద్ధిస్థానమున జెప్పబడు వమనాదులచేత) శోధనమును విధ్యుక్తప్రకారము చేయుంటయును హితకరమగును.

—•◎ ఇంద్రియజ-స్నాయ్వాదిజరోగములచికిత్స. ◎•—

మూ. శాన్తిరిన్ద్రియజాతానాం త్రిమర్మీయే ప్రవక్ష్యతే. ౩౮
స్నాయ్వాదిజానాం ప్రశమో వక్ష్యతే వాతరోగికే,

వ్యా. చక్షురాదీంద్రియముల నాశ్రయించినవ్యాధులకు త్రిమర్మీయ మను (చికిత్సాస్థానమునందలి యిరువదియారవ) అధ్యాయమున చికిత్సలు చెప్పబడును. స్నాయు సిరాకండరముల నాశ్రయించి పుట్టినవ్యాధులకు వాతవ్యాధి చికిత్సితమను (చికిత్సాస్థానమునందలి యిరువదియెనిమిదవ) అధ్యాయమున చికిత్స చెప్పబడును.

—•◎ మలమూత్రాదిజరోగముల చికిత్సాసంగ్రహము. ◎•—

మూ. న వేగాన్ ధారణేఽధ్యాయే చికిత్సాసంగ్రహః కృతః. ౩౯
మలజానాం వికారాణాం సిద్ధిశ్చోక్తా క్వచిత్క్వచిత్,

వ్యా. శరీరమునందలి మలమూత్రాదులకు సంబంధించినవ్యాధులకు దగినచికిత్సలు నవేగాన్ ధారణీయమను సూత్రస్థానమునందలి యేడవయధ్యాయమున సంగ్రహింపబడినవి. మరియును చికిత్సాస్థానమునందలి అతిసారగ్రహణ్యాదిచికిత్సితములయందును చెప్పబడినవి. (ఇత్తెరంగున నుద్దిష్టప్రకారము రస-రక్తజాదిరోగములకు హితసేవనాక్రమంబును చికిత్సలును చెప్పబడినవి).

—•◎ దోషములు రసరక్తాదిశాఖల జేరువిధము. ◎•—

మూ. వ్యాయామాదూష్మణస్తైక్ష్ణ్యాత్ హితస్యాఽనవచారణాత్. ౪౦
కోష్ఠాచ్ఛాఖామలా యాన్తి ద్రుతత్వాన్మారుతస్య చ,
తత్రస్థాశ్చ విలమ్బన్తే కదాచిన్న సమీరితాః. ౪౧
నాఽదేశకాలే కుప్యన్తి భూయో హేతుప్రతీక్షిణః,

వ్యా. దేహపరిశ్రమమువలనను, కాయాగ్నియొక్క తీవ్రమైనయావిరిచేతను, హితములగు నాహారాదుల నధికముగ మితిమీరి సేవించుటవలనను, ఇట్టికారణముల చేత కోష్ఠమునందలిమలములు (దోషములు) వాయువుయొక్క వేగముచేత రసరక్తాదిశాఖల జేర్పబడును. (మలములకు కోష్ఠము ఆశ్రయమైయున్నను పైజెప్పినవ్యాయామాదికారణముల చేత తమతమనియతస్థానముల విడచి చలనస్వభావముకల వాతవేగముచే రసము రక్తము మున్నగుశాఖల జేర్పబడునని భావము)

అట్టిమలములు శాఖల (రసరక్తాదుల) జేరియుండియు వానికి ప్రేరకములగుకారణములు లేమింజేసి ఆయారోగముల గల్గించక తమకు తగినకారణముల ప్రతీక్షించుచు నణగియుండును. (తమకు బలకరములగు కాలదేశములసంబంధము లేమింజేసి బలహీనములై రోగముల గల్గింపజాలక యూరకుండునని భావము. మరియు నయ్యవి తమకు దగిన దేశకాలాదిసంబంధంబును ప్రేరకమగుకారణంబును తటస్థపడిన యప్పుడు సమయము వేచియుండి లబ్ధబలములై ఆయావ్యాధులను కాలాంతరమున కల్గించుననియు భావము.)

శాఖలజేరినదోషముల కోష్ఠమునజేర్చు నుపాయము.

మూ. వృద్ధ్యాభిష్యన్దనాత్ పాకాత్ స్రోతోముఖవిశోధనాత్. ౪౨
శాఖాం ముక్త్వా మలాః కోష్ఠం యాన్తి వాయోశ్చ నిగ్రహాత్,

వ్యా. పైజెప్పినరీతిగ స్వస్థానమైన కోష్ఠమును వదలి రసరక్తాదిధాతువుల జేరిన దోషములు వృద్ధిచేతను, ద్రవము కల్గుటచేతను (ద్రవించుటచేతను), పాకముజెందుట చేతను శోధనముచే స్రోతో (ధమనుల) మార్గము శుభ్రముగ నగుటచేతను అట్టి రక్తాది శాఖల వదలి కోష్ఠమున జేరును. మరియు అట్టిదోషములను రసాదిధాతువుల జేర్చువాతమును నిగ్రహించుటవలనను దోషములు శాఖలనుండి మరలి కోష్ఠమున జేరును.

సకలరోగచికిత్సాసంగ్రహము.

మూ. అజాతానామనుత్పత్తౌ జాతానాం వినివృత్తయే. ౪౩
రోగాణాం యో విధిర్దృష్టః సుఖార్థీ తం సమాచరేత్,
సుఖార్థాస్సర్వభూతానాం మతాస్సర్వాః ప్రవృత్తయః. ౪౪
జ్ఞానాఽజ్ఞానవిశేషాత్తు మార్గామార్గప్రవృత్తయః,

వ్యా. మరియు సుఖమునుకోరు మనుజుడు ఈతంత్రమునందు రోగములు పుట్టకుండుటకును, పుట్టినరోగముల నివృత్తిపరచుటకు జెప్పియుండువిధానము నంతట్టిని

యథోక్తముగ నాచరించవలెను. (అట్టు లాచరించినయెడ వానికి రోగములు సంభవింపవనియు, ఒకవేళ గల్గినరోగములును నివృత్తించుననియు భావము.)

మరియు లోకమునందలి మనుజకోటులెల్ల వారివారికి సుఖమునె యెల్లప్పుడును కోరుచుందురు; (కాని కష్టముగోరరు). ఐనను వారివ్యాపారములు జ్ఞానముకల్గిననాడు మంచిమార్గములనే ప్రవర్తించును, జ్ఞానములేనినాడు అట్టివ్యాపారములన్నియు చెడ్డమార్గములనే ప్రవర్తించును. (కావున తెలివికలవారు తంత్రమున వివరింపబడిన రోగనివృత్తిపద్ధతుల నవలంబించి ప్రవర్తించుట సర్వరోగములకును చికిత్సయగునని భావము.)

మూ. హితమేవాఽనురుధ్యన్తే ప్రపరీక్ష్య పరీక్షకాః. ౪౫
రజోమోహావృతాత్మానః ప్రియమేవ తు లౌకికాః,

వ్యా. సదసద్వివేకముగలపరీక్షకులు యుక్తాఽయుక్తముల జక్కగ విమర్శించి అందు హితముగనుండువిషయములనే జేయగోరుదురు. రాగమును అజ్ఞానమును కలమనుజులు కేవలము తాత్కాలికప్రియమునే గోరి దానినే యాచరించెదరు.

("అనురుధః కామే" అను ప్రమాణముచేత అనుపూర్వకరుధధాతువుకు కామమని యర్థము. కావున "అనురుధ్యన్తే—కోరెదరు" అని యర్థము.)

మూ. శ్రుతం బుద్ధిః స్మృతిః దార్ఢ్యం ధృతిర్హితనిషేవణమ్. ౪౬
వాగ్విశుద్ధిశ్శమో ధైర్యం ఆశ్రయన్తి పరీక్షకమ్,
లౌకికం నాశ్రయన్త్యేతే గుణాః మోహతమశ్శ్రితమ్. ౪౭
తన్మూలా బహులాశ్చైవ రోగాశ్శారీరమానసాః,

వ్యా. శాస్త్రపరిజ్ఞానము, బుద్ధి, జ్ఞాపకశక్తి, మనోబలము, సంతసము, హితములనాచరించుట, వాక్కు అపశబ్దాదిదోషములు లేక పరిశుద్ధముగ నుండుట, ఇంద్రియనిగ్రహము, ధైర్యము ఇవియన్నియు పరీక్షకుడగుజ్ఞానవంతుని యాశ్రయించియుండును. అజ్ఞానాంధకారముచే నావరింపబడినవానిని పైజెప్పినగుణము లాశ్రయింపవు. దానంజేసి వారిని శారీరమానసరోగములన్నియు బాధించుచుండును.

## అహితసేవనమునకు ప్రజ్ఞాపరాధము కారణమనుట.

మూ. ప్రజ్ఞాపరాధాద్ధ్యహితాన్ అర్థాన్ పఞ్చ నిషేవతే. ౪౮
సన్ధారయతి వేగాంశ్చ సేవతే సాహసాని చ,
తదా త్వసుఖసంజ్ఞేషు భావేష్వజ్ఞోఽనురజ్యతే. ౪౯
రజ్యతే న తు విజ్ఞాతా విజ్ఞానే తు మలీకృతే,

వ్యా. యుక్తాయుక్తవివేకము లేనిమూఢుడు రజస్తమోగుణములచేత చెరుపబడిన బుద్ధికలవాడగుటంజేసి (అట్టియజ్ఞానమువలన) అహితములై వ్యాధికారణములైన యర్థములను (శబ్దస్పర్శరూపరసగంధములనునట్టి పంచేంద్రియార్థములను) సేవించెదరు. మలమూత్రాదివేగముల నిరోధించెదరు. సాహసకృత్యముల (బలవద్విగ్రహాదుల) జేయబూనెదరు. ఇత్తెరంగున తాత్కాలికసుఖమును మాత్రము జూపి ఫలితమున రోగరూపకష్టమును కల్గించువిషయములయందే మూఢులు ప్రీతికల్గియుందురు. వివేకపరిజ్ఞానము కలపండితుడు తనమనస్సు రజస్తమోదోషసంబంధములేక నిర్మలముగ నుండుటంజేసి తనకహితములగు విషయాదులయం దాసకొనడు.

రాగ-అజ్ఞానములను అవలంబించి యహితాహారమును జేయదగదనుట.

మూ. న రాగాన్నాప్యవిజ్ఞానాత్ ఆహారముపయోజయేత్. ౫౦
పరీక్ష్య హితమశ్నీయాత్ దేహో హ్యాహారసమ్భవః,

వ్యా. (పరిజ్ఞానముకలమనుజుడును తనకు హితముకానిదని తెలిసియున్నను తనకట్టి యహితవిషయములయం దాసచేత అట్టి యహితాహారాదుల సేవింపబూనును. జ్ఞానహీనుడు హితాహితపరిజ్ఞానములేమింజేసి యహితాహారాదుల సేవించును.) పరిజ్ఞాతగ నుండువాడు కేవలము రాగముచేతగాని, అజ్ఞానుడు హితాఽహితవివేకములేకయైనను అహితములగు నాహారముల సేవింపదగదు. దేహము ఆహారములవలన బుట్టి యాహారముచేతనే వృద్ధినొందును. కావున జ్ఞానవంతుడగుమనుజుడు హితాహితముల జక్కగ పరీక్షించి, అందు అహితముల దూరంబుచ్చి హితములగునాహారాదులనే సేవింపవలెనని భావము.

ఆహారవిధివిశేషకారణము లెనిమిది.

మూ. ఆహారస్య విధావష్టౌ విశేషాః హేతుసంజ్ఞకాః. ౫౧
శుభాఽశుభసముత్పత్తౌ తాన్ పరీక్ష్యోపయోజయేత్,

వ్యా. ఆహారవిధికి సంబంధించి యెనిమిదివిశేషములు విమానస్థానమున జెప్పబడినవి. అట్టివిశేషము లెనిమిదియు ఆరోగ్యరూపమైనశుభమునకును, అనారోగ్యరూపమైన యశుభమునకును ఉత్పత్తికారణములగును. కావున అట్టివిశేషముల నెనిమిదిటిని పరిశీలించి శుభ (ఆరోగ్య)కరములగు హేతువుల ననుసరించినయాహారాదుల నుపయోగింపనగును.

శుభాశుభకారణము.—ప్రకృతి, కరణము, సంయోగము, రాశి, దేశము, కాలము, ఉపయోగసంస్థ, ఉపయోక్త అను నీయెనిమిదియు ఆహారవిధికి సంబంధించిన శుభాశుభవిశేషకారణములు. అయ్యవి యథోక్తవిధి ననుసరించి యున్నచో నారోగ్య కారణంబులును, విధివిపరీతములుగ నున్నచో ననారోగ్యకారణంబులు నగును; కావున వానిని గమనించి యాహారమును సేవింపనగునని భావము.

ఈవిషయమునే విమానస్థానమునందలి రసవిమానమున తంత్రకారు లిట్లుపదేశించిరి:—"తత్ర ఖల్విమాని అష్టావాహారవిధివిశేషాయతనానితద్యథా:—ప్రకృతి-కరణ-సంయోగ - రాశి - దేశ - కాల - ఉపయోగసంస్థ-ఉపయోక్త్రష్టమానిభవన్తి; ఏషాం విశేషాః శుభాఽశుభఫలాః పరస్పరోపకారకాః భవన్తి; తాన్ బుభుత్సేత; బుద్ధ్వాచ హితేప్సురేవ స్యాత్. నచ మోహాత్ ప్రమాదాద్వా ప్రియమహితమసుఖోదర్కం ఉపసేవ్యమానమాహారజాతం అన్యద్వా" మరియు ప్రకృత్యాదివిశేషవివరణంబును అచ్చటనే వివరింపబడును, విస్తరభీతిచే నిట విడువంబడియె.

### అపథ్యనివృత్తిచే గల్గుముఖ్యఫలము.

మూ॥ పరిహార్యాణ్యపథ్యాని సదా పరిహరన్నరః. ౫౨
భవత్యనృణతాం ప్రాప్తః సాధూనామిహ పణ్డితః,
యత్తు రోగసముత్థాన మశక్య మిహ కేనచిత్, ౫౩
పరిహర్తుం, న తత్రాప్య శోచితవ్యం మనీషిణా,

వ్యా. పైచెప్పినరీతిగ యుక్తాయుక్తవిశేషముల గమనించి త్యజించవలసినయపథ్య విషయముల త్యజించి పథ్యములనే సేవించి నటించినచో (పండితులయుపదేశమును మీరక నటించుటవలన) పండితులఋణమును దీర్చినవాడగును.

మరియు నట్లు నటించినను ఏదైన యొకరోగము పూర్వజన్మసంచితకర్మప్రాబల్యమునంజేసి నివర్తింప నలవికాకున్నను అట్టిరోగమునుగూర్చి పండితుడు చింతింపందగదు.

(పైగ్రంథముచేత పథ్యసేవనము ఆరోగ్యకారణమనియు, అపథ్యాచరణము అనారోగ్యహేతువనియు ఫలితార్థ మేర్పడినది. అట్టియెడ లోకమున పథ్యసేవనమే జేయుచున్నను ఒక్కొకవ్యాధి ప్రబలమై యారోగ్యమును చెడగొట్టి యంతట నివర్తింపక బాధించుచున్నచో నద్దానికి ప్రబలమైనకర్మయె కారణమగును. కాన దానివిషయమై చింతింపదగదు. పథ్యసేవనముచేత పెద్దలయాజ్ఞ నాచరించినట్లగును. కావున వారిఋణము దీర్చినవాడగునని భావము.)

## అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. ఆహారసంభవం వస్తు, రోగాశ్చాహారసమ్భవాః. ౫౪
హితాఽహితవిశేషాశ్చ విశేషస్సుఖదుఃఖయోః,
సహత్త్వే చాసహత్త్వే చ దుఃఖానాం దేహసత్త్వయోః. ౫౫
విశేషో రోగసఙ్ఘాశ్చ ధాతుజా యే పృథక్పృథక్,
తేషాం చైవ ప్రశమనం కోష్ఠాచ్ఛాఖాముపేత్య చ. ౫౬
దోషాః యథా ప్రకుప్యన్తి శాఖాభ్యః కోష్ఠమేవ చ,
ప్రాజ్ఞాఽజ్ఞయోర్విశేషశ్చ స్వస్థాతురహితం చ యత్,
వివిధాశితపీతీయే తత్సర్వం సంప్రకాశితమ్. ౫౭

వ్యా. ఆహారమువలనబుట్టిన శరీరరూపమైనవస్తువు,ఆహారమువలన సంభవించురోగములు, హితాఽహితవిశేషంబులును, సుఖదుఃఖవిశేషంబులును, శారీరమానసికవ్యాధుల నోర్వదగిన శరీరభేదములు, వాని నోర్వజాలనిశరీరాదిభేదములు, శారీరమానసికవ్యాధివిశేషముల భేదములు, రసాదిధాతువుల నాశ్రయించి సంభవించువ్యాధివిశేషములు, వాని ప్రశమనోపాయములు, దోషములు కోష్ఠమును వదలి రసాదిధాతువుల జేరి ప్రకోపము నంది రోగముల కల్గించువిధము, అట్టిదోషములను రసాదిధాతువులనుండి మరలించి కోష్ఠమున జేర్చునుపాయంబును, ప్రాజ్ఞ - అప్రాజ్ఞవిశేషములు, స్వస్థ - ఆతురకును హితంబును ఇవియన్నియు వివిధాశితపీతీయమను నీయధ్యాయమున వివరింపబడినవి.

మూ. ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, సూత్రస్థానే
వివిధాశితపీతీయో నామ అష్టావింశోఽధ్యాయః.

ఇతి అన్నపానచతుష్కః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకమహర్షిచే సంస్కరింపబడినదియు నగుచరకసంహితయందు సూత్రస్థానమున నిరువదియెనిమిదవయధ్యాయము సమాప్తము.

అన్నపానచతుష్కము సమాప్తము.

## ఇరువదితొమ్మిదియవ యధ్యాయము.

అవతారిక:—పైజెప్పబడిన యిరువదియెనిమిదియధ్యాయములచేత సప్తచతుష్కములుగ విభజించి యన్నపానచతుష్కమువరకును ఆయావిషయములు తంత్రకారులచే వివరింపబడినవి. పిమ్మట పైచతుష్కములకన్న నతిరిక్తములగువిషయములు క్రింది యధ్యాయముల రెండిటియందును చెప్పబడును. అందును పైయధ్యాయమున "ప్రాణాయతనసముత్థః" అని చెప్పియుండుటవలన ప్రాణాయతనముల వివరించుటకై దశప్రాణాయతనీయ మనునధ్యాయము తొలుత జెప్పబడును. మరియు దశప్రాణాయతనీయమున సూత్రస్థానమునందలి విషయములు మాత్రము సంగ్రహించి చెప్పబడును. అర్థేదశమహామూలీయము (ముప్పదియవయధ్యాయము)న నీతంత్రమునందలి యన్నింటిస్థానముల యందును గలవిషయములన్నియు సంగ్రహింపబడును. అందు సూత్రస్థానాంతిమభాగ మగుటంజేసి యందలివిషయములసంగ్రహమును తొలుత దెలుపుట సమంజసమని యెంచి దశప్రాణాయతనీయము తొలుత జెప్పబడును.

మూ. అథాతో దశప్రాణాయతనీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. వివిధాశితపీతీయమను నధ్యాయమును జెప్పినపిదప ప్రాణములకు ప్రధాన స్థానముల పదిటిని వివరించునట్టి దశప్రాణాయతనీయమను నధ్యాయమును త్రికాలజ్ఞానవేత్తయగు నాత్రేయుం డుపదేశించినదానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరించెదనని యర్థము.

ఇచ్చట క్రిందజెప్పబడుకణతలు మున్నగుస్థానముల పదిటిలో నొకదానికైన నభిఘాతము కల్గిననాడు ప్రాణములకు హాని సంభవించును. కావున అట్టి పదిస్థానంబులును ప్రాణములకు ముఖ్యాధారంబు లగుటంజేసి ప్రాణాయతనములని చెప్పబడినది.

### పదిప్రాణాయతనములవివరణము.

మూ. దశైవాయతనాన్యాహుః ప్రాణా యేషు ప్రతిష్ఠితాః,
శఙ్ఖౌ మర్మత్రయం కణ్ఠో రక్తం శుక్రౌజసీ గుదమ్. 3
తానీన్ద్రియాణి విజ్ఞానం చేతనా హేతుమామయమ్,
జానీతే యస్స విద్వాన్ వై ప్రాణాభిసర ఉచ్యతే. ఇతి ౪

వ్యా. ఏస్థలములయందు ప్రాణములు ముఖ్యముగ నాశ్రయించి యుండునో అయ్యవి కణతలు, శిరస్సు, హృదయము, వస్తియు ననుమూడుమర్మంబులును, కంఠం

బును, రక్తంబును, శుక్రంబును, ఓజస్సును గుదంబును నైయుండును. (కణతలు పదియవయవంబులును ప్రాణములకు ముఖ్యస్థానములని భావము.)

ఏవైద్యవరుడు అట్టిప్రాణాధారస్థానముల పదిటిని, చక్షురాదీంద్రియ బుద్ధిని, (రోగపరిస్థితి నెరుంగుటకు సాధనములైన నిదానపూర్వరూపఉపశయసం పరిజ్ఞానమును), చేతనాధాతువునకు సమవాయికారణమైన యాత్మను, రోగః మును వీనినన్నింటిని నిస్సంశయముగ నెరింగియుండునో అట్టివిద్వద్వైద్యుడు "ప్ర సరః" అనుపదముచేత చెప్పదగినవాడుగ నుండును.

### ద్వివిధవైద్యులు.

మూ. ద్వివిధాస్తు ఖలు భిషజో భవన్త్యగ్నివేశ! "ప్రాణానామే సరాః హన్తారో రోగాణాం; రోగాణామేకేఽభిసరాః హ ప్రాణానాం ఇతి.

వ్యా. లోకమున వైద్యవరులు ప్రాణాభిసరులు, రోగాభిసరులు నని రెండు వారుగా నుందురు. అందు "తానీన్ద్రియాణి" అను పైవాక్యముచే జెప్పబడిన ప్రక ఆధ్యాత్మికములైన యింద్రియాదులను, బాహిరములైన హేతులింగౌషధములను ప్ర యతనములను జక్కగ నెరింగియుండువారు జ్వరాదిరోగముల శమింపజేసి యొక్క ప్రాణముల కాపాడువారగుదురు. కావున ప్రాణాభిసరులని చెప్పదగియుం పైజెప్పిన ఆధ్యాత్మికాదిపరిజ్ఞానము నెరుంగక రోగనిర్ణయాదిపరిజ్ఞానములేక రో లకు దగుచికిత్సజేయ నెరుంగక నానాట రోగమును పెంచి రోగుల హింసించుట రోగాభిసరులని చెప్పదగియుందురు.

### అగ్నివేశుల ప్రశ్నము.

మూ. ఏవం వాదినం భగవన్తమాత్రేయం అగ్నివేశ ఉవాచ:—
"భగవన్! తే కథమస్మాభిర్వేదితవ్యాః భవేయుః" ఇతి.

వ్యా. పైజెప్పినరీతిగ జెప్పుచున్న త్రికాలవేత్తయగు నాత్రేయునితో నగ్నివే ఇట్లు ప్రశ్న జేసిరి. ఓభగవత్స్వరూపుడా! పైజెప్పినరీతిగ మీరు సెలవిచ్చిన రెండు లకు జేరినవైద్యులును మనుబోంట్లచే నెట్లు తెలియదగియుందురు? సెలవిండని య వేశులు ఆత్రేయుని అడిగిరి.

## ప్రాణాభిసరసామాన్యలక్షణము.

మూ. భగవానువాచః—య ఇమే కులీనాః, పర్యవదాతశ్రుతాః, పరిదృష్టకర్మాణః దక్షాః శుచయో, జితహస్తాః, జితాత్మానః, సర్వోపకరణవన్తః, సర్వేన్ద్రియోపపన్నాః, ప్రకృతిజ్ఞాః, ప్రతిపత్తిజ్ఞాః, తే ప్రాణానామభిసరాః హన్తారో రోగాణాం. ౭

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశు లడుగ త్రికాలజ్ఞానసంపన్నుడగు నాత్రేయుం డిట్లు చెప్పందొడంగెను. ఏవైద్యవరులు సత్కులమున జనించినవారును,చక్కగ నభ్యసింపబడిన శాస్త్రపరిజ్ఞానముకలవారును, చికిత్సావిధానమునం దనుభవసిద్ధజ్ఞానము కలవారును, చికిత్సావిధానమున సమర్థులును, పరిశుద్ధమైన నడవడికకలవారును, చికిత్సావిధానమున చేవాసికలవారును, ఇంద్రియముల తనవశమున నుంచుకొనినవారును, శస్త్రాదిచికిత్సావిధానమునకు కావలసినపరికరములన్నియు సిద్ధముగ నుంచుకొనినవారును, చక్షురాదీంద్రియముల కెట్టిలోపమును లేక సరియైనపద్ధతి నుండువారును, శరీరప్రకృతులకును ఆయా వ్యాధిస్వభావాదులకును అనుగుణముగ చికిత్సావిధానమును సమయోచితముగ నిర్ణయించు పరిజ్ఞానమునుకలవారును నైయుందురో అట్టివైద్యవరులు రోగముల శమింపజేసి యాతురులకాపాడ సమర్థులైయుందురు; కావున వారు ప్రాణాభిసరపదముచే జెప్పదగిన వారగుదురు.

## ప్రాణాభిసరవిశేషలక్షణము (సూత్రస్థానవిషయసంగ్రహము.)

మూ. తథావిధా హి కేవలే శరీరజ్ఞానే, శరీరాభినిర్వృత్తిజ్ఞానే ప్రకృతివికారజ్ఞానే చ నిస్సంశయాః; సుఖసాధ్య-కృచ్ఛ్రసాధ్య-యాప్య-ప్రత్యాఖ్యేయానాం చ రోగాణాం సముత్థానపూర్వరూపలిఙ్గవేదనోపశయవిశేషజ్ఞానే వ్యపగతసన్దేహాః.

త్రివిధస్యాయుర్వేదసూత్రస్య ససఙ్గ్రహవ్యాకరణస్య సత్రివిధౌషధగ్రామస్య ప్రవక్తారః; పఞ్చత్రింశతశ్చ మూలఫలానాం చతుర్ణాం చ స్నేహానాం, పఞ్చానాం చ లవణానాం అష్టానాం చ మూత్రాణాం, అష్టానాం చ క్షీరాణాం క్షీరత్వగ్వృక్షాణాం చ షణ్ణాం, శిరోవిరేచనాదేశ్చ పఞ్చకర్మాశ్రయస్య ఔషధస్య అష్టావింశతేశ్చ యవాగూనాం, ద్వాత్రింశచ్చూర్ణప్రదేహానాం,

షణ్ణాం విరేచనశతానాం, పఞ్చానాం చ కషాయశతా
స్వస్థవృత్తావపి చ భోజనపాననియమస్థానచఙ్క్రమణ శయన
మాత్రాద్రవ్యాఞ్జనధూపనా వనాభ్యఞ్జనపరిమార్జన వేగవిధా
ఒవిధారణవ్యాయామసాత్మ్యేన్ద్రియ పరీక్షోపక్రమసద్వృత్త
లాః; చతుష్పాదోపగృహీతే చ భేషజే షోడశకలే సవినిశ్చ
సత్రిపర్యేషణే సవాతకలాకలజ్ఞానే వ్యపగతసన్దేహాః; 
ర్విధస్య చ స్నేహస్య చతుర్వింశత్యుపనయస్య ఉపకల్పనీయ
చతుష్షష్టిపర్యంతస్య వ్యవస్థాపయితారః; బహువిధానయుక్తా
చ స్నేహ్యస్వేద్యవమ్య విరేచ్యౌషధోపచారాణాం చ కుశల
శిరోరోగాదేశ్చ దోషాంశవికల్పజస్య వ్యాధిసంగ్రహస్య సక్ష
పిడకావిద్రధేః, త్రయాణాం చ శోఫానాం, బహువిధశో
సంబంధానాం అష్టావింశతశ్చ రోగాధికరణానాం, చత్వా
దుత్తరస్య చ నానాత్మజస్య వ్యాధిశతస్య, తథావిగర్హితా
స్థూలాతికృశానాం చ సహేతులక్షణోపక్రమాణాం, స్వప్న
చ హితాహితస్య అస్వప్నస్య చ సహేతూపక్రమస్య, షణ్ణ
చ లంఘనాదీనామపక్రమాణాం, సంతర్పణాపతర్పణజానాం
రోగాణాం స్వరూపప్రశమానానాం చ శోణితజానాం
వ్యాధీనాం మదమూర్ఛాయసన్యాసానాం చ సకారరూపౌప
నాం కుశలాః;

కుశలాశ్చాహారవిధివినిశ్చయస్య ప్రకృత్యా చ హితాహితా
ఆహారవికారాణాం, అగ్ర్యసంగ్రహస్య, ఆసవానాం చ చ
శీతేః, ద్రవ్యగుణవినిశ్చయస్య రసానురససంశ్రయస్య, సవి
వైరోధికస్య ద్వాదశవర్గాశ్రయస్య చ అన్నపానస్య స
ప్రభావస్య, సానుపానగుణస్య, నవవిధస్యార్థసఙ్గ్రహస్య, ఆహ
గతేశ్చ హితాహితోపయోగవిశేషాత్మకస్య చ, శుభాశుభ
షస్య ధాత్వాశ్రయాణాం చ రోగాణాం ఔషధసఙ్గ్రహా

చ దశానాం చ ప్రాణాయతనానాం, యంచ వక్ష్యామోఽర్థే దశ
మహామూలీయే త్రింశత్తమాధ్యాయే, తత్ర చ కృత్స్నస్య
తంత్రోద్దేశలక్షణస్య తన్త్రస్య చ గ్రహణధారణవిజ్ఞాన ప్రయో
గకర్మకార్యకాలకర్తృకరణకుశలాః;

కుశలాశ్చ స్మృతిమతిశాస్త్రసంయుక్తియుక్తిజ్ఞానస్యాత్మనః, శీల
గుణైరపి సంవాదనేన చ సంపాదనేన సర్వప్రాణిషు చేతసో
మైత్రస్య మాతృపితృభ్రాతృబంధువదేవముక్తా భవంత్యగ్నివేశ!
ప్రాణానామభిసరా హంతారో రోగాణామితి. ౮

వ్యా. మరియుం నట్టిప్రాణాభిసరులు కేవలము శరీరవిభాగజ్ఞానమునందును, శరీరో త్పత్తి క్రమజ్ఞానమునందును, శారీరస్థానములో సప్తమాధ్యాయమున జెప్పబడు శరీర విభాగజ్ఞానమునందును, కొంచెమైన సంశయములేక నిశ్చయాత్మకజ్ఞానము కలవారై యుందురు. సుఖసాధ్యరోగములయొక్కయుం, కృచ్ఛ్రసాధ్యరోగములయొక్కయుం, యాప్యరోగములయొక్కయుం, అసాధ్యములగుటచే చికిత్సజేయక విడువదగిన రోగ ములయొక్కయుం, నిదానపూర్వరూపలక్షణములను, ఉపశయవిశేషములను నిస్సంశయ ముగ దెలిసినవారై యుండవలెను.

మరియుం హేతు-లింగ-ఔషధరూపస్కంధత్రయాత్మకమై సంగ్రహావిస్తర రూపమైన యాయుర్వేదసూత్రమును మూడువిధములైన (వాత-పిత్త-కఫముల హరించు నట్టి) యౌషధసముదాయమును వివరించి చెప్పుటకు సమర్థులై యుండవలెను.

మరియుం ముప్పదియైదువేరులు, ఫలములు, నాల్గువిధములైన చమురులు ఐదువిధ ములైన లవణములు, ఎనిమిదివిధములైన మూత్రములు, ఎనిమిదివిధములైన క్షీరములు, ఆరువిధములైన క్షీరవృక్షములు, ఆరువిధములైన త్వగ్వృక్షములు, శిరోవిరేచనము మొదలగుపంచకర్మముల కుపయోగించునౌషధములతో గావింపబడు ఇరువదియెనిమిది యవాగుభేదములు, శరీరముపై రుద్దుటకును పూయుటకును పట్టువేయుటకును నుపయో గింపదగిన ముప్పదిరెండుచూర్ణములు ప్రదేహములు,ఆరువందలవిరేచనౌషధములు, ఐదు వందలకషాయౌషధములు, ఆరోగ్యపరిస్థితియందు అన్నపానములకు సంబంధించిననియమ ములు, నిల్కడ, సంచారము,శయనము, నివాసము, పరిమాణము,ద్రవ్యములు అంజనము, ధూమపానము, నస్యవిధి, అభ్యంజనము, అంతఃపరిమార్జనము, బహిఃపరిమార్జనము, నిరోధింపవలసినవేగములు, నిరోధింపకూడని వాతాదివేగములు, శరీరపరిశ్రమము

ఇంద్రియములసాత్మ్యాఽసాత్మ్యముల పరీక్షించి చికిత్స జేయుంట, సద్వృత్తాచరణవ అనుసీవిషయముల చక్కగ నెరింగి సమర్థులుగ నుండవలెను.

మరియు, ఖుడ్డాక-మహాచతుష్పాదాధ్యాయములయందు ప్రతిపాదింపబడి షోడశకలాయుక్తమగు భేషజమునందు విశేషనిశ్చయజ్ఞానముకలవారును; తిస్త్రైషణీయ ధ్యాయమునజెప్పిన యేషణాత్రయమునందును, వాతకలాకలీయమునజెప్పిన త్రిదోషవి యములయందును నిస్సంశయజ్ఞానము కల్గియుండవలెను.

మరియు, నాల్గువిధములైన స్నేహములకు సంబంధించిన యిరువదినాల్గుప్రయో భేదములయందును, మధురాదిషడ్రసయుక్తముగను, రహితముగను కల్పింపబ ఇరువదినాల్గువిధములైన విచారణాభేదములయందును నిశ్చయజ్ఞానము కలవారుగ స్నేహ్య-స్వేద్య-వమ్య-విరేచ్యలక్షణములను, అట్టివమనాద్యౌషధములను, అట్టియౌష ప్రయోగములయందు సమయోచితోపచారముల నియమించు విషయమును చక్క నెరింగి సమర్థులుగను ఉండవలెను.

మరియు, కియన్తశ్శిరసీయాధ్యాయమున జెప్పినశిరోరోగాది భేదముల త్రిదోషములసంసర్గములయందు ద్వ్యల్బణ-ఏకోల్బణాద్యంశాభేదములచే గల్గురో సంగ్రహమును;క్షయము, విద్రధి మున్నగురోగభేదములను; త్రిశోథీయాధ్యాయమ జెప్పినమూడువిధములైన శోథములను, పలుదెరంగులైన శోథానుబంధములను, నలు యొనిమిదిరోగాధికరణములను, నానావిధకారణములచే జనించు నూటనలువదివిధమ రోగభేదములను, అష్టౌనిందితీయాధ్యాయమున జెప్పిన నిందితములైన అతిస్థూల- కృశకారణములను, వానిలక్షణములను, వానిచికిత్సితములను, హితాఽహితరూపమై నిద్రాస్వరూపమును, నిద్రాభావకారణములను, నిద్రాభావమున దగినచికిత్సను; లంఘ బృంహిణీయాధ్యాయమున జెప్పిన లంఘనాదిషడ్విధచికిత్సాభేదములను, సంతర్పణ- తర్పణములచే గల్గురోగములస్వరూపమును, వానిశమనోపాయములను, రక్తముచెడుట గల్గురోగములయొక్కయు మదమూర్ఛాసంన్యాసములయొక్కయు హేతు-లక్ష చికిత్సలను చక్కగ దెలిసి వానియాచరణములయందు సమర్థులుగ నుండవలెను.

మరియు, ఆహారవిధినిశ్చయమందును, స్వభావముచే హితంబులును అహితంబుల నగు నాహారభేదములలో శ్రేష్ఠములగువాని సంగ్రహమునందును, (అగ్ర్యాధికార జెప్పబడినవాని నిశ్చయజ్ఞానమునందును,) ఎనుబదినాల్గుభేదములుకల యాసవపరిజ్ఞాన నందును, ఆసవోత్పత్తి కారణద్రవ్యవినిశ్చయమునందును; ఆత్రేయభాద్రకాప్యీయ వివరింపబడిన రసానురసముల నాశ్రయించిన భేదములయందును, వానియుపయోగ నందును, వానిపరస్పరవిరోధపరిజ్ఞానమునందును, పండ్రెండువర్గములుగ విభజింప

యన్నపానములయొక్క గుణప్రభావములయందును; అనుపానములయొక్కయు, వానిగుణములయొక్కయు, సంక్షేపముగ జెప్పబడిన తొమ్మిదివిధములైనయాహారముల యొక్కయ పరిజ్ఞానమునందును, ఆహారపరిణామవిషయమునందును; హితాహారసేవనమున కల్గుమేలును, అహితాహారమున గల్గుకీడును, రసాదిధాతువుల నాశ్రయించినరోగములను, వానియౌషధసంగ్రహమును (వీనినన్నిటి) నెఱింగి జక్కగ నుపయోగించుటయందును; దశప్రాణాయతనీయమను నీయధ్యాయమున జెప్పినప్రాణాధారను లైనపదిస్థానముల పరిజ్ఞానమునందును, మిక్కిలి సమర్థులుగ నుండవలెను.

మరియు, అర్థేదశమహామూలీయమను పైయధ్యాయమున (30. అ.) జెప్పబడు తంత్రోద్దేశలక్షణములయందును పరిజ్ఞానముకల్గి; ఆయుర్వేదతంత్రము నభ్యసించి ధారణ మున (జ్ఞప్తిలో) నుంచుకొని, విశేషజ్ఞానముకల్గి, వానిప్రయోగమునందును, శాస్త్రప్రమాణ మునుబట్టి చికిత్సజేయుటయందును, ధాతుసామ్యరూపమైన యారోగ్యము నొనగూర్చుట యందును, చికిత్సజేయవలసినకాలమునందును, వైద్యుడు వైద్యము మొదలగువాని లక్షణములయందును, సంపూర్ణపాండిత్యము కలవాడైయుండవలెను.

మరియు, స్మృతి, మతి, శాస్త్రసంయోజనము, యుక్తిజ్ఞానము అనునీవిషయ ములయం దసాధారణప్రజ్ఞకల్గి, తనయొక్క సదాచారసంపత్తి మొదలగుసౌశీల్యాదిగుణ ములుకల్గి, సకలప్రాణులయందును అకృత్రిమమైత్రికల్గి, అందరియందును తల్లిదండ్రులను సోదరులను బంధువులనుబోలె పరమసౌహార్దముకలవాడైయుండవలెను.

ఇత్తెరంగున పైజెప్పబడినలక్షణముల నన్నిటిని పూర్తిగగలవైద్యవరులు రోగి యొక్కరోగముల నున్మూలనముజేసి ప్రాణముల సంరక్షించుటకు సమర్థులై యుందురు; కావున అట్టివైద్యవరులు 'ప్రాణాభిసరు'లని యన్వర్థముగ జెప్పదగియుందురు.

ఇచ్చట "ద్వివిధాస్తు ఖలు భిషజో భవన్తి......హన్తారః ప్రాణానాం" అను సూత్రముచే క్లుప్తముగ జెప్పబడిన 'ప్రాణాభిసర, రోగాభిసర,' అనుద్వివిధవైద్యలక్షణము లను విపులముగ నెరుంగదలచి యగ్నివేశుడు ప్రశ్నింప, "య ఇమే కులీనాః పర్యవ దాతశ్రుతాః......ప్రాణాభిసరా హన్తారో రోగాణాం" అనుసూత్రముచేత ప్రాణాభి సరలక్షణము పూర్తిగ నాత్రేయునిచే నుపదేశింపబడెను.

ఇందు "త్రివిధస్యాయుర్వేదసూత్రస్య" అనువాక్యము మొదలుజేసి, "తన్త్రో ద్దేశలక్షణస్య తన్త్రస్య చ" అనువాక్యమువరకుం గలగ్రంథముచేత సూత్రస్థానమునందలి విషయసంగ్రహము తంత్రకారులచే యుక్తియుక్తముగ ప్రాణాభిసరలక్షణవ్యాజమున సూచింపబడినదని యెరుంగునది.

## రోగాభిసరసామాన్యలక్షణములు.

మూ. అతో విపర్యయేణ విపరీతాః రోగాణామభిసరాః, హన్తారః ప్రాణానాం; భిషక్ఛద్మప్రతిచ్ఛన్నాః కణ్టకభూతా లోకస్య, ప్రతి రూపకత్యక్తధర్మాణో రాజ్ఞాం ప్రమాదాచ్చరన్తి రాష్ట్రాణి. ౯

వ్యా. పైజెప్పినలక్షణములకు విరుద్ధములైనలక్షణములు కల్గి రోగములశాంతికి బదులుగ రోగముల వృద్ధినందింపుచు ప్రాణముల సమయింపుచుండుటంజేసి 'రోగాభిసరు' లని (రోగములకాపాడువారని) యన్వర్థముగ జెప్పంబడుదురు. అట్టి కపటవైద్యులు వైద్యునివలె కపటవేషమును బూని లోకమును వంచింపుచు ప్రాణకంటకులై లోకమునకు ద్రోహముచేయుచు కేవలము స్వార్థపరులై ధర్మమును బొత్తుగ వదలియుందురు. అట్టి కపటసన్యాసివేషము బూనినవైద్యబ్రువులను పరిపాలకులైన ప్రభువులు దండింపక యుపేక్షచేయుటంజేసి రాష్ట్రములందెల్ల సంచరించుచుందురు.

## రోగాభిసర (కువైద్య) విశేషలక్షణములు.

మూ. తేషామిదం విశేషవిజ్ఞానం:—

అత్యర్థం వైద్యవేషేణశ్లాఘమానాః విశిఖాన్తరమనుచరన్తి కర్మ లోభాత్; శ్రుత్వా చ కస్యచిత్ ఆతుర్యమభితః పరిసర్పన్తి, సంశ్రవణే చాస్యాత్మనో వైద్యగుణానుచ్చైర్వదన్తి, యశ్చాస్య వైద్యః ప్రతికర్మ కరోతి, తస్య చ దోషాన్ ముహుర్ముహు రుదాహరన్తి, ఆతురమిత్రాణి చ ప్రహర్షణోపజాపోపసేవా దిభిః ఇచ్ఛన్తి ఆత్మీకర్తుం, స్వల్పేచ్ఛుతామాత్మనః ఖ్యాపయన్తి, కర్మ చాసాద్య ముహుర్ముహురవలోకయన్తి దాక్ష్యేణాఽజ్ఞాన మాత్మనః ప్రచ్ఛాదయితుకామాః, వ్యాధిం చాపవర్తయితుమ శక్నువన్తో వ్యాధితమేవానుపకరణ మపచారికమనాత్మవన్తముద్ది శన్తి, అన్తగతం చైనమభివీక్ష్య అన్యమాశ్రయన్తి దేశమపదే శమాత్మనః కృత్వా, ప్రాకృతజనసన్నిపాతే చ ఆత్మనః కౌశల మకుశలవద్వర్ణయన్తి, అధీరవచ్చ ధైర్యమపవదన్తి ధీరాణామ్, విద్వజ్జనసన్నిపాతం చాభివీక్ష్య ప్రతిభయమివ కాన్తారమధ్వగాః పరిహరన్తి దూరాత్, యశ్చైషాం కశ్చిత్ సూత్రావయవో

భవత్యుపయుక్తః తమప్రకృతే ప్రకృత్యాన్తరే వా సతతముదా
హరన్తి, న చానుయోగమిచ్ఛన్త్యనుయోక్తుం వా, మృత్యోరివ
చాఽనుయోగాదుద్విజన్తే, న చైషామాచార్యశ్శిష్యో వా
సబ్రహ్మచారీ వైవాదికో వా కశ్చిత్ ప్రజ్ఞాయతే. ఇతి. ౧౦

వ్యా. మరియును పైజెప్పిన కుత్సితవైద్యులలక్షణములను ఈక్రింద జెప్పబడు విధము గుర్తింపనగును:—అట్టి వైద్యబ్రువులు తమకు వైద్యము తెలియకున్నను గొప్ప వైద్యునిబోలె వేసమువూని తమ్ము తామే శ్లాఘించుకొనుచుందురు. వైద్యముచేయఁగోరి కత్తో వీథులయందు భ్రమ్మరుదురు. ఎవనికైనను రోగమువచ్చినదని విన్నచో వాని యింటికి బిలువకున్నను పలుమారు పోవుచుందురు. తమచికిత్సానైపుణ్యమును ఆరోగికి వినబడునట్లు భట్రాజువలె బిగ్గరగా తామే పలుమారు చెప్పుచుందురు. అట్టిరోగికి ఇతరుడగువైద్యు డెవడైనను తత్కాలమున చికిత్సచేయుచున్నచో అట్టివైద్యునియందు లేని పోనిదోషము లారోపించి పలుమా రుగ్గడించి పలుకుచుందురు. రోగియొక్క మిత్రులను సంతోషపరచుచు రోగివిషయమై వారితో ఆలోచింపుచు శుశ్రూషాదివ్యాపారములచే వారిననుసరించి తమవశముచేసికొన ప్రయత్నింతురు. తమకు ద్రవ్యమునం దాసలేనట్లు అభినయింతురు. చికిత్స జేయుసమయమున పలుమారు నలుదెసల చూచుచుందురు. తాము వ్యాధిని నివర్తింపజేయ సామర్థ్యములేకున్నను తమయజ్ఞానమును యుక్తిచే మరగింప దలంచి రోగికి తగినసేవకాద్యుపకరణములు చక్కగ లేవనియు, రోగి పథ్యపానాది విషయములయందు తానుచెప్పినరీతిగ నడుచుకొనుటలేదనియు, బుద్ధిస్వాధీనములేనివా డనియు చెప్పుచుందురు. రోగికి నానాట రోగ ముత్కటమై యంతిమదశ సంభవించు సరికి తా నేదైన యొకకారణమును బన్ని తనచోటికి బోవలయునని చెప్పి తాను బోవుస్థళ మును వాస్తవముగ చెప్పక వేరొండుచోటికి వెళ్లును. తెలివితేటలులేని సామాన్యజనులు గుమిగూడియున్నచోట తన చికిత్సానైపుణ్యమును సామర్థ్యములేనివానివలె నభినయిం చుచు తనకుతానే పొగడి వర్ణించుచుండును. విద్వాంసులను వారికేమి తెలియదని నిందిం చుచు తనపాండిత్యమును పొగడికొనును. గొప్పపండితులు సభచేరి యున్నపుడు వారిని చూచి భయంకరమైన గాఢారణ్యమును చూచి త్రోవనడచువారు భీతిచెంది దూరముగ తొలగిపోవురీతిగ యాపండితసభకు దూరదూరముగనే పారిపోవును. అట్టివైద్యులలో నొకడు దేనినైన నొకలేశమాత్రము వైద్యసూత్ర మెరింగియున్నచో అట్టిసూత్రమును ఉపయోగములేని సమయములయందును పలుమారు అందరిఎదుట చదువుచుండును. అట్టి వైద్యునిచికిత్సచే నెచ్చటనైన ఘుణాక్షరన్యాయముగ రోగము శాంతినొందియున్నచో

అట్టికౌశలమును పలుమా రుదహరించుచుండును. వీని నెవరైన నొకరు ప్రశ్న చేసినచో సహింపరు. ఒకరితో వాదింపబూనరు. ఎవరైన నొకరు పండితుడు వాదింపబూనినచో వానినిజూచి మృత్యుదేవతను చూచినవిధముగ భయపడుదురు. ఈవైద్యులకు ఒకగురువైనను శిష్యుడైనను సహపాఠియైనను వీరితో వాదించినవాడైనను మచ్చునకైన దొరకరు. ఇవియే కపటవైద్యులవిశేషలక్షణములు. (ఇట్టిలక్షణము కపటవైద్యులకు సహజమై యుండును.)

కుత్సితవైద్యనిరసనము.

మూ. తత్ర శ్లోకాః —

భిషక్ఛద్మ ప్రవిశ్యైవ వ్యాధితాం స్తర్పయ న్తి యే,
వీతంసమివ సంశ్రిత్య వనే శాకు న్తికో ద్విజాన్. ౧౧
శ్రుతదృష్టిక్రియాకాలమాత్రాజ్ఞానబహిష్కృతాః,
వర్జనీయా హి తే మృత్యోః చర న్త్యనుచరా భువి. ౧౨
వృత్తిహేతోర్భిషజ్మానపూర్ణాన్ మూర్ఖవిశారదాన్,
వర్జయేదాతురో విద్వాన్ సర్పా స్తే పీతమారుతాః. ౧౩

వ్యా. శాస్త్రజ్ఞానమునకును అనుభవమునకును చికిత్సాజ్ఞానమునకును చికిత్సజేయవలసిన సమయజ్ఞానమునకును ఔషధాదిమాత్రాపరిమాణజ్ఞానమునకును శాస్త్రీయజ్ఞానమునకును వీనికన్నిటికిని దూరులై (అట్టిపరిజ్ఞానములేక) కపటముగ వైద్యునివేషమును బూని కుత్సితవైద్యులు, అడవియందు పక్షులబట్టుకిరాతులు ఊరులనొడ్డి పక్షులకై వేచియుండువిధముగ, రోగుల సమయమువేచి హింసింపనుందురు; కావున వారు మృత్యుదేవత కనుచరుల బోలె లోకమున సంచరింతురు. అట్టివారల దూరముగ వర్జింపవలెను

మరియు, అట్టివైద్యులు తమకు వైద్యవిధానము బొత్తుగ తెలియకున్నను పొట్టకూటికై వైద్యులమని విఱ్ఱవీగుచు నుందురు. అట్టి మూర్ఖశ్రేష్ఠులు గాలిచే కడుపు నిండించుకొనియున్న సర్పములబోలె క్రూరులైయుందురు; కావున తెలివితేటలుగల రోగి యట్టి మూఢవైద్యులను చెంత జేరనీయక దూరంబుచ్చి వెడలగొట్టవలెను.

విద్వద్వైద్యస్తుతి.

మూ. యే తు శాస్త్రవిదో దక్షాః శుచయః కర్మకోవిదాః,
జితహస్తాః జితాత్మానః తేభ్యో నిత్యం కృతం నమః. ౧౪

వ్యా. మరియు పైజెప్పినవిధముగాక వైద్యశాస్త్రపారంగతులును, చికిత్సాకుశలులును, సదాచారసంపన్నులును, పలుదెరంగులైన చికిత్సావిధానముల పండితులై యనుభవమునం దారితేరినవారును, ఇంద్రియముల స్వవశమున నుంచుకొనినవారునైన విద్వద్వైద్యులకు నిరంతరము నమస్కరించెదను.

అధ్యాయవిషయసంగ్రహము.

మూ. భవతి చాత్ర:—

దశప్రాణాయతనికే శ్లోకస్థానార్థసంగ్రహః,
ద్వివిధా భిషజశ్చోక్తాః ప్రాణస్యాయతనాని చ ఇతి. ౧౫

వ్యా. దశప్రాణాయతనీయమను నీయధ్యాయమున సూత్రస్థానవిషయసంగ్రహంబును ప్రాణాభిసర-రోగాభిసరభేదముచే రెండుతెగలైన వైద్యభేదములును, ప్రాణమునకు ముఖ్యములగు పదిస్థానములును వివరింపబడినవి.

మూ. ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, సూత్రస్థానే
దశప్రాణాయతనీయో నామ ఊనత్రింశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు నాయుర్వేదతంత్రమున సూత్రస్థానమునందు దశప్రాణాయతనీయమను నిరువదితొమ్మిదియవయధ్యాయము సమాప్తము.

---

## త్రింశోఽధ్యాయః.

అవతారిక:—పైయధ్యాయమున సూత్రస్థానమునందలి విషయములన్నియు సంగ్రహించి చెప్పబడినవి. ఈయధ్యాయమున నీసూవత్తంత్రమునంగల విషయములు సంగ్రహించి చెప్పబడును. మరియు పూర్వాధ్యాయమున హృదయము ప్రాణాధారస్థానమని చెప్పబడినది. అట్టి ప్రధానావయవమైన హృదయమును, దానినాశ్రయించిన ధమనులను వివరించుటకై అర్థేదశమహామూలీయమను నీయధ్యాయము చెప్పబడును.

మూ. అథాతోఽర్థేదశమహామూలీయ మధ్యాయం వ్యాఖ్యాస్యామః.
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౧

వ్యా. దశప్రాణాయతనీయమను జెప్పినపిదప "అర్థేదశమహామూలాః" అని యధికరించి చెప్పబడునధ్యాయమును భగవంతుడైన యాత్రేయుండుపదేశించినదానికన్న

న్యూనాతిరేకము లేకుండునట్లు వివరించెదనని యర్థము. (అర్థమన హృదయము. అట్టి హృదయము నాధారముగ జేసికొని యుండు పదిధమనులవిషయమును ప్రధానముగ జేసి వివరించునధ్యాయము చెప్పబడునని భావము.)

హృదయమాశ్రితములైనపదినాడులు.

మూ. అర్థే దశ మహామూలాః సమాసక్తాః మహాఫలాః,
మహచ్చార్థశ్చ హృదయం పర్యాయైరుచ్యతే బుధైః. 3

వ్యా. "మహత్, అర్థః," అనుపర్యాయపదములరెంటిచేత హృదయము చెప్పబడును. (ఆయుర్వేదవేత్త లీరెండుపదములను హృదయమునకు పర్యాయపదములుగ వాడెదరని భావము.) అట్టి ప్రధానస్థానమైన హృదయమున పదినాడులు చేరియుండును. అయ్యవి మహచ్ఛబ్దవాచ్యమగుహృదయమున జనించి దానినే యాధారముగ జేసికొని యుండుటంజేసి మహామూలములని చెప్పబడును. మరియు మిక్కిలి యనంతప్రయోజనము కలవియై యుండును.

హృదయమునాశ్రయించినపదార్థము.

మూ. షడఙ్గమఙ్గం విజ్ఞానం ఇన్ద్రియాణ్యర్థపఞ్చకమ్,
ఆత్మా చ సగుణశ్చేతః చిన్త్యం చ హృది సంశ్రితమ్. ౪

వ్యా. రెండుబాహులు, రెండుకాళ్లు, శిరస్సు, అంతరాధి యనునారు అంగముల సముదాయరూపమైన శరీరంబును, విజ్ఞానము, చక్షురాదీంద్రియములు, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను తన్మాత్రలు, సుఖాదిగుణములతోఁగూడిన యాత్మ, మనస్సు, మనస్సువిషయమైన సంకల్పరూపచింత్యము అనునివియన్నియు పైవివరింపబడిన హృదయము నాశ్రయించి యుండును.

పైజెప్పినషడంగములకు హృదయ మాశ్రయమనుట.

మూ. ప్రతిష్ఠార్థం హి భావానాం ఏషాం హృదయమిష్యతే,
గోపానసీనా మాగారకర్ణికేవార్థచిన్తకైః ౫
తస్యోపఘాతాన్మూర్ఛాయం భేదాన్మరణమృచ్ఛతి,

వ్యా. పైజెప్పిన షడంగాదిపదార్థములకు హృదయము: ఇంటికప్పునకు (వాసాలు వడుములు మున్నగువానికి) నిట్రాడు గుంజనుబోలె, ప్రధానమైన యాధారమైయుండునని హృదయముయొక్కపరిస్థితిని తెలిసినపండితులు చెప్పెదరు. అట్టి యాధారమైన హృదయమున కెంతమాత్రము అభిఘాతము కల్గినను మూర్ఛగ్రమ్మును. మరియు నది

శిథిలమై బొత్తుగ చెడిననాడు (ఆధారమైనయింటి నిట్రాడు చెడినప్పుడు ఇల్లంతయుం నిర్మూలమగునట్లు)అయ్యది ప్రాణమునకు ముఖ్యాధారమగుటంజేసి మరణము సంభవించును.

హృదయాశ్రితవిశేషములు.

మూ. యద్ధి తత్ స్పర్శవిజ్ఞానం ధారి తత్ తత్ర సంశ్రితమ్. ౬
తత్పరస్యౌజసస్థానం తత్ర చైతన్యసఙ్గ్రహః,
హృదయం మహదర్థశ్చ తస్మాదుక్తం చికిత్సకైః. ౭

వ్యా. ఎయ్యది యింద్రియములకు సంబంధించిన శబ్దస్పర్శరూపరసగంధములను స్పర్శములను మనస్సుకు సంబంధించిన చింత్యరూపమైన స్పర్శమును అరయుటకు ముఖ్యసాధనమైయుండునో, అయ్యది శరీరేంద్రియసత్వాత్మసంయోగరూపమైన జీవిత మనబడును. అట్టిజీవితమున సకలభావములును ఆశ్రయించియుండుటంజేసి ధారియనియుం చెప్పబడును. అట్టి జీవాత్మకును ఆధారమై అష్టబింద్వాత్మకమైన పరమోజస్సుకు స్థానమైయుండుటంజేసియుం, చైత్యవిషయముల కన్నిటికిని ముఖ్యాశ్రయమై యుండుటంజేసియుం హృదయము మహత్తనియుం, అర్థమనియు శాస్త్రవేత్తలచే చెప్పబడును.

ఓజస్సు పరమనియుం, అపరమనియుం, రెండువిధములు. అందు అష్టబింద్వాత్మకమై ప్రాణాధారమై కొంచెము పసుపురంగుకలరక్తము పర (శ్రేష్ఠమైన) ఓజస్సనియుం, అంజలి పరిమితమై శ్లేష్మరూపమైనయోజస్సు అపరమనియుం చెప్పబడును. ఈవిషయమును "హృది తిష్ఠతి యచ్ఛుద్ధం రక్తమీషత్సపీతకమ్, ప్రాణాశ్రయస్యౌజసోఽష్టౌ బిన్దవో హృదయాశ్రితాః." "తావదేవ పరిమాణం శ్లేష్మణ శ్చౌజసః" అనువాక్యములచే జెప్పబడినది. అట్టి అష్టబింద్వాత్మకమై ప్రాణములకు ముఖ్యాధారమైన పరమోజస్సుకు హృదయము స్థానమనియుం, దానంజేసియే "మహత్, అర్థ" అనుపదములచే హృదయము చెప్పబడు ననియుం ముఖ్యభావము.

ధమనులు, ఓజోగుణములును.

మూ. తేన మూలేన హతా మహామూలా మతా దశ,
ఓజోవహాశ్శరీరేఽస్మిన్ విధమ్యన్తే సమన్తతః. ౮
యేనౌజసా వర్తయన్తి ప్రీణితాస్సర్వజన్తవః,
యదృతే సర్వభూతానాం జీవితం నావతిష్ఠతే. ౯

యత్సారమాదౌ గర్భస్య యత్తద్గర్భరసాద్రసః,
సంవర్తమానం హృదయం సమావిశతి యత్పురా. ౧౦
యస్య నాశాత్తు నాశోఽస్తి ధారి యద్ధృదయాశ్రితం,
యచ్ఛరీరరసస్నేహః ప్రాణా యత్ర ప్రతిష్ఠితాః. ౧౧
తత్ఫలా బహుధా వాతాః ఫలన్తీవ మహాఫలాః,
ధ్మానాద్ధమన్యః స్రవణాత్ స్రోతాంసి సరణాత్సిరాః. ౧౨

వ్యా. అట్టి మహచ్ఛబ్దవాచ్యమైన హృదయమును మూలాధారముగ జేసికొని పై జెప్పిన పరమోజస్సునువహించుచు మనుజులశరీరమునందెల్ల అట్టియోజస్సును వ్యాపింప జేయునాడులు పది కలవు. అయ్యవి మహత్పదవాచ్యమైన హృదయమును ముఖ్యాధారముగ జేసికొని వ్యాపించుటంజేసి మహామూలములని యన్వర్థముగ జెప్పబడును.

మరియు, ఎట్టి యోజస్సుచేత సకలజంతువులును తృప్తినొంది సజీవులై యుందురో ఏయోజస్సు లేనినాడు సకలప్రాణులకును జీవితముకుండబోదో; ఏయోజస్సు గర్భోత్పత్తికి తొల్లింటికారణమై యుండునో; ఏయోజస్సు అట్టిగర్భరసము (శుక్రశోణితరూపమై గర్భోత్పత్తికికారణమైనరసము) వలన పుట్టునట్టిరసమో; ఏయోజస్సు వృద్ధినొందుచుండు గర్భరూపమైన పిండముయొక్క హృదయమును మొట్టమొదట ప్రవేశించునో; ఏయోజస్సు నశించిననాడు జీవాధారవ్యాపారములన్నియు నశించునో; ఏయోజస్సు హృదయము నాధారముగ జేసికొనియుండు ధారి (శరీర-ఇంద్రియ-సత్త్వ-ఆత్మసంయోగరూపమైన జీవితమును ధరింపజేయునది) యగునో; ఏయోజస్సు శరీరమునందలి సకలధాతుసారమై యుండునో; ఏయోజస్సు ఆధారముగ జేసికొని ప్రాణములు నిలిచియుండునో; అట్టి యమూల్యమైన కృత్యములజేయునట్టి యోజస్సును వహించుటంజేసియు, అనేకఫలముల కాధారమైనవృక్షమును బోలియుండుటంజేసియు, పైజెప్పినహృదయాశ్రితములై యోజస్సును వ్యాపింపజేయునాడులు (గొట్టములు) పదియును మహాఫలములని చెప్పబడును.

మరియు నియ్యవి రసాదిధాతువులచే నిండియుండుటంజేసి ధమనులనియు, అట్టిధాతువులను పోషించి స్రవింపజేయుటవలన స్రోతస్సులనియు, వానినే శరీరమునందెల్ల (నొకచోటినుండి వేరొకచోటికి) ప్రసరింపజేయుటచే సిరలనియు నన్వర్థముగ జెప్పబడును.

ఇచ్చట పైజెప్పిన పదిధమనులును ప్రధానములుగ జెప్పబడినవి; కావున ఇతరములగునాడులనేకములును శరీరమున వ్యాపించియుండునని యెరుంగునది. వానివివర

ణము శారీరస్థానమున జెప్పబడును. మరియు "తత్ఫలాః బహుధావాతాః" "బహుధా, వా, తాః" అని పదవిభాగము నెరుంగునది.

హృదయ-ధమనీ-ఓజస్సుల కాపాడునుపాయములు.

మూ. తన్మహాత్, తా మహామూలాః, తచ్చౌజః పరిరక్షతా,
పరిహార్యా విశేషేణ మనసో దుఃఖహేతవః. ౧౩
హృద్యం యత్స్యాద్యదోజస్యం స్రోతసాం యత్ప్రసాదనమ్,
తత్తత్సేవ్యం ప్రయత్నేన ప్రశమో జ్ఞానమేవ చ. ౧౪

వ్యా. అట్టి మహచ్ఛబ్దవాచ్యమగుహృదయమును, మహామూలము లనబడుపది ధమనులను, "యేనౌజసా వర్తయన్తి" అని యుపక్రమించి చెప్పబడినగుణములుకల యోజస్సును (ఈమూడిటిని) కాపాడుకొన నిచ్చగొనినమనుజులు మనస్సుకు దుఃఖమును కల్గించుకారణములను బొత్తుగ మానవలెను. హృదయమునకు హితంబును ప్రియంబు నగుదానిని, ఓజస్సును వృద్ధినందించుచు మేలుకల్గించువానిని, స్రోతస్సులను నిర్మలముగ జేయువానిని మిక్కిలి ప్రయత్నముతో సేవింపనగును. మనశ్శాంతిని, తత్వజ్ఞానమును అవలంబింపనగును.

ప్రాణవర్ధనాదులలో నుత్కృష్టతమపరిగణనము.

మూ అథ ఖల్వేకం ప్రాణవర్ధనానాం ఉత్కృష్టతమం, ఏకం బలవర్ధనానాం, ఏకం బృంహణానాం, ఏకం నన్దనానాం, ఏకం హర్షణానాం, ఏకమయనానాం ఇతి. తత్ర అహింసా ప్రాణినాం ప్రాణవర్ధనానాముత్కృష్టతమం, వీర్యం బలవర్ధనానాం, విద్యా బృంహణానాం, ఇన్ద్రియజయో నన్దనానాం, తత్వావబోధో హర్షణానాం, బ్రహ్మచర్యమయనానాం, ఇత్యాయుర్వేదవిదో మన్యన్తే. ౧౫

వ్యా. ప్రాణములో వృద్ధినొందించువానిలో ప్రాణులహింసింపకుండుట నొక్కటియే యుత్కృష్టతమముగ చెప్పబడును. ఇత్తెరంగుననే బలమును వృద్ధినొందించువానిలో నుత్సాహంబును, శరీరమును పెంపొందించువానిలో యోగశాస్త్రపాండిత్యమొక్కటియు, సంపత్తును కల్గించువానిలో ఇంద్రియముల జయించుటయు, ఆనందమును కల్గించువానిలో బ్రహ్మతత్వజ్ఞానంబును, సన్మార్గములలో బ్రహ్మచర్యంబును ఒకొక్కటియే మిక్కిలి శ్రేష్ఠతమంబులై యుండునని యాయుర్వేదవేత్తలు చెప్పెదరు.

ఇచ్చట ప్రాణవర్ధకములలో నన్నము ప్రధానముగా జెప్పబడినను 'అహి పరమోధర్మః' ధర్మములలో ప్రధానమైన యహింసచే నాయుర్వృద్ధియగునని ం సయే ప్రధానముగ జెప్పబడినది. బృంహణములలో మాంసము ప్రధానమని చెప్ప విద్యయనునది శరీరమును మనస్సును రెంటిని పెంపొందించును కాన శ్రేష్ఠతః చెప్పబడినది. మాంసము శరీరమును మాత్రము బలపరచునని విశేషము నెరుంగునది.

మూ. తత్రాయుర్వేదవిదస్తన్త్రస్థానాధ్యాయప్రశ్నానాం పృథ వాక్యశో వాక్యార్థశోఽర్థావయవశశ్చ ప్రవక్తారో మన్త తత్రాహ—కథం తన్త్రాదీని వాక్యశః వాక్యార్థశః అర్థావ శశ్చేతి ఉక్తాని భవన్తీతి.

వ్యా. ఆయుర్వేదవేత్తలు ఆయుర్వేదతంత్రముయొక్కయు స్థా యొక్కయు అధ్యాయములయొక్కయు, వానిలో ప్రశ్నములయొక్కయు విభ లను వేరువేరుగను, వాక్యములుగను, వాక్యార్థముగను, ఆయాప్రకరణవివరణార్థ గను చెప్ప సమర్థులని ఎన్నదగును. పైజెప్పినతంత్రము మొదలగునవి వాక్యము వాక్యార్థములుగను, అర్థావయవములుగను ఎట్లు వివరింపబడును? అన్నచో నీ వివరింపబడురీతిగ నెరుంగునది.

మూ. అత్రోచ్యతే తన్త్రమార్షం కార్త్స్న్యేన యథామ్నాయవ మానం వాక్యశో భవత్యుక్తం.

వ్యా. మహర్షిప్రణీతమయిన తంత్రమంతయు పాఠక్రమము ననుసరించి బడిన యానుపూర్వివాక్యక్రమము ననుసరించినదని ఎరుంగునది.

మూ. బుద్ధ్యా సమ్యగనుప్రవిశ్యార్థతత్త్వం వాగ్భిర్వ్యాససమాసప్ర హేతూదాహరణోపనయనిగమనయుక్తిభిః త్రివిధ శిష్య గమ్యాభిరుచ్యమానం వాక్యార్థశో భవత్యుక్తం

వ్యా. బుద్ధితో చక్కగ యోచించి విస్తరంబును,సంక్షిప్తంబును ప్రతిజ్ఞా- ఉదాహరణ-ఉపనయ-నిగమన-యుక్తి-యను, పంచావయవయుక్తను, లును నైన ములచేతను ఉత్తమాధమమధ్యములగుశిష్యులకు గోచరమగునట్లు అర్థతత్త్వము యించి చెప్పుట వాక్యార్థము ననుసరించి చెప్పబడినది యని ఎరుంగునది.

మూ. తన్త్రనియతానామర్థదుర్గాణాం పునర్విభావనైరుక్తం అర్థా వశో భవత్యుక్తం.

వ్యా. ఈతంత్రమునం దుపయోగింపబడి మిక్కిలి గూఢార్థములై సాంకేతికము లైన యర్థములను పలుమారు వ్యాఖ్యానముచేసి వివరించుట అర్థావయవరూపముగ జెప్పబడినదని యెరుంగునది.

మూ. తత్ర చేత్ప్రష్టారస్స్యుః చతుర్ణామృక్సామయజురథర్వవేదానాం కం వేద ముపదిశన్త్యాయుర్వేదవిదః? కిమాయుః? కస్మాదాయుర్వేదః? కిఞ్చాయుర్వేదః శాశ్వతః అశాశ్వతశ్చ? కతి కాని చాస్యాంగాని? కైశ్చాయ మధ్యేతవ్యః? కిమర్థం చేతి ౨౦

వ్యా. ఋక్కు-సామ-యజుస్సు-అథర్వము అను నాల్గువేదములలో నాయుర్వేదమును ఏవేదముతో చేర్పనగును? ఆయు వనగా నేమి? ఆయుర్వేద మను పేరు ఎట్లు కల్గెను? ఈయాయుర్వేదము ఉత్పత్తినాశములులేక శాశ్వతమైనదియా? లేక నశ్వరమైనదియా? ఈయాయుర్వేదమునకు అంగములెన్ని? అట్టియంగము లెవ్వి? ఎట్టివారాయాయుర్వేదమును చదువవలయును? దీనిని చదివిన నేమి ప్రయోజనము? అని ఇవ్విధముగ కొందరు ప్రశ్నలచేసెదరు. అట్టి ప్రశ్నలకు ఈక్రిందివిధముగ బదులు సెప్పనగును.

## ఆయుర్వేదనిరుక్తి, అథర్వణవేదాన్తర్గతత్వనిర్ణయము.

మూ. తత్ర భిషజా పృష్టేనైవం చతుర్ణామృక్సామయజురథర్వవేదానామాత్మనోఽథర్వవేదే భక్తిరాదేశ్యా, వేదో హ్యాథర్వణః స్వస్త్యయన-బలిమఙ్గళహోమనియమప్రాయశ్చిత్తోపవాసమన్త్రాదిపరిగ్రహాచ్చికిత్సాం ప్రాహ. చికిత్సా చాయుషో హితాయోపదిశ్యతే. వేదం చోపదిశ్యాయుర్వాచ్యం, తత్రాయుశ్చేతనానువృత్తిర్జీవితమనుబన్ధో ధారి చేత్యేకోఽర్థః, తత్రాయుర్వేదయతీత్యాయుర్వేదః. కథం? ఇతి చేదుచ్యతే—స్వలక్షణతః సుఖాఽసుఖతో హితాఽహితతః ప్రమాణాఽప్రమాణతశ్చాయుష్యాణ్యనాయుష్యాణి చ ద్రవ్యగుణకర్మాణి వేదయతీత్యతోఽప్యాయుర్వేదః. ౨౧

తత్రాయుష్యాణ్యనాయుష్యాణి చ ద్రవ్యగుణకర్మాణి కేవలేనోపదేక్ష్యన్తే తన్త్రేణ. ౨౨

వ్యా. పైజెప్పినరీతిగ నాయుర్వేదవేత్తను ప్రశ్నజేసినపుడు ఋక్సామయజుస్సుఅథర్వము అను వేదములునాల్గిటిలో తనకు అథర్వవేదమున భక్తికలదని చెప్పవలెను. అథర్వణవేదము స్వస్త్యయనమును, పూజావిధానమును, మంగళకరమైనహోమమును, నియమములను, చాంద్రాయణాదిప్రాయశ్చిత్తములను, ఉపవాసవ్రతములను, మంత్రతంత్రాదులను ఉపదేశించుచు, తన్మూలకములగు చికిత్సల నుపదేశించుచున్నది. చికిత్స యనునది యాయుంవునకు మిక్కిలి హితకరమై యభిలషణీయమైనది. (కావున అట్టి స్వస్త్యయనాది యాపచికిత్సలచే వ్యాధినివృత్తి స్వస్థపరిపాలనసాధకబోధకమగుటంజేసి యథర్వణవేదాంతర్భూత మాయుర్వేదమని వైద్యుడు నిర్ణయించి చెప్పనగునని భావము.) ఇత్తెరంగున వేదమును నిర్ణయించి యాయుంవు నిట్లు నిరూపింపనగును. ఆయుంవు, చేతనానువృత్తి, జీవితము, అనుబంధము, ధారి యనుపదములు ఒకే అర్థము కలది. (ఆయుంవు అనుదానికి శక్కినపదములు పర్యాయవాచకములై యాయుంవును బోధించునని భావము).

అట్టి యాయుంవును దెల్పునట్టిగ్రంథము ఆయుంర్వేద మనబడును. ఈయర్థము 'ఆయుంర్వేదయతి' అనువ్యుత్పత్తిచే లభించును. స్వలక్షణముచేతను, సుఖాసుఖములను, హితాహితములను, ప్రమాణాప్రమాణములనుబట్టి ఆయుంర్వృద్ధికరంబులును, ఆయుంర్హానికరంబులు నగుద్రవ్యగుణకర్మముల బోధించుటంజేసి యాయుంర్వేద మనబడునని భావము. అట్టి యాయుంర్వృద్ధికరంబులును, ఆయుంర్హానికరంబులును నగుద్రవ్యగుణకర్మములు ఈతంత్రముచే నుపదేశింపబడును.

### సుఖ-అసుఖ, హిత-అహిత, ఆయుంస్స్వరూపము.

మూ. తత్రాయురుక్తం స్వలక్షణతో యథావదిహైవ; తత్ర శారీరమానసాభ్యాం రోగాభ్యాం అనభిద్రుతస్య, విశేషేణ యౌవనవతః, సమర్థానుగతబలవీర్యపౌరుషపరాక్రమస్య, జ్ఞానవిజ్ఞానేన్ద్రియార్థబలసముదాయే వర్తమానస్య పరమర్ధిరుచిరవివిధోపభోగస్య, సమృద్ధసర్వారమ్భస్య, యథేష్టవిచారిణః, సుఖమాయురుచ్యతే; అసుఖమతో విపర్యయేణ. ౨౩

హితైషిణః పునర్భూతానాం పరస్వాదుపరతస్య, సత్యవాదినః, శమపరస్య, పరీక్ష్యకారిణః, అప్రమత్తస్య, త్రివర్గం పరస్పరేణాఽనుపహతముపసేవమానస్య, పూజార్హసంపూజకస్య, జ్ఞాన

విజ్ఞానోపశమశీలస్య, వృద్ధోపసేవినః సునియతరాగరోషేర్ష్యా మదమానవేగస్య, సతతం వివిధప్రదానపరస్య, తపోజ్ఞానప్రశమ నిత్యస్య, అధ్యాత్మవిదః, తత్పరస్య, లోకమిమం చాముం చావే క్షమాణస్య స్మృతిమతో హితమాయురుచ్యతే; అహితమతో విపర్యయేణ. ౨౪

వ్యా. పైనడిగిన ప్రశ్నములలో 'కిమాయుః' అను ప్రశ్నమునకు, "తత్రాయుశ్చేతనానువృత్తిః జీవితమనుబన్ధోధారి చ" అనువాక్యముచే నాయుస్స్వరూపలక్షణము ఈ ప్రకరణమున చెప్పబడినది. "సుఖాఽసుఖతః హితాహితతః ప్రమాణాప్రమాణతః" అనువాక్యముచే నాయువు నుద్దేశించి సూచించిన సుఖాసుఖస్వరూపంబును, హితాఽహితస్వరూపంబును, ప్రమాణాఽప్రమాణస్వరూపంబును "తత్ర శారీరమానసాభ్యాం అనభిద్రుతస్య...అసుఖమతోవిపర్యయేణ; హితైషిణః పునః...అహితమతో విపర్యయేణ; ప్రమాణమాయుషః...ఉపదిష్టమాయుషః ప్రమాణమాయుర్వేదే" అనుసూత్రముల మూడిటిచే నీక్రింద వరుసగ వివరింపబడును. అందు మనశ్శరీరములకు సంబంధించినరోగములచే బీడింపబడనివాడును, ముఖ్యముగ యౌవనవంతుడును, శరీరమునకు దగినంతబలంబును వీర్యంబును పౌరుషపరాక్రమంబులును కలవాడును, బుద్ధియొక్కయు శాస్త్రపరిజ్ఞానముయొక్కయు చక్షురాదీంద్రియముల యొక్కయు శబ్దస్పర్శాదీంద్రియార్థముల యొక్కయు సముదాయబలముకలవాడును, శ్రేష్ఠమైన మహాసంపదయు కల్గి మనోహరములై రమ్యములై పలుదెరంగులైన భోగముల ననుభవించువాడును, తాదలంచినకార్యములనెల్ల సాధింప సమర్థతకలవాడును, తనకిచ్చవచ్చినవిధముగ నడుచుకొను స్వతంత్రశక్తికలవాడును, నగుమానవునకు పైజెప్పబడిన జీవితరూపమైనయాయువు సుకరమై యుండును. అటుగాక పైజెప్పబడిన సంపత్తు విరుద్ధముగ నుండువానికి అట్టిజీవితము (ఆయువు) దుఃఖమును కల్గించునది యగును.

మరియు, సకలప్రాణులకును హితమునుగోరువాడును, పరద్రవ్యమునకు పరాఙ్ముఖుడు (అపహరింపకున్నవాడు)ను, సత్యసంధుడును, ఓర్పుకలవాడును, కార్యములపట్ల యుక్తాయుక్తము విచారించి పనుల జక్కజేయువాడును, అన్నివిషయములయందు జాగ్రత్తకలవాడును, ధర్మ-అర్థ-కామముల నొకటికొకటి విరోధముగాకుండ ననుభవించువాడును, పూజింపదగినపెద్దల యథోచితముగ పూజించువాడును, జ్ఞానము విజ్ఞానము (శాస్త్రీయజ్ఞానము), శాంతియుకలవాడును, సదాచారసంపన్నుడును, పెద్దలసేవించు

వాడును,ఆశ-క్రోధము-ఈర్ష్య-మదము-అహంకారము అను నీయైనిటివేగమును జయిం చినవాడును, ఎల్లప్పుడును అనేకవిధములైన దానధర్మములజేయు నాస్తికలవాడును, తపస్సునందును బ్రహ్మజ్ఞానమునందును, ఇంద్రియనిగ్రహమునందును, ఎడతేనిచిత్తవృత్తి కలవాడును, అధ్యాత్మజ్ఞానసంపన్నుడై యాత్మానుసంధానమునం దాసక్తికలవాడును, ఈలోకమునకును పరలోకమునకును సంబంధించినవిషయముల గమనించువాడును, గడచిన విషయముల జక్కగ జ్ఞప్తినుంచుకొనువాడు నగుమానవునకు నాయువు హితకరమై యుండును. పైజెప్పినవిషయములకు వ్యతిరేకముగ నుండువానిజీవితము అహితకరమగును.

### ఆయువునకు ప్రమాణ-అప్రమాణనిర్ణయము.

మూ॥ ప్రమాణమాయుషస్త్వర్థేన్ద్రియమనోబుద్ధిచేష్టాదీనాం వికృతిలక్షణైరుపలభ్యతే అనిమిత్తైః; ఇదమస్మాత్ క్షణాన్ముహూర్తాత్, దివసాత్, త్రిపఞ్చ-సప్త-దశ-ద్వాదశాహాత్, పక్షాన్మాసాత్, షణ్మాసాత్, సంవత్సరాద్వా స్వభావమాపత్స్యతే, ఇతి. తత్ర స్వభావః, ప్రవృత్తేరుపరమః, మరణం, అనిత్యతా, నిరోధ ఇత్యేకోఽర్థః; ఇత్యాయుషః ప్రమాణమ్, అతో విపరీతమప్రమాణమ్. అరిష్టాధికారే దేహప్రకృతిలక్షణమధికృత్య చోపదిష్టమాయుషః ప్రమాణమాయుర్వేదే. ౨౫

వ్యా. మరియు, ఇంద్రియగోచరములగు శబ్దస్పర్శరూపరసగంధములును, చక్షురాదీంద్రియములును, మనస్సును, బుద్ధియు, అంగికాదిచేష్టలును, కారణములేకయే నాకస్మికముగ స్వాభావికస్థితిమారి వికృతిజెందియున్నచో నట్టివికృతిలక్షణములచేత నాయుః పరిమాణము తెలియనగును. అట్టియింద్రియాదివికృతినిబట్టి ఈమనుజుడు క్షణకాలమునకైన ముహూర్తము,దినము,మూడుదినములు ఐదుదినములు, ఏడుదినములు, పదిదినములు, పండ్రెండుదినములు, పదునైదుదినములు, ఒకమాసము. ఆరుమాసములు, ఒకసంవత్సరము అను నీనియతకాలములయందైనను మృతినొందునని ఆయుఃపరిమాణమును నిర్ణయింపదగియుండును. అందు స్వభావము, ప్రవృత్త్యుపరమము, మరణము, అనిత్యత, నిరోధము, అనునీపదములు మరణమనుపదమునకు పర్యాయనామములగును. ఇట్టి నిర్ణయమే ఆయుః పరిమాణమని యెరుంగునది. అట్టికాలనియతి లేనియాయువు అప్రమాణము (కాలనియమములేనిది) అని యెరుంగునది.

మరియుం నరిష్టాధికారమున దేహమును ప్రకృతిని లక్షణములనుబట్టియుం నాయుః పరిమాణము విమానస్థానముననుచెప్పబడెను.

ఇంద్రియస్థానమున రెండు నాల్గు మున్నగునధ్యాయములలో "నానాపుష్పోప మోగాధో యస్య వాతి దివానిశమ్" అను మున్నగువాక్యములచే నింద్రియార్థముల వికృతినిబట్టియుం, "యశ్చ పశ్యత్యదృశ్యాన్వై" ఇత్యాదివాక్యములచే నింద్రియ వికృతినిబట్టియుం, "యైః పురా విన్దతే భావైః సమేతైః పరమాం గతిం, తైరేవారమ మాణస్య గ్లానస్సోర్మరణమాదిశేత్" ఇత్యాదివాక్యములచేత మనోవికృతినిబట్టియుం, "బుద్ధేర్బలమహేతుకం" ఇత్యాదివాక్యములచే బుద్ధివికృతినిబట్టియుం, "వికర్షన్నివ యః పాదౌమృత్యుం సపరిధావతి" ఇది మున్నగువాక్యములచే చేష్టావికృతినిబట్టియుం, ఆయుః పరిమాణము నిర్ణయింపబడినది. మరియుం విమానస్థానమున "సర్వైస్సారైరుపేతాః" అని యుపక్రమించి "చిరంజీవినో భవన్తి" అనునంతపరకుంగలగ్రంథముచేత శరీరమును బట్టి యాయుఃపరిమాణము నిర్ణయింపబడినది. "శ్లైష్మికాః బలవన్తో వసుమన్తశ్చ భవన్తి" ఇది మున్నగువాక్యములచే శ్లైష్మికాదిప్రకృతినిబట్టియుం, "ఆయుష్మతాం కుమారాణాం లక్షణాన్యుపదేక్ష్యామః" అని యుపక్రమించి కొన్నిలక్షణములబట్టియుం నాయుఃపరి మాణము నిర్ణయింపబడినది. (ఇంద్రియేంద్రియార్థాదికృతిలక్షణములబట్టి యింద్రియస్థాన మున నిర్ణయింపబడిన యాయుఃపరిమాణంబును, దేహ-ప్రకృతి-లక్షణములబట్టి విమాన స్థానమున నిర్ణయింపబడిన యాయుఃపరిమాణంబును, ఆయువుయొక్క కాలనియతిని దెల్పునని ముఖ్యభావము.)

## ఆయుర్వేదనిత్యత్వము.

మూ. సోఽయమాయుర్వేదశ్శాశ్వతో నిర్దిశ్యతే,అనాదిత్వాత్,స్వభావ సంసిద్ధలక్షణత్వాత్, భావస్వభావనిత్యత్వాచ్చ; నహి నాభూత్ కదాచిదాయుషస్సన్తానో, బుద్ధిసన్తానోవా; శాశ్వతశ్చాయుషో వేదితా; అనాదిచ సుఖదుఃఖం, సద్రవ్యహేతులక్షణమపరాపర యోగాత్; ఏష చార్థసఙ్గ్రహో విభావ్యతే ఆయుర్వేదలక్షణ మితి. గురులఘుశీతోష్ణస్నిగ్ధరూక్షాదీనాం చ సామాన్యవిశే షాభ్యాం వృద్ధిహ్రాసౌ, యథోక్తం గురుభిరభ్యస్యమానైః గురూణాముపచయోభవత్యపచయో లఘూనాం; ఏవమేవేత

రేషామిత్యేష భావస్వభావో నిత్యః, స్వలక్షణం చ ద్రవ్యాణాం పృథివ్యాదీనాం సన్తి తు సర్వదా గుణాశ్చ నిత్యానిత్యాః, న హ్యాయుర్వేదస్య అభూత్వోత్పత్తిరుపలభ్యతే; అన్యత్రావబోధోపదేశాభ్యాం, ఏతద్వై ద్వయం అధికృత్యోత్పత్తిముపదిశన్త్యేకే, స్వాభావికం చాస్య లక్షణమకృతకం, యదుక్తమిహ చాద్యేఽధ్యాయే యథాగ్నేరౌష్ణ్యం, అపాం ద్రవత్వం, భావస్వభావనిత్యత్వమపి చాస్య, యథోక్తం గురుభిరభ్యస్యమానైః గురూణాముపచయో భవత్యపచయో లఘూనామిత్యేవమాది. ౨౬

వ్యా॥ అట్టి యీయాయుర్వేదము అనాది(ఉత్పత్తిలేనిది)యు, కారణాంతరమున కల్గక తనంతనే సిద్ధములగులక్షణములగల్గినదియు, నిత్యమగుభావస్వభావము కల్గియుండునదియు నగుటచేత ఉత్పత్తినాశములులేక (పరంబ్రహ్మమును వేదములనుబోలె) శాశ్వతమైనది. (ఉత్పత్తినాశరహితమైనది). లోకమునందు ఆయుస్సంతానము (ఆయుర్వేదప్రతిపాద్యమైన యాయువుయొక్క పరంపర) బ్రహ్మమొదలుజేసి పరాపరాగతముగ నున్నదేకాని ఒకప్పుడైన నట్టియాయువు లేకుండలేదు. (ఎల్లప్పు డున్నదనుట). అత్తెరంగుననే అట్టియాయువును గమనించుబుద్ధి పరంపరయు, బుద్ధిచే నాయుర్విశేషమునుగమనించి తెలిసికొనువేత్తయు బ్రహ్మమొదలుజేసి పరంపరానుస్యూతముగ నున్నదేకాని యొకప్పుడును లేకుండదు. (ఆయుర్వేదప్రతిపాద్యమైన యాయువును, దానిని తెలిసికొనుటకు సాధనమైనబుద్ధియు, దానిని గమనించి నిర్ణయించువేత్తయు బ్రహ్మమొదలుజేసి పరంపరగవచ్చుచున్నదికాన ఆద్యంతములు లేనివియని యర్థము) పైజెప్పినరీతిగ నాయుర్వేదప్రతిపాద్యమైనఆయువును, దానినెరుంగ సాధనమైన జ్ఞానవిశేషంబును, దానిని తెలిసికొను నాయుర్వేదవేత్తలును పరంపరానుస్యూతముగ ధారావాహిగ బ్రహ్మమొదలుజేసి శాశ్వతముగ నుండుటంజేసి అట్టివిషయములబోధించు(బోధకమైన)యాయుర్వేదంబును శాశ్వతమని భావము. వేద్య-వేదన-వేత్తలనిత్యత్వముచే వేదకమైన యాయుర్వేదంబును నిత్యమని ఫలితార్థము.

మరియు, ద్రవ్యములు, హేతువులు, వానితోగూడిన సుఖదుఃఖంబులును, (ఆరోగ్యరూపమైనసుఖము, అనారోగ్యరూపమైనదుఃఖము)పైజెప్పినవిధముగ పరంపరాగతమగుటంజేసి శాశ్వతములు. దానంజేసియు నాయుర్వేదము శాశ్వతికమగును.

("హితాఽహితం సుఖం దుఃఖం ఆయుస్తస్య హితాహితం, మానంచ తచ్చ యత్రోక్తం ఆయుర్వేదస్స ఉచ్యతే." అని మొదటియధ్యాయమున నాయుర్వేదసామాన్యము చెప్పబడినది. అట్టి యాయుర్వేదలక్షణమున చెప్పినసుఖదుఃఖంబులను అనాదులగుటం జేసియు నాయుర్వేదము నిత్యమని భావము.)

పైకనిన "హితాహితం...ఉచ్యతే" అను నాయుర్వేదలక్షణమున పై వివరింప బడిన సుఖదుఃఖాద్యర్థములే సంగ్రహింపబడినవి. (హితాఽహితసుఖదుఃఖాదిబోధక మాయుర్వేదమని స్వరూపలక్షణమున జెప్పబడినది. అట్టి ప్రతిపాద్యముల నిత్యత్వమును బట్టి యాయుర్వేదము నిత్యమని సాధింపబడినదని భావము) ఇత్తెరంగున "అనాదిత్వాత్ స్వభావసంసిద్ధలక్షణత్వాత్" అని చెప్పిన రెండుహేతువులు వివరింపబడినవి.

మూడవది "స్వభావనిత్యత్వాత్" అనుహేతువు. ఆయుర్వేదప్రతిపాద్యము లైన గుణ - ద్రవ్య - క్రియారూపములైన భావపదార్థములును నిత్యములగుటవలన నాయుర్వేదము నిత్యమని యర్థము. అందు గురు-లఘు-శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్షాదిగుణముల సామాన్యముచే వృద్ధియు, విశేషముచే హ్రాసంబును కల్గును. గురుగుణోపయోగముచేత గురుగుణంబులును, లఘుగుణోపయోగమువలన లఘుత్వంబును కల్గును. ఇత్తెరంగుననే తక్కినభావములకు వృద్ధిహ్రాసముల నెరుంగునది. ఇదియె భావము. (అట్టి వృద్ధిహ్రాసములు పైజెప్పినరీతిగగల్గుటయే భావగుణాదులకు స్వతస్సిద్ధమైన నైసర్గికస్వభావమని యర్థము).

అట్టి గుణస్వభావము నిత్యమగును. మరియు పృథివ్యాదిద్రవ్యములకు జెప్పియుండు ఖరద్రవాదిస్వరూపలక్షణంబులును నిత్యములు. అట్టి ద్రవ్యనిష్ఠంబులైన గురులఘ్వాదిగుణంబులను, అట్టిగుణముల కాశ్రయములైన పృథివ్యాదిద్రవ్యంబులకు సంబంధించిన ఖరత్వాదులను నిత్యములగుటంజేసి అట్టిగుణాదులబోధించు నాయుర్వే దంబును నిత్యమని భావము.

మరియు గుణములలో కొన్ని నిత్యములు, కొన్ని అనిత్యములు. ఆకాశము నిత్యము, పృథివ్యాదులు కార్యములగుటచే ననిత్యములు. (అట్లున్నను పృథివ్యాదినిష్ఠఖరత్వాదులు నిత్యములగును కావున అట్టి గుణముల కాశ్రయములైన పృథివ్యాదిద్రవ్యంబులును పరంపరానుస్యూతములగుటంజేసి నిత్యములని చెప్పుట సమంజసము)

ఆయుర్వేదమునకును అపూర్వోత్పత్తి యేకారణముచేతనైన నూహింప వలను పడదు. ఆయుర్వేదపరిజ్ఞానంబును, ఆయుర్వేదోపదేశంబును అప్పుడప్పుడును క్రొత్తగ నగును. అట్టి కారణమునబట్టి ఆయుర్వేదము అనిత్యమని కొందరుచెప్పెదరు. కాని అంత మాత్రముననే యనిత్యతచెప్పుట సమంజసముకాదు. పైజెప్పిన యాయుర్వేదములస్వరూప

క్షలణము స్వాభావికము (స్వతస్సిద్ధము). కావున నయ్యది యకృతకము (కారణాంతరముచే కల్గినదికాదు). ఈవిషయమునే మొదటియధ్యాయమున "హితాహితం...... ఉచ్యతే" అను నలువదియవ శ్లోకముచే తంత్రకారుడు నిర్దేశించి చెప్పెను.

మరియుం అగ్నికి ఉష్ణగుణంబును, జలమునకు ద్రవత్వంబును ఎట్లు స్వభావసిద్ధమైనదియో అత్తెరంగుననే యాయుర్వేదము ప్రతిపాద్యములైన గుణద్రవ్యాదులు స్వతస్సిద్ధములు. అట్టి భావస్వభావనిత్యత్వంబును "గురుభి రభ్యస్యమానైః......భావస్వభావో నిత్యః" అనువాక్యముచే పైని చెప్పబడినది. కావున పైజెప్పినరీతిగ అనాదిత్వము, స్వభావసంసిద్ధలక్షణత్వము భావస్వభావనిత్యము, అను నీమూడుకారణములచే నాయుర్వేదము కృతకముగాక శాశ్వతికమయినదని సిద్ధాంతము చేయబడినది.

మరియుం నీయాయుర్వేదమున కనాదిత్వమును నిర్ణయించువిషయమున ననేకములగునుపపత్తులు కానంబడియెడు. వానిని విస్తరభీతిచే నిట వివరింపక విరమించితిని. (ఇత్తెరంగున "కిమాయుర్వేదః శాశ్వతః, అశాశ్వతశ్చ" అను ప్రశ్నమున కుత్తరముగ నాయుర్వేదనిత్యత్వము నిరూపింపబడినది).

## ఆయుర్వేదాష్టాంగములు.

మూ. తస్యాయుర్వేదస్యాష్టావఙ్గాని; తద్యథా.—కాయచికిత్సా, శాలాక్యం, శల్యాపహర్తృకం, విషగరవైరోధికప్రశమనం, భూతవిద్యా, కౌమారభృత్యం, రసాయనాని, వాజీకరణమితి. ౨౭

వ్యా. పైన వివరింపబడిన యాయుర్వేదమునకు కాయచికిత్స, శాలాక్యము, శల్యాపహారణము (శల్యతంత్రము), విషచికిత్స, భూతవిద్య, కౌమారభృత్యము, రసాయనము, వాజీకరణము నని యెనిమిదియంగము లుండును. వీనివివరణము:—

1. శరీరమునకు సంబంధించినచికిత్స కాయచికిత్స, శరీరమునందలి రసాదిధాతువులును, వాతాదిదోషములును మిథ్యాహారవిహారాదులచే దుష్టములై దానంజేసి సంభవించుజ్వరము అతిసారము మున్నగురోగములు శరీరము నాధారముగజేసి సంభవించును కావున అట్టి శరీరసంబంధములగురోగముల నుద్దేశించి చెప్పబడుచికిత్స కాయచికిత్స యని భావము. లేక "కాయతి (శబ్దం కరోతి) ఇతి కాయః" అనువ్యుత్పత్తిచేత జాఠరాగ్ని కాయ మనబడును. చెవులను మూసికొనినప్పుడు "డప్, లప్" అనుశబ్దము జాఠరాగ్ని వలన వినబడుట యనుభవసిద్ధము. అట్టి కాయాగ్నివైపరీత్యమువలన కల్గురోగముల కాధారమైనశరీరము నుద్దేశించి చికిత్సను బోధించుప్రకరణము కాయచికిత్స యని చెప్ప

బడును. ఈవిషయమును భోజుం డిట్లు చెప్పెను:—"జాఠరః ప్రాణినామగ్నిః కాయ ఇత్యభిధీయతే, యో వై చికిత్సేత్తీదన్తం స వై కాయచికిత్సకః" 'కై గై శబ్దే' అను ధాతువువలన కాయశబ్దము నిష్పన్నమైనదని యెరుంగునది. కాయచికిత్సను ప్రధానముగ జేసి చెప్పునట్టితంత్ర మియ్యది కావున తొలుత కాయచికిత్స యీతంత్రమున నిర్దేశింపబడినది. అష్టాఙ్గహృదయము కూడ కాయచికిత్సాప్రధాన మగుటంజేసియే "కాయబాలగ్రహోర్ధ్వాంగశల్యదంష్ట్రా జరావృషాన్, అష్టావఙ్గాని తస్యాహుః చికిత్సాయేషు సంశ్రితా" అని కాయచికిత్సయే తొలుత నిర్దేశింపబడినది. సుశ్రుతము శల్యతంత్రప్రధానమగుటంజేసి "శల్యం శాలాక్యం" అని శల్యతంత్రము తొలుత నిర్దేశింపబడినది. ఇత్తెరంగున నే ఆయాతంత్రములయందును ప్రాధాన్యము నెరుంగునది.

2. శాలాక్యము—కంటియందు పటలముల వేధించుసాధనవిశేషము శలాక. అట్టిశలాకచే ప్రధానముగ చేయబడుచికిత్స శాలాక్యము, దీనిచేత మెడకొంకులకు పై భాగమునకల నేత్రశ్రోత్రాదులకు సంబంధించిన(యూర్ధ్వాంగచికిత్స శాలాక్యమని ఫలితార్థము.

3. శల్యతన్త్రము:—"శలతి(గచ్ఛతి) (హింసాం కరోతి) ఇతివా శలః," శరీరమున శీఘ్రముగ వ్యాపించి హింసింపజూచునది శల్యము. అయ్యది శరీరమున నాటి బాధించునట్టి యినపముక్కలుమున్నగునవి. వానిని విడదీయునట్టి చికిత్సను బోధించునది శల్యతంత్రము. దీనిచేత శస్త్రచికిత్సాసామాన్యము శల్యతంత్రమనబడును. "శల గతౌ, హింసాయాంచ" అనుధాతువువలన శల్యశబ్దము నిష్పన్నము.

4. విషచికిత్స:—పాము తేలు మున్నగునవి కరచుటచే కల్గినది విషము. శరీరమునం దిమిడియుండి కాలాంతరమున బాధించునట్టి విషము గరము. విరుద్ధవస్తుసంయోగమున ప్రాణహారమైనది వైరోధికవిషము. ఈమూడువిధములైన విషములచికిత్సను బోధించునది విషచికిత్స. ఈవిషయమునే "విష-గర-వైరోధికప్రశమనం" అని తంత్రకారులు నిర్దేశించిరి. అట్టి చికిత్సకే అగదతంత్రమని నామాంతరము కలదు.

5. భూతవిద్య:—యక్షరక్షః పిశాచాదు లావహించి బాధించువిధమును వాని చికిత్సను (శాంతికర్మ మున్నగువానిని) బోధించునది భూతవిద్య.

6. కౌమారభృత్యము—"కుమారాణాం భృతిః-కుమారభృతిః, తస్యేదం-కౌమారభృత్యం" బిడ్డలకాపాడుటకు దగినచికిత్సాదుల బోధించునది కౌమారభృత్య మనబడును. ఇయ్యది కాయచికిత్సతో జేరినదియైనను బిడ్డలబాల్యాద్యవస్థాభేదమునుబట్టి చికిత్స భిన్నముగ నుండునుకావున వేరుగ జెప్పబడినది.

7. రసాయనము:—"రసానాం (రసకార్యధాతూనాం,రసవీర్యవిపాకానాం వా) ఆయనం (లాభోపాయః)రసాయనం" రసశబ్దముచేత రసకార్యములైన రక్తాదిధాతువుల నియు గ్రహింపబడును అట్టి రసరక్తాదిధాతువులను, (లేక రసవీర్యవిపాకములను) వృద్ధి నొందించి బలపరచునట్టి చికిత్సావిశేషము రసాయన మనబడును.

8. వాజీకరణము:—"అవాజినం వాజినం కుర్వన్తి అనేనేతి-వాజీకరణం" గుఱ్ఱము కాని మనుజుడు గుఱ్ఱమునుబోలె వీర్యపుష్టికల్గి సంభోగశక్తి నధికముగ కల్గియుండు నట్లుచేయు చికిత్సావిధానము వాజీకరణమని భావము. ఈవిషయమునే "యేన నారీషు సామర్థ్యం వాజివల్లభతే నరః, వ్యజ్యతే చాధికం యేన వాజీకరణముచ్యతే" అని చెప్పియున్నది. (ఇత్తెరంగున నాయుర్వేదము కాయచికిత్స మున్నగు నెనిమిదియంగములు గల్గియుండునని భావము.)

## ఆయుర్వేదాధ్యయనమున కర్హులు.

మూ॥ స చాఽధ్యేతవ్యో బ్రాహ్మణరాజన్యవైశ్యైః. తత్రానుగ్రహార్థం ప్రాణినాం బ్రాహ్మణైః, ఆత్మరక్షార్థం రాజన్యైః, వృత్త్యర్థం వైశ్యైః, సామాన్యతో వా ధర్మార్థకామపరిగ్రహార్థం సర్వైః ॥౨౮॥

వ్యా. అట్టి యష్టాంగవిశిష్టమైన యాయుర్వేదము బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అనుమూడువర్ణములవారిచే నధ్యయనము చేయదగును. అందు సకలప్రాణుల కును హితము నాచరించుటకై బ్రాహ్మణులును, ప్రజాపరిపాలకుడు క్షత్రియుండు ఆత్మ సంరక్షణార్థమునకును, వైశ్యుడు జీవనోపాయమునకును ఆయుర్వేదమును పఠించవలెను. లేక ధర్మము అర్థము కామము ననుమూడువిధములైన పురుషార్థములకై పైజెప్పిన మూడువర్ణములవారును సామాన్యముగ నాయుర్వేదమును పఠింపదగును.

## ఆయుర్వేదాధ్యయనముచే గల్గు త్రివర్గరూపఫలము.

మూ. తత్ర చ యదధ్యాత్మవిదాం, ధర్మపథస్థాపకానాం, ధర్మప్రకాశకానాం వా, మాతృ-పితృ-భ్రాతృ-బన్ధు-గురుజనస్య వా, వికారప్రశమనే ప్రయత్నవాన్ భవతి; యచ్చాయుర్వేదోక్తమధ్యాత్మమనుధ్యాయతి; వేదయత్యనువిధీయతే వా, సోఽప్యస్య పరో ధర్మః. ॥౨౯॥

యా పునరీశ్వరాణాం, వసుమతాం వా సకాశాత్ సుఖోపహార నిమిత్తా భవత్యర్థావాప్తిః, ఆరక్షణం చ; యా చ స్వపరిగృహీ తానాం ప్రాణినామాతుర్యాదారక్షా, సోఽస్యార్థః. 30

యత్పునరస్య విద్వద్గ్రహణయశః శరణ్యత్వం చ, యా చ సమ్మానశుశ్రూషా, యచ్చేష్టానాం విషయాణామారోగ్యమా ధత్తే, సోఽస్య కామః; ఇతి యథాప్రశ్నముక్తమశేషేణ 30

వ్యా. అధ్యాత్మజ్ఞానసంపన్నులకును, ధర్మమార్గమును నెలకొలుపువారికిని, సనా ుఁలగు వర్ణాశ్రమధర్మముల వ్యాపింపజేసి వెల్లడించువారికిని, తలిదండ్రులు సోద ం బంధువులు గురువులు మొదలగుపూజ్యులకును సంభవించినరోగముల శమింపజేయు ుం; ఈయాయుర్వేదమున నుపదేశింపబడిన యధ్యాత్మజ్ఞానమును స్మరించి యితరు బోధించి, అట్టిధర్మమును నియమములను తనశరీరమున కనుకూలముగ నాచరించు ుం నీయాయుర్వేదాధ్యయనమునగల్గు త్రివర్గములోఁజేరిన మొదటిధర్మము.

మరియు—ప్రభువులకును ద్రవ్యవంతులకును ఆయుర్వేదోక్తచికిత్సజేసి, తాను ముల ననుభవించుటకై వారివలన ధనమును సంపాదించుటయు,అట్టి ద్రవ్యమూలమున ీరమునకు ఆరోగ్యమును కాపాడికొనియుండుటయు, తనను ఆశ్రయించియుండు ారమునకు గల్గినరోగముల మాన్పి అట్టి ద్రవ్యమూలమున వారిని కాపాడుటయు ర్గములలో రెండవపురుషార్థమైన యర్థము

మరియు—ఆయుర్వేదాధ్యయనమువలన పండితు లాదరించుటచే గల్గు కీర్తినొం ుయు, తనకు సన్మానరూపములగు గౌరవపురస్సరవాక్యముల వినఁగోరుటయు, తనకిష్టు వారి కారోగ్యమును తనమనఃపూర్వకముగ నొసఁగూర్చుటయు నీయాయుర్వేదాధ్య నమున గల్గుమూడవపురుషార్థమైన కామము. ఇత్తెరంగున నాయుర్వేదాధ్యయనమున త్రివర్గరూపమైనఫలము.

ఈవిధమున పైజెప్పబడిన యిరువదియొకటవసూత్రమున "చతుర్ణాంపుకాసు... ర్థం చేతి" అనువాక్యముచే జెప్పబడిన యేడుప్రశ్నములకు వరుసగ నుత్తరములు ర్తిగ చెప్పబడియె.

తంత్రముమున్నగువాని నుద్దేశించిన యెనిమిదిప్రశ్నములు.

౩. అథ భిషగాదిత ఏవ భిషజా ప్రష్టవ్యః అష్టవిధం భవతి; తద్య థా—తన్త్రం, తన్త్రార్థం, స్థానాని, స్థానార్థాన్, అధ్యాయాన్,

అధ్యాయార్థాన్ ప్రశ్నాన్, ప్రశ్నార్థాంశ్చేతి పృష్టేన చైత
ద్వక్తవ్య మశేషేణ వాక్యశో వాక్యార్థశోఽర్థావయవశశ్చేతి.

వ్యా. ఒకవైద్యుడు మరియొకవైద్యుని జూచినప్పుడును వానిం బరీక్షించుటకై మొట్టమొదట నెనిమిదిప్రశ్నముల జేయవలెను. అవి యెవ్వియన—తంత్రమన నేమి? తంత్రార్థమన నెద్ది? స్థానము లెవ్వి? స్థానార్థము లేవి? అధ్యాయము లేవి? అధ్యాయార్థము లేవి? ప్రశ్నము లేవి? ప్రశ్నార్థము లెవ్వి? అను నీయెనిమిదిప్రశ్నముల జేసినయెడ అట్టి ప్రశ్నములకు వాక్యరూపముగను, వాక్యార్థరూపముగను, అర్థావయవరూపముగను ఈక్రింద వివరింపబడువిధముగ వైద్యుడు బదులు సెప్పనగును.

## తంత్రస్వరూపము.

మూ. తత్ర ఆయుర్వేదః, శాఖా, విద్యా, సూత్రం, జ్ఞానం, శాస్త్రం, లక్షణం, తన్త్రం, ఇత్యనర్థాన్తరమ్, తన్త్రార్థః పునః స్వలక్షణైరుపదిష్టః, స చార్థః ప్రకరణైర్విభావ్యమానో భూయ ఏవ శరీర వృత్తిహేతు వ్యాధికర్మకాలకర్తృకరణవిధివినిశ్చయాద్దశ ప్రకరణః, తాని చ ప్రకరణాని కేవలేనోపదేక్ష్యంతే తంత్రేణః. 33

వ్యా. పైనిర్దేశింపబడినవానిలో తంత్రమనునది ఆయుర్వేదము, శాఖ, విద్య, సూత్రము, జ్ఞానము, శాస్త్రము, లక్షణము, తంత్రము అను సమానార్థకపర్యాయపదములచే చెప్పబడును. (ఇది మొదటిప్రశ్నమున కుత్తరము.) తంత్రార్థమనునది యీయధ్యాయముననే "తత్రాయుర్వేదయతీత్యాయుర్వేదః" అనునట్టి యిరువదిరెండవసూత్రమున నుపక్రమించి హితాహితరూపములతో వివరింపబడిన స్వరూపలక్షణమని యెఱుంగునది.

మరియు నట్టి తంత్రార్థము పదిప్రకరణములరూపముగ నుండును. ఎట్టులన:— శరీరము, వృత్తి (యాహారము) వ్యాధిహేతువు, ధాతువైషమ్యరూపవ్యాధి, కర్మ (చికిత్స), ఆరోగ్యరూపకార్యము, వసంతాదిరూపకాలము, కర్త (వైద్యుడు), కరణము (సాధనరూపమైనయౌషధము), విధి (కల్పనాభేదము) అను నీపదివిషయముల నిర్ణయించు పదిప్రకరణములు. అట్టి ప్రకరణములపదిటిచే నిండియుండునది యాయుర్వేదము. అట్టి ప్రకరణములు పదియును ఈయాయుర్వేదమున విపులముగ నుపదేశింపబడును. (ఇది తంత్రార్థ మెద్ది? యను రెండవప్రశ్నమున కుత్తరము).

## స్థానవివరణము.

మూ. తత్రాష్టౌ స్థానాని, తద్యథాః—శ్లోక-నిదాన-విమాన-శారీర-ఇన్ద్రియ-చికిత్సిత-కల్ప-సిద్ధిస్థానాని. 34

వ్యా. మరియుం నీతంత్రము శ్లోక (సూత్ర) స్థానము, నిదానస్థానము, విమానస్థానము, శారీరస్థానము, ఇంద్రియస్థానము, చికిత్సితస్థానము, కల్పస్థానము, సిద్ధిస్థానము నని యెనిమిదిస్థానములు (విభాగములు) కల్గియుండును. (ఇది స్థానము లెవ్వి? యను మూఁడవప్రశ్నమున కుత్తరము).

## స్థానములకు వేరువేరుగ నధ్యాయసంఖ్యానియమము.

మూ. తత్ర త్రింశదధ్యాయకం శ్లోకస్థానం; అష్టాధ్యాయకాని నిదాన-విమాన-శారీరస్థానాని; ద్వాదశకమిన్ద్రియాణాం; త్రింశకం చికిత్సితానాం; ద్వాదశకే కల్పసిద్ధిస్థానే; ఇతి. 35

వ్యా. అట్టిస్థానములలో శ్లోకస్థానము ముప్పదియధ్యాయములు కల్గియుండును. నిదాన-విమాన-శారీరస్థానములు మూఁడును ఒక్కొకటి యెనిమిదేసియధ్యాయములు కల్గియుండును. ఇంద్రియస్థానము పండ్రెండు అధ్యాయములు కల్గియుండును. చికిత్సాస్థానము ముప్పదియధ్యాయములు కల్గియుండును. కల్పసిద్ధిస్థానములు పండ్రెండేసియధ్యాయముల కల్గియుండును. (ఇదియును మూఁడవప్రశ్నమునకే వివరణముగను త్తరము.)

## ఉక్తార్థానువాదము.

మూ. ద్వే త్రింశకే ద్వాదశకత్రయం చ,
త్రీణ్యష్టకాన్యేషు సమాప్తి రుక్తా,
శ్లోకౌషధారిష్టవికల్పసిద్ధి
నిదానమానాశ్రయసంజ్ఞకేషు. 36
స్వే స్వే స్థానే యథాస్వం చ స్థానార్థ ఉపదేక్ష్యతే,
సవింశమధ్యాయశతం శృణు నామక్రమాగతమ్. 37

వ్యా. సూత్రచికిత్సాస్థానములు రెండును ముప్పదేసియధ్యాయములు కల్గియుండును. ఇంద్రియ-కల్ప-సిద్ధిస్థానములు మూఁడును పండ్రెండేసియధ్యాయములు కల్గియుండును. నిదాన-విమాన-శారీరస్థానములు మూఁడును ఎనిమిదేసియధ్యాయముల గల్గియుండును. ఇవియన్నియుం కలిసి నూటయిరువదియధ్యాయములతో నీతంత్రము పూర్తియగును. ('మానాశ్రయ' అనుచోట ఆశ్రయశబ్దముచే శారీరము గ్రహింపబడినది.)

ఇదియే స్థానవిభాగము. స్థానార్థము ఆయాస్థానములయందు సందర్భానుసారముగ నుపదేశింపబడును. మరియు పైజెప్పిన నూటయిరువదియధ్యాయములు క్రమముగ వానివానినామభేదములచే నీక్రింద వివరింపబడును.

సూత్రస్థానమున ముప్పదియధ్యాయములు, వాని నామభేదములు.

మూ. దీర్ఘంజీవోఽప్యపామార్గతణ్డులారగ్వధాదికా,
1 షడ్విరేకాశ్రయశ్చేతి చతుష్కో భేషజాశ్రయః. ౩౮
మాత్రా తస్యాశితీయా చ నవేగాన్ధారణం తథా,
2 ఇన్ద్రియోపక్రమశ్చేతి చత్వారస్స్వస్థవృత్తికాః. ౩౯
ఖుడ్డాకశ్చ చతుష్పాదో మహాం స్తిస్రైషణ స్తథా,
3 సహ వాతకలాఖ్యేన విద్యాన్నైర్దేశికాన్ బుధః. ౪౦
స్నేహనస్వేదనాధ్యాయావుభౌ యశ్చోపకల్పనః,
4 చికిత్సాప్రాభృతశ్చైవ సర్వ ఏవోపకల్పనాః. ౪౧
కియ_న్తశ్శిరసీయశ్చ త్రిశోథాష్టోదరాదికా,
5 రోగాధ్యాయో మహాంశ్చైవ రోగాధ్యాయచతుష్టయం. ౪౨
అష్టౌ నిన్దితసఙ్ఖ్యాతః తథా లఙ్ఘనతర్పణౌ,
6 విధిశోణితకశ్చైవ వ్యాఖ్యాతా స్తత్ర యోజనాః. ౪౩
యజ్జఃపురుషసఙ్ఖ్యాతో భద్రకాప్యాన్నపానికా,
7 వివిధాశితపీతశ్చ చత్వారోఽన్నవినిశ్చయే. ౪౪
దశప్రాణాయతనికః తథార్థే దశమూలికః,
ద్వావేతౌ ప్రాణదేహార్థౌ ప్రోక్తౌ వైద్యగుణాశ్రయా. ౪౫

1. వ్యా. దీర్ఘంజీవితీయము, అపామార్గతండులీయము, ఆరగ్వధీయము, షడ్విరేచనశతాశితీయము ఈనాలుగధ్యాయములును జేరి భేషజచతుష్కము. (ఔషధద్రవ్యములనుగూర్చి వివరించునట్టి నాలుగధ్యాయములతో చేరినభాగము.)

2 మాత్రాశితీయము, తస్యాశితీయము, నవేగాన్ధారణీయము, ఇంద్రియోపక్రమణీయము అను నీనాలుగధ్యాయములుచేరి స్వస్థవృత్తిచతుష్కము. (స్వస్థవృత్తివిషయమును వివరించునాలుగధ్యాయములతో గూడినభాగము.)

3. ఖుడ్డాకచతుష్పాదము, మహాచతుష్పాదము, తిస్రైషణీయము, వాతకలాకలీయము అను నీనాలుగధ్యాయములుచేరి నిర్దేశచతుష్కము. (వైద్యగుణాదులదెల్పు నాలుగధ్యాయములతో గూడినభాగము.)

4. స్నేహాధ్యాయము, స్వేదాధ్యాయము, ఉపకల్పనీయము, చికిత్సాప్రాభృతీయము, అను నీనాలుగధ్యాయములుచేరి కల్పనాచతుష్కము. (చికిత్సనుపయోగించవలసినపద్ధతిని తెల్పు నాలుగధ్యాయములతోకూడినభాగము.

5. కియంతశ్శిరసీయము, త్రిశోథీయము, అష్టోదరీయము, మహారోగాధ్యాయము అను నాలుగధ్యాయములుచేరి రోగచతుష్కము (వ్యాధులవివరించు నాలుగధ్యాయములుగలభాగము.)

6 అష్టానిందితీయము, లంఘనబృంహణీయము, సంతర్పణీయము, విధిశోణితీయము అను నీనాలుగధ్యాయములుకూడి యోజనాచతుష్కము (ఆయారోగానుగుణ్యముగ ఔషధద్రవ్యములగూర్చుపద్ధతుల దెల్పుభాగము.)

7. యజ్జఃపురుషీయము, ఆత్రేయభద్రకాప్యీయము, అన్నపానవిధి, వివిధాశితపీతీయము అను నాలుగధ్యాయములుచేరి అన్నపానపతుష్కము. (అన్నపానముల విధానమును తెల్పు నాలుగధ్యాయములు గలభాగము.) ఇంతవనుక చతుష్కములుగా విభజింపబడినది.

దశప్రాణాయతనీయము. (ప్రాణములకు ముఖ్యాధారములయిన పదిస్థానముల దెల్పునది), అర్థేదశమహామూలీయము. (శరీరములోనినాడులు వైద్యగుణములు మున్నగువానిని దెల్పునది. అను నధ్యాయములు రెండు. (ఇవియన్నియుం జేరి సూత్రస్థానమున ముప్పదియధ్యాయము లవునని భావము).

## చతుష్కములవివరణము.

మూ. ఔషధ-స్వస్థ-నిర్దేశ-కల్పనా-రోగ-యోజనాః,
చతుష్కాః షట్ క్రమేణోక్తాః సప్తమశ్చాన్నపానికః. ౮౬
ద్వౌ చాన్యౌ సఙ్గ్రహాధ్యాయౌ ఇతి త్రింశత్కమర్థవత్,
శ్లోకస్థానం సముద్దిష్టం తన్త్రస్యాస్య శిరశ్శుభం. ౮౭

వ్యా. మఱియుం భేషజచతుష్కము,స్వస్థచతుష్కము,నిర్దేశచతుష్కము,కల్పనాచతుష్కము, రోగచతుష్కము, యోజనాచతుష్కము, అన్నపానచతుష్కము అను నీయేడుచతుష్కములును, ఇవిగాక ప్రాణస్థానములను సంగ్రహముగ దెల్పునట్టి దశప్రాణాయతనీయంబును శరీరమునందలి పదినాడులను హృదయము ఓజస్సు మున్నగువానిని సంగ్రహముగ దెలుపునట్టి అర్థేదశమహామూలీయ మనునధ్యాయమును చేరి ముప్పదియధ్యాయములతోకూడిన యర్థవంతమైన ఈశ్లోకస్థానమున ఈతంత్రమునకు శిరస్సునుబోలె శుభకరంబు ప్రధానంబునై యుండును.

### శ్లోకస్థానపదనిర్వచనము.

మూ. చతుష్కాణాం మహార్థానాం స్థానేఽస్మిన్ సంగ్రహః కృతః,
శ్లోకార్థః సఙ్గ్రహార్థశ్చ శ్లోకస్థానమతః స్మృతమ్. ౪౭

వ్యా. పైజెప్పిన భేషజచతుష్కాదులయందు గల అర్థవిశేషములను ఈతంత్రము నందలి అర్థవిశేషముల నన్నిటిని సంగ్రహరూపముగ యీస్థానము ప్రోవుగచేర్చి చెప్పి యుండుటచేత ఇయ్యది శ్లోకస్థానమని పేరొ్కనంబడును.

"శ్లోక్యతే (సఙ్ఘీక్రియతే అనేన తన్త్రార్థః) ఇతి శ్లోకః" అనువ్యుత్పత్తిచేత ఈతంత్రమునందలి విషయముల నన్నిటిని సంగ్రహముగచేర్చి చెప్పియుండు ప్రకరణము శ్లోకస్థానమని చెప్పబడును. ఇట్లు చెప్పుటచేత "సూత్రణాత్ సూచనా చ్చైవ ధారణా దర్థసంతతేః సూత్రస్థానం సముద్దిష్టం" అని చెప్పబడి సూత్రస్థానార్థమునకును శ్లోక స్థానార్థమునకును అభేద (భేదములేదని) మని యెరుంగునది. ఈయర్థమునే అష్టాంగ హృదయవ్యాఖ్యానమున "సూచ్యతే అనేన సకలతన్త్రార్థః" అనువ్యుత్పత్తిచేత తెలుప బడినది. తంత్రమునందలి యర్థమునంతటిని సంగ్రహముగ సూచనామాత్రముగ దెల్పు నట్టిభాగము సూత్రస్థానమనియు, శ్లోకస్థానమనియు చెప్పబడునని ముఖ్యభావము.

### నిదానస్థానమునందలి యధ్యాయములు (ఎనిమిది).

మూ. జ్వరాణాం రక్తపిత్తస్య గుల్మానాం మేహకుష్ఠయోః,
శోషోన్మాదనిదానే చ స్యాదపస్మారిణాం చ యత్. ౪౯
ఇత్యధ్యాయాష్టకమిదం నిదానస్థానముచ్యతే,

వ్యా. జ్వరనిదానము, రక్తపిత్తనిదానము, గుల్మనిదానము, ప్రమేహనిదానము, కుష్ఠనిదానము, శోషనిదానము, ఉన్మాదనిదానము, అపస్మారనిదానము అను నీయధ్యాయ ముల నెనిమిదిటితో గూడినది నిదానస్థానము. (జ్వరాదిరోగముల యెనిమిదిటి వేరు వేరునిదానముల దెల్పునట్టి యధ్యాయము లెనిమిది నిదానస్థానమున కలవని భావము).

### విమానస్థానాధ్యాయము లెనిమిది. వానినామములు.

మూ. రసేషు త్రివిధే కుక్షౌ ధ్వంసే జనపదస్య చ. ౫౦
త్రివిధే రోగవిజ్ఞానే స్రోతస్స్వపి చ వర్తనే,
రోగానీకే వ్యాధిరూపే రోగాణాం చ భిషగ్జితే. ౫౧
అష్టౌ విమానాన్యుక్తాని మానార్థాని మహర్షిణా,

వ్యా. రసవిమానము, త్రివిధకుక్షీయము, జనపదోద్ధ్వంసనీయము, త్రివిధరోగ విశేషవిజ్ఞానీయము, స్రోతోవిమానము, రోగానీకవిమానము, వ్యాధితరూపీయవిమానము, రోగభిషగ్జితీయము అను నీయెనిమిది అధ్యాయములు విమానస్థానమున కలవు.

"విశేషేణ మీయతేతి (జ్ఞాయతే దోషభేషజాద్యనేనేతి) విమానం" అనువ్యుత్పత్తి చేత దోషములయొక్కయు భేషజాదులయొక్కయు విశేషజ్ఞానము దెల్పునది విమాన మనబడును. రసముయొక్క విశేషజ్ఞానము దెల్పునది రసవిమానము అని అధ్యాయనామము. ఇత్తెరంగున నే తక్కిన త్రివిధకుక్షీయాదులకును అర్థవిశేషము నెఱుంగునది. అట్టి రసాదివిజ్ఞానముల దెల్పునట్టిప్రకరణము విమానస్థానమని చెప్పబడును. అట్టి విమానస్థానమున రసాదివిజ్ఞానముల దెల్పునధ్యాయము నెనిమిదిటిని మహర్షియగు నాత్రేయుంలచే జెప్పబడినవని యర్థము.

శారీరస్థానమునందలి యధ్యాయములు ఎనిమిది, వానినామభేదములును.

మూ. కతిధాపురుషీయం చ గోత్రేణాతుల్యమేవ చ. ॥౨
ఖుడ్డీకా మహతీ చైవ గర్భావక్రాన్తి రుచ్యతే,
పురుషస్య శరీరస్య విచయౌ ద్వౌ వినిశ్చితౌ. ॥౩
శరీరసంఖ్యాసూత్రం చ జాతేరష్టమముచ్యతే,
ఇత్యుద్దిష్టాని మునినా శారీరాణ్యత్రిసూనునా. ॥౪

వ్యా. కతిధాపురుషీయము, అతుల్యగోత్రీయము, ఖుడ్డికాగర్భావక్రాంతి, మహతీగర్భావక్రాంతి, పురుషవిచయము, శరీరవిచయము, శరీరసంఖ్య, జాతిసూత్రీయము అను నెనిమిదిశారీరముల దెల్పునధ్యాయముల నెనిమిదిటిని శారీరస్థానమున నాత్రేయుం డుపదేశించెను.

శరీరమునకు సంబంధించినకారణములు ఉత్పత్తిస్థితివృద్ధి మున్నగువిషయముల ప్రతిపాదించునది శారీరము. అట్టిశారీరముల వివరించు నెనిమిదియధ్యాయములను శారీరస్థానమున నాత్రేయుండు చెప్పెనని భావము.

ఇంద్రియస్థానమునందలి యధ్యాయములు పండ్రెండు, వానినామములును.

మూ. వర్ణస్వరీయః పుష్పాఖ్యః తృతీయః పరిమర్శనః,
తథా చైవేన్ద్రియానీకః పూర్వరూపిక ఏవ చ ॥౫
కతమానిశరీరీయః పన్నరూపోఽప్యవాక్శిరాః,
యస్య శ్యావనిమిత్తశ్చ సద్యోమరణ ఏవ చ. ॥౬
అణుజ్యోతిరితి ఖ్యాతః తథా గోమయచూర్ణవాన్,
ద్వాదశాధ్యాయకం స్థానం ఇన్ద్రియాణాం ప్రకీర్తితం.(ఇతిస్థితం)

వ్యా. వర్ణస్వరీయము, పుష్పితకము, పరిమర్శనీయము, ఇంద్రియానీకము, పూర్వరూపీయము, కతమానిశరీరీయము, పన్నరూపీయము, అవాక్శిరసీయము, యస్య

శ్యావనిమిత్తీయము, సద్యోమరణీయము, అనుజ్యోతీయము, గోమయచూర్ణీయము అను నీపండ్రెండు అధ్యాయములు ఇంద్రియస్థానమున కలవు.

ఇంద్రియమన రిష్టము. అయ్యది యరిష్ట (మరణ) సూచకచిహ్నము. అట్టి యింద్రియ (రిష్టమరణసూచకలక్షణ)ముల దెల్పునధ్యాయములు వర్ణస్వరీయము మున్నగునవి యెనిమిది. వానిని దెల్పుటకై చెప్పెడుభాగము ఇంద్రియస్థానము.

### చికిత్సాస్థానమున ముప్పదియధ్యాయములు, వానివివరణము.

మూ. అభయామలకీయం చ, ప్రాణకామీయ మేవ చ,
కరప్రచితికం, వేదసముత్థానం, రసాయనం. ౫౮
సంయోగశతమూలీయం ఆసిక్తక్షీరికం తథా,
మాషపర్ణం తృతీయం చ పుమాన్ జాతబలాదికం. ౫౯
చతుష్కద్వయమప్యేతత్ అధ్యాయద్వయముచ్యతే,
రసాయనమితి జ్ఞేయం వాజీకరణమేవ చ. ౬౦

వ్యా. (చికిత్సను వివరించుభాగము చికిత్సాస్థానము) అందు తొలుత రసాయనాధ్యాయంబును, రెండవది వాజీకరణాధ్యాయంబును నగును. అందు రసాయనాధ్యాయమున అభయామలకీయము, ప్రాణకామీయము, కరప్రచితీయము, ఆయుర్వేదసముత్థానీయము ననునాల్గుపాదములు కల్గియుండును.

రెండవదియగు వాజీకరణాధ్యాయమున సంయోగశతమూలీయము, ఆసిక్తక్షీరికము, మాషపర్ణభృతీయము, పుమాన్ జాతబలాదికము ననునాల్గువాజీకరణపాదములు కల్గియుండును.

మూ. జ్వరాణాం రక్తపిత్తస్య గుల్మానాం మేహకుష్ఠయోః,
శోషోన్మాదేఽప్యపస్మారక్షతశోథోదరార్శసామ్. ౬౧
గ్రహణీపాణ్డురోగాణాం(హిక్కానాం)శ్వాసకాసాఽతిసారిణాం,
(హిక్కాయాశ్శ్వాసకాసే చ గ్రహణీపాణ్డురోగయోః,)
ఛర్దివీసర్పతృష్ణానాం విషమద్యవికారిణామ్. ౬౨
ద్వివ్రణీయం త్రిమర్మీయం ఊరుస్తమ్భికమేవ చ,
వాతరోగే వాతరక్తే యోనివ్యాపదికం చ యత్. ౬౩
త్రింశచ్చికిత్సితాన్యుక్తాని

వ్యా. జ్వరచికిత్సితము, (జ్వరమునకు సంబంధించినచికిత్సను చెప్పునట్టియధ్యాయము. ఇత్తెరంగుననే తక్కినవానికిని యధ్యాయనామముల నెఱుంగునది). రక్తపిత్త

చికిత్సితము, గుల్మచికిత్సితము, ప్రమేహచికిత్సితము, కుష్ఠచికిత్సితము, శోష (రాజయక్ష్మ)చికిత్సితము, ఉన్మాదచికిత్సితము, అపస్మారచికిత్సితము, క్షతక్షీణచికిత్సితము, శోథ (శ్వయథు)చికిత్సితము, ఉదరచికిత్సితము, అర్శశ్చికిత్సితము, గ్రహణీచికిత్సితము, పాండురోగచికిత్సితము, హిక్కా-శ్వాసచికిత్సితము, కాసచికిత్సితము, అతిసారచికిత్సితము, ఛర్దిచికిత్సితము, విసర్పచికిత్సితము, తృష్ణారోగచికిత్సితము, విషచికిత్సితము, మదాత్యయచికిత్సితము, ద్వివ్రణీయచికిత్సితము, త్రిమర్మీయచికిత్సితము (హృదయము, శిరస్సు, వస్తి యను మూడుమర్మములయందలి రోగములకు చికిత్సను దెల్పునధ్యాయము త్రిమర్మీయచికిత్సితమని యెరుంగునది), ఊరుస్తంభచికిత్సితము, వాతవ్యాధిచికిత్సితము, వాతరక్త (వాతశోణిత) చికిత్సితము, యోనివ్యాపచ్చికిత్సితము నను నీయధ్యాయములును పైజెప్పిన రసాయన-వాజీకరణాధ్యాయములు రెండునుగలిసి ముప్పదియధ్యాయములు చికిత్సాస్థానమున జెప్పబడినవి.

ఇచ్చట జ్వరచికిత్సితము మున్నగుశబ్దములకును,అట్టిచికిత్సలబోధించు యధ్యాయములకును అభేదము నంగీకరించి చెప్పబడినదికాన జ్వరచికిత్సితాదిశబ్దములు అధ్యాయసంజ్ఞను బోధించునని యెరుంగునది.

మరియుం "హిక్కా-యోః......పాణ్డురోగయోః" అను పాఠాంతరము కానవచ్చుచున్నది; కాని యీపాఠము చికిత్సాస్థానమునందలి యధ్యాయక్రమమునకు వ్యత్యస్తముగ నుండుటచే ప్రశస్తముకాదు.

మరియుం పండితకులపతి జీవానందవిద్యాసాగరభట్టాచార్య, బి. ఏ., గారిచే 1896-వ సంవత్సరమున ప్రకాశితమైన ప్రతియందు ఈచికిత్సితాధ్యాయానుక్రమణికలో చాలవరకును ఆనుపూర్విలో వ్యత్యాసంబులును, తదనుసారముగ పాఠభేదంబులును గన్పట్టుచున్నవి. అట్టివరుస ననుసరించియే చికిత్సాస్థానమున నీయధ్యాయములు వరుసగ నున్నవి. చక్రపాణిదత్తచికిత్సావ్యాఖ్యానమున నాయాయధ్యాయమునకు పౌర్వాపర్యసంబంధమును చెప్పుతరి నీమూలమున గనబరిచిన యనుక్రమణికవరుసను బట్టియే వివరించియున్నారు. కావున ప్రకృతమున అరువదిరెండు అరువదిమూడు అరువదినాల్గుశ్లోకముల గనబరిచిన యానుపూర్వియే సమంజసమని తోచెడిని. విజ్ఞులు గమనించెదరుగాత!

**కల్పస్థానమునందలి పండ్రెండధ్యాయములవివరణము.**

మూ. అతః కల్పాన్ పరం శృణు,

ఫలజీమూతకేక్ష్వాకుకల్పో ధామార్గవస్య చ. ౬౪

పఞ్చమో వత్సకస్యోక్తః షష్ఠం చకృతవేధనే,
శ్యామాత్రివృతయోః కల్పః తథైవ చతురఙ్గుళే. ౬౫
తిల్వకస్య సుధాయాశ్చ సప్తలాశఙ్ఖినీష్వపి,
దన్తీద్రవన్త్యోః కల్పశ్చ ద్వాదశోఽయం సమాప్యతే. ౬౬

వ్యా. (వమనవిరేచనౌషధముల కల్పనమును దెల్పుప్రకరణము కల్పస్థానము) అందు మదన (ఫల) కల్పము, జీమూతకల్పము, ఇక్ష్వాకుకల్పము, ధామార్గవకల్పము, వత్సకకల్పము, కృతవేధనకల్పము, శ్యామాత్రివృత్కల్పము, చతురంగుళకల్పము, తిల్వకకల్పము, సుధాకల్పము, సప్తలాశంఖినీకల్పము, దంతీద్రవంతీకల్పము అను నీసంజ్ఞలు కలపండ్రెండు అధ్యాయములు కలవు.

ఇచ్చట మదనఫలములకల్పమును దెల్పునధ్యాయము మదనకల్పము. ఇత్తెరంగున నసే తక్కినయధ్యాయములకును సంజ్ఞల నెరుంగునది.

## సిద్ధిస్థానమునందలి పండ్రెండధ్యాయములవివరణము.

మూ. కల్పనా, పఞ్చకర్మాఖ్యా, వస్తిసూత్రా తథైవ చ,
స్నేహవ్యాపదికీ సిద్ధిః నేత్రవ్యాపదికీ తథా. ౬౭
సిద్ధిశ్శోధనయోశ్చైవ, వస్తిసిద్ధిస్తథైవ చ,
ప్రాసృతీ, మర్మసంఖ్యాతా, సిద్ధిర్వస్త్యాశ్రయా చ యా. ౬౮
ఫలమాత్రా, తథా సిద్ధిః సిద్ధిశ్చోత్తరసంజ్ఞితా,
సిద్ధయో ద్వాదశైవైతాః తన్త్రం చాసు సమాప్యతే. ౬౯

వ్యా. (వమనాదిపంచకర్మల అసమ్యగ్యోగమువలన సంభవించువ్యాపత్తులకు సాధ్యతారూపమైనది సిద్ధి. అట్టిసిద్ధి కారణముల దెల్పునట్టిస్థానము సిద్ధిస్థానము) అట్టిసిద్ధిస్థానమున కల్పనాసిద్ధి, పంచకర్మీయసిద్ధి, వస్తిసూత్రీయసిద్ధి, స్నేహవ్యాపదికాసిద్ధి, నేత్రవస్తివ్యాపత్సిద్ధి, వమనవిరేచనవ్యాపదికాసిద్ధి, వస్తివ్యాపత్సిద్ధి, ప్రసృతయోగికాసిద్ధి, త్రిమర్మీయాసిద్ధి, వస్తిసిద్ధి, ఫలమాత్రాసిద్ధి, ఉత్తరవస్తిసిద్ధి, అనునధ్యాయములు పండ్రెండును చెప్పబడును. ఈపండ్రెండుఅధ్యాయములతో నీసిద్ధిస్థానంబును, ఈతంత్రంబును పూర్తియగును. (ఇత్తెరంగున "దీర్ఘం జీవీయమపామార్గ" యని యుపక్రమించి యీతంత్రమునందలి యధ్యాయములన్నియుం వరుసగ జెప్పబడినవి.) అధ్యాయము లెవ్వియనుప్రశ్నమున కిది యుత్తరము.

## తంత్రార్థ-అధ్యాయార్థనిరూపణము.

మూ. స్వేస్వే స్థానే తథాధ్యాయే చాధ్యాయార్థః ప్రవక్ష్యతే,
తం బ్రూయాత్సర్వతః సర్వం యథాస్వం హ్యర్థసంగ్రహాత్. ౭౦

వ్యా. ఆయాస్థానమునం దాయాస్థానమునకు సంబంధించిన (స్థానార్థంబును) విషయములును, ఆయాయధ్యాయమున నాయాయధ్యాయమునకు సంబంధించిన అధ్యాయార్థంబులు (విషయములు)ను వివరింపబడును.

మరియు నాయాస్థానంబున స్థానార్థ (స్థానమునందలివిషయముల) సంగ్రహంబును, ఆయాయధ్యాయాంతమున నాయాయధ్యాయముల (అధ్యాయార్థ) సంగ్రహంబును చెప్పబడును.

ప్రతిస్థానమునందును ఆయాస్థానమునందలి విషయములు సంగ్రహించి చెప్పబడును. ఎట్లనగా—నిదానస్థానాంతమున "జ్వరాదీనాం వికారాణాం......నిదానస్థానమేతావత్ సంగ్రహేణోపదిశ్యతే." అనువాక్యముచే నిదానస్థానమునందలి విషయములన్నియుం సంగ్రహముగ దెల్పబడినవి. ఇత్తెరంగుననే తక్కినవిమానాదిస్థానాంతముల యందును స్థానార్థసంగ్రహము నెరుంగునది. ఇదియే స్థానార్థసంగ్రహము.

మరియుం నాయాయధ్యాయములయంతమునగల విషయసంగ్రహము అధ్యాయార్థసంగ్రహమని యెరుంగునది. శారీరస్థానాంతమున మాత్రము స్థానార్థసంగ్రహమును జెప్పియుండలేదు; కాని 'శరీరం చిన్త్యతే సర్వం దైవమానుషసమ్పదా, సర్వభావైర్యత స్తస్మాత్ శారీరం స్థానముచ్యతే.' అనుశ్లోకముచేత శారీరస్థాన మనుపదమున కవయవార్థము నిరూపింపబడినది. దీనినిబట్టియే శారీరస్థానార్థము సంగృహీతమని తంత్రకారులయభిప్రాయమని యూహింపదగియున్నది.

### ప్రశ్న-ప్రశ్నార్థములవివరణము.

మూ. పృచ్ఛా తన్త్రాద్యథామ్నాయం విధినా ప్రశ్న ఉచ్యతే,
ప్రశ్నార్థో యుక్తిమాంస్తత్ర తన్త్రేణైవార్థనిశ్చయః. 20

వ్యా. తంత్రాత్=తంత్రము మొదలుచేసి, యథామ్నాయం=క్రమముగ, విధినా=పూర్వాపరవిరోధాదిదోషములు లేక సామాన్యవిశేషరూపవిధి ననుసరించి, పృచ్ఛా=తెలిసికొనదలచినవిషయమును ప్రశ్నించుట, ప్రశ్నః=ప్రశ్నమని, ఉచ్యతే=చెప్పబడును; (తంత్రాదుల నుద్దేశించి, పూర్వాపరవిరోధాదిదోషములు లేకుండునట్లు తెలిసికొనదలచిన విషయము ప్రశ్నించుటయే ప్రశ్నమని చెప్పబడును). ఇది ప్రశ్నములన నెవ్వి? యను ప్రశ్నమున కుత్తరము.

అట్టి ప్రశ్నమునకు తంత్రముచేత నర్థనిర్ణయముచేయుట ప్రశ్నార్థ మనబడును. అట్టిప్రశ్న ప్రశ్నార్థములజ్ఞానమువలన యుక్తిమంతుడగునని యర్థము. (ఇది ప్రశ్నార్థము లెవ్వియనుప్రశ్నమున కుత్తరము.)

### తంత్ర-స్థాన-అధ్యాయపదనిర్వచనము.

మూ. నిరుక్తం తన్త్రణాత్తన్త్రం, స్థానమర్థప్రతిష్ఠయా,
అధికృత్యార్థమధ్యాయనామసంజ్ఞా ప్రతిష్ఠితా. 21

ఇతి సర్వం యథాప్రశ్నం అష్టకం సంప్రకాశితమ్,
కార్త్స్న్యేన చోక్తస్తన్త్రస్య సఙ్గ్రహస్సువినిశ్చితః. 23

వ్యా. అర్థవిశేషపరిజ్ఞానమును కల్గించుటవలన తంత్రమని చెప్పబడును. "తంత్ర్యతే (వ్యుత్పాద్యతే) అనేనేతి తంత్రం" అనువ్యుత్పత్తిచేత విశేషవిషయపరిజ్ఞానము నరయుంటకు సాధనమైనది తంత్రమని యన్వర్థముగ చెప్పబడును.)

మరియు విశేషార్థముల కునికిపట్టైనది స్థానము. "అర్థాః ప్రతిష్ఠన్త్యస్మిన్నితి - స్థానం" అనువ్యుత్పత్తిచే తంత్రమునందలి విశేషవిషయముల కునికిపట్టైనది స్థానమని యన్వర్థముగ జెప్పబడును.

మరియు స్థానమున చెప్పబడినవిషయములలో నొకదానిని ప్రధానముగ దీసికొని వివరించుప్రకరణము అధ్యాయ మనబడును. (ఆయాస్థానమున జెప్పబడినవిషయములలో నొక్కొకదానిని ప్రధానముగ దీసికొని వివరించుప్రకరణము అధ్యాయ మనబడును. ఈయర్థము "అధికృతః-అధ్యాయః" అనువ్యుత్పత్తిచే లభించును.)

(ఇచ్చట "తన్త్రం, స్థానం, అధ్యాయః" అనుపదములు నిర్వచనముచేసి చెప్పబడినవి; అయినను తంత్రశబ్దము సంపూర్ణశాస్త్రవాచకముగను, స్థానశబ్దము కాండాదులబోలె తంత్రములో నొక్కొకభాగమును బోధించుగ్రంథవిభాగవాచకముగను, అధ్యాయశబ్దము స్థానమునందలి యొకవిషయమును ప్రధానముగజేసి వివరించుభాగవాచకముగను, పంకజాదిశబ్దములవలె యోగరూఢములని యెరుంగునది).

ఇత్తెరంగున "భిషగాదిత ఏవ ప్రష్టవ్యః అష్టవిధం భవతి...... ప్రశ్నార్థాంశ్చేతి" అను ముప్పదిమూడవసూత్రమునందలివాక్యమున నిర్దిష్టములగు నెనిమిదిప్రశ్నములకును సదుత్తరములు పూర్తిగ చెప్పబడినవి. మరియు తంత్రమునందలి విషయములన్నియు సంగ్రహింపబడినవి.

ఇచ్చట నీవిశేషము నెరుంగునది.—వేదములయందును, సూత్రగ్రంథములయందును, శాస్త్ర - పురాణ - ఇతిహాసాదులయందును ఒక్కొకవిషయమును వివరించి సమాప్తిజేయుగ్రంథము ఏకదేశభాగమునకు కాండము, సర్గము, అధ్యాయము, ప్రశ్నము, పరిచ్ఛేదము, ఖండము మున్నగునామముల నిడుసంప్రదాయము అనాదిగ నలవాటులో నున్నది. అవి యెవ్వియన:—"సర్గో వర్గః పరిచ్ఛేదోద్ఘాతాధ్యాయాఙ్కసఙ్గ్రహాః, ఉచ్ఛ్వాసః పరివర్తశ్చ పటలః కాణ్డమేవచ. స్థానం ప్రకరణం చైవ పర్వోల్లాసాహ్నికానిచ, పురాణాదౌ పరిచ్ఛేదాః అనేకే పరికీర్తితాః." సర్గము, వర్గము, పరిచ్ఛేదము, ఉద్ఘాతము, అధ్యాయము, అంకము, సంగ్రహము, ఉచ్ఛ్వాసము, పరివర్తము, పటలము, కాండము, స్థానము, ప్రకరణము, పర్వము, ఉల్లాసము, ఆహ్నికము ఇవి మున్నగునామములు ఏకవిషయబోధకభాగమునకు పురాణాదులలో చెప్పబడినవి. ఆ పద్ధతి ననుసరించియే ప్రకృతతంత్రమున స్థానాదిపదములు చెప్పబడినవని యెరుంగునది.

## ⟿ వైద్యపరీక్షావశ్యకత. ⟾

మూ. స న్తి పాల్లవికోత్పాతాః సంక్షోభం జనయ న్తి యే,
వ ర్తకానామివోత్పాతాః సహసై వాఽవిభావితాః. ౭౪
తస్మాత్తాన్ పూర్వసంజల్పే సర్వత్రాప్తకమాదిశేత్,
పరాఽవరపరీక్షార్థం తత్ర శాస్త్రవిదాం బలమ్. ౭౫
శబ్దమాత్రేణ త న్త్రస్య కేవలస్యైకదేశికాః,
భ్రమ న్త్యల్పబలా స్తన్త్రే జ్యాశబ్దేనైవ వ ర్తకాః. ౭౬

వ్యా. మిడుతలు అడవిపిచ్చుకలు వచ్చినగుసవి గుంపులుగూడి యొక్కుమ్మడి వ్రాలి పైరుపచ్చల ధ్వంసముచేయువిధముగ, స్వల్పజ్ఞానముకల్గి శాస్త్రవిషయకజ్ఞానములేకయే వైద్యవృత్తి నవలంబించి రోగులకు లేనిపోనికష్టముల దెచ్చిపెట్టి భూభారముతీర్చు వైద్యబ్రువులు కొందరుందురు; అట్టివారిని పరీక్షింపకయే చికిత్సజేయ సమకట్టినచో ననర్థాంతరము సంభవించును; కావున అట్టివైద్యులను చూచినంతనే వారియోగ్యతను గమనించుటకై పైజెప్పినతంత్ర-తంత్రార్థాదిప్రశ్నముల నెనిమిదిటిని వాని నడగవలెను ఈయెనిమిదిప్రశ్నములయందు శాస్త్రార్థమంతయు నణగియుండును. కావున వానిపరిజ్ఞానము ఈప్రశ్నములచే తేటతెల్లమగును. అట్లు ప్రశ్నించినంతనే యల్పజ్ఞానియగు వైద్యుడు వింటివారిధ్వనిని విన్నపిచ్చుకవలె భయకంపితుడై దూరదూరముగ పలాయమానము చిత్తగించును. (కావున వైద్యునిపరీక్షించుటకై పైప్రశ్నములు చెప్పబడినవి.)

## ⟿ అసద్వైద్య, సద్వైద్యనిర్ణయము. ⟾

మూ. పశుః పశూనాం దౌర్బల్యాత్ కశ్చిన్మధ్యే వృకాయతే,
ససత్వం వృకమాసాద్య ప్రకృతిం భజతే పశుః. ౭౭
తద్వదజ్ఞోఽజ్ఞమధ్యస్థః కశ్చిన్మౌఖర్యసాధనః,
స్థాపయత్యాప్తమాత్మానం ఆప్తం త్వాసాద్య భిద్యతే. ౭౮
బభ్రుర్గూఢ ఇవోర్ణాభిః అబుద్ధిరబహుశ్రుతః,
కిం వై వక్ష్యతి? సంజల్పే కుణ్డభేదీ జడో యథా. ౭౯
సద్వృత్తైర్న విగృహ్ణీయాత్ భిషగల్పశ్రుతైరపి,
హన్యాత్ప్రశ్నాష్టకేనాదావితరాంస్త్వాత్మమానినః. ౮౦
దమ్భినో ముఖరా హ్యజ్ఞాః ప్రభూతాఽబద్ధభాషిణః,
ప్రాయః; ప్రాయేణ సుముఖాః స న్తో యుక్తాల్పభాషిణః. ౮౧
తత్త్వజ్ఞానప్రకాశార్థం అహంకారమనాశ్రితాః,
స్వల్పాధారాజ్ఞముఖరాన్ మర్షయేన్న వివాదినః. ౮౨

పరోభూతేష్వనుక్రోశః తత్వజ్ఞానే పరా దయా,
యేషాం తేషామసంవాదనిగ్రహే నిరతా మతిః. ౮౩

వ్యా. మిక్కిలి బలశాలియైన యొకపశువు (పొట్టేలు) బలహీనముగానుండు కొన్ని పొట్టేళ్లగుమిలోఁజేరి తానుతోడేలివేసము నుబూని బలహీనముగానుండు తక్కిన పొట్టేళ్లను బెదరించి కాలము గడపును. మరియుం నా పొట్టేలు నిజమైన తోడేలును గనినప్పుడు తానుభీతిజెంది తనస్వభావస్థితినే (పొట్టేలుగనె) యుండును. అత్తెరంగుననే నొకమాటకారియైన యజ్ఞానుడు తెలివిలేనివారిమూకలోఁ జేరి తనవాచాలత్వమును సాధనముగ జేసికొని తక్కినవారిని ఏమరిచి తనను పండితునిగ జేసుకొని నటించును. అట్టి మూర్ఖుడు వాస్తవ్యమైనపండితుడు తటస్థపడినప్పుడు తా నవమతిజెంది నిజరూపము జెందును. మఱియుం నట్టిమూఢుడు గొఱ్ఱెబొచ్చుచే గప్పికొను పొట్టేలువేసముబూనిన ముంగిస పొట్టేలినిజూచిన నవమతిజెందువిధముననుపరిభ్రమమొందును. అట్టివేషధారియగు మూర్ఖుడు పండితులతోఁ సంభాషణకల్గినప్పుడు కులభ్రష్టుడయిన యొక కుండుడు (జారుని వలనబుట్టిన భ్రష్టుడు) నిశ్చేష్టుడుగ నుండుభంగి శాస్త్రవాదమునందు మాటలాడజాలడు.

మఱియుం, శాస్త్రపరిజ్ఞానము కొంచెముగకల్గినను మంచినడవడికకల్గి యడకువతోఁ నుండువైద్యులను చూచినపుడు వారిని విద్వద్వైద్యుడు వాదింప జూడదగదు. అటుగాక గర్వితులైనవారిని పైజెప్పినప్రశ్నాష్టకముచే వాదించి వారియహంకారమును మొదలంట పోగొట్టనగును.

జ్ఞానహీనులగువారు తలతోక నెరుగక మితిమీరి దబ్బరలాడెదరు. గర్వాంధులై యుందురు. పండితులుగ నుండువారు మిక్కిలి వినయముగలవారై యుక్తముగ మితముగ సంభాషింతురు. వారు అహంకృతిని విడచి తనమనంబుననుండు వాస్తవ్యార్థమును వెలిబుచ్చుచు సంభాషించెదరు. అట్టిపండితులు స్వల్పజ్ఞానముకల్గి వదరుచుండుమూర్ఖులను సరకుచేయక వివాదముచే వారిగర్వము నణచవలయును.

మఱియుం సర్వప్రాణులయందును దయయును, వాస్తవ్యవిషయములయందు అభిలాషయుం కలపండితులు మూర్ఖులను నిగ్రహించుటకు పూనికతోఁ నుండవలయును.

### అసద్వైద్యనిరసనము, సద్వైద్యాశ్రయము.

మూ. అసత్పక్షాఽక్షణికత్వాద్దమ్భపారుష్యసాధనాః,
భవన్త్యనాప్తాః స్వే తన్త్రే ప్రాయః పరవికత్థకాః.
(పరవికల్పనాః) ౮౪

తాన్ కాలపాశసదృశాన్ వర్జయేచ్ఛాస్త్రదూషకాన్,
ప్రశమజ్ఞానవిజ్ఞానపూర్ణాః సేవ్యా భిషక్తమాః. ౮౫

వ్యా. పండితులు కానిమూర్ఖులను పైజెప్పినరీతిగ తంత్రాదివిషయముల ప్రశ్న చేసినపుడు వారు తమయజ్ఞానమును గ్రమ్మికొనుటకుగాను, మాపద్ధతికి మీశాస్త్రపద్ధతికి జతపడదనియుం, మీతోఁ నిప్పుడు వాదించుటకు అవకాశములేదనియుం, మీకు బదులు

సెప్పుటకు నాకిప్పుడు తలనొప్పి మున్నగుబాధ కల్గియుండుటచే వలనుపడియుండ దనియు సమాధానము చెప్పి కాలము గడపెదరు. లేక గర్వించి స్వతంత్రముగ పరుసము లాడి పండితుని యవమానింపజూతురు. ప్రాయికముగ నిట్టియుపాయముచేత నితరులను మూర్ఖులం మోసగింపజూతురు. కాలపాశముతో సమానులైన అట్టిశాస్త్రనిందకులైన దుష్టమూర్ఖులను పండితులగువైద్యులు దూరముగ నిలపించవలెను. మఱియు శమదమాది గుణంబులును జ్ఞానవిజ్ఞానంబులును పూర్ణముగా గలవిద్వద్వైద్యులను సేవించుట ముఖ్య కర్తవ్యము.

ఈతంత్రాధ్యయనమున గల్గుముఖ్యప్రయోజనము.

మూ. సమగ్రం దుఃఖమాయత్తమవిజ్ఞానే ద్వయాశ్రయం,
సుఖం సమగ్రం విజ్ఞానే విమలే చ ప్రతిష్ఠితమ్.  ౮౬
ఇదమేవ ముదారార్థం అజ్ఞానార్థప్రకాశకం,
శాస్త్రం దృష్టిప్రణష్టానాం యథైవాదిత్యమణ్డలమ్.  ౮౭

వ్యా. మనస్సునకు శరీరమునకు సంబంధించిన యనారోగ్యరూపమైనదుఃఖము శాస్త్రపరిజ్ఞానములేనినాడు కల్గును. నిర్మలమైన శాస్త్రపరిజ్ఞానముండినయెడ దాని నాధారముగ జేసికొని మనశ్శరీరసుఖరూపమైన యారోగ్యము నిలచియుండును. కావున మిక్కిలి యర్థపుష్టిగల యీశాస్త్రము తెలియనివిషయముల నన్నిటిని తెలుపుచు స్వల్పదృష్టిగల వారికి సూర్యమండలముబోలె సకలార్థప్రకాశికమై మిక్కిలి యుపకారకమై వెలయుచుండును.

అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. అర్థేదశమహామూలాః సంజ్ఞా చైషాం యథా కృతా,
అయనాన్తాః షడగ్ర్యాశ్చ, రూపం వేదవిదాం చ యత్  ౮౮
సప్తకశ్చాష్టకశ్చైవ పరిప్రశ్నస్సనిర్ణయః,
యథా వాచ్యం, యదర్థం, చ యద్విధాశ్చైకదేశికాః.  ౮౯
అర్థేదశమహామూలే సర్వమేతత్ప్రకాశితం,
సఙ్గ్రహశ్చాయమధ్యాయః తన్త్రస్యాస్యైవ కేవలః.  ౯౦
యథా సుమనసాం సూత్రం సఙ్గ్రహార్థం విధీయతే,
సఙ్గ్రహార్థం తథార్థానాం ఋషిణాః సఙ్గ్రహ కృతః.  ౯౧

వ్యా. హృదయము నాశ్రయించియుండు పదినాడులవివరమును, వానికి మహామూలములను సంజ్ఞకల్గుటకు కారణంబును ప్రాణధారణమునకు ముఖ్యకారణములైన అహింసాదులారును, ఆయుర్వేదవేత్తలస్వరూపంబును, ఏడువిధములగు ప్రశ్నములును

("కిమాయుః? కస్మాదాయుర్వేదః?" అను ప్రశ్న లేదుగు),"తన్త్రం తన్త్రార్థం" అని చూప బడిన ఎనిమిది ప్రశ్నములును, వానికుత్తరంబులును, అట్టి ప్రశ్నోత్తరంబులకు ప్రయోజనంబులును, అల్పజ్ఞానముగల వైద్యులస్వరూపంబును, కాలివిషయములన్నియును నీయర్థేదశమూలీయమను నీయధ్యాయమున వివరింపబడినవి.

మఱియును నీయధ్యాయము ఈతంత్రమునందుగల విషయలనన్నిటిని సంగ్రహముగ దెలుపబడినవి గాన ఇయ్యది తంత్రార్థసంగ్రహరూపమైనది. ఈసూత్రస్థానమున తంత్రార్థములన్నియు ఒకదారమునం దనేకపుష్పముల కూర్చువిధముగ కూర్చియుండుటచే సూత్రస్థానమని మునివరులచే చెప్పఁబడినది.

మూ. ఇత్యగ్నివేశకృతే తంత్రే చరకప్రతిసంస్కృతే సూత్రస్థానే
అర్థేదశమహామూలీయో నామ త్రింశోఽధ్యాయః.
అగ్నివేశకృతే తంత్రే చరకప్రతిసంస్కృతే,
ఇయతావధినా సర్వం సూత్రస్థానం సమాప్యతే.
ఇతి సూత్రస్థానం సమాప్తమ్.



వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును చరకమహర్షిచే సంస్కరింపబడినదియునైన చరకసంహితయందలి సూత్రస్థానమున నర్థేదశమహామూలీయంబను నధ్యాయము సమాప్తము. మఱియును నీతంత్రమునందలి సూత్రస్థానంబును సమాప్తము

ఇతి విశ్వనాథరచితా వ్యాఖ్యా చరకస్య కౌముదీ చాన్ధ్రీ,
శ్లోకస్థానస్య సదా జీయాదాచన్ద్రతారకమ్ అనితలే.

ఇది శ్రీ శ్రీ శ్రీ కామకోటిపీఠాధిపస్థానవిద్వదవతంస సర్వతంత్రస్వతంత్ర బ్రహ్మశ్రీ కుంభకోణము లక్ష్మీనృసింహశాస్త్రివరేణ్య చరణకమలసంసేవాసమాసాదితపాణినీయాదిశాస్త్రవిజ్ఞానసముల్లసితుండును అష్టాఙ్గహృదయ-చరకసంహితా-మాధవనిదానాద్యాయుర్వేదతన్త్రాన్ధ్రవ్యాఖ్యాతయును శ్రీ వైఖానసకులతిలక - ఆయుర్వేదమార్తాణ్డ - భిషఙ్మణి - వైద్యరత్న పణ్డిత డీవి గోపాలాచార్యసంస్థాపితాయుర్వేదాశ్రమాస్థానవిద్వాంసుండును ఉభయభాషాకవితావిరాజితుండును శ్రౌతప్రక్రియాధురీణుండును వేదవేదాఙ్గ శ్రౌతాభిజ్ఞ బ్రహ్మశ్రీ అగ్నిచిత్ సీతారామవాజపేయయాజి శ్రీమతి సీతాంబాసోమపీథినీసాధ్వీమతల్లికాతనూభవుండును ఉభయభాషాకవితాధురీణ శ్రౌతాగమధౌరేయ సుబ్రహ్మణ్యసోమయాజులకనుజుండును నగు వైయాకరణ విద్వాన్ పండిత విశ్వనాథశాస్త్రిచే విరచితంబగు కౌముదీనామ చరకసంహితాన్ధ్రవ్యాఖ్యానమున సూత్రస్థానము సమాప్తము.



చెన్నపురి : జావిళ్లి రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1935.